# PARISHODHAKUDUGA ARUDRA

(ARUDRA AS A RESEARCHER)

**A thesis submitted to the University of Hyderabad**
**in Partial Fulfilment of Requirement for the Award of the**
**Degree of DOCTOR OF PHILOSOPHY in Telugu.**

by


**DARLA VENKATESWARA RAO**


**Supervisor**
Dr. S.Saratjyothsna Rani


**DEPARTMENT OF TELUGU**
SCHOOL OF HUMANITIES
UNIVERSITY OF HYDERABAD
HYDERABAD - 500 046.

2003

# పరిశోధకుడుగా ఆరుద్ర



పరిశోధకుడు:
దార్ల వెంకటేశ్వరరావు

పర్యవేక్షణ:
డా.ఎస్.శరత్ జ్యోత్స్నారాణి

పి.హెచ్.డి. పట్టాకొరకు
హైదరాబాదు విశ్వవిద్యాలయానికి
సమర్పించిన సిద్ధాంత వ్యాసం
జూలై – 2003

DEPARTMENT OF TELUGU

School of Humanities

UNIVERSITY OF HYDERABAD

# CERTIFICATE

This is to certify that, I.Darla Venkateswara Rao, have carried out the research embodied in the present thesis for the full period prescribed under Ph.D ordinance of the University. My Topic of the Ph.D.Programme is PARISHODHAKUDUGĀ ĀRUDRA (ARUDRA AS A RESEARCHER).

I declare to the best of my knowledge that no part of this dissertation was earlier submitted for the award of Research Degree to any University.

18/7/03.

Darla Venkateswara Rao

Regd.No.98HT PH 04

Signature of the Supervisor

30/7/03

Head

Department of Telugu

31.7.03

Dean

School of Humanities

DEAN
SCHOOL OF HUMANITIES
University of Hyderabad
Hyderabad-500 134

# అంకితం

అభ్యుదయ భావాల ఆదర్శ జీవనంతో
అభ్యుదయ పథంవైపు నడిపిస్తూ
నిరంతర కృషికి ప్రేరేపించిన,
ఆత్మవిశ్వాసాన్ని అలంకరణగాధరింపజేసిన
అమృత హృదయుడు
శ్రీ వి.వి.రమణ (H.P.C.L, Hyd.)గారికి
ఆత్మీయంగా, అభిమానపూర్వకంగా
వినమ్రతతో చేస్తున్న అంకితం!

# కృతజ్ఞతలు

పరిశోధనకు అవకాశం కల్గించిన తెలుగు శాఖ, హైదరాబాదు విశ్వవిద్యాలయం వారికీ-

పరిశోధన పట్ల ఎంత ఆసక్తి ఉన్నా, దాన్ని ప్రోత్సహించడంలో సూపర్‌వైజర్ పాత్ర అనిర్వచనీయమైంది. సహృదయ విదుషీమణి, ఆత్మీయతామూర్తి డా. ఎస్.శరత్ జ్యోత్స్నారాణి గారి పర్యవేక్షణలో ఈ పరిశోధన కొనసాగడం వల్లనే సకాలంలో పూర్తి చేయగలిగాననుకొంటున్నాను. కేవలం పరిశోధనాంశాన్ని చర్చించడం వరకే చేసి, ఆ పరిశోధకుడిని వదలించుకొనే పద్ధతిలో కాకుండా, నావైయక్తిక పరిస్థితుల్ని కూడా అడిగి తెలుసుకొంటూ, తన పరిధిలో సహకారాన్ని, సూచనల్ని అందించి పరిశోధన చేయించిన సహృదయురాలు. వీరి కుటుంబంలో నన్నొక సభ్యుడిలా ఆదరించారు, పరిశోధన చేయమని హెచ్చరించారు. నా జీవితంలో స్థిరపడడానికో మార్గాన్ని చూపారు. వీరికి నా ప్రత్యేక కృతజ్ఞతలు.

ఆశ ఉన్నా, అవకాశం లేక అది నెరవేరని నా తల్లిదండ్రులు నా చదువునే వాళ్ళ ఉన్నత చదువులుగా భావించారు. ఎన్ని కష్టాలున్నా, ఇంకా నాచదువుకే జీవితాన్ని అంకితం చేస్తున్న మా అమ్మ పెదనాగమ్మ, మా అయ్య లంకయ్య (అబ్బాయి) గార్లకు కృతజ్ఞతలు చెప్పడం చిన్నమాటైనప్పటికీ, ఈ సందర్భంగా వారికి నా హృదయపూర్వక ధన్యవాదాలు చెప్పడం నావిధి.

పరిశోధనకు జూనియర్, సీనియర్ రీసెర్చ్ ఫెలోషిప్ (JRF& SRF) లను అందించిన యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్, న్యూఢిల్లీ వారికీ, దాన్ని అమలు చేసిన హైదరాబాదు విశ్వవిద్యాలయం వారికీ,

పరిశోధనకు ఒక పరిధిని నిర్ణయించుకొని, సేకరించిన సామగ్రితో సకాలంలో పూర్తి చేయడానికి ప్రయత్నించాలని, సలహానిస్తూనే, అన్ని విధాలా సహకరిస్తూ ప్రోత్సహించిన తెలుగు శాఖ అధ్యక్షుడు ఆచార్య ముదిగొండ వీరభద్రయ్య గారికీ -

పరిశోధనలో ప్రవేశించేటప్పుడు తెలుగు శాఖ, అధ్యక్షుడుగా ఉన్న ఆచార్య రవ్వాశ్రీహరిగారికీ, నాటి ఇంటర్వ్యూ కమిటీ వారికీ -

పరిశోధనకు కావలసిన సహకారాన్ని అందించిన డీన్, స్కూల్ ఆఫ్ హ్యూమానిటీస్, హైదరాబాదు విశ్వవిద్యాలయం వారికీ, సిబ్బందికీ -

ఎం.ఏ.లోనూ, ఎం.ఫిల్.లోనూ పాఠ్యాంశాల్ని బోధించిన మా అధ్యాపకులు డా. శరత్ జ్యోత్స్నా రాణి గారితో పాటు, ఆచార్య జి.వి.సుబ్రహ్మణం, ఆచార్య కె.కె. రంగానాథాచార్యులు, ఆచార్య పరిమిరామనరసింహం, డా.ఎన్. ఎస్. రాజు గార్లకూ, కలిసినప్పుడల్లా పరిశోధన త్వరగా పూర్తి చేయమంటూ ప్రోత్సహించిన డా.జి.అరుణకుమారి, డా.రాములు గార్లకూ -

నా పరిశోధనకు ప్రేరణనూ, ప్రోత్సాహాన్ని, ఆసక్తిని కల్గించిన వివిధ విశ్వవిద్యాలయాల, కళాశాలలకు చెందిన ఆచార్య గుజ్జర్లమూడి కృపాచారి (నాగార్జున విశ్వవిద్యాలయం), ఆచార్య రుక్నుద్దీన్, ఆచార్య కుసుమాబాయి, ఆచార్య ననుమాసస్వామి, ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి (ఉస్మానియా విశ్వవిద్యాలయం), ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు (బెంగుళూరు), ఆచార్య వేదుల సుబ్రహ్మణ్యశాస్త్రి(ఆంధ్రవిశ్వవిద్యాలయం), ఆచార్య బేతవోలు రామబ్రహ్మం, డా.పి.చంద్రశేఖర్ (పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం) , డా.వెలుదండ నిత్యానందరావు (ఉస్మానియా విశ్వవిద్యాలయం), డా.వాడవల్లి చక్రపాణిరావు, డా.ద్వానాశాస్త్రి (SKBR కాలేజి, అమలాపురం) తదితరులందరికీ -

ఎం. ఏ.లో చేరిన నాటినుండీ నాఅభివృద్ధికి తోడ్పడుతూ, నాపరిశోధనకు మరింత ఆత్మవిశ్వాసాన్ని అందించిన వి.వి.రమణ గారికీ, వేండవ్ గారింటికెళ్ళినప్పుడల్లా వారిసమయాల్ని కేటాయించి, సహకరించిన కుమారి సుష్మ, కుమారి సుదీప్తిలకూ -

పరిశోధన విషయచర్చల్లో వివిధ సూచనలు, సలహాలందించడంతో పాటు తన అన్ని గ్రంథాల్ని చదువుకోవడానికి స్వేచ్ఛ నిచ్చి, పరిశోధనలో నిరుత్సాహాన్ని తొలిగించి ఆత్మవిశ్వాసాన్ని కల్గించడంలో తోడ్పడిన అన్నయ్య డా.డి.నారాయణరావు (తెలుగు లెక్చరర్, ఎస్.ఏ.పి.కళాశాల) గారికీ -

సమస్యల్నేమీ ఆలోచించనివ్వకుండా పరిశోధన కొనసాగించడానికి ప్రశాంతమైన వాతావరణాన్ని కల్గించిన కుటుంబ సభ్యులు, అన్నయ్యలు, సామ్యాలు, సత్యనారాయణలకూ - పరిశోధన శుద్ధప్రతి తయారీలో ఎంతగానో సహకారాన్ని అందించిన నా జీవిత భాగస్వామి శ్రీమతి దార్ల మంజుశ్రీ (తెలుగు లెక్చరర్)కీ, నాదగ్గరే ఉండి, నాతోపాటు ఇదే విశ్వవిద్యాలయంలో పరిశోధన చేస్తూ, నా ఆరోగ్యానికి అవాంతరాలు రాకుండా, తోడ్పడిన తమ్ముడు రవికుమార్‌కీ, ఇంటికెళ్ళినప్పుడల్లా తొందరగా పరిశోధన చెయ్యమంటూ పరిశోధనపైనే ఆలోచనల్ని కేంద్రీకరించేటట్లు చేసిన చెల్లి, విజయకుమారి (తెలుగు పండిట్ గ్రేడ్ I) కీ -

పరిశోధనకు పరోక్షంగా ఆసక్తిని కల్గించడంలో సహకరిస్తూ, నావ్యాసాల్ని ప్రచురించిన వివిధ పత్రికాధిపతులకూ, నాప్రసంగాల్ని ప్రసారం చేసిన ఆకాశవాణి ప్రోగ్రామ్ ఎగ్జిక్యూటివ్స్ నల్లూరి బాబూరావు, ఝాన్సీ.కె.వి.కుమారి, సుధామ, ఉషారాణి, డా.బి.డి.ఎల్.ప్రసన్న, సుమనస్పతిరెడ్డి గార్లకూ-

సెంట్రల్ యూనివర్సిటీలో నిత్యం సాహిత్యం పట్ల వివిధ ధోరణులను చర్చకు పెట్టి, పరిశోధకుల నూతన ఆలోచనలకు కేంద్రబింధువులవుతున్న డా.బి. ఆర్. అంబేద్కర్ స్టూడెంట్స్ అసోషియేషన్, మాదిగ సాహిత్యవేదిక, ప్రోగ్రెస్సివ్ స్టూడెంట్స్ పోరమ్, దళిత స్టూడెంట్స్ యూనియన్, ఏ.పి.దళితరీసెర్చ్ సెంటర్‌లకూ-

పరిశోధక మిత్రులు ఎమ్.నరసింహులు, డా. ఎల్లయ్య, రాజేశ్వరారావు, ఇ.వెంకటేశ్, జి.వి.రత్నాకర్, తిరునగరి శ్రీనివాస్, గుండె డప్పుకనకయ్య, జిలుకర శ్రీనివాస్, సుధాకర్ భట్టు, రతికాంత్ పాండా, జి.ఈశ్వరరావు, ఎస్. ఎల్.వి. ఉమామహేశ్వరరావు, శాంతయ్యలకూ-

నాకో అస్తిత్వాన్ని కల్గించిన శ్రీఅనంత పద్మనాభ కళాశాల (వికారాబాదు) వారికీ -

ఏ సమయంలోనైనా మార్పులు-చేర్పులు చేస్తూ, ఏమాత్రం విసుగు ప్రదర్శించకుండా కంప్యూటర్ టైపింగ్ చేసి, సకాలంలో ఆకర్షణీయంగా గ్రంథాన్ని అందించిన పి.ఉమగారికి -

సమాచార సేకరణలో సహకరించిన ఇందిరాగాంధీ మెమోరియల్ లైబ్రరీ హైదరాబాదు విశ్వవిద్యాలయం, శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషానిలయం (హైదరాబాదు), నగర కేంద్ర గ్రంథాలయం (హైదరాబాదు), పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం (హైదరాబాదు), సుందరయ్య విజ్ఞాన కేంద్ర గ్రంథాలయం (హైదరాబాదు), శ్రీఅనంత పద్మనాభ కళాశాల (వికారాబాదు), శ్రీసారస్వతనికేతన్ (వేటపాలెం), గౌతమీ గ్రంథాలయం (రాజమండ్రి) వారికీ -

ఈ పరిశోధనలో వివిధ గ్రంథాలను వాడుకొన్నందుకు, ఆయా రచయితలకూ-

తెలుగు శాఖ, హైదరాబాదు విశ్వవిద్యాలయం సిబ్బంది పరమేశ్వర్, భవానీ శంకర్, వమూర్తి, కిషన్‌ల సహకారానికీ - హైదరాబాదు విశ్వవిద్యాలయ సిబ్బంది నారాయణ, ప్రసన్నసింగ్, వెస్లీ, బెన్షర్, సెబాస్టియన్ తదితరులందరికీ-

డిగ్రీ చదువుతున్నపుడ, ఈ విశ్వవిద్యాలయం గురించి విశదీకరించి హైదరాబాదు విశ్వవిద్యాలయంలోనే చదువుకోవాలనే కుతుహలాన్ని నాలో కల్గించిన ఆత్మీయమిత్రుడు గిడ్డి శ్రీరాములు (వెయ్యేరుఅగ్రహారం)కీ-

ఇంకా, ఈ పరిశోధన పూర్తి కావడానికి సహకరించిన వారందరికీ నా హృదయ పూర్వక కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను.

- దార్ల వెంకటేశ్వరరావు.

# సంకేత పదవివరణ

## (List of Abbrevations)

| | | |
|---|---|---|
| అను | = | అనువాదం |
| ఆ.అ.సం. | = | ఆరుద్ర అభినందన సంచిక |
| ఆ.సం. | = | ఆరవ సంపుటి |
| ఆ.వ్యా.పీ. | = | ఆరుద్ర వ్యాసపీఠం |
| ఎ.సం | = | ఎనిమిదవ సంపుటి |
| ఏ.సం. | = | ఏడవ సంపుటి |
| క.సం. | = | కవితా సంపుటి |
| క్ర.సం. | = | క్రమసంఖ్య |
| గు.గు.పీ. | = | గురజాడ గురు పీఠం |
| గు.సె. | = | గుడిలో సెక్స్ |
| చ.ము. | = | చతుర్థ ముద్రణ |
| తృ.ము. | = | తృతీయ ముద్రణ |
| తొ.కూ. | = | తొలి కూర్పు |
| తొ.ము. | = | తొలి ముద్రణ |
| తొ.సం. | = | తొమ్మిదవ సంపుటి |
| ది.ప. | = | దినపత్రిక |
| ద్వి.ము. | = | ద్వితీయ ముద్రణ |
| ద్వి.సం. | = | ద్వితీయ సంపుటి |
| నా.సం. | = | నాల్గవ సంపుటి |
| పద్నా.ము. | = | పద్నాల్గవ ముద్రణ |
| పరి.క. | = | పరిష్కరణ కర్త |
| పు.సం. | = | పుట సంఖ్య |
| పీ. | = | పీఠిక |
| పు. | = | పుట |
| పు.ము. | = | పునర్ముద్రణ |
| ప్ర.కా?. | = | ప్రచురణ కాలం |
| ప్ర.ప్ర. | = | ప్రజాకళలూ – ప్రగతివాదులూ |
| ప్ర.భా. | = | ప్రథమ భాగం |
| ప్ర.ము. | = | ప్రథమ ముద్రణ |
| ప్ర.సం. | = | ప్రధాన సంపాదకుడు |
| మ.వే. | = | మన వేమన |
| మా.ప. | = | మాస పత్రిక |
| మూ. | = | మూలం |
| మూ.భా. | = | మూడవ భాగం |
| మొ.సం. | = | మొదటి సంపుటి |
| రా.సీ.ఏ. | = | రాముడికి సీత ఏమవుతుంది? |
| రెం.భా. | = | రెండవ భాగం |
| రెం.సం. | = | రెండవ సంపుటి |
| వ.సం. | = | వరుస సంఖ్య |
| వే.వే. | = | వేమన్న వేదం |
| వ్యా. | = | వ్యాసం |
| స.ఆం.సా. | = | సమగ్ర ఆంధ్ర సాహిత్యం |
| సినారె. | = | సి.నారాయణ రెడ్డి |
| సం. | = | సంపాదకుడు/సంపాదకురాలు |
| సం.లు. | = | సంపాదకులు |
| సం.క. | = | సంకలనకర్త/సంకలనం |
| P | = | Page |

# ముందుమాట

## (Preface)

సెంట్రల్ యూనివర్సిటీ (హైదరాబాదు విశ్వవిద్యాలయం) లో ఎం.ఏ.తెలుగు చదువుతున్నపుడు, అధ్యాపకుల బోధన నన్నెంతగానో ఆకర్షించింది. ఇంటర్నల్ పరీక్షలకు వ్యాసాల్ని తయారు చేయించేవారు. ఈ వ్యాసాల్ని రాయడానికి అధ్యాపకుల, సీనియర్ల సలహాలను పొందడానికి, వారిని కలిసేవాడిని. కొత్త కొత్త అనుమానాలు కలిగేవి. హాస్టలులో సహవిద్యార్థులతో సాహిత్య చర్చలో పాల్గొనేవాడిని. యూనివర్సిటీ వారు వివిధ సెమినార్లు నిర్వహిస్తే వాటిలోనూ పాల్గొనే వాడిని. నగరంలో వివిధ సాహితీ సమావేశాలు జరుగుతుంటే, సమకాలీన సాహిత్య అవగాహనకు అవెంతగానో ఉపయోగించేవి. వాటిని విన్నప్పుడు సాహిత్యంలో పరిశోధించవలసిన అంశాలు చాలా ఉన్నాయనిపించేది. ఇవన్ని నాలో పరిశోధన చేయాలనే జిజ్ఞాసను పెంచాయి.

ఎం.ఫిల్‌లో సీటు రావడం, సహృదయ విదుషీమణి, నిత్యం ప్రోత్సహించే చైతన్యశీలి. డా. ఎస్.శరత్ జ్యోత్స్నారాణి గారి పర్యవేక్షణలో పరిశోధన చేయగలిగాను. ఈ కాలంలో, వీరు నన్నెంతగానో ప్రోత్సహించారు. పరిశోధన మరింత కొనసాగించాలని చెప్పేవారు. పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారు గ్రంథ ప్రచురణకిచ్చే ఆర్థిక సహాయానికి నా ఎం.ఫిల్ ఎంపిక అయ్యింది. కానీ, ప్రచురణకి ఆ సొమ్ము సరిపోదు. ఇదే సమయంలో ఎం.ఏ.కి రావలసిన మెరిట్‌స్కాలర్‌షిప్పుని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వారు అందించగా, ప్రచురణ కవసరమైన, మిగిలిన సొమ్మును వేడమ్‌గారు సహాయం చేశారు. దానితో నా ఎం.ఫిల్ "జ్ఞానానందకవి ఆమ్రపాలి పరిశీలన" ప్రచురితమై, పత్రికల, ఆకాశవాణిల ప్రశంసలు పొందింది. దీనిలో పరిశోధన చేయాలనే ఆసక్తి మరింత పెరగడంతో పి.హెచ్.డిలో చేరాను.

పి.హెచ్ డిలో ప్రవేశించే నాటికి, సాహిత్యంలో వివిధ అంశాలపై పరిశోధన చేయాలనే తపన ఉండేది. కాలాన్ని, ఆర్థిక పరిస్థితుల్నీ దృష్టిలో పెట్టుకోవడం చాలా అవసరమని మేడమ్ గారు, మరికొంతమంది అధ్యాపకులు సలహాలిచ్చారు. జె. ఆర్. ఎఫ్.(జూనియర్ రీసెర్చ్‌ఫెలోషిప్పు)కి ప్రయత్నిస్తూనే పి.హెచ్‌డి.కి సరైన అంశాన్ని ఆలోచిస్తున్నాను. **1998** లో ఆరుద్ర మరణించినప్పుడు నగరంలో చాలాచోట్ల 'ఆరుద్ర సాహితీ సమాలోచనలు' జరిగాయి. చాలావాటికి వెళ్ళాను. వక్తల ప్రసంగాల్ని విన్నాను. 'పరిశోధకుడు' అనడమేతప్ప, పరిశోధనాంశాల్ని వివరించడంలో స్పష్టత కన్పించలేదు. గ్రంథాల్ని మాత్రం పేర్కొనేవారు. విశ్వవిద్యాలయాల్లో ఎవ్వరైనా ఆరుద్ర పరిశోధన గురించి ప్రత్యేకంగా పరిశోదించారేమోనని చూశాను. ఆరుద్ర కవిత్వం గురించి పరిశోధించారు తప్ప, 'పరిశోధకుడుగా ఆరుద్ర' గురించి ప్రత్యేకించి ఎవ్వరూ పరిశీలించలేదని తెలుసుకున్నాను.

సమగ్ర ఆంధ్ర సాహిత్యం, గురజాడ గురుపీఠం, వేమన, రాముడికి సీత ఏమవుతుంది? గుడిలో సెక్స్, వ్యాసపీఠం వంటి ఆరుద్ర పరిశోధన గ్రంథాలు కన్పిస్తున్నాయి. గురజాడ గురుపీఠం గ్రంథం ఉత్తమ విమర్శ బహుమతి పొందింది. పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారు ఆరుద్రను ఉత్తమ పరిశోధనకిచ్చే బహుమతితో సత్కరించారు. సాహిత్య పరిశోధనకు గానూ వీరు చేసిన సేవకు

గుర్తింపుగా వివిధ విశ్వవిద్యాలయాలు గౌరవ డాక్టరేట్లతో గౌరవించాయి. ప్రముఖ విమర్శకుడు ముదిగొండ వీరభద్రయ్యగారు 'విమర్శకుడుగా ఆరుద్ర' కృషిని ఒక ఆంగ్ల వ్యాసంలో నిరూపించారు. కానీ, విమర్శను ఆరుద్ర, తన పరిశోధనకు వినియోగించుకున్నారనే అనుమానం నాకు కలిగింది. అయితే, పరిశోధనలో విమర్శ కూడా ఉన్నా, పరిశోధన, విమర్శలకు ప్రత్యేకమైన అస్తిత్వం ఉంది. ఆరుద్ర రచనల్ని ఈ రెండు కోణాలనుండీ అధ్యయనం చేయవలసిన అవసరం ఉందనిపించింది.

మరొక అంశం, సమగ్ర ఆంధ్ర సాహిత్యం పన్నెండు సంపుటాలవరకే ప్రచురించినా, ఆదిలో వేసుకొన్న ప్రణాళిక ప్రకారం ఆరుద్ర అన్ని సంపుటాల్ని అందించలేక పోయారు. ఈ తొలిముద్రణ వెలువడుతున్నప్పుడే వివిధ పత్రికల్లోనూ, ఆ గ్రంథాలకు రాసిన పీఠికల్లోనూ రచనలోగల లోపాల్ని, పొరపాట్లనీ కొంతమంది ఎత్తి చూపారు. మిగిలిన సంపుటాల్ని కూడా లోపాల్ని సవరించుకొని త్వరలోనే అందిస్తానని **1985**లో ఆరుద్ర షష్టిపూర్తి ఉత్సవంలో ప్రకటించినట్లే.,పదమూడు సంపుటాల్లో పునర్ముద్రణ చేసి విడుదల చేశారు. పునర్ముద్రణలో మార్పులూ, చేర్పులూ ఎంత వరకు చేశారు? తొలిముద్రణ పీఠికల్లోనూ, పత్రికల్లోనూ వచ్చిన విమర్శల్ని ఎంతవరకు సరిదిద్దారు ? ఈవిమర్శలకు ఒక సాహిత్య చరిత్రకారుడు, పరిశోధకుడుగా ఆరుద్ర ప్రతిస్పందన ఎలా ఉంది?వంటి వాటిని అన్నింటినీ పరిశీలించవలసిన అవసరం ఉందని పించింది.

వీటితోపాటు ఆరుద్ర వ్యాసాల్ని, పరిశోధన గ్రంథాల్ని చదువుతుంటే, చాలామంది పేర్కొన్నట్లు ఆకర్షణీయమైన శైలి కేవలం ఒకే అంశానికి చెందిందికాదనీ, అదొక ప్రత్యేక లక్షణంగా చేసుకొని పరిశోధనలో నిక్షిప్తం చేయడానికి ఆరుద్ర ప్రయత్నించినట్లు అన్పించింది. దీన్ని అధ్యయనం చేయడం అవసరమనిపించింది. ఆరుద్ర పరిశోధన గురించి మేడమ్ డా.శరత్‌జ్యోత్స్నారాణి గారికి వివరించాను. నా ఆలోచనకి స్వతంత్రతనిచ్చారు. పరిశోధన రచనల జాబితాను, ప్రణాళికను సిద్ధంచేయమన్నారు. ఈ అంశాన్ని పరిశోధన చేస్తే ఎలా ఉంటుందనే విషయంలో మరికొంత మంది అధ్యాపకుల్ని కూడా సలహా అడిగి, వారి సూచనల్ని కూడా స్వీకరించాను.

'పరిశోధకుడుగా ఆరుద్ర పేరుతో పి.హెచ్.డి అంశానికి ప్రణాళికను తయారుచేసి, మేడమ్ డా.శరత్‌జ్యోత్స్నారాణి గారికీ, ఆచార్య కె.కె.రంగనాథాచార్యుల గారికీ చూపించగా, కొన్ని సూచనలు చేశారు. వాటిని పాటించి, మార్పులచేసి, హైదరాబాదు విశ్వవిద్యాలయం, తెలుగు శాఖ వారికి సమర్పించాను. కానీ, పరిశోధన అంశాన్ని అధ్యయనం చేస్తున్నప్పుడు ఊహ ప్రతిపాదన (Hypotheses)కీ, ప్రణాళిక (Research Design)కీ చాలా వ్యత్యాసం కన్పించింది. ఈ పరిశోధన పూర్వప్రణాళికకు చాలా మార్పులు చేయవలసి వచ్చింది.

ఎప్పటికప్పుడు పర్యవేక్షణాధికారిణి డా.శరత్‌జ్యోత్స్నారాణి గారు వాటిని పరిశీలిస్తూ, నా భావాలకి స్వతంత్రత నిచ్చిన, మేడమ్‌గారి దగ్గర ఎం.ఫిల్ మాత్రమే కాకుండా, పి.హెచ్.డి కూడా చేసే అవకాశం లభించడం నా అదృష్టంగా భావిస్తున్నాను.

నా పరిశోధనాంశ పరిధి విషయంలో, ఆరుద్ర రచించిన ముద్రిత వ్యాసాల్ని, గ్రంథాల్ని మాత్రమే పరిశీలనకు తీసుకొన్నాను. గ్రంథరూపంలో ప్రకటితమైన సమగ్ర ఆంధ్ర సాహిత్యం, తొలి ప్రచురణా, పునర్ముద్రణనూ, రాముడికి సీత ఏమవుతుంది? మన వేమన, వేమన్న వేదం, గురజాడ గురు పీఠం, గుడిలో సెక్స్, వ్యాసపీఠం, వివిధ పత్రికలకు రాసిన వ్యాసాలూ, వివిధ గ్రంథాలకు రాసిన

పీఠికలు మొదలైనవి నా పరిశోధనకు స్వీకరించాను. చదరంగం గురించి 'చదరంగం-అంతర్జాతీయ విధానం' పేరుతో ఒక గ్రంథం రాసినా, దాన్ని ఈ పరిశోధనలోకి తీసుకోలేదు. అది ఒక క్రీడకు సంబంధించిన విషయం. చదరంగం నేర్చుకోవడం, ఎత్తుకి పై ఎత్తులు వేయడంలో గల తెలివితేటలు, వివిధ ఆటగాళ్ళ ప్రతిభావిశేషాలు వంటివి దానిలో ఉన్నాయి. ఇవి వ్యక్తి వ్యక్తికీ మధ్య మారుతూ ఉంటాయి. సంగీతానికి సంబంధించిన వ్యాసాల్నీ ఈ పరిశోధనలో, స్వీకరించలేదు. కానీ, నృత్య పరిణామాన్ని వివరించిన వాటిని పరిశీలించాను. సాహిత్య పరిశోధనే ప్రధాన కేంద్రంగా కొనసాగినా, సాహిత్యేతర గ్రంథాల్ని కూడా పరిశీలనకు స్వీకరించవలసి వచ్చింది. సాంఘిక శాస్త్రాల్లో చరిత్రను సమగ్ర ఆంధ్ర సాహిత్య పరిశోధనకు యుగవిభజన చేయడంలో, విశ్లేషణలోనూ ఆరుద్ర అధికంగా ఉపయోగించుకోవడం కన్పిస్తుంది.

సృజనాత్మక ప్రక్రియల్లో కృషి చేయలేని కొంతమంది విమర్శ, పరిశోధనలో రచనల్ని కొనసాగిస్తుంటారనే ఒక అభిప్రాయం ఉంది. కానీ, అది సరైందికాదు. అందుకనే ఆరుద్ర రచనల్ని సమీక్షిస్తూ, సృజనాత్మక రచనల నుండి పరిశోధన వైపు ప్రస్థానాన్ని కొనసాగించిన వికాసాన్ని ఒక అధ్యాయంలో వివరించాను. విమర్శ, పరిశోధన స్వరూపస్వభావాల్ని సైద్ధాంతికంగా విశ్లేషిస్తూ, విమర్శకుడుగా, పరిశోధకుడుగా, సాహిత్య చరిత్రకారుడుగా ఆరుద్ర కృషిని ప్రత్యేక అధ్యాయాల్లో నిరూపించడానికి ప్రయత్నించాను. పరిశోధకుడుగా ఆరుద్రను అధ్యయనం చేస్తుంటే, ఆత్మాశ్రయ శైలి ఉన్నా, వస్త్వాశ్రయ పరిశోధనలో సృజనాత్మకత ఉందని నిరూపితమైంది. పరిశోధనలో మార్క్సిస్టు దృక్పథాన్ని ప్రదర్శించినట్లు వెల్లడైంది. ఈ ఫలితాంశాల్ని ముగింపు అధ్యాయం 'సింహావలోకనం'లో ప్రత్యేకంగా వివరించాను. ఈ పరిశోధనలో విశ్లేషణాత్మక పద్ధతి (Analytical Method)ని పాటించాను. ప్రతి అధ్యాయం చివర ఆ అధ్యాయానికి సంబంధించిన సూచికలు (References) జతపరిచాను.

ఆరుద్ర రచనలు ఒక్కొక్కటీ ఒక్కో ప్రత్యేక అంశంగా పరిశీలన చేయువలసినంత లోతున్న రచనలు. వీటిలో సమగ్ర ఆంధ్ర సాహిత్యం పై పరిశోధన చేయాలంటే, అనేక కోణాల్లో పరిశీలన చేసే అవకాశం ఉంది. తొలి ముద్రణ-పునర్ముద్రణ లను ప్రత్యేకించి పి.హెచ్.డి కి ఒక అంశంగా స్వీకరించ గలిగినంత కృషి కన్పిస్తుంది. అలాగే, సమగ్ర ఆంధ్ర సాహిత్యం, కవుల సాహిత్య చరిత్రల్ని తులనాత్మకంగా అధ్యయనం చేసే అవకాశమూ ఉంది. కనుక, పరిశోధకుడుగా ఆరుద్ర చేసిన కృషిని పరిశీలిస్తూనే, పరిశోధన చేసిన అంశాల్నీ లోపాల్నీ నిరూపించడానికి ప్రయత్నించాను. సమగ్ర ఆంధ్ర సాహిత్యం లో సమగ్ర శబ్దం సమగ్రతను సూచించడం ఎలా సాధ్యం కాదో, 'పరిశోధకుడుగా ఆరుద్ర' అనే అంశంతో చేసిన ఈ పరిశోధనలో ఆరుద్రను పరిశోధకుడుగా సమగ్రంగా పరిశోధించగలగడమూ కష్టసాధ్యమే అని సవినయంగా మనవి చేసుకొంటున్నాను. ఈ పరిశోధన వల్ల ఆరుద్ర రచనలో గల విమర్శ, పరిశోధనాంశాల్ని బట్టి పరిశోధకుడుగా ఆరుద్ర దృక్పథం, స్వభావాల్ని అర్థం చేసుకోవడానికి నా పరిశోధన కాలం, వ్యయం, సామర్థ్యాల్ని బట్టి సాధ్యమైనంత కృషి చేశాననేఅనుకొంటున్నాను.

# విషయసూచిక

పుట సంఖ్య


అంకితం - iii

కృతజ్ఞతలు iv

సంకేతపదవివరణ vii

ముందుమాట viii


## అధ్యాయం-1

### ఆరుద్ర జీవితం, రచనా విశేషాలు-పరిశోధన ప్రస్థానం (1-22)


1.0. ఆరుద్ర జీవితం-సాహిత్యం 1

1.1. జననం 1

1.1.2. విద్యాభ్యాసం 1

1.3. సాహిత్యాభిరుచి 2

1.4. వృత్తి - ప్రవృత్తి 2

1.4.1. ఫోటో గ్రాఫర్ - గుమస్తా 3

1.4.2. ప్రూఫ్‌రీడర్ - సినీరచయిత 3

1.5. రచనా విశేషాలు 3

1.5.1. త్వమేవాహమ్ 3

1.5.2. 'సినీవాలి' 4

1.5.3. కూనలమ్మ పదాలు 6

1.5.4. ఇంటింటి పజ్యాలు 9

1.5.5. అమెరికా ఇంటింటి పజ్యాలు 10

1.5.6 ఆరుద్ర కవితాసంకలనాలు 11

1.5.7 మనిషి- ఆడమనిషి (ఆధునిక మహాకావ్యం) 11

1.5.8. సినీ గీతాలు 12

1.5.9. కథలు- నవలలు 13

1.5.10. నాటికలు-నాటకాలు 13

| | | |
|---|---|---|
| 1.5.11. | అనువాద రచనాలు | 14 |
| 1.5.12. | విమర్శ– పరిశోధన– ఇతర రచనలు | 14 |
| 1.6. | బహుముఖులు | 14 |
| 1.6.1. | ప్రవృత్తిని వృత్తిగా మార్చుకోవటం | 15 |
| 1.6.2. | పరిశోధనాభిలాష – ప్రేరణలు | 15 |
| 1.7. | మరణం | 17 |
| 1.8. | పరిశోధన పరిధి | 17 |
| 1.8.1. | పరిశోధన – స్వరూపస్వభావాలు | 17 |
| 1.8.2. | పరిశోధన – నిఘంటు అర్థం | 18 |
| 1.8.3. | పరిశోధన నిర్వచనం | 18 |
| 1.8.4. | పరిశోధన లక్షణాలు | 21 |
| 1.8.5. | పరిశోధన–సమీక్ష– విమర్శ | 22 |
| 1.8.6. | పరిశోధన – సాహిత్య చరిత్ర | 22 |


## అధ్యాయం– 2

## తెలుగు పరిశోధన : ఆరుద్ర దృక్పథం (28 – 45)


| | | |
|---|---|---|
| 2.0. | 'పరిశోధన' ఆరుద్ర దృక్పథం | 28 |
| 2.1. | సిద్ధాంతం– సిద్ధాంత గ్రంథం | 29 |
| 2.2. | పరిశోధన–పరిశోధకుడు: ఆరుద్ర అభిప్రాయాలు | 33 |
| 2.3. | తెలుగు పరిశోధన | 34 |
| 2.3.1. | తెలుగు పరిశోధన : పాశ్చాత్య ప్రభావం | 35 |
| 2.3.2. | పరిశోధనలో దృక్పథం | 36 |
| 2.4. | ఆరుద్ర దృక్పథం | 38 |
| 2.4.1. | ఆరుద్ర కవితా దృక్పథం | 39 |
| 2.5. | పరిశోధన– విమర్శ భేదాలు– పోలికలు : సమన్వయం | 43 |

## అధ్యాయం-3

### ఆరుద్ర విమర్శనాత్మక దృక్పథం (49-80)


| | | |
|---|---|---|
| 3.0. | పరిశోధక విమర్శకుడు | 49 |
| 3.1. | విమర్శలో దృక్పథాన్ని గుర్తించే అంశాలు | 49 |
| 3.1.1. | మార్క్సిస్టు విమర్శ సూత్రాలు : దృక్పథం | 50 |
| 3.2. | మార్క్సిస్టు దృక్పథంలో "వేమన" | 52 |
| 3.2.1 | లోకాయత భౌతిక వాస్తవిక దృక్పథం | 55 |
| 3.3. | శాస్త్రీయ దృక్పథంలో "గురజాడ" | 56 |
| 3.3.1. | తులనాత్మక విమర్శ | 57 |
| 3.3.2. | పరిశోధనాత్మక విమర్శ | 59 |
| 3.3.3. | సంయమన విమర్శన దృష్టి | 60 |
| 3.4. | శ్రీశ్రీ పట్ల ఆరుద్ర వైయక్తిక విమర్శ | 61 |
| 3.5. | "వ్యాసపీఠం"లో భిన్న దృక్పథాల సంగమం | 65 |
| 3.5.1 | స్థలనామాలు-శాస్త్రీయదృక్పథం | 67 |
| 3.6. | "ప్రజాకళలూ- ప్రగతి వాదులూ" లో మార్క్సిస్టు దృక్పథం | 67 |
| 3.7. | "గుడిలో సెక్స్"- చారిత్రక విమర్శ | 70 |
| 3.8. | "రాముడికి సీత ఏమవుతుంది ?" చరిత్ర, తులనాత్మక విమర్శ | 75 |
| 3.9. | "పీఠికలు"-సమన్వయ దృష్టి | 75 |
| 3.10. | విమర్శకుడుగా ఆరుద్ర | 80 |


## అధ్యాయం-4

### సమగ్ర ఆంధ్ర సాహిత్యం : తొలిముద్రణ, పునర్ముద్రణల మార్పులు-చేర్పులు

(85-142)


| | | |
|---|---|---|
| 4.0. | ప్రధానమైన మార్పులు | 85 |
| 4.1. | మొదటి సంపుటి ( ఆదిమ, చాళుక్య యుగాలు) | 86 |
| 4.2. | రెండవ సంపుటి ( కాకతీయ యుగం) | 97 |
| 4.3. | మూడవ సంపుటి ( పద్మనాయక, రెడ్డిరాజుల యుగం) | 107 |
| 4.4. | నాల్గవ సంపుటి ( గజపతుల, తొలిరాయల యుగం) | 117 |

4.5. అయిదవ సంపుటి (మలిరాయల యుగం) 125
4.6. ఆరవ సంపుటి (నవాబుల, ఆరవీటి రాజుల యుగం) 128
4.7. ఏడవ సంపుటి (నాయక రాజుల యుగం) 134
4.8. ఎనిమిదవ సంపుటి (కడపటి రాజుల యుగం) 140

## అధ్యాయం-5

### సమగ్ర ఆంధ్ర సాహిత్య పరిశోధన (144-204)

5.1. సంపుటులు-రచనాకాలం 144
5.1.1. తొలిముద్రణ వివరాలు 145
5.1.2. పునర్ముద్రణ వివరాలు 146
5.2. సమగ్ర ఆంధ్ర సాహిత్యం "సమగ్రత" 146
5.3. సమగ్ర ఆంధ్ర సాహిత్యం- "ఆంధ్ర" "తెలుగు" 150
5.4. సమగ్ర ఆంధ్ర సాహిత్యం-"సాహిత్యం" 151
5.5. కవుల చరిత్ర-సాహిత్యచరిత్ర 151
5.5.1. కవుల చరిత్ర 152
5.5.2. సాహిత్య చరిత్ర 152
5.5.3. వాఙ్మయ చరిత్ర 153
5.6. సాహిత్య చరిత్ర-"చరిత్ర" 153
5.7. సాహిత్య చరిత్రకు ఆధారాలు. 155
5.7.1. పరిశోధన ఆకారాలు- ఆరుద్ర అవగాహన. 155
5.8. సాహిత్య యుగం, సమస్యలు- ప్రమాణాలు 158
5.8. సాహిత్యయుగం-నిర్వచనాలు 160
5.8.2. కవుల సాహిత్య చరిత్రలు- యుగవిభజన 161
5.8.3. సమగ్ర ఆంధ్ర సాహిత్య యుగవిభజన- ఏకసూత్రత. 165
5.8.3.1. యుగ విభజన ఆరుద్ర భావ పరిణామం 166
5.8.3.2. ఆరుద్ర యుగ విభజనపై విమర్శలు 167
5.8.3.2.1. కొంతమంది కవులకు అధిక ప్రాధాన్యం. 167

| | | |
|---|---|---|
| 5.8.3.2.2. | యుగవిభజనకు ఏదొక సాకు చూపడం. | 171 |
| 5.8.3.2.3. | పేరు పోషకులదైనా కవి ప్రభావమే అధికం. | 171 |
| 5.8.3.2.4. | విడ్డూరమైన యుగవిభజన. | 172 |
| 5.8.3.2.5. | ఒకరిద్దరి పేర్లతో యుగం. | 172 |
| 5.8.3.2.6. | విస్మరించిన ప్రక్రియావైవిధ్యం. | 172 |
| 5.8.3.2.7. | కవుల్ని విస్మరించడం- తారుమారు చేయడం. | 174 |
| 5.8.3.3. | యుగవిభజనలో కాలస్పష్టత. | 175 |
| 5.8.3.3.1. | యుగవిభజన- ఆరుద్ర అనుసరణ | 176 |
| 5.8.3.3.2. | కాలానుసరణలో ఆరుద్ర నైపుణ్యం. | 177 |
| 5.8.3.3.2.1. | అదిమ, చాళుక్యయుగం (12వ శతాబ్ది చివరివరకూ) | 177 |
| 5.8.3.3.2.2. | కాకతీయ యుగం (క్రీ.శ.1200-1325) | 178 |
| 5.8.3.3.2.3. | పద్మనాయక, రెడ్డిరాజుల యుగం (క్రీ.శ.1325-1450) | 178 |
| 5.8.3.3.2.4. | గజపతుల, తొలిరాయల యుగం (క్రీ.శ.1450-1500) | 178 |
| 5.8.3.3.2.5. | మలిరాయల యుగం (క్రీ.శ.1500-1543) | 178 |
| 5.8.3.3.2.6. | నవాబుల, ఆరవీటి రాజుల యుగం (క్రీ.శ.1543-1572) | 179 |
| 5.8.3.3.2.7. | నాయకరాజుల యుగం (క్రీ.శ.1600-1674) | 179 |
| 5.8.3.3.2.8. | కడపటిరాజుల యుగం (క్రీ.శ.1674-1762) | 179 |
| 5.8.3.3.2.9. | కుంఫిణీయుగం-I-II (క్రీ.శ.1757-1857) | 180 |
| 5.8.3.3.2.10. | జమీందారీ నవ్యసాహిత్యయుగం I-II (క్రీ.శ1857-1930) | 180 |
| 5.8.3.3.2.11. | ఆధునిక అభ్యుదయ యుగం (క్రీ.శ.1930-1980) | 181 |
| 5.9. | సాహిత్య చరిత్ర- ఆరుద్ర దృక్పథం | 182 |
| 5.10. | పట్టికలు-పరిశోధన | 186 |
| 5.11. | లోపాలున్నా, నిర్ణయాల ప్రకటనలో నిదానం | 190 |
| 5.12. | గొలుసుకట్టు నిర్ణయాలు | 193 |
| 5.13. | భాష-గౌరవవాచకాలు- ఏకరూపత? | 195 |
| 5.14. | చర్చనీయాంశాలు- భవిష్యత్తు పరిశోధనకు ప్రేరణలు | 196 |
| 5.15. | సాహిత్య చరిత్రలలో సమగ్ర ఆంధ్ర సాహిత్యస్థానం | 199 |
| 5.16. | సమగ్ర ఆంధ్ర సాహిత్య వైశిష్ట్యం | 202 |
| 5.17. | సాహిత్య చరిత్రకారుడు-పరిశోధకుడుగా ఆరుద్ర | 204 |

## అధ్యాయం-6

## జానపద విజ్ఞాన పరిశోధన (210-230)


| | | |
|---|---|---|
| 6.1. | జానపదులు– జానపద సాహిత్యం | 210 |
| 6.1.1. | జానపద విజ్ఞానం | 211 |
| 6.2. | జానపద విజ్ఞానం– ఆరుద్ర అవగాహన | 211 |
| 6.2.'. | జానపద విజ్ఞాన పరిశోధన– ఆరుద్ర రచనలు | 212 |
| 6.2.1.1. | ఆదిమ సమాజం– కళావిర్భావం | 212 |
| 6.2.1.2. | అభినయానికి ప్రాతిపదిక– పశుపక్ష్యాదుల అనుకరణ | 214 |
| 6.2.1.3. | పాడుపుకథలు– సమన్వయాత్మకవివేచన | 219 |
| 6.3. | రాముడికి సీత ఏమవుతుంది? జనరంజక పరిశోధన | 220 |
| 6.3.1. | రామాయణంలో సీత– నవదృక్కోణాల ఆరుద్ర నవ్యదృష్టి | 222 |
| 6.3.1.1. | ప్రపంచంలో సీతారామకథలు | 222 |
| 6.3.1.2. | రామకథను పోలిన కథలు | 222 |
| 6.3.1.3. | సీతారాముల సంబంధ బాంధవ్యాలు | 223 |
| 6.3.1.4. | వావివరుసలు– సామాజిక విశ్లేషణ | 225 |
| 6.3.1.5. | మౌఖిక– లిఖిత వాఙ్మయంలో రామకథలు | 226 |
| 6.3.1.6. | లిఖిత వాఙ్మయంలో వాస్తవ వక్రీకరణ | 226 |
| 6.3.1.7. | రామాయణాల తులనాత్మక పరిశీలన | 226 |
| 6.3.1.8. | ప్రామాణిక (మూల) రామాయణం? | 228 |
| 6.3.1.9. | సీత కేంద్రంగా కొనసాగిన పరిశోధన | 228 |
| 6.4. | జనరంజక పరిశోధన | 229 |


## అధ్యాయం-7

## పరిశోధకుడుగా ఆరుద్ర (233-282)


| | | |
|---|---|---|
| 7.1. | ఆరుద్ర పరిశోధనా దృక్పథం | 233 |
| 7.1.1. | ఆరుద్ర : తులనాత్మక పరిశోధన | 235 |
| 7.1.1.1. | గురజాడ– తెలుగు రచనల ఆంతర్యం | 236 |
| 7.1.1.2. | గురజాడ "కన్యాశుల్కం" కర్తృత్వ పరిశీలన | 237 |
| 7.1.1.3. | "కన్యాశుల్కం"– నాందీ ప్రస్తావనలు | 239 |

7.1.1.4. ''కన్యాశుల్కం'' రచన- ప్రదర్శనల కాలనిర్ణయం. 240
7.1.1.5. ''కన్యాశుల్కం''- పూర్వోత్తర ప్రతులు : తులనాత్మక విశ్లేషణ 242
7.1.1.6. ''కన్యాశుల్కం'' వస్తుపరిణామం 243
7.1.1.7. ''కన్యాశుల్కం''లో పాత్ర చిత్రణ 243
7.1.1.8. మధురవాణి పాత్ర- ఆరుద్ర పరిశీలన 243
7.1.1.9. గురజాడ 'కన్యాశుల్కం'- వీరేశలింగం 'బ్రహ్మవివాహం' తులనాత్మక పరిశీలన 246
7.1.1.10. గురజాడ- తెలుగు కవులు 247
7.1.1.11. గురజాడ- ఆంధ్రేతర కవులు 249
7.1.1.12. తొలితెలుగు చిన్న కథ 249
7.2. కవిజీవిత పరిశోధన 250
7.2.1. వేమన కాలం 252
7.2.3. వేమనస్థలం- కులం- కుటుంబం 255
7.2.4. వేమన దార్శనిక పరిణామం- ఆరుద్ర దృక్పథం 262
7.2.5. వేమన మతం 262
7.3. సృజనాత్మక పరిశోధకుడుగా ఆరుద్ర 263
7.3.1. ప్రమాణాలు, కాలానుసరణలు 264
7.3.2. సృజనాత్మక రచన 265
7.3.3. విమర్శ, పరిశోధనలలో సృజనాత్మకత 266
7.3.4. సృజనాత్మక పరిశోధన 267
7.3.5. సృజనాత్మక పరిశోధన లక్షణాలు 268
7.3.6. సృజనాత్మక పరిశోధన- సమన్వయాత్మక విశ్లేషణ 268

## అధ్యాయం-8

**సింహావలోకనం (291-301)**

**అనుబంధం - I**

సమగ్ర ఆంధ్ర సాహిత్యంలో సాహితీ వేత్తలు- ప్రముఖ శీర్షికలు 302-356

**అనుబంధం -II**

సమగ్ర ఆంధ్ర సాహిత్యం ముఖ చిత్రాలు- పీఠికలు. 357-391

**ఉపయుక్తగ్రంథ సూచిక** 392-400

# ఆరుద్ర జీవితం, రచనా విశేషాలు-పరిశోధన

## 1.0. ఆరుద్ర జీవితం-సాహిత్యం:

సాహిత్యంలో వివిధ ప్రక్రియలు ఉన్నట్లే, ఒక్కొక్క రచయిత, ఎన్ని ప్రక్రియల్లో రచనలు చేసినా, ఒకే ప్రక్రియవల్ల ప్రసిద్ధుడు కావచ్చు, రాసిన అన్ని ప్రక్రియల్లోను కొంతమంది పేరు సంపాదించవచ్చు. ఇలా, తెలుగు సాహిత్యంలో విభిన్న ప్రక్రియల్లో తనదైన ప్రత్యేకతను సాధించిన వారిలో '*ఆరుద్ర*' ఒకరు. ఆరుద్ర అసలు పేరు భాగవతుల సదాశివ శంకర శాస్త్రి[1]. వీరికి మరికొన్ని కలంపేర్లు ఉన్నప్పటికీ, 'ఆరుద్ర' అనే పేరునే శాశ్వతం చేసుకొని, తన జీవితాంతం వరకూ ఆ పేరుతోనే రచనలు కొనసాగించారు[2]. కవిగా, కథకుడుగా, పాత్రికేయుడుగా, విమర్శకుడుగా, పరిశోధకుడుగా, సాహిత్యచరిత్ర కారుడుగా సాహితీ ప్రపంచంలో గుర్తింపు ఉన్న వీరి జీవిత నేపథ్యాన్ని తెలుసుకోవడం వల్ల '*పరిశోధకుడుగా ఆరుద్ర*' అనే పరిశోధనాంశానికి ఇది ఉపయుక్తమవుతుంది.

## 1.1. జననం:

ఆరుద్ర 1925 ఆగస్టు 31వ తేదీన శ్రీమతి వెంకటజోగమ్మ, శ్రీ నరసింగరావు దంపతులకు విశాఖపట్టణంలో జన్మించారు[3]. వీరి ఇంటిపేరు '*భాగవతుల*' అని కొంతమందికి తెలిసినా, వీరి వంశవృక్షాన్ని గమనిస్తే '*ఆదిభట్ల*' అని తెలుస్తుంది[4]. వీరి వంశంలోమూలపురుషుడు '*సీతారామయ భాగవతి*', భాగవతాన్ని చదివి వినిపిస్తూ, గ్రామీణులకు తగువులు తీర్చడంలో కూడా సాయపడే వారట[5]. '*భగవతి గారు*' కాస్తా భాగవతం చదవటం వల్ల 'భాగవతులు' గా మారిపోయి భాగవతుల ఇంటిపేరుగా స్థిరపడి పోయింది. ఇంటి పేర్ల నిఘంటు నిర్మాణం వెంటనే ప్రారంభించాలంటూ ఓ వ్యాసం[6] రాసిన ఆరుద్ర ఇంటి పేరే పరిశీలనాత్మకం కావటం విశేషం.

## 1.2. విద్యాభ్యాసం:

ఆరుద్ర విద్యాభ్యాసం విశాఖపట్టణంలోని శివరామయ్య బడిలోనూ, ఏ.వి.యమ్ కాలేజీలోగల హైస్కూలు లోను జరిగింది. విజయనగరంలోని ఎం.ఆర్.కళాశాలలో ఇంటర్మీడియట్ విద్యకోసం చేరినప్పటికీ, క్విట్ఇండియా ఉద్యమం ఉధృతంగా కొనసాగుతుండడం వల్ల, దానిలో చేరిపోయి, చదువుని సగంలోనే ఆపేశారు. కానీ, తండ్రి తెచ్చిన పుస్తకాలను మాత్రం బాగానే చదివేవారు. హిందూరీడింగ్ రూములో పిట్టకథలు, డిటెక్టివ్‌నవలలు, ప్రబంధాలు ఎక్కువగా చదువుకునేవారు. అయితే స్కూలు ఫైనల్ వరకూ తెలుగు ఒక సబ్జెక్టుగా చదవలేదు[7]. డిగ్రీల కోసం చదివిన చదువు కాకుండా విజ్ఞానార్జన ధ్యేయంగా వీరి విద్యాభ్యాసం కొనసాగిందని దీన్ని బట్టి తెలుస్తుంది.

## 1.3. సాహిత్యాభిరుచి:

ఆరుద్ర కుటుంబం మొదటి నుండీ సాహితీ వాతావరణం కలిగిందే. అయినప్పటికీ, వీరి కుటుంబం ఉంటున్న వీధిలోనే సుప్రసిద్ధ సాహితీవేత్తలు అబ్బూరి రామకృష్ణారావు, పింగళి లక్ష్మీకాంతం వంటివారు ఉండటం, వారితో తరుచుగా ఆరుద్ర కలవటం జరుగుతుండేది. అంతేకాక, శ్రీ శ్రీ స్వయంగా ఆరుద్రకు బంధువు కావటం వల్ల కూడా సాహిత్యాభిలాష మరింతగా పెరగడానికి దోహదపడింది. ఇంకా సాహితీలోకంలో ప్రముఖులైన నారాయణ బాబు, రావిశాస్త్రి, చాసో, రోణంకి అప్పలస్వామి వంటి వారి పరిచయం ఆరుద్రలో సాహితీ పిపాసను మరింత ద్విగుణీకృతం చేసింది. రోణంకి వారినుండి పాశ్చాత్య కవితారీతుల్ని, సాహిత్య స్వభావాన్ని అవగాహన చేసుకున్నారు[8]. పఠాభి, కొడవటిగంటి కుటుంబరావుల పరిచయం వల్ల జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో సాహిత్యంలో వస్తున్న కొత్తధోరణులను ఆకళింపు చేసుకున్నారు. అభ్యుదయ దృక్పథం కూడా ఆరుద్రలో కన్పించడానికి రోణంకివారే ప్రధాన కారకులు. చాసో వల్ల కమ్యూనిస్టుగాను, సెట్టి ఈశ్వర రావు వల్ల కమ్యూనిష్టు పార్టీ సభ్యుడుగాను చేరి, కోగంటి గోపాలకృష్ణయ్య కవిత్వాన్ని చదవటం వల్ల మార్క్సిస్టు భావ జాలాన్ని మరింతగా అధ్యయనం చేశారు[9]. వీరందరి సాహచర్యం ఆరుద్రలో సాహితీపిపాసను, అభిరుచిని పెంపొందించి ఒక స్పష్టమైన అవగాహనను కలిగించి, రచయితగా రూపొందేటట్టు చేసిందని చెప్పవచ్చు.

## 1.4. వృత్తి – ప్రవృత్తి:

రెండవ ప్రపంచయుద్ధం జరుగుతున్నపుడు ఫాసిజానికి వ్యతిరేకంగా యుద్ధం చేయాలని ఆరుద్ర 1942లో సాయుధసైన్యంలో చేరారని, వీరిపై పరిశోధన చేసిన ఎల్. సంగయ్య పేర్కొన్నారు[10]. కానీ, ఆరుద్ర కవిత్వం గురించే పరిశోధన చేసిన ఆర్. నరసింహారావు మాత్రం, సి.పి.ఐ ప్రజాయుద్ధ పంథాను బలపరచటం కోసమూ, మరికొన్ని పరిస్థితుల ప్రాబల్యం చేతనూ చదువుకి స్వస్తి చెప్పి, ఆరుద్ర 1943లో సైన్యంలో చేరారని వివరించారు[11]. కానీ, ఆర్వీయార్ '*కవిపుంగవులు*' అనేవ్యాసంలో పొట్టకూడు కోసమంటేనే సబబుగా ఉంటుందని అన్నారు[12], అయితే, ఆరుద్ర 'బయొడేటా'లో రాయల్ ఇండియన్ ఎయిర్ ఫోర్స్‌లో 1943–46 మధ్య జనరల్ డ్యూటీస్ క్లర్క్‌గానూ బ్యాండ్ మ్యూజీషియన్ అప్రంటీస్ గానూ పనిచేశారని తెలుస్తుంది[13]. ఆ తరువాత ఏయిర్ ఫోర్స్‌లో పనిచేశారు. అప్పుడే ఫ్రెంచి భాషను నాలుగు ఫారాలు వరకూ నేర్చుకున్నారు[14]. యుద్ధం ముగిసిన తర్వాత, ఉద్యోగం కోల్పోవడంతో, మద్రాసు లో ఉన్న తన బంధువు శ్రీ శ్రీ దగ్గరకు చేరుకొని ఉద్యోగ ప్రయత్నాలు మొదలు పెట్టి, *ఆనందవాణి* పత్రికలో సంపాదకుడుగా పని సంపాదించుకున్నారు. జీతం సరిపోక, "*రెండు రకాల నాలుకలు లేక*" *ఆనందవాణి* నుంచి విరమించుకొని విశాఖపట్టణం చేరుకున్నారు[15].

## 1.4.1. ఫోటో గ్రాఫర్ – గుమస్తా:

విశాఖపట్టణంలో కొన్నాళ్ళపాటు *లైకో గ్రాఫ్‌ఫోటో* స్టుడియోలో ఫోటో గ్రాఫర్ గానూ, హార్బర్ లో గుమస్తాగానూ పనిచేసేవారు[16]. విశాఖపట్టణం జీవితాన్ని చూస్తే 'ఇంతేనా జీవితపరమార్థం' అనిపించేదనీ స్వల్పమైన ఆశయాలతో అల్పమైన జీవితాన్ని జాపారుస్తూ ఈడ్చుకొంటూబతికే విల్లీపుల్లపై జాలివేసిందనీ, కలకత్తా వచ్చే శావనీ, కవి సోమసుందర్‌కి 25 ఏప్రియల్ 1948లో రాసిన లేఖలో ఆరుద్ర పేర్కొన్నారు[17].

## 1.4.2. ప్రూఫ్‌రీడర్ – సినీరచయిత:

జీవితమంటే విసిగి విసిగి తనకు కావలసిన 'జీవితం' దొరక్క కలకత్తా చేరుకున్నా నంటారు[18]. మళ్ళీ కొన్ని నెలల తరువాత మద్రాస్ చేరుకున్నారు. తనకి అనుభవం ఉన్న జర్నలిజంలో మళ్ళీ చేరాలనుకున్నారు. 'ఢంకా' కార్యాలయానికి వెళ్ళి రోజంతా ప్రూఫులు దిద్దితే, రోజుకో రూపాయి లభించేది. దానితో సినిమాలు చూసేవారు. ఈలోగా న్యాపతినారాయణమూర్తి ఒకపత్రిక ప్రారంభించబోతున్నారని తెలిసి, దానిలో ఉద్యోగం కోసం ప్రతిరోజూ ఆయన్ని కలుస్తుంటే, పత్రిక ప్రారంభించే వరకూ ఏదైనా ఉద్యోగం చూపిస్తానని, దాన్ని చేయమని చెప్పి, రాజరాజేశ్వరి ఫిలిం కంపెనీలో చేర్పించారు[19]. ఇక్కడ నుండే సినీరచయితగా ఆరుద్ర జీవితం ప్రారంభమైంది. ఎన్ని సమస్యలు వచ్చినా, నిత్యం వివిధ పుస్తకాలను అధ్యయనం చేస్తుండే వారు. ఎన్నివృత్తులు చేసినా ప్రవృత్తి మాత్రం కవిత్వం కథలు మొదలైనవి రాస్తుండేవారు.

## 1.5. రచనా విశేషాలు:

ఆరుద్ర హైస్కూల్‌లో చదివేటప్పుడు 'చిట్టి తమ్ముడు' గేయం రాసినా, మొట్టమొదటి కవితగా 'నా కలలో' 1939 చిత్రగుప్తతో ప్రచురితమైనదేనని తెలుస్తుంది[20] అయితే, 'చిట్టితమ్ముడు' కవితని ఆరుద్ర మొదటి కవితగా కొందరు[21] పేర్కొనగా 'నా కలలో' కవిత మొదటిదని మరికొంతమంది[22] నిరూపించారు. మొదట్లో భాగవతుల శంకరశాస్త్రి పేరుతో 'ప్రజాబంధు' ఆంధ్రపత్రిక, 'పెంకి పిల్ల', వినోదిని, వంటి పత్రికల్లో 1942 నాటికి ఇరవైనాలుగు కవితలు రాశారు. అయితే వాటిలో స్పార్క్‌లు మాత్రమే ఉన్నాయని తానే పూర్తి మార్కులు ఇవ్వలేనని ఆరుద్ర చెప్పుకున్నారు.[23] 1942 ఏప్రిల్ 6.వ తేదీన విశాఖపట్టణం పై జపాన్ బాంబుల వర్షం కురిపించినపుడు 'లోహవిహంగాలు' కవిత రాశారు. దాన్ని శ్రీ శ్రీ కూడా మెచ్చుకున్నారు. అయితే దానిపై పఠాభి ప్రభావం కన్పిస్తుంది. ఈ విషయం ఆరుద్ర చెప్పుకొన్నారు[24]. తరువాత తన సొంత బాణీలో రచనలు కొనసాగించారు.

## 1.5.1. త్వమేవాహమ్:

ఇది 1948 జూలై 10వ తేదీన కృష్ణాపత్రిక లో పడిన ఒక వార్తకు స్పందించి ఈ కావ్యాన్ని ఆరుద్ర రచించారు. 1949 జూలైలో తెలుగు స్వతంత్ర లో ప్రచురితమైంది. రజాకార్ల చేతిలో

దోపిడీకి గురైన ఒకామె రైలులో ప్రయాణం చేస్తూ బట్టలు విప్పేసి నగ్నంగా నిలబడడం, దానికి కారణాన్ని ఆ ప్రయాణీకులు అడగడం, దాంతో ఆమె రజ్వీ దురంతాలు, కాందిశీకుల కష్టాలు, నైజాం కిరాతకులు పెట్టిన హింస అంతా వివరించగా, దాన్ని "నాకా సిగ్గు? నా స్త్రీత్వం ఎప్పుడో పోయింది"! అనే పతాక శీర్షికతో రజాకార్ల చేత చెరచబడ్డ ఈ స్త్రీ కథనం ప్రచురితం కావడంతో, ఆ వార్తను చూసి ఆరుద్ర ఈ కావ్యాన్ని రాశారు. ఇది 'త్వమేవాహమ్' లో కవిహృదయం శీర్షికతో ఈ వివరణ కన్పిస్తుంది. మొదట్లో 'తెలంగాణా' అని ఆరుద్ర పేరు పెడితే దాన్ని శ్రీ శ్రీ 'త్వమేవాహమ్' అని మార్చమని సలహా ఇచ్చారు. ఈ కావ్యం తెలంగాణా పోరాటానికి సంబంధించింది. 'తెలంగాణా' రజాకార్ల దురంతాల వల్ల పీడింపబడిన యువతి దీనగాథ ఈకావ్య రచనకు ప్రోద్బలమైనా, తద్వారా కాల స్వభావాన్ని ఆధునికసంఘచరిత్రని వివరించడానికి మౌలికాంశంగా నిలిచింది[25]. అయితే, దీనిలో ప్రత్యేకత ఏమిటంటే ఆరుద్ర తాను తెలంగాణాకే పరిమితం కాకుండా, సమస్త మానవ కల్యాణాన్నికోరే అభ్యుదయ దృక్పథంలోకి పయనిస్తారు[26]. ఈ కావ్యంలో ఆనేక ప్రతీకలు వాడుకొన్నారు. ఈ కావ్యంలొ వాడిన ప్రతీకల గురించి ఆరుద్ర దాశరథికి రాసిన 'లేఖ' కావ్యవస్తువును అవగాహన చేసుకోవడానికి ఎంతో ఉపకరిస్తుంది. అలాగే, ఈ కావ్యానికి శ్రీ శ్రీ రాసిన లఘు టిప్పణి కూడా ఎంతో విలువైంది. హరీంద్రనాథఛటోపాధ్యాయ రచన "Tales of Telangana" ను ఆరుద్ర అనువాదం చేశారు[27]. ప్రత్యక్షంగా చూసి, పాల్గొని, అనుభవించి రచించింది కాకపోయినా త్వమేవాహమ్, తెలంగాణా ప్రజలతో "నీవే నేను" అనే ఏకత్వాన్ని ప్రకటించింది. వారి బాధల్ని హృదయ విదారకంగా ప్రతిస్పందింప చేసింది. అయితే, ఆలోచనా పరులైన పాఠకులు దీన్ని మెచ్చినంతగా సామాన్య పాఠకులు అర్థం చేసుకోలేరని కావ్య శిల్పక్లిష్టతే దీనికి కారణమని విమర్శించిన వారున్నారు. రోణంకి అప్పలస్వామికి అంకితం చేసిన ఈ కావ్యం వెలువడేనాటికి కె.రామలక్ష్మి తో ఆరుద్రకు పరిచయం లేదు. అయితే, ఆమె "ఈ నాటికీ నేను త్వమేవాహమ్ వింత పడుతూనే చదువుతాను. ఇప్పటికీ శ్రీశ్రీ వివరణ తరువాత కూడా నాకు పూర్తిగా అర్థం అయిందని అనుకోను" అని అన్నారామె[28]. ఈ త్వమేవాహమ్ లో చాలా ప్రసిద్ధమైన కవితా ఖండిక:

*"నువ్వు ఎక్కదలచుకొన్న రైలు*
*ఎప్పుడూ ఒక జీవితకాలం లేటు*
*ఏళ్ళూ పూళ్ళూ నిరీక్షించలేక*
*ఎక్కేస్తా వేదో ఒక బండీ"* (త్వమేవాహమ్-1999-23)

త్వమేవాహమ్ లో మార్క్సిస్టు దృక్పథం ప్రధానంగా కన్పిస్తుంది. ఆరుద్ర చేసిన కవిత్వప్రయోగ వాద ధోరణి కూడా దీనిలో కన్పిస్తుంది.

## 1.5.2. 'సినీవాలి':

ఆరుద్ర 1960 లో ఆవిష్కరించిన ఈ కావ్యం, సినీనటుడు జగ్గయ్యకు అంకితమిచ్చారు. సినీవాలి అంటే అమావాస్యనాడు కన్పించే వెన్నెల. ఈ విషయం ఆరుద్ర ఒక పద్యంలో చెప్పుకొన్నారు.

అసలు ఆరుద్ర సినీవాలి కావ్యం రాయకుండానే కేంద్రసాహిత్య అకాడమీ వారి 'కావ్యమాల' కవితా సంకలనంలో కాటూరి వెంకటేశ్వరరావు ఆరుద్రను పరిచయం చేస్తూ 'సినీవాలి' అనే కావ్యం ఆరుద్ర రాసినట్లు పేర్కొన్నారు. దాన్ని తరువాత ఆరుద్ర నిజం చేశారు.

ఈ సినీవాలిలో సాహిత్యో పనిషత్ పేరుతో శ్రీశ్రీ, వరద, లతో తర్కించిన కావ్య లక్షణాలను చేర్చారు.

*వీటిలో శ్రీశ్రీ అభిప్రాయాలుగా..........*

*"చూశావా ఆరుద్రా ఒక తమాషా*
*సంప్రదాయం నిలిచే ఉంటుంది హమేషా*
*మూఢాచారాలు మారుతూ ఉంటాయి నిజం*
*కానీ, సంప్రదాయం తాత ముత్తాతల నాటి ధనం*
*జాతికి జీవన నాళిక*
*జానపద గీతిక"* – (సినివాలి – **1990 : 20**)

*"నిన్నటి మహాకావ్యం పద్దెనిమిది పర్వాలైతే*
*నేటి మహాకావ్యం పద్దెనిమిది పేజీలే"* – (సినీవాలి : **1990–21**)

ఆరుద్ర అభిప్రాయాలుగా ఈ సాహిత్యోపనిషత్తులోనే కొన్ని చాలా ప్రసిద్ధమైనవి కన్పిస్తున్నాయి.

*"కావ్యం ఏదైనా సరే కనీసం ఒక రిక్వైరుమెంటు*
*కావాలి కవిత హృదయానికి నరిష్మెంటు*
*కారాదు ఏనాడు మెదడుకి పనిష్మెంటు'* (సినీవాలి : **1990–22**)

*"మంచిరచన చదివాక బాగాభోంచేసినట్టుండాలి*
*కొంచెం బాధపడాలి చింపుకొన్నట్టుండాలి*
*మనస్సుకి జ్వరం రావాలి ఒళ్ళు తిరగాలి*
*ఈ బాధలోంచే తేరుకొని బాగు పడాలి"* (సినీవాలి : **1990–23**)

'సినీవాలి' కావ్యంలో కథానాయకుడు సూర్యారావు మధ్యతరగతి జీవితానికి ప్రతినిధి. అతని జీవితమంతా నిరాశామయం. ఆమూలాగ్రం నిరాశా వాదం కనిపించినా రాబోయే జీవిత కాలంలో ఈ చీకటి పోయి వెలుగు వస్తుందనేది ఈ కావ్య నామం సూచిస్తుంది.[29] దీనిలో నగర వర్ణన కూడా ప్రముఖంగా కనిపిస్తుంది. తద్వారా యాంత్రిక జీవనాన్ని ఆరుద్ర వివరించారు.

ఈ కావ్యంలో మరికొన్ని ప్రసిద్ధ ఖండికలు

*"కల నిజపరచడం కాదు కవిత్వం*
*నిజాన్ని కలగనడమే దాని తత్త్వం'* (సినీవాలి : **1990–25**)

"జీవితం రేడియో సెట్టుకి
భర్త ఏరియల్ భార్య ఎర్తు" (సినీవాలి : 1990-56)

సినీవాలి కావ్యంలో యాంత్రిక నాగరికత, యాంత్రిక జీవితాలు వీటిని కథా వస్తువులుగా స్వీకరించినపుడు వాటిని వర్ణించడానికి యాంత్రిక నాగరికతలోని వస్తువులనే ఉపమానాలుగా స్వీకరించడం నవ్యత మాత్రమే కాక ఉచితం కూడ. వివిధ అంశాలపై ఇంతకు ముందెవ్వరూ ఊహించని కొత్త అర్థాలు, దర్శించని కొత్త కోణాలు ఈ కావ్యంలో కనిపిస్తాయి. అయితే ఈ కావ్యాన్ని ముగించటంలో ఆరుద్ర చేసిన వర్ణనను కొంతమంది ఇలా వ్యాఖ్యానించారు.

'కాలం తాడు మూడు పేటలు - భూత, వర్తమాన భవిష్యత్కాలాలు. భవిష్యత్తు మీద ఆశ గురించి పిల్లల భవిష్యత్తు గురించి తాను బ్రతకాలనుకొన్నాడు. పిల్లలే అతనికి ఆశాకిరణాలు. అదే సినివాలి ముగింపు. ఆ కారణాలు ఆలోచింపజేసేవి తద్వారా సందేశాలిచ్చేవి. ఆశయాల ఆచరణకు పురికొల్పేయి.[30]

## 1.5.3. కూనలమ్మ పదాలు :

14 కూనలమ్మ పదాలను ఆంధ్రప్రభలో మొట్టమెదటిసారిగా 1960లో ఆరుద్ర ప్రకటించారు. మిత్రులు మరిన్ని రాయమని ప్రోత్సహించడంతో 1963 మార్చి 'జ్యోతి' మాసపత్రిక రెండవ సంచిక నుండి కూనలమ్మ పదాలను విస్తృతంగా రాశారు. 1964 లో పుస్తక రూపంలో ప్రకటించారు. చిన్న,చిన్న పాదాలలో అంత్య ప్రాసలు పాటించి రాసినట్లైతే వీనులవిందుగా ఉంటుందని హృదయపు వీణను మీటుతాయని వీటిని ఆరుద్ర భావించారు. కూనలమ్మ పదాలనేవి ఆరుద్ర కంటే ముందే ఉన్నాయి. నన్నెచోడుడి నాటికే ఈ పదాలు చాలా ప్రచారంలో ఉండేవని ఆరుద్ర భావిస్తున్నారు[31]. 'కూన' అంటే చిన్న అని భావం. వీటని కూన పదాలు అని కూడా అంటారు. ప్రాచీన కూనలమ్మ పదాలు వంటి వాటిని 'విజయరాఘవ కల్యాణము' అనే యక్షగాన కృతికర్త విజయ రాఘవ నాయకుని ఆస్థాన కవి కోనేటి దీక్షిత చంద్రుడు వీటికి పారడీలు రచించినట్లు తెలుస్తుంది[32]. అయితే 'ఓకూనలమ్మ!' అనే మకుటంతో గలఎనిమిది పదాలను వేటూరి ప్రభాకరశాస్త్రి సేకరించారు - 1930 భారతి లో వీటిని వివరించారు. కూనలమ్మ పదాలలో మూడు పాదాలు ఉండి నాలుగోపాదం. ముకుటం "ఓ.కూనలమ్మ"! ఉంటుంది. కూనలమ్మ అనేది గ్రామదేవత అయిఉంటుందని పరిశోధకులు భావిస్తున్నారు[33]. పోతురాజు భార్య అని కృష్ణశ్రీ పేర్కొంటున్నారు. ఈ పోతురాజు పార్వతీదేవికి ఉన్న ఏడుగురు కూతుళ్ళకూ కాపలా కాసేవాడు అని కృష్ణశ్రీ అభిప్రాయం[34]. ఆరుద్ర రాసిన కూనలమ్మ పదాలలో రాజకీయ, సామాజక, నీతి, శృంగారం, వేదాంత, ఆధిక్షేప, హాస, అభినందాత్మకాలుగా వివరించే అవకాశం ఉంది.

కవులగురించి ఆరుద్ర రాసిన కొన్ని కూనలమ్మపదాలు పరిశోధనలో 'కవి' ని వివరించడం కంటే మంచి సృజనాత్మకంగా, చమత్కార పూర్వకంగా వర్ణించడాన్ని తెలుసుకోవచ్చు.

దేవులపల్లి కృష్ణశాస్త్రి గురించి ఇలా వర్ణించారు.

ఆకులో ఆకునైపోతానన్నా, నవ్విపోదురుగాక నాకేటి సిగ్గన్నా, మబ్బుల్లో చంద్రుడితో దోబుచులాడతానన్నా దిగిరాను దిగిరాను దివినుండి భువిఅన్నా, చినుకునై రాలిపోతానన్నా వీటి అన్నింటిలోనూ 'కవిత్వాన్ని' గురించి ఆలోచించకుండా ఉండలేరు. ఈ కూనలమ్మ పదాన్ని బట్టి భావకవిత్వాన్ని ఆరుద్ర సమర్థిస్తున్నట్లు అనుకోనవసరం లేదు. సమగ్ర ఆంధ్ర సాహిత్యంలో దీనిపై విమర్శనాత్మక విశ్లేషణ ఈ విషయాన్ని తెలుపుతుంది.

*"కొంతమందిది నవత*
*కొంతమందిది యువత*
*కృష్ణశాస్త్రిది కవిత*
*ఓ కూనలమ్మ"* (పు.6)

'శ్రీ శ్రీ' గురించి ప్రచారంలో ఉన్న వైయక్తిక విషయాల్ని కూడా చెప్తూనే చమత్కారాన్ని కల్గిస్తారు.

*"రెండు శ్రీల ధరించి*
*రెండు పెగ్గుబిగించి*
*వెలుగు శబ్దివిరించి*
*ఓ కూనలమ్మ"* (పు.6)

'వేమన' తాత్త్వికత గురించి మూడు పదాల్లో వర్ణించినా, పరిశోధనలో మాత్రం భిన్నకోణాల్ని దర్శింపజేశారు. చెరకు రసాన్ని పీల్చేటప్పుడు పిప్పిని పీల్చేకొద్దీ తీపివస్తున్నట్లు ఉంటుంది. వేమనను ఎన్నికోణాలనుండైనా చూడవచ్చుననే చక్కని సృజనాత్మకత దీనిలో ఉంది.

*"చెరకు రసముల ఊట*
*చిన్మయుత్తపు తేట*
*యోగివేమన మాట*
*ఓ కూనలమ్మ"* (పు.11)

"కొడవటి గంటి" గురించి వివరిస్తూ వ్యాసాల్ని రాసినా కథకుడుగా ఉండే విశిష్టతను వర్ణిస్తున్నారు.

*"కసరు తేనెల వంటి*
*కథలు కుత్సుక ఒంటి*
*నింపు కొడవటి గంటి*
*ఓ కూనలమ్మ "* (పు.16)

"**పోతన**" గురించి ఈ భక్తకవి వర్ణించిన పద్యాల్ని స్ఫురింపజేస్తూ తేనెలయేరు అనడం నిత్యపారాయణ గ్రంథం భాగవతంగా మారిందనే భావుకతను వ్యక్తీకరించారు.

"భక్తి తేనెల యేరు
పసిడి కలల బడారం
కలసి పోతన గారు
ఓ కూనలమ్మ" (పు.17)

'విశ్వనాథ సత్యనారాయణ' పేరెత్తి తేనే సంప్రదాయం గుర్తొస్తుంది. వేయిపడగల లో ఆధునికతను వ్యతిరేకించడం ప్రధానంగా కన్పిస్తుంది. విద్యుత్ వల్ల పక్షులు చనిపోతాయనీ చాతుర్వర్ణ్యసిద్ధాంతంలో ధర్మారావు ధర్మనిర్వహణ వంటివన్ని కొత్త అంటే జుగుప్సను కలిగించిన అంశాలు వంటివి. వీటన్నింటినీ మనసులో ఉంచుకొని వర్ణించిన కూనలమ్మపదం!

"కొత్త మీద జుగుప్స
కొలది ప్రాతకు వీప్స
విశ్వనాథకు లిప్స
ఓ కూనలమ్మ" (పు.23)

'నండూరి సుబ్బారావు' గురించి

"ఎంకి పాటలదారి
ఎడద గుర్రపు స్వారి
చేయులేనండూరి
ఓ కూనలమ్మ"(పు.25)

ఇంకా సరదాగా చెప్తున్న కూనలమ్మ పదాలు కొన్ని ఉన్నాయి.

"కొత్త పెండ్లము వండు
గొడ్డు కారము బెండు
తీపియును హుస్సేండు
ఓ కూనలమ్మ" (పు.22")

శ్రీకృష్ణుని గురించి చెప్పిన కూనలమ్మ పదం హాస్యంతోపాటు ఆలోచనకూడా కల్గిస్తుంది. ఈ పదంలో 'లా' లోచి కృష్ణుడు జరిపిన రాయబారాన్ని స్ఫురింపజేస్తుంది. లా లోచి అని శబ్దాన్ని విరిచినట్లయితే, ఒకరిపట్ల ఒక న్యాయం, మరొకరి పట్ల మరొక న్యాయం పాటించారనిపిస్తుంది. ఇదొక చమత్కారం!

"చెలుల చీరలుదోచి
చెల్లి చీరనుగాచి
చేసెనే లాలోచి
ఓ కూనలమ్మ"(పు.18")

సామ్యవాదం అమలు జరిగితే సకల ప్రపంచం సుఖవంతంగా ఉంటుందని చెప్తున్న కూనలమ్మ పదం!

"సామ్యవాద పథమ్ము
సౌమ్యమైన విధమ్ము
సకల సౌఖ్య ప్రదమ్ము
ఓ కూనలమ్మ" (పు.31")

కూనలమ్మ పదాలు చదువుకోవడానికి ఆనందంతో పాటు ఆలోచననూ కూడా రేకెత్తిస్తుంటాయి. సముద్రమంత భావాన్ని నీటిబిందువంత శబ్దాల్లో నిక్షిప్తం చేయడలిగే ఆరుద్ర సృజనాత్మక ప్రతిభను కూనలమ్మ పదాలు తెలుపుతుంటాయి.

## 1.5.4. ఇంటింటి పజ్యాలు:

**1964** లో ఆంధ్రపత్రిక వారపత్రికలో వారం వారం ప్రకటించిన పజ్యాలు మొత్తం **54.** వీటిని 'పద్యాలు' అని పిలవకుండా 'పజ్యాలు' అని నామకరణం చేయడంలో ఆరుద్ర ఔచిత్యం పాటించారని, ఛందోరీతి నికాకుండా వచనంలో రాసిన పద్య భేదాన్ని తెలుపడానికి వీలుగా "పద్యాలు" లో "ద్యా" కు బదులు "జ్యా" ని ప్రయోగించారని ఆధునాతను నిరూపించుకూన్నారని ఆరుద్ర కవిత్వంపై పరిశోధన చేసిన నరసింహారావు అన్నారు[35].

ఆరుద్ర 'ఇంటింటి పజ్యాల' లో హాస్యాన్ని పండించారు. వీటికి ప్రేరణ ఏమిటో ఆరుద్ర చెప్పుకున్నారు.

"అమెరికన్కు విశ్రీయుత ఆర్డన్ నేషు
హాస్య కవిత వ్రాసి చేసుకున్నాడు క్యాషు
అతణ్ణి అనుకరించు ఈ కవిత నిర్దోషు
దీనికి చాలు కొద్దిగా క్యాషు బోలెడు శభాషు"

క్యాషు సంగతి మనకు తెలియదు కానీ, శభాషు బాగానే వచ్చింది[36] మధ్య తరగతి జీవితాల్లోని సుఖదుఃఖాల్ని హాస్యభరితంగా ఈ ఇంటింటి పజ్యాల్లో ఆరుద్ర చక్కగా వర్ణించారు.

భార్యా భర్తల మధ్య అనేక సందర్భాల్లో హాస్య సంఘటనలు చోటుచేసుకొంటూంటాయి. వాటిలో ఒకదాన్ని వర్ణిస్తూ -

"పెళ్ళాంతో సినిమాకి
వెళ్ళడం బహుత్కుషీమాకీ
(ఎందుకొచ్చింది తురకం
ఇదోచిన్న సైజు కఠిన నరకం)
చెప్పుల్లో కాళ్ళుపెట్టుకుని వెంటనే తీసేస్తుంది
పాలగిన్నె మూతపెట్టకపోతే గండుపిల్లి తోసేస్తుంది.

వీధి గుమ్మం దగ్గరకొచ్చి మళ్ళీ లోపలకు వెళ్తుంది
పెరటి తలుపులకు వేసిన గడియలో కొంచెం వెళ్తుంది
మనం గబగబానడిస్తే క్రోప్పడుతుంది
గజానికి అరగంట టైమ్ పడుతుంది
ఆరు గంటలాటకే అసలు బయల్దేరతాం
ఆతరువాత షోకే తేల్తాం
ఇంతకే ఏం మరచి పోయామో మీకేం తెల్సు
ఇనప్బీరువాలో ఆవిడ దాచిన మనీ పర్సు"

ఇంటింటి పజ్యాల గురించి రామమోహనరాయ్ వ్యాఖ్యానిస్తు సంప్రదాయ వాదుల గుండెల్లో రైళ్ళు పరుగెత్తించి భాషలో కొత్త చమక్కులకు చోటుకల్పించారన్నారు[37].

## 1.5.5. అమెరికా ఇంటింటి పజ్యాలు:

బతికి ఉండగా రాసినప్పటికీ, ఆరుద్ర చనిపోయిన మూడేళ్ళ తర్వాతైనా వీటిని కె.రామలక్ష్మి ప్రచురించారు. కె.రామలక్ష్మి వ్యాఖ్యానించినట్లు ఈ పజ్యాలలో సగం అందం-బాపు బొమ్మలే! ఈ గ్రంథాన్ని అమెరికాలో వైద్యవృత్తి చేస్తూ, ఆరుద్రకి పెర్సనల్ పిజీషియన్ గా కొంతకాలం పరిచయం ఉన్న డాక్టర్ అల్లూరి ఎస్. రెడ్డికి అంకితం చేశారు. ఈ గ్రంథంలో 39 పజ్యాలు ఉన్నాయి. అమెరికాలో ఉన్న వారి జీవన స్థితిగతుల్ని హాస్యస్ఫోరకంగా వివరించారు. అంతేకాక అమెరికాలో గల తెలుగువాళ్ళ పరిస్థితిని కళ్ళకుకట్టేట్లు చక్కగా వర్ణించారు. అమెరికాలో తెలుగువాళ్ళు మాట్లాడే భాష ఎలా ఉంటుందో వివరిస్తూ "అయ్యోటిక్కెట్టేచ్చాడంటే" ట్రాఫిక్ పోలీసు పట్టుకొని కోర్టుకు సమన్సు ఇచ్చాడనీ, "డిష్‌లు చెయ్యడం" అంటే "కడగడం అంట్ల గిన్నెలు" అనీ వివరించి,

"అమెరికాంధ్రానికి గ్రామరుడిక్షనేరి
ఏ 'చేరా' అయినా రాస్తాడా ఏరికోరి ?
విదేశాల్లో స్థిరపడ్డ వాళ్ళ భాష
స్వదేశీయులు వింటున్నప్పుడు తమాషా" అని ఇతి భావ : ఇత్యర్థ : అనే 'పజ్యాన్ని' ముగించారు[38].

అమెరికాలో ఉండే బిజీ జీవితాన్ని వివరించే 'అభ్యాసము కూసువిద్య' పజ్యంలో :

'అమెరికాలో కాపురాని కొచ్చిన ప్రతియువతీ
అరణ్య వాసంలో సీతమ్మతో సమానురాలు
పంచవటిలో కనీసం పనులు చేయడానికుంటాడు సౌమిత్రి
ఇక్కడ తనకు తానే కూలీ, తనకుతానే మేస్త్రీ
చాలా పొద్దున్నే భర్త వెళ్ళిపోతాడు ఉద్యోగానికి
రోజిల్లా ఆమె గురి అవుతుంది ఒంటరితనానికి
నిజం చెప్పాలంటే ఆమె సజీవ కుక్-బుక్" (పు.7-8)

అమెరికా జీవితంలోని యాంత్రికతను హాస్య భరితంగా చూపడంలో ఆరుద్ర కృతకృత్యులైన పజ్యాల గ్రంథంగా దీన్ని చెప్పుకోవచ్చు.

## 1.5.6 ఆరుద్ర కవితాసంకలనాలు :

"గాయాలు-గేయాలు" **1957** లో ప్రచురించిన కవితల, గేయాల సంకలనం ప్రచురించారు.

అలాగే 'పైలా పచ్చీసు' పేరుతో **1967** లో వెలువరించిన కవితా సంకలనానికి ఒక ప్రత్యేకత ఉంది. **1942-1967** వరకూ రాసిన కొన్ని కవితల్ని, తన కవితా వ్యాసంగ కాలాన్ని 25 సంవత్సరాల్ని తెలిపేటట్లు **25** ఖండికల్ని ప్రచురించారు. బెజవాడ గోపాలరెడ్డికి 'అంకితం' చేసిన ఈ సంకలనం ఆంగ్లకవి డిలాన్ థామస్ First Twenty Five పేరుతో ప్రచురించుకొన్నట్లే ఆరుద్ర కూడా, ఆ కవిపై గల మక్కువతో ప్రచురించారు[39]. **1965** లో **25** కవితలతో ఎంచిన పద్యాలు పేరుతో ఒక సంకలనం ప్రచురించి ఖాసా సుబ్బారావుకి అంకితమిచ్చారు.

నారాయణ బాబుకి స్మృతికి అంకితం చేస్తూ, ఆరుద్ర కవితల్లో తనకి నచ్చిన వాటిని ఆరుద్ర సహచరి కె.రామలక్ష్మి **1979** లో "ఏటికేదాది"ప్రచురించారు. ఈ కవితలేకాకుండా విడిగా కూడా కొన్ని కవితలు వివిధ పత్రికలలో ఆరుద్ర జీవించినంతవరకూ రాశారు. శ్రీశ్రీతో కలిసి 'రుక్కుటేశ్వర శతకం' శ్రీశ్రీ అబ్బూరి వరద రాజేశ్వరావుతో కలిసి "సాహిత్యోపనిషత్" "మేమే" రచించారు. ఇది ఆరుద్ర కొనసాగించిన జంట కవిత్వంగా చెప్పవచ్చు. "శుద్ధ మాద్యాక్కరలు" పేరుతో కూడా కవిత్వాన్ని రాశారు.

ఆరుద్ర రచించిన కవిత్వంలో అభ్యుదయ భావాల్ని, ప్రయోగవాదాన్ని, నవ్యధోరణుల్ని, భాషా చమత్కారాల్ని సి.నారయణ రెడ్డి, ఎల్.సంగయ్య, ఆర్. నరసింహారావులు తమ పరిశోధన గ్రంథాల్లో సమగ్రంగా పరిశీలించారు. వీరితోపాటు రామమోహనరాయ్ వంటి విమర్శకులు కూడా సమీక్షించారు.

ఆరుద్ర కవిత్వంలో దేశభక్తి, సంప్రదాయం, అభ్యుదయభావాలు, ప్రయోగవాద ధోరణులు కన్పిస్తున్నట్లు సంగయ్య నిరూపించారు.

'ఆరుద్ర ప్రగతి వాద ప్రధాన కవిత రచించాడా? ప్రయోగవాద కవిత రచించాడా అని ప్రశ్నిస్తే నూతన ప్రయోగాలతో ప్రగతి కవిత్వం రచించాడని చెప్పాలి. తెలుగు సాహిత్యంలో నూతన ప్రయోగాలు చేసిన వారిలో ఆద్యుడు ఆరుద్ర కాకపోవచ్చు. కాని , ప్రయోగవాదం గురించి చర్చించేటప్పుడు ప్రముఖంగా చెప్పవలసినవాడు ఆరుద్రే' అని నరసింహారావు వివరించారు[40]. ఆరుద్ర కవిత్వాన్ని అవగాహన చేసుకోవడానికి పాఠకుడు హృదయాన్ని బుద్ధినీ ఉపయోగించినా, హృదయానికే ఆహ్లాదం కల్గిస్తుంది.

## 1.5.7 మనిషి-ఆడమనిషి(ఆధునిక మహాకావ్యం) :

ఆరుద్ర (బతికుండగా)రచిస్తున్న ఈ కావ్యంలో గల కొన్ని భాగాల్ని ఇండియాటుడే-**1995** (వార్షిక సాహిత్య సంచిక లో ప్రచురించారు[41]. ఈ కావ్యంలో గల కొంత భాగాల్ని 'స్త్రీ పురాణం'

పేరుతో చూడవచ్చు. హిందూ, క్రైస్తవ గ్రంథాలలో గల ఇతివృత్తాల్ని ఆధారంగ చేసుకొని స్త్రీ పురుషుల మధ్య గల వ్యత్యాసాల్ని వివరిస్తూనే, ; స్త్రీ ఔన్నత్యాన్ని వర్ణించారు. హిందుపురాణాల ప్రకారం తొలి ఏకకణం 'ఆదిశక్తి' గా చెప్తూంటారు. ఆదిశక్తి నుండే త్రిమూర్తులు ఉద్భవించినట్లు ప్రచారంలో ఉంది. దీన్ని ఆరుద్ర....

*"జీవినవుదామని సంకల్పించుకున్న ప్రథమక్షణాన్ని*
*వేవిధాల విభజించుకుంటున్న తొలి ఏకకణాన్ని*
*సనాతన జలచారాన్ని, పురాతన ఉభయచరాన్ని*
*ప్రాచీన ఖేచరాన్ని మొట్టమొదటి భూచరాన్ని*
*ఆదిమ స్తన్యజీవిని..."* అని వర్ణించారు.

ఋగ్వేదంలో యమీ, యమ లు సోదరీ సోదరులైనప్పటికీ వీరిద్దరి మధ్య గల శారీరక సంబంధాల గురించి ఇరువురి మధ్యా దీర్ఘమైన సంభాషణను వర్ణించారు. ఈ సందర్భంలో బ్రహ్మ, శివుడు, వంటివారు సాగించిన స్త్రీమోహచర్యల్ని వివరించారు.

బైబిల్ కథనాన్ని అనుసరించి ఆదాము, అవ్వల జీవితాన్ని కూడా ఆరుద్ర వర్ణించారు. జ్ఞాన ఫలాన్ని దేవుడు తినవద్దంటే వాళ్ళుతినడం, దేవుడు శపించడం వంటి వాటిని కూడా వర్ణించారు. ఆపండు తిన్న తర్వాత...

*"మొలకింద భాగాలు తిలకించలజ్జ*
*బులుపులకు చీకట్ల పొదరింట సెజ్జ*
*నాటినుండీ నీదు చోటు లేదాయె*
*దీటు రావాయె నాపాటి కావాయె*
*ఆనాటి నుండియు అబలవే నీవు*
*నానాటికీ నువ్వునాదాసిగా ఉండు"* (పు.142)

అని మగవాడు (ఆదాము) ఆడదాని (అవ్వ) పై పెత్తనం చెలాయించాడని వర్ణించారు.

"కార్యేషు" దాసీ.... శ్లోకభావాన్ని కూడా కవిత్వీకరించడం కన్పిస్తుంది (పు.147) అయితే కావ్యం పూర్తి అయితే ఏమి తేల్చేవారో తెలిసే అవకాశం ఉండేది. అయినా కాటమరాజు కథ (స్టేజి నాటకం) లో ఖడ్గతిక్కన భార్య చానమ్మ "సహగమనం" చేసినట్లు వర్ణించడానికిష్టపడని ఆరుద్ర, స్త్రీ చైతన్యాన్ని కోరుకొనేటట్లే దీనిలోనూ రాయడానికి ప్రయత్నించి ఉండేవారేమో అని ఆశించవచ్చు!.

## 1.5.8. సినీ గీతాలు :

'కొండగాలి తిరిగింది' పేరుతో ఆరుద్ర రాసిన సినీ గేయాలు తొలిసారిగా 1975 లో వెలువడ్డాయి. అయితే ఇటీవల కె.రామలక్ష్మి స్త్రీ శక్తి ప్రచురణల పేరుతో ఆరుద్ర సినీ గీతాల్ని ప్రచురించారు.

'ఉయ్యాల జంపాల' సినిమాలో 'కొండగాలి తిరిగింది గుండె ఊసులాడింది' పాటలోని పదాన్ని ఈ సినీగీతాల సంపుటికి పేరు పెట్టిన ట్లు తెలుస్తుంది. సుమారు మూడువేల పాటలు రాసిన ఆరుద్ర సినీగీతాల్లో ఎన్నో ఆణిముత్యాలు వంటివి ఉన్నాయి. 'ఎదగడానికెందుకు రా తొందర, ఎదర బ్రతుకంతా చిందర వందర' (అందాలరాముడు), 'నీయాశ అడియాశ చేజారే మణిపూస' (ఎం. ఎల్. ఏ) 'వేదంలా ఘోషించే గోదావరి' (ఆంధ్రకేసరి) వంటి గీతాలెన్నో ఉన్నాయి.సినీ గీతాలతోపాటు అనేక సినిమాలకు స్క్రిప్టుల్నీ రాశారు.

## 1.5.9. కథలు–నవలలు :

'నేను చెప్పానుగా' (1958); 'ఆరుద్ర కథలు' (1968) పేర్లతో ఆరుద్ర కథలు వెలువడ్డాయి. బతుకు తెరువుకోసమే మొదట్లో సినీ కంపెనీలో 'స్టోరీ డిపార్ట్ మెంటు' లో ఉద్యోగిగా చేరినా, అనేక కథల్ని చదవడానికి అవకాశం కలిగింది. సినిమాలకు కథలు, స్క్రిప్టు రచయితగా ఆరుద్ర 'భీష్మ', (1962) పాండవ వనవాసం (1960) చిత్రాలకు పరోక్షంగానూ, బాలభారతం (1972), యశోదకృష్ణ (1974) చిత్రాలకు ప్రత్యక్షంగా కథనం అందించారు[42].

ఆరుద్ర రాసిన మొదటి కథ 'మచ్చుబియ్యం' దీన్ని చాసో ప్రభావంతో రాశారు. ఇది 'వందేమాతరం' అనే పత్రికలో వచ్చింది. ఈ కథలో జీవన విశ్లేషణ లేదని ఆరుద్రే కొట్టిపారేశారు[43].

ఆరుద్ర కథల్లో పీడితులు, శ్రామికులు, మధ్యతరగతి జనం మనస్తత్వం జీవితం వాస్తవికతతో ఒప్పుతాయి[44]. ఆరుద్ర కథల్లో 'ఉష్ణమొస్తే బావుణ్ణు' కథ మనసుని పిండే కథ. తన అన్నయ్యకి జ్వరం వచ్చినపుడు కటుంబమంతా అతడిపై చూపిన శ్రద్ధాసక్తులు, తనకీ లభించాలంటే తనకీ జ్వరమొస్తే బాగుణ్ణనుకున్నా, చివరికి జ్వరం వల్ల తన అన్నయ్య చనిపోవడంతో, ఇంకెవరికీ జ్వరం రాకూడదని ఆపిల్లవాడు కోరుకొనే కథ. ఎన్నో వైవిధ్యభరితకథల్ని ఆరుద్ర రచించారు.

1970 ప్రాంతాల్లో కథలతో పాటు డిటెక్టివ్ కథలు, నవలల్ని కూడా ఆరుద్ర రచించారు. పలకల వెండిగ్లాసు, అహింసారౌడీ, పలకల వెండిగ్లాసు, అణాకోబేడస్టాంపు, రెండురెళ్ళు ఆరు, ఆనకట్టమీద ఆత్మహత్య వంటి డిటెక్టివ్ నవలల్ని రాశారు. 'గ్రామాయణం' అనే సాంఘిక నవలనూ, 1968 లో పాలగుమ్మి పద్మరాజు, ఆరుద్ర, మద్దిపట్ల సూరి, కె. రామలక్ష్మి, ప్రఖ్య శ్రీరామమూర్తి, కొడవటి గంటి కుటుంబరావులతో కలిసి 'పల్లె–పట్నం' అనే నవలను రాసినట్లు తెలుస్తుంది.

## 1.5.10 నాటికలు –నాటకాలు :

1951 తర్వాత పన్నెండు దృశ్య నాటికలు, తొమ్మిది శ్రవ్య రూపకాల్ని, 'సాలభంజిక', గ్రంథమహాయుద్ధం, దీర్ఘరాత్రం, తదేవగృహం, విషప్రయోగం, దేవుని ఎదుట, వ్యాయాధికారి, పార్కు బెంచీ, దరఖాస్తు ఫారం, నన్ను గురించే, అక్కయ్యకి ప్రమోషన్, వీటితో పాటు 1973 లో 'రాదారి బంగళా' వంటి నాటకాల్ని రాశారు. 'శ్రీకృష్ణ దేవరాయ' రూపవాణి నాటకం రాశారు.

వీటిలో దృశ్య, శ్రవ్య నాటికలు, నాటకాలు ఉన్నాయి. కాటమరాజు కథ (స్టేజి నాటకం) కూడా ఆరుద్ర రాశారు. 'శకుంతల' పేరుతో నృత్య రూపకం కూడా రాశారు[45]. ఆరుద్ర నాటికలు, నాటికలు నూతన సాంకేతిక పరికరాల్ని ఉపయోగించి ప్రదర్శించినట్లయితే సినిమా చూస్తున్న అనుభూతికి ప్రేక్షకులులోనవుతారు.

## 1.5.11. అనువాద రచనలు :

ఆంగ్లం, తమిళం నుండి తెలుగులోకి కొన్ని రచనల్ని ఆరుద్ర అనువదించారు. వాటిలో The Prison Dairy of Ho chi Minh (వియాత్నం కవి హో-చి-మిన్) ని "ఖైదులో కవితలు" గా అనువదించారు. ప్రజల పక్షం వహించి పోరాడిన నాయకుడు, కవి హోచి మన్ రచించిన 115 వచన గేయాల్లో 32 గేయాల్ని ఆరుద్ర అనువదించారు. వియాత్నం వీరుల పోరాట చరిత్ర, అకుంఠిత దీక్ష ను తెలుసు కోవడానికి హో.చి.మిన్ కావ్యం చాలా ఉపకరిస్తుందని భావించడం వల్ల దీన్ని అనువదించారు. ఇంకా హంగేరియన్ కవి పెటోఫీ కవితల్ని, అమెరికన్ కవి ఇ. ఇ.కమ్మింగ్ కవితల్ని, మలయాళ కవి వల్లుతోలునారాయణమీనన్ రచించిన 'Songs of the peasants' కవితల్ని తెలుగులోకి అనువదించారు[46]. వీటి అన్నింటికంటే ముందే తమిళ కవి తిరువళ్ళు వార్ రచించిన 'తిరుక్కురళ్' గ్రంథాన్ని తెలుగులోకి అనువదించారు. తమిళంలో జయం గొండాన్ వర్ణించిన 'కళింగత్తు పరణి ని' తెలుగులో 'వెన్నెల-వేసవి' పేరుతో అనువదించారు.

వీటిని బట్టి ఆరుద్రకు 'సృజనాత్మక' సాహిత్యంలోనే కాకుండా, అనువాదంలోనూ అనుభవం ఉందనీ, వివిధ భాషలు తెలుసుననీ తెలుస్తుంది. ఏ ప్రక్రియను ఎలా నిర్వహించాలో తెలిసిన సాహిత్యవేత్త అనీ అర్థమవుతుంది. వీటికి తగిన గుర్తింపు కూడా లభించిందనేది వీరికి అందిన పురస్కారాలు తెలుపుతున్నాయి.

## 1.5.12. విమర్శ-పరిశోధన-ఇతర రచనలు :

వందలాదిగా పత్రికల్లో విమర్శ, పరిశోధన వ్యాసాలు రాయడమే కాక, రాముడికి సీత ఏమవుతుంది?వేమన్న వేదం, మన వేమన, మహనీయుల కలం చిత్రాలు, గుడిలో సెక్స్, 'వ్యాస పీఠం', సమగ్ర ఆంధ్ర సాహిత్యం వంటివన్నీ గ్రంథరూపంలో ప్రకటించారు. వీటిపై ప్రస్తుత పరిశోధనలో ప్రత్యేక అధ్యయనం కొనసాగించడం జరుగుతుంది. ఇతర రచనల్లో 'చదరంగం' అంతర్జాతీయ విధానం గురించి అంతర్జాతీయ స్థాయిలో 1981 కి ఉన్న కొన్ని ఎత్తుగడల్ని, చదరంగాన్ని శాస్త్రీయంగా వివరించారు. స్వయంగా 'చదరంగం' లో ప్రావీణ్యం ఉన్న ఆరుద్ర రాసిన ఈ గ్రంథం పలువురి ప్రసంశల్ని పొందింది.

## 1.6. బహుమతులు :

1974 లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పురస్కారం, 1985లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం వారు గౌరవ డి.లిట్, ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు 'కళాప్రపూర్ణ' తెలుగు విశ్వవిద్యాలయం వారి

గౌరవ డాక్టరేట్, తెలుగు విశ్వవిద్యాలయం ఆరుద్ర పరిశోధనకు గాను, తిక్కవరపు రామిరెడ్డి పురస్కారం, పరిశోధనలో కృషి చేసినందుకు **1986** లో ఎల్.వి. రమణయ్య పురస్కారం, "గురజాడ గురు పీఠం" గ్రంథానికి **1987** లో సాహిత్య అకాడమీ పురస్కారం, తెలుగు విశ్వవిద్యాలయం **1988** లో కవిత్వానికి వార్షిక పురస్కారం వంటివి ఎన్నింటినో ఆరుద్ర స్వీకరించారు. ఆరుద్ర జీవితంలో 'సృజనాత్మక సాహిత్యం' విరివిగానే రాసి, ఆ అనుభవాన్ని వినియోగించుకొంటూ, సృజనాత్మకంగా విమర్శ, పరిశోధనలను కొన సాగించడం వల్ల పాఠకుల్ని వీరి శైలి అద్భుతంగా ఆకర్షించింది.

## 1.6.1. ప్రవృత్తిని – వృత్తిగా మార్చుకోవటం:

సాహితీ వాతావరణం ఉన్న కుటుంబం నుండి రావడంతోనే చిన్న నాటి నుండి రచనలు చేయాలనే ఆసక్తి ఆరుద్రలో కలిగింది. బడిలో చదువుతున్నప్పుడే ఓ ముగ్గురు విద్యార్థుల పేర్లను '*రాఘుత్ర యం*' అనే ఏక పేరుతో బడిలో జరిగే అవక తవకలు గురించి వ్యంగ్యాంగా ఓ వ్యాసం రాశారు[47]. తరువాత హైస్కూలు మేగ్‌జైన్ లో '*చిట్టితమ్ముడు*' పేరుతో ఓ గేయన్ని రాశారు[48]. విశాఖపట్టణం నుండి వెలువడే '*యువకళ*' మాసపత్రికలో కథలు,కవితలు రాస్తుండేవారు[49]. **1939**లో '*చిత్రగుప్త*' పత్రికలో వీరి మొట్ట మొదటి కవిత '*నాకలలో*.. ప్రచురితమైంది[50]. అప్పటినుండి ఒక వైపు రాస్తూనే,మరొకవైపు ఉద్యోగ వేట కొనసాగిస్తూనే అనేక రకాలైన ఉద్యోగాలు చేస్తూకూడా, ఖాళీ సమయాల్లో ప్రాచీన తెలుగు సాహిత్యాన్ని చదువుతుండేవారు. ముఖ్యంగా ప్రబంధ సాహిత్యన్ని కంఠస్థం పట్టేవారు. ఆంగ్ల సాహిత్యాన్ని, అందులో వస్తున్న ధోరణులను చాసో, రోణంకి, కొడవటిగంటి వంటి ప్రసిద్ధ సాహితీవేత్తలు సహాయంతో ఎప్పటి కప్పుడు తెలుసుకొంటుండేవారు. కలకత్తా నుండి కవి సోమసుందర్‌కి రాసిన లేఖలో ఆరుద్ర తెలిపిన విషయాలను బట్టి కూడా ఆంగ్ల సాహిత్యాన్ని బాగా చదివేవారని అర్థమవుతుంది. తాను చదవడమే కాకుండా, సమకాలీన సాహితీవేత్తలతో ఉత్తరప్రత్యుత్తరాలు కొనసాగిస్తు, వర్తమాన తెలుగు సాహిత్యస్థితి గతులను ఎక్కడ ఉన్నా, సాహితీ వాతావారణాన్ని తెలిసికొంటుండే వారు.అక్కడితో ఆగిపోకుండా, తాను కూడా రచనలు చేస్తూ, సినిమాలపై సమీక్షలు రాస్తుండేవారు. సమకాలీన రచయితల,కవుల రచనలను సమీక్షిస్తుండేవారు. ఆరచన మరింత ప్రతిభావంతంగా ఉండాలంటే ఎలాంటి కృషి అవసరమో కూడా సూచిస్తుండేవారు. మొత్తంమీద ప్రవృత్తిగా ప్రారంభమైన పుస్తక పఠనం, రచనా వ్యాసంగం, సినిమా (స్క్రిప్టు), డైలాగ్స్, పాటలు రాయటంతో వృత్తిగా మారిపోయిందని చెప్పవచ్చు. అలా సినిమా రచనకోసం ప్రారంభమైన అన్వేషణే పరిశోధన దిశగా పయనించేటట్లు చేసింది.

## 1.6.2. పరిశోధనాభిలాష – ప్రేరణలు:

సినిమాలకు (స్క్రిప్టు) రాస్తుండే రోజుల్లో, ఒక సందర్భంలో ఖడ్గతిక్కనా – కవితిక్కనా ఒకరా? వేర్వేరా? అనే ప్రశ్న ఆరుద్రకు వచ్చినప్పుడు, దాన్ని అన్వేషిస్తూ, పరిశోధన పట్ల గాఢమైన ఆసక్తి పెంచుకున్నట్లు ఆయనే చెప్పుకున్నారు[51]. ఈ సంఘటన **1948**లో జరిగింది. అప్పటికి సాహిత్య చరిత్రతో పరిచయమే లేదని ఆయనే చెప్పుకున్నారు[52]. కవిజీవితాలు, చాటుపద్యాలు, తిక్కనకు

సంబంధించిన గ్రంథాలు చదివారు. వీటిలో ముఖ్యంగా తిక్కనకే అంకితమిచ్చిన కేతన రచించిన '*దశకుమార చరిత్ర*' ను చదవటంతో ఒక ఆధారం దొరికినట్లయ్యింది. దానితో పాటు '*సిద్ధేశ్వర చరిత్ర*' లో తిక్కన, గణపతిదేవచక్రవర్తి దగ్గరకు వెళ్ళి మనుమసిద్ధి రాజ్యాన్ని నిలబెట్టినట్లు ఉన్న కథనాన్ని, తిక్కన మనుమసిద్ధికి అంకితమిచ్చిన '*నిర్వచనోత్తర రామాయణాన్ని*' కూడా వివరంగా చదివారు, వీటితో పాటు జానపద కథల్లో '*కాటమరాజు*' కథల్లో 'ఖడ్గతిక్కన' కు సంబంధించిన గ్రంథాల్నీ పరిశీలించారు.

జానపద సాహిత్యంలో *కాటమరాజు కథ* ప్రసిద్ధమైంది. ఈ కథాచక్రంలోనే నెల్లూరు సిద్ధిరాజులకూ, కాటమరాజుకూ జరిగిన యుద్ధంలో తిక్కన గురించిన ప్రస్తావన ఒకటి వస్తుంది. సిద్ధిరాజుకు మంత్రిగా ఉన్న ఈ తిక్కన, కాటమరాజుతో జరిగిన యుద్ధంలో శక్తిమంతంగా పోరాటం చేసి మరణిస్తాడు. ఇతడినే '*ఖడ్గతిక్కన*' రణతిక్కన లుగా పిలుస్తుంటారు.1953 లో మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయం వారు ప్రచురించిన '*కాటమరాజుకథ*' ద్విపద కావ్యాన్నీ ఈ సందర్భంగా నాలుగైదు సార్లు చదివారాట ఆరుద్ర[53]. లభించిన ఆ ఆధారలతో సంతృప్తి చెందక శ్రీ శ్రీ అభిప్రాయాన్ని అనుసరించి తన అన్వేషణలో కొత్త మార్గాల్ని అనుసరించారు. కేవలం ప్రాథమికాధారాలనే కాకుండా ప్రముఖుల అభిప్రాయాల్ని కూడా పరిగణన లోకి తీసుకోవాలని భావించారు. "*ఖడ్గతిక్కన, కవితిక్కన లిద్దరూ ఒకటేనా? కాదా? అని నేను గతంలో విఖ్యాత చరిత్రకారులు కీ.శే. మల్లంపల్లి సోమశేఖరశర్మ, నడిగినప్పుడు, ఆయన ఏటైనా ఊహించుకోవచ్చునని, దేనికీ నిర్దిష్టమైన ఆధారాలు లేవనీ చెప్పారు*" అని రాసుకున్న శ్రీ శ్రీ అభిప్రాయాన్ని అనుసరించి, మరికొంత పరిశోధన చేశారు[54]. అంతటితో శ్రీ శ్రీ అభిప్రాయాన్ని ఆమోదించేయకుండా, మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయం వారు ప్రచురించిన *కాటమరాజు* కథకు మల్లంపల్లి సోమశేఖరశర్మ ఆంగ్లంలోనూ, తెలుగులోనూ రాసిన పీఠికను పరిశీలించి, ఖడ్గతిక్కన, కవితిక్కనల మధ్యగల సంబంధాలను పరిశోధనాత్మకంగా అంచెనా వేశారు. ***దశకుమార చరిత్ర లో సేవణ దండ యాత్రను*** బట్టి, రణతిక్కన కాలనిర్ణయానికి, మరికొన్ని కైఫియత్తులను, శాసనాలను కూడా పరిశీలించారు. వేటూరి ప్రభాకర శాస్త్రి **1917**లో రెండవ కూర్పుగా ప్రకటించిన *చాటుపద్యమణిమంజరి* లో 'రణతిక్కన నెల్లూరు పురము' అనే శీర్శిక తో ఉన్న పద్యాల్ని, అందులో ప్రభాకరశాస్త్రి "*విరాటపర్వము దొట్టి తుది యుట్టనాంధ్ర మహాభారతమును రచించిన తిక్కన సోమయాజి కితడు పెద్ద తండ్రి కుమారుడు*" అని రణతిక్కన గురించి చెప్పిన అభిప్రాయాన్ని కూడా పరిశీలించారు[55]. ఇవన్నీ పరిశీలించి, శ్రీ శ్రీ ఊహించినట్లు, రణతిక్కన, కవితిక్కన ఒక్కటి కాదనీ, వేర్వేరనీ *దశకుమారక చరిత్ర*ను అనుసరించి తిక్కన వంశ వృక్షాన్ని తయారు చేశారు. సార కవితాభిరాముడు, గుంటూరు విభుడూ అయిన కొట్టరవు భాస్కరమంత్రికి నలుగురు కుమారులు. మూడవ కుమారుడైన సిద్ధనమంత్రికి ఏడుగురు కొడుకులు. వీళ్ళలో పెద్దవాడు ఖడ్గతిక్కన. భాస్కరమంత్రి నాలుగో కుమారుడైన కొమ్మన దండ నాథునికీ ఒక్కడే కుమారుడు. అతడే కవితిక్కన అని ఆరుద్ర నిరూపించి, సాహిత్య పరిశోధనకూడా వర్ధించిన విస్తరికాదన్నారు[56].

కవితిక్కన, ఖడ్గతిక్కన ల గురించి ఆరుద్రకి వచ్చిన ఒక ప్రశ్న ఒక అనుమానం, ఆయన్ని పరిశోధకుడిగా చేయడానికి దోహదపడిందని చెప్పవచ్చు. తనకొచ్చిన అనుమానాన్ని నివృత్తి చేసుకొవాలను కోవాటానికి బయలుదేరిన అభిరుచి, అన్వేషణగా మారి, సంబంధిత విషయాన్ని సేకరించేటట్లు చేసి, వాటన్నింటినీ మళ్ళీ పరిశీలించి, ఫలితాంశాల్ని బహిర్గతం చేసేటట్లు చేసింది. ఈ ప్రేరణే పరిశోధన రంగంలో కృషి చేసేటట్లు వారిని ప్రోత్సహించింది. ఆరుద్ర మాటల్లోనేచూస్తే "*కవితిక్కన సినిమా తీయమని ఒక దర్శక నిర్మాతతో యథాలాపంగా అన్నమాట సమగ్ర ఆంధ్ర సాహిత్య రచనకు నంసిద్ధుణ్ణి చేసింది*" అని తెలుస్తుంది[57]. ఆరుద్ర లో బీజరూపంలో ఉన్న అభిరుచి, కవితిక్కన, ఖడ్గతిక్కన లు ఒకటా? వేర్వేరా? అనే సందేహం మొక్కగా పెరిగి, దానికి సంబంధించిన సామగ్రీ సేకరణ ఎరువుగా పనిచేసి, ఒక ఫలాన్ని ఇవ్వడమే కాకుండా, సమగ్ర ఆంధ్ర సాహిత్యమనే వృక్షాన్ని పెరిగేటట్లు చేయటానికి అవసరమైన పరిశోధనశక్తిని ఆరుద్రలో కలిగేటట్లు చేసిందని చెప్పవచ్చు.

## 1.7. మరణం:

పుట్టిన వాడికి మరణం తప్పదన్నట్లు ఆరుద్ర తెలుగు సాహిత్యానికి విశేషమైనకృషి చేసి **1998** జూన్ **4**వ తేదీన మరణించారు, కానీ, ఆయన రచించిన కవిత్వం, కథలు, పరిశోధన వంటి రచనల్లో చిరకాలం జీవిస్తూనే ఉన్నారు. తన పరిశోధనల్లో ప్రతిపాదిత అంశాల్ని బట్టి ప్రతి పరిశోధకుడితోనూ చర్చల్లో పాల్గొంటూ నే ఉన్నారు!

## 1.8. పరిశోధన పరిధి:

ఆరుద్ర అనేక ప్రక్రియల్లో రచనా వ్యాసంగాన్ని కొనసాగించినా ఈ పరిశోధన లో "పరిశోధన" విషయాలు మాత్రమే వస్తాయి. ఆయన చేసిన ప్రతి పరిశోధనాంశాన్నీ పునః పరిశోధన చేయడమంటే పరిమితమైన పరిశోధన కాలం సరిపోదు. ఆయన చేసిన పరిశోధనల స్వరూప స్వభావాల్ని అధ్యయనం చేసి, ప్రధానంగా పరిశోధనా దృక్పథాన్ని విశ్లేషించడం ఈ పరిశోధన పరిధి. ఈ పరిధిలో ఆరుద్ర రచించిన వ్యాసాలు, గ్రంథాలు ప్రధానంగా పరిశీలన మవుతున్నాయి.

### 1.8.1. పరిశోధన – స్వరూపస్వభావాలు:

ఆరుద్ర పరిశోధనా దృక్పథం తెలుసుకొనే ముందు, స్థూలంగా పరిశోధన గురించి ఒక అవగాహనకు రావడం అవసరం. కనుక, పరిశోధన నిర్వచనం, స్వరూప స్వభావాలు పరిశీలించి, పరిశోధన లక్షణాలతో ఆరుద్ర దృక్పథాన్ని సమన్వయం చేయవలసి ఉంది.

'*పరిశోధన*' స్వరూప స్వభావాలను తెలియజేస్తూ ఆంగ్ల, తెలుగు భాషల్లోనూ చాలా గ్రంథాలు వెలువడ్డాయి. వాటిలో పరిశోధన లక్షణాన్ని విపులంగా చర్చించిన గ్రంథాలు తెలుగులోనూ విరివిగానే వచ్చాయి. గంధం అప్పారావు, కాళిదాసు సూర్యనారాయణల 'పరిశోధన పద్ధతులు' ఆర్వీయస్ సుందరం 'పరిశోధన పద్ధతులు'; ఎస్. జయప్రకాష్ 'పరిశోధన విధానం'; రాచపాలెం చంద్రశేఖర రెడ్డి, హెచ్. ఎస్. బ్రహ్మానందల సాహిత్య పరిశోధన సూత్రాలు'; కుసుమాబాయి 'పరిశోధన సూత్రాలు'

పేర్కొనదగినవి. ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి 'తెలుగులో పరిశోధన' వీటన్నింటి లోనూ ప్రథమంగా గణించదగింది. ఇతర భాషల నుండి తెలుగులోకి అనువాదం పొందిన పరిశోధన మౌలిక సూత్రాలకు సంబంధించిన గ్రంథాలు, కాకతీయ, హైదరాబాదు విశ్వవిద్యాలయాలలో జరిగిన సదస్సుల్లో సమర్పించిన పరిశోధన పత్రాల సంకలనాలు, ఎస్. గోపి, వాసిలి వసంతకుమార్, ననుమాసస్వామిల ఆధ్వర్యంలో ప్రచురితమైన 'తెలుగు పరిశోధన' పత్రిక; తెలుగు అకాడమీ, భారతి వంటి పత్రికలలో పరిశోధనలకు సంబంధించిన ప్రమాణాలు లభిస్తున్నాయి. వాటిలో పేర్కొన్న వివిధ అంశాల్ని సూత్రీకరించి నట్లయితే కొన్ని పరిశోధన లక్షణాలు తెలుస్తున్నాయి. వీటిని తెలుసుకొనే ముందు పరిశోధన శబ్ద చర్చ చేసి, పరిశోధన నిర్వచనాల్ని సంక్షిప్తంగా తెలుసుకొని, లక్షణాలను క్రోడీకరించవచ్చు.

## 1.8.2. పరిశోధన – నిఘంటు అర్థం:

'పరిశోధన' అనేమాటకు నేడు ఆంగ్లంలో గల 'Research' అనే అర్థమే ప్రాచుర్యంలో ఉంది. 'శోధన' 'పరిశోధన' అనే రెండు శబ్దాలూ పూర్వం ఆయుర్వేదాది శాస్త్ర, పారిభాషిక పదాలుగానే భావిస్తున్నారు[58]. 'శబ్దరత్నాకరం' లో 'శోధన' శబ్దానికి శుద్ధి చేయుట, పరిష్కరించుట, వెదుకుట, విష్ఠ అనే అర్థాలిచ్చి, చివరిగా మిక్కిలి శోధించుట అనే అర్థమిస్తుంది. 'శోధించు' క్రియకు 'పరి' ఉపసర్గగా చేరి 'పరిశోధించు' అయ్యింది సూర్యరాయాంధ్ర నిఘంటువులో పరిశోధనము శబ్దానికి పరిశోధము అని ఇచ్చి మిక్కిలి శోధించుట అనే అర్థాన్నిస్తుంది. బ్రౌణ్య నిఘంటువులో 'పరిశోధన' కు Enquiring, పరిశోధించుట - To examine, invistigate, to try, search అనే అర్థాలిచ్చింది. 'search' అనే శబ్దం నేడు వాడుకలో ఉన్న Research కి దగ్గరలో ఉంది. Research కి సంబంధించి ఆంగ్ల నిఘంటువుల్లో అనేక వివరణలు కన్పిస్తున్నాయి[59].

Research అనే పదం, ఫ్రెంచి భాషాపరమైన RECERCHER నుండి పుట్టింది[60]. ఈ పదానికి వెదకటం అని అర్థం Research అనే ఆంగ్ల పదానికి 'పునరన్వేషణ' 'పునః పరిశీలన' వంటి అర్థాలు ఉన్నప్పటికీ, 'పరిశోధన' పదమే స్థిరపడింది.

## 1.8.3. పరిశోధన నిర్వచనం:

'పరిశోధన' అంటే ఏమిటనే విషయంలో పరిశోధకులు భిన్నభిప్రాయాల్ని వ్యక్తీకరించారు. అవి వారి మాటల్లోనే కింది విధంగా తెలుసుకోవచ్చు. జి.వి. సుబ్రహ్మణ్యం తన రచనల్లో పేర్కొన్న కొన్ని నిర్వచనాలు గమనార్హాలు[61].

"A careful critical inquiry or Examination in seeking facts or principles, deligent investigation in order to ascertain some thing"

***Webster's International Dictionary***

"A Critical and Exahaustive investigation or experimentation having as its aim the revision of accepted conclusions in the light of newly discovered facts"

***- The Encyclopeadia of Social Sciences***

***Vol. IX (1930)***

"The more formal, systamatic, intensive process of carrying on the scientific method of analysis"

***- Best, J.W.,Research in Education (1963) p.4.***

"Research is a systamatic attempt to push back the bounds of comprehension and seek beyond the horizons of our knowledge some "truth", some reality shrided in a subtle way and consequantly to keep on extending as also consolidating these horizons withount end"

***- Wilkinson and Bandarkar (1979)***

ఈ నిర్వచనాలను పేర్కొని "విజ్ఞాన పరిధులను విస్తరింప జేసే యత్నంలో నూతన సత్యాలను, సూత్రాలను, సిద్ధాంతాలను కను గొనడానికి, శాస్త్రీయ పద్ధతులతో క్రమబద్ధంగా గాఢతరమైన అన్వేషణ, పరిశీలన చేసే విధానం పరిశోధన " అని జి.వి.సుబ్రహ్మణ్యం నిర్వచించారు[62]. వీరే దీని ఉద్దేశాన్ని వివరిస్తూ "లక్షించిన  ఏ అంశాన్నైనా నిర్ధారించడానికి సోపపత్తికంగా సామగ్రిని సేకరించి వాటిని నిశితంగా పరీక్షించటం, ఒకవేళ ఆ సామాగ్రి ద్వారా పూర్వ ప్రవర్తిత సిద్ధాంతాలను గానీ, సమన్వయాలను గానీ, ఫలితాలను గానీ పునర్ నిర్మించవలసి వచ్చినా, చివరకు ఒక వినూత్నాంశాన్ని ప్రతిపాదించ వలసి వచ్చినా సత్యాన్వేషణ దృష్టితో, సమన్వయ దృక్పథంతో నిర్మాణాత్మక వైఖరితో, వాస్తవాన్ని వ్యక్తీకరించాలన్న దీక్షతో పరిశోధన లక్ష్యమైన వికాసాన్ని సాధించటమే పరిశోధన" అన్నారు[63].

ఆర్వీయస్. సుందరం పరిశోధన అంటే ఏమిటో వివరిస్తూ "సత్యా న్వేషణా తత్పరులై తెలియని విషయాల నన్నింటి నీవెదికి, పరిశీలించి, పరిశోధించి అసలు విషయమిది అని చెప్ప బూనడమే పరిశోధన" అని, అంతటితో ఆగకుండా సాధ్యమైనంత వరకు సర్వ విద్వాంస సమ్మతంగా వాస్తవాంశ ప్రతిపాదకంగా, సమగ్రంగా స్వీకృత విషయాన్ని వ్యాఖ్యానం చేయడమే పరిశోధన" అన్నారు[64]. వీరే పరిశోధనను మరింత వివరిస్తూ ఆంగ్లేయ పరిశోధకుల నిర్వచనాల్ని కొన్ని పేర్కొన్నారు.

"Essentially, research is a matter of gathering and evaluating information in order to be able to draw reasonable conclusions" (J.H.Brunvand, Folhlore

***- A study and Research Guide, 1976: p85)***

రాచపాలెం చంద్ర శేఖరరెడ్డి  హెచ్. ఎస్.బ్రహ్మానంద 'సాహిత్య పరిశోధన సూత్రాలు' గ్రంథంలో కొన్ని పరిశోధన నిర్వచనాలిచ్చి,మరికొన్ని ఆంగ్ల నిర్వచనాలకు తెలుగు అనువాదాల్ని చేశారు[65].

"The act of searching (closely or carefully) for or after a specified thing or person"

***- The Oxford Universal Dictionary, 1974.***

(నిర్దిష్టమైన విషయం గురించి కాని, వ్యక్తి కోసం కాని (దగ్గరగా, జాగ్రత్తగా) శోధించడం పరిశోధన)

"Investigation undertaken in order to discover new facts, get additional information etc"

***- The Oxford Advanced learners dictionary (1980)***

(కొత్త సత్యాలను కనుగొనడానికి గాని, మరింత సమాచారాన్ని పొందడానికి గాని చేసే అన్వేషణే పరిశోధన.)

"The manipulation of things, concepts or symbols for the purpose of generalising to extend, correct or verify knowledge, whether that knowledge aids in construction of theory or in the part of an art"

***- Encyclopeadia of social sciences***

(నూతన సిద్ధాంతాన్ని నిర్మించేది లేక కళా సృష్టికి దోహద పడేది అయిన జ్ఞానాన్ని అభివృద్ధి చేసుకోవడానికి, సరిదిద్దు కోవడానికి, నిగ్గ తేల్చుకోవడానికి, సాధారణీ కరించడానికి, దొరికిన అంశాలను భావనలను, సంకేతాలను వినియోగించు కోవడమె పరిశోధన).

"Research is an Indeavour to discover, develop and verify knowledge. It is an intellecutal process that has developed over hundreds of years ever changing in purpose and form always searching for truth'

***- J.Francis.***

(జ్ఞానాన్వేషణకు, జ్ఞానాభివృద్ధికి, జ్ఞాన పరిశీలనకు చేసే ప్రయత్నం పరిశోధన. ఇది నిరంతర సత్యాన్వేషణ చేస్తూ ప్రయోజనంలో రూపంలో మార్పుల కు లోనౌతూ కొన్ని వందల సంవత్సరాల మీద రూపుదిద్దుకున్న బౌద్ధికప్రక్రియ.)

"A method of studying problems where solutions are to be designed partly or wholly from facts'

***- W.S.Manrow.***

(వాస్తవాలనుండి పాక్షికంగానో, సంపూర్ణంగానో పరిష్కారాలనాశించి సమస్యల్ని అధ్యయనం చేసే విధానం పరిశోధన).

" Research is simply a systematic refined technique of thinking, employing speciaiised tools, instruments and procedures in order to obtain in more adequate solutions of a problem than would be possible under ordinary means. It starts with a problem, collects data or facts, analyses them critically and reaches

decisions based on the actual evidence it involves original work instead of more exercise of personal opinion. It involves from a genuine desire to know rather than a desire to prove some thing. It is quantitative seeking to know not only what but how much measurement is therefore a central feature of it"

*- C.C.Crowford.*

(ఒక సమస్యకు ఓ మాదిరి పరిష్కారం కన్నా, ప్రత్యేక పరికరాలు, సాధనాలు, పద్ధతులను ఉపయోగించుకొని మరింత సమగ్రమైన పరిష్కారాన్ని కనుగొనే వ్యవస్థీకృత ఆలోచనా పద్ధతి పరిశోధన. ఇది ఒక సమస్యతో మొదలై విషయాలను సేకరించి, వాటిని విమర్శనాత్మకంగా విశ్లేషించి, వాస్తవాల మీద ఆధారపడిన నిర్ణయాలను ఉపయోగించు కోవడం కన్నా మౌలిక మైన శ్రమ అవసరమవుతుంది. ఇది దేనినో నిరూపించాలనే కోరిక కన్నా, తెలుసుకోవాలనే ఆసక్తి నుంచి పుట్టు కొస్తుంది. ఇలా పరిశోధకుల కొన్ని నిర్వచనాలను పేర్కొని తమదైన అభిప్రాయాల్ని కొన్ని వ్యక్తీకరించారు.

పైన పేర్కొన్న నిర్వచనాలలోని అంశాల్ని సూత్రీకరించి నట్లయితే, కిందివాటిని పరిశోధన లక్షణాలుగా చెప్పుకోవచ్చు.

## 1.8.4. పరిశోధన లక్షణాలు:

పరిశోధనకు శాస్త్రీయ పద్ధతిలో సామగ్రి సేకరణ చేయాలి. కొన్ని సందర్భాల్లో విషయ సేకరణ కూడా పరిశోధన కావచ్చు. తాళపత్రాల, తామ్ర, శిలా శాసనాలు వంటి వాటిని సేకరించడం పరిశోధన అవుతుంది. క్రమపద్ధతి లేదా ఒక ప్రణాళికా బద్ధంగా పరిశోధన కొనసాగాలి. పరిశోధన చేసేవాడిని 'పరిశోధకుడు' అంటారు. ఈ పరిశోధకుడికి శిక్షణ అవసరం. గాఢతరమైన అన్వేషణ చేయాలి. పరిశోధన పరిధిని నిర్దేశించుకోవాలి. ప్రమాణాలపై ఆధారపడి నిర్ణయాలు చేయాలి. రాగద్వేషాలకు అతీతంగా ఉండాలి. సత్యప్రకటన చేయాలి. భాషలో, భావజాలంలో, ఆచార వ్యవహారాలలో సమకాలీనతను గుర్తించాలి. ఉటంకింపులను చూపించడంలో విశ్వసనీయతను పాటించాలి. ఆధార సహితంగా సాధారణీ కరించడానికి ప్రయత్నించాలి. ఫలితాంశాల ద్వారా పూర్వ సిద్ధాంతాల్ని అన్వయించడం లేదా తిరస్కరించడం, నూతన సిద్ధాంతాల్ని ప్రతిపాదించడం, నిరూపించడం జరగాలి. పరిశోధన ప్రయోజన సహితంగా నిర్వహించాలి. తర్కసహితంగా, కార్య కారణ సంబంధంతో ఉండాలి. స్పష్టత, సంక్షిప్తత, సూటిదనం ఉండాలి. గుణాత్మకంగా, వికాస వంతంగా, సమగ్రంగా ఉండాలి. పరిశోధనా సమస్యకు పరిష్కారాన్ని గానీ, సమనాన్ని పాటించాలి. పరిశోధన ప్రణాళికలో లోపాలు కన్పిస్తే నిజాయితీగా అంగీకరించి సవరించుకోవాలి. నిర్మాణాత్మక దృష్టి ప్రదర్శించాలి. పాండిత్యం లేదా వ్యుత్పన్నత పరిశోధనకు ఉపయోగపడాలి. పరిశోధన అంశాన్ని సూక్ష్మంగా వర్గీకరించ డమే కాకుండా సత్యప్రకటనతో సమన్వయం చేయాలి. పరిశోధనకు ఉండే లక్ష్య నిర్దేశాన్ని ప్రకటించాలి. అవసరమైతే భవిష్యత్ పరిశోధనకు మార్గాల్ని సూచించాలి.

## 1.8.5. పరిశోధన–సమీక్ష–విమర్శ:

పరిశోధన నిర్వచనాలు, లక్షణాలను పరిశీలించిన తర్వాత, సమీక్షకూ, విమర్శకు, పరిశోధనతో ఉండే సంబంధాన్ని అవగాహన చేసుకోవడం అవసరం. వాటిని సంక్షిప్తంగా కింది విధంగా తెలుసుకోవచ్చు.

'సమీక్ష' అంటే సమ్యక్ ఈక్ష సమీక్ష అనేది సంప్రదాయంగా వస్తున్న ఆలోచన. ఆంగ్లంలోని "Review"ని 'సమీక్ష' గా చాలమంది భావిస్తున్నారు. రచనలో రచయిత వర్ణించే వివిధ అంశాల సమన్వయాన్ని సహృదయ బుద్ధితో వివరించడమే సమీక్ష[66]

"రచనలో ఉన్న దృక్పథాన్ని, సమీక్షకుడు పాఠకుడికి పరిచయం చేయడంలో గుణదోషస్ఫ్రుహను కల్గించడం" సమీక్ష గా చెప్పుకోవచ్చు. సమీక్షకుడు కావ్యాంగాల్ని సమన్వయం చేస్తూ, రచనలోని సాహిత్య విలువల్ని ప్రతిపాదించడంలో రచయిత కృషిని పరిచయం చేస్తాడు[67]. తాను సమీక్ష చేసే గ్రంథ లోతుపాతుల అవగాహన సమీక్షకుడికి అవసరం. ఈ అవగాహన సమీక్షకుడికి కలగాలంటే సాహిత్యంలో గల వివిధ ప్రక్రియల పరిజ్ఞానం సమీక్షకుడికి ఉండాలి. సమీక్షకుడు, రచనలోని విలువల్ని ఒకే కోణంతో చూసినట్లయితే అది ప్రశంస లేదా అభిశంసనగా మారిపోయి, సమీక్ష లక్షణాల్ని కోల్పోతుంది.

రచన వెలువడిన వెంటనే దాన్ని పరిచయం చేసి పాఠకుణ్ణి జాగృతం చేసేది సమీక్ష అవుతుంది.

'విమర్శ' కాలంతో నిమిత్తం లేకుండా రచనను సమగ్రంగా పరిశీలించి విలువల నిర్ణయం చేస్తుంది. సమీక్ష పరిధి కంటే విమర్శ పరిధి విస్తృతమైంది. విమర్శలో విశ్లేషణ, తులనాత్మకత, వ్యాఖ్యానం, నిర్ణయం వంటి మౌలిక లక్షణాలు ఉంటాయి. విమర్శలో చాలా రకాలు ఉన్నాయి. విమర్శ సృజనాత్మక ప్రతిభ,నిశ్చితమైన అభిప్రాయాల విషయంలోనూ విమర్శ స్వభావంలో వైవిధ్యం కన్పిస్తుంది. కొన్ని విషయాల్లో పరిశోధనకీ, విమర్శకీ అవినాభావ సంబంధం కూడా ఉంటుంది. సత్యప్రకటన విషయంలో విమర్శ, పరిశోధనలో అనుభవ సత్యాల ప్రకటనలో పోలికలూ, భేదాలూ కన్పిస్తుంటాయి. పరిశోధనలో ముఖ్యంగా సాహిత్య పరిశోధనలో దార్శనిక సత్యప్రకటన ఉంటుంది. సాహిత్య పరిశోధనకు విమర్శన లక్షణాల అవగాహన ఉండవలసి ఉంది. ఈ లక్షణాలను అనుసరించే పరిశోధన స్వభావాన్ని నిర్ణయించి, ఏ పరిశోధనగా చెందుతుందో తెలుసుకోనే వీలుందనే విమర్శకులూ కన్పిస్తున్నారు. సమీక్షలో ఒకే అంశంపై దృష్టి కేంద్రీకరించటం, విమర్శలో అనేకాంశాల్ని భిన్న దృక్కోణాలతో ఆత్మీయతాముద్రతో పరిశీలించటం, పరిశోధనలో ఆత్మీయతా ముద్రరహితంగా సత్యాన్వేషణా ఫలితాల ప్రకటనం ప్రధానమనేది సమీక్ష–విమర్శ–పరిశోధనలను బట్టి గమనించవచ్చు. పరిశోధన, సమీక్ష, విమర్శలతో బాటు 'సాహిత్య చరిత్ర' స్వభావాన్ని కూడా కొంతవరకూ పరిశీలించ వలసి ఉంది.

## 1.8.6. పరిశోధన – సాహిత్య చరిత్ర:

సప్రమాణ నిరూపణాత్మకమైన విషయ గ్రథనమే చరిత్ర[68] కవుల కావ్య సంబంధమైన జీవితచరిత్రల్ని కవులచరిత్రలుగానూ, కవుల రచనా సంబంధమైన కావ్యముల చరిత్రను సాహిత్య చరిత్ర గానూ

పరిశోధకులు భావిస్తున్నారు" కవుల చరిత్రలో కవుల కుల, మత, గోత్రాది పుట్టుపూర్వోత్తరాలు ప్రాధాన్యత వహిస్తే, ఈ పుట్టుపూర్వోత్తరాలన్నీ సాహిత్య చారిత్రక, ఉపోద్ఘాతప్రాయాలవంటి వవుతాయి. సాహిత్యాన్ని చారిత్రక సామాజిక, రాజకీయాది కారణాలతో విశ్లేషిస్తూ పరిణామాన్ని తెలియచేస్తే సాహిత్య వికాస చరిత్రగా రూపొందుతుంది. వీటిని రాబోయే అధ్యాయాల్లో విపులంగా పరిశీలించడాన్ని గమనించవచ్చు. ప్రస్తుతం, పరిశోధనకీ సాహిత్య చరిత్రకూ మధ్య గల అవినాభావ సంబంధాన్ని స్పృశించడమే ప్రధానం. కవుల జీవిత చరిత్రల్ని రచనల వివరాల్ని విశ్లేషించడానికైనా, పరిణామాన్ని తెలియజేయడానికైనా సేకరణ అనేది ప్రాథమికంగా జరగవలసి ఉంది. ఈ సేకరణ అనేది పరిశోధనకు చెందింది. కవుల రచనల్లో గల పరిణామాన్ని లేదా వికాసాన్ని గమనించాలన్నా తులనాత్మక వివేచనా శక్తి కావాలి. అది విమర్శ, పరిశోధనల నుండి గ్రహించవలసి ఉంది. ఈ విధంగా 'సాహిత్య చరిత్ర' కీ పరిశోధనకీ అవినాభావ సంబంధం ఉంది. రెండూ వేరు వేరు అంశాలైనా, పరస్పర పరిపోషకాలనేది గమనించవలసి ఉంది.

పరిశోధన, సమీక్ష, విమర్శ, సాహిత్య చరిత్రల మధ్యగల భేదసాదృశ్యాల్ని సంక్షిప్తంగానైనా గమనించడం వల్ల పరిశోధకుడుగా ఆరుద్ర ను ఒక అంచెనా వేయడానికి వీలవుతుంది. ఆయా సందర్భాల్లో పూర్తి వివరణలతో, రాబోయే అధ్యాయాలలో ఈ విషయాలపై దృష్టి కేంద్రీకరించడాన్ని గమనించవచ్చు.

## సూచికలు (References)

1. ఎల్.సంగయ్య, *ఆరుద్ర జీవితం – రచనలు సమగ్ర పరిశీలన*, మాధురీప్రచురణలు: నందిగామ. **1991, పు.12.**

2. అదే:పు.**26.**

"శంకరం, శంకరశాస్త్రి, ఫోటాశాస్త్రి, సిరామూర్తి, జూనియర్ అశ్విని, టింగు రంగారావు, సాంఘేని సావిత్రి, మార్కండేయుడు, వామాక్షి, హరిదాసు" అనే కలం పేర్లు కూడా ఉన్నాయి.

3. అదే:పు.**12.**

4. అదే:పు.**9&419.**

5. అదే:పు.**10.**

6. ఆరుద్ర, *వ్యాసపీఠం*, న్యూస్టూడెంట్స్ బుక్‌సెంటర్: విజయవాడ, **1985** పు.**94-98.**

7. పూర్వోక్తం:పు.**15.**

8. అదే:పు.**16.**

9. కేవియార్ '*కవి పుంగవులు*' (వ్యా) బి. ఎస. ఆర్ కృష్ణ (సం) ఆరుద్ర అభినందన సంచిక – **1985,** ఆరుద్ర షష్టిపూర్తి, ఉత్సవసంఘం, మదరాసు, పు.**57.**

10. అదే:పు.**4.**

11. ఆర్. నరసింహారావు, *అభ్యుదయ కవిత్వంలో ఆరుద్రత*, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్: హైదరాబాద్, **1992,**పు.**3.**

12. కే.వి.యార్ '*కవిపుంగవులు*' (వ్యా) బి. ఎస్. ఆర్. కృష్ణ (సం.) ఆరుద్ర అభినందన సంచిక – **1985** పు.**60.**

13. ఎల్.సంగయ్య, *ఆరుద్ర జీవితం రచనలు సమగ్ర పరిశీలన*, మాధురీప్రచురణలు: నందిగామ, **1991,** పు:**421.**

14. అదే:పు.**18.**

15. ఆరుద్ర '*పోస్టు చేయని ఆరుద్రజాబు*' (వ్యా) ఆరుద్ర అభినందన సంచిక, పు:**153**

16. ఎల్.సంగయ్య. *ఆరుద్ర జీవితం రచనలు, సమగ్ర పరిశీలన*-1991పు.20

17. ఆరుద్ర '*పోస్టు చేయని ఆరుద్రజాబు*'(వ్యా) పు:153,154.

18. అదే,పు:153.

19. ఎల్.సంగయ్య *ఆరుద్ర జీవితం రచనలు, సమగ్ర పరిశీలన*, పు:22

20. ఎల్.సంగయ్య,పు.15

21. ఆర్. నరసింహారావు, పు.2

22. ఎల్.సంగయ్య, పు.15

23. అదే.పు.15

24. అదే.పు.16

25. ఆర్. నరసింహారావు, పు.48

26. అదే.పు.50

27. రామమోహన్ రాయ్, 'ఆరుద్ర ఆనందహేల (వ్యా),ఆరుద్ర అభినందన సంచిక, పు.21.

28. కె.రామలక్ష్మి 'అభిప్రాయం', ఆరుద్ర-త్వమేవాహమ్, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ ప్రచురణ హైదారాబాదు. 1999, పు.8

29. ఆర్.నరసింహారావు, పు.171

30. ఎల్. సంగయ్య, పు.149

31. ఆరుద్ర 'ఇంట్రో' (పీ) కూనలమ్మ పదాలు, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ ప్రచురణ, హైదరాబాదు. 2001, పు.xii

32. అదే.పు.x

33. అదే.పు.x

34. అదే.పు.xi

35. ఆర్. నరసింహారావు, పు.209

36. అదే.పు.207

37. రామమోహన్ రాయ్, 'ఆరుద్ర ఆనందహేల (వ్యా), పు.26.

38. ఆరుద్ర, అమెరికా ఇంటింటి పజ్యాలు, స్త్రీ శక్తి పబ్లికేషన్స్, చెన్నై, ప్రు.ము. డిసెంబరు. 2001, పు.6.

39. ఆర్. నరసింహారావు, పు.285

40. అదే. పు. 221-222

41. ఆరుద్ర స్త్రీపురాణం ( శీ) ఇండియాటుడే వార్షిక సాహిత్య సంచిక-1995, (ప్ర.సం.) అరుణ్‌పూరి, పీవింగ్ మీడియా ఇండియా లిమిటెడ్ ప్రచురణః న్యూఢిల్లీ తరపున మద్రాసులో 1995 లో ముద్రితం.పు.137.

42. ఎల్. సంగయ్య.పు.355-356.

43. అదే. పు. 284.

44. అదే. పు. 286.

45. అదే. పు. 283.

46. అదే. పు. 193.

47. తీగల బుచ్చి వెంకట రమణయ్య (బుచ్చి కొండ),తీగలరామం. '*మా ఆరుద్ర చిన్న నాటి ముచ్చట్లు*' (వ్యా) ఆరుద్ర అభినందన సంచిక పు.94

48. ఎల్.సంగయ్య *ఆరుద్ర జీవితం రచనలు, సమగ్ర పరిశీలన,* పు.13.

49. అదే.పు.13.

50. అదే.పు.15.

51. ఆరుద్ర, *వ్యాస పీఠం '* *ఖడ్గతిక్కనా–కవితిక్కనా*' (వ్యా) పు:99 "అసలు వ్యాపరిశోధనా వ్యాసంగం తిక్కనగారిపై గల గాఢమైన ఆ సక్తితో మొదలైంది"-ఆరుద్ర

52. అదే.పు.99.

53. అదే.పు.100.

54. అదే.పు.102.

55. వే. నారి ప్రభాకర శాస్త్రి (సంక) *చాటుపద్య మణిమంజరి* (రెం.భా) మణిమంజరి ప్రచురణలు. హైదారాబాదు. 1988.పు.13.

56. ఆరుద్ర 'వ్యాస పీఠం' పు.104.

57. ఆరుద్ర 'వ్యాసపీఠం' పు.101.

58. బూదరాజు రాధాకృష్ణ 'తెలుగులో భాషాపరిశోధన, నాడు–నేడు' (వ్యా) తెలుగులో పరిశోధన (సం) దేవులపల్లి రామానుజరావు. ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి ప్రచురణలు: 1983. పు.341.

59. అదే.పు.341.

60. ఎస్.జయప్రకాష్. పరిశోధన విధానం '(Research Methodology)' విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్: హైదారాబాద్. 1992.పు.2.

61. జి.వి.సుబ్రహ్మణ్యం, 'జీవియస్ వ్యాసాలు' శ్రీవాణి ప్రచురణలు: హైదరాబాదు. 1993.పు.2.

62. అదే.పు.2.

63. అదే.పు.2–3.

64. ఆర్వీయస్.సుందరం 'పరిశోధన పద్ధతులు' యువభారతి ప్రచురణ: 1990.పు.4.

65. రాచపాళెం చంద్రశేఖర రెడ్డి, హెచ్. ఎస్. బ్రహ్మానంద, సాహిత్య పరిశోధన సూత్రాలు, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్: హైదరాబాద్, 1997, పు.1.

66. జి.వి.సుబ్రహ్మణ్యం, ఆంధ్ర సాహిత్య విమర్శ–ఆంగ్ల ప్రభావం 1983, పు.

67. అశ్వత్థనారాయణ 'పుస్తక సమీక్ష' (వ్యా) అభ్యుదయ విమర్శ విశేషసంచిక, పు.81.

68. కొర్లపాటి శ్రీరామమూర్తి, తెలుగు సాహిత్య చరిత్ర (ప్ర. భా) రమణశ్రీ ప్రచురణ విశాఖ పట్టణం: 1991, పు.14.

69. అదే.పు.14.

# తెలుగు పరిశోధన : ఆరుద్ర దృక్పథం

## 2.0. 'పరిశోధన' ఆరుద్ర దృక్పథం:

'దృక్పథం' లో 'చూసేవిధానం' ప్రధానం. ఆరుద్ర 'పరిశోధన' 'దృక్పథాన్ని'ను రెండు పార్శ్వాల నుండి పరిశీలించ వలసి ఉంది. ఆరుద్ర దేనిని పరిశోధన, సిద్ధాంతంగా భావిస్తున్నారో తెలిపే పార్శ్వం ఒకటైతే, ఆరుద్ర రచనల్లో వ్యక్తమైన దృక్పథాన్ని పరిశీలించటం మరో పార్శ్వం అవుతుంది.

ఆరుద్ర తన రచనల్లో చాలా సందర్భాల్లో, 'పరిశోధన', 'సిద్ధాంతం' అనే ప్రస్తావన చేశారు. వీటిని అధ్యయనం చేయటం వల్ల ఆరుద్రకు 'పరిశోధన' పట్ల గల దృక్పథం వెల్లడవుతుంది.

"సాహిత్యోపనిషత్"లో 'ఆరుద్ర-శ్రీ శ్రీ'ల కవిత్వ సంభాషణల్లో 'పరిశోధన' గురించిన ఆరుద్ర భావాలు కొన్ని అవగతవవుతున్నాయి. కవిత్వ మంటే ఏమిటో ఆరుద్ర-శ్రీ శ్రీలు సంభాషించు కొంటూ ఆరుద్ర అభిప్రాయంగా 'సిద్ధాంత' చర్చ చేశారు.[1]

> *"కవిత్వం సైన్సు, కారాదు కవిరచన కఠినమైన థీసీస్సు*
> *కావాలి అది ఎడారిలో ఒయాసిస్సు అనుభవాల తేట సరస్సు*
> *అందరికీ ఉపయోగ పడాల్సినదే కవిత్వం*
> *కొందరికి ఊహకందక పోవచ్చు దానిలోని రహస్యం*
> *అప్పుడు సామాన్య మానవుడికి చేయూత*
> *ఇవ్వాలా సహృదయుడైన వ్యాఖ్యాత ?" (సినీవాలి – పు: 15)*

ఈ కవితాఖండిలో "థీసీస్సు" గురించిన ప్రస్తావనలో కవిత్వంలో "థీసిస్సు" ఉంటుందనే అవగాహన కన్పిస్తుంది "కారాదు కవి రచన కఠినమైన థీసీస్సు" అనడంలో సులభమైన "థీసీస్సు" కూడా ఉంటుందనే ఆలోచన కూడా ఉంది, 'కవిత్వం' అందరికీ ఉపయోగపడడానికి దాన్ని వివరించే సహృదయుడైన వ్యాఖ్యాత అవసరం ఉందా? అనే అభిప్రాయాన్ని ధ్వనించేటట్లు, "చేయూతె నివ్వాలా సహృదయుడైన వ్యాఖ్యాత?" అని ప్రశ్నార్థకంతో ముగుస్తుంది. అంటే వ్యాఖ్యాత కూడా లేకుండా సులువుగా కవిత్వం అందరికీ అర్థం కావాలనేది ఆరుద్ర ఆశయం. ఈ కవితా ఖండికలో "థీసీస్సు" కీ "కవిత్వాని" కి పోలిక చెప్తూ తన అభిప్రాయాన్ని తెలిపారు. కనుక, కింది అంశాల్ని దీనినుండి గమనించే వీలు కన్పిస్తుంది.

| కవిత్వం | సిద్ధాంతం |
|---|---|
| i. అందరికీ అందు బాటులోకి ఉండాలి | i. అందరికీ అందు బాటులో ఉండదు. |
| ii. కవిత్వం కొందరికి అవగాహనకాదు | ii. కొందరికే అవగాహన అవుతుంది. |
| iii. అందరూ అర్థం చేసుకోవడానికి వ్యాఖ్యాత సహకరించ వచ్చు. | iii. వ్యాఖ్యాత ప్రస్తావనే లేదు. |
| iv. వ్యాఖ్యానం లేకుండానే కవిత్వం సామాన్యుడికీ అందు బాటులోకి రావాలి. | iv. సామాన్యుడనే ఆలోచనే లేదు. కానీ, సులువైన థీసిస్సులు కూడా ఉండ వచ్చుననే సూచన వల్ల కొన్నింటిని ప్రయత్నిస్తే అర్థం చేసుకోవచ్చు అనే అవగాహన ఉంది. |

ఆరుద్ర అభిప్రాయ పడినట్లు "థీసీస్సు" నిజంగా కఠినంగా ఉంటుందా! అని ఆలోచిస్తే, కవిత్వమంత సులభమై, హృద్యమై, అందరినీ అలరించక పోవచ్చుననేది ఆయన ఆలోచన కావచ్చు.

"థీసీస్సు" అనేది ఆరుద్ర ఏ అర్థంలో ప్రయోగించి ఉంటారనేది కూడా పరిశీలించ వలసి ఉంది.

M.Phil, డిగ్రీలకోసం సమర్పించే Dissertations ని పరిశోధన వ్యాసాలనీ, Ph.D., డిగ్రీలకోసం సమర్పించే Theses ల్ని సిద్ధాంతగ్రంథాలనీ సర్వసామాన్యంగా వ్యవహరిస్తున్నారు[2]. అయితే, M.Phil, లోనూ సైద్ధాంతికపరిశోధనలు ఉండవచ్చు. ఇక్కడ చర్చించేది "THESES" అంటే ఏమిటి ? అనేదిప్రధానం.

"Theses" అంటే 'సిద్ధాంతం'తో కూడింది.

## 2.1. సిద్ధాంతం– సిద్ధాంత గ్రంథం:

జి.వి.సుబ్రహ్మణ్యం ఈ విషయాన్ని వివరిస్తూ "పరిశోధన అన్వేషణ విధాన మైతే, "సిద్ధాంతం" అన్వేషణా ఫలం అని, ఈ రెండూ విలక్షణంగా కనపడుతూనే పరస్పర పోషకాలు గా ఉండి అద్వైత భావంతో వర్తిస్తుంటాయన్నారు.[3]

అన్వేషించిన ప్రతీదీ పరిశోధన కానట్లే, ఆ అన్వేషణకు లభించే ప్రతీ "ఫలం" సిద్ధాంతంగా భావించడానికి వీలు లేదు. కానీ, జి.వి.సుబ్రహ్మణ్యం మరో చోట సిద్ధాంతం గురించి వివరిస్తూ "తార్కిక అనుమానం (హైపోథీసిస్ నుండి సిద్ధాంతం (థీయరీ) వరకూ సాగే సత్యాన్వేషణ యాత్రా చరిత్ర సిద్ధాంత వ్యాసం థీసిస్" అన్నారు.[4]

రాచపాళెంచంద్ర శేఖరరెడ్డి, హెచ్. ఎస్. బ్రహ్మానందలు సిద్ధాంత గ్రంథమంటే ఏమిటో వివరిస్తూ "ఒక అంశాన్ని గురించి లోతుగా పరిశీలించి, దాని మీద కొన్ని నిర్ణయాలు చేసుకొని, ఆనిర్ణయాలను సూత్రాలుగా మలచుకొని, ఆ సూత్రాలను సాధికారికంగా సోదాహరణంగా వివరిస్తూ రాసేద"న్నారు.[5]

'సిద్ధాంతాల' తో కూడింది 'సిద్ధాంత గ్రంథం' "థీసిస్"(Thesis) ని 'సిద్ధాంతం' అని వ్యవహరిస్తున్నారు. ఈ 'సిద్ధాంతం' లో

(i) లోతైన పరిశీలన ఉంటుంది.

(ii) కొన్ని నిర్ణయాల్ని సూత్రాలుగా ప్రకటించడం ఉంటుంది.

(iii) సూత్రాలకు – నిర్ణయాలకు అన్వయం కన్పిస్తుంది.

(iv) వీటికి వాదం కూడా తోడవుతుంది.[6]

ఈ నాలుగు లక్షణాలూ ప్రధానంగా 'సిద్ధాంతం' లో కన్పిస్తుంటాయి. అంటే, నిరూపణకు అవకాశముండే ఒక తార్కిక ఆలోచనా క్రమం 'సిద్ధాంతం' లో కన్పిస్తుంది. కనుక, మేధోగతమైన పరిశ్రమ, శక్తి సామర్థ్యాలపై సిద్ధాంత అవగాహన ఆధారపడి ఉంది.

కవిత్వం హృదయ సంబంది కావటం వల్ల 'సిద్ధాంతం' (థీసిస్) కంటే కవిత్వం అందరికీ అర్థమయ్యేదికావాలని ఆరుద్ర అవగాహనగా ఈ కవితా ఖండికను బట్టి స్పష్టమవుతుంది.

ప్రచారంలో అనేక సిద్ధాంతాలు ఉన్నాయి. వాటిలో ఉదాహరణకి కమ్యూనిజం ఒక సిద్ధాంతం. దాన్ని పూర్తిగా అర్థం చేసుకోవటం అందరికీ సాధ్యం కాదు. కానీ, సిద్ధాంతాల్ని తమలో జీర్ణించు కోవచ్చు, ఆచరించ వచ్చు. దాన్ని వివరించ మంటే అందరికీ సాధ్యం కాదు. ఆ సిద్ధాంతంలో కన్పించే "గతితార్కిక భౌతిక చారిత్ర వాదాలకు సంబంధించి, కమ్యూనిజం అంటే ఏమిటి? వంటి గ్రంథాలు నేటికీ వెలువడుతూనే ఉన్నాయి. కనుక 'సిద్ధాంతం' అనేది కవిత్వమంత హృదయ గతమైన అంశం కాదనేది అరుద్ర అవగాహనగా దీన్ని బట్టి చెప్పకోవచ్చు. పైగా 'కవిత్వం' లో ఏదైనాఅర్థంకానిది ఉంటే అర్థవివరణలకు తప్ప వాదోపవాదాలకు అవకాశం లేని వ్యాఖ్యానం వల్ల సులభగ్రాహ్యం చేసుకొవచ్చుననేది ఆరుద్ర అభిప్రాయంగా భావించే వీలుంది. కానీ, సిద్ధాంతం సామాన్యులకు కూడా అర్థం కావాలనీ, అప్పుడే పరిశోధకుడు విజయవంతమైనట్లు భావించాలనే ఆలోచన కన్పిస్తుంది. ఆరుద్ర 'సిద్ధాంతం' పట్ల స్పష్టమైన అవగాహనతోనే ఈ ప్రయోగం చేసి ఉంటారనేది ఆరుద్ర రాసిన "మార్క్సుకు ముందు విఫలమైన కమ్యూనిజం ప్రయోగాలు[7] వ్యాసాన్ని బట్టి అర్థమవుతుంది.

'శాస్త్రీయ సామ్యవాద మార్గ ప్రతిష్ఠాపనా చార్యుడు. గతితార్కిక, చారిత్రక ఉభయ భౌతిక వాద ప్రవర్తకుడు, మహా మహో పాధ్యాయుడు' గా కారల్ మార్క్సుని అభివర్ణించి, ఫ్రెడరిక ఏంగేల్సుతో కలిసి సామ్యవాదాన్ని శాస్త్రీయ సామ్యవాదంగా తీర్చిదిద్ది ఆచరణ యోగ్యం చేశారని ఆరుద్ర చెప్పారు.[8]

మార్క్స్‌కి ముందూ, మార్క్స్ జీవిత కాలంలోనూ వచ్చిన వివిధ సామ్యవాద సిద్ధాంతాల్ని ఆరుద్ర పరిశీలించారు. ఫ్రాస్వానోయల్ బాబుష్ (1760-77) అనే ఫ్రెంచి విప్లవ వీరుడు మొట్టమొదటి సామ్యవాద ప్రచార నిర్మాత అని ఆరుద్ర అన్నారు. ఆర్థిక, సాంఘిక, రాజకీయ సమానత్వాలు ఒక్క విప్లవం ద్వారానే సాధ్యమని, విప్లవ నియంతృత్వపు నేతృత్వంలోనే విప్లవం సాధ్యమన్నారు గాని, శ్రామిక శక్తుల్ని సంఘటితం చేయాలనే ప్రాథమిక అవసరాన్ని ఫ్రాస్వానోయల్ గుర్తించ లేదని ఆరుద్ర చెప్పారు.

థామస్ స్పెన్స్ (1750-1864) అనే ఆంగ్లేయుడు ఇంగ్లండులో మొదటి సామ్యవాది అనీ, భూమి గ్రామస్థులందరి ఉమ్మడి ఆస్తిగా ఉండాలన్నాడే గాని, సమగ్ర సిద్ధాంతాలు లేవనీ, అవి భూసంస్కరణలకే ప్రాధాన్యతనిస్తాయని ఆరుద్ర థామస్ స్పెన్స్ సిద్ధాంతం లోని లోపాన్ని వెల్లడించారు.

సెంట్ సీమెన్ (1760-1825) శ్రామికుల్ని దోచుకొనే దురంతాల్ని ఖండించి, వర్గపోరాటాన్ని అంగీకరించి, వస్తూత్పత్తి వంటి విషయాల్లో ప్లానింగ్ ఆవశ్యకతను గుర్తించినా, నవ్యక్రైస్తవ వాదాన్ని సిఫార్స్ చేయడం సైద్ధాంతిక లోపంగా ఆరుద్ర గుర్తించారు.

జాన్ హంఫెరీ నోయస్ (1811-1886) ఆచరించి 'బైబిల్ కమ్యూనిజం'గా పేరుపెట్టిన సిద్ధాంతంలో 'వివాహ వ్యవస్థను' విచ్చలవిడిచేయటం నైతిక విలువల పతనానికి దారి తీసే అవకాశం ఉంది. చట్టాల్లో ఉన్న నియమ నిబంధల పేరుతో నోయస్‌ను అరెస్టు చేయడంతో ఆ సిద్ధాంతం విఫలమైందన్నారు.

వీటన్నింటిలో గల లోపాల్ని గమనించి, మార్క్స్ ఏంగెల్స్ రూపొందించిన కమ్యూనిస్టు, సిద్ధాంతాన్ని మానవాళికి మహత్తరమైన సిద్ధాంతంగా ఆరుద్ర విశ్వసించారు.

వీటిని బట్టి సైద్ధాంతిక నేపథ్యాన్ని గుర్తించే ఇక్కడ 'సిద్ధాంతం' అనే ప్రయోగం చేశారని తెలుస్తుంది.

'కవిత్వం - పరిశోధన'ల గురించి ఆరుద్ర 'సాహిత్యోపనిషత్ 'లో శ్రీ శ్రీ మాటలుగా కింది విధంగా వర్ణించారు.

> *"కవిత్వానికి కూడా సైన్సుకివలె*
> *కావాలి రేసెర్చ్ ఎక్స్‌పెరిమెంటూ*
> *కాని దాని పరమార్థం*
> *పలాయనం కాదు ప్రజాక్షేమం*
> *పరిశోధన చీకట్లో చిందులాటకాదు*
> *ప్రగతిశీలం, కాలం, సంఘర్షణ దానిమూలం*
> *పరిణామం దాని నైజం, పరాజయం లేనిది ప్రాణం*
> *పౌరం పర్యం గమనించి*
> *పారస్పర్యం గుర్తించి*

పరిశోధన సాగిస్తే బయలు పడుతుంది రహస్యం
ఈ దారిలో ప్రయాణానికే ఇంకో పేరు కవిత్వం"[9]

పరిశోధన చీకట్లో చిందులాటకాదని- ప్రగతిశీలకాలం, సంఘర్షణ దాని మూలం అనడంలో పరిశోధన సామాజిక ప్రయోజనాన్ని నేరవేర్చేదిగా ఉండాలనే ఆలోచన కన్పిస్తుంది.

"పారం పర్యం గమనించి
పారస్పర్యం గుర్తించి

పరిశోధన సాగిస్తే బయటు పడుతుంది రహస్యం' అని అనడంలో, 'పరిశోధన' గతంలో జరిగిన కృషిని గుర్తిస్తూనే, వర్తమానాన్ని గమనిస్తూ కార్య కారణాల్ని అన్వేషిస్తూ, ప్రగతి శీలమైన మార్పుకి పయనింప చేసేటట్లు కృషి చేయాలనే ఆకాంక్ష కన్పిస్తుంది.

'త్వమేవాహమ్' లో ఆరుద్ర పరిశోధన గురించి వర్ణిస్తూ -----

'కాలం ఒక తేలని ప్రశ్న
కాలం ఒక తీరని తృష్ణ
విరామం లేదు విజ్ఞానానికి
సందేహంతీరదు వేదాంతికి

ఓటమి ఇసుక తిన్నెలలోనే ఓర్పుకొని
జిజ్ఞాస కారు తోలుతాడు మానవుడు
గండాల సుడిగుండాలలోనే ధైర్యంతో
పరిశోధనల స్టీమరు నడుపుతాడు మానవుడు
ప్రాణాలు పెట్రోలుగా పోస్తాడు
కాలానికి ఎదురీదుతాడు.

యోపాం పుష్పంవేద యోపాం వేదం వేద అతడికి
శోధిస్తున్న కాలం శాంతిస్తుంది
శోధిస్తున్న కాలం లొంగుతుంది.

ధార్మిక తరంగాలలో ధనగుణ పక్షాలలో
పరమాణు శస్త్రాలతో పరిశోధన సత్యాలతో
స్పీడును జయిస్తున్నాను స్పేసును సాధిస్తున్నాను.

మేధా శోధన నాళికలో కలాన్ని పోసి
మండుతున్న గుండెలమీద మరగ పెడతాను

*మానవాళికి పనికొచ్చే ఫలితాలకోసం*
*పాటు పడతాను – పాటకడతాను*"[10]

*(త్వమేవా హమ్ ః పు 1999–4)*

దీనిలో కూడా, 'పరిశోధన' అనేది నిరంతర పరిశ్రమతో కూడిందనీ, పరిశోధన సత్యాలను వెల్లడిస్తుందనీ పరిశోధనలో తేలిన ఫలితాలు మానవాళికి ఉపయోగ పడాలనే ఆకాంక్ష కనిపిస్తుంది.

## 2.2. పరిశోధన–పరిశోధకుడు: ఆరుద్ర అభిప్రాయాలు:

'గుడిలో సెక్స్' అనే గ్రంథం పరిశోధన గురించి చెప్తూ ఎంతో పరిశోధన చేశాక, ఎన్నెన్నో సమాధానాలు లభ్యమయ్యాయి. 'పరిశోధన' చేసేవ్యక్తిని 'పరిశోధకుడు' అని పిలుస్తారు. బాధ్యతగల పరిశోధకుడు తను తెలుసుకున్న విషయాలను, తాను సంపాదించిన జ్ఞాన సంపదను జాతి జనులతో పంచుకొంటాడు" అన్నారు[11].

(i) దీనిలో పరిశోధకుడికి గల బాధ్యతల్ని ఆరుద్ర వివరిస్తున్నారు.

"ఈ యాభై సంవత్సరాలలో పరిశోధనలు చాలా విస్తృతంగా జరిగాయి. సోషల్ ఆంత్రోపాలజి, ఇండాలజీ మొదలైన శాస్త్రాల సహాయంతో ఆదిమ సమాజ లక్షణాలను శాస్త్రీయ సామ్యవాద సిద్ధాంతాల వెలుగులో పరిశీలించి ఎన్నో కొత్త విషయాలను గుర్తించి ఒకనాటి సనాతన ధర్మం ఏమిటో అర్థం చేసుకునే స్థితిలో మనమిప్పుడున్నాం. డి.డి.కోశాంబి, రొమెల్లా థాపర్ వంటి మేధావులు మన ప్రాచీన చరిత్రను మార్క్సిస్టు దృక్పథంతో ఎలా అవగాహన చేసుకోవాలో నేర్పారు. ముఖ్యంగా కోశాంబి, పరిశోధనా విధానాలకు నమూనాలా అన్నట్టు స్వీయ రచనలు పాఠ్య గ్రంథాలను చేశారు"[12].

(ii) ఇక్కడ పరిశోధనకు ఇతర శాస్త్రాల సహాయాన్ని ఆరుద్ర గుర్తిస్తున్నారు.

"*విబుధ వరులవల్ల విన్నంత కన్నంత తెలియ వచ్చినంత*
*తేటపరచటం బాధ్యత గల పరిశోధకుని ప్రథమ కర్తవ్యం*' (*గుడిలో సెక్స్–పు.3*)

(iii) దీనిలోనూ పరిశోధకుని బాధ్యతల్ని గుర్తు చేస్తున్నారు.

"రాముడికి సీత ఏమవుతుంది? గ్రంథంలో పరిశోధన గురించిన ఆరుద్ర అభిప్రాయం కింది విధంగా ఉంది[13].

"ఎందరెందరో విద్వద్వరేణ్యుల పరిశోధనా ఫలితాలను, ఉడతాభక్తిగా నా పరిశోధనా ఫలితాలను మేళవించి, వివిధ దేశాల రామాయణ విశేషాలను వ్యాస పరంపరగా పాఠకులకు అందించ దలిచాను. ఇది రామాయణ చరిత్రలో సత్య నిర్ణయానికి దోహదకారికావాలన్న ఒకే ఒక ఆశయంతో చేపట్టిన కార్యం".

(iv) 'పరిశోధన ఆశయం సత్యనిర్ణయం' గా ఆరుద్ర భావిస్తున్నారు. పరిశోధన-సిద్ధాంతల పట్ల ఆరుద్రకు గల అవగాహన ఆయన మాటల్లోనే అవగతమైంది.

## 2.3. తెలుగు పరిశోధన:

'పరిశోధన' అనే పారిభాషిక పదానికి చాలా విస్తృతమైన పరిధి ఉంది. సత్యాన్వేషణే దీని ప్రధానలక్ష్యమనడంలో ఎలాంటి సందేహం లేదు. పరిశోధన పరిణామక్రమాన్ని పరిశీలించినట్లయితే, దీన్ని వివిధ దశలుగా పరిశీలించే అవకాశం ఉంది. ప్రాథమిక స్థాయిలో సేకరణే పరిశోధనగా భావించబడితే, తర్వాత స్థాయిలో వర్గీకరణ, విశ్లేషణ, సిద్ధాంతీకరణ, నూతన సిద్ధాంత స్థాపన, తులనాత్మక అధ్యయనం వంటివన్నీ పరిశోధనలో కన్పించే స్థాయిలను తెలుపుతుంటాయి.

తెలుగులో జరిగిన పరిశోధన గురించి పరిశోధకుల్లో, ఎప్పటినుండి పరిశోధన ప్రారంభమైందీ, పరిశోధకుల్లో మొదటి స్థానంలో నిలచేదెవరు? వంటి విషయాల్లో భిన్నమైన అభిప్రాయాలు వ్యక్తమవుతున్నాయి. ప్రాచీన లక్షణ గ్రంథాలనుండే పరిశోధన ప్రారంభమైందనీ, కాకునూరు అప్పకవి రచించిన 'అప్పకవీయం'లో పరిశోధన లక్షణాలు పుష్కలంగా కనిపిస్తున్నాయనీ కొంత మంది పరిశోధకులు భావిస్తున్నారు.[14] "*అప్పకవీయం (1656) లో అనేక గ్రంథాలనుండి అనేక అంశాల్నీ ఉటంకించాడు. ఉదాహరించాడు. తన అభిప్రాయాలు గల ప్రమాణాలను ప్రదర్శించాడు. పూర్వుల అభిప్రాయాల్నీ స్వీకరించాడు. కొన్నింటిని హేతుబద్ధంగా నిరాకరించాడు. విషయాన్ని శాస్త్రీయంగా విశ్లేషించాడు. వివిధాంశాలను వర్గీకరించాడు. మూల గ్రంథానికి సంబంధించిన మూలాలను తగిన ఆధారాలతో ప్రదర్శించాడు. చర్చలు నిర్వహించాడు. అయితే, ఆయన అభిప్రాయాలు మొదలయిన వాటితో అనంతర లాక్షణికులు గానీ, ఈనాడు మనంగానీ అన్ని సందర్భాల్లోనూ ఏకీభవించ లేకపోవచ్చు. ఎవరియుక్తులు వారికి ఉండవచ్చు. అయినా ఆయన పరిశోధన విధానాన్ని కాదనలేం*" అని సంపత్కుమారాచార్య అభిప్రాయపడ్డారు[15]

భల్లాణ చరిత్ర ను రాసిన పోచిరాజు వీరన (1770-1840) నితెలుగులో 'తొలిసాహిత్య పరిశోధకుడు' గానూ, కావలి వెంకట బొర్రయ్యను 'తొలి చారిత్రక పరిశోధకుడు' గాను నిడదవోలు వెంకట్రావు భావించారు[16] కానీ, అనేక గ్రంథాలను పరిశీలించినందుకు గానూ, కావ్యాలకి ప్రతుల్నిరాపి ఇచ్చిన వాడనే అర్థంలోనే వీటిని ప్రయోగించారు తప్ప, సరైన హేతువుల్ని చూపలేక పోయారు. కనుక, పరిశోధనకు తెలుగులో ప్రాచీన సాహిత్యం వరకూ కొంత కృషిచేసిన వారిగా వీరిని పేర్కొనడం సమంజసంగా ఉంటుందని 'విశ్వవిద్యాలయాల్లో తెలుగు పరిశోధన' కర్త వెలుదండ నిత్యానందరావు భావిస్తున్నారు. తొలి పరిశోధకుడెవరు అనేది ఒక చర్చనీయాంశం. ఈ పరిశోధనలో దీని అవసరం అంతగా లేకపోవడం వల్ల పరిశోధన ఆరంభ వికాసాలను సమీక్షిస్తూ ముందుకు సాగడమే ప్రస్తుత కర్తవ్యం!

## 2.3.1. తెలుగు పరిశోధన – పాశ్చాత్యప్రభావం:

తెలుగులో పరిశోధన పాశ్చాత్య ప్రభావం వలన అభినవంగా రూపొందిందనీ, అంతకుపూర్వం పరిశోధన ఆ పేరుతో లేకపోయినా తెలుగులో ఉందనీ, అయితే, అది లక్షణ గ్రంథ రూపంగా మాత్రమే కనపడుతుందనీ జి.వి.సుబ్రహ్మణ్యం వివరించారు[17], ఆధునిక పరిశోధనకు కొత్తపల్లి వీర భద్రరావు అభిప్రాయం ప్రకారం. '*తెలుగుదేశములో పరిశోధనములకు పునాదులు వేసినవాడు మెకంజీ (1753–1821) తరువాత బ్రౌను దొరయే (1798–1884). వీరిరువురి కృషియేలేకున్న తెలుగు దేశమున పరిశోధన యే లేదన్నచో తరువాతి వారికృషిపై వీరి ప్రభావమెంత గాఢమో స్పష్టమగును*'[18] ఈ సందర్భంలో మెకంజీ, బ్రౌనులతో పాటు, వారిదగ్గర పండితులుగా పనిచేసి, తెలుగు భాషా సాహిత్య పరి శోధనలకు, కృషి చేసిన వారిలో చరిత్ర పరిశోధనకు వాఙ్మయ చరిత్ర సామగ్రిని సేకరించటానికి, దక్షిణ దేశానికి మార్గ దర్శకుడుగా కావలి వెంకటబొర్రయ్య, కావలి వెంకట రామస్వామిలను పేర్కొనవచ్చు. దక్షిణ దేశంలోనే వివిధ భాషల్లో గల కవుల్ని ఒక చోట చేర్చిన ప్రాచీన గ్రంథంగా ప్రసిద్ధిగాంచిన "Biographical sketches of Deccan poets" (1829) గ్రంథం, తెలుగు కవుల, సాహిత్యచరిత్ర నిర్మాణానికి అంకురార్పణ చేసిన గ్రంథంగా చెప్పాలనుకోవటం చారిత్రక సత్యమవుతుంది. ఈ గ్రంథం వెలువడిన కాలాన్ని కొత్తపల్లి వీరభద్రరావు బ్రౌణ్యయుగంగా పిలిచారు[19].

తెలుగు భాషా సాహిత్య చరిత్రలలో 19వ శతాబ్ది పూర్వార్థాన్ని తెలుగు పరిశోధనకు ఉషః కాంతుల్ని ప్రసరించిన కాలంగా పరిశోధకులు తలంచారు[20]. ఈ కాలంలో తెలుగు పరిశోధనను పరిశీలిస్తే, సాహిత్యపరి శోధన కంటే, భాషా పరిశోధనే ప్రధానంగా జరిగిందని తెలుస్తుంది. తాళపత్ర, లిఖిత గ్రంథాల్ని సేకరించడం, స్థల చరిత్రలు, శాసన ప్రతులు వంటి సాధన సామగ్రి సేకరణే ప్రధానం కావటం వల్ల, సేకరణ కూడా పరిశోధనగా పరిగణన పొందింది. దీనికి ఉదాహరణగా కందుకూరి వీరేశలింగం ఎన్నో వ్యయ ప్రయాసలకోర్చి సేకరించిన '*ఆంధ్ర కవుల చరిత్ర*' ను చెప్పుకోవచ్చు[21]. కొత్తపల్లి వీరభద్రరావు విభజన ప్రకారం 19వ శతాబ్ది పూర్వార్థాన్ని "బ్రౌణ్యయుగం" అని పిలిచారు. ఈ యుగ చైతన్యంలో జరిగిన కృషిని జి.వి.సుబ్రహ్మణ్యం కింది విధంగా వివరించారు[22]. *ఈ యుగ పరిశోధకులు భాష, చరిత్ర సంస్కృతులకు, సారస్వతానికి సంబంధించిన సమస్యలకు ప్రాముఖ్యమిచ్చారు. భాషాపరిశోధన ప్రవృత్తి – ఆంధ్ర భాష, సంస్కృత, ప్రాకృత జన్యమా? ద్రావిడ భాషా జన్యమా? అనే సమస్యను ప్రధానంగా ఎన్ను కొన్నది. దానికి గౌణంగా వ్యాకరణాంశాలు, గ్రంథ పరిష్కారాంశాలు, శబ్ద సాధుత్వ చర్చలు, నిఘంటు నిర్మాణం మొదలైనవి తలెత్తాయి*. వీటిలో గిడుగు రామమూర్తి పంతులు, జయంతి రామయ్య పంతులు వంటి పండితులు ఎంతోమంది పాల్గొని తెలుగు సాహిత్యాన్ని మరింత పరిపుష్టం చేసే విధంగా పరిశోధన వైపు చర్చోప చర్చల్ని కొనసాగించ గలిగారు. 19వ శతాబ్ది ఉత్తరార్థంలో కొమర్రాజు వేంకట లక్ష్మణరావు (1877 - 1923) 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వము' రచన ద్వారా "*సక్రమమైన పరిశోధన విధానమును దేశమున నెల కొల్పడం*" వల్ల పాశ్చాత్య పరిశోధన పద్ధతులు తెలుగు

వారికి అవగత మవ్వటంతో పరిశోధన వ్యాస ప్రక్రియ పటిష్ఠంగా రూపొందింది. అంతే కాకుండా, తెలుగు పరిశోధనలో కొమఱ్ఱాజు వారు సృజనాత్మకతను ప్రవేశపెట్టారని, చరిత్ర రచనకు సైతం సాహిత్య గౌరవం కల్పించారని జి.వి. సుబ్రహ్మణ్యం పేర్కొన్నారు[23]. ఈ విధంగా ప్రారంభమైన తెలుగు పరిశోధన, సామగ్రి సేకరణ, గ్రంథ రచన, పరిష్కరణ, సత్యాన్వేషణ లక్ష్యాలుగా మారింది.

స్వరూప స్వభావాల్లో కూడా పరిశోధన విస్తృతమైన పరిధిని పొందింది. శాస్త్ర పరిశోధ వ భౌతిక సత్యాన్ని నిరూ పించడానికే ప్రాధాన్యతనిస్తుంటే, కళాపరిశోధన దార్శనిక సత్యానికీ ప్రాధాన్యత నిస్తుంది. రెండింటిలోనూ శాస్త్రీయ పద్ధతి ఉంటుంది. వీటినే "Method of deduction, Method of induction" వంటి పేర్లతో పిలుస్తున్నారు. భావించే ఫలితాలను బట్టి ఈ విభజన చేయడం ప్రధానంగా కన్పిస్తుంది[24].

## 2.3.2. పరిశోధనలో దృక్పథం:

పరిశోధనలలో శాస్త్ర, కళాపరిశోధన విభాగాల్ని చూసినపుడు శాస్త్ర పరిశోధన భౌతిక సత్యానికీ, కళాపరిశోధన దార్శనిక సత్యానికీ ప్రాధాన్యతనిస్తుందన్నప్పుడు, కళాపరిశోధనలో వివిధ విభాగాల్ని చేసుకొనే వీలు కలుగుతుంది. దీనిలోనే సాహిత్య పరిశోధన ఒక భాగ మవుతుంది. కనుక, శాస్త్ర పరిశోధన కంటే, సాహిత్య పరిశోధనలో భిన్నఫలితాలు వెలువడే అవకాశం కలుగుతుంది. భిన్న ఫలితాలు రావడానికి పరిశోధకులల్లో కన్పించే భిన్న దృక్పథాలు కారణమవుతుంటాయి. అంటే పరిశోధనకు "దృక్పథం" అనేది కూడా ఉండే అవకాశం, సాహిత్య పరిశోధనలో ముఖ్యంగా కన్పిస్తుంది. అందు వల్లనే సాహిత్య పరిశోధనలో దృక్పథం అవసరమని కొంతమంది పరిశోధకులు భావిస్తున్నారు[25].

తెలుగు 'పరిశోధన దృక్పథ విధానం' గురించి చర్చిస్తూ కేతవరపు రామకోటి శాస్త్రి కింది విధంగా తెలిపారు[26]. *మనం వర్తమానంలో వున్నాం. మనం పరిశోధించే సాహిత్యరంగం భూతకాలానికి చెందినది. ఇది ఒక్క ప్రాచీన సాహిత్యానికే కాదు, ఆధునిక సాహిత్యనికీ వర్తిస్తుంది. మనమీనాడు పరిశోధనకు స్వీకరించిన విషయం తప్పనిసరిగా నిన్నటికైనా పూర్తి అయిఉంటుంది. ఈనాటికి రేపటికి కూడా పూర్తికాక కొనసాగుతున్న విషయాన్ని గురించి మనం పరిశోధించటంలేదు. అందువల్ల పరిశోధన అన్నది ఎల్లప్పుడూ నిన్నటి గురించే ఉంటుంది. నిన్నటితో సమాప్తమైన విషయం నిన్నటి దాకా వున్న కొన్ని నిర్దిష్టమైన భౌతిక పరిస్థితుల ఒత్తిడివల్ల, ప్రభావాల వల్ల, అందుకనుగుణంగానో, ప్రతికూలంగానో అది రూపొందుతుంది. ప్రతికూలంగా రూపొందిందంటే, అది ఆనాటి భౌతిక పరిస్థితుల మీద తన ప్రభావ ముద్ర వేయడానికి, ప్రభావ ముద్రకు ఆంతర్యం, ఆ పరిస్థితులను సంస్కరించటం కావచ్చు, లేక సమూలంగా మార్చడం గురించి కావచ్చు. మనం గమనించ వలసిందేమిటంటే, మనమున్న పరిస్థితులకంటే భిన్నమైన పరిస్థితులలో రూపొందిన విషయం గురించి మనం పరిశోధించటానికి దిగుతున్నాం అని! మన పరిస్థితులు, మన ఆలోచనలను, మన*

*వ్యాఖ్యానాలను రూపొందించాయి. ఇది పరిశోధకులమైన మనం గుర్తించుకోవలసిన విషయం, అంటే ఈ మేరకు మనకొక సబ్జెక్టివిజం అనేది ఉంటుంది. ఇది తప్పదు. సాహిత్యం మానవ జీవిత సంబంధాలతోనూ, అందువల్ల రూపొంది సంఘర్షించుకొనే భావజాలంతోనూ నిండి వుంటుంది. ఆమొత్తాన్ని వస్తువుగా చేసి రచయిత అయినవాడు ఒక సాహిత్య కళారూపాన్ని తయారు చేస్తున్నాడు. ఆరచయితకు మనందరికి వున్నట్లే ఒక సబ్జెక్టివు యాటిట్యూడ్ వుంటుంది. అంటే సాహిత్య కళారూపాలన్నీ కూడా ఆయా రచయితల యొక్క ఆత్మాశ్రయ దృక్పథం నుండి రూపుదిద్దుకొన్నవే అన్నమాట. మనం పరిశోధించవలసింది అలా రూపుదిద్దుకున్న వస్తువు యొక్క వాస్తవికతను గురించి, అందు వల్ల పరిశోధనకు "దృక్పథం" అనేది అత్యంత ప్రధానమైన అంశం. మన దృక్పథం వస్త్వాశ్రయంగా వుండేటట్లు జాగ్రత్తపడుతున్నకొద్దీ, మన పరిశోధనలో అబ్జెక్టివిజం – వస్తుతత్త్వం – వాస్తవికత ప్రధానమవుతుంది. పరిశోధనకు కావల్సింది భౌతిక వాస్తవిక దృక్పథం* పరిశోధనలో ఆత్మాశ్రయ, వస్త్వాశ్రయ ఆలోచనా విధానాలకు అవకాశం ఉందనీ, వస్త్వాశ్రయ దృక్పథమే వాస్తవికతను సరిగ్గా బహిర్గతం చేయగల్గుతుందని పై ఉటంకిత అభిప్రాయం వల్ల తెలుస్తుంది.

పరిశోధనకు దృక్పథం ఎంత ప్రధానమో ఇది స్పష్టం చేస్తున్నప్పటికి, ఆ దృక్పథం ఏర్పడడానికి, పరిశోధకుడి పై కొన్ని ప్రభావాలు పనిచేస్తుంటాయనేదీ గమనించవలసి ఉంది. ఈ భావన ను మరింత స్పష్టంగా వివరిస్తూ ఆర్. ఎస్. సుదర్శనం ఇలాతెలిపారు[27]. "*కాలంలో అభిరుచులూ, అభిప్రాయాలూ మారుతాయి; కావ్యరచనా విధానమూ మారిపోతుంది. కానీ, కవి దృక్పథానికీ కావ్యస్వరూపానికీ గల సంబంధం ఎప్పుడూ ఒక నిశ్చిత ప్రమాణమే* (or Constant), *ఆ సంబంధాన్ని ఆధారం చేసుకొను విమర్శ ఏ దృక్పథంలో వ్రాయబడిన పద్యకావ్యాన్నైనా, గద్యకావ్యాన్నైనా సరే, దాని వ్యంగ్యార్థాన్ని వ్యాఖ్యానించడం ద్వారా దానికి న్యాయం చేకూర్చ గలదు*" అంటే "దృక్పథంలో" మార్పులురావడానికి కాలంకూడా కారణమవుతుందని తెలుస్తుంది. కాలానుగుణమైన పరిస్థితులు, అప్పటికున్న కొన్ని ఆలోచనలు, పద్ధతులు కూడా పరిశోధకుడిని ప్రభావితం చేసి ఒక దృక్పథాన్నివ్వడానికి దోహదపడుతుంటాయి. కొంతమంది కేవలం సాహిత్య నిర్మాణాంశాల గురించే ఆలోచించి, ఆదిశగానే పరిశోధనా దృక్పథాన్ని ఏర్పరుచుకొంటే, ఆ రచన రావడానికి గల సామాజిక, చారిత్రక కారణాల్ని అన్వేషించాలనే దృక్పథం గల పరిశోధకులూ ఉన్నారు. సాహిత్య పరిశోధన విషయంలో కేతువిశ్వనాథరెడ్డి మూడు ధోరణుల్ని చూడవచ్చునంటున్నారు[28]. అవి:-

(i) సాహిత్య రచనలోని సామాజికాంశాలను, సాహిత్యాంశాలనూ పరిశీలించే ధోరణి.

(ii) సాహిత్య రచనలోని సామాజికాంశాలనూ, సమాజ శాస్త్ర పరిశోధనల సాయంతో పరిశీలించే ధోరణి.

(iii) సాహిత్య రచనలోని నిర్మాణాంశాలను మాత్రమే పరిశీలించే ధోరణి.

సాహిత్య రచనలో వ్యక్తమయ్యే సామాజకాంశాలే, ఏసమాజ శాస్త్ర సహాయాన్ని తీసుకోవాలో నిర్ధారిస్తాయని కూడా పేర్కొన్నారు.[29]

పరిశోధకుడిలో దృక్పథం ఏర్పడడానికి సాహిత్య విషయాలే కాకుండా, సామాజిక, చారిత్రక విషయాలు ఆనాటికి ప్రాచుర్యంలో ఉన్న ప్రమాణాలు కూడా ప్రభావాన్ని కల్గిస్తాయని పై ఫలితాంశాలను బట్టి తెలుస్తుంది. అయితే, పరిశోధకుడి లో కన్పించే ఈ దృక్పథం, ఆ పరిశోధకుడిలో అంతర్నిహితంగా ఉండే తాత్త్విక నేపథ్యాన్ని అనుసరించి కూడా ఏర్పడుతుంది. దీన్ని తాత్త్విక శాస్త్ర, కళానేపథ్యాలుగా విభజించ వచ్చునంటున్నారు పరిశోధకులు[30]. "తాత్త్విక నేపథ్యం ఒక రచన మీద ప్రపంచ మీద ఏర్పరుచుకొనేది. సమాజం మీద ఒక అవగాహన లేకుండా దేనినీ పరిశీలించలేం.తాత్త్విక నేపథ్యం అంటే ఒక ఆలోచనా విధానం. ఒక ప్రాపంచిక దృక్పథం" అని రాచపాళెం చంద్రశేఖరరెడ్డి ,హెచ్. ఎస్. బ్రహ్మా నందలు వ్యక్తీకరించిన అభిప్రాయాల ప్రకారం,పరిశోధకుడికి ఒక దృక్పథం ఏర్పడాలంటే రచయితమీదా, రచనమీదా, ఎంత అవగాహన ఉంటుందో అంతకంటే ముఖ్యంగా ఆ రచయిత వచ్చిన సమాజంమీదా, ఆ రచన వచ్చిన నేపథ్యం మీదా ఆ రచయిత, రచన కాల జీవన పరిస్థితుల మీదా ఒక సశాస్త్రీ యమైన అవగాహన ఉండాలి. అంటే, ఆయా కాలాల్లో వస్తున్న సాహిత్య, సాహిత్యేతర గ్రంథ విజ్ఞాన ం, లౌకిక విషయాల అవగాహన ఉన్నప్పుడే ఇది సాధ్యమవుతుంది. వీటిమీద "అవగాహన" లేదా దీని నేపథ్యం తెలియకపోతే ఒక దృక్పథం ఏర్పడి ఉండదా? అని ప్రశ్నించుకొంటే, అశాస్త్రీయమైన దృక్పథమనేది ఏర్పడుతుంది తప్ప, సశాస్త్రీయ దృక్పథం ఏర్పడుతుందని చెప్పలేం. 'సాహిత్యాన్ని సాహిత్యంగానే చూడాలనీ, సమాజంతో ముడిపెట్టి చూడడం సాహిత్యేతర దృష్టి అనేది ఒక సంప్రదాయ దృష్టి'[31].అది ఈ నాటికీ అక్కడక్కడా కనపడుతున్నా సాహిత్యాన్ని ఇతర క ళలను సమాజ పరిణామంతో పోల్చిచూడడం శాస్త్రీయ విధానమని ఆధునిక అవగాహన[32] గా రూపొందిందనేది గమనించి నప్పుడు, పరిశోధకుడికి దృక్పథం అవసరమే కాకుండా, ఎలాంటి దృక్పథం అవసరమో కూడా అవగాహన లోకి వస్తుంది.

## 2.4. ఆరుద్ర దృక్పథం:

పరిశోధనకు కావాల్సింది సత్యాన్వేషణ. అది సరైన దృక్పథంతో ఒక పద్ధతిలో వెలువడాలి. దృక్పథం అంటే చూసేమార్గం పరిశోధకుడి వైయక్తిక కోణం నుండి కాకుండా, రచన రూపొందించటానికి కారణ భూతమైన అన్ని పరిస్థితున్ని చూడగలిగే, పరిశీలించ గలిగే మార్గం. దీన్ని ఆంగ్లంలో "Approach" outlook" "point of view" అనే పారిభాషిక పదాలతో పేర్కొంటున్నారు. ఈ దృక్పథాన్ని ఒక క్రమ పద్ధతిలో చెప్పడానికి పరిశోధన పద్ధతి (Methodology) ని సహకారిగా తీసుకోవడం వల్ల, ఆ పరిశోధనకు మరింత శాస్త్రీయత ఏర్పడుతుంది.

విద్యాభ్యాసం కొనసాగిస్తూనే, వివిధ గ్రంథాలు చదువుతూ, సాహితీ వేత్తలతో పరిచయం పెంచుకొంటూ, జీవన భృతికోసం విమానదళంలో బ్యాండ్ బాయ్‌గా తర్వాత పాత్రికేయుడిగా ఫోటోగ్రాఫర్‌గా, సినీరచయితగా జీవితాన్ని కొనసాగించి, సినిమాస్క్రిప్టు కోసం ప్రారంభించిన అన్వేషణ,

ఫలితంగాపరిశోధనలో చేయిపెట్టడం జరిగిందనేది ఆరుద్ర జీవిత విశేషాలు తెలియ జేస్తున్నాయి[33]. తన జీవిత కాలంలో కవిత్వం, కథలు, నాటకాలు, నాటికలు, అనువాదాలు, డిటెక్టివ్ నవలలు, పరిశోధక వ్యాసాలు వంటి వెన్నింటినో రచించారు[34]. ఇవన్నీ ఆరుద్ర దృక్పథాన్ని పట్టిచ్చే అంశాలే అయినా, సృజనాత్మక సాహిత్యానికి, పరిశోధనకూ దృక్పథం లో కొన్ని వ్యత్యాసాలు కన్పిస్తుంటాయి. సినిమాపాటలు రాసిన ఆరుద్ర, ఆ సినిమా నిర్మాణాన్ని అనుసరించిన ఓ దృక్పథం బహిర్గతమవుతుంది. దానిలో స్వీయ అలోచనల్ని, భావజాలాన్ని నిక్షిప్తంచేయడానికంటే, కథాసందర్భం, సన్నివేశానికి అనుగుణమైన సృజన శీలతను ప్రదర్శించ వలసి ఉంటుంది. అయినప్పటికీ, కవిత్వంలో కూడా ఆరుద్ర అభ్యుదయ ధోరణిని పాటించినట్లు, ఆతని కవిత్వాన్ని పరిశీలించినట్లయితే తెలుస్తుంది.

ఏవో కొన్ని రచనలను బట్టి మాత్రమే అయితే, ఆ రచయితకి గల దృక్పథాన్ని పట్టివ్వ లేవట్లే ఆరుద్ర దృక్పథం ఆయన రచించిన సినిమా పాటలు, డిటెక్టివ్ నవలలను అనుసరించే కాకుండా, కవిత్వం లో బాగా గుర్తించ గలిగే అవకాశం ఉంది. కవిత్వంలో తన స్వీయాభిప్రాయాల్ని, స్వీయ స్పందనల్ని స్వేచ్ఛగా వ్యక్తీకరించే అవకాశం ఉంది. ఇది ఏ కొన్ని,కొద్ది సమయాల్లోనో తప్ప, పూర్తిగా స్వీయ దృక్పథ ప్రతిబింబంగానే వెలువడుతుంది. అందుకనే, ఆరుద్ర కవిత్వం ద్వారా, ఆతని దృక్పథాన్ని తెలుసుకోవడం, అది పరిశోధనలో ఏమైనా ప్రతిఫలించగలిగేందుకు అవకాశాలున్నాయేమో అధ్యయనం చేయటం మంచిదనే అభిప్రాయంతో, ఈ కోణంలోనూ పరిశీలించవచ్చు. విమర్శలో నిర్మమత, నిష్పక్షపాత దృష్టి ఉండాలని ఎంత చెప్పుకున్నా, విమర్శలో వివిధరకాలు ఉండటంవల్ల వివిధ విమర్శ పద్ధతుల్లో, విమర్శ వెలువడుతుంది. సంప్రదాయ విమర్శ నుండి, మార్క్సిస్టు విమర్శ వరకూ విమర్శల్లో రకాలు ఉంటున్నాయంటే, విమర్శలో స్వీయాభిప్రాయాలు, స్వీయ దృక్పథం ఏర్పడడానికి వీలు కలుగుతుందని తెలుస్తుంది. అలాంటప్పుడు విమర్శకూ, పరిశోధనకూ అవినాభావ సంబంధం ఉండటం అనే లక్షణం వల్ల, పరిశోధన లోనూ విమర్శ దృక్పథం వల్ల పరిశోధనలోనూ, పరిశోధకుడికి ఉండే దృక్పథం పరిశీలించాల్సిన అవసరం ఏర్పడుతుంది. కనుక, ఆరుద్ర కవితాదృక్పథం, విమర్శ దృక్పథాలను ముందుగా పరిశీలించి నట్లయితే, పరిశోధన దృక్పథం కూడా సులువుగా అవగతమవుతుంది.

## 2.4.1. ఆరుద్ర కవితా దృక్పథం:

ఆరుద్ర పరిశోధ న చేపట్టక ముందు నుంచే స్వేచ్ఛగా కవిత్వాన్ని రాశారు. కవిత్వంలో ప్రధానంగా అభ్యుదయ ధోరణినే ఆరుద్ర పాటించారని,'*అభ్యుదయ కవిత్వంలో ఆరుద్రత*' అనే పరిశోధన గ్రంథంలో ఆర్. నరసింహారావు నిరూపించారు[35]. ఆరుద్ర కవిత్వంలో దృక్పథాన్ని, ముఖ్యంగా అభ్యుదయ దృక్పథాన్ని 'త్వమేవాహం', కావ్యంలోనూ గమనించ వచ్చు. "*తెలంగాణా సంఘటనల ఆధారంగా నిజాంరాజు దౌష్ట్యాలు – పీడింపబడుతున్న ప్రజానీకం, ఆక్రందనలూ ఈ కావ్య ( త్వమేవాహం ) ప్రారంభంలో వర్ణింపబడినాయి. కానీ, వెంటనే కవి తాను తెలంగాణాకే పరిమితం కాకుండా సమస్త మానవ కల్యాణం కోరే అభ్యుదయ దృక్పథం లోకి పయనిస్తారు.*

తెలంగాణా వంటి సమస్యలకి ఉదాత్తమైన పరిష్కారం మార్క్సిజం మాత్రమే అని నిరూపించడానికి ప్రయత్నిస్తాడు[36]". అని నరసింహారావు వ్యాఖ్యానించడంలో, కవిత్వంలో ఆరుద్ర అభ్యుదయ దృక్పథం వెల్లడవుతుంది.

ఎల్.సంగయ్య, ఆర్.నరసింహారావులు తమ పరిశోధన గ్రంథాల్లో ఆరుద్ర కవితా దృక్పథాన్ని వివరిస్తూ అభ్యుదయ దృక్పథాన్ని విశ్లేషించి చూపారు.

ఆశాంతుల్ని, అభాగ్యుల్ని ఐక్యమై పోరాడాలని శ్రీశ్రీ 'దేశ చరిత్రలు' ఖండికలో ఉద్బోధించినట్లు గానే, ఆరుద్ర 'మార్చాన్' అనే కవిత లోనూ చేశారు.

"రష్యాలో మీమీ అన్నలు
చైనాలో మీ మీ తమ్ములు
బ్రిటనమెరిక దేశాల్లోపలి
జనక్షేమం కోరేశక్తులు
అభ్యుదయ పథాన్ని పట్టి
లక్ష్యానికి దగ్గర పడుతూ
భవిష్యముకు మెరుగులు పెడితే
కలతలలో నిద్దురపోయే
ఢిల్లీలో పాకీవాడా
లాహోరున టాంగావాలా
బొంబాయిలో మరపనివాడా
కలకత్తా చీకటి మనిషీ
మదరాసున టేబుల్ క్లీనర్"[37] – అందర్నీ సమైక్యంగా

పోరా డాలనడంలో మార్క్సిస్టు దృక్పథం కన్పిస్తుంది. పైథాగరస్ సిద్ధాంతాన్ని ఆసరాగా తన దృక్పథాన్ని వ్యక్తీకరిస్తూ వర్గ సంఘర్షణను ఆశించే ఆరుద్ర ఈ కవిత చాలా ప్రసిద్ధమైంది.

"త్వమేహ్యాహమ్" లో "పెద్దముల్లు" శీర్షికతో అభ్యుదయ బీజగణితం ద్వారా సాల్వ్ చేద్దామంటూ కొనసాగే ఈ కవితా ఖండిక ఆరుద్ర దృక్పథాన్ని బాగా పట్టిస్తుంది.

"చిన్న చిన్న చీమలూ వగైరా
అడుగుభుజం అనుకోండి
బలవంతమైన సర్పం
గత్రా ఎట్ సెట్రా
అడుగు భుజం ఉత్పత్తి చేసే
ఆ హారం మీద ఆధారపడ్డం వల్ల
లంబం అవదా మరి?

ఈ భుజాల
పరస్పర సంఘర్షణల ఫలితం
ఈ భుజాల
కర్ణం మీది చతురస్రం
అవునా? సరి
ఈ చతురస్ర వైశాల్యం
ఇజీక్వల్టూ
రెండు విభిన్న భుజాలపై
గల చతురస్రాలలోని తమిస్రం
థీసీస్ యాంటీ థీసీసుల మిశ్రమం
రెండు భిన్న పక్ష సంఘాల పోరాటం
అనగా ఒక నూతన అవస్థ
ఒక పునీత వ్యవస్థ
అని ఉపపాద్యం
వామపక్ష నినాదాల పచరించి
వామ పక్ష విధానాల చరించి
నిర్మాణ క్రమాన్ని చెయ్యండి "[38]

దీన్ని శ్రీ శ్రీ వ్యాఖ్యానిస్తూ 'ఆరుద్ర మార్క్సియవాదానికి అన్వయించాడని,

"వ్యక్తిగత దారిద్రాలనీ,
వర్గ కలహాలనీ
డొకడాల పద్ధతినీ "..

పుత్రపౌత్రభివృద్ధిగా పెంచకుండా ఆశారేఖా గణితం రీత్యా మీ సమస్యలని పరిష్కరించుకోండని అంటాడన్నారు"[39], 'బలవంతమైన సర్పము చలిచీమల చేత జిక్కిచావదే', అన్న సుమతీ శతకములోని న్యాయము దీనికి ప్రోద్బలక మైనది. "సర్పము" బూర్జువా వ్యవస్థ. "చీమలు" శ్రామిక వర్గము. చిన్న చిన్న చీమలు అడుగు భుజం, అడుగు భుజము మీద ఆధార పడినదిలంబము. ఇది భూర్జువావ్యవస్థ. ఈ రెంటి ఘర్షణ అనివార్యమని మార్క్సువాదము. ఈ రెంటి ఘర్షణ ఫలితముగా ఏర్పడు కర్ణము మీది చతుర్భుశ్రము సామ్యవాద సమాజము". అని సి.నారాయణ రెడ్డి వివరించారు[40] అయితే,సి.నా.రే, దీన్ని అభ్యుదయ కవిత్వ విభాగంలో కాకుండా 'అతి నవ్య కవితా ధోరణులు' లో వివరించారు.

ఈ కవితా ఖండికలోనే "పరస్పర సంఘర్షణ ఫలితం" "వామపక్ష విధానాలు చరించి నిర్మాణ క్రమం చెయ్యండి" వంటి పంక్తులు ఆరుద్ర మార్క్సిష్టు దృక్పథాన్ని ప్రత్యక్షంగా పట్టి చూపుతున్నాయి.

*"అనుభవం వివరిస్తోంది ఆర్థిక పాఠాలు ధర్మాలు*
*అదే విశద పరుస్తోంది అధికారపీఠాల మర్మాలు..*
*అక్కుపక్షు లెందరో తక్కువ కూలికి*
*రెక్కలు ముక్కలు చేసుకుంటే తప్ప*
*ఒక్క ధనికుడెప్పుడూ*
*పెక్కు లక్షలు వెనకెయ్యలేడు*
*కోటిమంది నోటిముందు కూట్లో దుమ్ముకొడితేనే తప్ప*
*కోటీశ్వరుడు కుబేరుడుగా అవతరించలేడు..*
*కష్ట జీవులు సృష్టిస్తారు ఐశ్వర్యం*
*కలవాళ్ళు పంపిణీ చేస్తారు దారిద్ర్యం"*

ఈ కవితా ఖండికను పరిశీలించినా దోపిడీ వర్గ తత్వాన్ని మార్క్సిస్టు దృక్పథంతో వర్ణించటం కన్పిస్తోంది. ఎల్. సంగయ్య ఈ సందర్భంగా ఆరుద్ర కవిత్వాన్ని వ్యాఖ్యానిస్తూ" శ్రామిక కళే నిజమైన కళ, శాశ్వతమైన కళ- అని నమ్మిన అభ్యుదయకవి ఆరుద్ర. తాను నమ్మిన సిద్ధాంతాన్నే రమ్యాక్షర సంయోజనతో సరళ పద విన్యాసంతో, అంత్యప్రాసల గంభీర ముద్రలతో ఆలోచన కంటే ఉన్నతమైన, భావన కంటె ఉత్తమమైన అభ్యుదయ భావాలతో ఆరుద్ర గేయాలు సాగాయి" అన్నారు[41]. ఈ విధంగా ఆరుద్ర కవితా దృక్పథాన్ని చూస్తే అభ్యుదయ ధోరణి, మార్క్సిస్టు దృక్పథం ప్రతిఫలిస్తున్నాయి.

ఆదిమ కమ్యునిస్టు సమాజంలో ఉత్పత్తి సాధనాలు శ్రామికుల చేతుల్లోనే ఉండటం వల్ల, కళలు కూడా తమచేతిలోనే ఉండేవనీ, క్రమేపీ యజమానులు, పెట్టుబడిదారుల చేతుల్లో కీలు బొమ్మలై పోయాయనీ, అవి మళ్ళీ ప్రజల పక్షం వహించి పీడించే వాళ్ళు, పీడింపబడేవాళ్ళు లేని వర్గ రహిత సమాజాన్ని ఆకాంక్షించే సాహిత్యం అభ్యుదయ దృక్పథం గల సాహిత్యంలో కన్పిస్తుంది.

అభ్యుదయ దృక్పథానికి మూలసిద్ధాంతం మార్క్సిజమ్.మార్క్స్ ఏంగిల్స్‌ల భావాలతో ఎక్కువగా కన్పించడం వల్ల కూడా '*మార్క్సిజమ్*' గా పేరొచ్చింది. ఇది ప్రధానంగా ఆర్థిక, రాజకీయ రంగాలకు చెందిన సిద్ధాంతమైనప్పటికీ, సమకాలీన సమాజం ప్రతిఫలించేటట్లు సాహిత్యం రూపొందేటప్పుడు, సాహిత్య సిద్ధాంతంగానూ ప్రచారంలోకి వచ్చింది. కనుకనే, సాహితీవేత్తలు మార్క్సిస్టు దృక్పథాన్ని కూడా పరిశీలించారు. సి. నారాయణరెడ్డి తన సిద్ధాంత గ్రంథంలో "*మార్క్సిస్టు దృక్పథంలో సాహిత్య పరమావధి, శ్రామిక వర్గ చైతన్యాన్ని చిత్రించటమే. కళలు, కవిత్వం, తత్వం, శ్రామికుల సుఖ దుఃఖాలను, వారి ఆశయాల్ని చిత్రించటానికే అంకితం కావాలనేది మార్క్సిస్టు దృఢ నిశ్చయం*". అని ఈ సిద్ధాంతం సాహిత్యంలో నిర్వహించే పాత్రను వివరించారు[42]. సృజనాత్మక సాహిత్యంలో మార్క్సిస్టు దృక్పథాన్ని చూడగలిగినట్లే, విమర్శలోనూ చూడవచ్చు. కొంతమంది పరిశోధకులు, కేవలం "*పరిశోధకులు*" గానే కాకుండా, విమర్శనాత్మక దృష్టిని కూడా ప్రసరిస్తూ,తమ

పరిశోధనలను కొనసాగిస్తుండటంవల్ల, వారి పరిశోధనల్లో దృక్పథ ప్రతిఫలనకు అవకాశాలు ఎక్కువగా కన్పిస్తుంటాయి. ఆరుద్ర వ్యాసాల్లో, విమర్శతో కూడిన పరిశోధన కన్పిస్తుంది.

## 2.5. పరిశోధన–విమర్శ భేదాలు–పోలికలు : సమన్వయం :

సాహిత్య పరిశోధనలో విమర్శ, సాహిత్య విమర్శలో పరిశోధన కొన్ని సార్లు మిళితమైన ట్లు గోచరిస్తుంటాయి. "*ప్రకటితము కాకుండానుండు ప్రతియొక్క దానిని కనిపెట్టి, అథవా ప్రతులను సంగ్రహించి ఆ కృతిని శాస్త్రీయముగా సంపాదించి ప్రకటించునది పరిశోధన మైతే, అట్లు ప్రకటితమైన కృతియొక్క గుణావగుణములను గూర్చి వివరించునది విమర్శ. విమర్శలో విమర్శకుని సొంత భావము, అనుభవములు ముఖ్యము. అచ్చట భిన్న వ్యాఖ్యానములకు అవకాశమున్నది. అది వస్తునిష్ఠమైనను, వ్యక్తి నిష్ఠ కూడా అగును. పరిశోధన సంపూర్ణంగా వస్తునిష్ఠము*[43]". కనుక పరిశోధనలో స్వీయ అభిప్రాయాలకు కాకుండా సత్యాన్వేషణకే ప్రాధాన్యత లభిస్తుంది. కానీ, విమర్శలో కొంత వరకూ ఆత్మాశ్రయ దృక్పథానికీ, అనుభూతికీ అవకాశమున్నప్పటికీ, దాని క్కూడా కొన్ని ప్రమాణాలు అవసరమవుతాయి. అవి ఆనాటికున్న ప్రమాణాలపై ఆధారపడి ఉంటాయి. అంతేకాక, విమర్శకుడిలో సహృదయత కూడా ఉండడం అవసరమనేది విమర్శలక్షణాల్లో ఒకటి. దీని వల్ల కావ్య విలువలను నిర్ణయించటం విమర్శలో కన్పిస్తుంది.

కావ్యం వెలువడిన పరిస్థితులు కూడా పరిగణనలోకి తీసుకోవాల్సి ఉంటుంది. అప్పటి కే ఉన్న లాక్షణికుల ప్రమాణాలను కొలమానాలుగా తీసుకోవటం అవసరమైనప్పటికీ, ప్రాచీన, ఆధునిక ఆలంకారిక లక్షణ సమన్వయంతో జాగురూకత వహించాల్సి ఉంటుంది. లేకపోతే అట్టి విమర్శలో లోపంకూడా కొట్టొచ్చినట్లు కన్పిస్తుంది. అందుకనే వడలి మందేశ్వరరావు ఈ విషయంలో తమ అభిప్రాయాన్నిలా చెప్పారు[44]. "*ఆలంకారిక శాస్త్రపు మూల సూత్రాలను ఆధునిక విజ్ఞానంతో పరీక్ష చేయడం కన్న ఆ శాస్త్రానికి మహోపకారం లేదు.*" విమర్శకు ఆనాటికి ఉన్న ప్రమాణాలను గ్రహించటం వల్ల దానికొక ప్రామాణికత వచ్చినా, అది తర్వాత కాలంలో వచ్చిన భావనలు, సూత్రాల వంటి ప్రమాణాల్లో మార్పుల వల్ల కావ్య విలువల్లోనూ, ప్రమాణాల నిర్ణయ స్థాయిల్లోనూ వ్యత్యాసం కన్పిస్తూనే ఉంటుంది. పరిశోధనలో మాత్రం భిన్న సిద్ధాంతాలు వెలువడవచ్చు వేమోగాని సత్యాన్వేషణ మాత్రం ప్రధానమవుతుంది. పరిశోధనలో నూతన భావనలు, సిద్ధాంతాలు వెలువడినప్పుడు, పాత సిద్ధాంతాల్ని ఖండిస్తూ కొత్త సిద్ధాంతాలు వెలువడ వచ్చు.

విమర్శలో కన్పించే విశ్లేషణ, తులనాత్మక పరిశీలన, వ్యాఖ్యానం, నిర్ణయం అనే నాలుగు ప్రధానాంశాల్లో, ఆయా కాలల్లో మారుతున్న సాహిత్యాభిరుచుల్ని గమనించడం వల్లనో, అవి విమర్శకుడిలో ప్రత్యేకముద్ర వేయడం వల్లనో, తన ఇష్టాయిష్టాలతో కూడి, తనకున్న అభిరుచితో విమర్శచేస్తూ, దానికొక దృక్పథాన్ని అంట గట్టే అవకాశం ఉంది. ఇటు వంటి విమర్శను అభిరుచి విమర్శగా పిలుస్తున్నారు. వడలి మందేశ్వరరావు '*విమర్శకుడు ఎలాంటి దృక్పథానికీ లొంగకూడదంటారు*'[45]. కానీ, విమర్శను, పరిశోధనను పరిశీలించినప్పుడు పరిశోధనలో కంటే

విమర్శలో దృక్పథ ప్రతిఫలనానికి అవకాశాలు ఎక్కువగా కన్పిస్తున్నాయనేది పై పరిశీలన వల్ల నిరూపితమవుతుంది. విమర్శ, పరిశోధనల్లో దృక్పథం కలిగి ఉన్నప్పటికీ, రెంటింటిలోనూ ఆ వ్యక్తి పై "దృక్పథం" ప్రతిఫలించడమనేది ఆధార పడుతుందని గమనించ వలసి ఉంటుంది. విమర్శ ప్రధానంగా కావ్యంలో ఉండే గుణ దోషాల్ని విశ్లేషించి, తన నిర్ణయాన్ని ప్రకటించడం జరుగుతుంది. దీనిలో కవి దృష్టి కోణం, విమర్శకుడి దృష్టికోణం రెండూ కన్పిస్తాయి. ఈ అంశాలే విమర్శలో దృక్పథాన్ని పట్టిచ్చే అంశాలవుతాయి. కేవలం విమర్శ పద్ధతులను అనుసరించి, ఆ కావ్యం-రచన ఏ విమర్శ పద్ధతిలో విశ్లేషణ చేస్తేబాగుంటుందో, ఆ పద్ధతితో చేయడం వల్ల నిర్మమత అనే గుణాన్ని కలిగిన విమర్శకుడు తన పనిని నెరవేరుస్తున్నట్లవుతుంది. అలాకాకుండా, తాను ఏర్పరుచుకొన్న అభిప్రాయాల్నే అన్ని రంగాల్లోనూ సమన్వయం చేసి, ఏదోతనకి వచ్చిన విమర్శ పద్ధతిలో నే విమర్శ కొనసాగిస్తే దృక్పథం తాత్త్విక నేపథ్యం అనేవాటి కున్న మౌలిక లక్షణానికి భంగం వాటిల్లుతుంది. కొన్ని సార్లు "ఒకే విమర్శ పద్ధతి"లో కావ్య విమర్శకొనసాగిస్తే, సరైన కావ్యవిలువలను నిర్ణయించడంలో సంతృప్తి చెందలేకపోవచ్చు. అలాంటప్పుడు, రెండు మూడు విమర్శ పద్ధతుల్లో, విమర్శలక్షణాల్ని అనువర్తితం చేయవలసి వచ్చినప్పుడు కూడా, విమర్శకుడిలో దాగి ఉన్న దృక్పథ ప్రభావం, తన పాండిత్య, సృజన శీలతతో సమ్మిళితమై బహిర్గతమవుతుంటుంది. అలాంటప్పుడు విమర్శకుడిలో ఎలాంటి "దృక్పథం" ఉందో స్పష్టమవుతూ, విమర్శ వ్యక్తి నిష్ఠ వైపు పయనిస్తుంటుంది. అలాంటపుడు శాస్త్రీయ దృక్పథానికి విమర్శకుడు ప్రాధాన్యత నిచ్చిన ట్లయితే, ఆ కావ్య రచన పట్ల తనకున్న ఇష్టాయిష్టాలతో పనిలేకుండా భౌతికవాస్తవాన్ని బహిర్గితం చేయడానికి వీలవుతుంది. అలాగని 'సహృదయత' లోపించినట్లయితే, ఆ విమర్శ కేవలం సాంకేతిక విషయాల్నే చర్చించి 'కావ్యాత్మ' ను పట్టివ్వడంలో లోపం ఏర్పడకూడదు.

ఇతివృత్తం, శైలీ, చారిత్రక, సామాజికాంశాల్ని అనుసరించి "కావ్యాత్మ"ను నిర్ణయిస్తూనే, ఆ రచనపై ప్రకాశాన్ని కల్గిస్తూ, రచయితకు భవిష్యన్మార్గం చూపిస్తూ, పాఠకుణ్ణి రచనతో ఆ రచయిత అభిప్రాయంతో నడిపించగలిగేటట్లు చేస్తూ, రచనలో గుప్తంగా ఉన్న వాటిని విడమర్చి చెప్పే వ్యాఖ్యానంగానూ మారి, రచన పట్ల మరింత అభిలాషను పెంచగలిగేటట్లు చేయగలగాలి. ఆ కవి లక్ష్యాన్ని, కావ్యలక్ష్యాన్ని తాత్త్విక నేపథ్యంతో వాస్తవికంగా, నిష్పక్షపాతంగా పరిశీలించేదే, విమర్శలో శాస్త్రీయ దృక్పథం అవుతుంది. ప్రముఖ విమర్శకురాలు సంజీవమ్మ అభిప్రాయంలో "*సమాజ చరిత్రనూ సమాజ జీవితాన్ని శాస్త్రీయంగా పరిశీలించటానికి విపులంగా, లోతుగా అర్థంచేసుకోవటానికి గతి తార్కిక- చారిత్రక భౌతిక వాద దృక్పథాన్నిచ్చింది మార్క్సిజమనీ, మార్క్సిస్టు విమర్శనే, మార్క్సిస్టు దృక్పథంతో విమర్శగా గుర్తించాలనీ, సాహిత్య విమర్శకు క్రొత్త దృక్పథం – అభ్యుదయ దృక్పథం యిచ్చినట్టిది మార్క్సిస్టు ఆలోచనావిధానమనీ, రచనలోని శిల్పసౌందర్యానికి తగిన ప్రాధాన్యమిస్తూనే, రచనాతత్త్వాన్ని –రచనలోని వస్తుతత్త్వాన్ని గురించి పరిశీలించేది, విలువ కట్టేది ఈ విమర్శనా దృక్పథంలో ఉంటుందనీ, రచనల స్థాయిని పెంచేదే కాదు, పాఠకుల అవగాహనస్థాయిని పెంచి ఆరోగ్య కరమైన అభిరుచుల్ని కలుగజేసి ఒక దృక్పథాన్ని ఇవ్వగలిగేదే విమర్శ*" అని పేర్కొన్నారు[44]. వీరి

అభిప్రాయాన్ని విశ్లేషించుకున్నట్లయితే ఒక రచన వెలువడిన తర్వాత విమర్శకుని దృక్కోణాన్ని బట్టి, పాఠకునిలో కొత్త దృక్పథం ఏర్పడుతుంది. రచన తత్త్వం మీదా, రచయిత మీదా పాఠకునికి స్వతహాగా ఏర్పడే దృక్పథం కంటే, విమర్శ చదవటం వల్ల పాఠకునిలో దృష్టిమార్గాన్ని విమర్శదృక్పథం లాగేసుకొంటుంది. కొన్ని సార్లు కొత్త ఆలోచనలకు ప్రేరణశక్తిగా కూడానిలుస్తుంది. డి.డి.కోశాంబి[47], ఆర్వియార్[48]లు భగవద్గీత ను మార్క్సిస్టు దృక్పథంతో వెలువరించిన అభిప్రాయాలు ఇలాంటి దృక్పథాన్ని కలిగి పాఠకుల్ని ప్రభావితం చేయగలుగుతున్నాయి. అందుకనే విమర్శనారంగంలో ప్రధానంగా మూడు దృక్పథాల్ని చూడవచ్చునంటున్నారు సంజీవమ్మ[49]. అవి:

(i) సంప్రదాయ (ఆలంకారిక) విమర్శనా దృక్పథం.

(ii) పాశ్చాత్య విమర్శనా దృక్పథం.

(iii) మార్క్సిస్టు విమర్శనా దృక్పథం.

సంజీవమ్మ ఇలా విభజించటంలో, విమర్శకుడు రచనను పరిశీలించే మార్గాన్నే అనుసరించారని తెలుస్తుంది. అంటే వీటిలోనూ ఉపశాఖా దృక్పథాలు కూడా ఉండే అవకాశం ఉంటుంది. ఈ అవగాహనను బట్టి చూసినా "మార్క్సిస్టు దృక్పథం" అని పేర్కొన్నారు గాని "అభ్యుదయదృక్పథం" అని పేర్కొన లేదు. ఈ రెండింటికీ మధ్యగల వ్యత్యాసాలను కె.కె. రంగనాథాచార్యులు తెలియజేస్తూ[50] *"అభ్యుదయ వాదంలాగే విప్లవవాదానికి మార్క్సిస్టు దృక్పథమే ప్రాతిపదిక. సామ్యవాద సమాజ నిర్మాణమే ధ్యేయం. అయితే అభ్యుదయవాదానికి, విప్లవవాదానికి ఉన్న ప్రధాన భేదం అవి రెండు భిన్న చారిత్రక దశలకు సంబంధించినవి కావటమే. అభ్యుదయ ఉద్యమం స్వాతంత్ర్యోద్యమంలో భాగంగా ఆరంభమైంది. భిన్న ధోరణులకు సంబంధించిన వారితో విశాల ప్రాతిపదికపైన ఈ ఉద్యమం సాగింది. సామ్యవాద సమాజం అంతిమ లక్ష్యంగా ప్రకటించుకున్నా, ఆనాటి తక్షణ లక్ష్యం స్వాతంత్ర్య సాధన. అభ్యుదయవాదానికి మార్క్సిజం ప్రధాన ప్రాతిపదిక అయినా మార్క్సిజంతో సంబంధం లేకుండా ఏమాత్రం పురోగామి భావాలున్నా, వారందరినీ ఉద్యమంలో చేర్చుకొని జాతీయోద్యమంలో భాగంగా పోరాడిందనీ, కానీ, సామ్యవాద సమాజ నిర్మాణమే దాని ముఖ్య ఆశయమనీ, దీనికి ఆధారభూతమైన దృక్పథం మార్క్సిస్టు దృక్పథమ*"నీ వివరించారు.

ఇటువంటి సామ్యవాద సమాజస్థాపన ధ్యేయానికి ప్రేరణగా నిలవడానికే ఆరుద్ర కవిత్వంలో అభ్యుదయ దృక్పథాన్ని ప్రదర్శించారు. మరి, విమర్శ లోనూ దృక్పథం ఉంటుందనీ, కవిత్వంలో ప్రతిఫలించే దృక్పథానికే, విమర్శన దృక్పథానికీ కొద్దిగా తేడా ఉంటుందనీ పైపరిశీలన వల్ల తేలింది. కనుక, విమర్శలో ఆరుద్ర దృక్పథాన్ని 'విమర్శకుడుగా ఆరుద్ర'ను తరువాత అధ్యాయంల్లో గమనించవచ్చు.

## సూచికలు (Referances)


1. ఆరుద్ర, *సినీవాలి* - 1990, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాదు - పు:15

2. జి.వి.సుబ్రహ్మణ్యం, '*తెలుగులో సాహిత్య పరిశోధన: నాడు–నేడు* (వ్యా) తెలుగులో పరిశోధన (సం.) దేవులపల్లి రామానుజరావు, ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీ (1983), హైదరాబాదు, పు.387.

3. అదే:పు.354.

4. జి.వి.సుబ్రహ్మణ్యం, *పరిశోధన దిక్సూచి (ముందుమాట)*, విశ్వవిద్యాలయాల్లో తెలుగు పరిశోధన, వెలుదండ నిత్యనందరావు. స్వీయప్రచురణ, మొ.ప్ర.1987, మలికూర్పు, 1998, పు. xxix

5. రాచపాళెం చంద్రశేఖరరెడ్డి, హెచ్. ఎస్, బ్రహ్మానంద, *సాహిత్య పరిశోధన సూత్రాలు* పు.58.

6. అదే.పు.58

   "థీసిస్‌లో పరిశోధకుని వాదం ఉంటుంది. సిద్ధాంత ప్రతిపాదనకు తాత్త్విక పునాది నేపథ్యంగా ఉపయోగపడుతుంది. పునాదిలోంచి మాట్లాడినప్పుడే అది వాదమౌతుంది. 'థీసిస్ "లో ఉండే ఈ వాదంతో పూర్వ సిద్ధాంతమేదైనా ఉంటే, దానిని పూర్వపక్షం చేయ్యడం లేదా పూర్వ సిద్ధాంతానికి మరింత బలాన్ని చేకూర్చడం, అందులో వెలితిని పూడ్చటం, నూతన సిద్ధాంతాన్ని ప్రతిపాదించటం సిద్ధాంత గ్రంథంలో ప్రధానాంశం".

7. ఆరుద్ర, *ప్రజాకళలూ– ప్రగతివాదులూ,* పు.132

8. అదే.పు.132.

9. ఆరుద్ర. *సినీవాలి,* పు.24

10. ఆరుద్ర, *త్వమేవాహమ్,* పు.4

11. ఆరుద్ర, *గుడిలో సెక్స్,* పు.1

12. అదే.పు.2,3

13. ఆరుద్ర, *రాముడికి సీత ఏమవుతుంది?,* పు.5

14. వెలుదండ నిత్యానందరావు, *విశ్వవిద్యాలయాల్లో తెలుగు పరిశోధన,* పు.3

15. అదే.పు.3

16. అదే పు.2,3

17. జి.వి.సుబ్రహ్మణ్యం, '*జీవియస్ వ్యాసాలు*' శ్రీవాణి ప్రచురణలు: హైదరాబాదు, 1993-పు.28

18. కొత్తపల్లి వీరభద్రరావు, *తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము*, (1960) ప్రచురణ: పు.140-141.

19. అదే.పు.171.

20. అదే.పు.171.

21. జి.వి.సుబ్రహ్మణ్యం, *జీవియస్‌వ్యాసాలు*, పు.32

22. అదే.పు.33.

23. అదే.పు.33.

24. అదే.పు.4.

25. కేతనరపు రామకోటిశాస్త్రి, '*తెలుగు సాహిత్య పరిశోధన: దృక్పథం విధానం* (వ్యా) తెలుగు అకాడమీవారి తెలుగు దశాబ్ది ఉత్సవ సంచిక (1988) నుండి స్వీకరించి, 'విశ్వవిద్యాలయాల్లో తెలుగు పరిశోధన' గ్రంథానికి నిత్యానందరావు 'ముందు మాట' గా గ్రహించిన దాని నుండి పు. xiv

26. అదే.పు. xv-xiv

27. ఆర్. ఎస్. సుదర్శనం, *సాహిత్యంలో దృక్పథాలు*. పు.2-3

28. కేతు విశ్వనాథరెడ్డి '*దృష్టి*' (*సాహిత్యవ్యాసాలు*). విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాదు: 1998,పు3

29. అనే.పు.5

30. రాచపాళెం చంద్రశేఖరరెడ్డి, హెచ్.ఎస్. బ్రహ్మానంద, *సాహిత్యపరిశోధన సూత్రాలు*, పు.27

31. అదే.పు.28-29

32. అదే.పు.29

33. చూడ: ఇదే పరిశోధన - *మొదటి అధ్యాయం*.

34. అదే

35. ఆర్.నరసింహారావు '*అభ్యుదయ కవిత్వంలో ఆరుద్రతో* విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాదు, 1992, పు.I

36. అదే.పు.50

37. ఎల్.సంగయ్య పు.49

38. ఆరుద్ర, *త్వమేవాహమ్*, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్: హైదరాబాదు. 1999,పు.13-14.

39. శ్రీ శ్రీ '*ఒకలఘుటిప్పణి* (వ్యా) *ఆరుద్ర- త్వమేవాహమ్* - 1999.పు.45

40. సి.నారాయణ రెడ్డి, *ఆధునికాంధ్ర కవిత్వము, సంప్రదాయములు: ప్రయోగములు:* ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, సికింద్రాబాదు, మచిలీపట్టణం, 1967, పు.632

41. ఎల్.సంగయ్య, పు.60.

42. సి.నారాయణ రెడ్డి, పు.557.

43. జి.వి.సుబ్రహ్మణ్యం, *జీవియస్ వ్యాసాలు*, పు.16

44. వడలి మందేశ్వరరావు, పు.108.

45. అదే.పు.88.

46. సంజీవమ్మ, '*సాహిత్య విమర్శ – మార్క్సిస్టు దృక్పథం* (వ్యా) అభ్యుదయ విమర్శ విశేష సంచిక (సం.) తుమ్మల వెంకట్రామయ్య పు.30-35.

47. డి.డి.కోశాంబి, '*భగవద్గీత చారిత్రక పరిణామం* హైదరాబాదు బుక్ ట్రస్టుప్రచురణ: జనవరి 1995, (సం) చేకూరి రామారావు.

48. ఆర్వియార్, '*భగవద్గీత – మార్క్సిజం* విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్: హైదరాబాదు, జూలై 2002.

49. సంజీవమ్మ.పు.34

50. కె.కె.రంగనాథాచార్యులు. *ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్న ధోరణులు*, ఆంధ్ర సారస్వత పరిషత్తు, హైదరాబాదు.1982,పు.(xiv)

అధ్యాయం-3

# ఆరుద్ర విమర్శనాత్మక దృక్పథం

## 3.0. పరిశోధక విమర్శకుడు :

తన జీవిత కాలంలో వెలువరించిన విమర్శ, పరిశోధన వ్యాసాల్లో, ఆరుద్ర విమర్శనా దృక్పథాన్ని పరిశీలించినప్పుడు 'మార్క్సిస్టు విమర్శనా దృక్పథమే' ప్రధానంగా కన్పిస్తుంది. ప్రముఖ విమర్శకురాలు సంజీవమ్మ 'మార్క్సిస్టు విమర్శ'ను 'మార్క్సిస్టు దృక్పథం'గా భావించారు[1]. ఆరుద్ర రచనల్లో మార్క్సిస్టు విమర్శనా దృక్పథం కన్పిస్తుందో,లేదో, సవివరంగా అధ్యయనం చేసేముందు, ఆరుద్ర విమర్శ పట్ల విమర్శకుల్లో గల అభిప్రాయాల్ని పరిశీలించవలసి ఉంది. ఆరుద్ర వ్యాసాల్లో తులనాత్మక, కవిజీవిత, అనువర్తిత చారిత్రక, మార్క్సిస్టు విమర్శనా పద్ధతులు కన్పిస్తున్నాయని ముదిగొండ వీరభద్రయ్య పేర్కొన్నారు[2]. అయితే, ఈ విమర్శనా దృక్పథాలన్నీ, మార్క్సిస్టు విమర్శనా దృక్పథాన్ని మరింత విశాలతరం చేయడానికే ఆరుద్ర వినియోగించు కొన్నారనేది గమనించాల్సి ఉంది. అలాగే ఆరుద్ర రాసిన వ్యాసాల్లో కన్పించే విమర్శ కూడ తన పరిశోధనలో అంతర్భాగంగా వినియోగించుకోవడానికే ప్రయత్నించారు. పరిశోధనలో విశ్లేషణాత్మక దృక్పథం, శాస్త్రీయ దృక్పథాలతో సిద్ధాంతీకరణ జరుగుతూ, సత్యాన్వేషణకు ఉప బలకంగా విమర్శను వినియోగించుకున్నారు. ఇటువంటి వ్యాసాల్ని బట్టి పరిశోధక విమర్శకుడుగా ఆరుద్ర ను పిలవడం సమంజసం. అయితే, సాహిత్య చరిత్ర పరిశోధకుడు గానూ, గ్రంథ పరిష్కృత పరిశోధకుడుగానూ, కవిజీవిత, తులనాత్మక పరిశోధకుడు గానూ కొన్ని లక్షణాలు కన్పిస్తున్నా, వీటన్నింటిలోనూ, సృజనాత్మక పరిశోధకుడు (creative scholar) గాను కన్పించడం మరోకోణంలో పరిశీలించాల్సి ఉంది.

## 3.1. విమర్శలో దృక్పథాన్ని గుర్తించే అంశాలు:

ఆరుద్ర విమర్శనాత్మక దృక్పథాన్ని పరిశీలిస్తున్నందు వల్ల, విమర్శనాదృక్పథాన్ని పట్టిచ్చే అంశాలను ముందుగా గమనించడం అవసరం. విమర్శలో వెలువడే వ్యాఖ్యానం, నిర్ణయ ప్రకటన దృక్పథాన్ని పట్టిచ్చే అంశాలు. కొన్ని సార్లు విమర్శకుడు తన నిర్ణయాన్ని ప్రకటించేటప్పుడు క్లిష్ట పరిస్థితుల్ని కూడా ఎదుర్కొంటుంటాడు. అలాంటి సందర్భాలేమిటో ముదిగొండ వీరభద్రయ్య తన 'విమర్శ మౌలిక లక్షణాలు' గ్రంథంలో గుర్తించవచ్చు[3]

(i) రచనలోని వస్తువు విమర్శకునికి నచ్చి, రచన మాత్రం కళావిలువల రీత్యా కనీస స్థాయిలో లేనప్పుడు;

(ii) కళావిలువలుండి కూడా రచనలో ఘనమైన, ప్రయోజనవంతమైన వస్తువును రచయిత తీసుకోనప్పుడు;

(iii) రచన సందేశంతోనూ, వస్తువుతోనూ విమర్శకుడు విభేదిస్తున్నపుడు, ఇదే సందేశం అని తెలిసికోవడం కష్టమైనప్పుడు;

(v) రచనలోని అనుభవం ఏదోస్పష్టంగా తెలీనప్పుడు, అలాంటప్పుడు విమర్శకుడు, తన నిర్ణయాన్ని ఎలాంటి ఇష్టాయిష్టాలూ లేకుండా, రాగ ద్వేషాలకు అతీతంగా ప్రకటించడం కష్టం. విమర్శకుడు కూడా ఒక సమాజం నుండి వచ్చిన వాడే కనుక, ఆతని అవగాహనను బట్టి నిర్ణయాన్ని ప్రకటించడంలోనే 'విమర్శకుని దృక్పథం' వెల్లడవుతుంటుంది.

ఆరుద్ర విమర్శనాదృక్పథం ప్రతిఫలించే రచనల్లో 'గురజాడ గురుపీఠం' 'వేమన' 'రాముడికి సీత ఏమవుతుంది?' 'ప్రజాకళలూ- ప్రగతివాదులూ' 'వ్యాసపీఠం' 'గుడిలో సెక్స్' గ్రంథాలతో పాటు మరికొన్ని వ్యాసాలు ఉన్నాయి. వీటిలో ఆరుద్ర ప్రధానంగా మార్క్సిస్టు విమర్శణ దృక్పథమే కన్పిస్తుంది వివిధ విమర్శ పద్ధతులున్నప్పటికీ, ఇవన్నీ రచనలోని కొన్ని అంశాలనే నిర్ధారిస్తుంటే రచన మొత్తంగా మార్క్సిస్టు విమర్శనా దృక్పథమే వెల్లడవుతుంది. కనుక ఈ దృక్పథం గురించి ఒక అవగాహనకు రావడం ముందుగా అవసరం.

## 3.1.1. మార్క్సిస్టు విమర్శసూత్రాలు – దృక్పథం:

దృక్పథం విషయంలో జరిగిన విశ్లేషణాత్మక పరిశీలనలో కొంత వరకూ మార్క్సిస్టు విమర్శనా దృక్పథం తెలిసినా, దీనిపట్ల ఈరంగంలో ప్రసిద్ధులైనవారి అభిప్రాయాల్ని క్రోడీకరించటం వల్ల స్పష్టత, ప్రామాణికతలు చేకూరగలవు.

మార్క్సిస్టు విమర్శ సూత్రాల గురించి మార్క్స్ అభిప్రాయాలుగా ముదిగొండ వీరభద్రయ్య పేర్కొన్న అంశాలు[4].

(i) దృశ్య మాన వస్తువు ప్రతి దానిలోనూ పరస్పరం రెండు విరుద్ధ శక్తుల సంఘర్షించు కొంటూ ఉంటాయి.

(ii) పరిమాణం గుణంగాను, గుణం పరిమాణంగానూ నిరంతరం పరివర్తన చెందుతుంటాయి.

(iii) అభావాన్ని అభావం చేస్తుంటుంది ప్రక్రియ. ఈ మూడంశాలూ భౌతిక వాద తార్కిక మౌలికాంశాలు.

(అ) ఆయా దశల్లోని ఉత్పత్తి శక్తులకు అనుగుణంగా ఆయా ఉత్పత్తి సంబంధాలుంటాయి.

(ఆ) మానవుల భౌతికమైన ఉనికి (being) లేక అస్తిత్వం వారి చైతన్యాన్ని నిర్ణయిస్తుంది.

(ఇ) వ్యవస్థ మూలంలో ఉన్న ఆర్థిక వ్యవస్థే దాని ఉపరితల నిర్మాణాన్ని నిర్ణయిస్తుంది, నియంత్రిస్తుంది.

మూల సూత్రాలతో మార్క్సిస్టు దృక్పథం సాహిత్యంలోనూ అన్వయించి, విమర్శకులు రచనల్ని విశ్లేషించారు. విమర్శకుడిలో ఈ దృక్పథంతో పరిశీలించడానికి ఆధారాలేమిటో మరింత సరళంగా చర్చించడానికి సంజీవమ్మ ప్రయత్నించారు[5].

వీటిలో ముఖ్యాంశాల్ని కింది విధంగా క్రోడీకరించవచ్చు.

(i) రచనకున్న సామాజిక స్వభావం (గుణం) యాదృచ్ఛికంగా ఏర్పడిందా? దృక్పథం కలిగిందా? అవేది పరిశీలించాలి.

(ii) ఆ దృక్పథం సమాజాన్ని ముందుకు నడిపించేదిగా ఉండాలి.

(iii) రచన యొక్క ఔన్నత్యాన్ని నిర్ణయించటంలో గీటురాయి దాని కళాత్మకత మాత్రమే కాదని గమనించాలి. వస్తువు, పాత్రలు వాతావరణం - ఒక్క మాటలో చేప్పాలంటే canvas అవేది ఆరచనా కాలం నాటి సామాజిక పరిస్థితుల్లో ప్రగతి శీలం కావడం గీటురాయికావాలి.

(iv) రచనల్లో సామాజిక చైతన్యం,వాస్తవికతలకు ప్రాధాన్యత నివ్వాలి.

(v) రచనలోని శిల్ప సౌందర్యానికి తగిన ప్రాధాన్యతనిస్తూనే, రచనాతత్త్వాన్ని, రచనలోని వస్తుతత్త్వాన్ని పరిశీలించి విలువ కట్టాలి.

(vi) కళలు దీర్ఘ కాలిక మానవ సమాజ వికాస ఫలితాలనీ, మానవ శ్రమ జనితాలనీ గుర్తించాలి. భౌతిక ప్రపంచ వికాసమూ, మానవ సమాజ వికాసము వలెనే కళావస్తు రూపాలూ కొన్ని నిర్దిష్ట సూత్రాలకు అనుగుణంగా తప్పనిసరిగా చారిత్రకంగా ఒక ప్రత్యేక సామాజిక వ్యవస్థతో కళ సంబద్ధమై తమకు రూపమిచ్చిన సామాజిక వాస్తవాన్ని కళలు క్రియాశీలంగాప్రభావం చేస్తాయని గుర్తించాలి.

(vii) ప్రగతి శీలమైన సామాజిక మార్పులకు దోహదం చేసే సముచిత శక్తి సాధనంగా సాహిత్యం వుండాలి.

(viii)జీవితంలోని వాస్తవ విషయాల సారతత్త్వాన్ని అన్వేషించి వాటి తాత్త్విక ఆంతరం గ్రహించే శక్తి వాటిని సజీవంగా సృజనాత్మకంగా రచనలో రూపొందించే శక్తి ఉన్నప్పుడే వాస్తవికతా వాదం రచనలో సార్థకమవుతుంది. కనుక, ఈ సామాజిక వ్యవస్థను, దాని పరిస్థితుల్ని గురించిన (సిద్ధాంత పరమైన) అవగాహనతో కూడిన విమర్శనాత్మక విశ్లేషణ వాస్తవికతా వాద రచనలో కీలకమైన అంశమవుతుందనే వాస్తవికతావాదం పట్ల అవగాహన కలిగి ఉండాలి.

(ix) సమాజం గతిశీలమైందనే సిద్ధాంత అవగాహనతో పాటు చారిత్రక దృక్పథం కలిగి ఉండాలి.

(x) వ్యక్తుల మానసిక ప్రవృత్తులు రూపొందడానికి సమాజంలోని భౌతిక పరిస్థితుల పాత్ర కూడా చాలా ప్రభావమున్నదన్న విషయమూ, మానవప్రవర్తనను ప్రేరేపించేవి సామాజిక శక్తులనే విషయాన్ని గుర్తించి, సామాజిక చైతన్యపు వివిధ కోణాల్నీ, వికాసాన్ని సన్నిహితంగా అవగాహన చేసుకోవడానికి వీలుగా పాత్ర చిత్రణను పరిశీంచాల్సి ఉంటుంది.

(xi) భావచిత్రాలు, భాష రచనకు కళాత్మకత సంతరించి పెట్టడమే కాకుండా సామాజిక చైతన్యాన్ని ప్రతిఫలించేందుకు, సమాజ స్వరూపాన్ని విశ్లేషించేందుకూ పనికి వస్తుందనే అవగాహన అవసరం.

ఈ సూత్రాల్నీ, అంశాల్ని అవగాహన చేసుకున్నప్పుడు, మార్క్సిస్టు విమర్శనాదృక్పథం లో చరిత్రను నడిపించే శక్తుల్ని పరిశీలించడం, ఏ ఉత్పత్తికైనా, ఏ చారిత్రక కారణాలున్నాయో,నేపథ్యాన్ని,

తాత్త్వికాంశాల్ని తెలుసుకోవడం కవి/కావ్య కాలాల్ని, లక్ష్యాల్ని, చారిత్రక సామాజిక స్థితిగతుల్ని సమన్వయం చేసుకొంటూ, కావ్యసౌందర్యం, కవి లక్ష్యానికి ప్రోద్బలకంగా పనిచేస్తుందో లేదో గమనించాల్సి ఉంది. ఈ అవగాహనతో ఆరుద్ర రచనల్లో కన్పించే విమర్శనాత్మక దృక్పథాన్ని పరిశీలించడానికి ప్రయత్నించవచ్చు.

## 3.2. మార్క్సిస్టు దృక్పథంలో "వేమన":

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ఆరుద్ర, వేమన గురించి చేసిన ప్రసంగాలతో పాటు మరికొన్ని వ్యాసాల్ని కలిపి "మన వేమన్న" పేరుతో గ్రంథంగా వెలువడింది. వేమన పద్యాలకు ఆరుద్ర చేసిన వ్యాఖ్యానాన్ని "వేమన్న వేదం" గా ప్రచురించారు. ఇంకా "సమగ్ర ఆంధ్ర సాహిత్యం" మరికొన్ని వ్యాసాల్లో వేమన కాల, జీవిత, తత్త్వాలతోపాటు పద్యాల గురించీ సాధ్యమైనంత సమగ్రంగా వేమన పట్ల ఆరుద్ర, తన కున్న దృక్పథాన్ని వెల్లడించారు.

వేమన కాలాన్ని నిర్ణయించడంలో చారిత్రకదృక్పథాన్ని అనుసరించి వివిధ కాలాల్ని, గ్రంథాల్ని, రాజులకాలాల్నీ, పద్యాల్ని పరిశీలించి వేమన కాలం **1656** గా చెప్పిన తర్వాత మళ్ళీ **1627** గా ఊహించవచ్చని "మన వేమన" గ్రంథంలోనే చెప్పారు. (మ.వే.పు.**13,44**)

వేమన కాలాన్ని, స్థలాన్ని నిర్ణయించటంలో చారిత్రక, తులనాత్మక విమర్శనా దృక్పథాన్ని అనుసరించినా, భావజాలాన్ని వివరించటంలో ఆరుద్ర మార్క్సిస్టు విమర్శనా దృక్పథాన్నే అనుసరించారు. వేమనను గొప్ప తత్త్వవేత్తగా, దార్శనికునిగా అంగీకరిస్తూనే, సంఘంలో ఆతనికుండే చైతన్యాన్ని బట్టే ఉనికి ఉద్భవించిందనీ చెప్పి, అభ్యుదయ ప్రవక్తగా మారి ప్రపంచాన్ని మార్చడానికి ప్రయత్నించిన వాడు వేమన అని పేర్కొన్నారు. ( మన వేమన పు:**45**) వేమన చదువు కోలేదనీ, కొద్దిగానే చదువుకొన్నాడనీ కొంతమంది భావించగా, వీధి బడుల్లో చదువు చెప్పే భట్రాజు దగ్గర వేమన చదువుకొని ఉంటాడని ఆరుద్ర (మ.వే.పు : **48**) ఊహించి, దానికి తార్కాణంగా వేమన నేర్చుకొన్న పౌరాణిక ప్రభావం వల్లనే ముఖ్యంగా జన్మతః శైవుడై శైవమతంలో కన్పించే దురాచారాల్ని ఖండిస్తూ ఆటవెలది పద్యాల్ని చెప్పాడనీ, పిడపర్తి సోమన పద్య బసవపురాణాన్ని, ద్విపద ప్రభులింగ లీలల్ని సోదాహరణంగా నిరూపించారు. వీటిలో ఉన్న కొన్ని భావాలు బాల్యం నుండే వేమనపై తీవ్రప్రభావాన్ని చూపాయనీ, దాని వల్లనే శైవాచారాల్ని చాలా చోట్ల ఖండించటం కన్పిస్తుందనీ చెప్పి, ఆస్తికుల తత్త్వాలకన్నా, నాస్తికుల దర్శనాలే ఆదర్శవంతంగా ఉన్నట్లు వేమనకన్పించటం వల్ల (మ.వే.పు:**58**) చార్వాకులతోటి, లోకాయత శాస్త్రంతోటి ప్రగాఢ పరిచయం ఏర్పరుచుకోవడంతో భౌతిక దృష్టి ఏర్పడిందన్నారు (మ.వే.పు:**73**). ఈ దృష్టి కలగడం వల్లనే వేమన పరలోకాన్ని ఖండించారనీ చెప్పి, ధనం మనిషి జీవన స్థితిగతులకు మూలమవుతుందనీ, దీని గురించి తెలుసుకోమని బోధించారనీ (మ.వే.పు:**74**) వివరించారు. వేమనలో గల ఈ దృక్పథం ధనిక, పేదల మధ్య వ్యత్యాసాల్ని గుర్తించటమే కాకుండా, పేదవాడికి, ధనాన్ని పంచి పెట్టడానికి కీడు తలపెట్టయినా, ముచ్చటించైనా, కపటం చేతనైనా, తెగింపు చేతనైనా గొప్పవాడి సిరిచేతచిక్కించుకొని నిరుపేదకు పంచి పెట్టడం మంచిదనే విప్లవ ధోరణి వరకూ

వేమన తత్త్వచింతన వెళ్ళిందంటే వారిపై భౌతిక వాదమైన "లోకాయత" శాస్త్రాన్ని ఆయన తరచి చూశారని చెప్పక తప్పదని (మ.వే.పు: 75) ఆరుద్ర అన్నారు.

ఈ వ్యాఖ్య చేయడానికి రాళ్ళపల్లి వారు సేకరించిన వేమన పద్యాన్ని కూడా ఉదాహరించారు. (మ.వే.పు: 75) ఈ లోకంలో పొందలేని సుఖాల్ని బోధించే బౌద్ధ, జైనాల్ని కూడా ఖండించి, ప్రత్యక్షమే మూలప్రమాణమని నమ్మేది చార్వాకమని, మార్క్స్ చెప్పింది అనాడే చార్వాకులు చెప్పడం గమనార్హమనీ, (మ.వే.పు:98) అభ్యుదయ దృక్పథం గలవాళ్ళు ఏ యుగంలో నైనా శ్రామిక పక్ష పాతులేననీ, వేమన కూడా అంతే (మ.వే.పు:100) ననీ మార్క్సిస్టు దృక్పథంతో ప్రకటించారు. చార్వాకులు మార్క్సిస్టు భావనకు శాస్త్రీయత లేదనీ, మార్క్సిజం వచ్చిన తర్వాతనే సైద్ధాంతికంగా శాస్త్రీయంగా వివరించారనీ, ఆరుద్ర పేర్కొన్నారు.

ఆదిమ సమాజాల్లోనూ సామ్యవాద ఛాయలున్నా, అవి మార్క్సిస్టు సిద్ధాంతంలోని శాస్త్రీయతకు సాటిరావనే అభిప్రాయాన్ని వ్యక్తీకరించారు. వేమన పద్యంలోని **'సహన మొక్కటబ్బ చాలకష్టంబురా'** అనే పాదాన్ని వ్యాఖ్యానిస్తూ ఆరుద్ర సహనము బ్బినప్పుడే సమాజాన్ని అర్థం చేసుకోడానికి వీలుంటుంది. అప్పుడే సామ్యసంఘంగా మార్చడానికి సాధనాలు బుద్ధికి గోచరిస్తాయి. వాటిని ఆచరణలో పెడితే సాధనమున పనులు ధరలో సమకూరతాయి. ఆదిమ లోకాయత మతాన్ని పునః ప్రచారం చేసి ఆధునిక లోకాయుతమైన శాస్త్రీయ సామ్యవాదాన్ని ఆచరణలో పెట్టి వర్గర హిత సమాజ స్థాపనకు పాటుపడడమే ప్రాజ్ఞతకలవాళ్ళ ప్రథమ కర్తవ్యమన్నారు (పు: 104) 'మన వేమన' గ్రంథంలో ఆరుద్ర మార్క్సిస్టు విమర్శనా దృక్పథంతో పరిశీలించినట్లే *'వేమన్న వేదం'* లోనూ వ్యాఖ్యానం కొనసాగింది. ప్రత్యక్షంగా ఆరుద్ర ఆ గ్రంథంలో గల తన వ్యాఖ్యాన విధానాన్ని గురించి "వేమన పద్యాల్లో ఆదిమ శాస్త్రీయ సామ్యవాద బీజాలనూ, ఈ నాటి అతివాద నక్సలైటు సిద్ధాంతాల వేళ్ళనూ నేను గుర్తించి నా *'వేమన్న వేదం'* గ్రంథాన్ని రాశాను" అని *మన వేమన* గ్రంథం (పు:3) లో చెప్పుకున్నారు.

లోకంలో వేమన పద్యాలుగా వేలకొలదీ ప్రచారంలో ఉన్నాయి. పద్య సంఖ్య విషయంలో పరిశోధకుల్లో భిన్నాభిప్రాయాలు వ్యక్తమవుతున్నాయి. ఏవో కొన్ని పద్యాల్ని బట్టి మాత్రమే "వేమన" ను ఓ సిద్ధాంతానికి, ఓ దృక్పథానికి చెందినవాడని నిర్ణయించడం సరైన పరిశీలనగా భావించడానికి వీలు లేదు. కానీ, వేమన కొన్ని (40) పద్యాలకే ఆరుద్ర వ్యాఖ్యానం చెప్పినా, వేమన పై పరిశోధన కొనసాగించిన నేపథ్యాన్నంతటినీ పరిగణనలోకి తీసుకొని, వాటినీ పరిశీలిస్తూనే, ఈ వ్యాఖ్యానాల్నీ పరిశీలనలోకి తీసుకోవడం శాస్త్రీయ పద్ధతిలో పరిశీలించడమవుతుంది.

"వేమన్న వేదం" లో ఆరుద్ర వ్యాఖ్యానం మార్క్సిస్టు విమర్శనా దృక్పథాన్ని కలిగి ఉందనే కంటే, ఆ దృక్పథానికి వీలయ్యే పద్యాలకే వ్యాఖ్యానాన్ని కొనసాగించారనడం సమంజసం. వేలకొలదీ పద్యాలన్నింటినీ వ్యాఖ్యానిస్తే, భిన్నదృక్పథాలు వెలువడవచ్చు. ఈ విషయంలో పరిశోధకుల్లో వేమన పద్యాలగురించి ఎన్నో చర్చోపచర్చలు జరుగుతూనే ఉన్నాయి. ఆరుద్ర తనది అభ్యుదయ దృక్పథమని చెప్పుకోవడమే కాకుండా, ఈ గ్రంథానికి **"ఆముఖం"** రాస్తూ జి.వి. సుబ్రహ్మణ్యం "*వేమన కవితా*

అభ్యుదయ భావ ప్రచారానికి అభినవ సాధనంగా సమాదరింప బడుతున్నది, సామాజిక వ్యవస్థను సామ్యవాద దృక్పథంతో సమీక్షించి సామ్యశీలంతో సత్యాన్ని విశ్వజనీనంగా ప్రతిపాదించగలిగిన ప్రతిభావంతులుగా" ఆరుద్రను ప్రశంసించారు. (వే.వే.పు:7). ఈ "వేమన్న వేదం" వ్యాఖ్యాన గ్రంథంలో ఆరుద్ర విమర్శనా దృక్పథాన్ని, కొన్ని పద్యాలకు చేసిన వ్యాఖ్యానం చూసినా తేటతెల్లమవుతుంది.

"ఉర్వివారికెల్ల నొక్క కంచము పెట్టి
పొత్తుగుడిపి కులము పొలయజేసి
తలను చెయ్యిపెట్టి తగనమ్మ జెప్పరా
విశ్వదాభిరామ వినురవేమ" .

అనే పద్యానికి ఆరుద్ర చెప్పిన వ్యాఖ్యానం "సమాజంలో ఉన్న బాధలకు, దుఃఖాలకు, దురహంకారానికీ, దౌర్జన్యానికి, గర్వానికి, హైన్యానికి మూలకారణం వర్ణవ్యవస్థ, వర్గవిభజన అన్న సత్యాన్ని వేమన్న తెలుసుకున్నారు. మానవులలో ఎక్కువ తక్కువలు ఉన్నంత కాలం చిక్కులు తప్పవు" (వే.వే.పు: 9) సంపద జాతీయం కావాలనే మార్క్సిస్టు భావజాలంతోనే దీన్ని వ్యాఖ్యానించారని స్పష్టమవుతుంది.

మరొక పద్యానికి ఆరుద్ర వ్యాఖ్యానం:

"బాపడనగనేమి? భక్తుడనగనేమి?
భోగియనగనేమి సొంపు లేక
ఎన్ని పేరులైన ఇనజుడు పనితీర్చు // విశ్వ//

తమ కులాలకు ఎన్ని పేర్లు పెట్టుకున్నా కట్టకడపట యముడు అందరి పనీపడతాడు. చావడంలో అందరూ సమానులైతే బతకడంలో ఎందుకు సరి సమానులు కాకూడదు? లోకమంతా ఒకేకుటుంబం, లోకులంతా ఒకే కుటుంబంలోని వ్యక్తులు. ఎవ్వరూ పంక్తి బాహ్యులు కారు. అందరూ ఒక్కకంచాన తింటే అన్ని బాధలకూ హేతువైన కులభేదం రూపుమాసిపోతుంది. సఖ్యత ఉంటుంది. ఈ సత్యాన్ని లోకులు విశ్వసించేటట్టు తలమీద చేయివేసి ప్రమాణ పూర్తిగా చెప్పరా? అని ఆదేశం. (ఇటీవల కాలంలో సామ్యవాద సాధకులైన వామపక్షాల వారు కూడా తమ పార్టీ సభ్యులూ ఒకే కమ్యూన్ లో ఆరగించాలని నియమం పెట్టుకున్నారు.) (వే.వే.పు:10) అని బ్రాకెట్టుల్లో కూడా తన వైయక్తిక అభిప్రాయాన్ని వ్యాఖ్యానంలో చెప్పటం ఆరుద్ర విమర్శలో మార్క్సిస్టు దృక్పథం కన్పించడంలో ఎలాంటి సందేహాలకు చోటు లేకుండా చేస్తుంది.

'సమగ్ర ఆంధ్ర సహిత్యం' లో కూడా వేమనను చారిత్రక, సామాజిక దృక్పథాల నుండి పరిశీలించినా, తులనాత్మక పరిశీలన కన్పిస్తున్నా, అవన్నీ మార్క్సిస్టు విమర్శనా దృక్పథానికి అంతర్భాగం గానే కొనసాగాటం గమనార్హం!

"ఏమానవుడికైనా సంఘంలో ఆతనికుండే ఉనికిని బట్టే అతని చైతన్యం ఉద్భవిస్తుందిగాని, అతని చైతన్యాన్ని బట్టి ఉనికి ఉద్భవించదు. చైతన్యవంతులైన దార్శనికులు ప్రపంచాన్ని వ్యాఖ్యానిస్తారు. ప్రవక్తలు మాత్రమే ప్రపంచాన్ని మార్చడానికి ప్రయత్నిస్తారు. కొంతవరకూ కృతకృత్యులవుతారు. వేమన అభ్యుదయ ప్రవక్తలు" (స.ఆం.సా.సం. (viii) పు: **44**) అని ఆరుద్ర అనడంలో వేమనను మార్క్సిస్టు దృక్పథాంతో పరిశీలించడం కన్పిస్తుంది. గతంలోతాను ప్రతిపాదిస్తూ వేమన గురించి రాసిన గ్రంథాల్లోని అంశాల్నే సమగ్ర ఆంధ్ర సాహిత్యంలో కూడా సమర్థించుకోవడం పరిశోధకునిగా, విమర్శకునిగా ఆరుద్రలోగల నిబద్ధతకు నిదర్శనం!

వేమన జీవితకాలం పట్ల పరిశోధకుల్లో భిన్నాభిప్రాయలున్నట్లే, పద్యాలపట్లా ఆఅభిప్రాయం కన్పించడం వల్లనే ఆరుద్ర, మార్క్సిస్టు దృక్పథం ప్రాధాన్యతను సంతరించు కొంది. వేమనను ప్రజాకవిగా పరిశోధన చేసి నిరూపించిన ఎన్. గోపి, వేమన్న దృక్పథాన్ని గురించి తెలుసుకోవడానికి వేమన పద్యాల్లో ఏకసూత్రత సాధించవలసిఉందనీ[6], ఆరుద్ర సమన్వయం చేసిన లోకాయత మతానికి చెందిన అభిప్రాయాలు ఎలా అభివ్యక్త మయ్యాయో బలపర్చినా[7] ఆధునిక కాలంలో ప్రచారానికొచ్చిన ఆర్థికదృష్టి (మార్క్సిజం) తో ఏర్పడిన వర్గాలు కూడా వర్తించవు. వేమన్న ఆర్థిక భావాలతో ఆయన దృక్పథం ప్రస్ఫుటంగా వివరించబడింది. సాంఘిక, మత దురన్యాయాలపైనే వేమన్న యుద్ధం ప్రకటించాడు. మౌలికంగా వేమన్నది సంస్కరణ దృక్పథం అని ప్రకటించారు[8].

### 3.2.1. లోకాయత భౌతిక వాస్తవిక దృక్పథం :

వేమనను లోకాయత మతంలో ఉండే భౌతిక వాస్తవిక దృక్పథంతో పరిశీలించిన ఆరుద్ర, జైనమత ప్రభావం వల్ల గాని దిగంబరంగా మారారేమోననే అనుమానాన్ని వెల్లడించి (మ.వే. – పు:**69**) జైనం తర్వాతనే లోకాయత దృక్పథం కన్పిస్తుందనీ, అది నేటి మార్క్సిస్టు దృక్పథానికి దగ్గరగా ఉందన్నారు.

ఎన్. గోపి మాత్రం " వేమన భౌతిక వాదికాదు. అట్లాని వాస్తవ ప్రపంచానికి వీడ్కోలు చెప్పిన శుద్ధ వేదాంతీ కాదు. ఇహపరాల్లో వేటినీ ఆయన విడిచి పెట్టలేదు. అది, భౌతిక విషయాల కారణంగా భౌతిక విషయాలకు విఘాతం కలిగితే మాత్రం ఆయన సహించలేడు. వీటికి ఉదాహరణలుగా అనేకమైన పద్యాలను చూపవచ్చు" (పు : **354**) అన్నట్లే[9], ఆరుద్ర చాలా పద్యాల్ని "వేమన్న వేదం" లో వ్యాఖ్యానించి, మార్క్సిస్టు దృక్పథాన్ని ప్రదర్శించారు. కవిగా అభ్యుదయ వాద దృక్పథం ఉన్న ఆరుద్ర విమర్శలోనూ ఆ దృక్పథాన్ని ప్రదర్శించడానికి కారణమేమిటో, జ్వాలాముఖి, తదితర విమర్శకుల విశ్లేషణలను పరిశీలించడాన్ని బట్టి అవగాహన చేసుకొనేవీలుంది. '*సామాజిక వైరుధ్యాల మధ్య వేమన* ' ను విశ్లేషించిన జ్వాలాముఖి, వేమన జీవిత దృక్పథాన్ని వివరిస్తూ, "తన కాలం నాటి సామాజిక, ఆర్థిక, మత ప్రభావాలవల్ల మానసిక అశాంతితో సామాజిక సంక్షోభంలో పడి నలిగిపోయి, పృజవాత్మక అరాచకవాది గా ఫ్యూడల్ కవిగా" కన్పిస్తాడనీ[10], అతని జీవితవైఫల్యమే అతన్ని బజారు లో నగ్నంగా నిలిపిందని వేమన దిగంబరత్వాన్ని వ్యాఖ్యానించారు[11]. సామాజిక వైరుధ్యాలలో విరోధాభాస వాస్తవంగా కన్పించే వేమన భావజాలం సామాజిక అభివృద్ధి క్రమంలో అభ్యుదయ శక్తులతో మమేకం చెందలేదు. కారణం వేమన భావుకుడై వుండికూడా సమాజాన్ని తన చుట్టే

ఆలోచించాడు. కాని, తనచుట్టూ వుండే సమాజక్రమంలో తానూ ఒక భాగం అని నిగ్గుతేల్చుకోలేక పోయాడు. ఫ్యూడల్ భావజాలానికి ప్రతినిధిగా నిలిచిన వేమన ఫ్యూడల్ విలువల కనుగుణంగా సంస్కరణల్ని (పైమార్పుల్ని) నాటి మారుతున్న (వర్తకసమాజం) వత్తిళ్ళకు లోనై తెలియకుండానే ప్రతిపాదించాడన్నారు[12] ఇలాంటి జీవన తాత్త్విక భావాలు వేమనలో కన్పిస్తున్నా, వేమనలో కన్పించే సంస్కరణాభిలాషను సరైన సాంఘిక నేపథ్యంతో పరిష్కారాల్ని తొలగించి వివరించడం లక్ష్యం కావాలనీ, అధిక సంఖ్యాకులైన ప్రజల ప్రయోజనాన్ని సాధించిపెట్టే వేమన పద్యాల్ని విస్తృతంగా ప్రచారం చేయాలని పీడితుల ఐక్యతను దృష్టిలో పెట్టుకొని నూతన ప్రజాతంత్ర యుగ ధర్మంగా తిరిగి సాక్షాత్కరింప జేయడాన్ని విజ్ఞతగా జ్వాలాముఖి భావించారు.

వేమన జీవిత కాలం నాటికి, మార్క్సిస్టు దృక్పథం లేకపోయినా, మార్క్సిజంలో చారిత్రక, ఆది భౌతిక, సామాజిక, రాబోయే సమాజ పరిస్థితుల్ని విశ్లేషించే దిశగా కొనసాగుతుండటం వల్లనే ఆరుద్ర, వేమన సాహిత్యాన్ని మార్క్సిస్టు దృక్పథంతో పరిశీలించగలిగారు.

" *వైరుధ్య భావాలు వేమనలో కన్పించటానికి పద్యాలన్నీ వేమనవో, కాదో నిర్ధారించు కోవాల్సి ఉందనీ, వేమన పేరుతో సమకాలికులో, తరువాతి కాలం వారో రాసి ప్రచారంలో తెచ్చి ఉంటారనీ, (శమశక్తికి ప్రాధాన్యాన్నిచ్చే భావాలు వేమనలో కన్పిస్తాయనీ, గత చరిత్రలోని భిన్న దశలలోని ఆర్థిక సంబంధాలు, పరిస్థితులపైన ఆధారపడిన విభిన్న తాత్త్విక దృక్పథాలన్నీ ఆధునిక యుగంలో కూడా మన మానసిక క్షేత్రాలను, మన నిత్య జీవిత విధానంతో ఏ మాత్రం సంబంధం లేకుండా పాలిస్తూనే ఉన్నాయి. ఆధునిక శాస్త్రీయ దృక్పథంలో దాని నుంచి చీల్చుకొని రావలసి ఉంది*". అని కె.కె. రంగనాథా చార్యులు, 'తెలుగులో తొలి సమాజ కవులు'లో అనడంలో వేమన దృక్పథం సరిగ్గా తెలియాలంటే ఇంకా చాలా పరిశోధనలు జరగవల్సి ఉందనే సూచన మాత్రం స్పష్టమవుతుంది[14]. అంతవరకు వేమన పట్ల భిన్న దృక్పథాలు వెలువడుతూనే ఉంటాయనేది సత్యం!

## 3.3. శాస్త్రీయ దృక్పథంలో "గురజాడ":

గురజాడను ఆరుద్ర చాలావరకూ చారిత్రక, తులనాత్మక విమర్శనా దృక్పథంతో పరిశీలిస్తూ కవిలో కన్పించే అభ్యుదయ భావజాలాన్ని మార్క్సిస్టు దృక్పథంతోనే పరిశీలించి శాస్త్రీయ దృక్పథానికి ప్రాముఖ్యతనిచ్చారు. అయితే, వస్తువు (ఇతివృత్తం) తీసుకోవడంలోను, పాత్ర చిత్రణలోనూ పరిణామాన్ని నిరూపించడంలో మార్క్సిస్టు దృక్పథం కంటే, చారిత్రక, తులనాత్మక కవి జీవిత విమర్శనా దృక్పథమే ప్రధానంగా కన్పిస్తుంది. చారిత్రక విమర్శలో రచనాకాలం, నాటి పరిస్థితుల ప్రభావం, ఆ అంశాలు రచనలో ఇతి వృత్తం గా రూపొందడానికి కవిపై చూపిన ప్రభావం, వంటివన్నీ చేరతాయి[15]. తులనాత్మక పరిశీలనలో చారిత్రక పరిణామంతో పాటు, కవికి గల దృక్పథం భిన్న రచనల్లో వ్యక్తమైన తీరు వెల్లడవుతుంది. వీటన్నింటినీ శ్రద్ధగా పరిశీలించి గలిగినప్పుడే, కవిలో కన్పించే దృక్పథం వెల్లడవుతుంది. వివిధ చారిత్రక కారణాల వల్ల, జీవిత సంఘర్షణ వల్ల కవి ఏ దృక్పథానికి చెందుతాడో నిర్ణయించడం లో సందిగ్ధంలో పడే పరిస్థితుల్లో విమర్శకుడిలో అంతర్నిహితంగా ఉన్న దృక్పథాన్ని బట్టి ఆ కవి

ని అంచెనా వేస్తాడు. ఈ అంచనాను బట్టే మళ్లీ విమర్శకుడి దృక్పథం కూడా పరిశీలించడం సాధ్యమవుతుంది.

గురజాడ జీవితాన్ని, రచనలను ఆరుద్ర 'గురజాడ గురుపీఠం' లోనూ, 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' (11వ సంపుటి) లోనూ, ప్రత్యేక సంచికల్లో, పత్రికల్లో, వివిధ పుస్తకాలకు రాసిన 'ముందు మాట' ల్లోనూ ప్రకటించారు. అయితే, వీటన్నింటిలో కంటే, 'గురజాడ గురుపీఠం' గ్రంథంలో గల వ్యాసాల్లోనే ఆరుద్ర విమర్శనా దృక్పథం బాగా వ్యక్తమవుతుంది.

గురజాడ వేంకట అప్పారావు చాలామంది తెలుగు నవ్య కవిత్యానికి యుగకర్తగాను ఆధునిక కవిత్యానికి గురుపాదులు గాను అభ్యుదయ వైఖరితో సంపూర్ణమైన ప్రగతి శీల దృక్పథాన్ని ప్రదర్శించారని పేర్కొన్నారు[16] ఏ కవికైనా సరే అతని చుట్టూ ఒక సమాజం, ఆ సమాజానికొక చరిత్ర, ఆ చరిత్రకొక పరిణామం ఉంటాయి. సామాజిక, చారిత్రక పరిణామ గమనంలో కవియొక్క సాహిత్యస్థానం నిర్ణయమవుతుంది. కవి ప్రగతిశీలి, ప్రతిభాశాలీ అయితే, ఆ గమనాన్ని ఆతడు మరింత వేగవంతం చేస్తాడు. సామాజిక పరిణామానికి విప్లవ పంథాలో వేగం సాధించిన 'మహాకవి గురుజాడ అప్పారావు' కవి జీవించిన కాలంనాటి పరిస్థితుల్ని మార్చాలనీ, ప్రజల ఆలోచనల్లో మార్పులు తేవాలనీ వివిధ ప్రక్రియల్లో రచనలు చేశారు[17]. ఇలాంటి భావన మాత్రామే కాకుండా, 'దేశభక్తి' గేయంలో అంతర్జాతీయ దృక్పథాన్ని ప్రదర్శించారు. అప్పటికి గ్రాంథిక భాష చాలా పటిష్ఠంగా అమలు జరుగుతున్నా, సామాజిక పరివర్తన కోరిన కవి కనుక, ప్రజల వ్యవహారంలో ప్రజలలో సులభంగా వ్యాపించగలిగే నాటక ప్రక్రియను తీసుకొని "కన్యాశుల్కం" నాటకం రాయడం, సామాజిక సమస్యల్ని నిరసించడం వంటి తన రచనల ద్వారా కొనసాగించారు. పేరు ప్రఖ్యాతుల కోసం కాకుండా, సాంఘిక ప్రయోజనాన్ని ఉద్దేశించారు. "కన్యాశుల్కం" రాసేనాటికి తెలుగు రచయితగా స్థిరపడి, ఖ్యాతి సాధించాలనే తపన ఏమీ గురజాడలో కనపడలేదు[18]. సి. నారాయణ రెడ్డి, నవ్యకవిత్యానికి 'ఇద్దరు యుగకర్తలుగా రాయప్రోలు, గురజాడలను భావించినా ముందుగా గురజాడ నే పేర్కొన్నారు[19]. కె.వి.రమణారెడ్డి 'మహోదయం', శెట్టి ఈశ్వరరావు, శ్రీ శ్రీ వంటి వారి రచనలు గురజాడ స్థానాన్ని బహుముఖంగా విశదీకరిస్తున్నాయి. ఈ బాటలోనే చాలామంది విమర్శకులు గురజాడ రచనలు, జీవితాన్ని పరిశోధనాత్మకంగా అంచెనా వేయడానికి ప్రయత్నిస్తూనే ఉన్నారు. కొత్త కొత్త విషయాల్ని, కొత్త సమన్వయాల్ని వెలువరిస్తూనే ఉన్నారు. గురజాడ రచనలకంటే, వీరి రచనలపై వచ్చిన విమర్శ, పరిశోధనాత్మక పుటల సంఖ్యే ఎక్కువగా ఉంటుంది.

## 3.3.1. తులనాత్మక విమర్శ

గురజాడ జీవితాన్నీ, రచనల్నీ, ఆరుద్ర విమర్శనాత్మక పరిశోధన కొనసాగించి, తులనాత్మకంగా వస్తువునీ, పాత్రల పరిణామాన్ని విశ్లేషించినా, అంతిమంగా 'ఒక్కొక్క పాత్రలోని సొగసులు చూపించాలంటే ఒక్కొక్క పుస్తకమే వ్రాయాలి. ముఖ్యపాత్రల్ని పరిశీలించి, వాటిపట్ల అప్పారావుగారి ఉద్దేశ్యం, ఫిలాసఫీ, సందేశం ఏమిటో గమనించడమే ప్రస్తుతానికి వీలైనది' (గు.గు.పీ.పు:64) అని ఆరుద్ర అన్నారు. దీన్నిబట్టే చారిత్రక, తులనాత్మక విమర్శనా పద్ధతిల్ని ఉపయోగించుకొని గురజాడ అప్పారావు రచనల్లో

కన్పించే అభ్యుదయ దృక్పథాన్నీ, లక్ష్యాన్నీ, నిరూపించారు. గురజాడ "కన్యాశుల్కం" రచన చేయడంలో గానీ పూర్ణమ్మలో బాల్యవివాహాల సమస్యల్ని కరుణ రస ప్రధానం చేయడంలో గానీ, సోషల్ రిఫార్మ్, స్పోకెన్ తెలుగు అనే వాటినే మనసులో పెట్టుకున్నారు (గు.గు.పీ.పు:2) వీటి పాత్రల్లో చాలా పరిణామాన్ని తీసుకొని రావడానికి గల కారణం అప్పారావు దృక్పథంలో మార్పు రావడమే అని ఆరుద్ర న్నారు (గు.గు.పీ.పు:11) దీని వల్లనే మొదట మధురవాణికీ, మంజువాణికీ, సరళకీ చాలా తేడాలు కన్పిస్తూ, రెండవ మధురవాణి పాత్రను అప్పారావు జీవితంలో నుంచే తీసుకొన్నా, మెరుగులు పెట్టడానికి వసంతసేనను తీసుకొని (గు.గు.పీ.పు:32) ఉండాల్సిన ఔన్నత్యాన్ని అందుకొన్న ఆదర్శ మూర్తిగా తీర్చిదిద్దారన్నారు (గు.గు.పీ.పు:66) గురజాడ రాసిన, "కొండుభట్టీయం" లోని పాత్ర మంజువాణి, 'వసంత సేన' శూద్రకుడు రాసిన *మృచ్ఛ కటికం* లో కథానాయిక వేశ్యపాత్ర. సంస్కర్త హృదయం "స్టూపింగ్ టు రైజ్" అనే ఆంగ్ల కథలోని నాయక సరళ. మంజువాణీ, సరళ ఇద్దరూ వేశ్యపాత్రలే ! స్వయంగా ఓ వేశ్య ఇంటికి పరిశీలన నిమిత్తం వెళ్ళిన అప్పారావుతో వేశ్యకు మాత్రం నీతిలేదనుకున్నారా? అన్నదనీ, ఆ మాటకి ఆనందించి మధురవాణి పాత్రను పోషించడానికి ప్రయత్నించావని చెప్పుకోవడాన్నీ ఆరుద్ర పేర్కొన్నారు (గు.గు.పీ.పు: 31) వీటన్నింటినీ ఆరుద్ర పరిశోధనలో తెలుసు కోవటం జరిగినా దృక్పథం విషయంలోనే ఇక్కడ చర్చించుకోవడం అవసరమవుతుంది. వేశ్యకీ సమాజంలో ఉండే గౌరవమర్యాదల్ని చూసినపుడు చాలా చులకన భావం ఉండటం గమనించవచ్చు. వేశ్య సమస్యకి గల చరిత్ర, సామాజిక కారణాల్ని అన్వేషించాలనీ అప్పుడు ఆ సమస్యే తలెత్తదనీ, అంతవరకూ, ఆ సమస్య పై చులకన భావాలు తప్పించు కోవడానికే అప్పారావు "కన్యాశుల్కం" లో ప్రయత్నించారన్నారు (గు.గు.పీ.పు:64).

గురజాడ జీవిత రచనాతత్త్వాన్ని వ్యాఖ్యానిస్తూ ఆరుద్ర, నైతిక ప్రయోజనం సిద్ధించినా వీరిలో సంస్కరణాభిలాష కన్నా సాహిత్య శిల్పం కొన్ని కొంటె పనులు చేయించింది. ఇంత మారాడనుకున్న లుబ్ధావధాన్లలో పాతవాసనలు పోలేదని చూపించడమే వారి చాకచక్యానికి నిదర్శనం... విశ్వమానవ ప్రేమని మూర్తీభవింపచేయడమే అప్పారావు లక్ష్యం అని ఆరుద్ర అన్నారు. (గు.గు.పీ.పు:69) విశ్వ ప్రేమ అనేది అభ్యుదయ కవిత్వంలోని అంతర్జాతీయ దృక్పథాన్ని స్ఫురింపజేసే అంశం. అంతేకాకుండా, సమగ్ర ఆంధ్ర సాహిత్యంలో గురజాడ రచించిన దేశభక్తి గేయం గురించి వివరిస్తూ, కె.వి.రమణా రెడ్డి అభిప్రాయాన్నే ఆరుద్ర స్థిరపరిచారు[20]. ఆ అభిప్రాయం ..."భౌతిక సంపత్తి , కళా విలసనం, వ్యాపార వాణిజ్యాల ఇతోధికాభివృద్ధి, ప్రగతి దృష్టి, సార్వత్రిక శాంతి, పరస్పర సహాయ్య సహకార వైఖరి, జాతులమైత్రి,మతాల ఒద్దిక, సమాజంలోని అడ్డుగోడలనుకున్న వాటిని కూల్చి ఆటంకాలను రద్దుచేసి దేశమంతటా ఒకే ఆర్థిక విధానాన్ని అమలు పరిచి, స్వదేశీ పరిశ్రమలు పెంపొందించుకొని, ఇతర జాతులతో వర్తక వాణిజ్యాలు సాగిస్తూ దేశాల నడుమ గల వైమనస్యాలను తొలగించి ప్రపంచమంతటా ఏకైకమైన ఆర్థిక వ్యవస్థను ఏర్పాటుచేసుకోవాలని కోరుతున్న మధ్యమ వర్గ భావజాలమే ఈ గీతంలో అడుగుడుగునా కన్పిస్తుంది. "పరులకలిమికి పొర్లి" ఏడ్వ గూడదన్నప్పుడు కలిమిలేములు అసమానతలు ఉన్నవి ఉన్నట్లుగానే కొనసాగడం అటుంచి, వ్యక్తి ఆస్తి భద్రతకు ఆస్కారం ఏర్పడుతుంది. అప్పారావు మానవతా వాదము ఆకాలానికి అభ్యుదయకరమే అయితే, దేశభక్తి గేయంలో అభ్యుదయ భావాలున్నా,

ఆంధ్ర రాష్ట్రంలో మాత్రం అభ్యుదయ రచయితల సంఘం, **1943** కి గాని ఒక రూపానికి రాలేదు. పోనీ, అప్పటికే భారతదేశంలో ఆ భావజాలం, ఆపేరుతో కొనసాగుతుందనీ చెప్పడానికి వీలులేదు. కానీ, **1935** నాటికే మార్క్సిస్టు దృక్పథంలో ప్రభావితులై రచనలు కొనసాగిస్తున్నారు. **1935** లోనే భారతదేశంలో 'అఖిలభారత అభ్యుదయ రచయితల సంఘం' రూపుదిద్దుకొంది. శ్రీ శ్రీ "మహాప్రస్థానం" రాసే నాటికి కూడా మార్క్సిస్టు దృక్పథం తో రాయబడుతున్న రచనలకి కూడా 'అభ్యుదయ సాహిత్యం' అనే పేరు రూఢికాలేదు. **1940** తర్వాత మహాప్రస్థానం గేయం ప్రచురణ పొందిన తర్వాత నే అభ్యుదయ కవిత్వమనే పేరు వ్యాప్తిలోకి వచ్చింది[21]. అయినప్పటికీ , కందుకూరి, గురుజాడ వంటి వారిని 'ఆంధ్ర అభ్యుదయ రచయితలు' ఆదర్శంగా స్వీకరించి, వారి భావజాలాన్ని ప్రచారం చేయడంలో అభ్యుదయ దృక్పథమే కారణమనేది గమనించ వలసివుంది. ఈ దృక్కోణంతో పరిశీలించినప్పుడు, 'దేశభక్తి' గేయంలోని విశ్వజనీన ప్రేమను ఆరుద్ర సమర్థించి, మార్క్సిస్టు విమర్శనా దృక్పథాన్నే ప్రదర్శించారని తెలుస్తుంది. ఈ దేశభక్తి గేయాన్ని శ్రీశ్రీ సమస్త ప్రపంచ మహాజనుల జాతీయగీతంగా ప్రశంసించారు[22]. ప్రాంతపు టెల్లలను,దేశ సీమలను జలధులను దాటిన విశాలదృష్టి ప్రదర్శించి, అంతర్వాహినిగా విశ్వప్రేమను ఈగేయంలో ప్రకటించారని గురజాడ గురించి సినారే అన్నారు[23].

రచనకుండే గుణం సమాజాన్ని ప్రగతి శీలంగా ముందుకి నడిపించేటట్లు రూపొందినదైయ్యేటట్లు, సామాజిక మార్పులకు సాధనంగా ఉపయోగ పడేటట్లు, సృజన జరగడమే కాకుండా, చరిత్ర గతిని ముందే నిర్ణయించే స్వభావం మార్క్సిజంలో ఉండటం వల్ల, ఆరుద్ర మార్క్సిస్టు దృక్పథంతో విమర్శనాత్మక పరిశోధన కొనసాగించి,శాస్త్రీయ దృక్పథానికి మార్గాల్ని తెరిచారు. నిజానికి గురజాడ మార్క్సిజం చదవలేదు. ఆయన ఆలోచనల్లో వర్గ సంఘర్షణ చోటు చేసుకోలేదు. అయినా, ఆయన రచనల్లో ఒక ముఖ్యమైన మార్క్సిస్టు లక్షణం వుందని కొంతమంది[24] విమర్శకులు పేర్కొనడాన్ని బట్టి కూడా ఆరుద్ర గురజాడ రచనల్ని మార్క్సిస్టు దృక్పథంతో పరిశీలించడం శాస్త్రీయ మైన దని తెలుస్తుంది.

## 3.3.2. పరిశోధనాత్మక విమర్శ

గురజాడలో పింగళిసూరన, వేమనల ప్రభావం కూడా కన్పిస్తుందన్నారు ఆరుద్ర (గు. గు. పీ. పు: **106**) పింగళి సూరన, కళాసిద్ధాంతాల్ని, వేమన సామాజిక స్పృహను ఆకళింపు చేసుకొని జాతిని మేల్కొలిపిన కవిగా గురజాడను అంచెనా వేశారు. పింగళిసూరన లక్షణ గ్రంథం కాకుండా కళాపూర్ణోదయం కావ్యం రాసినా, స్వతంత్ర కల్పనతో సృజనాత్మక కళనుఎలా ప్రదర్శించ వచ్చో నిరూపించడం, ఆ కాల్పనిక జగత్తు స్థానంలో సమకాలీన సమాజ స్వరూపాన్ని తన ప్రతిభా విశేషాలతో ప్రతిఫలింప జేయవచ్చుననేది గ్రహించి ఉంటారనేది వీరి అభిప్రాయం కావచ్చు. గురజాడ చేసిన స్వతంత్ర రచనల్లో సామాజిక స్పృహను నిక్షిప్తం చేయడంలో సూరన కళాసిద్ధాంతాల్ని, వేమన స్పృహనీ ఆకళింపు చేసుకున్నాడనే ఆరుద్ర పరిశీలన లోతైనది. గురజాడ కంటే ముందుగా, కాలమాన పరిస్థితుల దృష్ట్యా చూసినా తెలుగు సాహిత్యంలో సామాజిక స్పృహగల కవులు వేమన, కందుకూరి, గురజాడలు కన్పిస్తున్నా,

వేమనను సంస్కరణవాదిగా (మ.వే. పు:397), కందుకూరి వీరేశలింగంలో కన్పించే సంఘ సంస్కరణ, సాహిత్య ప్రక్రియలను ప్రారంభించడాన్ని గమనించి, ఆధునికాంధ్ర సాహిత్య ప్రక్రియలను ప్రారంభించడాన్ని విస్మరించకుండా కందుకూరిని 'ఆధునికాంధ్ర సాహిత్య నిర్మాత' గానూ, గురజాడను 'ఆధునికాంధ్ర సాహిత్య జనకుడు' గానూ పేర్కొని (గు.గు.పీ.పుట:111) అభ్యుదయ యుగ కర్తగా శ్రీ శ్రీ ని ప్రకటించడం ఆరుద్ర కున్న తెలుగు సాహిత్యం పట్ల గల లోతైన అవగాహన వెల్లడవుతుంది. ఇది కూడా ఆరుద్రకున్న విమర్శనాత్మక పరిశోధనా దృక్పథాన్ని పట్టిచ్చే అంశమవుతుంది.

## 3.3.3. సంయమన విమర్శన దృష్టి:

గురజాడను విమర్శనాత్మకంగా పరిశీలించడంలో తన పరిశోధనకు ఈ విమర్శను అంతర్భాగంగా చేసుకోవడం వల్ల, చాలా సంయమనంతో చారిత్రక, తులనాత్మక విమర్శనాపద్ధతుల సహకారాన్ని తీసుకొన్నారని తెలుస్తుంది. కానీ, ఎక్కడా మార్క్సిస్టు దృక్పథం అని పేర్కొనలేదు. దీనికో కారణం కూడా కన్పిస్తుంది. 'కన్యాశుల్కం' లో సౌజన్యరావు, మధురవాణికి భగవద్గీత నిస్తాడు. దీన్ననుసరించి గురుజాడ భగవద్గీతను ఎంత గౌరవిస్తారో తెలుస్తుందన్నారు ఆరుద్ర (గు.గు.పీ.పు:87). అంతేకాకుండా అప్పారావు హేతు వాదే కాని, నాస్తికులు కారు. ఆయన భగవద్గీత వైపు మొగ్గుతారు. కళకు ప్రయోజనముందని గుర్తించి, కళకోసమే కళ అన్నవాదాన్ని ఖండించినా, ఆయన కర్మసిద్ధాంతాన్ని పరోక్షంగా అంగీకరిస్తున్నట్లు కనపడుతుందన్నారు (గు.గు.పీ.పు:87) అంతటితోనే ఆగిపోకుండా, అప్పటికి సోషలిజం సిద్ధాంతాలు గురజాడకి పరిచయం కాకపోవచ్చు నన్నారు (గు.గు.పీ.పు:87) కె.వి.రమణారెడ్డి ఈ విషయంలో చెప్పిన వ్యాఖ్యానం 'తర్కదృష్టితో కర్మ సిద్ధాంతం సత్తాను చూపి మెచ్చడమే గాని, దాన్ని మొత్తంగా తాను ఒప్పేసుకోవడమేమీకాదు' అనే వాదాన్ని ఖండించి, అప్పారావు కర్మసిద్ధాంతాన్నే నమ్ముతున్నారన్నారు ఆరుద్ర (గు.గు.పీ.పు: 87). ఈ విషయం లో సోమయాజుల వెంకట రామమూర్తి అభిప్రాయాన్ని చూస్తే, "*భగవద్గీతలోని శ్రీకృష్ణ భగవానుని యుపదేశము లక్ష్యము అరిషడ్వర్గాన్ని చంపుకొనేందుకు ప్రయత్నిస్తుంటాడు, సౌజన్యరావు సార్థకనామధేయుడని*' అని తెలుస్తుంది[25]. ఇదే సంకలన గ్రంథంలో కేతవరపురామకోట శాస్త్రి అభిప్రాయం ఇలా ఉంది[26]. అమానుషంగా పరిణమించిన సాంఘికధర్మం ఇక సాగటానికి వీలు లేదని, దాన్ని సుమానుషంగా మార్చడానికి తోడ్పడుతున్న పుస్తకం గదా ఇది, తనకు తన రచనల మీద వున్న పూర్ణ విశ్వాసాన్ని ఎవరు ప్రకటిస్తే బాగావుంటుందో అని ఆలోచించి - అందుకు సౌజన్యరావును ఎన్నుకొన్నాడు గనుక, అప్పారావు గారి ప్రతినిధిగా సౌజన్యరావు కూడా మన విశ్వాసం చూరగొంటున్నాడు". ఎస్. గంగప్ప ఇదేవిషయాన్ని మరో కోణం నుండి చూశారు[27]. "ఈ హాస్యం అవహేళన (satire) చమత్కారయుతము (wit) అయినప్పుడు మరింత మనోజ్ఞంగా ఉంటుంది. బంట్రోతు గాయత్రి ప్రమాణం చేసి" ఇన్నాళ్ళకి జంఝప్పోగు వినియోగంలోకి వచ్చింది. థియోసోఫిస్టులు చెప్పినట్లు ఓల్డుకస్టమ్స్ అన్నిటికి యేదో ఒహప్రయోజనం ఆలోచించే మనవాళ్ళు యార్చరిచారు. ఆత్మానుభవం అయితేనే గాని తత్త్వం బోధపడదని వ్యాఖ్యానించడంలో సెటైర్ ఉంది" అలాగే వేదమంత్రాలను ఎద్దేవా చేసి నవ్వుపుట్టించడం సంప్రదాయంపై దెబ్బతీయడమవుతుంది వంటి

వ్యాఖ్యానాల్ని చూస్తే,సౌజన్యరావు, మధురవాణికి భగవ ద్గీత ను ఇవ్వడంలో, గురజాడ లక్ష్యం కొంత స్ఫురించే అవకాశం ఉంది. "భగవ ద్గీత–మార్క్సిజం" గ్రంథంలో ఆర్వీయార్, కర్మ, భక్తి సిద్ధాంతాలను చర్చించి, సమస్యల నుంచి పారిపోయె దారినే భగవద్గీత చూపిస్తుందనీ, శ్రామిక జనవిముక్తి పోరాటాన్ని ముందుకు సాగనివ్వదు అన్నారు[28]. ఈ అభిప్రాయాన్ని లోతుగా ఆలోచిస్తే, మరి ఏదృక్పథంతో సౌజన్యరావు చేత మధురవాణికి 'భగవ ద్గీత'ను ఇప్పించారనే తాత్త్విక అంశాల పట్ల ఆరుద్ర విమర్శనాత్మక శక్తి తెలుస్తుంది. సౌజన్యరావు ద్వారా గురజాడ సంఘ సంస్కరణను ఆశించారని చాలామంది విమర్శకులు చెప్పారు. గురజాడ పాత్ర రూపంగా సౌజన్యరావు లో ఉన్నాడన్నవారూ ఉన్నారు. కనుక, ఆరుద్ర చాలా సంయమనాన్ని పాటిస్తూ, ఒక 'విమర్శనాత్మక పరిశోధకుడు'గా రాగద్వేషాలకు అతీతంగా, గురుజాడ రచనల్లో మార్క్సిస్టు ధోరణులు కన్పిస్తున్నా, అప్పారావుహేతువాదే కాని, నాస్తికులు కాదని తన నిర్ణయాన్ని ప్రకటించారు.

గురజాడ అప్పారావు సంధ్యావందనం చేస్తూండేవారని లేఖల వల్ల కూడా తెలుస్తుంది. కనుక, పరిశోధక విమర్శకుడుగా ఆరుద్ర, గురజాడను అంచనా వేయడంలో సంయమనాన్ని పాటించారు.

## 3.4. శ్రీ శ్రీ పట్ల ఆరుద్ర వైయక్తిక విమర్శ:

శ్రీ శ్రీ (శ్రీ రంగం శ్రీనివాసరావు) విషయంలో ఆరుద్ర కొన్ని వైయక్తిక అనుభూతులకు లోనైనట్లు కన్పిస్తుంది. అభ్యుదయ కవిగానే కాకుండా "అభ్యుదయం" అనే పేరుతోనే ఓ క వితను రాసినవాడు శ్రీ శ్రీ[29]. ఆరుద్ర, శ్రీ శ్రీ బంధువులు. ఇద్దరూ కొన్నాళ్ళు మద్రాసులో కలిసి బతికినవారు[30]. మార్క్సిస్టు జెండాల్ని మోసినవారు. పార్టీ సమావేశాల్లో పాల్గొన్నవారు. మొదట్లో ఆరుద్రని, శ్రీ శ్రీ ప్రోత్సహిస్తూ, కవిత్వంలో గల లోటుపాట్లను తెలియజేసినవాడు[31]. అలాంటి శ్రీ శ్రీతో సైద్ధాంతిక విభేదాలు రావడంతో ఇరువురూ తీవ్రంగా విమర్శించుకున్నారు. ఈ విమర్శలు వైయక్తికమైతే పరిశోధకుడుగా ఆరుద్రను గాని, కవిగా శ్రీ శ్రీ ని గాని పట్టించుకో వల్సిన పనిలేదు. కానీ,ఈ విమర్శలవల్ల సాహిత్యానికి కొంత నష్టం వాటిల్లింది. అభ్యుదయ, విప్లవ కవిగా మార్క్సిస్టు దృక్పథాన్ని ప్రదర్శించిన శ్రీ శ్రీ లోనూ కొన్ని ఇజాల పట్ల తొణికిసలాట కన్పిస్తున్నా, ప్రధానంగా కన్పించేది మార్క్సిజమే! దీన్ని సూటిగా విమర్శకుడు, పరిశోధకుడు నిరూపించవలసిన అవసరం ఉంది. కానీ, తనతో సంబంధ బాంధవ్యాలు సక్రమంగా కొనసాగినంత కాలమూ ఒక పద్ధతిలోనూ, తర్వాత మరొక రకంగానూ విమర్శను కొనసాగించడం ఒక విమర్శకుని దృక్పథాన్ని పట్టి చూసినప్పుడు సద్విమర్శ ను కొనసాగిం చలేదని నిరూపితం కావడం తప్పదు. ఆరుద్ర లో శ్రీ శ్రీ పట్ల ఇలాంటి విమర్శనా దృక్పథం కన్పిస్తుంది. సమగ్ర ఆంధ్ర సాహిత్యంలో కొన్ని విషయాల్లో ఆరుద్ర వ్యాఖ్యానాలు ఈ విషయాన్ని నిరూపిస్తున్నాయి. వాటిని కింద విధంగా పరిశీలించవచ్చు.ఆరుద్ర, శ్రీ శ్రీ పట్ల వ్యక్తీకరించిన కొన్ని అభిప్రాయాల్ని యధాతథంగా కింద పేర్కొనడం ద్వారా ఆరుద్ర దృక్పథం స్పష్టమవుతుంది.

*"శ్రీ శ్రీ, అరవింద ఘోష్‌ను ఎప్పుడూ "అరవిందఘోస్టు" అని పేర్కొనేవాడు. "*
(స.ఆం.సా.13 సం.పు:96)

"మహాప్రస్థానం గీతానికి నజ్రుల్ ఇస్లామ్ కవితా, హరీన్ రాసిన 'ఘురూహూ హైజంగ్ అనే పాటా, శిష్ట్లా రచించిన 'మారో – మారో – మారో' అనే పాటా, ప్రోద్బలాలనీ, అయినా తన గీతరచనకు ఉత్తేజిత మిచ్చినవే వో 'చిరకాలం' దాకా శ్రీ శ్రీ చెప్పలేదని'. (స.ఆం.సా. 13.పు.146).

"రుక్మిణీనాథశాస్త్రి చెప్పిన కొత్త కవులంతా తన అనుయాయులే అని ధ్వనిస్తూ "శ్రీ శ్రీ పద్యాలనే వాడుడు" అనే గీతం శ్రీ శ్రీ రాశాడు.

"రెండు ట్వింకిల్ ట్వింకిల్ థియేటర్ స్టార్లు
రెండు ఆరుద్రాభిషేకాలు
రెండు రిక్షాపై మౌన శంఖాలు
రెండు విజ్జియార్భాటాలు
రెండు హనుమత్ శాస్త్రాలు
రెండు నమస్కరించ దగ్గ నారాయణాస్త్రాలు
రెండు సామరహిత ఫిడేలు రాగారా బాలు
రెండు పఠా పిఠా కఠోర కుఠారాలు"
రెండు గోరా వీణా వినాయకా రాగాలు'

ఈ పాదాలలో లిటిల్ థియేటర్ ఉద్యమాన్ని నడిపిన అబ్బూరివారూ, నేనూ (ఆరుద్ర) మౌన శంఖం వ్రాసిన నారాయణ బాబూ, విజ్జియార్ రాసిన సింగరాచార్య, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రీ, విశ్వనాథ సత్యనారాయణ, పఠాభీ, పిఠాపురం యువరాజా, గోరాశాస్త్రి అందరూ శ్రీ శ్రీ ప్రభావంలోని వాళ్ళే అన్నది కవిహృదయం. కాని, వాస్తవానికి వీళ్ళంతా శ్రీ శ్రీ హృదయంలో మెదిలే కవి సింహాలు, సింహ కిశోరాలు" (స.ఆం.సా.13వ సం.పు.287).

"శ్రీ శ్రీ సాహిత్య జీవితంలో పరిస్థితులకు వ్యక్తిగత జీవితంలో పరిస్థితులకు సమన్వయం సైకాలజిస్టులే చేయగల ప్రయత్నం". (స.ఆం.సా.13 వ సం.పు.264).

ఇవన్నీ సమగ్ర ఆంధ్ర సాహిత్యం 13వ సంపుటిలో శ్రీ శ్రీ పట్ల ఆరుద్ర చేసిన వ్యాఖ్యలు. ఆరుద్ర తన "గురజాడ గురుపీఠం"లో 'సంకల్పం' శీర్షికతో ముందు మాట రాసుకొంటూ....

"జాడ్యం ముదిరినవాడు తానే ఆద్యుడనుకొంటాడు. 1972 లో నేనూ ఈ పాతికేళ్ళ సాహిత్యం అనే వ్యాసంలో ఇతగాడు 1939దాకా తెలుగు సాహిత్యం నన్ను నడిపించింది ఆ తర్వాత నుంచీ దాన్ని నేను నడిపిస్తున్నానని నిస్సార స్వోత్కర్ష చేసుకున్నాడు. బండి చక్రం మీద నున్న ఈగ ఆ బండిని తానే కదిలిస్తాననుకొంటుంది. చారిత్రక, భౌతిక వాది ఎవరూ యిలా అనుకోరు. 1930 నుంచీ తెలుగు సాహిత్య చరిత్ర 'శ్రీ శ్రీ' స్వీయ చరిత్ర అనికూడా ఆ ప్రబుద్ధుడు నొక్కి వక్కాణించాడు" (గు.గు.పీ.పు.v) అని అన్నారు.

**1981** లో వేగుంట మోహన ప్రసాద్ "This Tense Times" అనే తెలుగు కవితల ఆంగ్లానువాదాల సంకలనంలో "Dedicated to the memory of my father and presented to Sri Sri the Father of Modern Telugu Poetry" అని అంకిత వాక్యాలు రాయడాన్ని ఆరుద్ర అంగీకరించలేదు. దీన్ని ఆరుద్ర ఖండించినట్లే రోణంకి అప్పలస్వామి కూడా వ్యతిరేకించిన ఉత్తరాన్నీ, కథనాన్ని పేర్కొన్నారు (గు.గు.పీ.పు:vi) అంతేకాక, శ్రీ శ్రీ తనను కాదన్న వారిపై విరుచుకు పడ్డారనీ, వార్థక్యంలో గురివింద గింజవాడిలా ప్రవర్తించారని ఆరుద్ర వ్యాఖ్యానించారు. "శ్రీ శ్రీ" నిఅభ్యుదయ కవిత్వానికి యుగకర్తగా చాలా మంది అంగీకరిస్తున్నారు[32].

**1930** నుంచి ఎలా ఉన్నా, **1947** నుండి **1955** సంవత్సరాల మధ్య వెలువడిన అభ్యుదయ కవుల కవితా సంకలనాల్ని పరిశీలిస్తే శ్రీ శ్రీ ప్రభావానికి లోను కాని అభ్యుదయ కవి కన్పించడని రామమోహన్ రాయ్ పేర్కొన్నారు[33] ఇలాంటి అభిప్రాయాలు విమర్శకుల్లో ఉండగా, ఆరుద్ర కూడా శ్రీ శ్రీ తో సైద్ధాంతిక విభేదాలు రాకముందు అభ్యుదయ కవి, విప్లవకవిగా శ్రీ శ్రీ గురించి చెప్పారు[3]. ఈ అభిప్రాయం **1955-69** లలో "రాసిన కలంచిత్రాలు " లో సంప్రదాయం తెలిసిన విప్లవకారుడు, తెలుగు తనం జీర్ణించుకున్న జగత్ పౌరుడు గా కూడా అభివర్ణించారు[34]. డా.సి.నారాయణ రెడ్డి తన సిద్ధాంత గ్రంథంలోనూ శ్రీ శ్రీ ని 'అభ్యుదయకవి' గానే చెప్పారు[35].

ఆరుద్ర, శ్రీ శ్రీ, అబ్బూరి వారితో తర్కించి కవిత్వంగా రాసిన "సాహిత్యోప నిషత్ " లో శ్రీ శ్రీ అభిప్రాయంగా కవి ప్రగతి శీల భావాలు కలవాడు కావాలని ఆకాంక్షించినట్లు వర్ణించడంలో మార్క్సిస్టు దృక్పథాన్ని తనదైన దృక్పథంతో ప్రకటించడం కన్పిస్తుంది[36].

శ్రీ శ్రీ అభిప్రాయంగా ఆరుద్ర రాసిన కవిత్వంలో శ్రీ శ్రీ పట్ల ఆరుద్ర దృక్పథం దీనిలోనూ తెలుస్తుంది. అయితే అంతకు ముందే స్వయంగా శ్రీ శ్రీ 'దేశ చరిత్రలు' లో ఈ భావాల్ని మరింత స్పష్టంగా కవిత్వీకరించారు[37]. దీన్ని "చరిత్ర నిర్మాతలు ప్రజలు. ఏరాజులో వారి తాబేదారులో కాదు. అన్న చారిత్రక భౌతిక వాద దృక్పథాన్ని కవితామయం చేసి, ప్రతిభావంతంగా రాసినవాడ"ని ఎస్వీ. సత్యనారాయణ, శ్రీ శ్రీ లో కన్పించే మార్క్సిస్టు దృక్పథాన్ని వివరించారు[38]. ఇంత స్పష్టంగా చెప్పక పోయినా, డొంక తిరుగుడు పద్ధతిలోనైనా శ్రీ శ్రీ ని అభ్యుదయ కవిగా, మార్క్సిస్టు దృక్పథంలోనే ఆరుద్ర వివరించడం తప్పలేదు. శ్రీ శ్రీ ని డిస్కవర్ చేయడమే కాక, నజ్రుల్ఇస్లాం గీతాలను ఎన్నింటినో మూలం నుండి చదివి వినిపించి, శ్రీ శ్రీ తిరుగుబాటులో తిప్పిన ఘనత నిస్సందేహంగా పురిపండాఅప్పలస్వామికే దక్కుతుంద నడంలో బలవంతంగా మార్క్సిజం లోకి శ్రీ శ్రీ లాక్కొని రాబడ్డాడు గాని స్వతహాగా రాలేదనేది స్ఫురించేటట్లు ఆరుద్ర వ్యాఖ్యానించారు. **(స.ఆం.సా.13వ.సం.పు.119).**

ట్రాట్స్ స్కీ 'రష్యా విప్లవం' 'క్రో పాట్కిన్' 'విప్లవ సందేశం' బుఖారిన్ 'చారిత్రక భౌతిక వాదం' ఇంకా ఇటలీ విప్లవ కారుడు 'మజ్జినీ చరిత్ర' సామ్యవాద సిద్ధాంతాల పట్ల శ్రీ శ్రీ ని ప్రభావితం చేశాయన్నారు. అలాంటి శ్రీ శ్రీ ప్రత్యక్షంగా పార్టీకార్య కలాపాల వల్ల మార్క్సిస్టు సిద్ధాంతం తెలియదని తానే చెప్పుకున్న ఉదంతాన్ని వివరించి, ఆదిలో మార్క్సిస్టు లైను లోకి శ్రీ శ్రీని

తీసుకొచ్చిన అబ్బూరి వారు ఎంత ప్రయత్నించినా' అతణ్ణి ఆ దారిలోంచి ప్రక్కకి తప్పించలేక పోయారన్నారు. (స.ఆం.సా.13వ.పు.106)

శ్రీ శ్రీ జీవితాన్నీ, రచనల్నీ విమర్శించడంలో ఆరుద్ర వ్యవహరించిన తీరుని పరిశీలించిన విమర్శకులలో కెవియార్ వంటివారు, తమ విచారాన్ని వ్యక్తం చేశారు[39]. కవి దాశరథి కూడా దీన్ని 'అనారోగ్య కర విమర్శనారీతి'గా వ్యాఖ్యానించారు[40].

"రుధిరజ్యోతిర్దర్శనం (సోమసుందర్) పుస్తకానికి పీఠికరాస్తూ" ఆరుద్ర, శ్రీ శ్రీని కించపరిచే మాటలు రాయటం న్యాయమనిపించదు. శ్రీ శ్రీ వైపు నుండి తీవ్రమైన శరాఘాతాలు వచ్చినపుడు ఆరుద్ర ఉపేక్షిస్తే, బాగుండేది. అభ్యుదయ యుగకర్తగా శ్రీ శ్రీకి ఇవ్వవలసిన సముచిత స్థానాన్ని పనిగట్టుకొని భంగపరచ జూస్తున్నట్లు ఇటీవల ఆయన రచించిన కొన్ని వ్యాసాలవలన అనిపిస్తున్నది" అని ఆరుద్ర అభినందన సంచిక లోనే రామమోహన్‌రాయ్ 'ఆరుద్ర ఆనందహేల' అనేవ్యాసం (ఆ.అ.సం.పు: 28) లో విమర్శించారు. దీన్ని ఆరుద్ర తన అభినందన సంచిక నుండి తొలగించకుండావే ప్రచురించడం విశేషం! ఇదే సంచికలో దేవులపల్లి రామానుజరావు 'ఆరుద్ర కవితలో భావప్రాధాన్యతతో పాటు అభ్యుదయ దృక్పథం ఒక ప్రత్యేకత, శ్రీ శ్రీ పక్కన నిలువదగిన కవి ఆరుద్ర' (ఆ.అ.సం.పు:109) అని రాస్తే, నండూరి రామమోహనరావు'అభ్యుదయకవిత్వానికి ఆదిరుద్రుడైన శ్రీ శ్రీ ఆరుద్రమ ఆరో రుద్రుడనీ పేర్కొన్నాడు. నిజానికి ఆరుద్ర రెండోరుద్రుడు, శ్రీ శ్రీ తర్వాత వెంటవే స్ఫురించే పేరు ఆరుద్రదే. అభ్యుదయ కవిత్వానికి ఒకరు మార్క్స్, మరొకరు ఏంగెల్స్ (ఆ.అ.సం.పు :71) అని పేర్కొన్నారు. ఆరుద్ర జీవితం, రచనలపై పరిశోధన చేసిన ఎల్. సంగయ్య, ఆరుద్ర పై మార్క్స్ సిద్ధాంత ప్రభావం ఉంది (పు:112) అని పేర్కొంటే, ఆరుద్ర షష్టిపూర్తి అభినందన సంచిక (1985) కి సంపాదకుడుగా వ్యవహరించిన బి.ఎస్.ఆర్. కృష్ణ 'శ్రీ శ్రీ – ఆరుద్ర'ల మధ్య వివాదాన్ని గురించి రాస్తూ 'కొందరికి కోపం, కొందరిలో నిరసన, మరికొందరిలో విచారం కలిగించాయి. వారి వారి ఆలోచనా ధోరణులను బట్టి ఈ తరతమ భేదాలు.. వ్యక్తివికాసం అందరిలో ఒకే లాగ మూసపోసినట్టు జరగదు. ఊహతెలిసి, ఊహలు పెరిగిన కొలది సాలోచనాపరుల ఆలోచనలు వివిధ దశలలో వేరువేరు దిశలు విస్తరిస్తుంటాయి. శ్రీ శ్రీ ఒక సిద్ధాంతానికి నిబద్ధుడైన కవికాగా, ఆరుద్ర ఏ ఒక్క సిద్ధాంతమూ పరిపూర్ణమైనది కాదన్న నమ్మికతో పూర్ణమానవవాది అయినాడు' (ఆ.అ.సం.పు: 122) అని ఇరువురి దృక్పథాల్ని విశ్లేషించారు. ఈ షష్టిపూర్తి సభలోనే అధ్యక్షోపన్యాసం చేసిన జస్టిస్ చిన్నప్ప రెడ్డి హేతు సమ్మితమై శాస్త్ర గతమైన దృక్పథంతో కానీ పాత అంతా రోత అనక, నవ్యతను గ్రహిస్తూ నవీన మార్గాలను సూచిస్తూ, రచయితగా, విమర్శకునిగా పయనిస్తాడనీ, ఆరుద్ర ఆలోచనలమీద, రచనలమీద మార్క్సిజం వెలుగు ప్రసరించడం వల్ల మార్క్సిస్టు,హ్యూమనిస్టు అనొచ్చు (ఆ.అ.సం.పు:11,12) అన్నారు.

ఇంతమంది అభిప్రాయాల్లో కూడా శ్రీ శ్రీ, ఆరుద్ర ల దృక్పథాలు వెల్లడవుతున్నాయి. శ్రీ శ్రీ – ఆరుద్ర ల్లో భిన్న దృక్పథాల కన్పిస్తున్నా, శ్రీ శ్రీ లో మార్క్సిస్టు దృక్పథం స్పష్టంగా కన్పిస్తున్నా, కొన్నిసార్లు మార్క్సిస్టు వ్యతిరేక తాత్విక ఆలోచనలూ కన్పిస్తున్నాయి. ఎ స్వీ. సత్యనారాయణ

మాటల్లో దీనికి సరైన సమన్వయాన్ని చూడగలిగే అవకాశం కన్పిస్తుంది. "సాహిత్యాన్ని తానొక్కడే శ్రీ శ్రీ నడిపిస్తున్నాననే భావం ఇలాంటి వాటిలో ఒకటి. కవిత్వరూపం విషయంలో శ్రీ శ్రీ ప్రకటించిన భావంకూడా ఇలాంటిదే. ఇవన్నీ శ్రీ శ్రీ లాంటి ప్రజాకవి స్థాయిని తగ్గించవు కానీ, ఆయన ఓ సందర్భంలో రాసినట్లు పక్లిక్కున నిలబడితే ఏమైనా అంటాం అనే వాళ్ళకు అవకాశం కల్గించాయన్నదే బాధ"[41] ఇక, ఆరుద్ర అన్నట్లు 'సైకాలిజిస్టులు' కూడా శ్రీ శ్రీ కవిత్వం అలా వెలువడడానికి గల కారణాల్ని విశ్లేషించారు. జీవితంలో తటస్థించిన కొన్ని పరిస్థితుల వల్ల సర్రియలిజం వంటి కవిత్వాన్ని రాయడానికి కారణమన్నారు. కానీ, ఈ దృష్టితో ఆరుద్ర ఆ వ్యాఖ్య చేయకుండా, వ్యక్తిగత రాగద్వేషం కన్పించడం వల్ల ఆరుద్ర విమర్శనా దృక్పథం, శ్రీ శ్రీ విషయంలో ప్రత్యేకించి కొంత కళంకాన్ని ఆపాదించుకొన్నదనే చెప్పాలి. పురాణం సుబ్రహ్మణ్య శర్మ భావించినట్లు శ్రీ శ్రీ - ఆరుద్రల విభేదాలు జాబిల్లి మీద మరకలు వంటివి కాదు. ఇరువురి వ్యక్తిత్వాల్లోనూ పెరగడాలు, తరగడాలు లేదనడం సరైందికాదు.

వివిధ దృక్పథాలు 'ఆరుద్ర' లో కన్పిస్తున్నాయని తన అభినందన సంచికలో ప్రకటించినా, ఏ విధమైన దృక్పథం తనదో, ఒక మాట కూడా ప్రకటించక పోవడం ఆరుద్ర ను ఆలోచించవలసిన పరిస్థితినే కల్గిస్తుంది.

ఏది ఏమైనా శ్రీ శ్రీ జీవితం, రచనల పట్ల ఆరుద్ర విమర్శనాత్మక దృక్పథంలో సూటిగా చెప్పే లక్షణం కొరవడినా, కవి జీవిత కావ్యసమన్వయ విమర్శను ఉపయోగించుకొని చారిత్రక, సామాజిక విషయాల్ని వివరిస్తూ, శ్రీ శ్రీ పట్ల ఆరుద్ర మార్క్సిస్టు విమర్శనా దృక్పథాన్నే ప్రదర్శించారని స్పష్టమయ్యింది.

## 3.5. "వ్యాసపీఠం" లో భిన్న దృక్పథాల సంగమం:

పత్రికల్లో ఆరుద్ర రాసిన కొన్ని వ్యాసాల సంకలనం "వ్యాసపీఠం". ఈ గ్రంథంలో "భగవద్గీత పుట్టుపూర్వోత్తరాలు". "బ్రిటనులో వామపక్ష పత్రికలు" వంటి వ్యాసాల్లో మార్క్సిస్టు విమర్శనా దృక్పథం కన్పిస్తుంది."భగవద్గీత", వర్ణవ్యవస్థను సంరంక్షించే గ్రంథమని, దీనివల్ల సమసమాజ నిర్మాణం సాధ్యంకాదనీ, దానికి శాస్త్రీయసామ్యవాదమే సాధనం కావాలని వ్యాఖ్యానించారు. (వ్యాసపీఠం. పు.65) భగవద్గీతకు సంబంధించిన కొన్ని వ్యాఖ్యానాల్ని పేర్కొని, పరిశోధనా గ్రంథాల్ని పరిశీలించి, ఇపుడు ప్రచారంలో ఉన్న భగవద్గీతను ముగ్గరు వ్యక్తులు వేర్వేరు కాలాల్లో రచించారన్నారు. ఆ ముగ్గరు ఎవరో పేర్లు ప్రకటించకుండా, ప్రథమాచార్యుడు, ద్వితీయాచార్యుడు, తృతీయాచార్యుడు అని పేర్కొన్నారు (ఆ.వ్యా.పీ.పు.63) కొన్ని చారిత్రక కారణాల వల్ల ప్రథమాచార్యుడు ఉన్నత వర్గాల ప్రయోజనం కోసం; రెండవ ఆచార్యుడు తాత్త్వికుల కోసం రాస్తే; తృతీయాచార్యుడు మాత్రం ఆర్తుల కోసం జిజ్ఞాసుల కోసం రాసి, అన్యదేవతా భక్తులను తనదైవానికి భక్తులను చేయదలిచాడని ఆరుద్ర వివరించారు. (ఆ.వ్యా.పీ.పు.64) ప్రథమాచార్యుడు క్రీ.పూ. 600కు పూర్వుడనీ, ద్వితీయాచార్యుడు క్రీ.పూ. 600-500 మధ్య, తృతీయాచార్యుడు క్రీ.పూ. 300-200 మధ్య కాలాలకు చెందినట్లు పేర్కొన్నారు.

(ఆ.వ్యా.పీ.పు.64) ఖైర్ రచించిన 'క్రైస్ట్ ఫర్ రియల్ గీత్ గ్రంథాన్ని' ఉదాహరించి (ఆ.వ్యా.పీ.పు.62) గీత మారాలంటే, మరికొన్ని పరిశోధనలు చేయాలని ముగించారు. ఈ పరిశీలనలో కొంత మార్క్సిస్టు విమర్శవాదృక్పథం కన్పిస్తున్నా, వర్ణ, వర్గ రహిత సమాజం రావాలనే దృక్పథమే ఈ వ్యాసంలో ప్రధానంగా కన్పించే ప్రతిపాదన.

ఇక, ఈ దృక్పథంతో రాసిన "బ్రిటనులో వామపక్ష పత్రికలు వ్యాసంలో" "శాస్త్రీయ సామ్యవాదాన్నే తమ మతంగా, అభిమతంగా ఎంచుకొనే నాకు సహజంగానే శ్రామికుల పత్రికలు బ్రిటనులోని కార్మికులు గురించి ఏంరాస్తుంటాయో చదవాలన్న తహతహ, నిజం తెలుసుకోవాలనే ఆకాంక్ష"తో కొన్ని పత్రికల్ని పరిశీలించినట్లు రాశారు. శాస్త్రీయ సామ్యవాదాన్ని విశ్వసించే వారు మిగిలిన పత్రికలకంటే తక్కువపుటలైనా, ఎక్కువ ధరైనా, "మార్నింగ్ స్టారు" పత్రికను కొని చదువు కొంటారని (ఆ.వ్యా.పీ.పు: 292) రాశారు. ఇదేకాకుండా కమ్యూనిస్టు పార్టీకి చెందిన "కమ్యూనిస్ట్ ఫోకస్ మార్క్సిజం టుడే" వంటి మాస పత్రికల స్వభావాల్ని వివరించారు. (ఆ.వ్యా.పీ.పు.293) బ్రిటన్‌లో కమ్యూనిస్టు ఉద్యమాల్లో ఉన్న చీలికల్ని పత్రికలు ప్రకటిస్తుంటాయనీ, వీటన్నింటినీ ఆలోచిస్తుంటే 'ప్రపంచ కార్మికులారా ఏకంకండి' అనే నినాదానికి ముందు 'ప్రపంచ కమ్యూనిస్టు లారా ఏకంకండి'అనే నినాదం ముఖ్యమనిపిస్తోంది. ఎందు చేతనంటే ఏ శాస్త్రీయ సామ్యవాదవర్గానికైనా ధ్యేయం ఆర్థిక విధానమైన 'వార్త'ను మార్చడమే సమస్త సమాజ స్థాపన కనుక (ఆ.వ్యా.పీ.పు: 296) అని ముగించారు. భారతదేశం లో కమ్యూనిస్టు చీలికల్ని, అంతర్జాతీయంగా కమ్యూనిస్టు పార్టీల్లో కన్పిస్తున్న చీలికలతో పోలుస్తూ, ఇవన్నీ ఏకం కావాలనీ, లేకపోతే భిన్నవైరుధ్యాలు, సడలింపులు జరగనన్నాళ్ళూ సమసమాజ స్థాపన సాధ్యం కాదనే మార్క్సిస్టు విమర్శనా దృక్పథంలో ఒక అంశం ఆరుద్ర విమర్శలో కన్పిస్తుంది.

'ఏకలవ్యుడి పుట్టు పూర్వోత్తరాలు' 'ఖడ్గ తిక్కనా – కవి తిక్కనా" 'గుండెలు బాదుకోవాల్సిన టెన్నీసన్' వ్యాసాల్లో తులనాత్మక విమర్శ కన్పిస్తుంది. ఏకలవ్యుని కథ ఆంధ్ర మహాభారతంలో కొద్దిగానే కన్పిస్తుంది. 'సమగ్ర కథనం' కావాలంటే సంస్కృత భారత, హరివంశాలను, తెలుగు హరివంశాల్ని పరిశీలించవలసి ఉంటుందనీ, వాటిని సోదాహరణంగా వివరించారు. పాండవులు, ఏకలవ్యుడు మేనత్త, మేనమామ బిడ్డలవుతారనీ, ఆంధ్ర మహాభారతంలో ఆయా రచయితలు తమ దృక్పథాలను బట్టి ఏకలవ్యుణ్ణి ఓ సంఘటనకు ఉపయోగించుకున్నారని తులనాత్మక పరిశోధకుడుగా ఆరుద్రలో ఫలితాంశాల్ని గమనించవచ్చు. ఖడ్గ తిక్కనా, కవి తిక్కనా వేర్వేరని సమకాలీన కావ్యాల్ని తులనాత్మక విమర్శచేసి నిరూపించి, కేతన 'దశకుమారచరిత్ర' ను ఆధారంగా చేసుకొని 'ఖడ్గ తిక్కన – కవి తిక్కన' ల వంశవృక్షాన్ని కూడా వివరించారు. దీన్ని సమగ్ర ఆంధ్ర సాహిత్యంలో పరిశోధనగానే వాడుకున్నారు. 'గుండెలు బాదుకోవాల్సిన టెన్నసన్' వ్యాసంలోనూ తులనాత్మక విమర్శ కన్పిస్తుంది. ఆంగ్ల కవి ఆల్‌ఫ్రెడ్ టెన్నీసన్ (1809–1892)కీ, తెలుగు కవి గురజాడ కీ గల పోలికల్ని, తేడాల్ని ఈ వ్యాసంలో విమర్శనాత్మకంగా పరిశీలించారు. టెన్నీసన్ "ఇన్‌మెమోరియం" గురుజాడ వారు 'కన్యాశుల్కం' లను ఇద్దరూ పెంచుకొంటూపోయారని (ఆ.వ్యా.పీ.పు.232) ఇన్‌మెమోరియం లో నాలుగు పాదాల నూతన ఛందస్సులో రచించావని మురిసిపోయారనీ, అలాగే గురజాడ "ముత్యాలసరం" అనే ఛందస్సు ఒక పార్శీగజల్ నడకను దృష్టిలో పెట్టుకొని నూతన

ఛందస్సుని సృష్టించానని రాసుకున్నారనీ, ఇద్దరినీ అప్పటికే అవివాదుకలో ఉన్న ఛందస్సులేనని ఆరుద్ర వ్యాఖ్యానించారు (ఆ.వ్యా.పీ.పు.**234**) టెన్నీసన్ కి ముందే ఉన్న లార్డ్ హెర్బెర్ట్ అనేకవి ఈ ఛందస్సుని ప్రయోగించారని, అలాగే తెలుగులో గురజాడ కంటే ముందు కందుకూరి రుద్రకవి రాసిన 'సుగ్రీవ విజయం' లో ముత్యాలసరం ఛందస్సు ఉందన్నారు. (ఆ.వ్యా.పీ.పు.**234**). ప్రస్తుతం ఆరుద్రలో కన్పించే తులనాత్మక విమర్శనా దృక్పథాన్ని మాత్రమే పరిశీలించినప్పుడు టె న్నిసన్‌కీ, గురజాడకీ గల పోలికల్ని ఎలా వివరించారో, చివరికేమి నిర్ణయించారో తెలుసుకోవడమే ప్రస్తుత లక్ష్యం. టెన్నీసన్-గురజాడ ఇద్దరికీ రాజాశ్రయం లభించిందనీ, తేడాల విషయంలో టెన్నిసన్ చనిపోయిన తర్వాత వ్రాతపతుల్ని, గ్రంథాల్ని భద్రపరిచేందుకు విశ్వవిద్యాలయాలు కృషిచేయగా, గురజాడ రచనల విషయంలో విశాలాంధ్ర వంటిప్రచురణ సంస్థలు ముద్రిస్తున్నాయన్నారు. కానీ, రాష్ట్రవ్యాప్తంగా ఉన్న విశ్వవిద్యాలయాల్లో గురజాడ రచనలపై పరిశోధనలు, అధ్యయనాల నిమిత్తం గ్రంథాలయాలు సేకరిస్తున్నాయనేది గమనించాల్సిన విషయమే అయినా, సమగ్ర రచనల్ని ప్రభుత్వపరంగా ముద్రించడం లేదన్నది ఆరుద్ర నిర్ణయంగా కన్పిస్తుంది.

## 3.5.1. స్థలనామాలు–శాస్త్రీయ దృక్పథం:

"శాస్త్రీయదృక్పథం" కన్పించే వ్యాసాల్లో 'స్థలనామ పరిశోధన సంఘం ఆవశ్యకత' 'ఇంటిపేర్ల నిఘంటు నిర్మాణం' పేర్కొనదగినవి. భాషాశాస్త్ర, సామాజిక, చారిత్రక విషయాల్ని ఆధారంగా చేసుకొని విమర్శను కొనసాగించడం ఈవ్యాసాల్లో కన్పిస్తుంది. రాజమండ్రి అనే స్థలనామాన్ని ఒకదాన్ని శాస్త్రీయంగా నిరూపించడానికెలా ప్రయత్నించారో కింది విశ్లేషణను పరిశీలిస్తే ఆరుద్ర శాస్త్రీయ పరిశోధనా పద్ధతి స్పష్టమవుతుంది. పరిశోధనలో విమర్శను ఎలా అంతర్భాగం చేయగలిగారో అర్థమవుతుంది.

సాహిత్యంలో నన్నయ్య, శ్రీనాథుడు, విన్నకోట పెద్దన్న వంటి కవులు పేర్కొన్న "రాజమహేంద్ర" "రాజమహేంద్రవరం" "రాజమహేంద్ర పురం" వంటి రూపాల్ని తీసుకొని, బూదరాజు రాధాకృష్ణ పరిశోధనా గ్రంథాన్ని, చారిత్రక ఆధారాల్ని పరిశీలించి "రాజమహేంద్రం" అనే ప్రాచీన రూపం నుంచి "రాజమండ్రం" అనే లోక వ్యవహారం ఏర్పడి, ఆంగ్ల ప్రభావం వల్ల రాజమండ్రి రూపం సిద్ధించిందన్నారు. (ఆ.వ్యా.పీ.పు.**86**)

వ్యాసపీఠంలో గల వ్యాసాల్లో కన్పించే పరిశోధనాంశాలు ఆయా శీర్షికలతో పరిశీలించిన విభాగాల్లో గమనించడం వల్ల, ఆరుద్రలో కన్పించే వివిధ పరిశోధనా దృక్పథాలు స్పష్టమవుతాయి. ఈ వ్యాస సంకలనంలో ప్రధానంగా మార్క్సిస్టు, తులనాత్మక, విమర్శనా దృక్పథాలు కన్పిస్తున్నాయనేది పై పరిశీలన వల్ల స్పష్టమయ్యింది.

## 3.6. 'ప్రజాకళలూ– ప్రగతివాదులూ' మార్క్సిస్టు దృక్పథం:

'ప్రజాకళలూ - ప్రగతివాదులూ' గ్రంథాన్ని, ఆరుద్ర రాసిన కొన్ని ఎంపిక చేసిన వ్యాసాల్ని సంకలనంగా ఆరుద్ర షష్టి పూర్తి సందర్భంగా ప్రజాశక్తి ప్రచురణాలయం వారు ప్రచురించారు. దీనిలో మోటూరి

హనుమంతరావు 'ముందుమాట'లో ఆరుద్ర రచనల్లో కన్పిస్తున్న అభ్యుదయ భావాల్ని, మార్క్సిస్టు విమర్శనా దృక్పథాన్ని గమనించవచ్చు ననీ, ఆరుద్ర రాసిన కవితా ఖండికల్ని, వ్యాసాల్ని సోదాహరణంగా వివరించారు. కానీ 'అరసం' లో గాని 'విరసం' లో గాని దేనిలోనూ ఆరుద్ర చేరలేదని స్పష్టంగా ప్రకటించారు. మార్క్సిస్టు అరుణ పతాకాన్ని సాహిత్యపు వినువీధుల్లో నిలిపిన ఘనుడనీ, అన్ని కళలనూ పీడిత ప్రజల ప్రయోజనం కోసం ప్రయోగించదలచిన మార్క్సిస్టుగా ఆరుద్రను ఆయన అభివర్ణించారు. (ప్ర.ప్ర.పు.2-4) మార్క్సిజం ఒక్కటే మానవాళికి మహత్తర శాస్త్రంగా ఆరుద్ర భావించారన్నారు.

ఈ వ్యాస సంకలనంలో ఆరుద్ర ప్రధానంగా మార్క్సిస్టు విమర్శనాదృక్పథాన్ని అనుసరించారు. తెలుగు ప్రజల కళారూపాల గురించి వివరిస్తూ ఆదిమ వర్గ రహిత సమాజాల్లో కళలన్నీ కూటి పెంపుదల కోసం తోడ్పడే ప్రపంచకరమైన విద్యలేననీ, శ్రమలోంచి శ్రమకోసం కళలు పుట్టాయన్నారు. (ప్ర.ప్ర.పు.5) భరతుని నాట్యశాస్త్రంలో కళలపుట్టుక దైవసంబంధంగా వివరి స్తే, ఆరుద్ర దాన్ని ,సామాజిక, చారిత్రక పరిణామ అభివృద్ధి గా చెప్పటంలో మార్క్సిస్టు దృక్పథం కన్పిస్తుంది. అరవై నాలుగు కళలుగా పేర్కొంటున్న కళల్లో జీవనాధార విద్యలెలా నిబిడీకృతమై ఉన్నాయో చక్కగా విశ్లేషించారు. (ప్ర.ప్ర.పు.8) పశువుల శరీరాన్నుండి చర్మాల్ని తీసే నేర్పు, చర్మాన్ని మృదువుగా చేసే నేర్పు, వస్త్రాలు నేయడం, ఇళ్ళు కట్టే విద్య, బొమ్మలు చేసే విద్య వంటివన్నీ గ్రామ సుఖ జీవనానికి అవసరమైనవన్నారు. కళల్లో సంప్రదాయ, జానపద కళలుగా ఎలావిడిపోయాయో సామాజిక విశ్లేషణ చేసి చూపారు. (ప్ర.ప్ర.పు.20) వీటిలో ప్రజాకళారూపాల్లో కొన్నింటితో ఫ్యూడల్ విలువల్ని ప్రచారం చేసే సాధనాలుగా పాలకులు వాడు కొంటున్నారనీ, వాటితోనే అభ్యుదయ రచయితలు ప్రజానాట్యమండలి కాళాకారులు సామ్యవాద ప్రచారానికి వినియోగించుకోవటం జరుగుతుందనీ, తాము నమ్మే సిద్ధాంతాన్ని జనం దగ్గరకి తీసుకొని వెళ్ళాలంటే ప్రజా కళారూపాలే ప్రబల సాధనాలవుతాయనే సూచన చేస్తున్నారు (ప్ర.ప్ర.పు: 22) 'దేశమంటే మట్టికాదు మనుష్యులే గాని మనుషులంటే అత్యధిక సంఖ్యాకులైన శ్రమజీవులే'నని వారి ప్రయోజనానికి కళల్ని ఉపయోగించుకొని వర్గరహిత సమాజ నిర్మాణానికి మార్గాలు వేయాలన్నారు. (ప్ర.ప్ర.పు:34) శ్రమజీవుల దర్శనమే మార్క్సిజం అని (ప్ర.ప్ర.పు:171) ఈ వ్యాసంలో మార్క్సిస్టు దృక్పథాన్ని వ్యక్తం చేశారు.

జానపద సాహిత్యాన్ని కూడా మార్క్సిస్టు దృక్పథంతో ఆరుద్ర అధ్యయనం చేయడం ఒక ప్రత్యేక అంశంగా కన్పిస్తోంది. జానపదులు కాపాడుకొంటున్న 'జాంబవ పురాణం' వంటివి అష్టా దశ పురాణాల్లో వేటికీ తీసిపోవనీ, కళల్ని కొంతమంది తమ వర్గ స్వలాభాల్ని సంరంక్షించుకోవడానికే పరిమితమై ఉంటుందన్నారు (ప్ర.ప్ర.పు:36) ప్రగతి వాదులు మాత్రమే ప్రజలకోసం ప్రజా కళారూపాల్ని ప్రచారం చేస్తారన్నారు (ప్ర.ప్ర.పు:37) సోవియట్ రష్యాలో జానపద కళారూపాలు నిజంగా ప్రజలకి సద్వినియోగమై, శాస్త్రీయ సామ్యవాద వ్యాప్తికి తోడ్పడ్డాయన్నారు (ప్ర.ప్ర.పు: 38).

నృత్యకళాకారిణి బాల సరస్వతి (1918-1984) కి బాష్పాంజలి ఘటిస్తూ రాసిన వ్యాసంలో, ఆమె ప్రతిభను పేర్కొని, మరణాన్ని గురించి వాఖ్యానిస్తూ స్వర్గ నరకాల పట్ల నమ్మకాలు లేవనీ, ఉంటే శ్రీనాథుడు, చేమకూర వేంకటకవివలే పద్యాలు వర్ణించే వాడిననీ, కానీ, వాటి పట్ల నమ్మకం

లేక పోవడం వల్లనే బాలమ్మ (బాలసరస్వతి ని కొంత మంది అలాపిలిచేవారు!) అభినయకళ అవనిలోనే అనవతరం వుండిపోతుంది. తనకళ ఎక్కడుంటే బాలమ్మ అక్కడే వుంటుంది (ప్ర.ప్ర.పు:74) అని ముగించడంలో మార్క్సిస్టు సిద్ధాంతం పట్ల ఆరుద్రకు నమ్మకమున్నట్లు, ఆ ఆలోచనా ధారతో విమర్శ కొనసాగించినట్లు స్పష్టమవుతుంది.

చలన చిత్రాల్లో ఇతివృత్తాన్నీ, దృశ్యచిత్రీకరణలో దర్శకుని ప్రతిభనూ, కళ కళకోసమా? ప్రజల కోసమా? అనే ప్రశ్నలొచ్చినప్పుడు, ప్రజల పక్షం వహించాల్సిన అవసరం ఉందని బి.నరసింగరావు నిర్మించిన 'రంగుల కల' చిత్రాన్ని చక్కగా మార్క్సిస్టు దృక్పథంతో విమర్శించారు. చిత్రంలో కథానాయకుడు రవి మొదట్లో ఏమాత్రం సామాజిక స్పృహను కళలో వ్యక్తం చేయకుండా బ్రతికేస్తుంటాడు. నిత్యం సమస్యల్లో కొట్టుమిట్టాడే ప్రాంతంలో జీవిస్తున్నా, దాన్నేమాత్రం తన చిత్రాల్లో ప్రతిఫలించడానికి ప్రయత్నించడు. ఒక రోజు అనారోగ్యానికి గురి కావడం, సాటి కార్మికులు టీ ఇచ్చి ఆదరించడం, కొన్నాళ్ళపాటు రవిలో కొత్త ఆలోచనకు దారితీస్తుంది. తర్వాత రవి పికాసో చిత్రాన్ని వేస్తాడు. కార్మిక సంఘాల సమావేశాలకు వెళతాడు. సంక్షిప్తంగా కథ ఇది. దీనిలో కళాత్మకతను సామాజిక పురోగతికి తోడ్పడేటట్లు దర్శకుడు నరసింగరావు నిర్మించిన పద్ధతిని చాలా చక్కగా విశ్లే షించారు ఆరుద్ర.

ప్రపంచ దేశాల్లో వచ్చిన యుద్ధాలు, వాటి ఫలితంగా కళాకారుల్లో వచ్చిన ఆలోచనా ధోరణుల్ని పేర్కొని, వారిలో పికాసో గురించి ఆరుద్ర వివరించారు. స్పెయిన్ అంతర్యుద్ధంలో వివిధ దేశాల కళాకారులు ప్రజల పక్షానపోరాడి ప్రాణాలిచ్చిన చారిత్రక వాస్తవాన్ని విశ్లేషించి, పాబ్లోపికాసో (1881-1973) శిల్పలక్షణాల్ని వివరిస్తూ, జీవితంలో అంతర్భాగంగా శిల్పం ఎలా పెనవేసుకుందో వివరించారు. విద్వాన్ విశ్వం "**ఒకవాడు**" కావ్యానికి విశ్వనాథ సత్యనారాయణ రచించిన, "తొలిమాటల్లోని" శిల్పలక్షణాలు వేరు, జీవితం వేరు - భిన్న సిద్ధాంతాలు వెలువడవచ్చుననే దాన్ని ఆరుద్ర ఖండించారు (ప్ర.ప్ర.పు:93) **పికాసో** జీవితం శిల్పలక్షణాలు వేరని భావించలేదు కనుకనే, హిట్లర్ పంపిన వైమానిక దళం స్పెయిన్ లోని గెర్నికా గ్రామం మీద నిర్దాక్షిణ్యంగా 1937లో బాంబుదాడులు చేసినప్పుడు గెర్నికా అనే చిత్రాన్ని చిత్రించారనీ, దీనిలో హింసనూ, వ్యధనూ కళ్ళకు కట్టేటట్లు ప్రత్యేక ప్రతీకలతో చూపెట్టారనీ విశ్లేషించారు. వృషభం, అశ్వం, దీపం, మార్గదర్శక జ్యోతికి ప్రతీకలుగా **పికాసో** భావించారని ఆరుద్ర విశ్లేషించారు. ఈ చిత్రరచన తర్వాతనే **పికాసో** ప్రజల పక్షమైన కమ్యూనిస్టులతో చేరువయ్యాడనీ,చివరికి అంతర్జాతీయ శాంతి ఉద్యమంలో చేరి, ఆ ఉద్యమ చిహ్నమైన శాంతి కపోతాన్ని చిత్రించాడని వివరించారు (ప్ర.ప్ర.పు:98) ఇలాంటి ఉద్యమస్ఫూర్తి **పికాసో** లో ఉంది కనుకనే, **రంగులకల** చలన చిత్రంలో కథానాయకుడు గెర్నికా చిత్రాన్ని చూసిన తర్వాత, శ్రామికుల సభకి వెళ్ళినట్లు దర్శకుడు చిత్రించడంలో ఒక అభ్యుదయ దృక్పథం కన్పిస్తుందన్నారు. చుట్టూ అత్యాచారాలూ, అమానుషాలూ చెలరేగుతున్నప్పుడు నిజమైన కళాకారుడు ప్రజాల పక్షాన్ని చేరక తప్పదని వ్యాఖ్యానించారు (ప్ర.ప్ర.పు:98).

ఇదంతా చూస్తే, ఒక చలన చిత్రాన్ని సమీక్షిస్తున్నట్లే అన్పించినా, దీనిలోను ఆరుద్ర ప్రతిభావంతమైన పరిశోధనాత్మక విమర్శ కన్పిస్తుంది. స్పెయిన్‌యుద్ధ సమయంలోనూ,తర్వాతా కళాకారుల్లో కలిగిన

అంతర్మథనాన్ని చరిత్ర, సాహిత్య ఆధారాలతో, మార్క్సిస్టు దృక్పథం తో విమర్శనాత్మక పరిశోధన స్థాయికి తీసుకొని పోగలిగారు. '**కళకళకోసమే**', అనే నివాదం సరైంది కాదనీ, కళ ప్రజలకోసమే అనే నివాదం సరైందనీ, '**కళప్రజలకోసమే**' అనే భావజాలం మార్క్సిజానికి బలం చేకూర్చే విమర్శనాత్మక దృక్పథాన్ని ఆరుద్ర ప్రదర్శించారు. తమిళ కవి సుబ్రహ్మణ్య భారతి జీవితాన్నీ, రచనల్నీ సమీక్షిస్తూ భారతి, రష్యావిప్లవాన్ని "**యుగ పురట్చి**" అని స్వాగతం పలికాడనీ, తమిళసాహిత్యంలో "**యుగవిప్లవం**" తెచ్చారనీ సోదాహరణంగా వివరించారు. తన జీవితంలో ఎదురైన సంఘర్షణ వల్లనే అంతర్జాతీయ కవిగా సుబ్రహ్మణ్యభారతి మారగలిగారన్నారు (ప్ర.ప్ర.పు: **124**). **1917** రష్యావిప్లవంలో జార్ చక్రవర్తి పతన వార్త విన్నాక "**కొత్తరష్యా**" అనే గీతాన్ని భారతి రచించారనీ, ఇది రాయడంలో ప్రజల పక్షం వహించిన కవిగా కన్పించారనే అభిప్రాయాన్ని వ్యక్తీకరించారు. నిరంకుశత్వంపై ప్రజలు తిరగబడి పోరాటం చేశాక, హిరణ్య కశిపుడు వలే జార్ చక్రవర్తి నాశనమయ్యాడనీ, "పీడించే జార్ పాలన పిశాచవనం అత్మాంతం" వంటి కవితా పంక్తులతో పెల్లుబికిందన్నారు (ప్ర.ప్ర.పు:**125**) అభ్యుదయ భావాలు సుబ్రహ్మణ్య భారతిలో వ్యక్తమైన వాటిని అనువర్తిత, కవిజీవిత సమన్వయ విమర్శ చేస్తూనే, మార్క్సిస్టు దృక్పథాన్ని కొనసాగించారు.

"మనుషులంటే ఎవ్వరోయ్?" అనే వ్యాసంలో ఆరుద్ర చారిత్రకభౌతిక వాదమొకటే మానవ చరిత్ర పట్ల సరియైన దోహదాకారి అవుతుంది" అని చెప్పి (ప్ర.ప్ర.పు: **129**), రావూరి భరద్వాజ రచనల్లో శాస్త్రీయ సామ్యవాద చింతనను విశ్లేషించారు (ప్ర.ప్ర.పు:**130**). "మార్క్సుకు ముందే విఫలమైన కమ్యూనిజం ప్రయోగాలు" వ్యాసంలో సెయింట్ సైమన్, జార్జి రిప్లే, నోయస్ వంటి వారు సామ్యవాద సంఘాలను స్థాపించినా, శాస్త్రీయ సామ్యవాదంపై ఆధారపడక పోవడమే కారణమని, మార్క్స్, ఏంగెల్స్ ప్రకటించిన *సైంటిఫిక్ సోషలిజాన్ని* సోవియట్ యూనియన్ జన చైనాలోనూ జయప్రదంగా ఆచరణలోకి తెచ్చారనీ, మార్క్సిజమొక్కటే మానవాళికి మహత్తర శాస్త్రమని అభిప్రాయపడటంలో ఆరుద్రలో మార్క్సిస్టు దృక్పథమే కన్పిస్తుంది. అభ్యుదయరచయితలు ప్రకటించిన మానిఫెస్టోను బ్రిటన్ పరిశోధనల్లో సేకరించాననీ, దాన్ని "*విప్లవాభి వందనాలతో*" (ప్ర.ప్ర.పు:**161**) పాఠకుల ముందు పెడుతున్నానడంలో వైయుక్తికంగా కూడా మార్క్సిస్టు ఆరుద్ర కన్పిస్తున్నారు. ప్రజాకళలూ, ప్రగతివాదులూ సమసమాజ నిర్మాణానికి పాటుపడాల్సిన ఆవశ్యకతను విమర్శనాత్మకంగా వివరించగలిగారు.

## 3.7. గుడిలో సెక్స్ – చారిత్రక విమర్శ:

డి.డి. కోశాంబి, రొమిల్లాథాపర్ వంటి మేధావులు మనప్రాచీన చరిత్రను మార్క్సిస్టు దృక్పథంతో అవగాహన చేసుకోవచ్చునో నేర్పారనీ, శాస్త్రీయ సామ్యవాద దృక్పథంతో దేవాలయాల మీద బూతు బొమ్మలెందుకుంటాయో పరిశోధన చేసి రాసిన గ్రంథంగా "**గుడిలో సెక్స్**" గ్రంథాన్ని ఆరుద్ర పేర్కొన్నారు (గు.సె.పు:3) ప్రాచీన కాలంలో గుడిలో దేవదాసీ వ్యవస్థ ఉండేది. ఈ వ్యవస్థ ఏర్పడడానికి గల కారణాల్ని అన్వేషిస్తూ, చారిత్రక, సామాజిక శాస్త్రాలసహాయంతో వేద, పురాణాల్ని ఆధారాలుగా చేసుకొని, అవి కావ్యాల్లో ఎలా వర్ణితమయ్యాయో సవిమర్శనాత్మకంగా వివరించారు. వేశ్యలకీ అప్సరసలకీ

గల భేదాన్ని వివరిస్తూ, "అప్సరసలు" వేశ్యలు వంటి వారేననీ, కానీ, వేశ్యలు డబ్బుకోసం వృత్తిగా వ్యభిచారాన్ని కొనసాగిస్తుంటే, అప్సరసలు అశ్వమేధ రాజసూయాగాది కార్యక్రమాల్లోని పుణ్యతంత్రాలే ప్రతిఫలంగా భావించేవారని ఆరుద్ర తెలిపారు. (గు.సె.పు:31) గుడి ఒక పవిత్ర స్థలంగానే కాకుండా, అక్కడే సృష్టి కార్యాలు జరిగేవనీ, అయితే, ఆలయంలో "దివ్య సెక్స్" కే అంకితమయ్యిందనీ (గు.సె.పు:4) అది తర్వాత కాలంలో దేవుడు, దేవతల విగ్రహాల్ని ఒకే చోట కలిపే వారనీ, దాని స్థానం లో ఒక కన్యను "దేవదాసీ" గా మార్చారనీ, ఆమె ఆ దేవాలయ ధర్మకర్తృత్వ మండలి యజమానికి అంకితం కావాలనే (గు.సె.పు:6) ఆచారం మొదలైందన్నారు.

దేవాలయాలలో "అమ్మ" "అయ్య"ల విగ్రహాలనే శయ్యాసనాలపైపడుకోబెట్టి "అలౌకిక శృంగార రసానుభావం" మాత్రమే జరిగేదను కోరాదు. కేవలం విగ్రహాలమూలంగానే కాక, ప్రాణమున్న వ్యక్తులద్వారా **'లౌకిక శృంగార రసాను భావ భావన'** కూడా జరిగేది. గుడిలో సెక్సు సేవలకోసమే దేవదాసీలను అంకితం చేశారు.

దేవదాసీలు దేవుని వధువుల, రజస్వల కాక ముందే గుడి సేవకోసం ప్రత్యేకించిన అమ్మాయితో దేవుని తో పెళ్ళి అయిపోతుంది. పెళ్ళయ్యాక గుడి ఏ రాజు గారి ధర్మ కర్తృత్వంలో ఉందో, ఆయనగారి పడక గదికి వెళ్ళి అ దేవవధువు ప్రభువు గారి శయ్యను చేతితో స్పృశించాలి. రాజుగారు ఆమె కళ్ళల్లో క ళ్లు పెట్టి చూస్తారు. ఆ చూపుల కలయిక ఉత్తరోత్తరపిల్ల ఈడేరాక జరిగే అంగ సంగమానికి నాంది. దేవదాసీ పెద్దమనిషి అయ్యాక దేవునితో కాక దేవుని ప్రతినిధి అయిన రాజుతోగాని, ఆలయానికి చెందిన ప్రధాన బ్రాహ్మణునితోగాని ప్రథమ సంయోగం విధిగా జరగాలి. (గు.సె.పు:6).

ఇలాంటివి కేవలం తెలుగు ప్రాంతంలోనే కాకుండా, భారతదేశంలో అనేక దేవాలయాల్లో జరిగేవంటూ, పూరీ జగన్నాథ స్వామి ఆలయం, కొప్పేశ్వర స్వామి ఆలయం(గోదావరీ మండలం), పలివెల (తూర్పుగోదావరి జిల్లా) లో జరిగినవిగా ప్రజలు చెప్పుకొనే కథల్ని ఆరుద్ర ఉదాహరించారు. పూజారులు, ధర్మకర్తృత్వ మండలి వారూ దేవదాసీలను తమ సెక్స్ కార్యానికి ఉపయోగించుకోనేవారని, ప్రజలు గానీ, అధికారులు గాని, రాజులుగాని నిలదీస్తే ఏవో కథలు చెప్పేవారని, విగ్రహాలతో పూజారులు చెప్పిన మహత్కార్యాలు కన్పించడం వల్ల వాళ్ళు తప్పించుకొనే వారనీ తేల్చారు. అయితే ఆ మహత్కార్యాలు గురించి ఆరుద్ర స్పష్టమైన వ్యాఖ్యలు చేయలేదు.

అత్యంత ప్రాచీన నాగరికతగా పేర్కొంటున్న సింధునాగరికతలో పంటచేల సారాన్ని వృద్ధి చేయడానికి, ప్రజలకు సంతాన బాహుల్యాన్ని కలిగించడానికి ఆచరించే సెక్స్, కర్మకాండలలో పవిత్ర వ్యభిచారం ముఖ్యమైన భాగమైందనీ, కాబట్టి దీనిని సింధు నాగరికులు కూడా అవలంబించారని ఈ పవిత్ర వ్యభిచారుణులనే "అప్సరసలు" అనే వారన్నారు (గు.సె.పు:23) ఇటువంటి సెక్స్ కార్యక్రమాలు కేవలం సింధునాగరికతలోనే కాకుండా, అప్పటి సమకాలిక పరదేశ నాగరికతలలోని ఆచారాలు, ఆధారాలు ఈజిప్టు, పానీషియా, అస్సీరియా, కాల్డియోకానాన్, పర్షియా దేశాలలో ఐసిస్,మొలాక్, బాల్, అష్టార్ట్ మెలిట్టా మొదలైన దేవతల ఆరాధనలలో విపరీతమైన సెక్స్ జాతరలు జరిగేవనీ, బాబిలోన్‌లో కొంత

వరకూ నిర్బంధ వ్యభిచారం అన్ని తరగతుల స్త్రీలపైనా మైలిట్టాదేవత గౌరవార్థంగా విధించే వారన్నారు.(గు.సె.పు:27).

మాతంగిని కూడా సగౌరవంగా 'మాత' అనిపిలుస్తారు. ఊరి మేలుకోసమే ఆమె జీవిస్తుంది. జాతర్లలో ఆమెస్థానం ప్రత్యేకమైంది. ఆమె అమ్మవారికి ప్రతినిధి ఆమెలో అమ్మవారిని జనులు చూసుకుంటారు. వివాహం చేసుకోదు. అలాగని సెక్సు సంబంధాలనుంచి దూరంగా ఉండదు. ఆమె ఎప్పుడూ కన్యే! సవర్ణుల దేవాలయాలు నిర్మితమయ్యాక అంటరానికులాల మతాలకు వాటిల్లో ప్రవేశంలేదు. అందుచేత ఆదిమ ఆచారాలనే పాటించి వానలు కురవటం కోసం,పంటలు, సంతానం పెరగటం కోసం, చేసే ఆరాధనలకు ఒక గణం ఏర్పడింది. ఒక పక్క రాజుదాసీలు ఉంటే మరోపక్క దేవదాసీలు సమిష్ట సంక్షేమం కోసం ఉద్భవించారు (గు.సె.పు:72) మాతంగి కన్యలు, మాతమ్మలు, మాతలు అమ్మవారి కొలువులలో మంత్రచర్యలు జరపడంలో ముఖ్యపాత్రను వహిస్తారు, ఇది అత్యంత ప్రాచీనకాలాలనుంచి వస్తున్న పద్ధతే, సమాజం వ్యావసాయిక స్థితి అందుకొనని ముందుకాలాల్లో సంచార జీవనం గడపే ఆటవిక జాతులందరిలో తల్లి పెత్తనమే ఉంటుందనీ, వ్యవసాయాన్ని కనిపెట్టిందీ స్త్రీలేనని ఆరుద్ర అన్నారు (గు.సె.పు:73) నేలతల్లి పండటానికి ఎన్నెన్ని మంత్రచర్యలు ఆచరించాలో అన్నీ మాతృత్వాధికారం ఉన్న సమాజంలో నే మొదట ఉద్భవించాయి (గు.సె.పు:79) ఇది ఋగ్వేద కాలంలో మంత్రచర్యగా మారింది, వ్యావసాయక మంత్ర చర్యలో దీన్ని ఆచరించారు (గు.సె.పు:74),వ్యావసాయిక మంత్ర చర్యలో క్షేత్రాన్ని సారవంతం చేయడం, బీజాన్ని స్థైర్యం చేయడం అవసరం. భూమాత కడుపు పండడానికి రాష్ట్రమాత కడుపుకూడా పండాలి. దీనికి కులపాలిక పురోహితునితో పవిత్ర సంభోగం చేయాలి. దీనిని చూసి దేవతలు సృష్టికార్యానికి ఉద్యుక్తులవుతారు.సర్వదేశాలలో ప్రజలు నేల ను తల్లిగానూ, నింగిని తండ్రిగానూ, భావిస్తారు (గు.సె.పు:74).

కనుక, సెక్స్ అనేది సృష్టికార్యమనీ, ఉత్పత్తి సంబంధాల్లో ప్రధాన పాత్ర వహిస్తుందనీ పంటకూ, కడుపు పంటకూ స్త్రీపురుషులిద్దరూ ఉండాలని పేర్కొన్నారు ఆరుద్ర (గు.సె.పు: 52).

దేవాలయాలమీద 'భూతు బొమ్మలెందుకుంటాయో, గుడిలో సెక్స్ కార్యాలపరమార్థమేమిటో సంప్రదాయ పండితుల వివరణలనూ పరిశీలించిన ఆరుద్ర, వాటిని ఖండించటం కన్పిస్తుంది. ఆదిమ వామాచారాలు పల్లిగ్గా వ్యావసాయిక మంత్ర చర్యలరూపంలో ఉత్పత్తికోసం జరిగితే, కొన్ని ఆచారాలు బహిరంగ మయ్యాయన్నారు (గు.సె.పు:103). చిన్న చిన్న రాళ్ళు చిల్లర దేవుళ్ళై వాళ్ళకు గుడులు ఏర్పడినప్పుడు శిల్పాలు లేవు. కాని రాజులు పెద్ద ఆలయాలు నిర్మించడం మొదలు పెట్టాక పురాణ ఇతిహాసాలలోని వివిధ దేవతలు కథల మధ్య కామ శిల్పాలు కూడా చోటుచేసుకున్నాయి. సంస్కృత కావ్యాలలో సంభోగ వర్ణనల ఎటువంటి స్థానాన్ని ఆక్రమించాయో దేవాలయ శిల్పాలలో కామదృశ్యాల చిత్రీకరణ కూడా అలాంటి ప్రామాణ్యాన్ని పొందింది (గు.సె.పు:104) అయితే సంప్రదాయ వాదులు క్రింది కారణాల్ని చెప్పారని, వాటిని వివరించారు. (గు.సె.పు:104).

1. ఓంకారంలో ఎలాగైతే సంయోగాన్ని చూడాలో అలాగే ఈ శిల్పాలలో ప్రకృతి పురుష శక్తుల సంయోగాన్ని, దైవత్వంలో ఏకత్వాన్నీ చూడాలి.
2. ఆధ్యాత్మిక సచ్చిదానందాన్ని ఐహికచిహ్నాలతో శిల్పాలు సూచిస్తాయి.
3. భక్తులలోని విషయ వాంఛలను ఈ మిథునాలు రేకెత్తించి వాటిని అధిగమించడానికి తోడ్పడతాయి.
4. ఈ శిల్పాలు ఐహిక జీవితంలోని నృత్య, గీత, ఆలంకరణాది దృశ్యాలను చిత్రించడంతో పాటు మానవ వ్యాపారాలలో భాగమైన శరీర సుఖాన్ని కూడా తెలియచేస్తాయి. కళ దేనినీ విస్మరించదు, విసర్జించదు.
5. దృష్టిదోషాల నుంచీ, పిడుగు పాటునుంచీ ఈ శిల్పాలు దేవాలయాలను రక్షిస్తాయి.
6. విషయ వాంఛాసక్తులను సైతం ఈ చిత్రాలు గుడికి రప్పిస్తాయి. ఆలయానికి ఏమిషమీదవచ్చినా మంచిదే కదా!
7. ఈ మిథున శిల్పాలు అజ్ఞానులకు కామశాస్త్ర శిక్షణను ప్రత్యక్ష దృశ్యాలతో ప్రబోధించి జ్ఞానవంతులను చేస్తాయి.
8. తంత్ర విద్యలలోని మంత్ర చర్యలకు ఇవి సూచ్యైన యోగ చిత్రీకరణలు.

అయితే వీటిని సాకులు, సంజాయిషీలుగా ఆరుద్ర కొట్టిపారేశారు. (గు.సె.పు:104).

ఇంకా ఇలాంటి వివరణలు ఉన్న కొన్ని గ్రంథాల్ని పేర్కొని వాటిని తార్కికంగా ఎందుకు కాదో నిరూపించడానికి ఆరుద్ర ప్రయత్నించారు.

మానవ సంతానాన్ని వ్యాపింప జేయడం, వంశాన్ని విస్తరింపచేయడం అన్నవే ఆదిమ తంత్రంలక్ష్యాలు · (గు.సె.పు :105) దేవాలయాలనూ బృహన్నిర్మాణాలుగా రూపొందించిన వాళ్ళంతా రాజ్యాధినేతలే, వాళ్ళమతాలూ, అభిమతాలూ, రుచులూ, అభిరుచులూ, ఆ ఆయతనాలలో చోటుచేసుకున్నాయనీ ఊహించారు (గు.సె.పు : 106). అసంఖ్యాకులైన శిల్పులు వీటిని మలిచారు, ఆగమశాస్త్రాల ప్రకారం వీటిని కట్టారు, ద్రావిడ, నాగర, వేసర రీతులలో నిర్మించిన ఏ దేవాలయాలోనైన ఉదాత్త పౌరాణిక శిల్పాలతో పాటు కామశిల్పాలు కూడా చోటుచేసుకున్నాయి (గు.సె.పు : 106). అయితే తెలుగు భాషాసమితి వారు ప్రచురించిన విజ్ఞాన సర్వస్వం 14వ సంపుటం "లలితకళలు" అనే సంకలనంలో ఈ మైథున శిల్పాలు గురించి కొంత వివరణ కన్పిస్తుంది.

1. ప్రకృతి పురుషుల సంయోగమే సృజనకు మూలకందం. ఈ సనాతన భావం భారతీయ శిల్పాల్లోనే కాకుండా, పౌరాణిక మూర్తుల రూపకల్పనం లోనూ కన్పిస్తుంది, అలాంటి భావనే వాఙ్మయం లోనూ విస్తృతంగా ఆలముకొంది, ఇదే భావన వాత్స్యాయన కామసూత్రాలకీ ప్రాతిపదిక అయ్యిందనేది విజ్ఞాన సర్వస్వం చెప్తుంది. అశ్లీలమైన శిల్పాల గురించి చెప్తూ "*అశ్లీలత యను దానికి దేశకాలాతీతముగు కొలబద్దను దేనినీ నిర్ణయింపజాలము. ఈనాడు కొన్ని ప్రాచీన జాతుల యందే కాదు, సభ్యత యందు ఉచ్ఛ్రయ స్థాయికి చేరుకొని నటుల భావించు కొన్ని సంఘముల స్త్రీ వేష ధారణలలో*

*ఊర్ధ్వ భాగము అనాచ్ఛాదమై ఉండుట చక్కని సంప్రదాయముగా భావింపబడగ, కొన్ని సభ్య జాతులవారు అట్టి వేషమును అశ్లీలము గను, అసభ్యము అని నిరసించుట కననగు చున్నది. ఇట్టి యెడ ఒక స్థిరమగు కొలబద్ద నిర్ణయించ లేమనుట సువిదితము. కావున కోణార్కమునను, తక్కిన చోటులను కననగు మిథున శిల్పములను వాని నిర్మాణ కాలపు సాంఘిక పరిసరముల దృష్టితో అర్థము చేసుకుని వానికి రూపమొసగిన శిల్పుల ప్రతిభకు విలువలను నిర్దేశించుట మాత్రము సహృదయుల ధర్మము'* (వి.స.పు:**175–176**) అని వివరించడం కన్పిస్తుంది.

ఈ వివరణలన్నీ సంప్రదాయ సిద్ధమైన సమర్థన రీతులను తెలుసుకోవడానికి ఉపకరిస్తాయి, అయితే ఒక ఆచారం గాని, మంత్ర చర్యగాని ఆవిర్భవించడానికి సామాజికమైన అవసరాలు ఉంటాయి, సాహిత్యంగాని, కళగాని, శిల్పంగాని, సాంఘిక ప్రయోజన రహితంగా ఆదిలో పుట్టదు (గు.సె.పు:**107**) ఆది నుండే జనుల ఆచారవ్యవహారాలు నిత్యజీవిత దృశ్యాల చిత్రీకరణ కూడా దేవాలయాలపై జరిగి ఉంటుంది. కొన్ని చారిత్రక కారణాల వల్ల శిల్పాల్లో కామం గణనీయమైన స్థానాన్ని ఏర్పరుచుకుందన్నారు (గు.సె.పు : **111**) ఉత్పత్తి విధానాలలో ఎన్ని మార్పులు వచ్చినా, ఎంత అభివృద్ధి జరిగినా, ఎంత విజ్ఞానం కలిగినా తొలినాటి ఆచారాలు, ఆస్తులను పట్టి జాతిజనుల్లో ఉండిపోయాయి. భారతదేశంలో ఎన్నో దేవాలయాలు ఉన్నాయి, వాటిలో ఎన్నో కామ శిల్పాలు ఉన్నాయి, అన్నింటిని గురించే రేఖా మాత్రంగానైనా చెప్పడం ఒక చిన్న సంపుటంలో సాధ్యం కాదన్నారు ఆరుద్ర (గు.సె.పు. 110). ఆర్యులు భారత దేశానికి రాక ముందు నుంచీ, వచ్చాక ఈ వ్యవసాయిక మంత్ర చర్య ఆరు బయట జరుగుతూ ఉండేది. యాగశాలలు పరమ పవిత్రమైనవి. కనుక అక్కడే అవి జరిగేవి. యాగశాలలూ క్రమంగా తగ్గిపోయి దేవాలయాలు వచ్చాక వ్యావసాయికమైన సెక్సు చర్యల ప్రత్నామ్నాయాలుగా గుడిలోనే చోటుచేసుకున్నాయి, యజ్ఞాలలో యజమాని పత్ని సోమిదమ్మ, సోమిసాని స్థానాన్ని "గుడిసాని" పొందింది. చారిత్రక పరిణామంలో ఆదిమ సెక్సు మంత్ర చర్యలు గుడిలో ప్రత్నామ్నాయ ప్రతీకల, ప్రతిమల, కామశిల్పాల రూపంలో నిక్షిప్తమయ్యాయని (గు.సె.పు:**81**) నిరూపించడానికి ఆరుద్ర ప్రయత్నించారు.

డి.డి. కోశాంబి దేవాలయాల దగ్గర ఉండే కొలను గురించి చారిత్రక ఊహలు చేశారు. సంస్కృతంలో ఈ తటాకాన్ని **"పుష్కరా"** అంటారు, ఇవి దేవాలయాల ప్రక్కనే చోటు చేసుకున్నాయి, ఇవి ఓ ప్రత్యేకమైన పద్ధతిలో కట్టేవారు, అక్కడ **అప్సరసలు** అనే నీటి దేవతలు లేదా నీటి మంత్ర గత్తెలు ఉంటారని నమ్మేవారనీ కోశాంబి చెప్పారు[43]. **"భారతచరిత్ర పరిచయవ్యాసాలు"** డి.డి.కోశాంబి పురుషులు పుష్కరాల్లో స్నానంచేసి, ఆ యువతులతో సంభోగించే ఆచారం ఉండి ఉండవచ్చునీ, ఇది పునరుత్పత్తి కోసం కొన్ని తాంత్రిక ఆచారాలతో మొదలయి ఉండవచ్చునన్నారు[44]. అంతేకాక, దేవాలయం ఉత్పత్తి కార్యక్రమాలలో భారీ పాత్ర నిర్వహించి ఉండవచ్చునన్నారు[45].

వీటన్నింటినీ విశ్లేషించినప్పుడు **"గుడిలో సెక్స్"** గ్రంథంలో చారిత్రకవిమర్శనే ఆరుద్ర మార్క్సిస్టు విమర్శనా దృక్పథం వివరించాడానికి వినియోగించారు. చారిత్రక సమాజ పరిణామ క్రమాన్ని వివరిస్తూ,

చరిత్ర, సమాజ శాస్త్ర, సాహిత్య, పౌరాణిక గ్రంథాలను ఆధారంగా చేసుకొని తన పరిశోధనను విమర్శనాత్మకంగా కొనసాగించారు.

## 3.8. 'రాముడికి సీత ఏమవుతుంది?" – చరిత్ర, తులనాత్మక విమర్శ:

ప్రధానంగా పరిశోధనా గ్రంథమైనప్పటికీ 'రాముడికి సీత ఏమవుతుంది?' గ్రంథంలో పరిశోధనకు అంతర్వాహినిగా చారిత్రక తులనాత్మక విమర్శను ఆరుద్ర ఉపయోగించుకున్నారు. వివిధ కాలాల్లో వచ్చిన రామాయణాల్లో వచ్చిన మార్పులకు, ఆకాలంలో ఉండే సామాజిక సంబంధాలు కారణం అవుతుంటాయి. వాటిని కాలానుగుణంగా పరిశీలించినప్పుడే ఆ రామాయణాల్లో ఆ విధమైన మార్పులు కనిపించడానికి కారణాలు స్పష్టమవుతుంటాయి. అందుకనే వాల్మీకి రాసిన రాయాయణం నాటికే రామకథ ప్రచారంలో ఉందనీ, ఆనాటి కాలపరిస్థితులకు అనుగుణంగా వాల్మీకి ఆ వస్తువుని వర్ణించారనే అభిప్రాయాన్ని ఆరుద్ర వ్యక్తీకరించారు. రా.సీ.ఏ.వు.దీన్ని తన పరిశోధనలో భాగంగానే వివిధ రామాయాణాల్ని, వివిధ దేశాల్లో ప్రచారంలో ఉన్న రామకథల్ని పోల్చిచూడడం, విశ్లేషించడం అనే రెండు పద్ధతుల్ని అనుసరించారు. 'విమర్శకుడు పోల్చి చూడడం, విశ్లేషించడం అనే రెండు పద్ధతుల్ని వాడుతుంటార'ని విమర్శకులు భావిస్తున్నారు[46]. అంతేకాక చారిత్రక విమర్శను గురించి వివరిస్తూ ముదిగొండ వీరభద్రయ్య చారిత్రక విమర్శలో రచన ఏ సంప్రదాయంలో ప్రభావించింది దాని కాలం ఏమిటి అన్నది ముఖ్యాంశాలుగా ఈ దృష్టితో అధ్యయనం చేసినప్పుడు ఉంటాయన్నారు[47]. కనుకనే ఆరుద్ర రామాయణాల్ని, రామకథల్ని పరిశీలిస్తూ ఆదేశ సామాజిక చారిత్రక పరిస్థితుల్ని విశ్లేషించడం ద్వారా చారిత్రక విమర్శనా దృక్పథాన్ని ప్రదర్శించారని తెలుస్తుంది. జానపద సాహిత్యం లో రామకథ గురించి విశేషంగా వివరించడం ఏసంప్రదాయంలో రామకథ ప్రభవించిందో చెప్పడానికి ఆరుద్ర ప్రయత్నించడమే అవుతుంది. ఆరుద్ర చేసిన జానపద పరిశోధన విభాగంలో 'రాముడికి సీత ఏమవుతుంది?' అనేది మరింత విపులంగా పరిశీలించడం గమనించవచ్చు.

## 3.9. "పీఠికలు"– సమన్వయ దృష్టి:

ఆరుద్ర, వివిధ రచయితలు, కవులు రాసిన పుస్తకాలకు పీఠికలు రచించారు. వీటిలోనూ ఆరుద్ర విమర్శనా దృక్పథం వెల్లడయ్యే అవకాశం ఉంది. అయితే సర్వ సాధారణంగా పీఠికలు ప్రశంసలతో నిండి ఉంటాయి. తెలిసిన వారికి, తెలిసిన వారే రాసేమాటలు కనుక, ప్రోత్సాహాన్ని అందిస్తూనో, మోహమాటానికో నాలుగు వాక్యాలు రాసేవారు కొంత మంది ఉంటే, అలాంటి వాటికి దూరంగా ఉండే వాళ్ళూ కన్పిస్తుంటారు. అలాంటి వాళ్ళు నిర్మోహమాటంగా తనదైన లోచూపుతోనే పీఠికలు రాస్తుంటారు. అయితే, పీఠిక రాయడానికి అంగీకరించడమే ఆ గ్రంథం పట్లనో, ఆ గ్రంథ విషయం పట్లనో, ఆ గ్రంథకర్త పట్లనో గల అనుబంధం లేదా పరిచయం వల్లనే జరుగుతుంటుంది. కొన్ని సార్లు కొన్ని సంస్థలు పనికట్టుకొని రాయించే పీఠికలూ ఉంటాయి. ఇటువంటి గ్రంథాలు, రచయితలు ఆ కాలానికి సజీవంగా లేక పోవటం వంటి కారణాల వల్ల నిష్పక్ష పాతంగా, విమర్శనాత్మక పీఠిక

వెలువడే అవకాశం ఉంటుంది. ఆరుద్ర ఇటువంటి వాటికి సుదీర్ఘమైన పీఠికలు రాయడం కన్పిస్తుంది. ముద్దుపళని రచించిన "**రాధికా సాంత్వనము**" కావ్యానికి రాసిన పీఠిక ఈ కోవకి చెందుతుంది[48].

రచయిత జీవించి ఉండగా రాసిన పీఠికకూ మరణించిన తర్వాత రాసే పీఠికకూ చాలా వ్యత్యాసాలు కన్పించే అవకాశాలు ఉన్నాయి. ఇటువంటి భిన్న రకాలైన పరిస్థితుల్లో ఆరుద్ర పీఠికలు రచించడం వల్ల దృక్పథ ప్రతిఫలనకు అవకాశాలు ఎక్కువగానే కన్పిస్తున్నాయి. ఎల్లోరా రాసిన "**జానపద సాహిత్యం**" గ్రంథానికి సుదీర్ఘమైన పీఠిక రాస్తూ "ఇది ఒక ప్రణాళిక వేసుకొని ప్రయత్నపూర్వకంగా రాసిన పాఠ్యగ్రంథం కాదు. ఏదితోస్తే అది, ఎలాతోస్తే, అలాగు, ఎప్పుడు తోస్తే అప్పుడు రాసినవి. ప్రకరణాలు చేసి వైదుష్యం,వైవిధ్యం, భిన్నత్వంలో ఏకత్వం చూపెట్టే గ్రంథమనీ, జానపద సాహిత్యంపై పరిశోధనలు చేసే విద్యార్థులు చూడక తప్పని గ్రంథమే" అన్నారు[49]. ప్రణాళిక లేకపోవడం, ఎలాతోస్తే అలారాయడం గ్రంథరచనల్లో, ముఖ్యంగా పరిశోధన గ్రంథ రచనల్లో సరైందికాదనే ఆరుద్ర విమర్శ సూచనామాత్రంగా ఇక్కడ కన్పిస్తుంది. కానీ, దాన్ని తెలివిగా చెప్తూ 'పరిశోధక విద్యార్థులు చూడక తప్పని గ్రంథమే' అన్నారు గాని, 'తప్పనిసరిగా చూడాలవలేదు'. అంటే సామగ్రీ సేకరణకు బాగా ఉపయుక్తమయ్యే గ్రంథమనే విమర్శకూడా ఉంది. గ్రంథ విశ్లేషణ చేస్తూ, గ్రంథంలో పేర్కొన్న "**అప్పగింతలు**" శీర్షిక ను ఉదాహరించి, దానిపై తన వ్యాఖ్యానాన్నీ, నిర్ణయాన్నీ ఆరుద్ర ప్రకటించారు[50].

"పాటలేనిదే బ్రతుకే లేదా అనిపిస్తుంది! లేచింది మొదలు పడుకొనే వరకూ... శ్రామికులు ఏపనిచేస్తున్నా పాటలేనిదే చేయరు.." ఇలా కొనసాగిన ఒక పేరాను ఉదాహరించిన తర్వాత, ఆరుద్ర తన నిర్ణయాన్ని ఇలా ప్రకటించారు. "ఇందులో పనీకీ పాటకూ గల సంబంధాలను చర్చించే మౌలిక జిజ్ఞాస ఉంది. ఈ భావాంకురం మొలకెత్తితే శాస్త్రీయ సామ్యవాద దృష్టితో మొత్తం జానపద సాహిత్యాన్ని అవగాహన చేసుకొనే అవకాశాలు తప్పకుండా ఉంటాయి. శ్రమతో కూడుకొన్న ఏవ్యాపారమైనా కూటికోసమే. అందుకే ఉత్తరోత్తరా కోటివిద్యలూ కూటి కొరకే అవసరమయ్యాయి. అన్ని కళలూ ఆదిలో ఆహారోత్పత్తి, కోసమే ఉద్భవించాయి..." అంటూ మార్క్సిస్టు విమర్శనా దృక్పథంతో పీఠికను కొనసాగించటం విశేషం!

పఠాభి ప్రచురించిన "కయితనాదయిత" కవితా సంకలనానికి పీఠికరాస్తూ ఆరుద్ర, వచన పద్యాలనే దుడ్డు కర్రలతో పద్యాల నడుం విరగ్గొట్టే అహంభావ కవిగానే పఠాభి మిగిలిపోయాడుగాని, కొన్ని కవితల్లో ఏదో ఒక మాత్రాఛందస్సు ను ఉపయోగించాడన్నారు[51] శాంతి నికేతనంలో చదువుకొనేటప్పుడు రవీంద్రుని ప్రభావానికి లోనై అంత్యప్రాసలతో మాత్రాఛందస్సులో కవిత్వం రాశాడనీ, వాటిలో కొన్నింటిని సోదాహరణంగా వివరిస్తూ ప్రబంధాలలో రగడలు వాడే చోట్ల విధిగా అంత్యప్రాసలు పాటించే ఛందోసంప్రదాయాన్ని గుర్తుచేసి, మొదట అష్ట విధనాయిక లక్షణాలకు కావ్యరూపం ఇచ్చే ఏనిమిది కవితల్లో, పదేసి పాదాలు ఒక ఖండంగా ఎనిమిది రచనలలోనూ కనబడుతుందని ఆ పదిపాదాలలో రకరకాలుగా అంత్యప్రాసలను పఠాభి పాటించాడనీ, ఒకదానిలో వాడిన క్రమంలో ఇంకొకటి వాడలేదని,వాటిని వివరించారు అంతేకాక, పఠాభి పెట్టుకున్న ఈ వివిధ నియమాలు విశ్లేషించి చూస్తే ముందుగా ఎంత పథకం వేసుకొని పరిశోధనలు ప్రారంభించాడో తెలుస్తుందనీ, ఈ ఖండికల్లో

గల అంత్యప్రాస నియమాలను కూలంకూషంగా పరిశీలించడం అవసరమన్నారు[53] అంతే కాకుండా, పఠాభి ప్రభావం తనపై గాఢంగా పడిందనీ ఆరుద్ర ఒప్పుకున్నారు[54]. ఇది ఆరుద్ర రాసిన "త్వోహావిహంగాలు" ఖండకావ్యంలో స్పష్టంగా కన్పిస్తుందనీ ఈ పీఠికలోనే చెప్పుకున్నారు. ఈ సందర్భంలోనే శ్రీ శ్రీపై అబ్బూరివారి ప్రభావం, శ్రీ శ్రీ ప్రభావం తనపై పడటం, దాని నుండి తప్పించుకోవడానికి పఠాభి ముద్రకు లోనుకావడం జరిగిందన్నారు. పఠాభి కూడా విశ్వనాథ వారి "కిన్నెరసాని" ప్రభావం కన్పిస్తుందనీ, కొన్నింటిలో శ్రీ శ్రీ ప్రభావంకూడా పఠాభిపై ఉందని సోదాహరణంగా నిరూపిస్తు పరిశోధన వ్యాసాన్ని తలపించే తులనాత్మక విమర్శనా దృక్పథాన్ని ఈ పీఠికలో కొనసాగించారు. ఆరుద్ర తులనాత్మక విమర్శనాత్మక పరిశోధనా దృక్పథాన్ని పట్టిచ్చే చక్కని పీఠికగా దీన్ని చెప్పుకోవచ్చు.

నూతల పాటి గంగాధరం గారి "వెలుగులోకి" కవితాసంపుటికి పీఠిక రాస్తూ ఆరుద్ర, కవి అభ్యుదయ పంథాను వివరిస్తూనే, తెలుగు సాహిత్యాన్ని విరుసమీక్ష చేసి, గంగాధరం కవిత్వం అభ్యుదయ కవిత్వానికి చెందుతుందనీ, బతుకుకోసం, ప్రగతికోసం, ఆరని వెలుగుకోసం సమరం చేస్తుంటారనీ, ఆ బాటలోనే కవి పయనిస్తున్నాడంటూ, అభ్యుదయ ధోరణి ప్రోత్సహించేటట్లు రాశారు[55] ముదిగొండ వీరభద్రమూర్తి వర్ణించిన "వందేమాతరం" (స్వాతంత్ర్యోద్యమ చరిత్ర **(1860-1906)** కు ఆరుద్ర తన అభిప్రాయాన్ని తెలుపుతూ "*ఇది నేను సంపూర్ణంగా చదవలేదు. ఇందులో "ఇంగ్లండు ఖండం' అనే భాగాన్ని మాత్రమే నాకు కవిగారు ఇచ్చారు. ఆయన ఉద్దేశంలో 'అన్నమంతా చూడాలా ఒక మెతుకు చూస్తే చాలదా' అన్నట్లు నాకు ఇచ్చి నట్లున్నారు. సంపూర్ణ కావ్యం చదవందే పరిపూర్ణ మైన అభిప్రాయం ప్రకటించటం నా అభిమతం కాదు. అయినా ఒకానొక పర్వం నా చేతికిస్తూ శ్రీమూర్తి గారు చెప్పిన కొన్ని విషయాలవల్ల ఈ పర్వంలోని కృషి నాకర్థమైంది. ఆంధ్ర దేశపు అరుగులపై కూర్చుని, ఊహాగానంలో ఈయన ఇంగ్లాండు ను వర్ణించలేదు. కథాకాలంనాటి ఇంగ్లాడును కన్నులారా చూసి కథకు కావలసినంత కవిత్వాన్ని వాడుకొంటూ కథనం చేశాడీయన*" అనడంలో ఆరుద్ర వ్యక్తిత్వం, దృక్పథం స్పష్టమవుతుంది[56]. కావ్యానికి అభిప్రాయం రాయాలంటే మొహమాటాలు కంటే, చిత్తశుద్ధి అవసరమనేది దీనిలో వ్యక్తంచేశారు. ఒక పర్వాన్ని చదివినా, కొంతమంది స్థాలీపులాక న్యాయంగా "ఇంగ్లండు" ఖండాన్ని పరిశీలిస్తున్నానంటూ, దానిలోని సొగసుని చెప్పి, వాటిని కావ్యానికంతటినీ అనువర్తించే అవకాశం ఉన్నా నిష్పక్షపాతంగా, వాస్తవానికి అవకాశాన్ని కల్గించే అభిప్రాయాన్ని ఆరుద్ర వ్యక్తంచేశారు.

ఇంకా చాలామంది పుస్తకాలకు ఆరుద్ర పీఠికలు రాశారు. దాశరథి (కవితాపుష్పకం) గుంటూరు శేషేంద్ర శర్మ (ఋతుఘోష) నాగభైరవకోటేశ్వరరావు (ఒయాసిస్) వంటి కవుల కవిత్వాన్ని పీఠికల్లో వివరించారు. 'మార్గ శీర్ష' ద్వానాశాస్త్రిలు కలిసి ప్రచురించిన "సమాధిలో స్వగతాలు" "కవితా సంకలనానికి పీఠిక రాస్తూ ఆరుద్ర" "కొన్ని పీఠికలు విధిలేక రాయాలి, కొన్ని విధి గాభావించి

...యాలన్నారు. ఇది రెండో కోవలోనిది" అన్నారు[57]. ఏమాత్రం ప్రగతి దృక్పథం గల రచయిత అయినా నిశ్శబ్దాన్ని భరించలేడు, నిశీధాన్ని వరించలేడు. అందుకేలేస్తాడు అని తన దృక్పథాన్ని కొంతవరకూ ఆరుద్ర బయట పెట్టారు. ఇద్దరు కవుల్ని మెచ్చుకుంటూ, మినీకతల్ని వర్ణించడానికి కొంతప్రత్యేకమైన నేర్పుచూపించ వలసిన ప్రక్రియ గా చెప్పి, కొసమెరుపు, కొసమలుపు కావాలనీ, ఆఖరి పాదం చదవగానే 'ఆహాబాగుంది' అనిపించగలగాలనీ, మార్గశీర్ష పరిణితి వైపు పయనిస్తూ ఉంటే, ద్వా.నా.శాస్త్రి ప్రస్ఫుటత్వం అలవర్చు కొంటున్నట్లుందని ఇద్దరినీ నొప్పించకుండానే ఇరువురిలో గల కవితా ప్రతిభను ప్రశంసిస్తూనే, ఇద్దరూ ఇంకా మంచి సంకలనాలు ముమ్ముందు తీసుకొని వస్తారని ఆశిస్తున్నాను అన్నారు. ఈ పీఠికలో ఆరుద్ర దృక్పథాన్ని పట్టిచే అంశాలు మూడు కన్పిస్తున్నాయి

(i) ప్రగతి భావాలున్న వాటిని ప్రోత్సహించటం,

(ii) కవిత్వంలో ఉండే సామాజిక స్పృహను విశ్లేషిస్తూనే, కవిత్వల లక్షణాన్ని గుర్తిస్తూ ఆప్రక్రియ గౌరవాన్ని కాపాడమని ప్రబోధించడం

(iii). విమర్శకుడిలో ప్రధానంగా ఉండాల్సిన నిర్మమమత, సహృదయతలను పాటించడం వల్లనే చెప్పవలసింది నొప్పించకుండా తెలియచేయగలిగారు. పీఠికలు ఏస్థితితో రాయాల్సివస్తుందో కూడ దీని ప్రారంభంలోనే రాయడం వల్ల కొన్ని మొహమాటంతో రాయవలసి వస్తుందనీ చెప్తున్నారు.

ఇంతవరకూ ఆరుద్ర రాసిన పీఠికల విశ్లేషణలు అన్నీ, సమకాలీన కవుల,కావ్యాల,సంకలనాలకో, సంపుటిలకో చెందినవై ఉన్నాయి. ఇప్పుడు ప్రాచీన సాహిత్యంలో, ఆ రచయిత్రి ప్రస్తుతం లేకపోయి, ఆ కావ్యానికి 'పీఠిక' రాయాల్సి వచ్చి నప్పుడు ఆరుద్ర ప్రదర్శించిన విమర్శనా వైచిత్రిని తెలుసుకోవడానికి వీలుగా ఈ పరిశీలన గమనించవచ్చు.

ముద్దుపళని రచించిన "రాధికా సాంత్వనం" (దీనికే 'ఇళాదేవీయం' అనే మరో పేరుకూడా ఉంది.) చిలకమర్తి లక్ష్మీ నరసింహం 'గణపతి' నవలకు ఆరుద్ర పీఠికల్నిరాశారు. వీటిలో ముద్దుపళని రచించిన 'రాధికా సాంత్వనం' కావ్యానికి చక్కని కావ్య విమర్శనాత్మక పీఠికను ఆరుద్ర రచించారు.

'రాధికా సాంత్వనం' లో ఉన్న కథను సంక్షిప్తంగా వివరించి, ముద్దుపళని కవితా విశేషాల్ని సవివరంగా వివరిస్తూ "ఈ కావ్యంలో గొప్ప కవిత్వధోరణులుగానీ, విశేష చమత్కారాలు గానీ కనబడకపోవచ్చును. గాని, సమకాలిక కవుల శబ్దాడంబరం నైపుణ్యాలు, ఆ లోపాల పాపాలు కూడా కనబడువు. ముద్దుపళనిలో వున్నగొప్ప సుగుణం పాత్ర చిత్రణ, వాళ్ల మానసిక భావాలు, సంభాషణలద్వారా, వాళ్ళ స్వగతాల ద్వారా బయట పెడుతుందిగాని తాను కథనం చేయదు. మధ్యలో జొరబడి అనవసర వ్యాఖ్యానాలు చెయ్యదు" అని పాత్రల్ని పోషించడాన్ని కవి తీసుకోవాల్సిన మెళకువుల్ని మెచ్చుకుని, కవియిత్రి రచనా నైపుణ్యం పట్ల ఆసక్తిని పెంచారు, కావ్యంలో గుణం కన్నా కవయిత్రి కులానికి ప్రాముఖ్యం ఇవ్వడం తగని పని అనీ, మనపూర్వులు ఆ దృష్టితోనే చిన్న చూపు చూడడం సరైంది

కాదన్నారు ఆరుద్ర[58] తరచు వీరిలోని వేశ్య 'తంజ నాయకి', పెంచుకున్న అమ్మాయి 'ముద్దుపళని' అని చెప్తూ,దక్షిణాదిని 'పళని' అనేక్షేత్రంలో కుమారస్వామి ఆలయం ప్రసిద్ధమైంది, ఆపేరే ఆమెకు పేరు పెట్టారు, పిల్లల పేరుముందు 'ముద్దు' అనే ఆప్యాయ సూచిక పదం పెట్టడం సర్వసాధారణం కనుక, 'ముద్దుపళని' అనే పేరు వచ్చిందన్నారు[59] ఆమె సాహిత్యవిద్యా విశారద అయ్యి, కవన, లలిత కళా వైభవాన్ని సంతరించుకొని, మహారాష్ట్రరాజు ప్రతాపసింహుడుకోరుకొనేటంత కీర్తిని సంపాదిచుకోవటంవల్లనే ముద్దుపళనిని ఆరాజు ఆదరించ గలగాడని ఆమె జీవితాన్నీ పరిచయంచేశారు.

ముద్దు పళని రాసిన 'రాధికా సాంత్వనం' లో గల కొన్ని బూతు పద్యాలవల్ల నిషేధించిన సంఘటన ప్రస్తావించి, కందుకూరి వీరేశలింగం వంటి వారు ఈ కావ్యంలో గల బూతు పద్యాల పట్ల స్త్రీలు వినదగిన పద్యాలు కాదనడాన్నీ, ఆ అభిప్రాయాన్ని ఖండిస్తూ బెంగుళూరు నాగరత్నం ఇచ్చిన సమాధానాన్ని కూడా పేర్కొని, ప్రకాశం పంతులు ప్రభుత్వంలో నిషేధాన్ని తొలగించిన చారిత్రిక యధార్థాల్ని కూడా ఈ పీఠికలు వివరించారు[60]. తెలుగు సాహిత్యంలో ఈ ఇతివృత్తంతో వచ్చిన కావ్యాల్ని, కవుల్ని ప్రస్తావించి, కొన్ని కావ్యాల్లో గల పద్యాల పోలికలు ముద్దుపళిని 'రాధికా సాంత్వనం'లో కన్పించడాన్ని, ఆమె చదువును తెలియజేస్తాయే గాని ఘనతను తగ్గించవన్నారు[61].

మన తెలుగు సాహిత్యంలో 'రాధ' ఇతివృత్తంతో వచ్చిన కావ్యాల్ని చూస్తే చాలావచ్చాయి. వాటిలో ప్రముఖంగా చెప్పుకోదగినవి ముద్దుపళనికి పూర్వమే లింగనముఖి తిరుకామయ్య. 'సత్యభామాసాంత్వనం'; చింతలపూడి ఎల్లన్న 'రాధామాధవం'; ధరణిదేవుల రామయ్య 'దశావతార చరిత్ర'; (దీనిలోనూ రాధాకథ ఉంది); వెలిదిండ్ల వెంకటపతి; 'రాధామాధవ సంవాదం' వంటివెన్నో రాధా-కృష్ణుల ఇతివృత్తంతో వచ్చిన కావ్యాలు. అయినా ముద్దుపళని మళ్ళీ రాధాకృష్ణుల ప్రణయాన్ని వర్ణించి కావ్యం రాస్తే, ఎంతగొప్పగా ఉంటే ఆదరిస్తారో తెలిసిన ప్రజ్ఞావంతురాలు కనుకనే, నైపుణ్యతను ప్రదర్శించారన్నారు. ఆరుద్ర రాసిన ఒక చిన్న విశ్లేషణాత్మక పరిశోధన వ్యాసం వలే కొసాగిన పీఠికగా దీన్ని చెప్పవచ్చు.

పీఠికల్లో ఆరుద్ర విమర్శను కింది అంశాలుగావివరించడానికి అవకాశం ఉంది.

1. ఆత్మాశ్రయంగా వివరిస్తూ, వైయక్తికానుభావాల్ని చెప్పడం.
2. రచయితను పరిచయం చేయడం.
3. కావ్యాన్ని సమీక్షిస్తూ శిల్పసౌందర్యం, కావ్యవస్తువులో భాగంగా ఉండి కళ కళకోసమే కాకుండా, ప్రజల కోసం పాటుపడేలా ఉండాలనే దృక్పథాన్ని వ్యక్తంచేయడం. ప్రగతిశీల భావాల్ని ఆహ్వానించి, సామాజిక దృక్పథాన్ని పెంపొందించే దిశగా కవిని పయనించేటట్లు ఉత్తేజితం చేయటం.
4. కవికాలాన్ని, కావ్యవస్తు కాలాన్ని నిర్ణయించడానికి ప్రయత్నించడం.
5. కావ్యహృదయాన్ని సరళమైన వాక్యాల్లో వివరించి, ఆ కావ్యాన్ని చదివే ఉత్సుకతను కలిగిస్తూ సమన్వయ దృష్టిని ప్రదర్శించడం.

6. కావ్యంలో ఉండే వస్తువు, అలాంటి వస్తువుకి దగ్గరలో ఉండే కావ్యాల్నీ ప్రయోగాన్ని సందర్భోచితంగా వివరించడం.

7. కావ్యాన్ని సంపూర్ణం గా చదివిన తర్వాతనే అభిప్రాయాన్ని రాయాడానికి ప్రయత్నించడం, అలాకానప్పుడు ఆ విషయం స్పష్టంచేయడం.

8. రచయితను ఎట్టి పరిస్థితుల్లోనూ నిరాశ పర్చేలా వ్యాఖ్యానించకుండా, సహృదయతతో, సౌకుమార్యంగా సూచనల్ని అందించే చక్కని శైలిని ప్రయోగించడం.

9. విధిలేక పీఠికలు రాసినా, ఆ విషయాన్ని వ్యంగ్యంగా విశదీకరించే చక్కని భాషాప్రౌఢిమను ప్రదర్శించడం.

10. కవిసమకాలికుడైనా, జీవించినా/ మరణించినా చెప్పదలిచిన అభిప్రాయాల్ని స్పష్టంగా అభివ్యక్తీకరించడం.

ఇవన్నీ ఆరుద్ర పీఠికల్లో కన్పించే అంశాలు. భాషా, ఛందోప్రయోగాల్ని వివరించడం కూడా ఆరుద్ర పీఠికల్లో కన్పించే ఇంకో అంశం. అయితే వీటన్నింటినీ కేవలం పరిచయ వాక్యాలుగానో, చిరు సమీక్షలుగా నో కాకుండా, విమర్శను పరిశోధన స్థాయిలో కొనసాగించే సృజనాత్మకతను ప్రదర్శించడం ఆరుద్ర పీఠికల్లో గొప్పతనం!

## 3.10. విమర్శకుడుగా ఆరుద్రః

వివిధ వ్యాసాలూ, గ్రంథాల్ని పరిశీలించినప్పుడు 'విమర్శకుడుగా ఆరుద్ర' వివిధ విమర్శ పద్ధతులను పాటించినా, ప్రధానంగా మార్క్సిస్టు విమర్శకుడుగానే స్పష్టమవుతున్నారు. మార్క్సిస్టు విమర్శను చేసినా, సంయమనాన్ని, సహృదయతనూ, నిర్మమత ప్రకటించిన ఆరుద్ర శ్రీశ్రీ విషయానికొచ్చేసరికి రెండు రకాలుగా విమర్శను కొనసాగించారు, విభేదాలు రాకముందు ఒక విధంగానూ, వ్యక్తిగత విభేదాలు వచ్చిన తర్వాత మరొక రకంగానూ శ్రీశ్రీ రచనల్ని విమర్శించడం వల్ల 'విమర్శకుడుగా ఆరుద్ర' లో కొన్ని లోపాలున్నాయని చెప్పకతప్పలేదు. శ్రీశ్రీ విషయంలో ఆరుద్ర విమర్శలో కొన్ని లోపాలున్నప్పటికీ, మిగిలిన అన్ని రచనల్నీ చారిత్రక, కవి జీవిత అనువర్తిత విమర్శను కూడా అనుసరించడం, భాషాశాస్త్ర విషయంలో శాస్త్రీయ దృక్పథాన్ని ప్రదర్శించడం వంటివన్ని 'విమర్శకుడుగా ఆరుద్ర' స్థానాన్ని తెల్పుతున్నాయి. గుడిలో సెక్స్, కన్యాశుల్కం వంటివాటిని విశ్లేషించినప్పుడు విమర్శలో పరిశోధనాంశాల్ని చేర్చి పరిశోధక విమర్శకుడిగా ఒక విశిష్టస్థానాన్ని పొందగలిగారు. అయితే, విమర్శలో మాత్రమే కాకుండా పరిశోధనతోనూ సృజనాత్మకతను ప్రదర్శిస్తూనే పరిశోధకుడుగా ఒక విశిష్టస్థానాన్నెలా పొందగలిగారో తరువాత అధ్యాయాల్లో అధ్యయనం కొనసాగుతుంది.

# సూచికలు (Referances)

1. సంజీవమ్మ, *సాహిత్య విమర్శ–మార్క్సిస్టు దృక్పథం* (వ్యా), (సం) తుమ్మల వెంకట్రామయ్య, అభ్యుదయ–విమర్శ విశేష సంచిక–1980, ఆగస్టు, అరసం: ప్ర.స్థ.?,పు.34.

2. Mudigonda Veerabhadriah, ***MAJOR CRITICS OF MODERN TELUGU LITERATURE***, Pallavi Publications : Vijayawada, First Edition, 1998, p.29,31.

3. ముదిగొండ వీరభద్రయ్య, *విమర్శ మౌలిక లక్షణాలు*, తెలుగు అకాడమి ప్రచురణ: హైదరాబాదు, ప్ర.ము.1990,పు.74.

4. అదే.పు.94.

5. సంజీవమ్మ.పు.33–41.

6. ఎస్.గోపి. *ప్రజాకవి వేమన*, ఎస్.అరుణ ప్రచురణ: హైదరాబాదు. ప్ర.ము.1980,ద్వి.ము.1992, పు.224.

7. అదే.పు.240.

8. అదే.పు.347.

9. అదే.పు.354.

10. జ్వాలాముఖి, *సామాజిక వైరుధ్యాల మధ్య వేమన*(వ్యా), (సం) కె.కె.రంగనాథాచార్యులు, తెలుగులో తొలి సమాజ కవులు, ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రచురణ : హైదరాబాదు, ప్ర.ము.1983,పు.104,113.

11. అదే.పు.116.

12. అదే.పు.117.

13. అదే.పు.118,119.

14. కె.కె.రంగనాథాచార్యులు, *సంపాదకీయ వ్యాసం, తెలుగులో తొలి సమాజ కవులు*, ప్ర.ము.1983, ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రచురణ : హైదరాబాదు, పు.xxxvi-xxxviii.

15. జి.వి.సుబ్రహ్మణ్యం, *ఆంధ్ర సాహిత్య విమర్శ – ఆంగ్ల ప్రభావం:* పు.149.

16. శ్రీ శ్రీ, *మనగురజాడ*, (కూర్పు) చలసాని ప్రసాద్, విరసం ప్రచురణ : విశాఖపట్టణం, 1988, పు.22,62.

17. అదే.పు.56.

18. కఠెవరపు వెంకట్రావు, *కన్యాశుల్కం–చారిత్రకనేపథ్యం* (వ్యా) (సం)నిర్మలానంద ప్రజాసాహితి, కన్యా శుల్కం ప్రదర్శన శత జయంతి ప్రత్యేక సంచిక – ఆగస్టు, 1992, పు.115.

19. సి.నారాయణరెడ్డి, *ఆధునికాంధ్ర కవిత్వము–సంప్రదాయములు : ప్రయోగములు*, పు.206.

20. ఆరుద్ర, *సమగ్ర ఆంధ్ర సాహిత్యం* (11వ సంపుటి) పు.ము, పు.225,226.

21. సి.నారాయణరెడ్డి, *ఆధునికాంధ్ర కవిత్వము–సంప్రదాయములు : ప్రయోగములు*, పు.586.

22. శ్రీ శ్రీ, *మన గురజాడ*, పు.60.

23. సి.నారాయణ రెడ్డి, పు.246.

24. మరువాడ రాజేశ్వరరావు, *గురజాడ మార్క్సిస్టు దృష్టి* (వ్యా), ప్రజాసాహితి– ఆగస్టు–1992, పు.136.

25. సోమయాజుల వెంకట రామమూర్తి, (సం.లు)మొదలి నాగభూషణ శర్మ, ఏటూకూరి ప్రసాద్, *కన్యాశుల్కం నూరేళ్ళ సమాలోచనం*, పు.310.

26. కేతవరపు రామకోటశాస్త్రి , *కన్యాశుల్కం–నూరేళ్ళ సమాలోచనం*, పు.393.

27. ఎస్.గంగప్ప, *కన్యాశుల్కం–నూరేళ్ళ సమాలోచనం*, పు.335,336.

28. ఆర్వీయార్, *భగవద్గీత–మార్క్సిజం*, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ : హైదరాబాదు, జూలై,2002, పు.62.

29. *శ్రీ శ్రీ మహాప్రస్థానం* (క.సం.), 1940, (కూర్పు) చలసాని ప్రసాద్, 1999, విప్లవ రచయితల సంఘం, ఆంధ్ర ప్రదేశ్ ప్రచురణ : విశాఖ పట్టణం, పు.65.

30. *శ్రీశ్రీకి ఆరుద్ర జాబు* (లేఖ) ఆరుద్ర అభినందన సంచిక, (సం) బి. ఎస్. ఆర్.కృష్ణ, ఆరుద్ర షష్ఠి పూర్తి ఉత్సవ సంఘం, మదరాసు, 1985,పు.102.

31.. ఎల్. సంగయ్య, పు.3.

32. సి.నారాయణరెడ్డి. పు.535.

33. రామమోహనరాయ్, *తెలుగు కవితా వికాసం*(1947-1980), ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ : హైదరాబాదు, 1982, పు.234.

34. *ఆరుద్ర అభిప్రాయం,* చల్లా రాధాకృష్ణ శర్మ వ్యాసం కమ్మని కలం చిత్రాలు ఆరుద్ర అభినందన సంచిక, పు.5.

35. సి.నారాయణరెడ్డి, పు.535.

36.. ఆరుద్ర, సినీవాలి- *సాహిత్యోపనిషత్,* విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ : హైదరాబాదు, ప్ర.ము.1987, ద్వి.ము.1990, పు.24.

37. శ్రీశ్రీ *మహాప్రస్థానం* - 1999, పు.84.

38. ఎస్వీ. సత్యనారాయణ, *రేఖాచిత్రాలు,* ఆంధ్ర ప్రదేశ్ అభ్యుదయ రచయితల సంఘం : హైదరాబాదు, 1987,పు.7.

39. కె.వి.యార్, *కవిపుంగవులు* (వ్యా), ఆరుద్ర అభివందన సంచిక, పు.61.

40. దాశరథి *అభిప్రాయం, ఆరుద్ర అభినందన సంచిక,* పు.62.

41. ఎస్వీ. సత్యనారాయణ, *రేఖాచిత్రాలు,* పు.8.

42. పురాణం సుబ్రహ్మణ్య శర్మ, *ఆరుద్ర అభినందన సంచిక,* పు.124.

43. డి.డి.కోశాంబి, *భారత చరిత్ర–పరిచయ వ్యాసాలు,* (అను) వి.రామకృష్ణ, హైదరాబాదు బుక్ ట్రస్ట్ ప్రచురణ : హైదరాబాదు. ప్ర.ము.1986, రెం.ము.1996, పు.26-27

44. అదే.పు.26.

45. అదే.పు.28.

46. ముదిగొండ వీరభద్రయ్య, *వివర్శ పరిభాషిక లక్షణాలు,* పు.4.

47. అదే.పు.92.

48. ఆరుద్ర *ప్రవేశిక (పీ), వయిద్దపళని–రాధికా సాంత్వనం,* ఎమెస్కో ప్రచురణ: విజయవాడ, 1997, పు. 9-20

49. ఆరుద్ర-*సంతోష కారణం* (పీ), ఎల్లోర-జానపద సాహిత్యం, దీప్తి పబ్లికేషన్స్ : హైదరాబాదు, 1982, పు.19-20

1982, పు.19-20

50. అదే. పు.21.

51. ఆరుద్ర, *గోరంత కృతజ్ఞత,* (పీ), పఠాభి-కవిత నాదయిత, వర్ధమాన సమాజం ప్రచురణః నెల్లూరు, పు.1.

52. అదే.పు.4.

53. అదే.పు.7

54. అదే.పు.8.

55. ఆరుద్ర, *హారతిరింపు,* (పీ), నూతలపాటి గంగాధరం-వెలుగులోకి (క.సం.) ఎస్వీ. పబ్లికేషన్స్, మద్రాసు, మొ.ప్ర.1974.పు.9.

56. ఆరుద్ర *పీఠిక, ముదిగొండ వీరభద్రమూర్తి—వందేమాతరం (స్వాతంత్ర్యోద్యమ చరిత్ర 1860—1906),* ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రచురణ : హైదరాబాదు, మొ.ప్ర.1977, పు.88.

57. ఆరుద్ర, *శుభాకాంక్షలు, (పీ) మార్గశీర్ష, ద్వా.నా.శాస్త్రి—సమాధిలో స్వగతాలు* (క.సం) (సం) బి.వి.రమణమూర్తి, శ్రీ శారదా ప్రింటింగ్ వర్క్స్, భట్నవిల్లి, మొ.ప్ర.1981. పు.6.

58. ఆరుద్ర, *ప్రవేశిక (పీ) ముద్దు పళని — రాధికా సాంత్వనం,* ఎమెస్కో ప్రచురణః విజయవాడ, 1997, పు.9.

59. అదే.పు.19

60. అదే.పు.19.

61. అదే.పు.21.

# అధ్యాయం-4

# సమగ్ర ఆంధ్ర సాహిత్యం : తొలిముద్రణ, పునర్ముద్రణల మార్పులు-చేర్పులు

అధ్యాయం-4

# సమగ్ర ఆంధ్ర సాహిత్యం: తొలి ముద్రణ పునర్ముద్రణల మార్పులు-చేర్పులు

## 4.0. ప్రధానమైన మార్పులు:

'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' తొలిముద్రణ మొదటి సంపుటిలో ప్రకటించిన యుగ విభజన ప్రణాళికకూ, మూడవ సంపుటి లో ప్రకటించిన యుగ విభజన (ఉజ్జాయింపుకాలాలు) కీ, పునర్ముద్రణలో యుగ విభజనకీ తేడా కన్పిస్తుంది. తొ.ము. మొదటి సంపుటిలో ప్రకటించిన ఆదిమ చాళుక్య కాకతీయ యుగాల్లో మార్పులు చేయలేదు. కానీ, పద్మనాయకయుగం తొ.ము.మొ.సంపుటిలో మొదటి సర్వజ్ఞ సింగమనాయకుని రాజ్యంవరకూ క్రీ.శ.1337-1399 వరకూ అని పేర్కొన్నారు. దీన్ని తొ.ము. మూ.సంపుటికి వచ్చేసరికి 1300-1375 వరకూ అని కాలాల్ని మార్పు చేశారు. రెడ్డిరాజులయుగం తొ.ము.మొ.సం.లో 1400-1450గా ప్రకటించి, మూ.సం.లో 1400-1450 గా ప్రకటించి, మూ.సం.లో 1375-1450 గా మార్పుచేశారు. తొ.ము. మొ.సం.లో గజపతులయుగం ప్రకటించలేదు. మూ.సం.లోనూ ఈ మార్పులేదు. కానీ నాల్గవసంపుటిలో 1435 నుండి గజపతులయుగం చేర్చారు. దీన్ని రెడ్డిరాజుల యుగానికి అనుబంధం వంటిదిగా పేర్కొన్నారు[1]. నాయకరాజుల యుగం మొ.సం.లో 1600-1670 గా ఒకే సంపుటిగా అందించాలనుకున్నది, తొ.ము. పదవ సంపుటి నాయకరాజుల యుగం-I (1600నుండి... రఘునాథనాయకుని పాలన) నాయకరాజుల యుగం-II 1670 వరకూ....విజయరాఘవ నాయకుని కాలం) అని రెండు సంపుటాలుగా మార్చేశారు[2]. అంటే తొ.ము. మొ.సం.కీ,11వ సంపుటిలో పేర్కొన్న యుగ విభజనకీ మార్పులు కన్పిస్తున్నాయి. కవుల వరుసల్ని మార్చారు. కాలాల్నీ సవరించారు. ఇటువంటి ఎన్నోప్రధానమైన మార్పుల్ని పు.ము.లో చేశారు.

పునర్ముద్రణలో ఆరుద్ర 'మనవిమాటలు' లో చెప్పుకున్న దానిలో పద్మనాయకయుగం 1337-1399, రెడ్డి రాజులయుగం 1400-1450 గా ఆదిలో ప్రణాళిక వేసుకొన్నట్లు ప్రకటించారు. కానీ తొ.ము లో మొ.సం.లోనే ఈ యుగ విభజన కన్పిస్తుంది. మళ్ళీ మూడవ సంపుటినుండి మార్పుచేశారు. ఇవన్నీ పై వివరణలో స్పష్టమవుతున్నాయి. వీటన్నింటినీ పుటల సంపుటాల వారీగా కింది విధంగా పరిశీలించడం వల్ల 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' లో తొలి ముద్రణ పునర్ముద్రణలలో చేసిన మార్పులు-చేర్పులు అవగతమవుతాయి.

## 4.1. మొదటి సంపుటి (ఆదిమ, చాళుక్య యుగాలు)

### *ఆదిమ యుగం*

పు.ము I (పు.1) లో మల్లియరేచన కవిజనాశ్రయంలో తెనుగు, తెలుగు అనే వాటిలో దేన్ని పేర్కొన్నాడో నికరంగా చెప్పలేమన్నారు ఆరుద్ర. బహుశా తెనుగు ప్రయోగం చేసి ఉండ వచ్చునన్నారు.

ఇది అదనంగా చేర్చిన సమాచారం.

♦ తొ.ము I (పు.3) లో శాతవాహనులు, పు.ము I (పు.2) లో 'సాతవాహనులు' 'శాతవాహన' పదానికి ప్రాకృతరూపమే 'సాతవాహన' సాతవాహన, 'శాతకర్ణి' పదాలు సమానార్థకాలుగా కన్పిస్తున్నాయి. 'సత', 'శత', 'సద' అనే హ్రస్వ రూపాలు నాణేలమీద ఉన్నాయి. ప్రాకృత వయ్యాకరణ హేమచంద్రుని ప్రకారం 'శాలివాహన' అనేది 'శాతవాహనకు' మరొక ప్రాకృత రూపం అని తెలుస్తుంది[3].

'జన ప్రభాసూరి' అనే జైన రచయిత ప్రకారం వందలకొలది (శతాని) వాహనులను (వాహనాల్ని) దానం చేసినందువల్ల శాతవాహనులయ్యారనే అభిప్రాయం ఉంది[4].

శాతవాహనుల అధికార భాష ప్రాకృతం. మాతృభాష తెలుగు[5]. పు.ము I (పు.2) ఇటీవల పరిశోధనల్లో సాతవాహనుల జన్మభూమి ఆంధ్ర దేశమేననీ, వారి భాషలో తెలుగు మాటలే ఉన్నాయనీ, పురాణాల్లో ఆంధ్ర భృత్యులూ, ఆంధ్ర రాజులూ, సాతవాహనులేనని పరిశోధకులు రూఢిగా చెప్పారు.

ఇది తొ.ము.లో లేదు.

♦తొ.ము (పు.3) లో 'పురవానూరు' లో "అయ్ మందిరం" అనే నాయకుని ప్రసక్తి ఉంది. పు.ము I (పు.) "ఆమ్ మందిరం." గా మార్పు చేశారు.

♦తొ.ము I (పు.6) లో పాదసూచికలో 'నాగబు' గురించి వివరిస్తూ '*ఆంధ్ర లిపికి మూలమంత్రాక్షరం*' గా భావించామన్నారు. పు.ము (పు.4) లో మూలంగా భావించారు. మార్క్సిస్టు భావజాలానికి అనుగుణంగా సంప్రదాయ భావన 'మంత్రాక్షరం' అనేది తొలగించడం గమనించవచ్చు.

♦తొ.ము I (పు.19) తెలుగు, సంస్కృత భాషా జన్యం కాదని అప్పటికి దీన్ని, వివిధ వాదనలను బట్టి చెప్పారు. కాని. పు.ము (పు.14)లో దీన్ని శాస్త్రీయంగా భాషాశాస్త్రజ్ఞుడు M.S.Andronov పరిశోధనలను ఉటంకిస్తూ ద్రావిడభాషల వ్యవహార భౌగోళిక పటాన్ని కూడా చేర్చారు.

♦తొ.ము I (పు.23) లో లేని కూబీ భాషను మాట్లాడే కొండదొరల గురించి పు.ము I (పు.18) లో ప్రస్తావించారు. తాము పాండవుల సంతతిగా కొండదొరలు చెప్పుకొంటారని రాశారు.

ఆదిమ సమాజాల్లో స్త్రీ పురుషులు పనుల్లో పాటపాడుకొంటూండేవారనీ, శృంగార, హాస్య, పదలాలిత్యంతో కూడి ఒక సమిష్టి జీవనానికి పాట తోడ్పడేదని సవరల జీవితాన్ని గురించిరాసిన

గిడుగు వారి భావాల్ని పేర్కొనడం.తొ.ము. I (పు.30) లో లేదు. ఇది పు.ము I (పు.23) లో అదనపు సమాచారం.

♦ తొ.ము. I (పు.30) లో గాథాసప్తశతిలో గల 'చక్కగాదంచిన .....'పాట ఏడవవందలోని 89వ గాథ అని పేర్కొనగా, పు.ము I (పు.24) లో 98 గాథ అని సరిదిద్దారు.

పు.ము I (పు.27-31) లో తొ.ము. I లో లేని సాతవాహనుల రాజకీయ ప్రాభవం పేర్కొని, వారి కాలంలో గల ప్రాకృత భాషనీ, బ్రాహ్మీలిపినీ, వాడుకలో ఉన్న నాణాల్నీ భౌగోళిక పటంతో సహా వివరించారు. సాతవాహనులు తమ నాణాలపై ఒకవైపు ప్రాకృతంలోనూ, రెండోవైపు తెలుగులోనూ తమ నామధేయాల వక్కణాన్ని బ్రాహ్మీలిపిలో, మాత్రాఛందస్సులో చెక్కించారన్నారు. వీటిని సోదాహరణంగా వివరించారు. వీటితో పాటు గాథా ఛందస్సు కూడా విరివిగా ప్రచారంలో ఉందని, తెలుగు ఛందస్సుకీ, గాథా ఛందస్సుకీ మధ్య సంబంధాల్ని పరిశీలించారు.

♦తొ.ము. I (పు.68) లో లేని మగన్టు లోని బండి 'ఱ' 'రు'కు కాక 'డు' కు చిహ్నం కావచ్చని, పు.ము I (పు.54) లో ఊహను చేర్చారు.

♦తొ.ము. I (పు.72) లో లేని అంశం పు.ము I (పు.57) లో బూదరాజు రాధాకృష్ణ 'ప్రాచీనాంధ్ర శాసనాలు' గ్రంథంలో 'నాగబు'దగ్గర నుంచి క్రీ.శ 1100 వరకు లభ్యమైన శాసన ప్రతులు తయారు చేసిన విషయాన్ని స్పృశించారు.

♦తొ.ము. I (పు.77) లో లేని అంశం పు.ము I (పు.59) లో రేచన ద్విపద లక్షణం గురించి వివరించి చెప్పారు.

♦తొ.ము I (పు.77) లో లేని అంశ పు.ము I (పు.60) లో నన్నయ 'తరువోజ'ను వాడారు గాని ద్విపదను వాడలేదు. కనుక అది ప్రాచీనం కాదా అని మన పరిశోధకులు భావిస్తారని చేర్చారు.

♦తొ.ము. I (పు.78) లో పాల్కురికి సోమనాథుని కాలంనుండీ ద్విపదలు కన్పిస్తున్నాయనే అమరేశం రాజేశ్వర శర్మ ప్రతిపాదనను అంగీకరించారు. పు.ము I (పు.60) లో ఆ ప్రతిపాదన సమంజసంగా కన్పిస్తుందేమోగాని, నన్నయ కు ఒకే శతాబ్ది పూర్వుడు మల్లియరేచన తరువోజ, ద్విపదలకు విడివిడి లక్షణాలు చెప్పాడు కనుక, అతని కాలంలో రెండూ ఉండేవి అన్నారు.

♦తొ.ము I (పు.93) లో నన్నయ కు ముందు గల వచన రచనల్లో వ్యాకరణాన్వయానికి లోబడని వాక్యాలలో ఉండడాన్ని చూస్తే, ఆ నాడు వచన రచనలేదనిపిస్తుందని చెప్తూనే, నన్నయ వచన రచనకు దగ్గరలో ఉన్న గద్య కుసుమాలు ఆనాడు వికసించక పోలేదనికొని శాసనం లోని వాక్యాల్ని ఉదాహరించారు. కాలంకూడా తొమ్మిదవ శతబ్దపు మధ్యకాలందన్నారు. పు.ము I (పు.72) "నన్నయ" కు బదులు "శిష్టకావ్యాల వచన రచనకు దగ్గరలో" అన్నారు. 850 నాటి ధర్మవరం శాసనాన్ని ఉదాహరించారు.

♦తొ.ము. I 'ఆదిమ యుగం' అనే ప్రకరణం "అనగనగా ఒక ఈగ ఇల్లలుక్కొంటూ తన పేరు మరిచిపోయిందట"......అంటూప్రారంభించి.

"ఇల్లలికాక ..... ఇక పండుగే ! " అని ముగించారు. తొలి ప్రకరణం 95 పుటల్లో రాశారు. పు.ము. I (136-73) లో ఇంతవరకూ జరిగిన చేర్పులతో పాటు ఇంకా 63 పుటల అదనపు సమాచారం 'ఆదిమయుగం'లో చేర్చారు.

ఈ అదనపు సమాచారం ప్రధానంగా, సాహిత్యం పట్ల దృక్పథాన్ని (పు 74) చెప్తూ, ప్రజలే సాహిత్య చరిత్రను సృష్టించుకుంటారను గతితార్కిక భౌతిక వాద దృక్పథాన్ని ఉదహరించారు.

వివిధ కోణాలనుండి సాహిత్య చరిత్రను అధ్యయనం చేయాలి. ఆంధ్రులు, ఆంధ్రభాషను వేదాలు, బ్రాహ్మణాలు, చారిత్రకంగా కన్పించే శాసనాలు పరిశీలించి, తెలుగు వారి సంస్కృతికి సంబంధించిన విషయాలు వివరించారు. జైన, బౌద్ధ మతాల ప్రభావం తెలుగు సాహిత్యం మీద పడిందన్నారు. తెలుగు వాళ్ళ మొదటి ఛందో గ్రంథం జైన రచనే నన్నారు. (పు.101) కేతన దశకుమార చరిత్ర, మంచెన 'కేయురబాహు చరిత్ర' లలో ఆనాటికి తెలుగు దేశంలో ఉన్న జైన ప్రభావం కన్పిస్తుందన్నారు.

♦తొ.ము I లో లేని ఒక కొత్త అంశం. తెలుగు లో ఆదికవి గురించిన చర్చ పు.ము (పు.112) కన్పిస్తుంది.

♦తొ.ము (viii) (131-132) లో "లింగమ కుంట సర్వకవి" శీర్షికతో తొందరపడి రాశానని తొ.ము I సం. (పు.114) లో ఆరుద్ర చెప్పుకున్నారు. ఈకవి తెనాలి రామకృష్ణుని అల్లుడు. లింగమ కుంట రామయ్య అని ఆరుద్ర పు.ము I లో చెప్పారు.

"సర్వదేవుడు" అనే అర్వాచీన కవి కోసం గాలించి గుర్తించానే తప్ప, అతడు 'ఆది పురాణం' అనే జైన గ్రంథాన్ని రాసి వుంటాడు అని లోతుకు వెళ్ళి ఆలోచించలేదు. అని పు.ము I (పు.114) లో ఒప్పుకున్నారు. నేలటూరి వెంకటరమణయ్య, నిడదవోలు వెంకటరావులు, పొన్నమయ్య నే సర్వదేవుడనీ, తెలుగులో "ఆది పురాణం" రచించాడని నిరూపించినదానినే ఆరుద్ర సమర్థిస్తూ పు.ము.I లో (117) వివరించారు. దీన్ని తనదైన పరిశోధనా పటిమను ప్రదర్శిస్తూ ఛందోవిధానాన్ని విశ్లేషించారు. "పొన్నడు" "పొన్నమయ్య" లనే "సర్వదేవుడు" గా పూర్వ పరిశోధకుల ఫలితాలను ఆధారంగా చేసుకొని, ఆంధ్ర మహాభారత కర్త నన్నయ్యకు ముందే తెలుగులో కవిత్వం ప్రచారంలో ఉందన్నారు. 'ఆది పురాణం' లో కొన్ని పద్యాలే దొరుకుతున్నాయి గాని, మిగిలిన వన్నీ లభిస్తే, 'పొన్నమయ్య' తెలుగులో ఆదికవి అవుతారన్నారు. పు.ము I (పు.118)

♦తొ.ము I లో లేని మల్లియ రేచన 'ఆదికవి' చర్చ ద్వి.ము-I లో కన్పిస్తుంది. దీనితో పాటు మల్లియరేచన 'కవిజనాశ్రయం' గురించిన సుదీర్ఘ చర్చ కూడ దీనిలో చేశారు. కుల ప్రభావం వల్ల రేచనను కవులు పూర్వ కవి స్తుతిలో పేర్కొనడానికి వెనుకంజవేశారని, భీమన ఛందంగా పేర్కొన్నారనీ, "కవిజనాశ్రయం"లో గల ఛందస్సుని అనుసరించి దీనికి భీమన ఛందస్సు అన్నారనీ, రచయితకు

రావల్సిన కీర్తిని రానీయకుండా అడుపడ్డారనీ, నిజం నిలకడమీద తేలక పోదు అన్న సామెతకు రేచన కవిజనాశ్రయం చక్కని నిదర్శనమని నిరూపించిన పరిశోధన కృషి ది.ము I (136) కన్పిస్తుంది.

*చాళుక్య యుగం*

♦తొ.ము. I లో (పు.101) 100వ పుటలో లేని అంశం. "ఈ రామకథను వావికొలను సుబ్బారావు అనువాదాన్ని కూడా పేర్కొని:కుశలవులను 'మార్గమ' ను సంగీత విధానాన్ని అనుసరించి 'రామచరిత్ర'ను పాడినట్లు చెప్పారు. ప్రజాకళలు ప్రభువుల ప్రాంగణాలలోకి వెళ్ళగానే క్లాసికల్ ఆహార్యాన్ని ధరిస్తాయని ఇది సంగీతంలో మరీ ఎక్కువ జరుగుతుందని చెప్పారు. ఇది పు.ము I (143)లో ఉంది.

♦తొ.ము I (పు.103) లో తెలుగు గడ్డ మీద జన్మించిన కవులు కన్నడం, సంస్కృతం, ప్రాకృతాలలో రాసిన కావ్యాలు దొరుకుతున్నాయి. తెలుగులో రాస్తే దొరకవు రాయలేదని కొందరు సిద్ధాంతీకరిస్తున్నారు. కవులున్నారు గాని కావ్యాలు లేవని మనం భావించాలి అని ఉన్నదానికి 'భావించాలి కాబోలు' అని అన్నారు. నన్నయ పూర్వ్యం ఉన్న భాషా స్థితిని మల్లంపల్లి సోమ శేఖర శర్మ, నేలటూరి వేంకట రమణయ్యలు చెప్పిన దాన్ని పేర్కొని బూదరాజు రాధాకృష్ణ అముద్రిత పరిశోధనా వ్యాసంలోని అంశాల్ని ఆధారంగా చేసుకొని ప్రాక్సాహిత్య దశ, కావ్య భాషాదశలను పరిచయం చేసి 7వ శతాబ్దం నుంచే మన భాషల కావ్యశైలి ఏర్పడిందని చెప్పిన కోరాడ మహదేవశాస్త్రి పరిశోధనను ఉటంకించారు. ఇది (పు.142 నుండి 144 వరకు) ఆదనపు సమాచారం.

♦తొ.ము I (పు.116) నన్నయ కాలానికి ముందు ఉన్న మల్లియ రేచన కాలాన్ని చెప్పలేదు. కాని పు.ము (పు.153) లో క్రీ.శ 940 లో మల్లియ రేచన కవిజనాశ్రయాన్ని రచించినట్లు చెప్పారు.

♦తొ.ము. I (పు.118) సంస్కృత శబ్దాలను కన్నడం చేసారని చెప్తూ పంపన, రన్నడలను మాత్రమే తొ.ము I (పు.118) లో పేర్కొంటే పు.ము I (పు.155) లో పొన్నమయ్యను కూడ చేర్చారు.

♦తొ.ము I (పు.126) లో దివాకర్ల వేంకటావధాని నన్నయ భారతాన్ని మాత్రమే పరిశీలించి భారతం పట్ల తన అభిప్రాయాన్ని వ్యక్తం చేయగా పు.ము I (పు.161) లో జొన్నలగడ్డ మృత్యుంజయరావు సిద్ధాంత గ్రంథం 'వ్యాస భారతం-నన్నయ పరిష్కారం' కూడా పరిశీలించారు.

♦తొ.ము I (పు.133) లో 'ఆంధ్ర శబ్ద చింతామణి' ని నన్నయ రాసినట్లు కొంతమంది నమ్మారని అన్నారు. కానీ, పు.ము I (పు.167) లో ఈ వ్యాకరణ గ్రంథాన్ని ప్రామాణిక బలం కోసం నన్నయకు అంటగట్టారని నమ్మకంగా చెప్పవచ్చని స్పష్టం చేశారు.

♦తొ.ము I (పు.137) లో శాసనం కుడా కావ్యం వలే ఉంటుందని నన్నయ రాసిన ఓ శాసన భాగాన్ని పేర్కొని, తర్వాత అంశానికి వెళ్ళిపోతే, పు.ము I (పు.169)లో శాసన లేఖకుల్ని "సాంధి

విగ్రహకులు, మహాసాంధి విగ్రహకులు" అని పిలవడం వేములవాడ చాళుక్యుల కాలంలో కన్పించేది. నన్నయ కూడా "సాంధి విగ్రహకులై" ప్రసిద్ధి పొంది ఉంటారు.

"సాంధ విగ్రహకులు" అంటే మంత్రులు, అన్యరాజులతో సంధిగాని, యుద్ధంగాని వీరి వల్ల జరిగేదనే చరిత్ర పరిశోధకుల అభిప్రాయాలు పొరపాటని పేర్కొన్న నేలటూరి వెంకట రమణయ్య అభిప్రాయాల్ని ఆరుద్ర సమర్థించి, వాక్య రచనలోనూ, శబ్దాల్ని కూర్చటంలోనూ, నైపుణ్యం గలిగిన వారిని "సాంధి విగ్రహకులు" గా భావించవచ్చునన్నారు. ఈ కారణాల వల్లనే నన్నయకు "విపుల శబ్ద శాసనులు" అనే విశేషణం వచ్చి ఉండుందని ఆరుద్ర భావించారు.

చరిత్ర పరిశోధకుల ఫలితాంశాల్ని, నన్నయకు అన్వయించి చెప్పటం వల్ల సాహిత్య చరిత్రకు కొత్త ఆలోచనను అందించినట్లయ్యింది.

♦తొ.ము I (పు.140) లో బ్రాహ్మణులకు దానం చేయడం నన్నయకు సరదా అని మూలంతో తులనాత్మకంగా పరిశీలించ లేదు. ఇది పు.ము I (పు.172-174) వరకు కనిపిస్తుంది. వ్యాస భారతంలో బ్రాహ్మణ ప్రశంస ఆధిక్యత దానాలు కొంచెంగా కన్పిస్తున్నా, ఆంధ్ర మహాభారతంలో ఎక్కువగా కనిపిస్తున్నాయని రెండు మహాభారతాల్ని తులనాత్మకంగా పరిశీలిస్తూ దీనిలో పరిశోధన చేసిన వారి కృషిని కూడా ప్రస్తావించడం ఉంది. ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి వ్యాస భారతంలో ఉన్నవే నన్నయ తెలుగు భారతంలో పెట్టారని వాదించిందాన్ని పూర్వ పక్షం చేయడానికి జొన్నలగడ్డ మృత్యుంజయరావు సిద్ధాంత వ్యాసాన్ని ఆధారంగా చేసుకొని సోదాహరణంగా నిరూపించారు.

♦తొ.ము I (పు.142)లో ప్రసన్న కథాకలితార్థయుక్తిని చెప్పడానికి విశ్వనాథ సత్యనారాయణ వ్యాఖ్యానాన్ని మాత్రమే ఆరుద్ర స్వీకరించి సమర్థించారు. కాని, పు.ము I (పు.175)లో వివిధ పాఠాంతరాల్ని ప్రముఖుల అభిప్రాయాల్ని పేర్కొన్నారు.

'నన్నయ మీద పంపన భారత ప్రభావం ఉంది. కవితా ధర్మాలు, ఛందో వైవిధ్యంలో ఇద్దరిలోనూ పోలికలు కనిపిస్తాయి. అయితే కథా కథనం చేయడంలో ఉద్దేశ్యాలు వేరు. పంపన లక్ష్యం తన ప్రభువు అరికేసరికి, అర్జునుడికి అభేదం కల్పించి భారతాన్ని ప్రబంధంగా కథనం చేయడం.

నన్నయ 'అధిక ధీయుక్తి'తో మహాభారత అర్థాన్ని నిరూపించి తెలుగు వాళ్ళకందించటం లక్ష్యం పాండవులది చంద్ర వంశం కావడం రాజరాజనరేంద్రుడిది అదే వంశం కావడం వల్ల భారత రచనకు ప్రేరణ అయ్యింది. ఇది నన్నయ్య,పంపన రచనలులో గల పోలికలు భేదాలు. వీటిని ఆరుద్ర చర్చించారు.

అక్కిరాజు ఉమాకాంతవిద్యాశేఖరులు, నన్నయ పరరాష్ట్రాలనుండి వచ్చిన ఆనాంధ్రుడు అనే వాదాన్ని లేవదీసారు. దీన్ని ఆరుద్ర నన్నయ పేరులో ఉన్న శబ్దానికున్న అర్థాన్ని కూడా చర్చించి దీనికి శాసనాలలో ఉన్న ప్రయోగాల్ని పరిశీలించారు. 'నన్ని' శబ్దం నుంచే నన, నల్లన అనే పదాలు తమిళంలో ఉన్నాయి. 'నల్ల' అంటే మంచి అని అర్థం. 'నల్ల' శబ్దానికి వేదాలనీ 'నల్లార్' అంటే 'వేదవిదులని' అర్థం. బ్రాహ్మణ అగ్రహారానికి 'నల్లండ్లు' అనేది దేశ్య రూపం. నన్నయ 'నల్లిండ్లు' ప్రయోగం చేసాడు.

ప్రాజ్ఞన్నయ యుగంలో వ్యక్తి నామాలుగా నల్లయ, నల్లాతణ్ నల్లుడు అనే పేర్లు కనబడతాయి. వీటిలో 'నల్ల' శబ్దం రంగుకాక మంచితనాన్ని 'వేద పాండిత్యాన్ని' సూచిస్తుంది. బూదరాజు రాధాకృష్ణ 'ప్రాచీనాంధ్ర శాసనాలు' లో ఈ వివరణ స్పష్టంగా కనిపిస్తుంది. వీటన్నింటినీ విశ్లేషించి, 'నన్న' పదాన్ని ఆధారం చేసుకొన్నా, అక్కిరాజు ఉమాకాంతవిద్యాశేఖరుల వాదం నన్నయ అనాంధ్రుడని వాదించడం ఎంతమాత్రం సమంజసంగా లేదని దాన్ని పూర్వ పక్షం చేశారు.

చాళుక్యులకీ, చోళులకీ మధ్య బంధుత్వాల్ని చర్చించి, రాజరాజనరేంద్రుడు బహుశా తంజావూరులో జన్మించి ఉండవచ్చునన్నారు. నన్నయ తెలుగువాడేనని వివరించారు.

మహా భారతాన్ని ఆంధ్రీకరించమని రాజరాజనరేంద్రుడు, నన్నయను అడిగిన కాలమూ రచన కొనసాగిన, ఆగిపోయిన కాలాల్ని ఆరుద్ర ఊహించారు. అవి 1052 నుంచి భారత రచన కొనసాగుతూ 1061లో ఆగిపోయి ఉంటుంది. రాజరాజ నరేంద్రుడు పదవీచ్యుతుడు కావడంతో భారత రచన ఆగిపోయిందనే చరిత్ర కారుల ఊహలను ఉటంకించారు.

భారత రచన ఆవిర్భావం, కన్నడ ప్రభావం, పంప భారతానికీ, నన్నయ భారతానికీ మధ్యగల పోలికలు, భేదాలు నన్నయ ప్రాంతం వంటివన్నీ, పు.ము I లో అదనంగా చేర్చిన అంశాలు.

*నన్నెచోడుడు.*

♦తొ.ము I (పు.143) లో నన్నెచోడుడు కి ముందు 'నాల్గవ ప్రకరణం' గా 'పావులూరిమల్లన' ను గురించిన వివరించగా పు.ము I (పు.187) లో నన్నెచోడుని తర్వాతనే పావులూరి మల్లనను వివరించారు.

♦తొ.ము.I (పు.155) లో లేనిమానవల్లి రామకృష్ణ కాలాన్ని పు.ము I (పు.187) లో 1866-1957 అని పేర్కొన్నారు. పు.ము I (పు.190)లో నన్నెచోడుని వస్తుకవితను చర్చిస్తూ, తెలుగు కావ్యాల్లో ఎక్కడా దొరకలేదు. మల్లియ రేచన కవిజనాశ్రయం లో 'వస్తుకవి జనాశ్రయుణ్ణ' అని చెప్పుకున్నాడు. కన్నడ సాహిత్యంలో వస్తుకవిత ఉండేదని కన్నడంలో ఆదికవి పంపన వస్తు విద్య, వస్తుకృతి అనే మాటలు ప్రయోగించాడు. కన్నడ వాఙ్మయాన్ని నన్నెచోడుడు చదివి ఉంటాడు. క్రీ.శ.853 నాటికే కన్నడంలో 'అసగుడు' అనే పేరు గల కవి రచించిన 'కుమార సంభవం' ప్రచారంలో ఉండి ఉంటుంది. ఇది నన్నెచోడుడు చదివినా, చదవకపోయినా, వస్తువిద్యను పట్టుకొని, వస్తుకృతిని తెలుగులోకి తెచ్చాడు.

నన్నెచోడుని వస్తుకవిత గురించిన మరింత సమాచారం పు.ము I లో చేర్చారు. తిమ్మావఝల కోదండ రామయ్య వస్తుకవిత్వం గురించి చేసిన పరిశీలనను పేర్కొనడంలో కన్నడ, తమిళ సాహిత్యాలనుంచి వస్తుకవిత అనే సంప్రదాయాన్ని నన్నెచోడుడు స్వీకరించాడని పు.ము I (పు.191) లో ఉంది. కానీ, తొ.ము I (160) లో తమిళం నుంచి కూడా స్వీకరించి ఉంటారనే తిమ్మావఝలవారి అభిప్రాయంలేదు.

♦తొ.ము I (పు.170) లో నన్నెచోడుని కుమారసంభవంలో పార్వతి, మల్లికార్జున యోగిని ఆరాధిస్తుంది. ఈ మల్లికార్జున యోగి ఎవరై ఉంటారని చర్చిస్తూ, జైన మహాచార్యుల్ని ఓడించిన వాళ్ళలో 'వాదీంద్ర చూడామణి' అనే ఆచార్యుడు ఉన్నాడేమోననీ, ఈ వాదీంద్రుడే తెలుగులో మొదటి

లక్షణ గ్రంథాన్ని రాసిన మల్లియరేచన గురువు అని తేల్చగా పు.ము I (పు.198) లో ఒక వాదీంద్రుడు అనేది ఈ వాదీంద్రుడు స్థానంలో పెట్టారు. అంతేకాకుండా నన్నెచోడునికి రేచన కొన్ని తరాల ప్రాచీనుడనీ పేర్కొన్నారు.

పు.ము I (పు.199) నన్నెచోడుడు ఒరయూరుపురాధీశ్వర అనిచెప్పుకోవడాన్ని పరిశీలిస్తూ 17వ శతాబ్ది ప్రథమ పాదంలో పర్తియాల సంస్థానం పాలకులు జూపల్లి వారుకూడా తాము ఒరయూరు పురాధీశ్వరులమనే చెప్పుకున్నారు ఎలకూచి బాల సరస్వతి 'చంద్రికాపరిణయం'లో ఉంది. ఇది తొ.ము I లలో లేదు. ఎప్పుడో తమ వంశం వారు పాలించిన ప్రాంతాన్ని వదిలి పెట్టినా, ఆపేరు చెప్పుకోవటం బిరుదుగా ఆరుద్ర ఊహించారు.

♦తొ.ము I (పు.176-178)లో కుమార సంభవం ఆ శ్వాసాల్లో, కథ ఎత్తుకొనే మొదటి గద్య పద్యాల విభక్తుల పట్టిక కీ, పు.ము I (పు.202-204) లో తేడా కన్పిస్తుంది. ఇది ముద్రణా దోషమని తెలుస్తుంది. ఆ శ్వాసాల క్రమం పు.ము I లో తప్పింది.

♦తొ.ము I(పు.186) తెలుగులో నన్నెచోడుడు ఆదికవి అనే పేరుకి నోచుకోక పాయినా, చాలా విషయాల్లో ఆద్యుడనీ, ప్రప్రథమ ప్రబంధపరమేశ్వరుడని పరిశోధకులు భావించినవాటిని పేర్కొని, అది సత్యమే అయినా, కొత్త పీట వేసికొలుచు కోవటం మంచిదనీ, ప్రబంధ ప్రభాపతి గా అభివర్ణించి ముగించారు. పు.ము I (పు.211) లో దీన్ని పొడిగించి మరికొన్ని పరిశోధన వివరాల్ని చేర్చారు. నన్నెచోడుని 'కుమార సంభవం' అనే ప్రాచీన కావ్యం ఏదోలేదని మానవల్లి రామకృష్ణకవిగారే దానిని రాసి తమ వ్రాత ప్రతికి పుత్రికగా ఒక తాళపత్రి ప్రతిని పుట్టించి, దానిని తంజాపూరు సరస్వతీ మహాలు గ్రంథాలయం లోనికి స్మగుల్ చేశారనే కొర్లపాటి శ్రీరామమూర్తి వాదాన్నీ పేర్కొన్నారు.

దీనికి సంబంధించి సరస్వతీ మహాలు గ్రంథాలయంలో తాళపత్ర గ్రంథాన్ని 'కుమార సంభవం'లో కన్పిస్తొండడం వల్ల తమిళ తొలి కావ్యం 'కళింగత్తు పరణినీ' ఈ కావ్యానికి కారణభూతుడైన కులోత్తుంగ చోళుని కాలాన్ని కూడా పరిశీలించారు. వేటూరి ప్రభాకర శాస్త్రి, శ్రీధరమూర్తి వంటి పరిశోధకుల సంబంధిత విషయాల్ని, శాసన ప్రమాణాల్ని పరిశోధించి నన్నెచోడుని కాలం క్రీ.శ. 1080-1130 ప్రాంతాల వికావచ్చునన్నారు. కుమార సంభవమనే తెలుగు కావ్యం కూట సృష్టి అనే నీలాపనిందను ఎవరూ సీరియస్‌గా పట్టించుకొన్నట్లు లేదు. అయితే నన్నచోడుని కావ్యాన్ని మాత్రం సాహితీ పరులు సీరియస్ గా అధ్యయనం చేయాలి. అది మన ప్రథమ సమీప బంధుర ప్రబంధంగా తేల్చి ముగించారు. ఈ పరిశోధన తొ.ము I లో కంటే పు.ము I లో సుమారు (211-217) ఆరు పుటలు అదనంగా చేర్చారు.

## బద్దెన

అమృత నాథుడు, మరికొందరు శీర్షికతో కొంతమంది కవుల్ని తొ.ము I లో బద్దెనను వివరించలేదు. పు.ము I (పు.218-229) చేర్చారు.

## పావులూరి మల్లన

పు.ము I (పు.230) లో నన్నెచోడుడు, బద్దెనల తర్వాత పావులూరి మల్లనను వివరించారు. తొ.ము I లో మాత్రం పావులూరి మల్లన తర్వాతనే నన్నెచోడుడిని పెట్టారు. 'సారసంగ్రహ గణితం' రాసిన పావులూరి మల్లనకు రాజరాజనరేంద్రుడు ఒక అగ్రహారాన్ని ఇచ్చాడని వీరేశలింగం రాశారు. పావూలూరి మల్లనను కాదని ఇతరులంటున్నారు. అని తొ.ము I (పు.144) లో కంటే పు.ము I (పు.230) లో వేటూరి ప్రభాకర శాస్త్రి రుజువుచేశారని స్పష్టంగా ఆరుద్ర ప్రకటించారు.

పు.ము I (పు.230) నన్నెచోడుడుని పరిశీలించిన తర్వాతనే 'రాసిన పావులూరి మల్లన' ప్రకరణంలో 'మొదటి తెలుగుకావ్యాన్ని ప్రారంభిస్తూ నన్నయ....' అనడాన్ని బట్టి నన్నెచోడుడు రాసిన 'కుమార సంభవం' తెలుగులో తొలికావ్యం అవ్వదనీ, నన్నెచోడుడు ఆదికవి కాడనీ స్పష్టమవుతుంది. సంస్కృతంలో 'గణిత సార సంగ్రహం' రచించిన మహావీరాచార్యుల రాష్ట్రకూట రాజుఅమోఘవర్షుని రాజ్యకాలంలోనివాడు క్రీ.శ.814-877 మధ్య తన గ్రంథాన్ని రచించాడని పు.ము. I (పు.232) లో పేర్కొన్నారు. కానీ, తొ.ము. I పు.(146) లో రాజునీ, కాలాన్ని పేర్కొనలేదు.

పు.ము I (పు.237)లో ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో పదమూడు ప్రతులు ఉన్నాయని వీటి సంఖ్య D 2283 నుంచి D2295 పేర్కొన్నారు. ఒక కాగిత ప్రతి ఉన్నా, అన్ని అసమగ్ర లేనవ్నారు. మహావీరాచార్యుల 'గణిత సార సంగ్రహం' లో ఎనిమిది ప్రకరణాలు ఉంటే, పావులూరి మల్లన గ్రంథంలో ఇంకా అచ్చుకావాల్సింది ఉందన్నారు. ఈ సమాచారం తొ.ము. I లో లేదు. తిమ్మావజ్ఝల వారు భారతి, 1953 జూలై సంపుటి 30 సంచికలు 7-9 అనే స్పష్టమైన ఆధారాలు కూడా పు.ము.లో ఉన్నాయి.

## వేములవాడ భీమకవి.

♦తొ.ము I (పు.187) లో నన్నెచోడుని తర్వాత వేములవాడ భీమ కవిని పేర్కొన్నారు. కానీ, వేములవాడ భీమ కవిని ద్వి.ము I (పు.238) లో పావులూరి మల్లన తర్వాత పెట్టారు.

పు.ము I (పు.242) లో పాదసూచికలో 'చూడు' కి పాఠాంతరం అర్థాలు (DEO 2260) ప్రకారం వివరించారు. ఇది తొ.ము I (పు.193) లో లేదు.

♦తో.ము I (పు.204) లో వేములవాడ భీమకవి చెప్పినట్టు అప్పకవి. ఉదహరించిన పద్యంలో 'మైలభీమన చారిత్రక వ్యక్తేనా' అనే ప్రశ్నార్థకం పు.ము I (పు.250) చారిత్రక వ్యక్తే అని నిర్ధారణలో చెప్పారు.

మైల భీముడు క్రీ.శ. 1101-1124 ప్రాంతాలన్నారు. పు.ము I (పు.251-254) లలో మైల భీముని కాలనిర్ణయానికి మరికొంత పరిశోధన చేసినట్లు కన్పిస్తుంది.

భీమకవి వ్యక్తిత్వం తెలియడానికి, ఆతని చాటువులూ, ఆతని పద్యాలనూ, ఇతరులు ఉదహరించినవీ పరిశీలించి, ఏ కవుల, ఏ కాలాలలో స్తుతించారో అలాంటపుడు ఏయే విషయాలు చెప్పారో కవుల కాలనిర్ణయాలతో విషయ వివరణతో పట్టిక రూపంలో పరిశోధించారు. ఈ పరిశోధనలో కొన్ని మార్పుల కన్పిస్తున్నాయి.

శ్రీనాథుడి కాలం తొ.ము I (పు.210) లో 1380-1450 గా పేర్కొంటే, పు.ము I (పు255) లో 138^-1458 గా సరిదిద్దారు.

ఒక కవి శైలీ, ప్రత్యేకత, భావనాశక్తి సంతృప్తికరంగా ఆవిష్కరిం చాలంటే కనీసం ఒక ఘట్టాన్ని, ఒక సంపూర్ణ శీర్షికనైనా చదివితేనే రసానందు కలుగుతుందన్నారు. వేములవాడ భీమకవి చెప్పిన పద్నాలుగు పద్యాల్ని తొ.ము I (పు.215-217) లో ప్రచురిస్తే, పు.ము I (పు.259) లో పద్యాల్ని పేర్కొనకుండానే పద్నాలుగు పద్యాల ప్రస్తావన కూడా లేకుండానే, అలాంటి అవకాశం భవిష్యత్తులో కలుగుతుందేమోనని ఆశిద్దామని ఈ కవి గురించిన చర్చ ముగించారు.

♦తొ.ము I లో వేములవాడ భీమకవి తర్వాత స్థానం పొందిన మల్లియరేచన పు.ము I (పు.118) ఆదిమయుగంలోకి చేర్చారు.

మల్లియరేచన గురించి చేసిన మార్పుల్ని ఇంతకుముందే పరిశీలించడాన్ని గమనించవచ్చు.

పు.ము I (పు.259) లో వేములవాడ భీమకవి తర్వాత, 'సుమతి భీమన' శీర్షికతో కొంత పరిశీలన కనిపిస్తుంది. సుమతీ శతక కర్త గురించి, తెలుసుకోవడం సాహిత్య చరిత్ర కారుల విధి అని భావించారు. దీనికి ఆధారాలుగా పంగిపర్రు భీమనప్పయ్య (కీ.శ.900 ప్రాంతం) మల్లియ భీమనప్ప (కీ.శ 900ప్రాంతం) భీమన ప్రెగ్గడ (క్రీ.శ.1072 ప్రాంతం), బంగెన భీమన (కీ.శ.1124) ఎల్లమ భీమన, పూరమ భీమనలు, వేములవాడ భీమకవి, శ్రీధరుని భీమన, చెదలవాడ భీమన ల గురించి సుమారు (పు.259-274) పదహారుపుటలలో, సుమతీ శతకం ఒక ప్రతి లభిస్తుండడంవల్ల ఈ శతకాన్ని భీమన రచించారన్న మాటకన పడుతుంది. కనుక, ఇతడిని సుమతీ భీమనగా పిలవడం సముచితమన్నారు. ఈ పరిశోధనకు మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో దొరుకుతున్న శతక తాళ పత్రప్రతుల్ని పరిశీలన చేయడం (పు.264) కన్పిస్తుంది.

సుమతీ శతక కర్త'బద్దెన'అనే వాదననీ పరిశీలించడం (పు.274-277) పు.ము I లోనే కన్పిస్తుంది. ఈ అధ్యయనానికీ 'సరస్వతీ మహలు' ప్రతుల్ని పరిశీలించి కొత్త అంశాల్ని పు.ము I లో చేర్చారు.

సుమతీశతకాన్ని భీమన రాశాడని చెప్తూ లాక్షణికుడు కూచిమంచి తిమ్మకవి తన 'సర్వలక్షణ సార సంగ్రహం' లో ఉదహరించడంతో వివాదాలు ప్రారంభమైయ్యాయి. మానవల్లి రామకృష్ణ కవి ప్రకారం బద్దెన 'సుమతీ' శతక కర్త అవుతున్నాడంటూనే తాళపత్రాల్లో భీమకవి పేరు కన్పించిందన్నారు. ఈ వాదోపవాదాల్లో వంగూరి సుబ్బారావు. వేదం వెంకట కృష్ణ శర్మ వంటివారు పాల్గొన్నారు. వీటిని సోదాహరణంగా పు.ము I లో చర్చించారు.

# మల్లికార్జున పండితారాధ్యులు

'దాక్షారామంలో సుమారు ఎనిమిది వందల ఏళ్ళకిందట' అంటూ మల్లికార్జున పండితారాధ్యుడు శైవదీక్ష తీసుకొన్న నాటిస్థితిని చెప్తూ తొ.ము I (పు.229) లో చెప్తే, పు.ము I (పు.278) బ్రాకెట్ లో "బహుశ క్రీ.శ 1160 లో" అని కాలాన్ని చెప్పడానికి ప్రయత్నించారు.

మల్లికార్జున పండితారాధ్యులు పుట్టిన కాలాన్ని పు.ము I (పు.278) బహుశా 1140 లో పుట్టినట్లుగా చెప్పారు. తొ.ము I లో ఇది పేర్కొనలేదు.

♦తొ.ము I లో లేని, బిజ్జలుని కోశాధికారిగా ఉన్న శివభక్తుడైన బసవన్న పు.ము I (పు.279) లో క్రీ.శ 1160 నుండీ శైవమత ప్రచారం చేస్తున్నట్లు కాలాన్ని పేర్కొన్నారు.

♦తొ.ము I లో లేని మరొక అంశం పు.ము I (పు.280) లో పండితారాధ్యుడు, వెలనాటి చోళుల రాజధాని 'చందవోలు' క్రీ.శ 1774 ప్రాంతాలలో వచ్చి, మతాన్ని బోధించాడన్నారు. అలాగే, చందవోలు నుండి అమరావతికి బహుశా, క్రీ.శ 1175 లో వెళ్ళాడన్నారు. పు.ము I (పు.281) ఇది తొ.ము I (పు.235) లో లేదు.1174 అనేది 1774 గా ముద్రణా దోషం పు.ము లో కన్పిస్తుంది.

పండితారాధ్యుని శిష్యులు వెలనాటి చోడుణ్ణి హత్య చేసినట్లు 'పండితారాధ్య చరిత్ర' కథనం - నేలటూరి వెంకట రమణయ్య భావాల్ని అనుసరించి చెప్పి, తర్వాత వివరణకి తొ.ము I (పు.235) లోకి వెళ్ళిపోయిన ఆరుద్ర, పు.ము I (పు.282) లో పండితయ్య చంపించిన వెలనాటి చోడుడు క్రీ.శ 1163-1180 వరకూ పాలించిన రాజేంద్ర చోళుడని నిర్ణయించారు.

మల్లికార్జున పండితరాధ్యుడు బసవన్న దగ్గరకు వెళ్తూ, మార్గమధ్యలో నల్లగొండ జిల్లా పానగల్లులో మకాం చేశాడు. ఆ ఊరు చోడరాజులకు ముఖ్యపట్టణం. దాన్ని అప్పుడు ఉదయచోడుడు పరిపాలిస్తున్నాడు. ఈ కాలాన్ని కూడా పు.ము I (పు.282) లో క్రీ.శ 1136-1176 గా పేర్కొన్నారు.

చోడరాజులలో ఉండే ఫ్యూడల్ స్వభావం తొ.ము I (పు.236) లో లేదు. పు.ము I (పు.282) లో విశదీకరించారు. స్వామిభక్తిని ప్రకటించుకోవడానికి దాసులు ఎంగిలికూడు బలవంతంగా తినవలసి వచ్చేది. ప్రభువు నమిలి ఉమ్మే తాంబూలాన్ని దాసులు అరచేతిలో పెట్టుకొని తినవలసివచ్చేది.

ఈ దుశ్చర్యల్ని వివరించడంవల్ల సేవకులు రాజవిధుల్ని వ్యతిరేకించడానికి కారణాల్ని పరిష్టంగా చెప్పడం కన్పిస్తుంది. సేవకుడైన ధవళేశు నామయ్య, ప్రభుభక్తిని పరీక్షించుకొని ఎంగిలి తాంబూలాన్ని తినడానికిష్టపడక, ఆత్మహత్య చేసుకున్నాడు. తొ.ము I (పు.236.) లో రాజవిధినిని నిర్వర్తించని నామయ్యపై రాజుకి పౌరుషం వచ్చిందన్నారు. ద్వి.ము I లో కొంచెమే మార్పులు చేసిన, ఆనాటి ఫ్యూడల్ సమాజ స్వరూప స్వభావాలు చక్కగా స్పష్టమవ్వడానికి అవకాశం ఏర్పడింది.

మత కార్యక్రమానికి కథనం ఎక్కువగా ఖర్చుచేస్తున్నందుకు కోపడిన బిజ్జలుని, బసనన్న చంపినట్లు, మార్గమధ్యలో పయనంలో ఉన్న మల్లికార్జున పండితారాధ్యునికి తెలియడంతో, బసవన్న ఉండే కర్నాటకకు

ప్రయాణాన్ని విరమించుకొని, శ్రీశైలం మార్గం పట్టి, తనకు ఓపికలేక శిష్యుల్ని కొండపైకి ఎక్కమని తాను, తనువు చాలించినట్లు మాత్రమే తొ.ము I (పు.237) లో ఉంది. కానీ, వీటిని కాలానుగుణంగా బసవన్న క్రీ.శ.1196 లో మరణించాడు, శ్రీశైలానికి వెళ్ళేమార్గమధ్యలో కృష్ణాతీరంలో కూడలికి రెండుమైళ్ళ దూరంలో ఉన్న సంగమేశ్వరాన్ని పరిపాలిస్తున్న కన్నాటి గోకర్ణ దేవమహారాజు క్రీ.శ 1185 లో, తన తండ్రి పోచిరాజుకి పూర్వం లభించాలనే తలంపుతో మల్లికార్జున పండితారాధ్యుడి కాళ్ళు కడిగి దీనం చేశాడు. ఈ లోగా శ్రీశైలం కొండకెళ్ళి మొక్కులు చెల్లించి వచ్చిన శిష్యుల్ని చూసి, పండితారాధ్యుడు తనువుచాలించాడు. ఇది బహుశా 1197లో జరిగి ఉంటుందని ఆరుద్ర చెప్పారు. ఇవన్నీ పు.ము I (పు.283) లో చేర్చిన అంశాలు.

♦ తొ.ము I (పు.237) లో లేని బసవన్న మతబోధనల ప్రభావం, సామాజిక పరివర్తన, ఆతని బోధనల వల్ల కులకట్టుబాట్లు తొలగిపోతున్నందుకు కొన్ని కులాలు వారి ఆగ్రహాలు పు.ము I (పు.283-286) లో సృజనాత్మక పరిశోధకుడుగా బాగా వివరించారు. బడాల రామయ్య 'బసవేశ్వర వచనాలు – సమగ్ర సమీక్ష' గ్రంథం నుండి చాలా విషయాల్ని ఆరుద్ర గ్రహించడం కన్పిస్తుంది.

సాహిత్యానికి సాంఘిక ప్రయోజనం ఉంది. కళ ప్రజలకోసమని భావించాలి. వర్ణభేదాల, వర్గ భేదాలు తొలగించి సర్వతా సమానులనే నూతన వ్యవస్థను నిర్మించాలనే ఉద్యమంగా బసవన్న సాహిత్యాన్ని భావించి, ప్రజలకోసం, ప్రజల భాషలో రాసిందని విశ్లేషించారు. దీని వల్ల ఆరుద్ర పరిశోధనలో మార్క్సిస్టు దృక్పథం వెల్లడవుతుంది.

♦తొ.ము I(పు.252) లో "పండితారాధ్యుని విలక్షణ పదాల పట్టిక"లో "ఆలాపు" అని ఉంటే పు.ము I (పు.297) లో "ఆలావు" అని కన్పిస్తుంది.

నిఘంటువులకెక్కని పదాలుగా కొన్నింటిని 'శివతత్త్వసారం' లో ఉన్నాయని చెప్పడం వల్ల వీటిలో ముద్రణాదోషం ఉందో మార్పుల చేశారో చెప్పలేదు.

ప్ర.ము I లో కంటే పు.ము I (పు.298 లో 14 పద్యాల్ని 'అనుబంధం' ఇచ్చారు. వీటితో పాటు 'అనుబంధాలు' పేరుతో సాతవాహనుల రాజవంశం (పు.300) ఇక్ష్వాకుల రాజవంశం (301), పల్లవరాజవంశం (పు.302) విష్ణుకుండిను రాజవంశం (303) తూర్పుచాళుక్యుల రాజవంశం (పు.304), వేములవాడ చాళుక్యుల రాజవంశం (పు.305), ముదిగొండ చాళుక్యుల రాజవంశం వెలనాటి చోళుల రాజవంశం (306) ల పట్టికలో రాజులక్రమం, పరిపాలనా కాలాలను చేర్చారు..

ఉపయుక్త గ్రంథాలని ఇవ్వకపోయినా తొ.ము I కంటే పు.ము I లో (పు301-312) పుస్తక గ్రంథాలు – వ్యాసాలు, పత్రికలు ప్రత్యేక సంచికలు, selected Bibliography లలో ఎక్కు వ గ్రంథాలు, వ్యాసాల జాబితా కన్పిస్తుంది.

# సమగ్ర ఆంధ్ర సాహిత్యం: తొలి ముద్రణ పునర్ముద్రణల మార్పులు చేర్పులు

## 4.2. రెండవ సంపుటి( కాకతీయ యుగం)

*కాకతీయ యుగం*

♦ తొ.ము II మే. 1965లో ప్రచురితమైంది. పి.వి. రాజమన్నారు ప్రవేశిక విశ్వనాథ సత్యనారాయణ పీఠిక ఉంది. ఈ సంపుటిలో 'కాకతీయ యుగం' గురించి వివరించారు.

పు.ము II 1989 జూలైలో ప్రచురితమైంది.

♦ తొ.ము II (పు.I) లో (కాకతీయులరాజ్యకాలం క్రీ.శ 1000-1030 ప్రారంభమైందన్నారు. పు.ము (పు.I) కాలం 900-912 కు మూడుతరాల ముందే ప్రారంభమైందన్నారు.

♦ తొ.ము II లో లేని, పు.ము II (పు.2) కాకతీయ సామ్రాజ్యం, గణపతి చక్రవర్తికాలం, పటం ఇచ్చారు.

♦ తొ.ము II (పు.3) లో లేని ముమ్మడి గండన, ముత్తాత వెన్నరాజు కాకతీయుల రాజ్యస్థాపకుడు. కాకతి నుండి రాజ్యం చేయడంవల్ల ఈ వంశం వారిని కాకతీయులని పిలుస్తారు. ఈ వంశం వారికి 'కాకతమ్మ' అనే గ్రామదేవత ఆరాధ్యదైవం. దుర్జయవంశం, సామంతవిష్టి వంశానికి చెందిన కాకతీయులు నాందేడ్ జిల్లా లోని కందహారుపురం నుండి వచ్చి, తెలుగు నాట స్థిరపడ్డారు అనేది పు.ము II (పు.3) అదనపు సమాచారం. పు.ములో ఈ వంశం రాజుల కాల నిర్ణయాలను మార్పులచేసిన విధంగా రాజుల పాలనను వివరించారు.

పు.ము II (పు.5-6) లో నిడదవోలు చాళుక్యులు, జననాథపురం చాళుక్యులకు అణకువగా ఉండి, కాకతీయ సామ్రాజ్యం వేళ్ళూనుకుంటున్న కాలంనుంచీ దీనికి సామంతులయ్యారు. ఆ చారిత్ర కాలనిర్ణయాల పట్టికను చూపారు.

ఈ యుగంలో గల వేశ్యరికం, జూదమాడటాన్ని గురించి సుమతీ శతకకారుడి పద్యాన్ని అదనంగా (పు.7) చేర్చారు. దీనితోపాటు బసవపురాణం, పండితారాధ్యచరిత్ర లలో గల వర్ణనలను పేర్కొన్నారు.

♦తొ.ము II (పు.2) లో కాకతీయ వంశ పాలకుల పట్టికకీ పు.ము II లో పట్టికకీ తేడా కన్పిస్తుంది.

| పట్టికల తేడాలు | |
|---|---|
| తొ.ము (II) | పు.ము (II) |
| 1................ | 1. ముమ్మడి గుండన క్రీ.శ 900-912 |
| 2................ | 2. ఎర్రన క్రీ.శ 912-950 |
| 3. ................ | 3. మొదటి బేతన క్రీ.శ ........? |
| 4. మొదటి బేతరాజు క్రీ.శ 1000-1030 | 4. పిండిగుండన 950-1050 |
| 5. మొదటి ప్రోలరాజు క్రీ.శ 1030-1075 | 5. ఇమ్మడిబేతన 990-1050 |
| 6. రెండవబేతరాజు 1075-1110 | 6. ప్రోలన 1055-1075 |
| 7. రెండవ ప్రోలరాజు 1110-1158 | 7. ముమ్మడి త్రిభువన మల్లబేతన 1075-1098 |
| 8. రుద్రదేవమహారాజు 1158-1195 | 8. త్రిభువన మల్లదుర్గరాజు 1098-1115 |
| 6. మహాదేవరాజు 1195-1198 | 9. ఇమ్మడి ప్రోలరాజు 1115-1150 |
| 7. గణపతి దేవ చక్రవర్తి 1198-1262 | 10. రుద్రదేవమహారాజు 1950-1195 |
| 8. రుద్రమదేవి 1262-1291 | 11. మహాదేవరాజు 1196-1199 |
| 9. ప్రతాపరుద్రుడు 1291-1323 | 12. గణపతి దేవచక్రవర్తి 1198-1262 |
| | 13. రుద్రమదేవి 1262-1291 |
| | 14. ప్రతాపరుద్రుడు 1291-1323 |

♦తొ.ము II (పు.14) కాకతీయ యుగంలో ప్రజలు భోగలాలసులైనా, నీతి పరులన్నారు. పు.ము II (పు.14) లో దీనిని పొడిగిస్తూ నీతి అవినీతి అనేవి యుగ ధర్మాన్ని బట్టి మారతాయని, ఆ యుగ ధర్మం ఉత్పత్తి విధానాలు, ఆర్థిక సంబంధాలకు అనువుగా రూపొందుతుందని వివరించారు. శైవ, జైన, బౌద్ధ మత ప్రభావాలు, కాకతీయ యుగాల్లో ఉన్న పరిస్థితిని, ఆనాటి సామాజిక, ఆర్థిక రాజకీయ పరిస్థితుల్ని శాసనాలు, పాల్కురికి సోమనాథుని రచనలు, డి.డి.కోశాంబి Myth & Reality అనుసరించి పరిశీలిస్తూ కొత్త విషయాల్ని సుమారు నాలుగు పుటల్లో (14-18) విశ్లేషించారు. చారిత్రక కాల నిర్ణయాల్ని కూడా స్పష్టం చేయడం పు.ము II లో కన్పిస్తుంది.

## భాస్కరునికేతన

♦తొ.ము II (పు.29) కేతన 'కాదంబరి' నుంచి మూడు పద్యాలూ, ఒక శార్దూల పాదం మాత్రమే లభిస్తున్నాయన్నారు. పు.ము II (పు 29)లో మానవల్లి రామకృష్ణ కవి నన్నెచోడుని కుమారసంభవం తొలిసారి ప్రచురించిన ప్రథమభాగం అనుబంధంలో చూపించిన రెండు పద్యాల్ని పేర్కొన్నారు. (పు.30) దీన్ని అనుసరించి భాస్కరునికేతన 'కాదంబరి' నుంచి అయిదు పద్యాలూ అనేది కొత్తగా చేర్చిన సమాచారం.

## యథావాక్కుల అన్నమయ్య

♦తొ.ము II (పు.30) ఉపశీర్షిక అచ్చితమైన సర్వేశ్వర శతకాన్ని తొలి శతకం అని పెడితే, పు.ము II (పు.32) లో వృత్తాలలో 'తొలి శతకం' గా మార్పులు చేశారు. తొ.ము II (పు.30) లో శతక వాఙ్మయ శాఖలో మకుటనియమం గల మొదటి కృతి యథావాక్కుల అన్నమయ్య రచించిన సర్వేశ్వర శతకం.పు.ము II (పు.32) లో శతక వాఙ్మయశాఖలో మకుటనియమంగల మొదటి కృతి సుమతీ శతకం అని మార్పు చేశారు.

♦తొ.ము II (పు.33) పూర్వకవుల్ని స్తుతిస్తూ యథావాక్కుల అన్నమయ్యను పేర్కొన్న వారిలో పింగళి ఎల్లకవి కాలాన్ని క్రీ.శ 1590-1620 గా గుర్తించినా, పు.ము II (పు.33) లో క్రీ.1760 ప్రాంతంగా మార్పుచేశారు.

## క్షేమేంద్రుడు

♦తొ.ము II లో లేని అంశం, పు.ము II (పు.45-47) లో తెలుగు క్షేమేంద్రుడు రాసిన 'శతపక్ష సంవాదం' ఒక పద్యమే లభిస్తే, ముద్రామాత్యంలో 32 పద్యాలు దొరికినందుకు సంతోషించాలని చెప్తూ, ఇతడు 'శూద్రక చరిత్ర' ను తెలుగు లో రాశారని వివరిస్తూ కొంత సమాచారాన్ని చేర్చారు. సంస్కృత శూద్రకుడిని గురించి కూడా వివరించారు. తెలుగు క్షేమేంద్రుని రచనలు దొరకలేదు గాని, ఇతని పుస్తకాలు దొరికితే సాహిత్య చరిత్రకు మరింత ప్రయోజకారవుతుందని ముగించారు.

♦తొ.ము II లో క్షేమేంద్రుడు తర్వాత తిక్కన సోమయాజిని వివరించగా, పు.ము II లో (పు.48) లో కవిభల్లటుడిని చేర్చారు. ఇతడు క్రీ.శ.1600 కి పూర్వపు వాడని, తెలుగు వాడే అయినా, కాశ్మీర సువాసనలు గుభాళించే కవిత చెప్పాడేమో అన్నారు. (పు.53) ఇతడు సంస్కృతంలో గణమంజరి, పదమంజరి అనే రెండు గ్రంథాలు రాశాడట. (పు.48) అని, కందుకూరి, నిడదవోలు, చాగంటి శేషయ్యల పరిశీలనలను పేర్కొన్నారు.

## తిక్కన సోమయాజి

♦తొ.ము II (పు.58) లో 'విజయ సేనం' లోని దని జగ్గన ఉదహరించిన మరొక పద్యం ప్రబంధ రత్నావళిలో పద్యసంఖ్య 156 గానూ, పు.ము II (పు.59) లో పద్యసంఖ్య.136 గాను ఉంది.

పద్య సంఖ్యలో తేడా . తొ.ము II (పు.65) లో (విరాట -2-242)

పు.ము II (పు.65) లో (విరాట -2-212)

♦తొ.ము II (పు.84) లో ఉద్యోగ పర్వ పద్య సంఖ్య (2-238) గానూ,

పు.ము II (పు.79) లో ఉద్యోగ 3-242 గానూ పేర్కొన్నారు.

♦తొ.ము II (పు.93) లో ఆంధ్ర మహాభారతంలో గల మొత్తం గద్య పద్యాల సంఖ్య 16,457 పు.ము II (పు.87) లో ఈ సంఖ్య 16,617 గా ముద్రితమై ఉంది.

♦తొ.ము II (పు.95) లో నీరుపైగవిసిన నిప్పులట్ల (విరాట 5-351) ఉంటే, పు.ము II (పు.89)లో (15-351) అని ఉంది.

♦తొ.ము II (పు.109) లో తిక్కన వంశ వృక్షం లో సంఖ్యల్నిచ్చి, వాటిని వివరించారు.

పు.ము II (పు.100) లో వరుస సంఖ్యలతోపాటు మావెన (I) 1-28 అనే పద్ధతితో అదనపు సంఖ్యను ఇచ్చారు. ఆశ్వాస పద్యాలు దేనిని భావించవలసి ఉందో వివరణ లేదు.

## ఆంధ్ర భోజుడు

♦తొ.ము II (పు.137) భోజరాజకాలాన్ని 11వ శతాబ్దిగా పేర్కొని పు.ము II (పు.120) లో క్రీ.శ 1000-1050 గా చెప్పారు.

♦తొ.ము II (పు.139) లో మడికి సింగన కాలం 1347 ప్రాంతం వాడిగా వేదం వెంకట రాయశాస్త్రీ ని పేర్కొనగా, ద్వి.ము II (పు.121) లో దీన్ని మల్లంపల్లి సోమశేఖర శర్మ కాల నిర్ణయంగా మార్పులుచేశారు. మడికి సింగన తన 'పద్మపురాణం' ఉత్తర ఖండంలో దాని రచనాకాలాన్ని ఇచ్చాడని, అది క్రీ.శ 1420 అని కొందరు సాహిత్య చరిత్రకారులు భావిస్తున్నారు. అయితే, క్రీ.శ 1370 ప్రాంతాల లోనే మడికి సింగన ఉండి ఉండాలన్నారు. ఇది మడికి 'సింగన కీర్తి శిఖరం' అనే ఉపశీర్షకతో ప్రత్యేకం గా పేర్కొన్నారు.

'భోజరాజు విభూషణ' మనే నీతి భూషణము పేరుని మానవల్లి రామకృష్ణ ఉదహరించారు. 'నీతిభూషణం' లో నుంచి లక్షణ కర్తల ప్రయోగాలు స్వీకరించారు. మడికి సింగన 'నీతి భూషణం' నుంచి ప్రయోగాలు స్వీకరించారు.

## అప్పనమంత్రి

అప్పన మంత్రి కాలం మడికి సింగనకు పూర్వమే నంటూ, మడికి సింగన కాలాన్ని 1370 ప్రాంతాలుగా పు.ము II (పు.126) లో మార్పులు చేశారు. ఇది తొ.ము II (పు.145) లో 1347 గా చెప్పారు.

పు.ము II (పు 128-129) లో అప్పన మంత్రి 'చారుచర్య' లో గల నాలుగు పద్యా (33,51,56,80,) లను ఉదహరించారు.

'చారుచర్య' ను వేటూరి ప్రభాకర శాస్త్రి పీఠికతో మక్త్యాల సంస్థానాధీశులు "ప్రకటించారట" అని తొ.ము II (పు.147) లో రాస్తే, పు.ము II (పు.129) లో "ప్రకటించారు". అని దానిని పాదసూచికతో సహా పేర్కొన్నారు. ప్రభాకర శాస్త్రి పీఠికలో 'చారుచర్య' ఆత్మ సంబోధన గ్రంథం బద్దెనీతి సారమొకటుంది. దానికీ,దీనికీ శైలీ సాదృశ్యం ఉంది. కాబట్టి, ఈ కవి తిక్కన, బద్దెనలకు

సమకాలికుడై ఉంటాడని వ్రాశారట అన్నారు. వేటూరివారి పీఠికలోని అంశాలుగా పు.ము II (పు129) లో మార్పుల చేసిన విషయాల్ని పేర్కొన్నారు.

బద్దెన, తిక్కనకించుమించు సమకాలీనులు గా భావిస్తున్నారనీ, ఇతడు అప్పటివాడుకాదని, మడికి సింగనకు నూరేండ్లముందున్న వాడన్నమాట అని రాశారని పేర్కొన్నారు.

వ్రాత ప్రతుల్లో భోజుని సంస్కృత చారుచర్య రెండు విధాలుగా ఉందనీ, ఒకటి చిన్నదనీ, రెండోది కొంచెం పెద్దదనీ ప్రభాకర శాస్త్రి చెప్పిన విషయం (పు.ము II (పు.129) లో పేర్కొన్నారు. ఈ తెలు॥ రచన భోజుని గ్రంథానికి అనువాదమేకాని, సరైన తెలుగు కి అనువాదం కాదని, సంగ్రహాలన్నారన్న ప్రభాకరశాస్త్రి పీఠిక విషయాల్ని ఆరుద్ర వివరించారు. భోజుడే కాకుండా క్షేమేంద్రుడు కూడా ఒక 'చారుచర్య' సంస్కృతంలో చెప్పడం, దీనికి హిందీలో దేవదత్త శాస్త్రి వ్యాఖ్యానానికి, పి.వి. రమణారెడ్డి తెలుగు వచన వాఖ్యానం వంటివి వివరించి, భోజుని చారుచర్యకీ, దీనికీ సంబంధం లేదన్నారు.

'నీతిభూషణం' రచించిన ఆంధ్ర భోజుడు, భోజుని చారుచర్యని తెనిగించిన అప్పనమంత్రే అని నేను భావిస్తున్నాను. ఇద్దరూ భిన్న వ్యక్తులయినా ఇతడు కాకతీయ యు గంలోని వ్యక్తే అని ఆరుద్రన్నారు.

## శివ దేవయ్య

శివదేవయ్యను పూర్వ కవిస్తుతిలో పేర్కొన్న వారిని, గ్రంథాల్ని ఉదాహరిస్తూ తొ.ము II (పు.153) లో ఎడపాటి ఎర్రన కాలం క్రీ.శ **1504-1530** గాను, అయ్యంకి బాలసరస్వతి - తురగా రాజకవి అనేజంటకవులు రచించిన నాగరఖండం క్రీ.శ **1584** ప్రాంతంగాను పింగళి ఎల్లన తోభ్యచరిత్ర క్రీ.శ.**1620** ప్రాంతంగానూ పేర్కొన్నారు. పు.ము II (పు.133) లో కాలాల్ని మార్పులు చేశారు. ఎడపాటి ఎర్రన కాలం క్రీ.శ **1678-1693** గాను, నాగర ఖండం **1680** ప్రాంతాలగాను, తోభ్యచరిత్ర **1760** తర్వాత గానూ మార్పులు కన్పిస్తున్నాయి. రాజసభలో లేఖకులు ఉండేవారు. లేఖలు చదవడం వీరి వృత్తి. వీరి లక్షణాలను శివదేవయ్య మూడు పద్యాలలో వివరించాడు. ఆ పద్యాలలో మొదటిరెండు భీతి రాజు ముమ్మయ్య రచించిన విష్ణుకథావిధానం లోని పద్యాలని వేటూరి ప్రభాకరశాస్త్రి 'ప్రబంధ రత్నావళి' లో **(376,399)** పద్యాలుగా గుర్తించటం పు.ము II (పు.**136**) లో అదనంగా చేర్చారు.

## మూలఘుటిక కేతన

పు.ము II (పు.**140**) లో తిక్కన,ఖడ్గతిక్కనల సంబంధ బాంధవ్యాల్ని, వీరి పదవుల్ని మూడు పేరాల్లో వివరించారు. ఇది తొ.ము II లో లేదు.

'అభినవదండి'గా పేరొందిన మూలఘుటికకేతన రచించిన తెలుగులో తొలికథాకావ్యంగా భావిస్తున్న 'దశకుమార చరిత్ర' లోని కథను పు.ము II (పు**141-145**) కథాసార సంగ్రహాన్ని చేర్చారు.

దండి 'దశకుమార చరిత్ర' ను సంస్కృతంలో వర్ణించిన చాలా వాటిని తెలుగులో కేతన మార్పులు, చేర్పులు చేశాడనే కందుకూరి, శిష్లా రామకృష్ణ శాస్త్రి ల అభిప్రాయాల్ని పు.ము II (పు **146-147**) లో అదనంగా చేర్చారు.

వేశ్యమాత, తన కూతురికిచ్చేశిక్షణను ఎలా వర్ణించారో విద్వాన్ విశ్వం చేసిన అనువాదాన్ని అనుసరించి పు.ము II (149-150) లో వివరించడాన్ని అదనంగా చేర్చారు.

మూలంలో కేతన గర్భధారణనను అష్టా దశవర్ణనల్లో వర్ణించిన తరువాత కవులు చాలామంది అనుసరించారని అందులో అల్లసాని పెద్దన 'మను చరిత్ర' 1-4 పద్యం ఉందని మాత్రమే ద్వి.ము II (పు.171) లో పేర్కొనగా పు.ము II (పు.152) లో ఆ పద్యాన్ని కూడా ఇచ్చారు.

కావ్యాంతంలో కేతన, భరత వాక్యాన్ని వర్ణించిన పద్యాన్ని పు.ము II (పు.153) లో పేర్కొన్నారు. ఇది తొ.ము II లో లేదు.

కేతనకు ప్రాచీనులు, కొద్దిపాటి సమకాలికులు షష్ట్యంతాల తరువాత క థ ప్రారంభించిన పద్ధతిని వివరిస్తూ నన్నెచోడుడు 'కుమార సంభవం' తిక్కన 'నిర్వచనోత్తర రామాయణం' మంచెన 'కేయూర బాహుచరిత్ర' మారన 'మార్కేండేయ పురాణం' లను సోదాహరణంగా పు.ము II (పు 153-154) లలో వివరించారు. ఇది తొ.ము II లో లేదు.

పు.ము II (పు.155) లో కేతన ఛందస్సు గురించి శిష్టా రామకృష్ణ శాస్త్రి 'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సర్వస్వం' లో వివరించిన దాన్ని పేర్కొంటూనే, శిష్టావారు గుర్తించిన తరువోజ, ఉత్సాహ వృత్తాలు, మత్త కోకిల, తరళం వృత్తాలను కేతన ప్రయోగించాడని అదనపు సమాచారం ఉంది. ఇది తొ.ము I లో లేదు.

కేతన రచించిన మరో పుస్తకం 'ఆంధ్ర భాషాభూషణం' గురించి వివరిస్తూ పు.ము II (పు.156) లో ఈ గ్రంథానికి ముందున్న 'ఆంధ్రభాషావ్యాకరణం' పట్ల జరిగిన వాదోపవాదాల్లో వజ్ఝల చిన సీతారామ శాస్త్రి పేరుని ఉటంకించారు. అలాగే, తొ.ము II (పు.174) లో ఆంధ్ర భాషావ్యాకరణమే తెలుగు భాషలో తెలుగు భాషకు చెప్పిన వ్యాకరణమనే విషయాన్ని ఉపోద్ఘాతంతో సంక్షిప్తంగా వివరించారు. దీన్ని పు.ము II (పు.156-157) లో సుదీర్ఘ ఉటంకింపులో పేర్కొన్నారు.

♦తొ.ము II (పు.175) లో 'ఆంధ్ర భాషాభూషణం' మొదలుకొని వజ్ఝమూడి వారి వ్యావహారిక వ్యాకరణం ద్వారా వచ్చిన వ్యాకరణ సమన్వయం చాలా అవసరమని ఈ గ్రంథం గురించి ముగించేశారు.

కానీ. పు.ము II (పు 158-163) లో సుదీర్ఘంగా వివరించారు. వ్యాకరణాల విషయమై పరిశోధకుల అభిప్రాయాల్ని విశదకరించారు. దీనితో కేతన చెప్పిన తెనుగు భాష (పు.158) దేశీ తెలుగులో ఉండే పదాలు ఎటువంటివో పట్టిక రూపంలోనూ II (పు 159) , వివరించారు. హరిశివకుమార్, 'కేతన అతని కృతులు', బొడ్డు పల్లి పురుషోత్తం 'తెనుగువ్యాకరణవికాసము' అమరేశ్వర రాజేశ్వర శర్మ 'ఆంధ్రవ్యాకరణ వికాసం' వంటి సిద్ధాంత గ్రంథాలలో గల అభిప్రాయాల్ని ద్వి.ము II లో చేర్చారు.

♦తొ.ము II (పు.176) 'విజ్ఞానేశ్వరీయం' లో గల మూడు కాండల పద్యవివరాల్ని పేర్కొని 433 మొత్తం పద్యాలుగా పేర్కొన్నారు. తర్వాత వాటిని వివరించలేదు. పు.ము II (పు.163)

లో నేడు వ్యవహారంలో ఉన్న ఆచార వ్యవహారాలు అంటే ఏమిటో వివరించారు. 'విజ్ఞానేశ్వరీయం' లో ఆచారం అంటే వర్ణాశ్రమధర్మాల నిర్వహణ; వ్యవహారం అంటే 'సివిల్‌లా' అని ఉందన్నారు.

చాతుర్వర్ణాల వారికి నిర్దేశించిన శిక్షలు (Punishments) ని బ్రాహ్మణులకు 'తుల'; క్షత్రియులకు 'అగ్ని', వైశ్యులకు 'జలం' శూద్రులకు 'విషం' పరిక్షలు ఉండేవనీ, కోశ పరీక్ష అన్ని వర్ణాల వారికి విధించే వారనేది సోదాహరణంగా వివరించారు (పు.167–168) యాజ్ఞవల్క్య మహర్షి సంస్కృతంలో రచించిన దీన్ని కేతన తెలుగులో అనువదించినా, స్వతంత్ర గ్రంథంవలే, తనకాలపు విషయాల్ని చొప్పించాడని కొన్నింటిని పేర్కొన్నారు. శూద్రులను దండించడానికి విషపరీక్ష పెట్టేవారు. దాన్ని వివరిస్తూ....

> *"క్రొత్త కుండలోన గ్రూర సర్పముసిడి*
> *యర్థితముగ జేసి యందులోన*
> *నిమ్మపండువేసి నెమ్మితో దిలియంగ*
> *శోధ్యుడైన వాడు శుద్ధుడయ్యె" (3–121)*

ఈ పద్యాన్ని పేర్కొన్న తర్వాత ఆరుద్ర 'విజ్ఞానేశ్వరీయలు' లో కేతన తన కాలంనాటి సంగతులనే స్మృతికర్తల అభిమతానికి విరుద్ధంగా కూడా చెప్పాడు. (పు.168) అని వ్యాఖ్యానించారు.

ఇవన్ని పు.ము II లో అదనంగా చేర్చిన అంశాలు.

## *కమలనాభామాత్యుడు, బయ్యన:*

♦తొ.ము II లో మూలఘటిక కేతన తర్వాత బద్దెన ను వివరించగా, పు.ము II లో బద్దెన ను తొలగించి, కమలనాభామాత్యుడు, బయ్యనలను పెట్టారు.

శ్రీనాథుని తాత, కమలనాభామాత్యుడు, అనంతామాత్యుని తాత బయ్యన, వీరి గురించి కొత్తసమాచారం ఏమీ చేర్చలేదు.

## *మంచెన*

♦తొ.ము II లో 'మంచన' గానూ, పు.ము II లో "మంచెన" గానూ ఆరుద్ర ఈ కవిని వ్యవహరించారు.

♦తొ.ము II (పు.191) లో మంచెన పద్యం మాత్రమే పేర్కొంటే,

పు.ము II (పు.173) లో కొంత వ్యాఖ్యానం చేశారు. ఏ కథను చెప్పాలో ఎలా చెప్పాలో కృతి పతే నిర్దేశించాడని ఆ పద్యాన్ని పేర్కొన్నారు.

పు.ము II (పు.174–176) 'కేయూర బాహు చరిత్ర' లోని కథా సార సంగ్రహాన్ని వివరించారు.

ఇది తొ.ము II లో లేదు.

మంచెన పద్యాల్ని అల్లసాని పెద్దన అనుకరించిన పద్యాలుగా రెండు చెప్పినా,తొ.ము II(పు.196) ఒక్కదాన్నే పేర్కొన్నారు. కానీ, పు.ము II (పు.180) రెండవపద్యాన్ని చూపించారు.

♦తొ.ము II (పు.199) లో 'కేయూర బాహుచరిత్ర' లోని వంట్యామడికి సింగన 'సకలనీతి సమ్మతం' లో ఉదహరించిన రెండు పద్యాలనూ పేర్కొన్నా, ఈ రెండూ 'కేయూర బాహుచరిత్ర'లో కనబడవు అని చెప్పారు. కానీ, పు.ము II (పు.181) లో ఈ రెండూ 'కేయూర బాహుచరిత్ర' లో ఉన్నాయని,'మొదటి ఆశ్వాసం 86వ పద్యం, తృతీయాశ్వాసం 232 పద్యంగా కనబడతాయి' అన్నారు.

ఈ మార్పులు చాలా ముఖ్యమైనవి.

## పెద్దయామాత్యుడు

♦తొ.ము II (పు.202) లో మంచెన తర్వాత పాల్కురికి సోమనాథుడుని వివరించగా, పు.ము II (పు.184) లో పెద్దయామాత్యుడు ని పేర్కొన్నారు.

జక్కన తాత పెద్దయామాత్యుడు, మనుమసిద్ధి చనిపోయిన తర్వాత క్రీ.శ 1285 నుంచి నెల్లూరిని పాలించిన తిక్కరాజు ఆస్థాన కవి.

'విక్రమార్క చరిత్ర' లో జక్కన వర్ణించిన పన్నెండు పాదాల సీసమును బట్టి పెద్దయామాత్యుడు చిత్రకవితలు రాసి ఉంటాడని చెప్పారు. ఈ కవిరచనలేమీ దొరకలేదు. కానీ, ఈ కవి చెప్పిన చిత్ర కవితలు ఎలాంటివో వివిధ కవుల పద్యాల్ని ఆరుద్ర విశ్లేషించారు.

పెద్దయామాత్యుడనే ఓ కవి ఉన్నాడని చెప్పడం తప్ప,ఈ కవి రచనల్ని ప్రత్యేకించేమీ చెప్పకుండానే సుమా రు (184-191) ఎనిమిదిపుటలు పెంచడానికి ఆరుద్ర ప్రయత్నించారు.

## పాల్కురికి సోమనాథుడు

♦తొ.ము II(పు.210) లో బసవన్న కథ, భక్తులకథా చెప్పాలనుకున్నా,పాల్కురికి సోమనాథుడు 'జనానికి అందుబాటులో ఉండే విధంగా కొత్త ఛందస్సును సృష్టించుకొన్నాడు' అని రాస్తే ద్వి.ము II (పు.197) లో 'ఒక పూర్వ ఛందస్సును ఎంచుకొన్నాడు' అని మార్పుచేశారు.

పు.ము II(పు.198) లో ద్విపద లక్షణాన్ని రేచన 'కవిజనాశ్రయంలో' చెప్పిన దానిని పేర్కొన్నారు. జైనులు ఈ ద్విపద ఛందస్సును మత ప్రచారం కోసం వాడుకొన్నారని భావించవచ్చన్నారు. ద్విపద యోగ్యమైన ఛందస్సుగా భావించి సోమనాథుడు ఈ ఛందస్సుని దేశానికి పరిచయం చేశాడన్నారు. సోమనాథుడు కథనం చేసిన ముప్పై రెండుమంది భక్తుల చరిత్రలను బసవన్న కథతో జోడించి చెప్పారని వారి పేర్లను ఆకారాది గా వివరించారు. పు.ము II (పు.199) లో మూడవ ఆశ్వాసంలో

ఉన్న బసవన్న తన భార్య చీరవిప్పించి మిండ జంగానికి ఇప్పించినట్లు చెప్పారు. తొ.ము II (పు.212) లో 'మిండ జంగానికి' అనలేదు. "జంగాలకి" అన్నారు.

పు.ము II(పు.201) బసవన్న గురించి సోమనాథుడు చెప్పుకొన్న రెండు ద్విపదల్ని పేర్కొని అవి సోమనాథునికే వర్తిస్తాయన్నాడు. ఇది అదనంగా చేర్చారు.

పు.ము II(పు.202) లో సోమనాథుని రచనలు జీవితంపై పరిశోధన చేసిన వేటూరి ప్రభాకర శాస్త్రి, బండారు తమ్మయ్యల అభిప్రాయాలను అదనంగా చేర్చారు.

పాల్కురికి సోమానాథుని రచనల్లో కన్పించే మతతత్త్వాన్ని వివరించి, భగవంతుని కన్నా భక్తుడు గొప్పవాడని, శివుడే ఆ రూపంతో వస్తాడని సిరియాళుణ్ణి చంపి వండి పెట్టడం వంటి వాటిని జుగుప్సగా భావించిన వాలాయుధుని వంటివారి వాదనల్ని పేర్కొన్నారు. వర్గ భేదాల్ని రూపుమాపకుండా వర్ణ భేదాల్ని తొలగించడానికి ప్రయత్నించడం కష్టమన్నారు. (పు.207) దృక్పథంలో మార్పు పు.ము II లో కన్పిస్తుంది. శైవమతంలోని కొన్ని ధోరణులను సోదాహరణంగా, కాశీనాథుని నాగేశ్వరరావు వంటివారుచెప్పిన అభిప్రాయాలో వివరించారు..

ఇలాంటి తాత్త్విక చర్చ చారిత్రక సామాజిక నేపథ్యంతో పరిశీలించడం కూడా కన్పిస్తుంది.

పాల్కురికి సోమనాథుని జీవితకాలం గురించి ఉన్న భిన్నాభిప్రాయాల్ని తొ.ము II(పు.219) లో ఉన్నట్లే పేర్కొంటూ వాటన్నింటికంటే ముందు వేటూరి ప్రభాకాశాస్త్రి నిర్ణయించిన కాలాన్ని 1190 ప్రాంతంవారుగా పేర్కొన్నదాన్ని ఉటంకించారు. కానీ, నేలటూరి వెంకటరమణయ్య నిర్ణయించిన కాలం 1280-1340 నే ఆరుద్ర కూడా అంగీకరించారు. (పు.211) ఇది.పు.ము II(పు.208) లో చేరిన అదనపు సమాచారం.

## చక్రపాణి రంగనాథుడు

రంగనాథ రామాయణాన్ని, అది రాసిన కవి ఎవరైనా, 14వ శతాబ్ది చివరి భాగంలో 1380 ప్రాంతాల్లోగా తొ.ము II (పు.222) లోనూ, పు.ము II (211) 1330 గానూ ఉంది. పు.ము II లోఉన్నది ముద్రణా దోషమని తెలుస్తుంది.

## కృష్ణమాచార్యులు.

♦తొ.ము II లో చక్రపాణి రంగనాథుడు తర్వాత మారన నను పేర్కొనగా, పు.ము II (పు.218) లో కృష్ణమాచార్యులు గురించి వివరించారు. ఈ కవి గురించి తొ.ము II లో లేదు. పు.ముII లో అదనంగా చేర్చారు.

సింహగిరి వచనాలు రచించిన కవి కృష్ణమాచార్యులు ప్రతాపరుద్రుని కాలంలో జీవించాడు. సుమారు పద్దెనిమిది పుటల్లో (పు.218-235) ఈ కవిని గురించి ఆరుద్ర వివరించారు.

## మారన

మారన 'మార్కండేయపురాణం' రచించడానికి గల నేపథ్యాన్ని వివరించడంలో శైలిలో పు.ము II (పు.237-238) మార్పు కన్పిస్తుందికానీ, విషయం ఇంచుమించు ఒకటే.

పు.ము II (పు 238) లో 'మార్కేండేయ పురాణం'లో తృతీయాశ్వాసంలో ఉన్న రాజధర్మాల ప్రసక్తి 'వి జ్ఞానేశ్వరీయం' తో పోలిక చెప్పడం వంటివి అదనంగా చేర్చారు.

వ్యాసుని శిష్యుడు జైమినికి కలిగిన సందేహాల్ని నివృత్తి చేస్తూ,మార్కేండేయ మహాముని కొన్నింటిని చెప్పి, మరిన్ని వివరాలకి వింధ్యనగరంలో ఉన్న నలుగురు ధర్మపక్షుల దగ్గరకెళ్ళమనడం తర్వాత, కథా కథనం శైలిలో మార్పు పు.ము II (పు.239) కన్పిస్తుంది. పక్షులేమిటి ధర్మసందేహాల్ని నివృత్తి చేయడమేమిటనీ జైమిని ఆశ్చర్యం వంటి వాటిని ఆరుద్ర కథనీకరించారు.

పు.ము II (పు.239-248) సుమారు పది పుటలలో'మార్కండేయ పురాణం'లో గల విశేషాల్ని కవి ప్రతిభను వివరించారు.

'మార్కండేయ పురాణం' మూలంలో కంటే తెలుగులో కన్పించే విశేషాంశాల్ని శేషాద్రిరమణ కవుల, నేలటూరి వెంకటరమణయ్యల పరిశీలనలనూ కూడా అదనంగా చేర్చారు.

♦తొ.ము IIలో ఎనిమిది పుటల్లో (పు.231-238) మారన గురించి వివరిస్తే,

పు.ము II (పు.236-238) పదమూడు పుటల్లో పెంచి విశదీకరించారు.

## అధర్వణా చార్యుడు

నన్నయ వదిలిన భారతాన్ని విరాటపర్వం నుంచి తిక్కన మాత్రమే కాకుండా, అధర్వణుడు పూర్తి చేశాడనీ, అయితే అది లభ్యం కాలేదంటూ అధర్వణ్ణిపరిచయం చేశారు. ఆ భారత భాగం లభ్యం కాలేదని ముగించారు. ఇతడు రచించిన 'ఆనందరంగ రాట్ఛంధం'లో 26 పద్యాలు మాత్రమే లభ్యమవుతున్నాయి. అయితే ఇతడు రచించినట్లు చెప్పుకుంటున్న 'వికృతి వివేకం' గురించిన చర్చ పు.ము II లో అధికంగా కన్పిస్తుంది'. 'వికృతవివేకం' అధర్వణుని కృతం కాదనీ, అహోబలపండితుడే దీనిని సృష్టించి అధర్వణనికి అంటగట్టారనే అభిప్రాయాన్ని వ్యక్తం చేసిన దొణప్ప పరిశోధనను, 'వికృత వివేకం' రచించక పోయినా, అధర్వణుడు 'త్రిలింగ శబ్దాను శాసనం' రచించి ఉంటాడనే అమరేశ్వరం రాజేశ్వర శర్మ అభిప్రాయాన్ని చర్చించడం పు.ము II (పు.251) లో అదనంగా చేర్చారు. కానీ,క్రీ.శ 1660 ప్రాంతాల్లో మండలక్ష్మీ నరసింహా చార్యులు 'ఆంధ్రకౌముది'ని రచించారు. దీనికే 'త్రిలింగ శబ్దాను శాసనం' అనే పేరు ఉందన్నీ దీనికి మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయం కేటలాగు 1-1223 ప్రతిని ఆధారం చూపారు.'ఆంధ్ర శబ్దచింతా మణి'కంటే ఈ 'త్రిలింగ శబ్దాను శాసనం' ప్రథమమనే అమరేశ్వర రాజేశ్వరశర్మ అభిప్రాయాన్ని పూర్వ పక్షంచేశారు. 'త్రిలింగ శబ్దాను శాసనం' అధర్వణకృతం కాదు అనడం వంటివన్నీ పు.ము II లో అదనంగా చేర్చిన అంశాలు..

ఈ కవితో రెండవ సంపుటిని ముగించారు.

# సమగ్ర ఆంధ్ర సాహిత్యం: తొలి ముద్రణ పునర్ముద్రణల మార్పులు చేర్పులు

## 4.3. మూడవ సంపుటి(పద్మనాయక, రెడ్డిరాజుల యుగం)

♦తొ.ము. III జూన్ 1965 లో ముద్రితమైంది. పి.వి.రాజమన్నారు. శివశంకరస్వామిలు 'ముందుమాటలు' రాశారు.

పు.ము III మార్చి 1990 లో ప్రచురించారు. పి.వి రాజమన్నారు. శివశంకర స్వామిల ముందు మాటల్ని తొలగించారు.

♦తొ.ము III పద్మనాయక యుగంలో భాస్కర రామాయణ కవులు, శరభాంకుడు, కృష్ణమాచార్యులు, రావిపాటి తిప్పన్న, పెద్దయామాత్యుడు, చిమ్మపూడి అమరేశ్వరుడు, ఎఱ్ఱాప్రెగ్గడ, నాచనసోమనాథుడు, శ్రీగిరికవి, గోనబుద్ధరాజు, భూపతి విట్ఠలరాజులవరకూ వివరించారు.

పు.ము III లో పద్మనాయక యుగంతోపాటు, రెడ్డిరాజుల యుగాన్ని కూడా కలిపారు.

### *పద్మనాయక యుగం*

♦తొ.ము III లో 'పద్మనాయక యుగం' లోనే చెప్తూ, రెడ్డిరాజుల ఆస్థానంలో ఉన్న ఎర్రా ప్రెగడ గురించి, పద్మనాయక యుగంలో చెప్పుకొనడం చారిత్రక కాల విభజన వల్ల తప్పని సరి అవుతోంది అన్నారు. (పు.7.) దీన్ని పు.ము III లో తొలగించారు.

♦తొ.ము III లో (పు.8) ఎడపాటి ఎర్రన కాలాన్ని 1509-1530 గానూ, పు.ము **III** లో (పు.6) ఈ కవి కాలాన్ని 1678-1693 గా మార్పుచేశారు.

♦తొ.ము. III (పు.9) లో తురగారాజకవి, అయ్యంకి బాలసరస్వతి అనే జంటకవుల రచన 'నాగర ఖండం' ప్రబంధం 1584 గానూ, పు.ము III (పు.6)లో 1731 గానూ మార్పు చేశారు.

♦తొ.ము III.లో 'పద్మనాయక యుగం' మాత్రమే ఉండగా, పు.ము III లో 'రెడ్డి రాజుల యుగం' కూడా కలిపారు.(పు.10) పన్నెండు పుటలలో రెడ్డి రాజులయుగ ప్రాశస్త్యాన్ని వివరించారు.

### *భాస్కర రామాయణ కవులు*

కాకతీయయుగం లో స్త్రీలు పాడుకొనే రామాయణం నుండిగాని, ఈ భాస్కర రామాయణ కవులు మార్పులు స్వీకరిస్తే వాళ్లని అభినందించాలని ఆరుద్ర చెప్పారు. రెండుపుటల (పు.47-48) అదనపు సమాచారం ఇచ్చారు.

## శరభాంకుడు

♦తొ.ము III (పు.50) శరభాంకుణ్ణి కవిగా అనంతరకవులుభుతించారు. 16వ శతాబ్ది ప్రథమపాదంలో ఉన్న "ఎడపాటి ఎఱ్ఱయ్యకవి.."గా చెప్పారు.

పు.ము III (పు.50) ఈ కవిని 17వ శతాబ్ది చరమ పాదంలో ఉన్న కవిగా మార్పుచేశారు.

## శ్రీగిరి అయ్యగారు.

♦తొ.ము III (పు.57-72) లో శరభాంకుడు తర్వాత కృష్ణమాచార్యులు గురించి వివరించగా, పు.ము III (పు.55) శరభాంకుడు తర్వాత శ్రీగిరి అయ్యగారుని చేర్చారు.

శ్రీగిరి కవి రచించిన 'నవనాథ చరిత్ర' అనే పద్యకావ్యాన్ని గౌరన ద్విపదగా వర్ణించాడు. 'శ్రీగిరికవి మఠాచార్యుడు కావచ్చును'అన్నారు. శైవాచార్యుల్ని 'అయ్యగారు' అనీ, వైష్ణవాచార్యుల్ని 'అయ్యంగారు' గానూ పిలుస్తుంటారు. (పు.56) కాకతీయ ప్రభువులలో ప్రతాపరుద్రుడు (క్రీ.శ 1291-1323) కాలంలో ఈ కవి జీవించాడు. శాసనప్రమాణాలలో 'ప్రమథకవి శ్రీగిరి' అని కన్పిస్తుంది. (పు.60) అన్నారు.

## రావిపాటి తిప్పన్న

♦తొ.ము-III (పు.76) లో లేనిది పు.ము III (పు.62) లో ఆన వేమారెడ్డి (క్రీ.శ. 1364-1386) కాలంలో ఒకరాయని భాస్కరుడు ఉన్నాడని కొన్నిచాటువులు చెప్తున్నాయి. రావిపాటి తిప్పరాజు ఈ కాలం వాడని భావిస్తున్న మల్లంపల్లి సోమశే ఖర శర్మ అభిప్రాయాన్ని ఈ సందర్భంలో చేర్చారు.

## చిమ్మపూడి అమరేశ్వరుడు

♦తొ.ము III (పు.88) లో రావిపాటి తిప్పన్న తర్వాత పెద్దయామాత్యుడుని వివరిస్తే, పు.ము III(పు.72) లో చిమ్మపూడి అమరేశ్వరుడు గురించి వివరించారు.

అమరేశ్వరుణ్ణి స్తుతించిన కవులపట్టిక తొ.ము III (పు.101) లో నూతకవి సూరన్నకాలం క్రీ.శ. 1475-1500 గానూ, పు.ము III లో (పు.1700 ప్రాంతాలుగానూ మార్పు కన్పిస్తుంది.

♦తొ.ము III (పు.108) లో ఒకపద్యం పేర్కొన్నారు. పు.ము III (పు.77-78) లో ఇది 'విక్రమసేనం'లోని పద్యమని 'ప్రబంధ రత్నాకరం'లోనూ, 'ఉదాహరణ సంకలనం'లోనూ చేర్చినా, ఇది వాస్తవానికి నన్నెచోడుని పద్యమేనని, 'కుమార సంభవం' సప్తమా శ్వాసం 108 వ పద్యంగా నిర్ణయించారు.

'విక్రమ సేనం'లోనిదని 'ప్రబంధ రత్నాకరం', 'ఉదాహరణ గ్రంథం'లోనూ ఇద్దరు సంకలన కర్తలో పొరపడి ఉండవచ్చువనీ, వాస్తవానికి ఈ కావ్యం బమ్మెరపోతరాజుదనీ, దశవు స్కంథపూర్వభాగంలోని 1288 వ పద్యంగా పు.ము III (పు.84) మార్పుల చేశారు.

♦తా.ము III (పు.129) లో "భూమినిండెమింట" పద్యం అమరేశ్వరునిదిగానే భావించగా, పు.ము (పు.95)లో భాగవతంలోని దశమస్కంధం పూర్వ భాగం 1291 పద్యంగా మార్పు చేశారు.

పు.ము III (పు.99) లో మానవల్లి రామకృష్ణకవి ప్రకటించిన 'ప్రబంధమణి భూషణం' అనే సుకవికృత కథాకావ్యాన్ని ప్రకటించిన విషయం చెప్పి, దీనిలో ఏయే కృతులనుండి పద్యాల్ని తీసుకొని కథను అల్లాడో చెప్పలేమన్నారు. వీటిలో 411 పద్యాలకు మాత్రమే కర్తలెవరో కనిపెట్టగలిగారాన్నారు. రవ్వాశ్రీహరి 'అలభ్యకావ్యపద్యముక్తావలి' మటివాటిలో నిడదవోలువారు పొరపాటున చెప్పారోమేనని చెప్పిన అభిప్రాయాల్ని పేర్కొన్నారు. 'విజయ సేనము' బదులు 'విక్రమ సేనలు' గా తంజాపూరు మూలప్రతుల్ని ముందే పేర్కొన్నారు. ఇవన్నీ అదనపు అంశాలు సుమారు అయిదు పుటలవరకూ పెంచడం ఇక్కడ కన్పిస్తుంది.

## *నాచన సోమనుడు*

♦తా.ము III (పు.201) లో "సోముని సత్యభామలో పయ్యెదకొంగు ఒకింత తొలగలేదు. ఆ తొలగిన పైటను కృష్ణుడే పొందుపరచవలసి వచ్చింది." అని ఉండగా, పు.ము III (పు.154) లో "పోతరాజు గారి సత్యభామ ........ తొలగలేదు. సోముని భామలో ఆతొలగిన పైటను పొందుపరచవలసి వచ్చింది." అని మార్పుచేశారు.

♦తా.ము III (పు.206) లో లేని వివరణ, పు.ము III (పు.158) లో ఒకటి కన్పిస్తుంది. "మిండరికము", "లంజెతనము" అనే మాటలు సోముడు కావాలని నీచత్వం కోసం వాడిన మాటలు కావు. అతని సమకాలిక సమాజంలో వాటిని వాడే వారు వంటి వివరణలు చేర్చారు.

♦తా.ము III (పు.216) లో మొత్తం మీద లాక్షిణికులో, సంకలనకర్తలో ఉదాహరించడం వల్ల నాచన సోమన కృతులు 1 ఉత్తరహరివంశం, 2 ఆదిపురాణం లేక ఆదిత్యపురాణం 3 వసంత విలాసం అనే మూడింటిగా గుర్తించగా, పు.ము III (పు.170) లో నాచనసోముని కృతులుగా నాలుగింటిని పేర్కొన్నారు. ఆ నాల్గవది హరి (ర) విలాసం.

దీనితోపాటు మరికొంత అదనపు సమాచారాన్ని పు.ము III (పు.165-170) చేర్చారు. దీనిలో మానవల్లి రామకృష్ణకవి గుర్తించినవి తిరుపతి ప్రాచ్య లిఖితగ్రంథాలయంలోని 'బాలబోధ ఛందస్సు'లో ఉదాహరించినవీ, వీరేశలింగం 'కవుల చరిత్ర'లో పేర్కొన్నవీ. మంత్రిప్రగడ భుజంగరావు గుర్తించినవీ,సంపత్కుమారాచార్య పరిష్కరించిన ప్రతులను కూడా పు.ము III లో విశ్లేషించారు.

## *గోన బుద్ధరాజు*

♦తా.ము III (పు.217) లో నాచన సోముడి తర్వాత శ్రీగిరి కవిని పేర్కొని తర్వాత గోన బుద్ధ రాజుని వివరించగా పు.ము III (పు.170) గోన బుద్ధరాజుని వివరించారు.

♦తొ.ము III (పు.224) లో చెంగల్పట్టు జిల్లా తిరుప్పుకు శాసనంలో ఒక గోనకాటయ పేరు కన్పిస్తుందని మల్లింపల్లి వారు గుర్తించానన్నారు.

పు.ము III (పు.173) తమిళ అక్షరాన్ని తొలగించారు.

♦తొ.ము III(పు.236) లో మల్లంపల్లి సోమశేఖర శర్మ, వివిధ రామాయణాలలోని అవాల్మీకి గాథల్ని పట్టికలో చూపగా, పు.ము III (పు.183) మరికొన్ని రామాయణ ప్రతుల్ని పరిశోధించినట్లు ఆరుద్ర చెప్పుకున్నారు. లండన్‌లోని ఇండియా ఆఫీసు గ్రంథాలయం, ప్రాచ్యభాగంలో రెండు రంగనాథ ప్రతుల్ని చూసి వాటిని (TEL-MSS-UR 5397, TEL-MSS-OR 8841) సంక్షిప్తంగా వివరించడాన్ని చేర్చారు. బ్రిటన్‌లోనే కాకుండా, ఫ్రాన్స్‌లో ఉన్న ఒకప్రతి కార్డు నెంబరు **38-938-H 271.1** ని పేర్కొన్నారు. ఇలా కొత్త అంశాల్ని సుమారు మూడు పుటల (183-185) వరకూ తొ.ము III లో లేని అంశాలు పు.ము III లో చేర్చారు.

## *కాచ భూపతి, విట్ఠలరాజు*

♦తొ.ము III (పు.253) లో తిరుప్పుక్కు గ్రామంలో గోనకాటయ శాసనం గురించి వివరిస్తూ "తిరుప్పుక్కు" తర్వాత తమిళ లిపిలో ఒక అక్షరం కన్పిస్తుంది. ఇది సుమారు "తిరుప్పుకు" తర్వాతనే మూడుసార్లు వచ్చింది. ఇది పు.ము III (పు.198) లో తొలగించారు.

కాచభూపతి, విట్ఠలరాజులతో తొ.ము III సంపుటిని ముగించగా, పు.ము III లో దోనయామాత్యుడు, పశుపతినాగనాథ కవి, ప్రకాశ భారతీయోగి, కందనామాత్యుడు, మడికి సింగన, మడికి అనంతయ్య, కొరవి సత్యనారన, విన్నకోట పెద్దన, జన్నమంత్రి, కవి రాక్షసుడు, శ్రీనాథుడు, నిశ్శంకకొమ్మన, దగ్గుపల్లి దుగ్గన, జక్కన కవుల్ని వివరించారు.

♦తొ.ము III లో గల కవుల్ని పు.ము III లో చేర్చారు.

## *రెడ్డి రాజుల యుగం.*

♦తొ.ము IV 'రెడ్డిరాజుల యుగం' గా ఒక సంపుటిలో వివరించగా, పు.ము III లో పద్మనాయక, రెడ్డిరాజులయుగాలు గా ఒకే సంపుటిలో కలిపేశారు. తొ.ము పు.ము III గా మార్పు చేశారు.

## *దోనయామాత్యుడు.*

దోనయామాత్యుడు గ్రంథంలో ప్రాచీన ధోరణి కన్పిస్తుందనీ, తరువోజ, తోటక వృత్తాలు వాడారని నిడదవోలు వెంకటరావు భావించగా, లేఖకులు పొరపాటువల్ల చేరి ఉండవచ్చుననీ, అది తరువోజు కాదనీ, మంజరీద్విపద అనీ చెప్పి, ప్రాచీన తరువోజ లక్షణాలయిన ఏక యతీ నియమం పాటించలేదు. ఈ పద్యాలను చూశాక, క్రీ.శ. 1356 ప్రాంతాలలోనే మంజరీ ద్విపదలు తెలుగు సాహిత్యంలో ప్రవేశించాయని చెప్పుకోవాలి అన్నారు. కానీ, తొ.ము IV (పు.25) లో కాలాన్ని 1360 ప్రాంతంగా గుర్తించినదాన్ని పు.ము III లో మార్పుచేశారు.

కాళిదాసు 'మేఘసందేశం' లో మేఘుణ్ణి మంచిరోజున కథలో ప్రవేశపెట్టారని వివరించి పు.ము III (పు.200) లో దోనయామాత్యుడు ఆ విధంగా వర్ణించటంలో గల కవి ప్రతీకను వివరించారు. (పు:201)

దోనయామాత్యుడు రచించిన 'సస్యానందం' గురించి తొ.ము IV (పు.22) లో 'మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకశాల'లో తాళపత్ర, కాగిత ప్రతులు కొన్ని "ఉన్నాయట" అని పేర్కొన్న ఆరుద్ర. పు.ము III (పు.204) లో "ఉన్నాయి" అని నిర్ధారణలో చెప్పారు. .

పు.ము III (పు.205) మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో డి 2385 సంఖ్యగల ప్రతిని చూపారు. అంతేకాకుండా తొ.ము IV లో నిడదవోలు వెంకటరావు చెప్పిన కాలాన్ని 1356 గాని, క్రీ.శ. 1360 గాని అవుతుందన్న దాన్ని ఉటంకిస్తే, పు.ము III (పు.205) లో దోనయామాత్యుని పోషకుడు విశాఖపట్నం జిల్లా ఎలమంచిలి సర్వసిద్ధిని పాలించిన చాళుక్య వంశంలోనివి మూడవ ఉపేంద్రుడు అనీ, ఈతని కాలం 1356 నుండి 1364 వరకు గా చరిత్ర చెబుతుందన్నారు. దోనయామాత్యుడు కూడా ఈ కాలానికి చెందినవాడేనని చెప్పారు.

♦తొ.ము IV లో లేని విషయాలు కొన్ని పు.ము III లో చేర్చారు. రైతులకు 'సస్యానందం' వంటి గ్రంథ ప్రయోజనాన్ని, శుక్రుడికీ, గురుడికీ రైతులు పెట్టుకొనే పదాల్ని మాండలిక వృత్తిపదకోశం ఆధారంగా విశ్లేషించి, 210 నుండి 212 పుటలవరకూ దోనయామాత్యుని కృషిని వివరించారు.

## *పశుపతి నాగనాథకవి*

♦తొ.ము IV లో దోనయామాత్యుని తర్వాత కవి భల్లటుడు ఉంటే.,పు.ము III (213) లో పశుపతి నాగనాథకవిని వివరించారు.

పశుపతి నాగనాథకవి 1369 లో పాలించిన పద్మనాయక ప్రభువు అనపోతనాయకుని అయినవోలు శాసనానికి నాగనాథుడు కర్త అనేది కొత్తగా పు.ము III (పు.216) చేర్చిన అంశం. మల్లంపల్లి సోమశేఖర శర్మ రచించిన History of Reddy Kingdoms (పు.531) ని ఆధారంగా తీసుకొని ఈ కొత్త అంశాన్ని చేర్చారు.

## *ప్రకాశ భారతీయోగి*

♦తొ.ము IV (పు.44) లో ప్రకాశ భారతీయోగి గురించి శాసనాలవల్ల కొన్ని వివరాలు చెప్పి, అనవేమారెడ్డి ఆస్థానంలో ఉండేవాడేమే అన్నారు. పు.ము III (పు.219) లో అనవేముని కాలాన్ని 1364-1386 గా పేర్కొని, ప్రకాశ భారతీయోగి చెప్పినట్లు తెలుస్తున్న శాసనపద్య విశేషాల్ని మరి కొన్నింటిని వివరించారు.

## కందనామాత్యుడు

పల్నాడు (హనుమకొండ ప్రాంతం) ని రాయగిరి దుర్గం రాజధానిగా క్రీ.శ 1350 ప్రాంతాల్లో పరిపాలించిన ముప్పభూపాలుని మంత్రి కందనామాత్యుడు. ఇతడు కవికూడా!

కందనామాత్యుడు చెప్పిందని మడికి సింగన 'సకలనీతి సమ్మతం' లో చేర్చినా ఇది 'కవిజనాశ్రయం' లో కన్పిస్తుంది. అయితే 'కవిజనాశ్రయం' లోకి కందనామాత్యుని 'నీతితారావళి' నుండే ఈ పద్యం వెళ్ళడానికి ఆస్కారముందని తొ.ము IV (పు.49) లో చెప్పగా, పు.ము III(పు.223) లో ప్రతుల లేఖకుల పొరబడ్డారేమోనంటారు. లేఖక దోషాల్ని కూడా గుర్తించారు.

## మడికి సింగన

మడికి సింగన 1377 ప్రాంతంవాడని పు.ము III (పు.230) లో కాపయనాయకుని కాలం 1345-1367ని బట్టి, 1347 నాటి ఆనపోతనాయకుని ద్రాక్షారామ శాసనాన్ని అనుసరించి, ఈ కాలంలో మడిసింగన తండ్రి అయ్యల మంత్రి జీవించి ఉండటం వల్ల తరానికి ముప్ఫయి సంవత్సారాలు లెక్కించి నిర్ణయించవచ్చునన్నారు.

ఇది తొ.ము IV లో లేదు. పు.ము III లో అదనంగా చేర్చారు.

## మడికి అనంతయ్య

ఈ కవి గురించి ప్రస్తావన చేస్తూ 'కేయూరబాహు చరిత్ర' నే 'మారన' రచించినట్లు తొ.ము IV (పు.79) లో పేర్కొని, పు.ము III (పు.247) లో 'మంచెన' గా సరిదిద్దారు.

♦తొ.ము.IV (పు.81) లో 'ఇది శ్రీమదన గోపాలవర ప్రసాద......'

పు.ము III లో (పు.249) 'వర' తొలగించారు.

♦తొ.ము IV లో (పు.82) మడికి సింగన తమ్ముడు అనంతయ్య కాలం 1347-1400 ల ప్రాంతాలుగా పేర్కొంటే,

పు.ము III లో (పు.250) 1374-1400 ప్రాంతాలుగా మార్పు చేశారు.

♦తొ.ము IV (పు.83) లో శేషయ్య "నిరూపించారు".

పు.ము III (పు.250) లో శేషయ్య "ఆరోపించారు".

♦తొ.ము IV (పు.83) లో అనంతయ్య రచనని నిరూపించారు.

పు.ము III (పు.250) లో అనంతయ్య రచనని 'అనంతయ్యరచన అని శేషయ్య' ఉద్దేశం. అన్నారు.

♦తొ.ము IV (పు.83) లో 'మనం దానిని పటిష్టం చేద్దాం' అన్నారు.

పు.ము III (పు.250) లో "మరికొన్ని కొత్త విషయాలతో మనం దానిని పరిశీలిద్దాం".అని వాక్యాన్ని మార్పు చేశారు.

♦తొ.ము IV (పు.84) లో గోదావరి మండల వాసిగా అనంతయ్యను శేషయ్య నిరూపించారని అన్నారు.

పు.ము III (పు.251) లో శేషయ్య వాదిస్తున్నారన్నారు.

♦తొ.ము IV (పు.86) లో 'విష్ణుమాయానాటకం', 'తారక బ్రహ్మరాజీయం', మధ్య భేదాల గురించిన వాఖ్యానం పు.ము III (పు.252) లో ఉంది. తొ.ము IV (పు.86) లో 'విష్ణుమాయా నాటకం,' తారక 'బ్రహ్మరాజీయం' మధ్య భేదాల గురించిన వ్యాఖ్యానం పు.ము III (పు.252) లో ఉంది. తొ.ము IV (పు.86) లో చాగంటి శేషయ్య వాదన "గ్రంథ కర్తలు భిన్నం" అనే దానికి చెప్పిన కారణాలు సహేతుకంగా లేవని ఒకే కవి భిన్న కావ్యాలలో భిన్న కథలు రాసి ఉండవచ్చునని శ్రీనాథుడు 'కాశీ ఖండం'లో గుణనిధి కథను, 'శివరాత్రి మాహాత్మ్యం' లో 'సుకుమారుని కథ' 'తెనాలి రామకృష్ణుడు ఉద్భటారాధ్య చరిత్ర' లో మదాలసుని కథ, 'పాండురంగ మాహాత్మ్యం'లో నిగమశర్మ కథ ఉన్నట్లే ఎల్లన కూడా పయనించాడనుకోవచ్చు గదా' అన్నారు.

♦తొ.ము IV లో కంటే, పు.ము III (పు.248) లో పతితులు మోక్షంపొందిన కథలున్న కావ్యాల్ని వింగడించడంలో మరింత స్పష్టత కన్పిస్తుంది. 'కాశీఖండం'లో గల గుణనిధికథను పట్టికలో అదనంగా చేర్చారు. అంతేకాకుండా, పు.ము III లో ఏ కావ్యంలో ఏ కథలు పతితులు మోక్షం పొందారో స్పష్టంచేశారు. అవి: శివరాత్రి మాహాత్మంలో సుకుమారనికథ; ఉద్భటారాధ్య చరిత్ర లో, మదాలసునికథ, పాండురంగమాహాత్మ్యంలో నిగమశర్మ కథ.

♦తొ.ము IV (పు.88) లో మడికి సింగన, మడికి అనంతయ్యలను అన్న, తమ్ముడుగా పేర్కొని, "అన్నగారు వ్రాసిన పద్యాన్ని తమ్ముడు అనుసరించిన పద్యాన్ని" అని వివరిస్తే, పు.ము III (పు.254) లో "సింగన పద్యాన్నీ విష్ణుమాయానాటకంలో అనుసరించిన పద్యాన్నీ" కూడా చూద్దామన్నారు.

అలాగే తొ.ము IV (88) లో సింగన పద్యం, అనంతయ్య పద్యమని మరొక చోట ప్రయోగించగా, పు.ము III (254) లో సింగన పద్యం, పద్యంగా మార్పు చేశారు.'అర్వాచీనుడి'.

విష్ణుమాయానాటక కర్త మడికి అనంతయ్యగా తొ.ము IV లో భావిస్తే, పు.ము III లో, కర్తృత్వాన్ని, అనంతయ్యకి దాఖలు పర్చలేమన్నారు. (పు.255), అందుకనే అన్న, తమ్ముడు రచించినవనడంలో మార్పు చేశారు.

♦తొ.ము IV (పు.90) లో 'విష్ణు మాయానాటక కర్త' మడికి అనంతయ్యగా నిర్ణయించినా, పు.ము III (పు.255) లో వివిధ పరిశోధకుల సిద్ధాంతాల్ని చర్చించి, కర్తృత్వ విషయంలో విష్ణుమాయానాటకాన్ని అనంతయ్యదిగా భావించడాని వీల్లేదన్నారు.

## చిన్నకోట పెద్దన

♦తా.ము. IV (పు.107) లో "నన్నయ్య కాలాన తెలుగులో ఛందో గ్రంథంగాని, వ్యాకరణం గాని లేదు". అని ఉంటే, పు.ము III (పు.268) లో చాళుక్య రాజు కాలాన తెలుగులో ఛందోగ్రంథంగాని వ్యాకరణం గాని లేదు. అని వాక్యరచనలో మార్పు చేశారు.

## శ్రీనాథుడు

♦తా.ము IV (128) లో రెడ్డి రాజుల కాలం నాటి ఆంధ్ర దేశం పటం ఉంది.

పు.ము III (283) లో పటం ఖాళీ ఉంది కానీ, పటం లేదు. ఇది ముద్రణాదోషమని తెలుస్తుంది.

♦తా.ము IV (పు.168) లో అన్నమంత్రి శ్రీనాథుడ్ని స్కాందపురాణంలోని గోదావరీ ఖండాన్ని అనువదించమన్నాడు. శ్రీనాథుడు అంగీకరించారు. ఇది సంస్కృత 'స్కాంద పురాణం'లో గోదావరి ఖండ మనేది ఏదీ కనపడదనిఅన్నారు. పు.ము III (పు.312) లో ఈ వాక్యాలు తొలగించారు.

♦తా.ము IV (పు.169) 'భీమఖండం' కథాకథనశైలికీ, పు.ము III (పు.313) కీ భేదం కన్పిస్తుంది.

♦తా.ము IV (పు.175) లో శ్రీనాథుడు చెప్పిన కర్ణాటభాషను బట్టి ఆతని ప్రాంతాన్ని నిర్ణయించడానికి కొంత ప్రయత్నం కన్పిస్తుంది. ఇది చేర్పు

శ్రీనాథుడు పాకనాటివాడన్నారు. 'శ్రీశైలం అడివారనుండి తూర్పున సముద్రం దాకా విస్తరించిన సీమను పాకనాడు అని పిలిచేవారు. శ్రీనాథుని స్వస్థానాన్ని ఆనాడు "కర్నాడు" అని కూడా వ్యవహరించేవారు. కర్మినాడు, కర్నాట, కణ్ణ విషయ అన్నవి ప్రాచీన నామాలు. నందికొట్కూర్రు, కర్నూలు, నంద్యాల తాలూకాలోని కొన్ని భాగాలు కలిసి ఒకప్పుడు "కరునాడు" అని చెలామణి అయ్యేవి. సాతవాహనుల కాలంలోని కర్ణి రాజుల ఏలుబడిలోని ప్రాంతాల్ని "కర్మినాడు" అని పిలిచేవారు. కణ్ణ విషయమని వ్యవహరించేవారు. సాతవాహన కోట రూపాంతరమైన "సాతానికోట" ఇప్పటికీ ఈ ప్రాంతాలలో ఉంది.

శ్రీనాథుని కాలంలో కొంత పాకనాడు, కొంత కమ్మనాడు కలిసి కర్నాడుగా చెలామణి అయ్యేవనిచెప్పవచ్చు. అందుకే తన భాషా ప్రౌఢి వల్ల సంస్కృతం, పలుకు నుడికారం వల్ల తెలుగు అయినా మొత్తం మీద కర్ణాటక భాష అని చాటుకున్నారు.

పాల్కురికి సోమనాథుని కాలంలో కర్నూలు ప్రాంతాల్ని కర్నాడు అని పేర్కొనేవారు. కర్నూలు తాలూకాలోని గొబ్బూరును కర్ణాటక భూమికి కుటీరమని సోమనాథుడు చెప్పారు. (పు.318)

♦తా.ము IV (పు.185) లో కథాసూత్రంతో "**జారువముడి**" వేశారు.

పు.ము III (పు.326) లో కథాసూత్రంతో "**జారుముడి**" వేశారు.

♦తా.ము IV (పు.193) లో డిండిమభట్టుని గురించి చెప్తూ ఇటువంటి పండితుణ్ణి గతిస్తే పేరు..... అన్నారు.

పు.ము III (పు.33) "ప్రౌఢ పండితుణ్ణి" అని విశేషణాన్ని చేర్చారు.

♦తా.ము IV (పు.193) మధ్యష్టం

పు..ము III (పు.332) మాధ్యష్టం

♦తా.ము IV (పు.211) శ్రీనాథుని శివరాత్రి మాహాత్మ్యంలో నాలుగు ఆశ్వాసాల వరకే కథ దొరికిందనీ, బిరుదురాజు రామరాజు సంపాదించిన సంపూర్ణ గ్రంథం ప్రకటించబోతున్నారన్నారు.

పు.ము III (పు.344) లో శిథిల పూరణం చేసి గ్రంథాన్ని ఇటీవలే ముద్రించారని మార్పుచేశారు.

♦తా.ము IV (పు.248) లో లేని అంశాల పు.ము III (పు.371) లో కొన్ని కన్పిస్తున్నాయి.

పు.ము.III (పు.372-373) శ్రీనాథుని జీవిత కాలాన్ని కొమర్రాజు, కందుకూరి, బండారు, మల్లంపల్లి,చాగంటి, వేటూరి వారు ఎలా భావించారో ఒక పట్టికలో చూపించారు. ఈ పట్టికలో శ్రీనాథుని కావ్యాల్ని, కృతిపతుల వివరాల్ని పేర్కొన్నారు. అయితే దీనిలో 'నందన నందన చరిత్ర' అనే పేరుతో ఒక కావ్యాన్ని శ్రీనాథుడు రచించిన ట్లు చెప్తున్నారని, కానీ దీన్ని వేటూరి వారు విశ్వసించలేమన్నారు.

భీమఖండంలో శ్రీనాథుడు, మొట్టమొదట అవతారికలోరాధాకృష్ణుల ప్రసక్తి తీసుకువచ్చాడు. తెలుగు సాహిత్యంలో మొట్టమొదట రాధామాధవ శృంగారాన్ని వర్ణించిన ఘనత ఈకవికే చెందుతుంది.

మడికి అనంతయ్య రాసిన విష్ణుమాయనాటకమే శ్రీనాథుడు రచించిన 'నందనందన చరిత్ర' అనే బాలాంత్రపు వేంకటరావు వాదాన్ని చర్చించారు. 'నందనందన చరిత్ర' రాసి ఉండొచ్చునని చాగంటివారు అంగీకరించడం, 'భీమ ఖండం'లోని రాధామాధవస్తుతిని బట్టి 'నందనవందన చరిత్ర' శ్రీనాథుడు రచించి ఉంటాడనే కొర్లపాటి శ్రీరామమూర్తి పరిశోధనను పేర్కొన్నారు.

ఈ అంశాలన్నీ అదనంగా పు.ము III లో చేర్చారు. శ్రీనాథుడు తన కావ్యాల్లో పేర్కొన్న శాక పాకాల్ని పు.ము III (పు.379-384)లో ఆరుపుటల్లో వివరించి "అనుబంధం" గా చేర్చారు.

♦తా.ము IV శ్రీనాథుడు తో ముగించగా, (పు.ము III) లో మాత్రం నిశ్శంక కొమ్మన, దుగ్గపల్లి దుగ్గన, జగ్గనల వరకూ వివరించారు.

## నిశ్శంకకొమ్మన

నిశ్శంకకొమ్మనను తా.ము IV గజపతులయుగం లో మొదట వివరించారు. గజపతుల యుగాన్ని ఆరుద్ర వివరిస్తూ ఆంధ్రదేశంలో గజపతులు చిరస్థాయిగా ఉండే ఊళ్ళు కట్టించి, చెరువులు తవ్వించి,

పాలించారు. వీరి రాజకీయ చరిత్ర రెడ్డి రాజుల అవసాన కాలంలోనూ, మలిరాయల యుగంతోనూ పెనవేసుకొని ఉంది. గజపతులు తెలుగు సాహిత్యాన్ని ప్రత్యక్షంగా పోషించినట్లు సాక్ష్యం లేకపోయినా ఒడయనంబి విలాపం,మాఘ మాహాత్మ్యం మొదలైన గ్రంథలవల్ల వాళ్ళు చేసిన దానాలు, విద్యాపోషణ తెలుస్తూండడం చేత గజపతుల పేర ఒకయుగాన్ని పేర్కొని, దానిని రెడ్డిరాజుల, తొలిరాయల యుగాలకు అనుబంధంగా జమకట్టుకొందాం. శ్రీనాథుని సమకాలికులూ, సమీప కాలికులూ ఇందులో ఉంటారు (పు.16) అని ఆరుద్ర అన్నారు. కానీ పు.ము.IVలో గజపతుల, తొలిరాయల యుగం విషయంలో చాలా మార్పు కన్పిస్తుంది. ఈ మార్పుల్ని పు.ము.IVలో గల కవుల, రచనల్లో జరిగిన మార్పుల్ని పరిశీలించినప్పుడు గమనించవచ్చు.

## *దుగ్గపల్లి దుగ్గన*

తొ.ము V (పు.**36-58**) లో గౌరన గురించి వివరించగా, పు.ము III(పు.**1400**) లో దుగ్గపల్లి దుగ్గవను వివరించారు. అయితే తొ.ము V(పు.**157**)లో అయ్యలరాజు తిప్పయ్య తర్వాత వివరించారు.

తొ.ము V (పు.**158**) లో దుగ్గన రచించిన 'శివకాంచీ మాహాత్మ్యం' ప్రస్తుతం లభించకపోయినా, రెండు పద్యాలు లభిస్తున్నాయని ఉదాహరించి, 'శివకాంచీ మాహాత్మ్యానికి మూల గ్రంథమేమిటో కావ్యంలో ఏయే విషయాలు ఉంటాయో వివరించిన భాగాల్ని పేర్కొన్నారు. అది వివరించినటే కుమళ్ళ అచ్యుతరావు పేరు పు.ము III (పు.**401**) లో కొన్ని మార్పులతో పేర్కొన్నారు.

నాసికేతుని కథ భారతీయతత్త్వశాస్త్ర చరిత్రలో ఒక సంధియుగానికి సంబంధించింది వంటి వ్యాఖ్యలు పు.ము III (పు.**414**) లో ఉన్నాయి. ఇవి తొ.ము V (పు.**175**) లో లేవు. అలాగే దుగ్గన గురించి ముగిస్తూ చందలూరి బక్కయ్య (క్రీ.శ**1550**పూర్వం) శృంగారకవి తిరుమల నాథుడూ (క్రీ.శ.**1740**) ప్రాంతాలవాడు మిక్కిలి మల్లికార్జునుడు **1805-1875**) తోలేటి వెంకటసుబ్బారావు (**1887**) వంటివారు నాసికోతోపాంఖ్యావం, దుగ్గవ ప్రభావం వల్ల కూడా రచించారు వంటివి అదనంగా చేర్చిన అంశాలు.

## *జక్కన*

తొ.ము V (పు.**59**) లో గౌరన తర్వాత జక్కనను పేర్కొనగా, పు.ము III (పు.**416**) లో దుగ్గన తర్వాతనే జక్కన ను వివరించారు.

తొ.ము V (పు.**59**) లో లేనిది పు.ము III (పు.**418**) లో 'ఆదిమయుగం'లోనే 'శూద్రకరాజ చరిత్ర' అనే పేరుతో విక్రమార్కుని కథ కన్నడ తెలుగు సాహిత్యాల్లో రూపొందాయని చెప్పి, తర్వాత క్రీ.శ.**1400** ప్రాంతాలకే విక్రమార్కుని కథలు అతని పేరు కూడ తెలుగులో ఉన్నాయన్నారు.

జక్కన కవితో పు.ము III ముగిసింది.

# సమగ్ర ఆంధ్ర సాహిత్యం: తొలి ముద్రణ
# పునర్ముద్రణల మార్పులు చేర్పులు

## 4.4. నాల్గవ సంపుటి( గజపతుల, తొలి రాయల యుగం)

♦తొ.ము V లో గజపతుల యుగం పేర్కొనగా, పు.ము IV లో గజపతుల యుగంతో పాటు, తొలిరాయల యుగాన్నికూడా చేర్చారు. పు.ము III లో ప్రచురణకర్తల, ఆరుద్ర ముందుమాటలు మాత్రమే ఉన్నాయి. తొ.ము V ని ఆగస్టు 1965 లో ప్రచురించగా, పు.ము IV మార్చి 1990 లో ప్రచురించారు.

♦తొ.ము V (పు.2) లో లేని కొత్తఅంశాలు పు.ము IV (పు.3-5) లో గజపతుల గురించి కొన్ని చేర్చారు.

16వ శతాబ్ది ప్రథమ భాగంలో జీవించిన అబ్జరపు పేరయలింగం రచించిన 'ఒడయనంబివిలాసం' లో తనపూర్వులకు అగ్రహారం ఇచ్చినాడు అని పేర్కొన్న ఒక పద్యాన్ని ఉదాహరించారు. దీనిలో "గజిరాట్సిం హాసనాధ్యక్షునిన్ " అని వర్ణించిన గజపతి ఎవరోని కరంగా తేల్చలేదన్నారు.

కపిలేశ్వరగజపతి (క్రీ.శ. 1434-1468), పురుషోత్తమ గజపతి (క్రీ.శ. 1465-1497) ప్రతాపరుద్ర గజపతి (క్రీ.శ.1497-1538) పద్యాలలో వర్ణించిన గజపతి వీరిలో ఎవరో ఒకరై ఉంటారని తొ.ము V స్పష్టంగా ఉంటే, మరికొన్ని కొత్త అంశాలు చేరుస్తూ, వెనమళ్ళ సోమన 'సీమంతినీ కల్యాణం' కావ్యావతరికను బట్టీ 'ఏనుగు లక్ష్మణ కవి' తన ఇంటి పేరులోని "ఏనుగు" రావడానికి కారణం గజసతి భర్త చేత "గజము తోడ అగ్రహారాలు పొందడం" వంటి వర్ణనలు అవతారికలో కన్పించడాన్ని బట్టి, గజపతులు ఎందరో కవుల్ని ఆదరించారనే విషయాన్ని వివరించారు.

కపిలేశ్వర గజపతి, పురుషోత్తమగజపతి, ప్రతాపరుద్ర గజపతుల పాలన గురించి చాటువుల్ని, చరిత్రను ఆధారం చేసుకొని పు.ము IV (పు.6-10) లో వివరించినవి కొత్తగా చేర్చిన అంశాలు.

పు.ము IV (పు.15) లో గజపతులు తెలుగు వారికి వంశ పారంపర్యంగా వస్తున్న హక్కుల్ని సంరక్షిస్తూ, సముచిత స్థానాన్ని ఇవ్వడమే కాకుండా, శాశ్వతంగా ఉండేటట్లు శాసనాలు వేయించారని చెప్పారు. పూరీ జగన్నాథ ఆలయంలో జయదేవుని గీతగోవిందం గానం చేసే హక్కు తెలంగాణా నుండి వచ్చి పూరిలో స్థిరపడిన నట్టువ మేళం ఆటగత్తెలకే ఉండేవని, ఒరియాభాషలో గజపతులు 1499 లో వేయించిన శాసనాన్ని వివరించారు. దేవశర్మ పద్మావతి అనే ఒక అమ్మాయిని జగన్నాథునికి వివాహంచేయదలచి తెలంగాణా నుండి వెళ్ళాడు దేవశర్మ: పొండాలకు దేవుడు కలలో కన్పించి, జయదేవుణ్ణే వివాహం చేసుకోమనడం, దానికి జయదేవుడు నిరాకరించడం, దేవశర్మ, పద్మావతిని దేవాలయంలో వదలి వెళ్ళిపోవటంతో కొన్నాళ్ళకు జయదేవుడు పద్మావతిని ప్రియురాలుగా స్వీకరించాడు.

తెలంగాణా కు చెందిన ప్రాచీన నట్టువ మేళంతోనే పద్మావతి వచ్చి ఉంటుంది. ఆమె జయదేవునికి ప్రియురాలు కావడం వల్ల ఆమెతో వచ్చిన ఇతర దేవదాసీలకు కూడా 'గీతగోవిందం'పై ఒక రకమైన ఆడపడుచుల హక్కు ఏర్పడింది. సుమారు మూడు వందల ఏళ్ళుగా ఈ కుటుంబాలు గీత గోవిందాన్ని అభినయిస్తూ, దేవుణ్ణి సేవించుకోవడం గమనించిన ప్రతాపరుద్ర గజపతి, ఆసంప్రదాయం శాశ్వతంగా కొనసాగేటట్లు ఈ శాసనం చేయించారని ఆరుద్ర వివరించిన ఈ అంశాలు తొ.ము V లో లేనివి పు.ము IV లో కొత్తగా చేర్చినవని తెలుస్తున్నాయి.

ప్రతాపరుద్ర గజపతి ముందే ఆతని తాత కపిలేశ్వరుడు 'నట్టువ మేళం' వారిని ఆదరించాడని, **1459** కి ముందే ఓరుగల్లుని జయించిన కపిలేశ్వరుడిని ఆంధ్రనాట్యం, నర్తకీ మణులు నచ్చడం వల్ల తన కటకానికి వీరిని తీసుకొని వెళ్ళి ఉంటాడన్నారు. (పు.**18**)

గజపతులు, ఒడ్డెరాజుల కాలంనాటి అంశాల్ని వివరిస్తూ 'కేయూరబాహు చరిత్ర' రచించిన మంచన గురించి వివరించారు. మంచనను మార్పు చేయలేదు. (పు.**19**)

ఇతరచోట్ల తొ.ము V లో **"మంచవ"** ను **"మంచెవ"** గా పు.ము IV లో మార్పు చేశారు.

గజపతుల యుగం గురించిన ముగింపు పు.ము IV (పు.**20**) లో వీరి రాజకీయ చరిత్ర తొలి; దశ రెడ్డిరాజుల అవసాన కాలంలోనూ, చివరి దశ మలి రాయుల యుగం తోనూ పెనవేసుకొని ఉంది. వీరి పాలనంలో తెలుగు సాహిత్యాన్ని పోషించారు.

♦తొ.ము V(పు.**15**) లో వీరి రాజకీయ చరిత్ర రెడ్డి రాజుల అవసాన కాలంతోనూ, మలిరాయుల యుగంతోనూ పెనవేసుకొని ఉంది అని గజపతులు తెలుగు సాహిత్యాన్ని ప్రత్యక్షంగా పోషించినట్లు సాక్ష్యాలు లేక పోయినా ఒడయనంబి విలాసం మాఘ మాహాత్మ్యం మొదలైన గ్రంథాలవల్ల వీరి దానాలు, విద్యాపోషణా తెలుసుకోవచ్చుననీ., గజపతుల సేవ ఒక యుగాన్ని పేర్కొన్నా, దాన్ని రెడ్డి రాజుల, తొలిరాయుల యుగాలకు అనుబంధంగా చేసికొని, శ్రీనాథుని సమకాలికులూ, సమీపకాలికులు ఇందులో ఉంటారన్నారు. (పు.**16**)

## *తొలి రాయుల యుగం*

పు.ము IV లో గజపతుల యుగంతోపాటు, తొలిరాయుల యుగాన్ని కూడా ఒకే సంపుటి లో చేర్చారు. కానీ, తొ.ము V లో గజపతుల యుగం (సంపుటి V) తో రాయులయుగం సంపుటి లుగా విడివిడిగా పరిశీలించారు.

♦తొ.ము V లో ఖండవల్లి లక్ష్మి రంజనం రచించిన పీఠిక ఉంటే పు.ము IV లో దాన్ని చేర్చలేదు.

## గౌరన

పది ద్విపద పాదాలు సమాసం కట్టి గౌరన 'హరిశ్చంద్ర చరిత్ర' లో ఎలా వర్ణించాడో వాటిని ఉదహరించడం అదనంగా పు.ము IV(పు.33) లో చేర్చారు.

గౌరన రచించిన 'హరిశ్చంద్రచరిత్ర' ద్విపదనూ, 'నవనాథ చరిత్ర'నూ చదువుతూ ఉంటే సాహిత్య పరిశోధనా నిపుణులకు ఎందరో పూర్వ మహాకవుల ప్రయోగాలు కొన్ని చోట్ల స్ఫురిస్తాయన్నారు. తిక్కన, పాల్కురికి సోమనాథుడు, నాచనసోమనాథుడు వంటి వారు ప్రయోగించిన జాతీయాలు సామెతలు, పలుకుబళ్ళను దృష్టిలో పెట్టుకొని అటువంటి వాటిని కొన్నింటిని తన కావ్యాల్లో వర్ణించారని సోదాహరణంగా వివరించారు. గౌరన పద్యాలలో గల భావాల్ని వేమన పద్యాల్లో కూడా చూడవచ్చునని (పు.47) హరిశ్చంద్ర చరిత్రలో ఉన్న ఒక పద్యాన్ని వేమన పద్యంతో పోల్చి చూపించారు. ఇవన్నీ కొత్తగా చేర్చిన అంశాలు.

## వెన్నెలకంటి అన్నయ్య

♦తొ.ము V లో గౌరన తర్వాత జక్కనను పేర్కొనగా, పు.ము IV లో గౌరన తర్వాత వెన్నెలకంటి అన్నయ్యను పేర్కొన్నారు.

పు.ము IV (పు. 59-60) లో శ్రీనాథుని 'హంస' తర్వాత, వెన్నెలకంటి అన్నయ్య 'చిలుక' తెలుగు సాహిత్యంలో అడుగు పెట్టిన ద్వితీయ విహంగ పాత్ర. ఇది కవితలు కూడా చెప్పగలదు. వాటిని కొన్నింటిని ఆరుద్ర పేర్కొన్నారు. ఇది అదనంగా చేర్చిన అంశం..

## ఆంధ్ర కవి రామయ్య

♦తొ.ము V (పు.77) లో దుగ్గుపల్లి దుగ్గన తర్వాత ఆంధ్రకవి రామయ్యను పేర్కొనగా పు.ము IV (పు.101) లో అయ్యలరాజు తిప్పయ్య తర్వాత ఈ కవిని చేర్చారు.

## పోతన

పు.ము IV (పు.124) సింగభూపాలుని కొలువులో ఉండడంవల్లనే కాకుండా, ఆ సంస్థానంలోని వైష్ణవ గురువు సాన్నిహిత్యం వల్ల కూడా పోతన భోగినీ దండకం రాశారనీ భావించవచ్చునని ఆరుద్ర భావించారు. వీటికి తమిళ సాహిత్య సంప్రదాయ ప్రభావం పోతనపై పడి ఉంటుందనేది అదనపు సమాచారం (పు.124-126) వరకు వీటిని వివరించారు పు.ము IV (పు.139-141) లో భాగవత రచనా కాలం నాటికి సింగ మరేడు రాజ్యం చేస్తున్నాడా ?లేదా ? అనేది చారిత్రక విశేషాలతో చర్చించటం అదనంగా చేర్చారు. 1430 లో రాజ్యానికి వచ్చిన కొత్తలో పోతనకు రాజాశ్రయం దొరికి ఉంటుందన్నారు. 1430-33 సంవత్సరాల మధ్య 'భోగిని దండకం' రచన జరిగి ఉంటుంది. తరువాత ఒక దశాబ్దం లేదా ఒక పుష్కర కాలం భాగవతం శ్రీధర వ్యాఖ్యతో అధ్యయనం

చేసారనుకోవచ్చు. భాగవతాన్ని ఎన్నోసార్లు చదివిన పోతన ఆ తత్త్వాన్ని ఒంట పట్టించుకొన్నాడు అనేవి(పు.146) కొత్త అంశాలు. పు.ము IV ( తొ.142-144) లో 'ఆంధ్ర మహా భాగవతపు వ్యాసములు' పోతన చరిత్ర స్థల-కాలములు అనే అంశం పై ఆంధ్ర సారస్వత పరిషత్తు వారి ఉపన్యాసాలను అనుసరించి మరికొన్ని కొత్త అంశాలను చేర్చారు.పోతన తో తొ.ము. ఐదవ సంపుటి ముగిసింది.

## బొప్పరాజు గంగన

బొప్పరాజు గంగన గురించి తొ.ము VI (6వ సంపుటి) లో తొలిరాయల యుగంలో వివరించారు. కానీ పు.ము IV లోనే చేర్చారు.

ఈ కవిని గురించి చేప్తూ ఇతని కవిత్వంలో శిల్ప పరమైన అంశాలు వివరించి, ఇది సహృదయులకు పెద్ద ఆనందం ఇవ్వదని తొ.ము VI లో (పు.16) ముగించారు. కాని, పు.ము IV (పు.66-68) కొంచెం ఉదార దృక్పథంతో చూసే వాళ్ళకు గంగన రచన మెరుగ్గానే కనబడుతుందని చాగంటి శేషయ్య వంటి వారి అభిప్రాయాల్ని పేర్కొంటూ మరికొంత సమాచారాన్ని చేర్చారు.

## కాకునూరి పండితులు

♦తొ.ము VI లో (పు.44) అప్పకవి వంశ వృక్షంలో సోమన కుమారులు అమరేశ్వరుడు, కొండలయ్య, రంగన్న,లక్ష్మణుడు అని అన్నారు. పు.ము IV (పు.189) రంగన్న బదులు గంగన్నగా మార్చారు.

## నూతనకవి సూరన

♦తొ.ము VI లో కాకునూరి పండితులు తర్వాత భైరవకవి ని (పు.48) పేర్కొనగా పు.ము IV (పు.192) లో నూతన కవి సూరనను ఈ వరుసలో చేర్చారు. కాని తొ.ము VI లో భైరవకవి తర్వాత ఈ కవి కనిపిస్తాడు.

నూతనకవి సూరన ధనాభిమార్గాన్ని ద్విపదలో చెప్పాడో లేక రావిపాటి తిప్పన్న సంస్కృతంలో ప్రేమాభిరామం తో పాటుధనాభిరామం కూడ చెపితే, దానిని జాతి వార్తలతో చెప్పాడో తెలియదు. సూరన 328 గద్య పద్యాలలో 'ధనాభిరామం'లో చెప్పిన కథను ఎఱ్ఱన ఒక పద్యంలో సంక్షిప్తం చేశాడు. అలాగే ఇందులోని సారాంశాన్ని ఒక్క పద్యంలో సుమతీ శతక కారుడు ఏనాడో చెప్పాడు. ఈ పద్యం చెప్పిన కవి ధనాభిరామం చదివాడో లేదో తెలియదు. నూతన కవి సూరన సుమతీ శతకం చూసాడో లేదో తెలియదు. సుమతీ శతక కారుడు ఎప్పటి వాడో కూడా చెప్పలేం! కాని గ్రంథం గురించి విపులంగానే చర్చించవచ్చు. అని తొ.ము VI (పు.86) లో ముగిస్తే పు.ము IV (పు.205) ఈ చర్చను లేకుండా ఉత్తరోత్తరా ఇంకొక శతక కర్తయైన వేమన "ధనమున్నది ఎలా ఉత్పన్నమౌతుందో చెప్పార"ని ఒక పద్యాన్ని వివరించి మన శతక కవుల దృక్పథం విలక్షణమైనదని ఇంటి పేరు వల్ల మాత్రమే సూరన కొంతవరకు "నూతన కవి" అని ముగించారు.

## దూబకుంట నారాయణ కవి

తెలుగులో పంచతంత్ర కథల్ని అనువదించిన దూబకుంటనారయణకవి గురించి చెప్తూనే, తెలుగులో పంచతంత్ర కావ్యాల పట్టికను ఆరుద్ర చూపారు (తొ.ము VI పు.130-131) పు.ము IV (పు.237) లో 20 వశతాబ్దంలో విద్వాన్ విశ్వం నాలుగు వేల పంక్తులతో ద్విపద కావ్యంగా బాలుర కోసం రచన చేసి, చందమామలో ప్రచురించిన దాని వివరాలు అదనంగా చేర్చారు.

## అన్నమయ్య

తాళ్ళపాక అన్నమయ్య గురించి పు.ము IV(పు.266-73) వరకు తొ.ము VI (పు.169) లో లేని అంశాలు మరికొన్ని చేర్చారు. తాళ్ళపాక వారి పద సాహిత్యంపై గౌరిపెద్ది రామ సుబ్బశర్మ ప్రకటించిన అభిప్రాయాల్ని ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఆకాడమీ ప్రచురణలోని అంశాల్ని చేర్చారు. అన్నమయ్య కీర్తనలు రాసిన రేకులు ఇప్పటివరకు లభించినవి 2284 మాత్రమేనని తాళ్ళపాక వారి కుటుంబ సభ్యుల రేకుల వెరసి సంఖ్య 2531 అని చెప్తున్న పరిశోధనలను వివరించారు.

'తాళ్ళపాక వారి పలుకుబళ్ళు' గ్రంథంలో పేర్కొన్న అంశాల్ని కూడా (పు.267-269 వరకు) చేర్చారు. అన్నమయ్య వాడిన శబ్దాలకు అర్థ నిర్ణయం చేయటంలో జరగాల్సిన కృషిని వివరించడానికి చాలా వివరణ కన్పిస్తుంది. పదకవితా పితామహుడైన అన్నమయ్య ప్రయోగించిన పదాల పరిణామాన్ని ఆకారాదిక్రమంగా పరిశీలించడం (పు.272-273) అదనంగా ఉంది.

## తాళ్ళపాక తిమ్మక్క

తాళ్ళపాక తిమ్మక్క,తాళ్ళపాక అన్నమాచార్యుల ఇల్లాలని తొ.ము VI (పు.173) లో చెప్పగా, పు.ము IV (పు.276) లో ఈ విషయాన్ని వేటూరి ప్రభాకర శాస్త్రి తేల్చారని, సాహిత్యచరిత్ర పరిశోధకులలో వివాదాలున్నాయన్నారు.

♦తొ.ము VI (పు.175) లో తిమ్మక్క రచనా శైలిని నన్నయ భారతంలో స్వీకరించిన అంశాల్ని వివరిస్తూ, దక్షిణాదికి వచ్చిన అర్జునుడు మా తిరుపతికి రాకుండా ఉంటాడా? అని ఆమె భావించడంలో తప్పులేదు. అతిక్రమణ కు వరవడి పెట్టినది నన్నయ గారు కదా ఆయనవేలు చూపినచోట ఈమె కొండ అందుకొంటుంది అని ఉండగా, పు.ము IV (పు.178) లో ఈమె "మండ అందుకొంటుంది" మార్పు చేశారు.

♦తొ.ము VI లో లేని తాళ్ళపాక తిమ్మక్క" సుభద్రా కల్యాణం" కర్తృత్వం తాళ్ళపాక తిమ్మక్కా? తిమ్మప్పా? ఆడ మగా? అనే చర్చ పు.ము IV లో కనిపిస్తుంది. సమగ్ర ఆంధ్రసాహిత్యం తొ.ము సంపుటి నాయక రాజుల యుగం మొదటి భాగానికి తాపీ ధర్మారావు రాసిన 'పీఠిక ' లోని అంశాన్ని యధాతథంగా పు.ము IV (పు.287-290) లో చేర్చారు.

తిరుమల తిరుపతి దేవస్థానం వారు 1950 లో సుభద్రా కల్యాణం ప్రచురించారు. దీన్ని వేటూరి ప్రభాకర శాస్త్రి పరిష్కరించి పీఠిక రాస్తూ, తాళ్ళపాక అన్నమాచార్యుల భార్య, తిమ్మక్క ఈ గేయకృతికి రచయిత్రి అనీ, సంగీత సాహిత్య చతుర అనీ, ఈమె రాసిన పాటలోని పలుకుబళ్ళు చేమకూర వేంకటకవి 'విజయవిలాసం' లో కన్పిస్తున్నాయన్నారు.

కానీ, తాపీధర్మారావు ఈ వాదాన్ని ఆధారాలు లేవని కొట్టిపారేశారు. అంతేకాకుండా, వేటూరివారు మంచి పరిశోధకులు కావడం వల్ల ఆయన ప్రకటించిన చాలా పరిశోధనల వల్ల, ఈ పరిశోధననూ కొనసాగించాలనే ఆలోచనలో పరిశోధకులు పొరబడ్డారన్నారు. (పు.287)

తాళ్ళపాక తిమ్మక్క కాదనీ, "తిమ్మప్ప" అనీ అది స్త్రీ కి సంబంధించిన పేరు కాదనీ, పురుషుడై ఉంటాడనీ కొన్ని ఆధారాల్ని చూపి, తాళ్ళపాక తిమ్మక్క అన్నమాచార్యుల భార్యకాదన్నారు. పైగా, విజయ విలాసంలో ఉన్న కొన్ని పద్యాలు సుభద్రా కల్యాణంలో ద్విపదుల అనుకరణ అనడాన్ని కూడా సరైంది కాదదని తాపీవారన్నారు. (పు.289)

తాళ్ళపాక అన్నమాచార్యుల కంటే తాళ్ళపాక తిమ్మప్ప (క్క) అర్వాచీనుడన్నారు. వర కవీశ్వరుడు కావచ్చుననీ తాపీవారు నిర్ణయించారు.

అయితే, ఆరుద్ర మాత్రం తిమ్మక్క విషయమే "తిమ్మప్ప" విషయంలో పొరబాటున మాత్రమే ఉండనని తెలుస్తుందన్నారు. (పు.292) తాపీవారు చెప్పిన తాళ్ళపాక తిమ్మనాచార్యులు గ్రంథాల లేఖకులోనే మనకు తెలుస్తున్నారని కవి అని చెప్పిలేమనీ ఆరుద్ర (పు.293) వివరించారు. దురదృష్టవశాత్తు తాళ్ళపాక వారి కుటుంబంలోని మగమహారాజులందరూ పేరుమోసిన కవిపుంగవులయినా ఒక్కరూ తిమ్మక్క 'కవయిత్రి' అన్న సంగతి గ్రంథస్థం చేయలేదనీ, ఇది ఒక అపచారమేననీ, ఆడవారికి మగవాళ్ళు ఎన్నో అన్యాయాలు చేస్తున్నారు కనుక అలాంటిదే ఇదీనని, చారిత్రకంగా కూడా ఇలాంటివి కన్పిస్తున్నాయని ముగించేశారు. (పు.294).

అంటే తాళ్ళపాక తిమ్మక్క విషయంలో వేటూరి ప్రభాకర శాస్త్రి నిర్ణయాన్నే ఆరుద్ర సమర్థించడం, ఆ విషయాలు పు.ము IV లో చేర్చి, మరింత స్పష్టం చేయడంగా గమనించవచ్చు. ఈ వాదాలు తొ.ము VI లో లేవు. కనుక తాళ్ళపాక అన్నమాచార్యులు భార్యగానే తాళ్ళపాక తిమ్మక్కను ఆరుద్ర భావిస్తున్నారని తెలుస్తుంది.

## ప్రోలుగంటి చెన్నయ మంత్రి

యక్షగానఆవిర్భావ వికాసాన్ని చర్చిస్తూ, చిత్రకవి పెద్దన లక్షణసార సంగ్రహంలో వర్ణనను చెప్పేటప్పుడు చిత్రకవి పెద్దన కాలాన్ని తొ.ము VI (పు.191) లో క్రీ.శ 1550 గా చెప్తే పు.ము IV(పు.297) లో క్రి.శ 1330 గా మార్పు చేశారు.

చిత్రకవి చెప్పిన యక్షగాన లక్షణాన్ని అప్పకవి (క్రీ.శ 1656) కొద్ది మార్పులతో చెప్పాడన్నారు. అలాగే 1600 ప్రాంతాల ఆపైన వార్తకవి రాఘవయ్యతోపాటు, క్రీ.శ.1450 కి ముందు కవులు యక్షగాన అస్తిత్వాన్ని చెప్పారన్నారు. 1485 నుంచి 1512 వరకూ పాలించిన సాళువ నరసింగ రాయల కాలంలో నిశ్చయంగా యక్షగానం రాశాడని చెప్పకోదగ్గ రచయిత ప్రోలుగంటి చెన్నయ మంత్రి కన్పిస్తున్నాడన్నారు..

ఈ అంశాలన్నీ పు.ము IV లో అదనంగా చేర్చిన అంశాలు. తొ.ము VI లో ఇవి లేవు.

ప్రప్రథమ యక్షగానంగా ప్రసిద్ధి చెందిన 'సౌభరి చరిత్ర' కర్త ప్రోలుగంటి చెన్నయ మంత్రి జక్కుల కథగా చెప్పారంటే 'సౌభరి చరిత్ర' 'విష్ణు పురాణం' లో కన్పిస్తుంది. దీన్ని అనుసరించి యక్షగానానికి ఉండే సాంఘిక ప్రయోజనాన్ని వివరించి తొ.ము VI లో ముగిస్తే, పు.ము IV (పు.302-307) లో కైఫీయత్తులను అనుసరించి చూపారు.

మాచుపల్లి కైఫీయత్తులో ఒక కథ ఉందని 'ఆంధ్రవాగ్గేయకార చరిత్రములలో బాలాంత్రపు రజనీకాంతారావు గ్రంథంలో మల్లంపల్లి సోమశేఖర శర్మ మాటలుగా తొ.ము VI (పు.197) గా చేప్తే, పు.ము IV (పు.302) లో ఆ కైఫీయత్తుని ఆరుద్ర పేర్కొంటూ వివరించడం కన్పిస్తుంది.

## నంది-ఘంటల జంట :

వీరిని పరిచయం చేస్తూ, ఉపోద్ఘాతంలో భారతదేశంలో ఉన్న దర్శనాలగురించి తొ.ము VI (పు.230.-231) లో వివరించగా, పు.ము IV (పు.332) ఆరు ఆస్తిక దర్శనాలు, ఆరు నాస్తిక దర్శనాలను పేర్కొని ఆస్తిక దర్శనాలు వేద ప్రామాణ్యాన్ని అంగీకరిస్తాయని, వాటిని వివరించారు (పు.332)

## భైరవ కవి

♦ తొ.ము VI (పు.48-67)లో భైరవకవిని, కారుమూరి పండితుల తర్వాత పేర్కొనగా, పు.ము IV (పు.349) లో నంది మల్లయ్య, ఘంటసింగన్న తర్వాత వివరించారు.

భైరవుడు రచించిన 'రత్న పరీక్ష' అనే గ్రంథం ఆవిర్భవించడానికి గల కారణాలను వివరిస్తూ ముదిగొండ కేదారయ్య కోరికపై ముదిగొండ వీరభద్రునికి అంకితమిచ్చినట్లు, ముదిగొండ గ్రామం తెలంగాణాలో ఉన్నట్లు తొ.ము VI (పు.158) లో పేర్కొని భైరవుడు రాచకొండ పద్మనాయకుల కొలువులో ఉన్న మంత్రికుటుంబంలోని వారనే చారిత్రక వివరణకు వెళ్ళి పోయారు. కానీ, పు.ము IV (పు356) లో మహబూబ్ నగర్ జిల్లాలో అచ్చంపేటకు సమీపంలో గల తీగలమాను దగ్గర వజ్రాల్ని కాళ్ళి తీసేవారు. ఆ రత్నాల్ని పరీక్షించి, వ్యాపారం చేసేవారు. అందువల్లనే భైరవుడు 'రత్న పరీక్ష' గ్రంథాన్ని తెనిగించి ఉండవచ్చునని రంగాచార్య అభిప్రాయాన్ని (పు.356) చేర్చారు. ఇంకా తెలుగు రాష్ట్రంలో కృష్ణానది ప్రవాహించిన చోట, గుంటూరు జిల్లా చేజెర్ల, సత్తెనపల్లి దగ్గరలో కొల్లూరు,

కర్నూలు జిల్లా , అనంతపురం జిల్లా వజ్రకరూరుల దగ్గర వజ్రాలు దొరికేవన్నారు. కొల్లూరు దగ్గరే కోహినూరు వజ్రం దొరికిందని కథలు చెప్పుకుంటారన్నారు.

భైరవకవి సర్వలఘు రచన లేకాకుండా బంధకవిత్వం, చక్ర బంధం, నాగ బంధం, గోమూత్రికా బంధం వంటివి రచించాడు. వీటిని తొ.ము VI (పు.255-256) చిత్ర పటాలతో చూపించి, పద్యాలు మాత్రం (పు.67) లో చూడమన్నారు. పు.ము IV లోనూ 'అనుబంధం'లో చిత్ర పటాలు పెట్టినా, పద్యాలు కూడా అక్కడే పేర్కొన్నారు. (పు.367,368)

భైరవకవి తో పు.ము IV ముగించగా, తొ.ము VI నంది మల్లయ్య ఘంట సింగన లతో ముగించారు.

## 4.5. అయిదవ సంపుటి(మలిరాయల యుగం)

### పుత్తేటి రామభద్రయ్య

అల్లసాని పెద్దన తర్వాత ధూర్జటిని తొ.ముVII (పు.201) లో వివరించగా పు.ము V (పు.146) పుత్తేటిరామభద్రయ్యను చేర్చారు.

### హరిభట్టు

ఈ కవి గురించి తొ.ము VII (పు.258) లో ఒక పుటలో మాత్రమే సంక్షిప్తంగా పేర్కొనగా పు.ము V పు.187-199 వరకూ వివరించారు.

### పిడపర్తి కవులు

పిడపర్తి సోమనాథుడు రచించిన కొన్ని ద్విపద పాదాలు ఉదహరించడం పు.ము V (పు.202-203) లో చేర్చారు.

### తాళ్ళపాక కవులు

హరిభట్టు మత్స్యపురాణంలో చెప్పిన కొన్ని పద్యపాదాల్ని పు.ము V (పు.205-206) లలో ఉదహరించారు. యజ్ఞ క్రతువుల వల్ల కంటే సంగీత కృతుల వల్లనే దేవుని మనసునురంజింప చేయవచ్చునని నారదునితో విష్ణువు చెప్పిన మాటలుగా ఉదహరించి తాళ్ళపాక కవుల 'పాట' గొప్పతనాన్ని వివరించారు.

### యాగంటి లక్ష్మయ్య

♦తొ.ము VII లో ఈ కవి గురించి చెప్పలేదు. పు.ము V లో (211-221) వరకు ఈ కవిని గురించి వివరించారు.

### పోశెట్టి లింగన్న

ఈ కవిని గురించి తొ.ము VII లో ఇతర కవులు ప్రకరణం (పు.258) లో అరపుట మాత్రమే వివరించారు కానీ, పు.ము VII(పు.222-226) వరకు పద్యపాదాల్ని ఉదహరిస్తూ వివరించారు.

## ప్రౌఢకవి మల్లన్న

ఈ కవిని గురించి కూడా తొ.ము VII (పు.259) లో అరపుట మాత్రమే వివరించగా పు.ము V (పు.227-233) వరకు ఈ కవి రచించిన 'రుక్మాంగద చరిత్ర'లోని పద్యాల్ని వివరిస్తూ పేర్కొన్నారు. కాల నిర్ణయాన్ని కూడా నిర్ణయిస్తూ 1550 ప్రాంతం వాడన్నారు.

## వెన్నెలకంటి సూరన్న

ఈ కవిని గురించి కూడా కేవలం అరపుటలో వివరించిన దానిని పు.ము V (పు.234-248) వరకు వివరించారు.

## వాసిరాజు రామయ్య

♦తొ.ము VII లో వివరించలేదు. కానీ, తొ.ము VIII పు. (88-91) లో ఉన్న ఈ కవిని పు.ము V (పు.249-251) వరకు వివరించారు.

## చెందలూరి చిక్కయ్య

ఈ కవిని గురించి కూడా తొ.ము VII లో లేదు. కానీ తొ.ము VIII (పు.92-97) వరకు ఉంచి పు.ము V లో (పు.252-256) ఉంది.

## కానుకొలను అన్నమరాజు

ఈ కవిని గురించి కూడా తొ.ము VII లో లేదు కానీ, తొ.ము VIII పు.98-102 వరకు ఉంది. పు.ము V (257-260) వరకూ వివరించారు.

## భానుకవి

♦తొ.ము VII (పు.260) లో అరపుట మాత్రమే ఉన్న వివరాలు పు.ము V పు.261-264 వరకు వివరించారు.

## తెనాలి రామకృష్ణుడు

ఇది తొ.ము VII లో ఈ కవి గురించి లేదు. కానీ, తొ.ము VIII (పు.15-65)వరకు ఉంది. పు.ము V (పు.265-300) వరకు వివరించారు.

## కందుకూరి రుద్రకవి

ఈ కవిని గురించి కూడా తొ.ము VII లో లేదు. కాని పు.ము V పు.301-314 వరకు వివరించారు.

## ఇతర కవులు

♦తొ.వు VII (పు 257-262) వరకు పదమూడు మంది కవులను సంక్షిప్తంగా వివరించారు ఆ కవుల పేర్లు.

| | |
|---|---|
| 1. యాదవామాత్యుడు (పు.257) | 7. భానుకవి (పు.260) |
| 2. పోశెట్టి లింగన్న (పు.258) | 8. కాణూరివల్లభాచార్యులు (పు.260-261) |
| 3. హరిభట్టు (పు.258) | 9. ఎడపాటి ఎఱ్ఱన (పు.261) |
| 4. ప్రౌఢకవి మల్లన్న (పు.259) | 10. పుత్తేటి రామభద్రుడు (పు.261) |
| 5. వెన్నెలకంటి సూరన (పు.259) | 11. మాచిరాజు బసవన్న (పు.262) |
| 6. పెదపాటి సోమయ్య (పు.259-260) | 12. త్రిలోకభేది (పు.262) |

13. వెల్లంకి తాతంభట్టు (పు.262) ఉండగా పు.ము V లో ఇతర కవులు ప్రకరణంలో 18 మంది కవులను సంక్షిప్తంగా పేర్కొన్నారు. తొ.ము VII లో సంక్షిప్తంగా పేర్కొన్నవన్నీ కొంత మందినీ, పు.ము V లో సుదీర్ఘంగా వివరిస్తూ ప్రత్యేక ప్రకరణాలుగా పేర్కొన్నారు.

పు.ము.V లో వివరించిన 18 మంది కవులు

1. యాదవామాత్యుడు (పు.315 2. పెదపాటి సోమయ్య (పు.316)

3. కోడూరి వల్లభయ్య (పు.316-317) 4. బొమ్మలాట కవులు (బొమ్మలాట అమృతకవి, ఇతనికే చంద్రయ్య అని పేరు కూడా ఉంది. బొమ్మలాట మోహనకవి అనే పేరుగల బొమ్మలాట సిద్ధయ్య బొమ్మలాట సాంబయ్యలు, 'బొమ్మలాట' కవులుగా ప్రసిద్ధి)

5.కోదండ రామయ్యగారి రామచంద్రయ్య (పు.318) 6.కాకమాను గంగాధరుడు (పు.318-320)

7. రాయసంగణపయ్య (పు.320) 8. కుడిచెర్ల తిప్పరాజు (పు320-321) 9. కుంటుముక్కల తిమ్మయ్య (పు.321-322) 10.రాపురది దేచిరాజ (పు.322) 11.పోతరాజు (పు.322) 12.భీమన్న (పు.322-323) 13. రెడ్డిపల్లి ముద్దమరాజు (పు.323) 14.పోతరాజు వీరయ్య (పు.324) 15.సిద్ధన ప్రగఢ (పు.324) 16.కాచిరాజు బసవన్న (పు.324) 17. త్రి లోకభేది (పు.324) 18.వెల్లంకి తాతం భట్టు (పు.324-325)

## 4.6. ఆరవ సంపుటి(నవాబుల ఆరవీటి రాజుల యుగం)

### *నవాబుల యుగం*

♦తొ.ము VII లో 'నవాబుల యుగం' ఒక సంపుటిగా ప్రచురించగా, పు.ము VI లో నవాబుల, ఆరవీటి రాజుల యుగాల్ని ఒక సంపుటిగా చేర్చారు.

నవాబుల యుగం 1 (అ)

ఆరవీటి రాజుల యుగం 1 (ఆ)

♦తొ.ము IX లో ఆరవీటి రాజుల యుగం ఒకసంపుటిగా ప్రచురించగా పు.ము VI లో నవాబుల యుగంతోపాటు,ఆరవీటి యుగాన్ని కూడా ఒకే సంపుటిలో చేర్చారు.

### *శంకరకవి*

పు.ము VI లో మొదట శంకరకవిని పేర్కొన్నారు. ఐతే తొ.ము VIII లో శంకరకవి కంటే ముందు తెనాలి రామకృష్ణుణ్ణే వివరించారు. కా.ని పు.ము VI లో తెనాలి రామకృష్ణుణ్ణే తొలగించారు.

### *అయ్యలరాజు రామ భద్రుడు*

ఈ కవి రచించిన 'రామాభ్యుదయం' అనే రామాయణ ప్రబంధంలో కొన్ని పద్యాల్ని ఆరుద్ర ఉదాహరించారు. అశోకవనంలో ఆంజనేయుడు శ్రీరాముని ముద్రిక ఇచ్చినప్పుడు దాన్ని చూస్తూ సీతమ్మ అనుకొన్న మాటలు 14 పద్యాలలో వర్ణించారని, వాటిని పేర్కొని తొ.ము VIII (పు.125) లో రామా 6.187-200 గా సూచించగా పు.ము. VI పు:59 లో రామా:6:187-200గాసూచించగా, పు.ము పు. 59లో స పద్య సంఖ్యల్ని అచ్చు తప్పులు పడ్డాయి. 157వ పద్యం నుండి 200 వరకు ఉన్న పద్యాలు 14. కనుక తొ.ము VIII లో 187-200 అనడం పొరపాటు.

### *తెనాలి కవులు – బంధువులు*

♦తొ.ము VIII (పు.129-130) లో లింగమకుంట సర్వకవి గురించి చెప్తూ, అజ్ఞాత గ్రంథ సంధాత బహుశా లింగమకుంట సర్వన్న గ్రంథంలోంచి ఉదాహరించాడేమోనని ఆ పద్యాల్ని వివరించారు. పు.ము VI (పు.64) లో సంక్షిప్తంచేసి పెదపాటి ఎర్రన తన మల్హణచరిత్ర లో ఒక సర్వదేవుణ్ణే

నుతించాడనీ ఆ పద్యాల్ని పేర్కొని, ప్రాచీన కన్నడ కవికాక కృష్ణరాయలకాలానికి కొంచెం పూర్వుడో, సమకాలికుడో అయి లింగమగుంట సర్వదేవుడు కావచ్చునన్నారు. ఈ విషయం భావి పరిశోధనల వల్ల తేలవచ్చునన్నారు.

## అద్దంకి గంగాధరుడు

ఈ కవి రచించిన 'తపతీ సంవరణము' లో గల కొన్ని విశేషాల్ని పద్యాలతో సహా ఉదహరించడం పు.ము VI (పు.69-70) వరకూ పెంచారు. తొ.ము VIII (పు.139) లో ఇవి లేవు. తపతీ సంవరణం 1550 ప్రాంతంలో సంకల్పించ బడి, 1565 ప్రాంతంలో ఇభరాముడికి అంకితమిచ్చారన్నారు. కావ్యవిశేషాల్ని కూడ వివరించారు.

## సారంగు తమ్మయ్య

♦తొ.ము VIII లో పొన్ని కంటి తెలగన్న, చదలవాడ మల్లన్న ల తర్వాత సారంగు తమ్మయ్యను పేర్కొనగా (పు.158) పు.ము VIలో పొన్నికంటి తెలగన్న తర్వాతనే వివరించారు.

## చదలువాడ మల్లన

♦తొ.ము VIII (పు.149) లో పొన్నికంటి తెలగన్న తర్వాత పేర్కొన్న ఈ కవిని, పు.ము VI (పు.86) లో సారంగు తమ్మయ్య తర్వాత వివరించారు.

## పింగళి సూరన్న

♦తొ.ము VIII లో పింగళి సూరన కంటే ముందు సారంగు తమ్మయ్య, కందుకూరి రుద్ర కవులను వివరించగా, (పు.ము VI పు.93) లో చదలవాడ మల్లన తర్వాత పింగళిసూరన్నను గురించి వివరించారు.

## మరిగంటి సింగరాచార్యులు

ఈ కవి సుమారు పందొమ్మిది కావ్యాలు రాసినట్లు, అతడు రచించిన 'శుద్ధాంధ్ర నిరోష్ఠ్య సీతాకళ్యాణం' లో విశదీకరించారని చెప్పారు. ఈ కావ్యాలు ఏయే వయస్సులో ఏ యే కావ్యాలు రచించిందీ పు.ము VI (పు.146) లో స్పష్టంగా వివరించారు. తొ.ము VIII (పు.262) లో పండితులు సేకరించిన వాటిని బట్టి ఈ కవి రచనలు తెలుస్తున్నాయన్నారు. దొరికిన సాక్ష్యాలు వల్ల ఈ కవిని ఉద్దండ పండితుడని చెప్పవచ్చుని తొ.ము VIII (పు.263) లో ఉన్నదాన్ని, పు.ము VI(పు.147) లో పెట్టుకొన్న నియమాల పరిధిలో ఇతడు ఉద్దండకవి అని భ్రమించడానికి అవకాశాలున్నాయన్నారు.

'సింగరాచార్యులు నిజంగా కబ్బాల సింగం' అని తొ.ము. ముగించగా పు.ము VI (పు.14) లో '...... పింగం అనిపిస్తాడు గాని, ఇతనికావ్యాన్ని పరిశీలించినవారు ఈ కవి రచించిన 'దశరథ రాజనందన చరిత్ర' లో కవిత్వం ప్రౌఢంగా లేకున్నా, సులభ గ్రాహ్యంగానూ లేదని చెప్పకతప్పదన్నారు. పైగా, ఈ కావ్యంలో రామకథనే చెప్పినా, పెట్టుకున్న నియమాల ప్రకారం రామలక్ష్మణ శబ్దాలలో ఓష్ఠ్యాలున్నాయని, వాటిని యథాతథంగా వాడ లేకపోయాడన్నారు. ఆస్తికులకు పరమ పవిత్రమైన రామ నామము ఈ కబ్బంలో వాడడానికి కవిగారికి ఇబ్బంది కరమైందన్నారు.

♦తొ.ము VIII లో ఈ కవి పట్ల ఆరుద్ర ప్రకటించిన అంచెనాకీ, పు.ము VI లో చేసిన నిర్ణయానికీ చాలా తేడా కన్పిస్తుంది.

## పన్నెండుమంది వేదాంతులు

వీరిలో 'సదానందయోగి' 'నవ్యతరభోగి శ్రీ సదానందయోగి' అనే మకుటంతో ఇతడు 99 పద్యాలని తొ.ము VIII (పు.270) లోనూ పు.ము VI (పు.154) లో 90 పద్యాలని ఉంది.

తొ.ము VIII ముగిసింది.

## పచ్చకప్పురపు తిరువేంగళరాజు

♦తొ.ము IX ఈ కవితో ప్రారంభమౌతుంది. ఈ కవిని గురించి పు.ము VI (పు.161) లోనే వివరించారు.

## పెదపాటి జగ్గన్న

ఇతడు రామరాజు రంగప్ప రాసిన 'సాంబోపాఖ్యానం' లోని పద్యాన్ని స్వీక రించటం వల్ల ఇతని కాలం క్రీ.శ 1580 కావచ్చునని, కాబట్టి పెదపాటి జగ్గన్న క్రీ.శ 1580-90 ప్రాంతాలకు తన 'ప్రబంధ రత్నాకరం' సమకూర్చాడని భావించవచ్చునన్నారు. జగ్గన్న పేర్కొన్న 60 మంది కవులలో 38 మంది గురించి ఆయా యుగాల్లో ఆరుద్ర చర్చించారు. తొ.ము IX (పు.92) కానీ, దీన్ని పు.ము VI లో మార్పు చేశారు. 'సాంబో పాఖ్యానాన్ని' క్రీ.శ 1560 ప్రాంతాలలో రచించి ఉంటాడని చెప్పారు. ఇటీవల పరిశోధనల వల్ల తేలిన కాల నిర్ణయాలను పేర్కొంటూ పెదపాటి జగ్గన్న 'ప్రబంధరత్నాకరా' న్ని బహుశా క్రీ.శ 1600 ప్రాంతాలలో సంకలనం చేసే ఉంటాడని చెప్పారు. పు.ము VI (పు.215) ఇలా ఈ కాలాన్ని నిర్ణయించడానికి రామరాజు రంగప్పరాజు రచించిన 'సాంబోపాఖ్యాన రచనా కాలం క్రీ.శ 1560, అద్దంకి గంగాధరుని తపతీసంవరణం అంకిత కాలం క్రీ.శ 1565 తెనాలి రామకృష్ణుని పాండురంగ మాహాత్మ్యం రచనాకాలం 1575. ఈ ముగ్గురు కవుల గ్రంథాల్లో నుంచి పద్యాలు తీసుకొని పెదపాటి జగ్గన్న మూడు కావ్యాల పేర్లు తప్పుగా పేర్కొన్నాడని

చెప్పి, ఈ కవులకు జగ్గన్న సమకాలికుడు కావచ్చు, లేదా తరం అర్వాచీనుడన్నా తప్పులేదు. ఆయా యుగాలలో వివరిస్తున్నట్టు పు.ము VI (పు. 225) లో వివరించారు. వారిచ్చిన పట్టికలో పు.ము VI (పు.252) లో పెదపాటి ఎర్రన్నను తొలగించారు.

## కొందరు స్మరణీయులు

పెదపాటి జగ్గన్నకు ఒక తరం ముందు వారో సమకాలికులో అయి ఉంటారంటూ 22 మంది కవులను గురించి సంక్షిప్తంగా కొందరు స్మరణీయులు అనే ప్రకరణంగా పు.ము VI (పు.233-249) వరకు వివరించారు. వీరిని గురించి పెదపాటి జగ్గన్న ప్రకరణం లోనే తొ.ము IX (పు.96-118) వరకూ కలిపి వివరించారు.

'జ్ఞాపకం పెట్టుకోదగ్గ ఒక్క పద్యం చెప్పిన కవినైనా సాహిత్యలోకం సర్వసాధారణంగా విస్మరించదు.' అంటూ 37 మందిని ఈ ప్రకరణంలో ఆరుద్ర వివరించారు .

## మట్ల అనంతరాజు

♦తొ.ము IX (పు.119) లో పెదపాటి జగ్గన్న తర్వాత 'ఒక అజ్ఞాత గ్రంథసంధాత ప్రకరణం' తర్వాత మట్ల అనంతరాజుని పేర్కొనగా, పు.ము VI లో పెదపాటి జగ్గన్న తర్వాత ఉన్న 'కొందరు స్మరణీయు కవుల' తర్వాతనే వివరించారు.

## తరిగొప్పుల మల్లన

♦తొ.ము IX (పు.161-164) లో ఈ కవికంటే ముందు తురగారాజకవి, అయ్యంకి బాలసరస్వతిలను వివరించారు.

## కుల పురాణాలూ, స్థల పురాణాలూ సిసలు పురాణాలూ:

♦తొ.ము IX లో లేని ప్రకరణమిది. దీన్ని అదనంగా చేర్చారు. తొ.ము IX లో "ఇతరకవుల" పేరుతో ఉన్న ప్రకరణంలో కొంతవుంది కవుల్ని దీనిలో చేర్చారు. భద్రకవిలింగకవి, ఎల్లకర నరసింహకవి, భాస్కరాచార్యులు, మల్లారెడ్డిదేశాయి, కలిదిండిభావనారాయణ, పొన్నతోట ఓబకవి, రాజలింగకవి, ఒద్దెపూడిపెద్దయ్యలను ప్రత్యేకించి దీనిలో చేర్చారు.

## ఇతర కవులు

42 మంది కవుల్ని ఈ ప్రకరణంలో సంక్షిప్తంగా పు.ము VI (పు.338-358) లో 34 మందిని మాత్రమే వివరించారు.

ఆ పట్టిక

| క్ర.సం. | తొ.వు IX | పుట సంఖ్య | పు.ము VI | పుట సంఖ్య |
|---|---|---|---|---|
| 1. | పెదకెంపరాయుడు | 228 | పెదకెంపరాయుడు | 338 |
| 2. | భద్రకవి లింగకవి | 229 | కావూరి ఎల్లయ్య | 339 |
| 3. | ఎల్లకర నరసింహకవి | 230 | గూళికల్లు వేంకటరమణకవి | 339 |
| 4. | భాస్కరాచార్యులు | 231 | తామరపల్లి తిమ్మయ్య | 340 |
| 5. | మల్లారెడ్డి దేశాయి | 233 | మోచర్ల నన్నయ్య | 341 |
| 6. | కుదిండిభావనారాయణ | 233 | కంచెర్ల అయ్యన్న | 342 |
| 7. | పొన్నతోట ఓబళకవి | 234 | నారన్నగారి సూరన్న | 343 |
| 8. | రాజలింగకవి | 234 | రాయసం వేంకటపతి | 343 |
| 9. | కావూరి ఎల్లయ్య | 236 | ఉప్పుగుండూరి కవులు | 344 |
| 10. | గూళికల్లు వేంకటరమణ | 236 | కుందుర్తి పండితులు | 344 |
| 11. | తామరపల్లి తిమ్మయ్య | 237 | రేటూరి కవులు | 345 |
| 12. | మోచర్ల నన్నయ్య | 239 | ఎలుగంటి పెద్దన | 346 |
| 13. | కంచెర్ల అయ్యన్న | 241 | బద్దెవీటి దత్తప్ప | 346 |
| 14. | నారన్నగారి సూరన్న | 241 | నెప్పల్లె అప్పన్న | 346 |
| 15. | బడ్డిపూడి పెద్దయ్య | 241 | మల్లవరపు వీరేశ్వరుడు | 347 |
| 16. | రాయసం వేంకటపతి | 242 | పెనుమర్తి వెంకటార్యుడు | 347 |
| 17. | ఉప్పుగుండూరి కవులు | 243 | కోట శివరామకవి | 347 |
| 18. | కుందుర్తి పండితులు | 243 | కొటికెలపూడి సోమనాథుడు | 348 |
| 19. | రేటూరి కవులు | 244 | నేబది కృష్ణమంత్రి | 349 |
| 20. | ఎలుగంటి పెద్దన | 246 | పెద్దిరాజు గారి రామరాజు | 350 |

| | | | |
|---|---|---|---|
| 21. బద్దెవీటి దత్తప్ప | 247 | పలకలూరి గోపన్న | 351 |
| 22. సెప్పల్లె అప్పన్న | 247 | ఎడవల్లి పర్వతన్న | 351 |
| 23. మల్లవీరపు వీరేశ్వరుడు | 248 | పొట్టూరి గోపన్న | 352 |
| 24. పెనుమర్తి వెంకటార్యుడు | 248 | వణుకూరి గురవరాజు | 352 |
| 25. కోటరామకవి | 249 | రాచపూడి వెంకటయ్య | 352 |
| 26. కొటికెలపూడి సోమనాథుడు | 250 | గౌరరాజు | 353 |
| 27. నేబది కృష్ణమంత్రి | 251 | కంచి వీరశరభయ్య | 353 |
| 28. పెద్దిరాజు గారి రామరాజు | 252 | సర్వజ్ఞ పద్మనాయక భూపాలుడు | 354 |
| 29. పలకలూరి గోపన్న | 253 | వెణుతుర్ల ఒడ్డెయ్య | 355 |
| 30. ఎడవల్లి పర్వతన్న | 254 | ముడియం వెంకటరమణకవి | 355 |
| 31. పొట్టూరి గోపన్న | 255 | వేగినాటి కొండన్న | 356 |
| 32. వణుకూరి గురవరాజు | 255 | చెన్న బసవయ్య | 356 |
| 33. రాచపూడి వెంకటయ్య | 256 | ముకుందయోగి | 356 |
| 34. గౌరరాజు | 256 | చరిగొండ నరసింహకవి | 357 |
| 35. కంచి వీరశరభయ్య | 256 | | |
| 36. సర్వజ్ఞపద్మనాయకభూపాలుడు | 257 | | |
| 37. వెణుతుర్ల ఒడ్డెయ్య | 258 | | |
| 38. ముడియం వెంకటరమణకవి | 259 | | |
| 39. వేగినాటి కొండన్న | 260 | | |
| 40. చెన్నబసవయ్య | 261 | | |
| 41. ముకుందయోగి | 261 | | |
| 42. చరిగొండ నరసింహకవి | 261 | | |

# సమగ్ర ఆంధ్ర సాహిత్యం: తొలి ముద్రణ పునర్ముద్రణల మార్పులు చేర్పులు

## 4.7. ఏడవ సంపుటి(నాయకరాజుల యుగం)

### నాయకరాజుల యుగం

పు.ము VIII (పు.6) లో నాయకరాజుల గురించి వివరిస్తూ, చెవ్వప్ప నాయకుడూ, అతని తండ్రి తిమ్మప్ప నాయకుడూ కృష్ణ దేవరాయలవారి కాలం నుంచి సార్వభౌముల కొలువులో ఉన్నారని రుజువు చేయడానికి శాసన ప్రమాణాలను చూపిస్తూ కొంత అదనపు సమాచారం చేర్చారు. ఇది తొ.ము X లో లేదు.

వీటితోపాటు అచ్యుతప్పనాయకుడు నాట్యకళకు శాశ్వతమైన స్థానాన్ని తంజావూరు రాజ్యంలో నెలకొల్పాడనడానికి వీలుగా కొన్ని దాఖలాల్ని చూపారు. పు.ము VII (పు.7) అతడు బ్రాహ్మణులకు చేసిన దానాల్ని (పు.8) పేర్కొన్నారు.

### *రఘునాథనాయకుడు*

♦తొ.ము X (పు.51–52) లో స్పష్టంగా రఘునాథనాయకుణ్ణి గురించి వివరించగా పు.ము VII (పు.38–39) ఒక పేరాలోది మరొక పేరాలోకి మారిపోయి గందరగోళంగా తయారయ్యింది.

♦తొ.ము X లో విషయమే మీ మార్పు లేకపోయినా పు.ము VII లో గందర గోళానికి దారి తీసింది. ఇది ముద్రణాపరమైన దోషమని తెలుస్తుంది.

♦తొ.ము X (పు.70) లో క్రీ.శ 1615 లో యార్పణం పాలించే యడేర్ మణ్ణసింగ ఆర్యుడనే పరరాజశేఖరుడు మరణించాడు. 'నుండి (పు 76) లో ఈ దుర్భర క్షామాన్ని తొలగించడం ఒక్క ఋష్యశృంగునికే చేతనౌను, అతన్ని తీసుకురమ్మని రాజు సాని కూతుళ్ళకు పురమాయించాడు. మీ అంత……… వరకు పు.ము VII లో (పు.50) లోపించింది..

ఇదీ ముద్రణా దోషమే కానీ, దీనివల్ల రఘునాథ నాయకుని గురించి చెప్పవలసిన అంశాలకు పూర్తిగా సమన్వయం లోపించింది.

పరరాజశేఖరుని మరణానంతరం అతని మూడేళ్ళ కుమారునికి అరసకేసరి పండారణ్ణి సంరక్షకునిగా రాజశేఖరుడు మరణించేముందే నియమించాడు. ఈ నియమకాన్ని పోర్చుగీసు వారు ఆమోదించాల్సి ఉంది. ఈ లోగా కొన్ని కుట్రలు జరిగాయి. దానిలో పసిబిడ్డ, సంరక్షకుడు చనిపోయారు. ఆ తరువాత రాజ్యానికి సంకిలి కుమారుడు అనే రాజబంధువు వచ్చాడు. కానీ కొందరు వీరనాయకులు

పోర్చుగీసువారు సమ్మతించక అతన్ని రాజ్యభ్రష్టుణ్ణి చేశారు. ఇతడు తంజావూరు వెళ్ళి రఘునాథుణ్ణి ఆశ్రయం ఇమ్మని ప్రార్థించడం, అతడు అభయమివ్వడం జరిగిపోయాయి. ఈ లోగా కావేరి సముద్రంలో కలిసే చోట కొలనూరు లోపలిగట్టున దేవికోట దుర్గాన్ని చోళగుడు పరిపాలిస్తున్నాడు. దుర్మార్గుడైన చోళగుడు,'చెంజి' నాయకునికి సామంతుడు, పోర్చుగీసు వాళ్ళకు మిత్రుడు. కనుక రఘునాథుడు ఇతన్ని ఓడిస్తేగాని దేశంలో శాంతి ఉండదని భావించాడు. వీటిని సాధించాడు. 'సాధిత సముద్రాంతర ద్వీప' అనే బిరుదు చోళగుని పై విజయాన్ని సూచిస్తుందనీ 'నేపాళ భూపాల స్థాపనాచార్య' అనేది సంకిలి రాజుకి పట్టం కట్టడం వల్ల వచ్చాయని ఆరుద్ర అన్నారు. ఈ విశేషణాలన్నీ రఘునాథుడు రాసిన రామాయణంలో కనిపిస్తాయన్నారు. ఇతనీ రామాయాణాన్ని రాముడికి అంకితమిచ్చాడు. దీని పేరే రఘునాథ రామాయణం దీన్ని సంపూర్ణంగా రచించినా, ప్రస్తుతం'బాలకాండ'లోని కొంత భాగం మాత్రమే దొరుకుతుందన్నారు. వీటిలో 'ఋష్యశృంగ చరిత్ర' రమారమి నాలుగో వంతు ఉందన్నారు.

పింగళి సూరన 'రాఘవ పాండవీయం' లో రామ రాజ్యాన్ని వర్ణించినట్లే రఘునాథ నాయకుడు వర్ణించాడని వాటిని తులనాత్మకంగా వివరించారు. (పు.73) రఘునాథ నాయకుడు తన రామాయణంలో 22 రకాల ధాన్యాల్ని చెప్పాడని వాటిని పేర్కొన్నారు. (పు.75) ధాన్యాల్ని పేర్కొన్నా ఆనాటి తంజావూరులో క్షామాలు ఉన్నాయని, సామాజిక జీవిత చిత్రణను ఆరుద్ర ఊహించారు. ఋష్యశృంగుని రాకకు పూర్వం రోమపాదుని రాజ్యంలో చినుకు బంగారమైందట. కనుక ఈ దుర్భర క్షామాన్ని తొలగించడానికి ఋష్యశృంగుని తీసుకురమ్మని రాజు సాని కూతుళ్ళకు పురమాయించాడు. మీఅంత వారికి'.....వరకు పు.ము VII లో లేదు.

## *చేమకూర వెంకటకవి*

తొ.ము. X (పు.120) లో "విజయ విలాసానికి సంపూర్ణమైన వ్యాఖ్యానాన్ని తాపీధర్మారావు గారే రచించి ప్రచురించ బోతున్నారు. వారు బయట పెట్టపోయే రత్నాలు భాషాసరస్వతి తలమీద పెట్టుకుంది". (పు.120) అన్నారు.

పు.ము VII (పు.79) లో తాపీధర్మారావు గారే రచించి ప్రచురించారు. వారు బయటి పెట్ట పోయే రత్నాలు భాషా సరస్వతి తల మీదపెట్టుకుంది. అన్నారు.

ఇక్కడ తాపీవారి వ్యాఖ్యానం వెలువడినట్లూ, దాన్ని పాదసూచికలో కూడా ఆరుద్ర పు.ము. VII పు.79 లో పేర్కొన్నారు. కానీ, బయటపెట్టిచోయే, అనేది మార్పులు చేయలేదు.

పు.ము.VII పు.80లో సమగ్రాంధ్ర సాహిత్యం నాలుగ సంపుటంలో తాళ్ళపాక తిమ్మక్క గారిపై రాసిన ప్రకరణంలో సుభద్రా కళ్యాణం - స్త్రీల పాట తాళ్ళపాక వారింటనే పుట్టిందనీ, అది తంజ వూరుదాకా పాకిందని నిరూపించాను. తాళ్ళపాక వారి సంకీర్తనాలు ముఖ్యంగా తోడయ మంగళంలోని అయిదు పాటలు నేటికీ తంజావూరు భజన సంప్రదాయంలోనూ భాగవత మేళా ప్రదర్శనల ప్రారంభంలోనూ సజీవంగా ఉన్న సంగతి తెలియ చేశాను. తమ ఇళ్ళలో ఆడవాళ్ళు పాడుకొనే పాటల్లోని సొగసులను వర్ణనలనూ చేమకూర వారు వాడుకొని ఉండొచ్చని చెప్పాను అని కొత్త సమాచారాన్ని చేర్చారు.

## కొందరు తిట్టుకవులు

తిట్టు కవులను చెప్పి విషమ స్థానాలలో దుష్టాక్షరాలు పెట్టి పద్యం రాసిన లక్షణం తెలియక తిడితే తిట్టు దీవెన అవుతుందట. దీవిస్తే తిట్టు అవుతుందట. ఐతే వాల్మీకి తొలి శ్లోకంలో విషమాక్షరమే ఉంటే తిట్టు కవిత్వంలో తొలి శ్లోకం అవుతుంది. అని బోయవాడు జంట పక్షుల్లో ఒక పక్షిని చంపినపుడు వెలువడిన శ్లోకాన్ని పేర్కొని ఈ శ్లోకంలో అరింట 'త' కారం ఉంది అని తొ.ము.X (పు.135) లో ముగించాడు. కానీ, ప్రాచీన కాలం నుండీ అన్ని మానవ సమాజాల్లోనూ ప్రచారంలో ఉన్న కవి వాక్కు గొప్పతనాన్ని మరింతగా వివరించారు (పు.89) పు.ము VII అయితే ఇంతా చర్చించిన తర్వాత జనసామాన్యంలో శాపాలకు చచ్చేవాడూ లేడు. దీవనలకు బతికేవాడూ లేడు అనే ధైర్యం కూడా క్రమేణా వచ్చి సామెతగా స్థిరపడిందనీ, ఇది సూచకమైందని ముగించారు.

తిట్టుకవుల భావజాలాన్ని వివరించడంలో ఆరుద్ర దృక్పథం అభ్యుదయభావజాలా న్ని వివరించే దిశగా పయనించిందని తెలుస్తుంది.

## కట్టా వరదరాజు

తెలుగు సాహిత్యంలో లభ్యమవుతున్న ద్విపద రామాయణాలను పాద సూచికలో తొ.ము X (పు.194) లో సూచించగా, పు.ము VII (పు.132) లో వీటిని తొలగించారు.

కవిగురించిన మార్పులేమిచేయలేదు.

## అందుగుల వెంకయ్య, ధూర్జటి కవులు

అందుగుల వెంకయ్యగురించి వివరాలు ఇంకా లభించవలసి ఉందని కావ్య సమీక్ష దిశగా రచన కొనసాగించటం తొ.ము X (పు.200) లో కన్పించగా, పు.ము VIII (పు.136-138) లో ఈ కవి కాల నిర్ణయాన్ని చేయడానికి ప్రయత్నించారు. చాగంటి శేషయ్య చేసిన కాల నిర్ణయాన్ని కూడ పరిగణతలోకి తీసుకొని, ఆయన చెప్పిన 1546 నుండి రెండు తరాలు హెచ్చించినా సరిపడడం లేదని వివిధ కారణాల్ని చూపి క్రీ.శ 1680 ప్రాంతాల్లో ఉండగలడన్నారు. "రామరాజీయం" కావ్యం 1680 ప్రాంతాలనాటిదేనన్నారు.

కుమార ధూర్జటి చిన్నతనంలో రాసిన ఇందుమతీ పరిణయం చక్కగా ఉంది. దీన్ని నూజివీడు పాలించిన మేకా వీర నరసప్పారావు కి అంకితమిచ్చాడు. ఇతడు విజయ అప్పారావు మనవడు. గోల్కొండ సుల్తానుల పక్షాన యుద్ధం చేశారు. ఫలితంగా 'విజయ' బిరుదు పొందారు. 1597 లో మరణించారు. వీరి మనవడు నరసప్పారావు 1627 ప్రాంతాల్లో నూజివీడు పాలిస్తూ ఉండేవారని భావించవచ్చునన్నారు. (తొ.ము X పు.203) కానీ, పు.ము.VII (పు.140) లో నరసప్పారావు నూజివీడును 1700 ప్రాంతాల్లో పరిపాలిస్తున్నట్లు మార్పు చేశారు. కృతి సమర్పణ క్రీ.శ.1700 ప్రాంతాల్లో జరిగి ఉటుందని (పు.143) కొంత చారిత్రక చర్చ చేశారు.

1667 లో రెండవ విజయ అప్పారావు గోలకొండ కుతుబ్‌షాహులవల్ల బిరుదులు అందుకొన్నారని, 1680 లో నూజివీడు కోట కట్టారని ఎ.ఏ. స్వామినాథ అయ్యర్ రచించిన శ్రీమదప్పారాయాన్వయ చరిత్రము ను ఆధారంగా కొన్ని విషయాల్ని చేర్చారు. (పు.143)

ధూర్జటి కవుల వివరాల్లో కాలనిర్ణయాల్లో తొ.ము X (పు.211) పు.ము VII (పు.146) కి మార్పుకన్పిస్తుంది.

కుమార ధూర్జటి వెంకటరాయుడు కాలం క్రీ.శ 1630 గానూ, ఆరవీటి చినవెంకటపతి పోషకులుగా తొ.ము X లో పేర్కొంటే, పు.ము VII లో క్రీ.శ 1700 నుండి 1710 మధ్యగా కాలనిర్ణయం చేసి, నూజివీటి నరసప్పారావుని కూడా పోషకుల్లో చేర్చారు. అలాగే లింగరాజు 1655, ధూర్జటి వెంకటరాయుడు 1680 లుగా తొ.ము X లో చెప్పగా, పు.ము VII లో 1730, బహుశా 1750 లుగా మార్పు చేశారు.

## పెద్దాపురం ప్రభువులు, వారి ఆశ్రితులు

పెదలక్ష్మణ కవి "ద్రౌపదీ పరిణయం" అంకితం పుచ్చుకొన్న సార్వభౌమ తిమ్మరాజు స్వయంగా కవిత్వం చెప్పలేదు. కానీ, వారి తమ్ముడు బలభద్ర రాజు స్వయంగా కవి. ఈయన శ్రీరామ శతకాన్ని రచించాడు. సాహిత్య సారజ్ఞుడై భోజరాజంత కీర్తిని ఆర్జించా, కవిత్వంచెప్పడమే కాక, 'కిరాతార్జునీయం' అనేకావ్యాన్ని అంకితం పుచ్చుకొన్నాడు. ఇది 'అమితఖ్యాతిమూలమైన కృతి' అని చినలక్ష్మణ కవి చెప్పాడుగాని, అంతకీర్తిని పొందిన కావ్యాన్ని ఎవరురచించారో కూడా తెలియదని తొ.ము X (పు.228) లో ముగించగా, పు.ము VII (పు.157) లో ఈ పేరాకు కొనసాగింపుగా "బహుశా దిట్టకవి వెంకటకవి చెప్పినది కావచ్చు". అని చేర్చారు గానీ, హేతువుల్ని చూపలేదు.

నాయకరాజుల సమకాలికులైన వార్ని వారి ఆశ్రితుల్ని వివరిస్తూ దిట్టకవి వెంకటకవి గురించి వివరిస్తూ తొ.ము X (పు.229) లో విశ్వనాథం కుమారుడు 'విష్ణుపురాణం' మొదలైనవి రాశాడు. ఏవీదక్కలేదు. అని పేర్కొన్నారు. పు.ము VII (పు.158) లో ఈ కవిని గురించి మరింత వివరిస్తూ "ఇతడు చెప్పిన 'కిరాతార్జునీయం' ప్రతి అసమగ్రమైనా లభిస్తోందన్నారు.

ఏనుగు పెదలక్ష్మణకవి అని తొ.ము X (229) లో పేర్కొనగా పు.ము VII (పు.159) లో ఏనుగు లక్ష్మణకవి అనిమాత్రమే పేర్కొన్నారు "పెద" అనేది తొలగించారు.

## తొలితరం ఇతరకవులు

♦తొ.ము X (పు.230) లో ఇతర కవులు అని మాత్రమే ప్రకరణాన్ని సూచించగా, పు.ము VII (పు.160) లో "తొలితరం ఇతరకవులు" అని మార్పుచేశారు

♦తా.ము X (పు.254) లో ఇదే ప్రకరణంలో ఈ సంపుటకిచివరి కవిగా వివరించిన అనఘం కోదండరామయ్యను పు.ము VII లో పేర్కొనలేదు.కానీ, 'విషయసూచికలో ఈ కవిని గురించి వివరించినట్లు సూచిక మాత్రమే కన్పిస్తుంది.

♦తా.ము XI విజయరాఘవ నాయకుడు తో ప్రారంభమవ్వగా, పు.ము VII లో 14వ ప్రకరణంలో ఈ కవిని వివరించారు.

## దామెరల కవులు, కాకమాని మూర్తికవి

మూర్తికవి చంద్రగిరి కోట గాని, ఆ ప్రాంతాలలో గాని నివాసం ఉండాలి. ఈ గ్రంథం తిరుపతి వెంకన్నకు అంకితం అనేది పు.ము VII (పు.222) లో చేర్చారు.

## క్షేత్రయ్య

క్షేత్రయ్య పదాలు కనీసం 4500 వరకూ ఉండి ఉండాలని, కానీ, 450 పదాలు మాత్రమే దొరుకుతున్నాయని, వీటిని పరిశోధించిన వారిలో విస్సా అప్పారావు కృషిని తా.ము XI (పు.94) లో పేర్కొనగా, పు.ము VII (పు.237) లో తంజావూరులో విజయ రాఘవుని మీద చెప్పిన వేయి పదాలలో కొన్నయినా దొరుకుతున్నాయి గాని, మధురలోనూ, గోలకొండలోను చెప్పిన వైనాలు సైతం తెలియవసి, క్షేత్రయ్యను మెచ్చిబహుమానమిచ్చిన గోలకొండ పాదుషా అబుల్ హసన్ తానిషా (క్రీ.శ 1620–1672) అని చారిత్రక విశేషాల్ని చేర్చారు.

## రామభద్రమ్మ, రంగాజమ్మ మొదలైనవారు

రంగాజమ్మ తన 'మన్నారుదాసవిలాసం' అనే ప్రబంధంలో తన కవితా శక్తుల గురించి చెప్పుకొన్న సీస పద్యభాగాన్ని ఉదాహరించి, దీనివల్ల రాయసంపడుచులు కేవలం రాతపోతలకే కాక, స్వామి సమయం తెలుసుకొని కార్యభాగాలు నివేదించే ప్రయివేటు సెక్రెటరీలుగా కూడా పనిచేశారని ఊహించవచ్చుననీ, రంగాజమ్మ రాయసంపడుచుగా కొలువులో చేరిరాజపత్నిగా ఎదిగిందన్నారు పు.ము VII (పు.266) లో దీన్ని చేర్చారు. ఇది తా.ము XI (పు.125) లో లేదు.

## నారాయణ తీర్థులు, సిద్ధేంద్ర యోగి

నారాయణ తీర్థులు, పారిజాతాన్ని దక్షిణానికి వెళ్ళకముందే రాసి ఉంటారనే విశ్వనాథ సత్యనారాయణ అభిప్రాయాన్ని పు.ము VII (పు.326) లో పేర్కొని చల్లపల్లి ముక్త్యాల ప్రభువులు తీర్థుల్ని సత్కరించి పోషించారనేది చరిత్ర విరుద్ధం కావచ్చునన్నారు. వీటికి చారిత్రక సంఘటనల్ని, కొన్ని పద్యాల్ని ఇచ్చారు. సిద్ధేంద్రుడనే వ్యక్తి ఎవరోకాదనీ, తీర్థులవారినే సిద్ధేంద్రులుగా తెలుగువారు వ్యవహరించే వారనే ఒక వాదం ఉందని దాన్ని వివరించారు. (పు.327) జనశ్రుతి ప్రకారం సిద్ధేంద్రుడు రచించినవి రెండే! భామాకలాపమనే పేర ప్రసిద్ధమైన 'పారిజాతం' 'గొల్లకలాపం'.

సిద్ధేంద్రయోగి మిద్యా వ్యక్తి కాక చారిత్రక పురుషుడే అయితే, జీవిత చరిత్రను కూచిపూడి వారే స్పష్టంగా చెప్పలేకపోవడం విచారించ తగ్గ విషయ మన్నారు. (పు.328) నటరాజు రామకృష్ణ అభిప్రాయం ప్రకారం సిద్ధయ్య రాయలసీమ వాడు. దేశాటనం చేస్తూ కూచిపూడి చేరాడు. జోగావధాన్ల పుత్రికను వివాహమాడి అక్కడే స్థిరపడి, కొంతకాలానికి సన్యసించి సిద్ధేంద్రయోగి అయ్యారు.

భారతదేశంలో ఆడకట్టు కట్టుకొని పురుషులే నాట్యం చేసేవారని, సుమారు 15 రాష్ట్రాలను పేర్కొని, ఏయే నాట్య సంప్రదాయాల్లో అలా జరుగుతుందో ఒక జాబితాను ఆరుద్ర ఇచ్చారు. (పు.328–329)

అయితే, కూచిపూడి లో స్త్రీలను బహిష్కరించారనడానికి ఆస్కారం లేదన్నారు.

ఆంధ్ర దేశంలో రకరకాల భాగవతులున్నారని, ఎర్రగొల్ల, బిందు, చిన్నమాదిగ, జంగం, మాల, యానాది, బలిజ భాగవతుల్ని పద్దెనిమిది రకాల్ని పేర్కొన్నారు. (పు.331–332) వీరిలో అందరూ పారిజాతాన్ని గానీ, భామాకలాపాన్ని గాని ప్రదర్శించరన్నారు. 'భామాకలాపం'లో ఉండే రచనా ప్రణాళిక ఉంటుందని, దాన్ని ప్రస్తావన, విరహం, దూతికా సంవాదం, స్వప్నావస్థ, అవధి, భామా సంవాదం, మన్మథ ఉపాలంభన, చంద్రోపాలంభన, వాయు ఉపాలంభన, మూర్చావస్థ, సపత్నీ వివాదం అనే పదకొండు ముఖ్యాంశాల్ని వివరించారు. తీర్థులువారు చెప్పిన ప్రణాళికకు ఈ భామా కలాప ప్రణాళికకు చాలా తేడా ఉందన్నారు. ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో ఉన్న వివిధ వేషకథల వైనాల్ని క్రోడీకరించవలసి ఉందని, ఆ పట్టికను (పు.335–336) ఇచ్చారు. ఇలాంటి అంశాల్ని పు.ము.VII లో చాలా చేర్చారు.

♦తొ.ము XI లో లేని అనేకాంశాల్ని పు.ము VII లో చేర్చారు.

## *మలితరం ఇతర కవులు*

♦తొ.ము XI (పు.254) లో ఇతరకవులు అనిపేర్కొన్న ప్రకరణం పేరుని పు.ము VII (పు.382) లో 'మలితరం ఇతరకవులు' గా మార్పుచేశారు. కానీ కవులలో ఏమార్పుచేయలేదు.

పు.ము VII లో మాచపల్లి కైఫీయత్తుని 'అనుబంధం–I' లోనూ (పు 397–399) కొండవీటి సీమపముతులు సీసపద్యాన్ని 'చాటుపద్యమణిమంజరి–2' (1988) నుండి తీసుకొని 'అనుబంధం–II' గానూ (పు.400) కూచిపూడి గ్రామం యొక్క పూర్వోత్తరము 'అనుబంధం–III' గానూ (పు.401–403) చేర్చారు.

# సమగ్ర ఆంధ్ర సాహిత్యం: తొలి ముద్రణ పునర్ముద్రణల మార్పులు చేర్పులు

## 4.8. ఎనిమిదవ సంపుటి( కడపటిరాజుల యుగం)

### *కడపటిరాజుల యుగం*

♦తొ.ము XII (పు.32-40) లో కొంతమంది మెదకు సుభాకవుల్ని పు.ము VIII (పు.27) లో తొలగించారు. ఆ కవుల పేర్లు వనపర్తి సంస్థానం, దీనినే 'నాగూరు సంస్థానం' అని పిలిచేవారు! ఈ సంస్థానంలోగల కవుల్ని, అష్టభాషా గోపాలరావు, ఏరుట్ల శేషాచలం, వురింగంటి పెదనరసింహాచార్యులు, కర్పూరం కృష్ణమాచార్యులు, కాంద్రవీటి రామానుజాచార్యులు, అత్తాను రామానుజాచార్యులు ముదిగొండ బ్రహ్మయలింగం వంటి వారిని పు.ము VIII లో తొలగించారు.

### *వేమన, కడపసుభాకవులు*

♦తొ.ము XII (పు.59-72) లో వివరించిన వేమన గురించి పు.ము VIII (పు.43-68) లో చాలా మార్పులు చేర్పులు చేశారు. తొ.ము XII లో కథా చరిత్ర వలె కొనసాగింది. కానీ, పు.ము VIII లో చక్కని విమర్శతో కూడిన సాహిత్య చరిత్ర కన్పిస్తుంది. వేమన కాలనిర్ణయాన్ని, కులాన్ని, మతాన్ని, తాత్త్విక పరిణామాన్ని శాస్త్రీయంగా వివరించడానికి ప్రయత్నించారు. 'మనవేమన' 'వేమన్న వేదం' గ్రంథాలలో ఆరుద్ర చెప్పిన అంశాల్ని ఈ పు.ము VIII లో సంక్షిప్తీకరించి వివరించారు. క్రీ.శ 1627 ప్రాంతాలలో వేమన జన్మించాడని ఊహించిన వేమన కాలం 1652-1725 ని సమర్థించారు. అదే తొ.ము XII సంపుటి (పు.60) లో వేమన 1650 ప్రాంతాలలో చిత్తూరు జిల్లా చంద్రగిరి తాలుకాలోని మూగచింతలపల్లిలో జన్మించారని చెప్పారు. పు.ము లో వేమన కాలాన్ని 1627 గా మార్చారని తెలుస్తుంది. భాదజాలాన్ని వివరించటంలో కూడా తేడా కన్పిస్తుంది. వేమనను అనుకరించిన కవుల పేర్లను చారిత్రక కాలక్రమంలో కూడా (పు.63) చూపారు. తొ.ము VII లో లేని అనేక అంశాల్ని పు.ము VIII లో చేర్చారు.

### *మధురనాయక రాజులు, ఆశ్రితులు*

గొట్టిముక్కల వారు స్వయంగా సాహిత్య నిర్మాణం చేశారు. ఈ ఇంటిపేరు గల ముగ్గురు రాచవారు చెప్పిన కృతులు ఈ మధ్య వెలుగు చూశాయని, వాటిని పేర్కొన్నారు. 'రాజపాళయం' రాజకవుల యక్షగానములు అని 1981 లో ప్రచురించిన వాటి వివరాలను ఇచ్చారు.

గొట్టిముక్కల కృష్ణమరాజు - సీతా కళ్యాణం

గొట్టిముక్కల సింగరాజు - పారిజాతాపహరణం

గొట్టిముక్కల కుమారపెద్దిరాజు - సావిత్రి.

ఈ రాచకవుల యక్షగానాలనేకాక, బహుశా వారి ఆశ్రితులైన భాస్కర శేషాచలం తిరుమెక్కాళ, తిరువెంగళాచార్యులు రచించిన 'నాచ్చార్ పరిణయం' 'కూరత్తాళ్వార్ చరిత్ర' అనే యక్షగానాలు కూడా రాజపాళయంలోనే దొరికాయని కొత్త అంశాల్ని తొ.ము XII లో లేనివి, పు.ము VIII పు. **106-107** లో చేర్చారు.

## తంజావూరు మహారాష్ట్ర రాజులు

శివాజీ కేవలం సాహిత్య విషయాలే కాక దార్శనిక చింతనకు కూడా ఆదరణ చూపాడని, నాటి వీరవైష్ణవం, అద్వైతం వంటివాటి ప్రభావాల్ని పు.ము VIII(పు.**118**) లో వివరించారు. ఇవి తొ.ము XII లో లేవు. గంగాధర, ఆధ్వర్యంలో, 'అవైదిక దర్శన సంగ్రహం' అనే గ్రంథాన్ని సంకలనం చేయించాడన్నారు. (పు.**118**)

## మొదటి శరభోజి

తన అన్నగారు శహాజీకి సంతానంలేనందు వల్ల తను రాజ్యానికి రావడం శరభోజి మనస్సుని బాగా కుదిపేసిన వైనాన్ని పు.ము VIII(పు.**120**) లో అదనంగా చేర్చారు. తనకు పుత్రులు లేనందువల్ల తాను , తనతరువున ఆస్థాన విద్వాంసుణ్ణి ఆయాక్షేత్రాలకు పంపించడం, తల్లి పేర నిర్మించిన దాసాంబపురానికి కూడా విద్వాంసు వెళతాడు. అక్కడ ఉన్న సదాశివ బ్రహ్మేంద్రులు అనుగ్రహించి శరభోజిని దీవిస్తూ తమ కృతి 'ఆత్మవిద్యా విలాసం' ప్రతినొకదాన్ని రాజుకి ఆస్థాన పండితుడి ద్వారా పంపించాడు. రాజవంశం వర్ధిల్లుతుందని దీవించినట్టు కనిపిస్తుంది ఇటువంటి సంఘటనల్ని కొత్తగా చేర్చారు.

## తుక్కోజి

తుక్కోజి కాలంలో ఆదరణలో ఉన్న చిత్రకళను గురించి వివరించడం అదనంగా పు.ము VIII(పు.**121**) లో చేర్చారు. ఇది తొ.ము XII (పు.**138**) లో లేదు..

## ఆర్కాటుసుభాకవులు

ఎరపాటి ఎర్రన్న కవి పు.ము VIII(పు.**156-157**) అదనంగా చేర్చారు. ఈ ప్రకరణంలో ఈ కవిని గురించి తొ.ము XII లో పేర్కొనలేదు.

## కొండపల్లి ఏలూరు సర్కారులు

'నూజివీటి వంశావళిలో ఇద్దరు అప్పారావులు ఉన్నారు. వాళ్ళలో రెండో వారి మనుమడి కాలంలో కుమార ధూర్జటి ఉన్నాడని ఇంతకు ముందు చెప్పుకొన్నాం' అని పు.ము VIII (పు.172) లో మార్పు చేసుకొంటే ఈ ప్రకటన తొ.ము XII (పు.205) లో 'వాళ్ళలో రెండోవాడి మనుమడే అప్పారావు అని తెలియక పూర్వం తప్పులెక్కకట్టేను. మొదటి విజయ అప్పారావు గారి మనమడి కాలంలో కుమార ధూర్జటి ఉన్నాడనుకొని ఆ కవిని పోయిన యుగం (నాయకరాజుల యుగం) లో చేర్చాను' అని ఆరుద్ర అన్నారు.

## ప్రోలునాటి కవులు

ఈ ప్రకరణంలో అయ్యగారి పెదబాపయ్య శాస్త్రిని పు.ము VIII (పు.211) లో అదనంగా చేర్చారు.

ఒరగాారాజకవీ, అయ్యంకి బాలసరస్వతిలను ఈ ప్రకరణంలోనూ సంక్షిప్తంగా వివరించటం పు.ము VIII పు.273-277 లో వివరించారు.

తొలి ముద్రణ లో గల 12 వ సంపుటాల్ని పునర్ముద్రణలో 8 సంపుటలుగానే అందించారు. 9వ సంపుటనుండి 13 వ సంపుటి వరకు పూర్తిగా కొత్త సమాచారాన్ని వెలువరించారు. వీటిని సమగ్ర ఆంధ్ర సాహిత్య పరిశోధనలో ఆరుద్ర కృషితో పాటు సమీక్షించడం జరుగుతుంది.

# సూచికలు (Referances)

1. ఆరుద్ర, సమగ్ర ఆంధ్ర సాహిత్యం, తొ.ము.iv పు.v.

2. ఆరుద్ర, సమగ్ర ఆంధ్ర సాహిత్యం, తొ.ము.x పు.vi.

3. బి. యస్. యల్. హనుమంతరావు, ఆంధ్రుల చరిత్ర, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ ప్రచురణ : హైదరాబాద్, వి.పి.హెచ్. ప్రథమ ప్రచురణ;1994, ద్వితీయ ముద్రణ, 1997. పు.52.

4. అదే. పు.53.

5. అదే. పు.44.

అధ్యాయం-5

# సమగ్ర ఆంధ్ర సాహిత్య పరిశోధన

పరిశోధకుడుగా,సాహిత్యచరిత్రకారుడుగా తెలుగు సాహిత్యంలో ఆరుద్ర ఒక విశిష్ట స్థానం పొందడానికి కారణమైన రచన 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం'. వేమన, గురజాడ, రామాయణం వంటి వివిధ విషయాలపై అనేక పరిశోధన వ్యాసాలు రచించినప్పటికీ, ఆరుద్రను 'పరిశోధకుడు' అని పిలవగానే సాహితీ వేత్తల్లో 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' రచన పట్ల ఆయన చేసిన కృషే గుర్తొస్తుంటుంది. ఈ అధ్యాయంలో, ఆరుద్ర రచించిన 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' లో 'సమగ్రత' నూ, సాహిత్య చరిత్ర స్వరూపస్వభావాల్నీ, కవుల చరిత్రకూ సాహిత్య చరిత్రకూ గల పోలికలు, భేదాల్ని వివరించడం, యుగవిభజన, రచనలో పరిశోధనకృషి, ఇతరుల రచనలతో తులనాత్మక పరిశీలన చేయడం వంటివన్నీ సమీక్షించడం వల్ల, ఆరుద్ర చేసిన పరిశోధన కృషి వెల్లడయ్యే అవకాశం ఉంది.

## 5.1. సంపుటులు–రచనాకాలం:

ఆరుద్ర రచించిన 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' తొలిముద్రణ ను నెలనెలా ఒక 'నవల'వలే విడుదల చేయాలనీ, పుటల సంఖ్య, ధర, పుస్తకాలు వెలువడే కాలం వంటివన్నీ ముందే ప్రకటించి, ఈ రచనకు పూనుకొన్నట్లు, రచయిత, ప్రకాశకుల 'ముందు మాటల'ను బట్టి తెలుస్తుంది[1]. తొలిముద్రణ (తొ.ము) లో 12 సంపుటులుగా సమగ్ర ఆంధ్ర సాహిత్యాన్ని వెలువరించారు. తొ.ము.లో మొదటి సంపుటి 1965 ఏప్రియల్ లోనూ, 12వ సంపుటి 1968 ఫిబ్రవరికీ పూర్తయ్యింది. వీటిని అనుకొన్న ప్రకారం నెలనెలా ప్రచురించి ఇవ్వలేకపోయారు. దానికి అనేక కారణాల్ని 'ప్రకాశకులు' చెప్పుకున్నారు. పుటల సంఖ్య ప్రకటించినట్లే ఇవ్వడం కుదరడం లేదనీ, సాహిత్యాన్ని సమగ్రంగా అందించడానికి మరికొన్ని పుటల్ని పెంచవలసి వచ్చిందనీ విన్నవించుకొన్నారు[2]. అన్ని సంపుటాలకీ ఉమ్మడిగా పి.వి.రాజమన్నారు చేత 'ప్రవేశిక' నూ, ప్రతి సంపుటికీ విడివిడిగా ప్రముఖ సాహితీ వేత్తలతో 'పీఠిక' ను రాయించి, ప్రచురించారు. ఈ పీఠికల్లోనే సమగ్ర ఆంధ్ర సాహిత్యం రచనలోగల లోటుపాట్లను కొంతవరకూ చర్చించడం కన్పిస్తుంది. పత్రికల్లో కూడా చాలా విమర్శలు వెలువడ్డాయి. వీటన్నింటినీ దృష్టిలో పెట్టుకొంటూనే రచన కొనసాగిస్తున్నట్లు ఆరుద్ర తెలిపిన "కృతజ్ఞతలు" తెలియజేస్తున్నాయి[3]. అయినప్పటికీ, తొలిముద్రణ లో గల లోటుపాట్లను, ఇంకా పూర్తి చేయవలసిన భాగాల గురించి, తన ఆరోగ్యం కుదుటి పడిన తర్వాత రాయడానికి పూనుకొంటానని చెప్పిన ఆరుద్ర, తొ.ము.లో జరిగిన పొరపాట్లను సవరించి, మార్పులూ, చేర్పులూ చేసి, కొత్త సమాచారాన్ని చేరుస్తూ పునర్ముద్రణ ను ప్రకటించారు. తొలి ముద్రణను, యం. శేషాచలం అండ్ కంపెనీ ప్రచురించగా, పునర్ముద్రణ ను ప్రజాశక్తి బుక్‌హౌస్ వారు ప్రచురించారు.

పునర్ముద్రణ లో మొదటి సంపుటి జూలై,1989 లోనూ, పదమూడవ సంపుటి సెప్టెంబరు, 1991 కీ పూర్తిచేశారు. పునర్ముద్రణలో ప్రచురణ కర్తల 'మామాట', ఆరుద్ర రచించిన 'మనవిమాటలు' అన్ని సంపుటులకీ ఇంచుమించు ఉమ్మడిగానే పెట్టేశారు[4]. తొ.ము.లో ప్రచురించిన 'పీఠికలు', రాజమన్నారు 'ప్రవేశిక' అన్నింటినీ పునర్ముద్రణ నుండి తొలగించారు. తొ.ము. పునర్ముద్రణలలో యుగాల పేర్ల కొన్నింటిని మార్చడం, చేర్చడం చేశారు. ఆయా సంపుటాలు వెలువడిన కాలం, యుగాల పేర్ల వివరాలన్నీ పట్టిక I, II లలో చూడవచ్చు.

## 5.1.1. తొలిముద్రణ వివరాలు :

పట్టిక-I

| సంఖ్య | సంపుటి పేరు | కాలం | పీఠిక కర్త | పీఠిక పేరు |
|---|---|---|---|---|
| 1. | చాళుక్య యుగం | ఏప్రిల్,1965 | వేలూరి శివరామశాస్త్రి | మంగళాశాసనం |
| 2. | కాకతీయ యుగం | మే,1965 | విశ్వనాథ సత్యనారాయణ | పీఠిక |
| 3. | పద్మనాయక యుగం | జూన్,1965 | శివశంకరస్వామి | పీఠిక |
| 4. | రెడ్డి రాజుల యుగం | జూలై,1965 | మల్లాది రామకృష్ణశాస్త్రి | పీఠిక |
| 5. | గజపతుల యుగం | ఆగస్టు,1965 | గిడుగు వేంకట సీతాపతి | పీఠిక |
| 6. | తొలిరాయల యుగం | సెప్టెంబరు,1965 | ఖండవల్లి లక్ష్మీరంజనం | పీఠిక |
| 7. | మలిరాయల యుగం | అక్టోబరు,1965 | దివాకర్ల వేంకటావధాని | పీఠిక |
| 8. | నవాబుల యుగం | నవంబరు,1965 | రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ | పీఠిక |
| 9. | ఆరవీటి రాజుల యుగం | ఫిబ్రవరి,1966 | వేటూరి వెంకటరమణయ్య | పీఠిక |
| 10. | నాయకరాజుల యుగం-I | అక్టోబరు,1966 | తాపీధర్మారావు. | పీఠిక |
| 11. | నాయకరాజుల యుగం-II | మార్చి,1967 | కప్పగంతుల లక్ష్మణశాస్త్రి | పీఠిక |
| 12. | కడపటి రాజులయుగం | ఫిబ్రవరి,1968 | - | |

## 5.1.2. పునర్ముద్రణ వివరాలు:

పట్టిక – II

| సంపుటి సంఖ్య | సంపుటి పేరు | ప్రచురణ కాలం |
|---|---|---|
| 1. | ఆదిమ, చాళుక్యయుగాలు | జూలై,1989 |
| 2. | కాకతీయ యుగం | జూలై 1989 |
| 3. | పద్మనాయక, రెడ్డిరాజుల యుగాలు | మార్చి, 1990 |
| 4. | గజపతుల,తొలిరాయల యుగాలు | మార్చి,1990 |
| 5. | మలిరాయల యుగాలు | ఆగస్టు,1990 |
| 6. | నవాబుల, ఆరవీటి రాజుల యుగాలు | నవంబర్,1990 |
| 7. | నాయక రాజుల యుగం | నవంబర్,1990 |
| 8. | కడపటి రాజుల యుగం | నవంబర్,1990 |
| 9. | కుంఫిణీ యుగం–I | డిసెంబర్,1990 |
| 10. | కుంఫిణీ యుగం–II | డిసెంబర్,1990 |
| 11. | జమీందారీ, నవ్యసాహిత్యయుగాలు–I | మే,1991 |
| 12. | జమీందారీ, నవ్యసాహిత్యయుగాలు–II | మే,1991 |
| 13. | ఆధునిక యుగం (ఆధునిక అభ్యుదయ యుగం) | సెప్టెంబర్,1991 |

## 5.2. సమగ్ర ఆంధ్రసాహిత్యం–"సమగ్రత":

సమగ్ర ఆంధ్ర సాహిత్యం లో 'సమగ్రత' ను పరిశీలిస్తే, సాహిత్యం ప్రారంభమైంది మొదలు, సంపుటాలు వెలువడినంతవరకున్న అంతటినీ అందించేదని భావించడానికి వీలులేదు. ఆరంభం నుండి, అన్ని సంపుటాలు వెలువడిన నాటివరకూ సాహిత్యం లో గుర్తించదలచిన వాటిని విస్మరించకుండా రచన కొనసాగించగలగడం, ఆనాటి సాహిత్య వ్యూహను అవగాహన కల్గించడానికి ప్రయత్నించడం. ఒక స్వరూపాన్నీ, ఒక అవగాహనను కల్గించడంగా భావించవలసి ఉంది. ఆరుద్రే, పదమూడవ సంపుటిని ముగిస్తూ 'స్వస్తి వాచకం' లో చెప్పుకున్నట్లు సాహిత్య చరిత్రకు ముగింపు అంటూ ఉండదు[5].

కాలం, 'సమగ్రత' అంటే తెలుగు సాహిత్యాన్ని ఆరంభ వికాసాల్ని అవగతం చేసుకోవడానికి జరిగిన ప్రయత్నంగా గుర్తించవలసి ఉంది. 'ఈ సాహిత్య చరిత్ర ఆశయం సమగ్రత. కాని సమగ్రతకు ప్రయత్నం మాత్రం జరిగిన ఈ గ్రంథంలో అది పూర్తిగా ఫలించిందని చెప్పటానికి వీలులేదు. ప్రచురణకర్తల వ్యాపార దృష్టి కూడా ఈ సమగ్రతకి భంగం కల్గించింది. పుటల సంఖ్య నియమితం కావటం, అనంతర సంపుటాలు పెరగటం, రాను రాను ప్రముఖుల గురించి సంక్షిప్తంగా చెప్పార" ని ఎస్.వి. రామారావు అన్నారు[6] అయితే, మలికూర్పులో లోపాల్ని సవరించుకొనే అవకాశం గల గ్రంథంగా, 'సమగ్రత' కి దారి చూపిన సాహిత్య చరిత్రగా చిరస్మరణీయమైన దానిగా కూడా ఎస్.వి.రామారావు వ్యాఖ్యానించారు[7]. పునర్ముద్రణలో ఆరుద్ర సమగ్రత కు ప్రయత్నించారు. ఆ 'సమగ్రత' గిడుగు సీతాపతి, తొ.ము. 'పీఠిక' లో వివరించిన దానికి దగ్గరలో ఉంది. గిడుగు సీతాపతి అభిప్రాయంలో ఆరుద్ర రచించిన గ్రంథాల్లో అన్ని విషయాలు సమగ్రంగా చర్చించడానికి అవకాశం కలిగింది. " 'సమగ్ర' శబ్దము సాపేక్షము". ఒక దృష్టితో చూసినట్లయితే ఎంత విపులంగా రాసినా ఏదీ సమగ్రమవ్వదు. పదమూడు సంపుటాల్లో ఎంత వరకూ సాధ్యం కాగలదో అంతవరకూ సమగ్రంగానే వీరీ సాహిత్య చరిత్ర రచించారని[8], ఆరుద్ర రచనలో ""సమగ్రత""ను సమర్థించారు. అయితే నిడదవోలు వెంకటరావు[9], ముదిగొండ వీరేశలింగం[10] మొదలైన వారు సమగ్రం కాని రచన అంటూ కొంతమంది కవుల్ని, కావ్యాల్ని పేర్కొన్నారు. 'ప్రబంధ రత్నావళి' ఆధారంగా చేసుకొని కొంతమంది కవుల్ని చేర్చిన ఆరుద్ర, మరికొంతమందిని విడిచిపెట్టారని నాగలూటి శేషనారాధ్యుడు గురించి నిడదవోలు వెంకటరావు వివరించారు. వీరే 'శేషనాథుడు' అని కూడా పేర్కొన్ని, 'శేషనారాధ్యుడు' - 'శేషనాథుడు' కి తేడాలేకుండా ప్రయోగించారు. ఈకవి **1500** ప్రాంతంలోని కవిగా వివరించారు. ఆరుద్ర "నాగలూటి శేషనాథుడి" ని వదిలేయలేదు. తొ.ము.IX పు-**112**; : పు.ము.**6-245** లలో ఈ కవి వివరాల్ని సమగ్ర ఆంధ్ర సాహిత్యంలో చూడవచ్చు. "చేర్చవలసిన కవులనే పేర్కొంటూ, గ్రంథంలో ఉన్న కవుల్ని విమర్శిస్తాను" అని అస్పష్టమైన విమర్శను నిడదవోలు వారు చేశారు[11] *పచ్చకప్పురపు తిరువెంగళకవి, భద్రకవి లింగకవి, కోటశివరామకవి, దోనూరి కోనేరు నాథుడు, సిద్ధిరాజు తిమ్మరాజు,* రామరాజు రంగప్పరాజు, బోడ్డుచెర్ల చినతిమ్మన, *మెట్టసోమనాథ సోమయాజి, రేటూరి భావన, నాగన సూరన,* అంగరప్పసింహకవి, పెదపాటి జగ్గన, *తెనాలి రామకృష్ణకవి* మొదలైన వారిని పేర్కొన్నారు. '*రేటూరి భావన*'ను ఆరుద్ర "ఈ ఇంటిపేరు (రేటూరి) తోనే భావనామాత్యుడనే కవి అని పేర్కొని 'కామేశ్వరిచరితం' అనేద్విపద కావ్యం రాశాడు' అని రాశారు. 'భావన' అని ప్రత్యక్షంగా, సూటిగా లేకపోవడంతో ఈ కవిని ఆరుద్ర పేర్కొనలేదన్నారు నిడదవోలువారు.

నిడదవోలు వారి విమర్శలో ఒకసంపుటిలో కవులు మరొక సంపుటిలోకి వెళ్ళిపోయారనే విమర్శమాత్రం వాస్తవాన్ని తెలుపుతుంది. భారతి మాసపత్రికలో స.ఆం.సా. ఎనిమిదవ సంపుటి గురించి వివరించగా, తొమ్మిదో సంపుటిలో చాలామంది కవుల్ని ఆరుద్ర పేర్కొన్నారు. అయితే, భారతి **1966** ఫిబ్రవరిలో ఈ విమర్శవెలువడగా, తొమ్మిదవ సంపుటి కూడా అదేనెలలోనే (తొ.ము) వెలువడింది. కొంతమంది కవుల్ని పుటల విస్తరణ వల్ల వివరించలేక తర్వాత సంపుటిలో ఆరుద్ర చేర్చారని తెలుస్తుంది. అయితే భారతిలో నిడదవోలు వారి వ్యాసాలు వెలువడిన తర్వాత విస్మరించిన కొంతమంది కవుల్ని ఆరుద్ర

చేర్చారు. కానీ, కాలాన్ని స్పష్టంగా వివరించకుండా తొ.ము.లో తప్పించుకున్నా, పు.ము.లో దాన్ని సరిదిద్దికున్నారు. అంగరనృసింహకవిని విస్మరించారని నిడదవోలు వారు భారతి ఫిబ్రవరి 1966 లో విమర్శించగా, అంగరనృసింహకవిని పదకొండవ సంపుటి (తొ.ము) పుట.267 లో చేర్చారు. కందుకూరి వీరేశలింగం కూడా పేర్కొన్న అంగరనృసింహకవి 1510 ప్రాంతంవాడనే వాదన ఉన్నా, దాన్ని నమ్మలేమని నిడదవోలు వారు వివరించి, ఈ కవి 'రాజరాజాభిషేకము' అనే అయిదాశ్వాసాల కావ్యం రచించారన్నారు[12]. 1650 ప్రాంతీలవాడైన కట్వావరదరాజు చేసిన ప్రయోగాల్ని అనుసరించి అంగరనృసింహకవి కూడా ఈ కాలంవాడే కావచ్చునని ఆరుద్ర తొ.ము XI పు-267 లో చెప్పి, రాజరాజాభిషేకం అముద్రితమన్నారు. అంగరనృసింహకవి గురించి తొ.ము.లో చెప్పినవే పు.ము పదకొండవ సంపుటి (పు.394) లోనూ ఉంచేసి మార్పులు చేర్పులు చేయాల్సిన అవసరం లేదని భావించారు.

తొ.ము. ఆరవసంపుటి (తొలిరాయలయుగం) లో వివరించిన పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడిని గురించి ముదిగొండ వీరేశలింగము, భారతి సెప్టెంబర్ 1966లో పెనుమళ్ళ సోమయ్య్య రచించిన 'సీమంతినీ పరిణయము' కావ్యం అముద్రితమనీ, మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయం సంఖ్య -513, ఉందనీ అథోదీపిక లో ఆరుద్ర పేర్కొనడాన్ని విమర్శిస్తూ, 'సీమంతినీ పరిణయము' ముద్రితమేననీ, సాహిత్య చరిత్ర రాసే కాలంలో గ్రంథకర్తకు లభించలేదనడం సరైందికాదనీ, 'ఇట్టి విషయాలు గ్రహించి, సరిదిద్ది కనీసము రెండవ ముద్రణములోనైనను గ్రంథస్కాలిత్యములను సవరించి, అనుబంధముతో సహా సంపూర్ణముగా వేయనిచో, ఇది సమగ్రాంధ్ర సాహిత్య మెట్లగునో తెలుపవలసినదిగా కోరుచున్నాడ" అని "సమగ్రత" ను ప్రశ్నించారు. ఆరుద్ర తొ.ము VI పు.200 లో అథోదీపికలో ముదిగొండ వీరేశలింగం విమర్శించినట్లే ఉంది. ఈ విమర్శను దృష్టిలో పెట్టుకొని పునర్ముద్రణ పు.309 లో తొలగించారు. విషయంలో మాత్రం ఎలాంటి మార్పూచేయలేదు. ముదిగొండ వీరేశలింగం భావించినట్లు కేవలం గ్రంథాన్ని అముద్రితమవడం వల్ల సమగ్రతకు భంగవాటిల్లినట్లుకాదు. సాహిత్య చరిత్ర రాసేవారందరికీ లోకంలో ముద్రించిన కావ్యవివరాలన్నీ తెలిసి రాస్తేనే 'సమగ్ర సాహిత్య చరిత్ర' రూపొందుతుందను కోవడం సరైన ఆలోచనకాదు. ఆ కావ్యం లోకంలో లేకుండా ఊహలు చేయడం వంటివో, తెలిసే విస్మరించడమో చేస్తే, సాహిత్య చరిత్ర కారుడు సమగ్రతకు ప్రయత్నించ లేదన వచ్చునేమోకానీ, ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలోనైనా ప్రతిని సూచించి, దానిలో విషయాన్ని అందించినా, ప్రచురణ వివరాలు దొరకనంత మాత్రంచేత 'సమగ్రత' లోపించిందనడం సరైన విమర్శ అనిపించుకోదు. నిడదవోలు పేర్కొన్న కావ్యాల్ని, కవుల్ని అందరినీ సాహిత్య చరిత్రకారుడు పేర్కొనాలనేమీ లేదు. కావ్య విలువల్ని బట్టి ఆ రచనను సాహిత్య చరిత్రలో ఉటంకించాలో వద్దో రచయిత విచక్షణపై ఆధారపడి ఉంటుంది. కొంతమందికి దొరికిన కావ్యాలు 'సాహిత్య చరిత్ర' లో లేకపోయినంతమాత్రంచేత కూడా సమగ్రతకు భంగం వాటిల్లిందని భావించడం. సాహిత్య చరిత్ర కాదనీ పరిధినీ, కాలాన్నీ, సామార్థ్యాన్ని దృష్టిలో పెట్టుకొని సహృదయతతో చేసిన విమర్శ అనిపించుకోదు. కనిపించిన కావ్యాన్నో, కవినో రాస్తే విశ్వసించదగని వారి రచనల్ని స్వీకరించడమనే విమర్శకు లోను కావలసి వస్తుంది. అయినా, ఆరుద్ర తన రచనలో శేషయ్య, బులుసు వారి అభిప్రాయాల్ని యథాతథంగా తీసుకున్నారని

నేలటూరి వెంకటరమణయ్య (తొ.ము IX పీఠిక) విమర్శించారు. ఆరుద్ర సమగ్రతను ఆశయంగా భావించిన రచనగా చెప్పుకున్నా, కొంతవరకూ దాన్ని సాధించలేకపోవడానికి కారణాల్ని ఆరుద్ర కూడా కొన్నిచోట్ల చెప్పుకున్నారు. **12**వ సంపుటి జమీందారీ నవ్యసాహిత్యయుగం (పు.ము) లో చెప్పుకోవలసిన వారి గురించి చెప్పడానికి ప్రయత్నించినా, అందరిగురించికాకపోయినా కొందరు రాసిన అన్ని పుస్తకాల గురించి కూడా విశదం చేయడానికి వీలుకాలేదనీ, చాలా మంది మిగిలిపోయారని (పు.**367**) అంగీకరించారు. వీటితోపాటు మరికొన్ని కారణాల్ని ఊహించవచ్చు.

i) కొంతమంది కవుల్ని విస్తృతంగా చర్చించారు.

ii) సామాన్యులకు సహితం అందుబాటులోకి రావాలనే తపనతో 'సృజనాత్మక పరిశోధన' కొనసాగించడం వల్ల కొందరిని వివరణాత్మకంగా చెప్పక తప్పలేదు.

iii) సాధ్యమైనన్ని విషయాల్ని లోతుగా పరిశీలించాలనే ఆలోచనలతో స్థల, కాల, కర్తృత్వాది విషయాల్ని చర్చించడం, అదీ కొన్ని కావ్యాల-కవులకే కేటాయించటవల్ల కొందరి గురించి చాలా తక్కువగా చెప్పవలసి వచ్చి ఉండవచ్చు.

iv) బాగా ఆకరాలు లభించిన వారిని సాధ్యమైనన్ని కోణాల్ని పరిశీలించడానికి ప్రయత్నించడం.

ఇన్ని కారణాలు కన్పిస్తున్నా, పునర్ముద్రణలో సమగ్రతకు చేసిన ప్రయత్నం ఎంతో కన్పిస్తుంది.

పోషకుల పేరుతో యుగవిభజన చేసుకున్నా, కొన్ని ప్రకరణాల్లో ప్రక్రియాపరంగా చెప్తూ, సమగ్రంగా రచనల్ని, కవుల్ని వివరించే ప్రయత్నం చేశారు. మరికొన్నింటిని అనుబంధాల రూపలో అందించారు. ఆరవసంపుటిలో కులపురాణాలు, స్థలపురాణాలూ, సిసలు పురాణాలూ, లోనూ **8**వ సంపుటి పు.ము లో రామాయణ రచయితలు (పు.**260**) శీర్షికలతో సమగ్రతకు ప్రయత్నించి పెంచిన అయిదు సంపుటాల్లో ఈ ఆలోచన మరింతగా కన్పిస్తుంది. 'కథలు-కవమీమీషలు,' 'విద్యావంతులు-భావచైతన్యం,' 'భగవద్గీతలు-బ్రహ్మవిద్యలు,' 'వాడుక-వేడుక భాషలయుద్ధం,' 'వీధి నాటకాలు-స్టేజినాటకాలు,' 'కథా సాహిత్యం-ప్రజాబాహుళ్యం' మొదలైన శీర్షికలతో వివిధ ప్రకరణలో అనేక మంది కవుల్ని, రచనల్ని గమనించినప్పుడు తొ.ము.కంటే పు.ము. సమగ్రమైన సాహిత్యరచనకు ఆరుద్ర కృషిచేసినట్లే భావించవచ్చు. నాయకరాజుల యుగం, దీన్నే కొంతమంది క్షీణయుగమనీ, దక్షిణాంధ్ర యుగమని పిలిచిన ఈ యుగంలో ఆరుద్ర చేసిన కృషిని ప్రత్యేకంగా గుర్తించవలసి ఉంది. "ఈ యుగము నాటి రాజకీయ సాంఘిక చరిత్రను నిశిత దృష్టితో పరిశీలించి, అట్టి వాతావరణములో వెలువడిన కావ్యములను గూర్చి విపులముగా చర్చించింది. తుండీర మండలమును గూర్చి చారిత్రకులు వ్యక్తీకరించిన భిన్నాభిప్రాయములను సమన్వయపరిచి తెలుగు కవులను, తుండీర మండ లాధిపులకును గల సంబంధమును సోపపత్తికముగ నిరూపించి తెలుగు సాహిత్య కేంద్రములలో చెంజికి సముచిత ప్రాధాన్యమొసగుట ఆరుద్ర గారి పరిశోధనాత్మక దృష్టికి తార్కాణముగనున్నది. విస్మృతాంశమునింత సమగ్రముగ వివరించిన అంశమొకటియే ఇది సమగ్ర ఆంధ్ర సాహిత్య చరిత్ర యనుటకు నిదర్శనము" అని కప్పగంతుల లక్ష్మణశాస్త్రి చేసిన ప్రశంసలో ఔచిత్యం ఉంది[13].

శివశంకరస్వామి, తొ.ము. 'పీఠిక'లో చెప్పినట్లు "రచయిత హృదయం ఏదో గమనించడం ముఖ్యం. ఆయన దానిని ఏ విధముగా నిర్వహించినాడు, అది సమంజనముగా ఉన్నదా లేదా అని సమీక్ష చేయడం సరసంగా ఉంటుంది. ఇందులో అవిలేవు, ఇవిలేవు, ఇవి ఎక్కువగా ఉన్నది, ఇవిన్యూనముగా ఉన్నవి-అని విమర్శించడం న్యాయముకాదు. విధానమును బట్టి ఈ సంపుటిని పరిశీలిస్తే రచయిత తలపెట్టిన లక్ష్యం నెరవేరినట్టుతోస్తుంది" అని 3వ సంపుటి గురించి చెప్పినా, ఈ అభిప్రాయం పు.ము. లో అన్నింటికీ వర్తించి, ఆరుద్ర సమగ్ర ఆంధ్ర సాహిత్యంలో "సమగ్ర" పదానికి న్యాయం చేయడానికి ప్రయత్నించినట్లు చెప్పడానికి ప్రామాణికమైన అభిప్రాయంగా దివాకర్ల వేంకటావధాని దీన్ని గుర్తించవచ్చు కూడా ఈ సమగ్ర ఆంధ్ర సాహిత్య రచనకు ఆరుద్ర సుమారైదేండ్ల నుండి కృషిచేసి, సమగ్రాంధ్ర సాహిత్యమును నామాన్ని సార్థకం చేశారని ప్రశంసించారు[14]. ఇది పూర్తిగా కాకపోయినా చాలా వరకూ సమంజసమేనని పరిశీలించిన వారికి తెలుస్తుంది.

## 5.3. సమగ్ర ఆంధ్ర సాహిత్యం – "ఆంధ్ర" "తెలుగు"

ఆరుద్ర 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' అనడంలో 'ఆంధ్ర' శబ్దాన్నే ప్రయోగానికి తీసుకున్నారు. ఆంధ్ర, తెలుగు, తెనుగు, శబ్దాలలో దేన్ని తీసుకోవాలనే విషయంలో సమాసగత ప్రయోగానికి అనుకూలంగా "ఆంధ్ర" ని స్వీకరించారు. అంతే గాని, 'ఆంధ్ర', 'తెలుగు', 'తెనుగు వేర్వేరు శబ్దాలుగానో, ఒకదానికంటే ఒకటి ప్రాచీనమో, అర్వాచీనమో అనే భావనలో స్వీకరించి ఉండకపోవచ్చు. చాలామంది ఆరుద్ర కంటే ముందు, తర్వాతా, 'సాహిత్య చరిత్రలు' రాసిన, రాస్తున్న వారున్నారు. 'ఆంధ్ర సాహిత్య చరిత్ర', 'తెలుగు సాహిత్య చరిత్ర' అనే పేర్లతో సాహిత్య చరిత్రలను పేర్కొన్నారు. వాఙ్మయం అనే పదాన్ని కూడా సాహిత్యమనే పర్యాయ పదంగానూ, విస్తృతార్థంలోనూ 'ఆంధ్ర వాఙ్మయ చరిత్రలు' రాసిన వారున్నారు. ఆంధ్ర, తెలుగు అనేవి జాతిపరంగా కాకుండా, భాషాపరంగానే సాహిత్య చరిత్రకారులు ప్రయోగించడం గమనించ వలసి ఉంది. ఆరుద్ర కూడా, సమగ్ర ఆంధ్ర సాహిత్యం లో "ఆంధ్ర" శబ్దాన్ని భాషాపరంగానే స్వీకరించారని అర్థం చేసుకోవలసి ఉంది. కందుకూరి వీరేశలింగం, కవిత్వవేది, వంగూరి సుబ్బారావు, కాశీనాథుని నాగేశ్వరరావు, పింగళి లక్ష్మీకాంతం, ఖండవల్లి లక్ష్మీ రంజనం, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, దివాకర్ల వేంకటావధాని, వారణాసి వేంకటేశ్వర్లు మొదలైన వారంతా సాహిత్య చరిత్రలకి ఆంధ్ర శబ్దాన్ని ప్రయోగించడం భాషా పరంగానే జరిగిందినేది ఈ సందర్భంగా గమనించవలసి ఉంది.

జ.నాగయ్య, ఊటుకూరి లక్ష్మీకాంతం, కొర్లపాటి శ్రీరామమూర్తి, కె.కె.రంగనాథా చార్యులు, జి.వి.సుబ్రహ్మణ్యం, ద్వా.నా.శాస్త్రి వంటివారు సాహిత్య చరిత్ర, వికాస చరిత్రలకు తెలుగు పదాన్ని ప్రయోగించడం కూడా భాషాపరంగానే అని తెలుస్తుంది. ఆంధ్ర, తెలుగు శబ్దాలు జాతి, దేశ, భాషావాచకాలుగా ప్రయోగంలో ఉన్నప్పటికీ, ఆరుద్ర భాషాపరంగానే స్వీకరించారు. కనుక, 'ఆంధ్ర సాహిత్య చరిత్ర' అని పిలిచినా, 'తెలుగు సాహిత్య చరిత్ర' అని పిలిచినా తెలుగు భాషా,సాహిత్యాలకు చెందిన చరిత్ర అనే అర్థంలోనే స్వీకరిస్తున్నారు.

## 5.4. సమగ్ర ఆంధ్ర సాహిత్యం-సాహిత్యం

గ్రంథస్థవములైన వాటితోపాటు, వాగ్రూపంలో వెలసిన సర్వవిధాల రచనలు, సంభాషణలు, ఉపన్యాసాలు, పద్దులు, ఉత్తరాలు వంటివన్నీ, వాఙ్మయం లో చేరుతున్నాయి. కానీ, శాస్త్ర వాఙ్మయం, కావ్య వాఙ్మయం వంటి విభజన చేయడం వల్ల, కావ్య వాఙ్మయమే "సాహిత్యం" అనే వ్యవహారంలో కన్పిస్తుంది. పరిమితమైన అర్థంలో వాఙ్మయం,సాహిత్యం అనే శబ్దాలికి పర్యాయపదంగా మారింది[15].

లిఖితమైన లేక గ్రంథస్థమైనదంతా, అంటే శాస్త్ర గ్రంథాలు, పంచాంగాలు వార్తా పత్రికలు, శాసనాలు, నిఘంటువులు వంటి సర్వశాస్త్ర కావ్య సమూహాన్నంతటినీ సారస్వతమంటారని సాహితీ వేత్తలు భావిస్తున్నారు[16].

'సహితస్య భావః సాహిత్యమ్, హితేన సహితం సాహిత్యమ్' వంటి శ్లోకాల్లో, సాహిత్యం ధర్మం మొదలైన సకల శాస్త్ర రహస్యాలతో మిళితమైందని తెలుస్తుంది[17]. ప్రకృతి సత్యాన్ని సౌందర్యవంతం చేసి, ఆనంద పర్యవసాయిగా చిత్రించేది సాహిత్యమవుతుంది. అటువంటి సాహిత్యం మేలు చేకూరుస్తూ, ప్రీతి దాయకమై, నీతిని బోధిస్తుంది. జి.నాగయ్య అభిప్రాయంలో "సార్వజనీనము, సార్వకాలికమునయి కవి యొక్క ఆత్మీయతను స్ఫురింపజేయుచూ రసప్రధానములును, ఆనంద ప్రదములును నగు కావ్యజాలమే సాహిత్యమనబడును"[18].

ఈ చర్చను బట్టి వాఙ్మయ, సారస్వత, సాహిత్య శబ్దాలు మూడూ సామాన్యంగా పర్యాయపదాలుగా ప్రయోగించడం కన్పిస్తుంది.

ఆరుద్ర' సమగ్ర ఆంధ్ర సాహిత్యం లో 'సాహిత్యం' అనే శబ్దాన్ని కవుల రచనలు, వాటిలోని సౌందర్యాలను వివరించే అర్థంలోనే ప్రయోగించారు. తొ.ము. ముఖ చిత్రంలో 'తెలుగు సాహిత్య సౌరభ సౌందర్యాలకు వాచవి'గా పేర్కొనడం ఈ సందర్భంలో గమనించవచ్చు[19].

## 5.5. కవుల చరిత్ర-సాహిత్య చరిత్రః

కవుల చరిత్ర, సాహిత్య చరిత్రలకు ప్రత్యేకమైన అర్థాలు ఉన్నాయి. గురజాడ శ్రీరామమూర్తి, కందుకూరి వీరేశలింగం వంటివారు కవుల చరిత్రలను రాయగా, పింగళి లక్ష్మీకాంతం,కొర్లపాటి శ్రీరామమూర్తి వంటివారు సాహిత్య చరిత్రల పేరుతోనే రచించారు. జి.నాగయ్య 'తెలుగు సాహిత్య సమీక్ష' అని పేర్కొన్నారు. కవుల చరిత్ర అనడంలో కేవలం కవుల్నే కేంద్రంగా చేసుకొనే అవకాశం ఉంది. ఇక్కడ కవులు అంటే కేవలం పుంలింగానికి చెందిందనే అర్థంలోకాకుండా కవి, కవయిత్రినీ కలిపే 'కవులు' అనే విస్తృతార్థంలో ఈ పరిశోధనలో ప్రయోగిస్తుండటాన్ని గమనించాలి. అయితే, కవుల చరిత్ర అనడం వల్ల, సాహిత్యంలో గల మిగిలిన ప్రక్రియల చరిత్ర స్పృశించక పోయినా పట్టింపు ఉండదు. "ఒక రచన సృజింపబడుతున్నపుడే దాని స్వభావాన్ని అదే అభివ్యక్తం చేసుకొంటుంది.

అలా అభివ్యక్తమయ్యే కావ్యస్వభావం తర్కబద్ధంగా ఉంటుంది. దీన్ని అంగీకరిస్తే గతి తర్కాన్ని ఆశ్రయించి ఒక స్వరూప స్వభావాన్ని సంతరించుకొన్న రచన ఒక వర్గంగా పరిగణింప బడుతుంది. (వర్గాలుగా ఇంగ్లీషులో చెప్పబడేవి Mode,Type,Kind) అయితే, తార్కిక వివేచన విధానానికి కూడా ఒక స్వయం సమగ్ర మైన ప్రామాణిక లక్షణభావం ఉండాలి. అటువంటి తార్కికమైన వ్యవస్థగల రూప భావానికి ప్రకియ అని పేరు" అని ప్రకియను జి.వి.సుబ్రహ్మణ్యం నిర్వచించారు[20]. కానీ, సాహిత్య చరిత్ర అనడం వల్ల సాహిత్యంలో పద్య కావ్యాలు, గద్య కావ్యాలు, చంపూకావ్యాలు, మహాకావ్యాలు, లఘుకావ్యాలు, శాస్త్రకావ్యాలు, క్షేత్ర కావ్యాలు, కథా కావ్యాలు, చరిత్ర కావ్యాలు, సంగీత కావ్యాలు, స్వతంత్ర కావ్యాలు, శ్లేషకావ్యాలు, ద్వ్యర్థి కావ్యాలు, ద్విపద కావ్యాలు, ఉదాహరణ కావ్యాలు, శతకాలు, రగడలు, వీరగాథలు, యక్షగానాలు, కీర్తనలు, కృతులు, పదములు, ఆఖ్యాయికలు, కథానికలు, నవలలు, పాటలు, గేయాలు, ఏకాంకికలు, నాటికలు, నాటకాలు వంటి వన్నీ ప్రక్రియలకిందకే వస్తాయి ఈ సాహిత్య ప్రక్రియలన్నింటినీ గుర్తించి, వాటి స్వరూపస్వభావాల్ని గుర్తిస్తూ ఈ సాహిత్య చరిత్ర రాయవలసి ఉంటుంది. సాహిత్య ప్రకియల చరిత్రయే సాహిత్య చరిత్ర. కవుల చరిత్రకూ-సాహిత్య చరిత్రకూ మధ్యగల సామ్యభేదాల్ని కొర్లపాటి శ్రీరామమూర్తి కొంత వరకూ చర్చించారు[21].

కవుల చరిత్ర, కవుల కావ్య సంబంధమైన జీవిత చరిత్ర అయితే సాహిత్య చరిత్ర రచనా సంబంధమైన కావ్యాల చరిత్ర అవుతుంది.

## 5.5.1. కవుల చరిత్ర:

కవుల చరిత్రలలో కవుల కుల,మత గోత్రాది పుట్టుపూర్వోత్తరాలు ఉంటాయి. జన్మస్థలం, గమ్యస్థానాలు, బిరుదులు, సాధించిన ఘనకార్యాలు, రచించిన కావ్యాల వివరాలు, కాలనిర్ణయాలు, కర్తృత్వ నిర్ధారణలు, కావ్యంలో ఉండే కవితా శైలి, కొన్ని ఉదాహరణలు వంటివి ఉంటూ, కవి కావ్య చరిత్రాంశాలు ప్రాధాన్యతను వహిస్తుంటాయి[22].

## 5.5.2. సాహిత్య చరిత్ర:

కవుల చరిత్రలోని అంశాలు సాహిత్య చరిత్రకు ఉపోద్ఘాతప్రాయాలు వంటివి[23]. కావ్యంలో గల కవితా రీతులన్నింటినీ విశ్లేషణాత్మకంగా, సమన్వయ ధోరణిలో, విపులమైన ఉదాహరణలనిస్తూ, సాహిత్య పరిణామ వికాసాన్ని సాహిత్య చరిత్ర ప్రతిబింబిస్తుంది[24]. ఆనాటి సమాజానికీ, సాహిత్యానికీ మధ్యగల అవినాభావ సంబంధాన్ని, చారిత్రకనే పథ్యాన్ని 'సాహిత్య చరిత్ర' వివరిస్తుంది[25]. అనువాద పద్ధతుల్ని సోదాహరణంగా వివరిస్తుండటం, సమానధర్మం కల కవుల్ని సమానేతివృత్తం గల కావ్యాల్ని తులనాత్మకంగా పరిశీలించి, హేతువుల్ని వివరిస్తూ, సమన్వయం చేస్తూ, ప్రత్యేకతల్ని విశ్లేషిస్తుంది. కవి ఆత్మీయత కావ్యంలో ప్రతిఫలించినదాన్ని ఆవిష్కరిస్తుంది[26]. సమాజంలో ఎప్పటికప్పుడు వచ్చే వివిధ ఉద్యమాల్ని సాహిత్య చరిత్ర విశ్లేషిస్తుంది.

## 5.5.3. వాఙ్మయ చరిత్ర :

'సాహిత్య చరిత్ర' అనే అర్థంలోనే ప్రయోగించి, దీన్ని కొంతమంది ఇలా నిర్వచించారు. "ఒక భాషలో వాఙ్మయం ఎప్పటినుండి, ఎట్లు ప్రారంభమైనది, ఏ విధముగా వికాసము చెందినది, ఎన్నెన్ని పరిణామములకు లోనైనది అను అంశములను నిరూపించు ప్రయత్నమును వాఙ్మయ చరిత్ర అందురు'[27].

ఆరుద్ర సమగ్ర ఆంధ్ర సాహిత్యం కవుల, కావ్యాల చరిత్రాంశాలతో పాటు, కావ్యశైలీ రమ్యతనూ, కవుల, కావ్యాల పోలికల్ని, తేడాల్ని తులనాత్మకంగా విశ్లేషిస్తూ, ఆ రచన కవికర్తృత్వం, అంకితాది వివరాల్ని చర్చించింది. వీటన్నింటినీ పరిశీలించినపుడు, 'కవుల చరిత్ర' అనే కంటే, 'సాహిత్య చరిత్ర' గానే దీన్ని పరిగణించవలసి ఉంది. కవుల్ని పోషించిన వారిని గురించి, వివిధ ప్రక్రియల్ని గురించి, ఆయాయుగాల్లో ఉన్న విశిష్ట లక్షణాల్ని వివరించటం వల్ల కూడా సాహిత్య చరిత్ర అనే చెప్పవలసి ఉంది. ఆరుద్ర కూడా చాలా సందర్భాల్లో 'సాహిత్య చరిత్ర' అని చెప్పుకున్నారు. రోమన్ కేథలిక్కులలో చాలామంది పేర్లలో 'ఆనంద' విశేషణం కన్పిస్తుంది. మెకంజీ దొరకొలువులో ఒక ఆనందరావు ఉన్నాడు, 'వేదాంతరసాయనం' అనే క్రైస్తవ కావ్యం వర్ణించిన మంగళగిరి ఆనందకవి ఒకరున్నారు. బైబిలు అనువాదంలో ఒక ఆనందరావు కన్పిస్తున్నారు. ఈ ఆనందరావుల్ని గురించి వివరిస్తూ, "తెలుగు సాహిత్య చరిత్రలో చోటుచేసుకొందకి ఆనందరావు చేసిన అనువాద సహాయం ఒక్కటే చాలు" అని (స.ఆం.సా. ix పు.ము. 289) అనడంద్వారా, తాను "సాహిత్య చరిత్ర" నే రచిస్తున్నట్లు ఆరుద్ర భావిస్తున్నారని నిరూపితమవుతుంది. కానీ, కవుల చరిత్ర స్వభావాన్ని వీడలేని సాహిత్య చరిత్రను అందిస్తూ, వికాస చరిత్రకు మార్గాన్ని వేసేదిగా సమగ్ర ఆంధ్ర సాహిత్యాన్ని భావించడం మరింత సమంజసం! దీన్ని ముందుముందు మరింత వివరణాత్మకంగా సందర్భానుసారంగా వివరించడం జరుగుతుంది.

## 5.6. సాహిత్య చరిత్ర–"చరిత్ర" :

చరిత్రను ఆంగ్లంలో History గా పిలుస్తున్నారు. చరిత్ర వాస్తవానికి సంబంధించినదై ఉంటుంది. వాస్తవం బహిర్గతం కావడానికి వివిధ ఆకరాలు ఆధారమవుతాయి. ప్రతి వ్యక్తికీ, వస్తువుకీ, దేశానికీ చరిత్ర ఉంటుంది. అయితే అది వివిధ మార్గాల్లో వ్యక్తమవుతుంది. అలా వ్యక్తం కావడానికి ఆధారమైనవే ఆకరాలు (Sources). చరిత్ర అంటే వెంటనే స్ఫురించేది దేశ చరిత్ర. దేశ చరిత్రకు శాసనాలు, నాణేలు, కట్టడాలు, వాఙ్మయాధారాలు తోడ్పడుతుంటాయి. కొన్నిసార్లు కేవలం ఈ ఆధారాలు మాత్రమే వాస్తవ చరిత్రను ప్రతిబింబించలేవు. జన శ్రుతి కూడా చరిత్ర కు ఆధారంగా స్వీకరించవలసి ఉంటుంది. అంటే చరిత్ర కు పురావస్తు ఆకరాలు (Archeological Sources) వాఙ్మయాధారాలు (Literary Sources) వీటితోపాటు వాడకపు పనిముట్లు, అలంకారికంగా ఉపయోగించే వస్తువులు, కర్మకాండల సందర్భంలో వాడే సామాగ్రీ, సమాధులు మీద చెక్కే శాసనాలు వంటివాటిని శిలాశాసన ఆధారాలు (Epigraphical Sources)గా చరిత్ర కారులు భావిస్తున్నారు. చరిత్రకు ఆధారాలయిన

కొన్ని ఆకరాలతో నిర్మితమయ్యే దానిలో రాజుల పాలన, వారి వంశం వంటివి తెలిస్తే సరిపోదనీ, అనాటి సామాజిక జీవన విధానం కూడా ముఖ్యమనే చరిత్రకారులు కొంతమంది కన్పిస్తున్నారు. కొందరి దృష్టిలో, ఉత్పత్తి శక్తులలోనూ, ఉత్పత్తి సంబంధాలలోనూ క్రమానుసారంగా వచ్చే మార్పు లను కాలానుగతంగా వివరించడం చరిత్ర అవుతుంది[29]. మరికొంతమంది ఉత్పత్తి శక్తులతో, సంబంధాలతో సంబంధం లేకుండా, గత కాలంలో జరిగిన వాటిని సాక్ష్యాధారాలతో నిరూపించగలిగేది చరిత్రగా చెప్తున్నారు. చరిత్ర అంటే ఏమిటనే విషయంలో సాంఘిక శాస్త్రాల (Social Sciences) లో ముఖ్యంగా చరిత్ర (History) లో చాలామంది అనేక నిర్వచనాలిచ్చారు[30]. వీరందరూ వాఙ్మయాధారాలు (Literary Sources) కూడా చరిత్ర రచనకు అవసరమన్నారు. అయితే, దేశ చరిత్రకూ, సాహిత్య చరిత్రకూ మధ్య తేడా ఉంది. దేశచరిత్ర చాలా విస్తృతమైన అర్థంలో స్వీకరిస్తే, సాహిత్య చరిత్ర పరిమితార్థంలోనే ప్రయోగిస్తున్నారు. ఉత్పత్తి సాధనాలు, ఉత్పత్తి సంబంధాల్లో కాలక్రమంగా వచ్చిన పరిశోధనను చెప్పటమే దేశచరిత్ర అయితే, ఆ సంబంధాలు సాహిత్యంలో ఎలా ప్రతిబింబించాయో, దానికి అనుగుణంగా సాహిత్య రూపాలు ఎట్లా సంతరించుకున్నాయో చెప్పటమే సాహిత్య చరిత్ర' అనే వారూ ఉన్నారు[31]. అంటే దీన్నిబట్టి సాహిత్య చరిత్రలో ఉత్పత్తి సంబంధాల ప్రతిఫలనం కూడా జరుగుతుంటుంది. అయా చారిత్రక పరిస్థితుల్లో ఎటువంటి సాహిత్యం వచ్చిందో చెప్పగలగడం, అందులోనూ సామాజిక పరిణామాల ప్రతిఫలనం ఎంతవరకూ ఉందో పేర్కొనటం మార్క్సిస్టు దృక్పథంతో రాసే సాహిత్య చరిత్రకారుని ముఖ్యాంశమవుతుందనే పరిశోధకులు ఉన్నారు[32]. కవుల దేశకాలాదులను, గ్రంథ రచనా కాలాన్ని తెలుసుకోవడానికి చరిత్ర ఆధారమవుతుంది. ఆయా కావ్యాలు, ఆయా కాలాల్లో సృజించడానికి గల కారణాలైన సాంఘిక రాజకీయాది పరిస్థితుల్ని దేశ చరిత్రనుండే స్వీకరిస్తారు. కవుల గ్రంథాల్లో ఆయా కవుల పేర్లు, వారి పోషకుల చరిత్రలు తెలుస్తాయి. కవుల్ని పోషించిన రాజుల, మంత్రుల చారిత్రక పురుషుల కాలాల్ని బట్టి కవుల కాలాన్ని స్పష్టంగా తెలుసుకోవడానికి దేశ చరిత్రలు' సాహిత్య చరిత్ర కు దోహదమవుతుంటాయి. చరిత్ర, దేశ చరిత్ర, కవుల చరిత్ర, సాహిత్య చరిత్ర ల మధ్యగల అవినాభావ సంబంధాన్ని కొర్లపాటి శ్రీరామమూర్తి కింది విధంగా వివరించారు[33]. "సప్రమాణ నిరూపణాత్మకమైన యదార్థ గ్రథనమే చరిత్ర. సంభావ్యమైన సమన్వయము ఉపాధేయమే. దేశ చరిత్ర,కవుల చరిత్రకు కరదీపిక. కావ్యములలోని అవతారికలు, ఆశ్వాసాద్యంత పద్యగద్యములు కవుల చరిత్ర సాహిత్య చరిత్రకు సాధనము".

ఆరుద్ర, "సమగ్ర ఆంధ్ర సాహిత్యం" శీర్షికలో 'చరిత్ర' అనిలేకపోయినా 'సాహిత్య చరిత్ర' ఉంది. కవుల్ని పోషించిన రాజుల, మంత్రుల కాలాన్ని కావ్యాల్ని అనుసరించీ, రాజుల,మంత్రుల కాలాల్ని నిర్ణయించే ప్రయత్నం కన్పిస్తుంది. ఆ సాహిత్యం అలా రూపొందడానికి ప్రభావితం చేసిన అంశాల్లో రాజులపాలనను, సమాజ పరిస్థితుల్ని కూడా విశ్లేషిస్తూ, సాహిత్య క్రమ పరిణామాన్ని వివరించిడానికీ ప్రయత్నించారు. సమగ్ర ఆంధ్ర సాహిత్యంలో రాజులు, మంత్రుల రాజకీయాది విషయాల్ని చర్చించినా, అవి సాహిత్య చరిత్రకు తోడ్పడిన పరిస్థితులను వివరించడానికే జరిగాయి. ఈ అంశాలన్ని సమగ్ర ఆంధ్ర సాహిత్యం, 'సాహిత్య చరిత్ర' అనే విషయాన్ని ధృవీకరిస్తున్నాయి.

## 5.7. సాహిత్య చరిత్రకు ఆధారాలు :

సాహిత్య చరిత్రకు ప్రాథమిక ఆధారాలు (Primary Sources), మాధ్యమిక ఆధారాలు (Secondary Sources) అని రెండు రకాల ఆధారాలు ప్రధాన భూమికను నిర్వహిస్తుంటాయి[34]. ఏభాషలో సాహిత్య చరిత్ర వెలువడాలన్నా మొట్టమొదటి ఆధారం ఆ భాషలో లభించే గ్రంథాలే కవుల, కావ్యాల విషయాల్ని, ఆ భాషానుడికారం, పలుకుబడి, సొంతదనం, ఆ ప్రాంత పరిస్థితుల్ని అంటే స్థానికత (Nativity)ని ప్రతిబింబించే ఆ భాషాగ్రంథాలే ముఖ్యాధారాలవుతాయి.

తెలుగు సాహిత్య చరిత్రకు ఆధారాలు శాసనాలు, కావ్యావతారికలు, ఆశ్వాసాంతగద్యలు, లక్షణగ్రంథాలు, సంకలన గ్రంథాలు, గ్రంథాసూచికలు, చరిత్ర, జనశ్రుతి ముఖ్యాధారాలవుతున్నాయి[35]. తెలుగు కవులకు చారిత్రకదృష్టి తక్కువ ! కనుక, శాసనాలు కాలనిర్ణయాల్ని తెలుసుకోవటానికి ఎంతగానో తోడ్పడతాయి[36]. నన్నయకు పూర్వం ఉన్న భాషాస్థితిని తెలుసుకోవడానికి శాసనాలు తప్ప మరొక లిఖిత ఆధారంలేదని పరిశోధకులు భావిస్తున్నారు[37]. తెలుగు కవుల జీవిత చరిత్రల్ని తెలిపే చారిత్రక గ్రంథాలు లేకపోవటంవల్ల కావ్యావతారికల్లో కన్పించే కృతికర్త, కృతిభర్త, కావ్యేతివృత్తం, రచనా సంప్రదాయం వంటి అంశాల్ని అనుసరించి కవుల జీవిత చరిత్రల్ని గ్రహించవచ్చు[38]. సంకలన, లక్షణ గ్రంథాల్లో ఉదహరించిన పద్యాల్ని అనుసరించి కవులకాలం, రచనలకు ఊహించడానికి అవకాశం ఉంది[39]. ఆరుద్ర సమగ్ర ఆంధ్ర సాహిత్యంలో సాహిత్య చరిత్ర నిర్మాణం ఈ పద్ధతిలో చేయడం వల్ల చాలామంది కవుల్ని కనుగొనవలసిన ఆసక్తి కన్పిస్తుంది. ముద్రిత, అముద్రిత గ్రంథసూచికల్ని అనుసరించి కూడా కొంత మంది కవుల, రచనల్ని అన్వేషించే అవకాశం ఉంది. ఆరుద్ర ఈ పద్ధతిని అనుసరించి తంజావూరు సరస్వతీ మహలు వారి సూచికల్నీ, ఆంధ్ర సారస్వతపరిషత్తు వారి తాళపత్ర గ్రంథసూచికల్ని, మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండగార సూచికల్ని, లండను గ్రంథాలయంవారి సూచికల్ని అనుసరించి సాహిత్య చరిత్ర నిర్మాణానికి ప్రయత్నించారు. ప్రముఖ సాహితీవేత్తలు తెలిపిన అంశాల్ని గ్రహించి సాహిత్య చరిత్ర రాయడానికి ప్రయత్నించడం కూడా జనశ్రుతి ద్వారా సాహిత్యచరిత్రకూ ఆధారాల్ని సేకరించవచ్చునే విషయాన్ని నిరూపించారు. భారతి, ఆంధ్ర సారస్వత పత్రిక, కృష్ణాపత్రికలవంటి వాటిలో వచ్చిన వ్యాసాల్ని విరివిగానే వాడుకున్నారు.

### 5.7.1. పరిశోధన ఆకరాలు– ఆరుద్ర అవగాహన :

సాహిత్యచరిత్ర పరిశోధన పద్ధతుల గురించీ, ఆకరాల సూచించవలసిన ఆవశ్యకతను గురించి ఆరుద్ర వివిధ సందర్భాల్లో చెప్పారు. కర్నూలు జిల్లా ఎర్రగుడిపాడు లో అశోకుని శిలాశాసనాలు త్రవ్వకాల్లో బయటపడినట్లు **1929** జూన్ **11**వ తేదిన ఒక వార్త వెలువడింది. ఆ వార్త చదివి స్పందించిన పరిశోధకుల గురించి చెప్తూ ఆరుద్ర "చరిత్ర పరిశోధనకే జీవితాన్ని అంకితం చేసిన మల్లంపల్లి సోమశేఖర శర్మగారు, *పరిశోధనా* పద్ధతులను పకడ్బందీగా తీర్చిదిద్దిన నేలటూరి వెంకట రమణయ్యగారు వెను వెంటనే ఎర్రగుడికి వెళ్ళారు" ని రాశారు (వ్యా.పీ.పు.10) దీనిలో 'పరిశోధన పద్ధతి' గురించిన ప్రస్తావన ఉంది. శాతవాహనుల్ని తెలుసుకోవడానికి నాణాల వల్ల కొత్త సమాచారం

దొరుకుతుందన్నారు. (వ్యా.పీ.పు.10) దీనిలో 'పరిశోధన పద్ధతి' గురించిన ప్రస్తావన చేశారు. శాతవాహనుల్ని తెలుసుకోవడానికి నాణాల వల్ల కొత్త సమాచారం దొరుకుతుదన్నారు.(వ్యా.పీ.పు.20) "పరిశోధకుడు విధానమే ప్రధానమనుకొంటాడు. ఆవేశంకన్న సంయమనం ప్రదర్శిస్తాడు". (గు.గు.పీ.పు.107) అని బంగోరే గురించి ఆరుద్ర చెప్పడంలో Methodology ప్రస్తావన కన్పిస్తుంది. కనీసం పరిశోధనకు ఒకవిధానం అవసరం అనేది గుర్తించారని తెలుస్తుంది. "ఇటీవల చేసిన *చారిత్రిక పరిశోధనల* వల్ల వేమన కాలాన్ని ఇతిమిద్ధం అని నిర్ణయించడానికి నాకు కొన్ని ఆధారాలు దొరికాయి" (మ.వే.పు.4) అనడంలో పరిశోధనకు "ఆధారాలు" కావాలనేది ఆరుద్ర గుర్తించిన అంశం. మరొకచోట పరిశోధన గురించే ప్రస్తావిస్తూ "గంథం అప్పారావు గారు ఈ చౌడప్ప పద్యాన్ని ఏతాళపత్ర ప్రతిలో చూశారో, అది ఎక్కడ ఉందో, దాని నెంబరేమిటో, అందులోని పద్య సంఖ్య ఏమిటో మొదలైన వివరాలేం చెప్పలేదు. ఇటువంటి రుజువులూ,సాక్ష్యాలూ చూపించడం సాహిత్య పరిశోధక మర్యాద" (మ.వే.పు.30) అన్నారు. సమగ్ర ఆంధ్ర సాహిత్యం (పు.ము. Viii-139) లో ఒక సందర్భంలో "పరిశోధక క్షీరకంతులు" అని ప్రయోగించారు. మరొక చోట (పు.ము I పు.251) లో "ప్రామాణిక చరిత్రకారులు తమకు దొరికిన ఆకరాలను, ప్రమాణాలను అడుగడుగునా అధోజ్ఞాపికలలోనైనా చెప్పడం అవసరం" అన్నారు. ఇవన్నీ పరిశోధన పట్ల ఆరుద్రకున్న అభిప్రాయాలు.

సమగ్ర ఆంధ్ర సాహిత్యం మొదటి సంపుటిలో(పు.ము) తెలుగు భాషాస్థితిని శాసనాల ఆధారంగా నిర్ణయించారు. (పు.5) శాతవాహనుల కాలంనాటి పాటల్ని, పద్యాల్ని నాణేల్ని ఆధారంగా చేసుకొని పద్యఛందస్సుల్ని విశ్లేషించారు (పు.29) ప్రత్యక్షంగా శాసనాల్ని, నాణేల్ని పరిశీలించినట్లు మెకంజీ గురించిన పరిశోధనలో ఛాయా చిత్రాలతో సహా వివరించారు[40]. కానీ, అన్ని శాసనాల్ని మళ్ళీ చదవాలంటే సమయం సరిపోదు. కనుక, కుందూరి ఈశ్వరదత్తు, 'ప్రాచీనాంధ్ర భూగోళం', బూదరాజు రాధాకృష్ణ 'ప్రాచీనాంధ్ర శాసనాలు' రాయప్రోలు సుబ్రహ్మణ్యం "అశోకుని ఎఱ్ఱగుడి పాడు శిలా శాసనాలు" వేపారామేశం పంతులు 'తెలంగాణా శాసనాలు' మొదలైన వాటిని ఆధారం చేసుకొని ప్రాచీన ఆంధ్ర భాషా పరిణామాన్ని వివరించారు. భద్రిరాజు కృష్ణమూర్తి సంపాదకత్వంలో వెలువడిన 'తెలుగు భాషాచరిత్ర' వంటి ప్రామాణిక గ్రంథాల్ని భాషా విశ్లేషణలకు ఆధారంగా గ్రహించారు. కొన్ని శాసనాల్లో భాషను కూడా ఉటంకించారు. (పు.ము I -పు.154) శ్రీనాథుని గురించి కూడా శాసనాధారాలతో విశ్లేషించారు. సింహాచల శాసనం లో 'కన్నడదేశంలోని సంబురాయుని కొడుకు' అని ఉంది. దీనిలో ఉన్న "రాయుని" విషయమై పరిశోధించి, ఆంధ్ర విష్ణువు తెలుగురాయుడు. వ్యక్తులకేకాక గ్రామాలకు కూడా ఈ పేరు ఆరోజుల్లో ఉండేది. సంపరాయుడు అశ్వారూఢుడైనపుడు చూసి ఒక పద్యం వర్ణించినట్లు చెప్పారు. దీన్నిబట్టి స్థల పరిశోధన ను శాసనాధారాలతో కొనసాగించారు. (పు.ము III-పు.309). వివిధ రాజుల స్థలకాల స్పష్టతకు సాహిత్యేతర పరిశోధన పద్ధతిలో 'భౌగోళిక పటాల్ని' ఇవ్వడం కూడా కన్పిస్తుంది.

ఆరుద్ర, సమగ్ర ఆంధ్ర సాహిత్యాన్ని నిర్మించడంలో కావ్యావతారికల్ని, ఆశ్వాసాంత గద్యల్ని, లక్షణ గ్రంథాల్ని సంకలన గ్రంథాల్ని కూడా విరివిగానే ఉపయోగించుకున్నారు. నన్నయ భారతాన్ని తెలుగులోనికి తేవడానికి చేసిన కృషి అంతా 'ఆంధ్ర మహాభారత కావ్యావతారిక' వల్లనే స్పష్టమవుతుంది.

(పు.ము I పు.146) దీన్ని శాసనాధారాలతోనూ, నారాయణభట్టు గురించి చారిత్రక ఆధారాలతోనూ వివరించారు. నన్నెచోడుడు కుకవినిందలో కొంతమందిని ఈగలతో పోల్చగా, తర్వాత కవులు 'మక్కికి మక్కి' అనుసరించారనడం (పు.ము.I–పు.192) లో కావ్యావతారికల్ని ఆధారంగా తీసుకోవడం కన్పిస్తుంది. వస్తు కవితను గురించి కూడా కావ్యావతారికలోనే నన్నెచోడుడు చెప్పాడు. మడికి సింగన సంకలనం చేసిన 'సకలనీతి సమ్మతం' లో ఉన్న పద్యాల్ని బట్టే పంచతంత్రాన్నీ, కామందకాన్ని కాకతీయ యుగంలోనే ఎవరో అనువాదం చేశారని తెలుస్తుందని (పు.ము.II పు.11) ఆదిశగా పరిశోధన కొనసాగించారు. దీన్ని ఆధారంగానే తెలుగు క్షేమేంద్రుడునీ (పు.ము.II పు.40) అప్పనమంత్రి (పు.130) వంటివారెందరి గురించో 'సాహిత్య చరిత్ర' రాయడానికి ఆ పద్యాల్ని ఆకరాలుగా తీసుకున్నారు. భీమఖండంలో శ్రీనాథుడు మొట్టమొదటి అవతారికలో రాధాకృష్ణుల ప్రసక్తిని తెచ్చి, రాధా మాధవ శృంగారాన్ని తెలుగులోకి తెచ్చిన ఘనత శ్రీనాథుడికే దక్కుతుందని (పు.ము III పు.323) అనడంలో కావ్యావతారికల్ని ఆకరాలుగా స్వీకరించడం చూడవచ్చు. వేటూరి ప్రభాకరశాస్త్రి 'ప్రబంధ రత్నావళి' నుండి కొన్ని పద్యాల్ని బట్టి సాహిత్య చరిత్ర నిర్మించడానికి ప్రయత్నించారు. లక్షణ గ్రంథాలలో అప్పకవి ఉదహరించిన పద్యాల్ని అనుసరించి కొంతమంది కవుల్ని నిర్ణయించడానికి ప్రయత్నించారు. ఆ కవుల జాబితా పు.ము III–357ని బట్టి ఏయే సంపుటాల్లో ఆకవుల్ని ఉదహరించారో శాస్త్రీయంగా పట్టిక రూపంలో ప్రకటించారు. ప్రాచ్యలిఖిత గ్రంథాలయాల్లోని తాళపత్ర గ్రంథాల్ని, కూడా పరిశీలించినట్లు ఆరుద్ర పేర్కొన్న పాదసూచికలు తెలియజేస్తున్నాయి. మహాభారతం, ప్రబంధాలు వంటి వాటి విషయంలో కావ్యాల్ని ప్రాథమిక ఆకరాలుగానే గ్రహించారు. జమీందారీ యుగం వచ్చేసరికి ఆంగ్లేయుల లేఖలూ, డైరీలు, వివిధ జర్నల్స్‌లో వచ్చిన రిపోర్టులు, లేఖలు, కైఫీయత్తుల్ని, ఆ కాల పాలనకు సంబంధించిన గెజిటీర్లను ప్రాథమిక ఆకరాలుగా తీసుకున్నారు. ఆ పాలనా కాలాన్ని పరిశోధించిన గ్రంథాల్ని కూడా స్వీకరించారు. కుంఫిణీయుగానికి మంగమ్మ పరిశోధననూ, బ్రౌన్ పై జరిగిన పరిశోధనల్లో కొత్తపల్లి వీరభద్రరావు పరిశోధనల్ని ద్వితీయ ఆకరాలు (మాధ్యమిక ఆకారాలు)Secondary Sources గానూ తీసుకున్నారు. నేలటూరి వారు సమగ్ర ఆంధ్ర సాహిత్యంలో ఆరుద్ర స్వంత అభిప్రాయాలు కనబడవనీ, సెకండరీ సోర్సులతోనే సంతృప్తి పడ్డారని విమర్శించారు[42]. సాహిత్య చరిత్ర రచించేటప్పుడు ప్రతికవి రచననీ పట్టి చూసి రాయడమంటే చాలా కష్టం. ఒకవేళ ముద్రితప్రతి దొరికినా, దాన్నే ప్రాథమిక ఆకరం (Primary Sources) గా భావించడానికి అవకాశం ఉందా? నిజంగా ఆలోచిస్తే కవిస్వీయదస్తూరితో రాసిన అముద్రిత ప్రతే ప్రాథమిక ఆకరం అవుతుంది. ఇలా చూడాలంటే ఎన్నింటికి సాధ్యమవుతుంది! కొంతమంది స్వయంగా రాయకుండా చెప్తుంటే లేఖకులు రాస్తూంటారు.

ముద్రణావకాశాలు లేని రోజుల్లో కావ్యాల 'ప్రతికలు' తయారీలో అనేక పాఠాంతరాలు రావడానికి కారణమైంది. 'పాఠ పరిష్కరం' పరిశోధనకు అవసరమయ్యింది. కనుక, ప్రాథమిక ఆకరం అనేదాన్ని నిర్ణయించడంలో కొన్ని ఇబ్బందులున్నప్పటికీ గుర్తించవచ్చు. అన్నింటినీ ప్రాథమిక ఆకరాల్నే చూడాలంటే సాధ్యమవుతుందా? అనేదే ప్రశ్న. అయినప్పటికీ, చాలా వాటికి అముద్రిత గ్రంథాల్ని, తాళపత్ర ప్రతుల్ని సేకరించి పరిశీలించారు. పాదసూచికల్లో ఆరుద్ర పేర్కొన్న వివరాలే వీటిని తెలుపుతున్నాయి.

తా.ము.లో కంటే పు.ము.లో మరింతగా ప్రాథమిక ఆకరాల ప్రత్యక్ష పరిశీలనకు ప్రయత్నించినట్లు తెలుస్తుంది. అభ్యుదయ రచయితలు ప్రకటించిన మేనిఫెస్టోను బ్రిటన్‌లోని బర్మింగ్‌హాం గ్రంథాలయంలోనూ, లండన్‌లోని కమ్యూనిస్టు పార్టీ ఆఫ్ గ్రేట్ బ్రిటన్ కార్యాలయంలోనూ, మార్క్స్ మెమోరియల్ లైబ్రరీలోనూ వెతికి సేకరించారు. దీన్ని పదమూడవ సంపుటి - అనుబంధం II (పు.395) లో చూడవచ్చు. తాళ్ళపాక 'తిమ్మక్క' 'తిమ్మప్ప' అనే పాఠాంతర సమస్య వచ్చినపుడు వేటూరి ప్రభాకర శాస్త్రి పరిష్కరించిన గ్రంథాన్ని, తిరుమల తిరుపతి దేవస్థానంలో గల తాళపత్ర ప్రతుల్ని, అధ్యయనం చేసే, తిమ్మక్క తులనాత్మకంగా గురించి తన నిర్ణయాన్ని ప్రకటించారు[43]. అన్నింటినీ ఈ పద్ధతిలో చేయాలంటే సాధ్యంకాదు. శాసనాల్ని ప్రకటించి గ్రంథరూపంలో వివరణలతో సహా పురావస్తుశాఖవారు అందుబాటులోకి తెస్తున్నారు. అవి ప్రాథమిక ఆధారాలు కాదని అసలు శాసనాన్ని చూడాలనుకొంటే, దానిలోని భాషను అర్థంచేసుకోవడానికే చాలాకాలం పడుతుంది. కనుక, ఆరుద్ర సమగ్ర ఆంధ్ర సాహిత్యం రచించేనాటికి అందుబాటులో ఉన్న సాధ్యమైనంత ప్రామాణికత్వం ఉన్న గ్రంథాల్ని ఆకరాలుగా స్వీకరించినా, ఆ వివరాల్ని పాదసూచికల్లో పేర్కొన్నారు. ఆ గ్రంథకర్తలు పేర్కొన్న సిద్ధాంతాల్ని, అభిప్రాయాల్ని అన్నింటినీ అంగీకరించేయడమో, పూర్తిగా తిరస్కరించడమో చేయలేదు. సంయమన పూరణను చేశారు. కొన్నింటిని పరిశోధకుల నిర్ణయానికే వదిలేశారు. అయితే, కొంచెం ప్రయత్నిస్తే, గ్రంథాన్ని స్వయంగా చూసి రాయగలిగే అవకాశం ఉన్నవాటిని కూడా పత్రికల్లో వచ్చిన వ్యాసాల్ని ఆధారం చేసేకొని పరిశోధన ను కొనసాగించడం వల్ల ఆకరాల నిర్ణయంలో ప్రామాణికత్వానికి అనుమానం ఏర్పడడానికి అవకాశం ఏర్పడింది. మొల్ల గురించి పేర్కొంటు 'భారతి' లో వచ్చిన వ్యాసాల్ని తన రచనా కౌశలంతో పునర్మించేశారు[44]. మడికి సింగన కాలాన్ని కూడా ఇలాగే చేశారు. ఇలాంటి కొన్ని చిన్న చిన్న లోపాలున్నా, 'ఆకరాల' విషయంలో సాహిత్య చారిత్రకారుడికి కావలసిన ఆకరాల్ని ఆరుద్ర గుర్తెరిగే రచనకొనసాగించారు. దివాకర్ల వేంకటావధాని కూడా సమగ్ర ఆంధ్ర సాహిత్య రచనలో ఆంతరంగిక సాక్ష్యాల్ని వివరిస్తూ ఆరుద్ర చేసిన కృషిని శ్లాఘించారు[45].

## 5.8. సాహిత్యయుగం సమస్యలు-ప్రమాణాలు :

సాహిత్య చరిత్రనైనా, పరిణామాన్నైనా, వికాసాన్నైనా అవగాహన చేసుకోవడానికి ఒక పద్ధతి అవసరం. అది కాలాన్ని అనుసరించి గాని, ఆ కాలాన్ని ప్రభావితం చేసిన అంశాన్ని బట్టి గాని నిర్ణయించే అవకాశం ఉంది. సాహిత్య యుగ నిర్ణయానికి ప్రమాణాల్ని గ్రహించటంలో కొన్ని సమస్యలు తలెత్తుతున్నాయి. కాలాన్ని అనుసరించటం, లేదా ప్రక్రియలను ఆధారంగా విభజన చేయటం జరిగితే కాలాన్ని ఎక్కడనుండి ఎక్కడివరకూ ఒక యుగం గా గుర్తించాలనే విషయంలో సమస్య ఏర్పడుతుంది.

ప్రక్రియలను అనుసరించి గుర్తించాలంటే, సాహిత్యంలో ప్రాచీన కాలంలో కొన్ని ప్రక్రియలే ప్రాధాన్యత వహించినా ఆధునిక కాలంలో అనేక ప్రక్రియలలో సాహిత్యం వెలువడుతుంది. 'ప్రాచీన, ఆధునిక' అనడంలోనే కాలాన్ని అనుసరించటం, మళ్ళీ ఆధునికత విషయంలో ఏకాభిప్రాయం లేకపోవటం కూడా సమస్య అవుతుంది. ఆధునికత కాలవాచిగాకాకుండా, అదొకతత్త్వంగా భావించేవారున్నారు.

వేటికి ఆధునికంగాకన్పించేది కొన్నాళ్ళకు ప్రాచీనమవుతుంది. మళ్ళీ ఆధునికంగా ఆ నాటికి ఉన్న ప్రమాణాలు వేరుగా ఉంటుంటాయి.

కవుల్ని అనుసరించి యుగ విభజన చేయాలంటే ఎంతోమంది కవులు ఉంటున్నప్పుడు, ఏ కవిని ప్రమాణంగా తీసుకోవాలనేది సమస్య అవుతుంది. కవుల్ని పోషించిన వారిని ప్రమాణంగా తీసుకొని వారి పేరుతో యుగవిభజన చేయాలని భావిస్తే, పోషకులు లేని ఎంతోమంది ఉత్తమ సాహిత్యాన్ని సృజించారు. పోషకులకీ, వారి రచనలకీ ఎలాంటి సంబంధం కనిపించదు.

ఇవన్నీ సాహిత్య యుగ నిర్ణయంలో ప్రమాణాలుగా తీసుకోవటంలో కన్పించే సమస్యలు. అందువల్లనే తెలుగులో కవుల చరిత్రలు, సాహిత్య చరిత్రలు రచించినవారందరూ వారి వారి సానుకూలతను బట్టి యుగ విభజన చేసినవారే గాని, ఏకాభిప్రాయంతో యుగవిభజన ఇలాగే ఉండాలనే ప్రమాణాలనేమీ శాసించలేకపోయారు. తెలుగు సాహిత్య చరిత్రకారుల్లో యుగవిభజన విషయంలో ఏకాభిప్రాయం లేకపోవడానికి మరొక కారణం, సాహిత్య చరిత్రనే శాస్త్రీయ దృక్పథం తో పరిశీలించక పోవడమేననేవారూ ఉన్నారు[46]. ముందుగా, యుగ విభజన చేసుకొని తర్వాత చరిత్ర రాయకూడదనీ, త్రిపురనేని మధుసూధనరావు అభిప్రాయపడుతున్నారు. సాహిత్య చరిత్ర రచనలో కాలాన్ని దృష్టిలో పెట్టుకోవడం అవసరమేకానీ, కాలానుక్రమయుగ విభజన పురోగమనాన్ని ఆవిష్కరించలేదు. ఒక కవికీ తదనంతర కవికీ సంబంధాల్లో విరంతరాయుతా ఉల్లంఘనన్ని వివరించేటప్పుడు వాటికి మూలమైనరాజకీయ,తాత్త్విక, ఆర్థిక కారణాల్ని ప్రదర్శించాలని వీరి అభిప్రాయం. యుగాల్ని రాసేటప్పుడు చరిత్ర గమనం దృష్టిలో ఉండాలి. ప్రతియుగంలోనూ విభిన్న స్రవంతులు కలిసి ఉంటాయి. కొన్ని ప్రక్రియలు చాలాయుగాల్లో కొనసాగుతున్నట్లు కనిపించినప్పటికీ, అవి విభిన్న యుగాల్లో విభిన్న సామాజిక ప్రయోజనాల్ని నిర్వహిస్తాయి. అందుకనే నిర్దిష్ట విషయాన్ని నిర్దిష్టంగా విశ్లేషించాలి. నిరంతరమైన పరస్పరమైన మార్పుల్ని పరిగణనలోకి తీసుకోవాలి. అనడంలో మార్క్సిస్టు దృక్పథంతో యుగవిభజన కొనసాగాలనే ఆలోచన కన్పిస్తుంది.

తెలుగు సాహిత్య ఆవిర్భావ, వికాసాలను తెలుసుకోవటానికిగాని, గుర్తించడానికి గాని యుగ నిర్ణయ సమస్యను దృష్టిలో ఉంచుకొని సాహిత్య, సాహిత్యేతర ప్రమాణాలపై ఆధారపడటమూ కన్పిస్తుంది. ఒక విధమైన ధోరణి కలిగిన సాహిత్యం రూపొందడానికి ప్రేరణనిచ్చే అంశాలు ఆ సమాజంలో జరిగే వివిధ సంఘటనలపైనా, ఆ కాలం పరిపాలనా విధానాలవల్ల, ప్రపంచ వ్యాప్తంగా కలుగుతున్న మార్పులవల్ల సంభవిస్తుండవచ్చు. వీటిని ప్రమాణాలుగా గ్రహించి నిర్దుష్ట కాలపరిమితిని లేదా నిర్దిష్ట సంఘటనను ఆధారంగా తీసుకొని దానిని సాహిత్యంలో యుగం గా విభజించటానికి అవకాశం ఉంది. సాహిత్యంలో ఒక్కోసారి ప్రక్రియగాని, కవిగాని తీవ్ర ప్రభావాన్ని చూపవచ్చు. కొన్నిసార్లు అన్ని ప్రక్రియలకూ, ఆ కాలంలో ఉన్న కవులకీ సమాన ఆదరణ లభించవచ్చు. ప్రభావిత అంశమే "యుగం" విభజన నామకరణకు గురవుతుంది.

## 5.8.1 సాహిత్య యుగం-నిర్వచనాలు:

యుగం అనేది ఆంగ్లంలో "Age" అనే అర్థంలో వ్యవహరిస్తున్నారు. ఆంగ్ల సాహిత్య చరిత్ర లో యుగాల్ని "Ages" అనడం కన్పిస్తుంది. సాహిత్య చరిత్రలో యుగం సాహిత్య పరిణామ సూచికాలైన కాలమానములు[47] వాఙ్మయంలో యుగాల్ని ఒకే దృష్టితో విభజించాలనే నియమమేమిలేదు. వాఙ్మయ చరిత్ర కారులు తమ అభిరుచిని బట్టి సౌకర్యం కోసం ఎలాగైనా యుగ విభజన చేసుకోవచ్చు[48]. ఇటువంటి సాహిత్య యుగాన్ని సాహిత్య చరిత్రకారులు నిర్వచించడానికి ప్రయత్నించారు. పింగళి లక్ష్మీకాంతం, ఆంధ్రసాహిత్యచరిత్ర లో సాహిత్య యుగకర్త గురించి కింది విధంగా వివరించారు[49].

"ఎవని పేరుమీద ఒక కాలమునకవి వంశము ప్రతిష్ఠ సంపాదించునో, ఎవని నడచిన మార్గ మును అర్వాచీనులు శిష్యప్రాయులుగా ననుసరిం చెదరో, ఎవని అవతారమునకై ఆకాలమువందలి పూర్వకవుల సాధన తపః ప్రాయమగునో, ఎవడు సూత్రధారుడై కావ్య సరస్వతిని నూత్న వేషముతో అలంకరించి రంగమున ప్రవేశపెట్టునో, ఎవడు క్షీణదశయందున్న వాఙ్మయమును నూత్న మార్గము దొక్కిశక్తిమంతము చేయునో అతడు యుగ కర్త అనిపించుకొనును. ఆయాకాలములయందు వాఙ్మయమున శైలిలో ప్రకియలో, వస్తు స్వీకారములో కలిగెడి రూప పరిణామమునకు అతడే కర్తయు, చరిత్రను విభాగము చేయుట సమంజసమైన పద్ధతి..... అవసరమైనచో ఒక కాలమున సర్వోన్నతుడు అని చెప్పదగిన కవి కానరాక సమస్కంధులు పెక్కురున్నప్పుడు ఆ కాలమునకు ఇంకొక పేరు వాడవచ్చును".

ఎవరు తమ రచనల ద్వారా వర్తమాన కాలమునకే కాక భవిష్యత్తరముల వారికి అభినవోత్తేజము కల్గింతురో, ఎవరు గతానుగతికమైన ఘనీభవించిన భావ ప్రపంచములో ఉదాత్తమైన ఉద్దీపనము కలిగింతురో, ఎవరు తమతరువాత అనేక కవులకు అనుకరణీయము లౌదురో వారిని సాహిత్య రంగమున యుగకర్తలనవచ్చును. అని యుగ విభజన ప్రస్తావనను సినారే చేశారు. [50]

జి.వి.సుబ్రహ్మణ్యం సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు లో సాహిత్యయుగం గురించి చెప్తూ 'మార్పుగా, నవ్యతగా వెలువడే ప్రయోగాలు ఒక సంప్రదాయాన్ని నెలకొల్పే వరకూ సాగిన కాలాన్ని సాహిత్యయుగం'గా పరిగణించవచ్చు నన్నారు[51].

జి.నాగయ్య 'తెలుగు సాహిత్య సమీక్ష'లో ఈ విషయాన్ని నిర్వచిస్తూ 'కొన్ని విశిష్ట సమాన ధర్మములు గల ఒక కాలపరిమితి, వాఙ్మయ చరిత్రమున కొన్ని విశిష్ట లక్షణములు గల వాఙ్మయము ప్రారంభించిన దాదిగా మరలనట్టి ప్రాధాన్యము నశించి క్రొత్తదియగు భిన్న వర్గమునకు చెందిన లక్షణములు గల వాఙ్మయము ప్రారంభించు వరకు గల కాలమును యుగమనవచ్చును' అన్నారు[52].

ఈ నిర్వచనాల్లో ప్రభావిత అంశాలు, సాహిత్య అభివృద్ధి, వికాసం, కాలపరిమితి, వంటి విశిష్ట లక్షణాలు సాహిత్యయుగంలో ప్రాధాన్యాన్ని వహిస్తుంటాయని, దాన్ని అనుసరించే సాహిత్య చరిత్రకారులకు ఉండే దృక్పథాన్ని బట్టి యుగ విభజన చేస్తుంటారని స్పష్టమవుతుంది.

## 5.8.2. కవుల, సాహిత్య చరిత్రలు–యుగ విభజన:

తెలుగులో కవుల చరిత్రలు, సాహిత్య చరిత్రలు వెలువడినప్పటికీ, వీటిలో యుగ విభజన ఒక్కొదానిలో ఒక్కో విధంగా ఉంది.

1829 లో కావలి రామస్వామి రచించిన Biographical sketches of Deccan poets' లో యుగ విభాగాన్ని పాటించకుండా తమకి తెలిసిన కవుల్ని గురించిన సమాచారాన్ని ఇవ్వడమే రచనా పద్ధతిగా కన్పిస్తుంది[53].

1893 లో వెలువడిన గురజాడ శ్రీరామమూర్తి "కవిజీవితములు" లో భారతాంధ్రకవులు, రామయణాంధ్ర కవులు, ఆంధ్ర పంచ కావ్య కవులు, ఆంధ్ర ద్వ్యర్థికావ్యకవులు, ప్రౌఢ ప్రబంధకవులు, పురాణ కవులు అని ప్రక్రియాపరమైన యుగ విభాగం కూడా చేశారు. ఇదికూడా చారిత్రకమైన ఆధారాలతో ప్రామాణికంగా జరిగిన రచనగా పరిశోధకులు భావించడంలేదు[54].

1917 లో కందుకూరి వీరేశలింగం "ఆంధ్ర కవుల చరిత్రము" మూడు భాగాలుగా విభజించి, పూర్వకవులు, మధ్య కవులు, ఆధునిక కవులు అని విడివిడిగా ప్రచురించారు. కందుకూరి ఆధునికులని చెప్పిన ఒక్క కవికూడా ఆధునికుడు కాడనీ, ఈ యుగ విభజన ఏ విధంగానూ సమర్థనీయం కాదన్నవారున్నారు[55]. కానీ, ఈ రచనలో గల విశిష్ట లక్షణాల్ని ఆహ్వానిం నవారూ ఉన్నారు[56].

1920 లో వెలువడిన వంగూరి సుబ్బారావు "ఆంధ్ర వాఙ్మయ చరిత్ర" లో మొదటి భాగాన్ని నన్నయ పూర్వ యుగంగాను, రెండవభాగాన్ని నన్నయ తరువాత యుగంగాను విభజించారు. మొదటి భాగంలో ఆంధ్ర భాష, వాఙ్మయం వంటి విషయాల్ని, రెండవభాగంలో పురాణాలు, ప్రబంధాలు, ద్విపద కావ్యాలు, వీరగీతాలు, గేయాలు శతకాలు, వచన కావ్యాలు....అని ప్రక్రియాపరమైన యుగ విభాగం చేశారు[57].

1928 లో కవిత్వవేది (కల్లూరి వేంకట నారాయణరావు) రచించిన "ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహము" ఆంగ్ల సాహిత్య ప్రభావంతో రచించినట్లు గ్రంథకర్త మాటల్ని బట్టి తెలుస్తుంది. గ్రంథాన్ని మొత్తం అయిదు ఖండాలు ( అధ్యాయాలు) గా విభజించి, ప్రతి అధ్యాయాన్ని యుగాలవారిగా విభజ ంచారు. ప్రథమ ఖండంలో – అజ్ఞాతయుగాన్ని, ద్వితీయఖండంలో చాళుక్య యుగం, కాకతీయుల యుగం, తృతీయ ఖండంలో రెడ్డి, నాయక, కర్ణాటక యుగాలు, చతుర్థ ఖండంలో మధ్యమయుగం, సంధియుగం, పంచమ ఖండంలో నవయుగం అనే విధంగా విభజించారు[58]. 1928 నాటికే ఒక పరిశోధనా విధానాన్ని (Methodology) పాటించిన గ్రంథంగా దీనికి పరిశోధకులు భావిస్తున్నారు[59].

1932 లో బసవరాజు అప్పారావు "ఆంధ్ర కవిత్వ చరిత్రము" లో రసభావాల్ని అనుసరించి ఆరు విభాగాలు చేశారు. అవి 1. రసాత్మకం వాక్యం కావ్యమ్, 2. రస స్వరూప నిరూపణము 3. మానవ ధర్మమున రసము దేనినాశ్రయించకొనెను 4. అనంతోవైరపః 5. భావనలు, భావనాశక్తి 6. భావ

ప్రకటనము అని ప్రాచ్య, పాశ్చాత్య విమర్శకుల, లాక్షణికుల సాహిత్య సిద్ధాంతాల్ని సమన్వయాత్మకంగా పొందుపరిచారు[60].

1946 లో ప్రారంభించి 1971 నాటికి 14 సంపుటాలుగా "ఆంధ్రకవితరంగిణి" ని చాగంటి శేషయ్య వెలువరించారు. కవుల్ని వివరించడం, రాజవంశాలవర్ణనలతో నిండినరచన, అనవసరమైన ప్రసంగాలతో, దీని ఆకారాన్ని పెంచారేతప్ప, దీని వలన సాహిత్య లోకానికి కొత్తగా చెప్పిందేమీలేదనే విమర్శకు గురైన రచన[61]. కానీ, దీనిలో స్థల, కాల, కర్తృత్వ చర్చల్ని ఆరుద్ర చాలావరకూ పరిశీలనకు తీసుకున్నారు.

1929 లో ప్రథమముద్రణలో కాశీనాథుని నాగేశ్వరరావు "ఆంధ్రవాఙ్మయ సూచిక" ప్రచురించారు[62]. ఈ సూచికకు ముందు ఒక సుదీర్ఘ పీఠికను రచించారు. దీన్నే తర్వాత కాలంలో "ఆంధ్ర వాఙ్మయ చరిత్రము" (1947) గా మార్పు చేశారు[63].

కాశీనాథుని నాగేశ్వరరావు "ఆంధ్ర వాఙ్మయము"ను కాలాన్ని బట్టి నాలుగు రకాలుగా విభజించవచ్చునన్నారు.

1. అజ్ఞాతయుగము - (నన్నయకు పూర్వం ఉన్న సాహిత్యం - శాసనాలు) (ఆంధ్రరాజుల కాలంనుండి 1050 వరకూ)

2. ఆదియుగము - (నన్నయ కాలం నుండి తిక్కన కాలంవరకూ 1050-1450)

3. మధ్యయుగము - (కృష్ణదేవరాయులకాలంనుండి కాకునూరి అప్పకవికాలం వరకూ 1500-1750 ప్రాంతం)

4. ఆధునికయుగము - ( ఆంగ్ల విద్యావ్యాప్తినుండి 1750 - తరువాత - ఇది మిశ్రమయుగం)

భావవ్యాసనమును అనుసరించి వాఙ్మయాన్ని నాలుగు రకాలుగా విభజించవచ్చునన్నారు.

1.జ్ఞానయుగం 2.భక్తియుగం 3. శృంగారయుగం 4. సాంకర్యయుగం.

1949 లో ఖండవల్లి లక్ష్మీరంజనం "ఆంధ్ర సాహిత్య సంగ్రహము" వెలువడింది. దీనిలో కవుల చరిత్ర-సాహిత్యశాఖల చరిత్రను రచించినట్లు రచయిత చెప్పారు. ఆంధ్రజాతి, నన్నయపూర్వయుగం, ఆదికవి నన్నయ- ఆతని సమకాలికులు, నన్నయ తిక్కనల నడిమ కాలం, తిక్కన యుగం, ఎర్రన యుగం, శ్రీనాథ యుగం, కృష్ణదేవరాయల యుగం, అనంతర ప్రబంధయుగం, కొందరు తెలంగాణా కవులు 17,18 శతాబ్దాలో కొందరు ప్రసిద్ధాంధ్రకవులు. ఇలా ప్రముఖ కవులను బట్టి యుగ విభాగం చేసి వారి కాలంలో వచ్చిన కొంతమంది కవుల్ని, రచనల్ని విశ్లేషించారు. చారిత్రక కావ్యాలు యక్షగానాలు, శతకములు, అని ప్రక్రియాపరమైన విభాగంతోపాటు, ఆంధ్ర కవయిత్రులు అనే విభాగం' తెలంగాణా కవులనే విభాగం కూడా చేయడం వల్ల దీనికొక ఒక ప్రత్యేకతను సంతరించుకొనేటట్లు చేసింది[64].

1950లో మధునాపంతుల సత్యనారాయణ రచించిన "ఆంధ్ర రచయితలు" లో చిన్నయసూరితో ప్రారంభించి తుమ్మల సీతారామ మూర్తి చౌదరి వరకూ సుమారు వందమంది రచయితలను పరిచయం చేశారు. కవుల పరిచయాన్ని కాలక్రమ పద్ధతిలో చెప్పారు. ఈ గ్రంథాన్ని సమగ్రమైన కవిజీవితాలుగా గుర్తించడానికి వీలులేదనే అభిప్రాయం కన్పిస్తుంది[65]. చాలా సంక్షిప్తంగా కవుల్ని, కావ్యాల్ని వివరించారు.

1953లో నిడదవోలు వేంకటరావు 'తెలుగు కవుల చరిత్ర' గ్రంథాన్ని రచించారు. దీన్ని ఆరు ఖండాలుగా విభజించారు. ప్రథమఖండం (800-1000) నన్నయ పూర్వయుగం (తూర్పు చాళుక్యులు) ద్వితీయ ఖండం (1000-1100) నన్నయయుగం (తూర్పుచాళుక్యులు- రాజరాజనరేంద్రుడు) తృతీయ ఖండం (1100-1250) శివకవియుగం (కొత్తపి, పాకనాటి చోళులు కాకతీయ సామ్రాజ్యస్థాపన), చతుర్థ ఖండం (1250-1350) తిక్కనయుగం (నెల్లూరి చోళులు), పంచమ ఖండం (1330-1400) ఎఱ్ఱా ప్రగ్గడ యుగం (రెడ్డిరాజ్యస్థాపన, విజయనగర స్థాపన), షష్ఠఖండం (1400-1500) శ్రీనాథ యుగం (కొండవీటిరెడ్లు) జనశ్రుతిని ఎక్కువగా స్వీకరించడం ఈ రచనలో కన్పిస్తుంది[66]. తెలుగు, కన్నడ సాహిత్యాల మధ్యగల సంబంధాన్ని సోదాహరణంగా వివరించిన వారిలో నిడదవోలు వెంకటరావుని ప్రథములు చేసిన రచనగా దీన్ని కొంతమంది భావిస్తున్నారు[67].

1956లో బులుసు వెంకటరమణయ్య 'ఆంధ్రకవిసప్తశతి' ని వెలువరించారు. కవులనామాలను బట్టి, అకారాది క్రమంలో వివరించిన సంక్షిప్తగ్రంథం. సుమారు ఏడువందలమంది కాలం, గోత్ర, బిరుదులు, కృతులు వివరించిన గ్రంథం. కవుల చరిత్రను ఒక Index గా ఈ గ్రంథాన్ని అభివర్ణించినవారున్నారు[68].

1957 లో శిష్టారామకృష్ణశాస్త్రి రచించిన 'ఆంధ్ర వాఙ్మయచరిత్ర సర్వస్వము' మూడుసంపుటాలుగా ప్రణాళిక ఉన్నప్పటికీ, మొదటి సంపుటిమాత్రమే వెలువడింది. ప్రాఙ్నన్నయ యుగం, కవిత్రయ యుగం, శ్రీనాథ యుగం, పెద్దన యుగం, దక్షిణాంధ్ర యుగం, ఆధునిక వాఙ్మయయుగంగా విభజించి, గ్రంథాన్ని మళ్ళీ పదిప్రకరణాలుగా పేర్కొన్నారు[69].

1958లో ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ 'ఆంధ్రకవయిత్రులు' పేరుతో 13వ శతాబ్ది నుండి ఆధునికయుగం వరకూ సుమారు రెండువందలమంది కవయిత్రులను పరిచయం చేస్తూ ఒక గ్రంథాన్ని వెలువరించారు. కవయిత్రుల కవిత్వాన్ని, శైలివంటివాటిని సంక్షిప్తంగా కొనసాగించారు. ఈ కవయిత్రుల్ని అయిదు తరాలుగా విభజించారు. ప్రాచీనాంధ్ర కవిత్వము (తొలితరము), వీరేశలింగయుగము (మలితరము), ఆధునికాంధ్ర యుగము (మూడవతరము), అధ్యతనాంధ్రయుగము (నాల్గవతరం), నవ్యాంధ్రయుగము (ఐదవతరము).

1958లో దివాకర్ల వేంకటావధాని 'ఆంధ్రవాఙ్మయచరిత్రము' ప్రచురించారు. ప్రాఙ్నన్నయయుగం, భాషాంతరీకరణయుగం, కావ్యయుగం, ప్రబంధయుగం, దక్షిణాంధ్ర యుగం, ఆధునికయుగం, శతకాలు, జానపదగేయ వాఙ్మయం, నాటకాలు, నవలలు-కథానికలు, జీవిత చరిత్రలు, వ్యాసములు, విమర్శలు - పరిశోధనలుగా విభజించారు[70].

1958 లో కూర్మావేణుగోపాలస్వామి సంపాదకత్వంలో "ఆంధ్రవాఙ్మయ సంగ్రహ చరిత్ర" వెలువడింది. తెలుగు సాహిత్యాన్ని సంస్కృత సాహిత్య సంపర్కంతో వెలువడిందని భావించిన దీన్ని పరిశోధకులు పూర్వయుగంగాను, పాశ్చాత్య సాహిత్య సంపర్కంతో వెలువడిందని భావించిన సాహిత్యాన్ని నవ్యయుగం గా విభజించవచ్చునన్నారు. అయితే, మొత్తం గ్రంథాన్ని అయిదు ప్రకరణాలుగా విభజించారు. మొదటి ప్రకరణంలో ప్రాచీనాంధ్ర వాఙ్మయం, మళ్ళీ దీనిలో నన్నయ పూర్వకాలం, తరువాతి కాలంగా పేర్కొన్నారు.రెండవ ప్రకరణంలో దక్షిణాంధ్ర వా ఙ్మయం, మూడవ ప్రకరణం ఆధునిక గద్య వాఙ్మయం, నాల్గవ ప్రకరణం-నవ్యకవిత్వం, ఐదవ ప్రకరణం తెలుగునాటకాలుగా విభజించారు. గంటి జోగిసోమయాజి, కొర్లపాట శ్రీరామమూర్తి, జీరెడ్డి చెన్నారెడ్డి,విద్వాన్ విశ్వం, కూర్మా వేణుగోపాలస్వామి ఈ అయిదు ప్రకరణాలను రచించారు. ఒకో ప్రకరణాన్ని మరికొన్ని విభాగాలు చేయడం దీనిలో విశిష్టత[71].

1965లో ఆరుద్ర సమగ్ర ఆంధ్ర సాహిత్యం రచన ప్రారంభించి, ముగించే సరికి మరికొంతమంది సాహిత్య చరిత్రలను వెలువరించారు.

ఆరుద్ర తర్వాత సాహిత్య చరిత్ర ల్లోనూ యుగ విభజన చేయడంలో ఏక సూత్రత కనిపించడంలేదు.

1974లో "ఆంధ్ర సాహిత్య చరిత్ర" పింగళి లక్ష్మీకాంతం పేరుతో ఒక గ్రంథం వెలువడింది. ఇది అసంపూర్ణమైనా, దీనిలో ప్రాఙ్నన్నయ యుగం, నన్నయయుగం, శివకవియుగం, తిక్కన యుగం ఎఱ్ఱన యుగం, శ్రీనాథుని యుగం, కృష్ణ దేవరాయలయుగం, దక్షిణాంధ్ర యుగం, క్షీణయుగం, ఆధునిక యుగం పేర్లతో యుగ విభజన చేశారు. దీనిలోనూ కవుల్ని, సాహిత్య పరిణామ క్రమాన్ని, కాలాన్ని బట్టి విభజించటం కన్పిస్తుంది. దీన్ని చాలామంది ఆదర్శప్రాయమైన యుగ విభజనగా పేర్కొన్నారు.[72]

1974 లోనే వెలువడిన "ఆంధ్రవాఙ్మయ చరిత్ర సంగ్రహం" రచయిత వారణాసి వేంకటేశ్వర్లు. పాఠ్యగ్రంథాల కోవకి చెందినదే అయినప్పటికీ, కవిత్వరీతుల్ని, రసపోషణ వంటి విషయాల్ని చర్చించిన గ్రంథం. దీన్ని ప్రాఙ్నన్నయ యుగం, నన్నయ యుగం, తిక్కన యుగం, ఎఱ్ఱన యుగం, శ్రీనాథయుగం ..... ఇలా యుగకర్తల్ని అనుసరించి యుగ విభజన చేశారు.[73]

1983,1985లలో, రెండు సంపుటులుగా జి.నాగయ్య "తెలుగు సాహిత్య సమీక్ష"ను ప్రచురించారు. సాహిత్యాభిలాష గల వారికే కాకుండా పరీక్ష దృష్టితో చదివేవారికీ ఉపయోగకారిగా రాసిన గ్రంథమిది. సాహిత్య అధ్యయన పద్ధతులు, యుగ విభజన చర్చలతో పాటు, క్రీ.శ 1000 కి ముందట తెలుగు భాష-సంస్కృత ప్రాకృతములతో గల సంబంధం, నన్నయకు, పూర్వపు తెలుగు కవిత, తెలుగులో నన్నయ ఆదికవి, మార్గదేశి సంప్రదాయాలు, నన్నెచోడుని జానుతెలుగు, వస్తుకవిత, శివకవుల రచనా వైశిష్ట్యము, తిక్కన, ఎర్రన, శ్రీనాథుని యుగం, పురాణేతిహాస ప్రక్రియలు - మొదటి సంపుటిలో చర్చించారు. రెండవ సంపుటిలో అష్టదిగ్గజములు, కృష్ణదేవరాయులు, ప్రబంధయుగం, యక్షగానవాఙ్మయ చరిత్ర, చారిత్రక కావ్యాలు, తెలుగు కవయిత్రులు, దక్షిణాంధ్ర యుగ సాహిత్యం, సంస్థానములు

- తెలుగు సాహిత్య పోషణము, వేమన, శతక వాఙ్మయ చరిత్ర క్షీణ యుగం, ఆధునికాంధ్ర కవిత్వము - ప్రాదుర్భావ వికాసములు, తెలుగు జానపద కవిత్వము, ఆంధ్ర నాటక సాహిత్య పరిణామం, తెలుగు నవలా వికాసము, తెలుగు కథ - కథానిక, తెలుగు సాహిత్య వ్యాసములు, విమర్శలు, పరిశోధనలుగా విభజించారు.

కవుల్ని, ప్రక్రియల్ని, సాహిత్య పరిణామ క్రమాన్ని అనుసరించి, సాహిత్యాన్ని సమీక్షించిన గ్రంథాలుగా వీటిని చెప్పుకోవచ్చు.

**1986**లో 'తెలుగు సాహిత్య చరిత్ర' పేరుతో కలిదిండి వేంకటరామరాజు సంపాదకుడుగా, వైద్యుల కృష్ణారావు, వాడవల్లి చక్రపాణిరావులు బి. ఏ. స్పెషల్ తెలుగు విద్యార్థులకోసం ఒక గ్రంథాన్ని రచించారు. తెలుగు అకాడమీ ప్రచురించిన ఈ గ్రంథంలో ప్రాఙ్నన్నయ యుగం, నన్నయ యుగం, శివకవి యుగం, తిక్కన యుగం, ఎఱ్ఱన యుగం, శ్రీనాథ యుగం, రాయల యుగం, రాయల అనంతర యుగం, ఆధునిక యుగంగా అధ్యయన సౌలభ్యానికి విభజించామన్నారు[75].

**1986** లో ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి 'ఆరుయుగాల ఆంధ్ర కవిత' పేరుతో ఒక గ్రంథాన్ని రచించారు. ఆంధ్ర కవితా వికాసాన్ని కళాత్మకంగా ఆరు ఋతువులుగా విభజించారు.[76] ఇంకా, ముదిగొండ సుజాతరెడ్డి, ద్వా.నా.శాస్త్రి తెలుగు సాహిత్య చరిత్రల్ని రచించగా, కె.కె. రంగనాథచార్యులు తెలుగు సాహిత్య వికాసం గ్రంథాన్ని రచించారు. ఇన్ని గ్రంథాలు "సాహిత్య చరిత్ర" ను విశదీకరించే ప్రయత్నం చేసినా, యుగవిభజనలో ఏకాభిప్రాయం కన్పించకపోవడం, యుగవిభజనను నిర్దుష్టంగా చేయలేమని తెలుపుతుంది.

## 5.8.3. సమగ్ర ఆంధ్ర సాహిత్య యుగవిభజన– ఏకసూత్రత :

సాహిత్య చరిత్ర రచనకు శాస్త్రీయమైన ఒక పద్ధతి అంటూ నిర్దేశించటం సాధ్యంకాదని యుగవిభజన సమస్యలు, ప్రమాణాల్ని బట్టి తెలుస్తుంది. ఈ సమస్యల్ని బేరీజు వేసుకొన్న ఆరుద్ర, ఆంగ్ల సాహిత్య చరిత్రలో పోషకులను ఆధారంగా చేసుకొని యుగవిభజన ఉన్నట్లే, తెలుగు సాహిత్య చరిత్రలో యుగవిభజన కాలాన్ని అనుసరించి, చారిత్రక పరిస్థితుల్ని క్రమంగా అధ్యయనం చేయడానికి వీలుగా రాజుల, పోషకుల్ని అనుసరించి చేశారు[77]. అయితే, మొదటి సంపుటి నుండి చివరి (పదమూడవ) సంపుటి వరకూ ఈ పద్ధతిని కొనసాగించగలిగారా? అనేది యుగవిభజన లో ఏకసూత్రతను తెలియజేస్తుంది. సూత్రం అంటే ఒక నియమం,(principle) మొదటి నుండి చివరి వరకూ ఒకే నియమాన్ని పాటించడం 'ఏకసూత్రత' క్రమబద్ధమైన నిర్మాణ పద్ధతి ఉంటేనే ఏకసూత్రత ఉన్నట్లవుతుంది. ఆదిలో వేసుకొన్న ప్రణాళిక ప్రకారమే నిర్మాణం సాగడం దీనిలో జరగవలసి ఉంటుంది.

యుగవిభజన ను ఆరుద్ర తొ.ము.లో ఉజ్జాయింపు ప్రణాళిక అనీ, మరికొన్ని మార్పులు చేసిన యుగవిభజన అనీ, మొదట్లో వేసుకున్న ప్రణాళిక అనీ చాలాసార్లు యుగవిభజనను మార్పుచేశారు. వీటన్నింటినీ సమగ్ర ఆంధ్ర సాహిత్య తొలిముద్రణ–పునర్ముద్రణల మార్పులు–చేర్పులు లో వివరించడం

జరిగింది. ప్రస్తుతం, యుగవిభజనను ఆరుద్ర సమర్థించుకున్న పద్ధతినీ, దానికెంతవరకూ సమన్వయం కుదురుతుందో లేదో పరిశీలించడం వల్ల ఏకసూత్రత అవగాహనకొస్తూనే, సాహిత్య చరిత్రకారుడుగా, పరిశోధకుడు గా ఆరుద్ర చేసిన ప్రయత్నం తెలుస్తుంది.

## 5.8.3.1. యుగవిభజన ఆరుద్ర భావపరిణామం :

సమగ్ర ఆంధ్ర సాహిత్యం, మొదటి సంపుటి నుండీ యుగవిభజనను సమర్థించుకొంటూ రచన కొనసాగించినా, ఆరవ సంపుటి నవాబుల- ఆరవీటి రాజులయుగాల నుండి 'సమర్థింపు' లో కొంత మార్పు కన్పిస్తుంది. కవుల స్వభావాల్ని రాజుల్ని అతిగా కీర్తించడంలోగల ఆంతర్యాన్ని విశదీకరించే దిశగా సాగింది.(పు.ము VI–పు.4) ఇబ్రహీం కుతుబ్‌షాహీని హరిశ్చంద్రుడు, నలుడు.... వీళ్ళ వరుసలో "సల్కి భరామచంద్రుడే యేడవ చక్రవర్తి పదునేడవరాజు ధరాతలమ్మునన్" అనే పద్యాన్ని 'చాటుపద్యమణి మంజిరి' నుండి స్వీకరించి ఈ యుగకవుల రచనా స్వభావాల్ని వివరించారు. అయినా జమీందారీ నవ్యసాహిత్యయుగాల్ని వివరించేటప్పటికి ఆరుద్ర భావజాల వివరణలో పరిణామం కన్పిస్తుంది. పదకొండవ సంపుటిలో రాజ్యాలూ, రాజలాంఛనాలూ, బిరుదులు పోయిన పాలకులు, తమ ఆశ్రితులను పోషించలేకపోయారు. ఎందరికో జీవనోపాధులు పోయాయి, (పు : 7) బ్రిటీష్‌వాళ్ళు ఆర్థికంగా తెచ్చిన మార్పుల వల్ల సంస్థానాధీశ్వరులు తమని తాము కాపాడుకోవడానికీ ప్రయత్నాలు చేసుకోవడానికే సరిపోయేది. విక్టోరియా మహారాణికి 'బ్రిటిష్ దేశపు మహారాణి' బిరుదుతోపాటు ఎంప్రెస్ ఆఫ్ ఇండియా ( భారతదేశపు చక్రవర్తిని) అనే బిరుదు అవసరమని భావించి, బ్రిటీష్ పార్లమెంటు 'రాయల్ టైటిల్' చట్టాన్ని ఆమెదించింది. ఇండియాలోని సమస్తజనులూ సంస్థానాధీశ్వరుల సమక్షంలో ప్రకటించాలని నిర్ణయించడం, ఢిల్లీలో (1877 జనవరి ఒకటవతేదిన) నిర్వహించదఁ పెట్టిన 'ఇంపీరియల్ దర్బారు' హడావిడిలోనే సంస్థాధీశ్వరులు మునిగిపోయారు. ఈ పరిస్థితుల్లో కొక్కొండవేంకట రత్నం తో పాటు వీరేశలింగం కూడా మహారాణిని కీర్తిస్తూ పద్యాల్ని వర్ణించారనడంలో మొదటి సంపుటి నుండి పదకొండవ సంపుటి కొచ్చేసరికి రాజుల, పోషకుల యుగ విభజనలో గల పరిణామం బాగా స్పష్టమవుతుంది. ఆర్థిక అంశాలు సాహిత్య సృష్టిని లేదా ఉత్పాదన చేయడంలో దిశానిర్దేశం చేస్తుంటాయనే మార్క్సిద్ధాంతంతో సమన్వయించడానికి ఆరుద్ర ప్రయత్నించారు.

మార్క్సిజానికి ఆర్థిక అంశాలు పునాది. ఈ పునాదిమీద ఆధారపడిన అనేక ఉపరితల అంశాల్లో సాహిత్యం ఒకటని సైద్ధాంతిక చర్చలోతేలింది. రచనను చారిత్రక సందర్భంలో పరిశీలించడం, సామాజిక వాస్తవాల్ని భౌతిక దృక్పథంతో పరిశీలించడం, జీవితాన్ని నడిపించే శక్తులేవో, అడ్డుపడేవేవో, వాటిని సమర్థించేవారిని వ్యతిరేకించే వారిని పరిశీలించాలనేది మార్క్సిస్టు దృక్పథంతో చేసే వివేచన అవుతుంది ఈ అంశాల్ని, ఆరుద్ర యుగవిభజన చేయడంలో వచ్చిన పరిణామంతో సమన్వయించి చూసినట్లయితే, అస్తిత్వం నుండి చైతన్యం పుడుతుందనే భౌతికవాద అవగాహన కన్పిస్తుంది. పదార్థ భౌతిక మూలంకనుక, సామాజిక భౌతిక జీవితం నుండి సామాజిక చైతన్యం పుట్టుకొస్తుందనే దృష్టితోనే 'ఆధునిక అభ్యుదయయుగం' గా ఆరుద్ర మార్క్సిస్టు సిద్ధాంతంతో పరిశీలించే అవకాశం ఉన్నట్లే

యుగవిభజనను కాలానుసరణ, చారిత్రక పద్ధతిలో రాజుల్ని, పోషకుల్ని ఆధారం చేసుకున్నా, వివేచన మాత్రం వాస్తవాల్ని వివరించే పద్ధతిలో కొనసాగింది. కానీ, కేవలం తొ.ము.నే పరిశీలించేవారికి ఈ పద్ధతి అవగతం కాదు. పైగా, ఒకయుగంలో ఉండవలసిన కవుల్ని మరొకయుగంలో కూడా చేర్చారు. అందుకనే తొ.ము. వెలువడుతున్నప్పుడే కొందరు ఈ యుగవిభజనను విమర్శించారు[78].

## 5.8.3.2. ఆరుద్ర యుగ విభజనపై విమర్శలు :

తొలిముద్రణ నెలనెలా పత్రిక వలే వెలువడుతున్నప్పుడే పత్రికల్లోనూ, సమగ్ర ఆంధ్ర సాహిత్య సంపుటికి రాసిన 'పీఠిక' ల్లోనూ కొంతమంది ఆరుద్ర చేసిన యుగవిభజన నచ్చలేదనీ, సరైన ప్రణాళిక లేదనీ, అవకతవకలున్నాయనీ, ఒక యుగంలో ఉండవలసిన కవులు, మరొక యుగంలో కన్పిస్తున్నారనీ, గజపతుల పేరుతో ఒక ప్రత్యేకయుగం పెట్టవలసిన పనిలేదనీ, కొంతమంది కవుల గురించి విస్తారంగా పేర్కొని, ఆకవి పేరుతో కాకుండా, ఆ కాలంనాటి రాజుల పేరుతో యుగ విభజన చేశారనీ, తెనాలి రామకృష్ణుని చిత్రలేఖనం వలే విడ్డూరంగా కనపడుతుందనీ అనేకరకాలుగా యుగవిభజన గురించి విమర్శలు చేశారు[79]. వీటిని వివరించడంలో ఆరుద్ర ఎంతవరకూ కృతకృత్యుడయ్యారో పు.ము. సమగ్ర ఆంధ్ర సంపుటుల్ని పరిశీలించడం వల్ల అర్థమవుతుంది. వీటిని వివిధ శీర్షికలుగా అధ్యయనం చేయవచ్చు.

## 5.8.3.2.1. కొంతమంది కవులకు అధిక ప్రాధాన్యం :

తొ.ము. రెండవ సంపుటిని విమర్శిస్తూ విశ్వనాథ సత్యనారాయణ "మొత్తం రెండువందల యాభైమూడు పుటల్లో తిక్కనగారి గురించి 85 పుటల్ని, తిక్కన 168 పుటల్లో పదహారుగురు గురించి రాశా"రన్నారు. "ఈ లెక్కలో "కాకతీయ యుగం" అనడం కంటే తిక్కనయుగం అంటేనే బాగుంటుందేమో అదే అనగూడదేమో! కాకతీయ యుగమే బాగుంది" అన్నారు[80].

తొలిముద్రణ కాకతీయ యుగం (రెండవ సంపుటి) విశ్వనాథ వారన్నట్లు 250 పుటలు మాత్రమేకాదు. ఇన్నర్‌టైటిల్, ముందుమాటలు, ఉపయుక్త గ్రంథసూచికలు కాకుండానే 253 పుటలులో ఉంది. తిక్కనసోమయాజి గురించి 50 నుండి 134 పుటల వరకూ వివరించారు. అంటే 85 పుటల్లోనే విశ్లేషించారు. పునర్ముద్రణలో 260 పుటల్లో ఉన్న సంపుటిలో తిక్కన గురించి 54 నుండి 118 పుటల వరకూ 84 పుటల్లోనే పేర్కొన్నారు. విశ్వనాథ వారి విమర్శలో కొంత సవిమర్శకదృష్టి గోచరిస్తుంది. "ఒకే కవిని గురించి అన్ని పుటల్ని చెప్పినప్పుడు, 'తిక్కన యుగం' అంటే సరిపోతుంది కదా!" అని వెంటనే 'కాదనీ' ఆరుద్ర విభజనే సమంజసమన్నారు. కానీ, శివకవుల గురించి వివరిస్తూ "తిక్కనను చూచి శివకవులు రాయలేదు, ఆనాటి సారస్వతం మీద శివకవులముద్రే ఎక్కువగా ఉంది. పాల్కురికి సోమనాథుని గురించి తగినంత రాయలేద"ని విశ్వనాథ అన్నారు[81].

దీన్ని సహృదయ విమర్శగా భావించిన ఆరుద్ర, పునర్ముద్రణలో పాల్కురికి సోమనాథుడి గురించి మరింత సమాచారాన్ని పెంచి రచించడమే కాకుండా తాత్త్విక చర్చకూడా చేశారు. అయితే, తిక్కన

గురించి ఎక్కువగా రాశారనే దాన్ని ఆలోచిస్తే తెలుగులో వెలువడిన భారతంలో గల 18 పర్వాల్లో 15 పర్వాల్ని చక్కని తెలుగు పలుకుబళ్ళతో అందించడం వల్ల విస్తృతంగా రాసినా, పు.ము.లో తగ్గించలేదు. భారతమేకాకుండా నిర్వచనోత్తరరామాయణం కూడా తెలుగు సాహిత్యానికి విశిష్టమైన భావాల్ని అందించింది. విశ్వనాథ వారి విమర్శ, తిక్కన గురించి చేసినప్పటికీ, మిగిలిన సంపుటాల్లోనూ కొంతమంది పట్ల ప్రత్యేక శ్రద్ధని ఆరుద్ర కలిగి ఉండటం వల్ల పుటల విస్తరణ, సమగ్రతకు కొంత భంగవాటిల్లేటట్లు 'యుగవిభజన' తయారైంది. తిక్కన గురించే అధికంగా విశ్లేషణ చేసి కూడా "తిక్కన యుగం" అని పేరు పెట్టకుండా, 'కాకతీయయుగం' అనిపేరు పెట్టడాన్ని పరిశీలించడం అవసరం. ఈ యుగంలో జైనులు, శైవుల శృంగార లీలల్ని 'బసవపురాణం' 'పండితారాధ్యచరిత్ర'లను బట్టి వివరించారు. ముగ్దసంగయ్య కథ, అమాయకుడైన భక్తుడు వేశ్యల ఇంటికెళ్ళిన పరిస్థితిని బట్టి, ఆనాటి భక్తుల్లో ఉండే రసికతను వివరించారు (పు.ము II-పు.8). రాజసేవలో వారకాంతలు "లలితమంజుల విమలాంగలతలు వెలుగ సూక్ష్మవస్త్రా భరణం"లో సంచరించేవారని కామందక నీతిశాస్త్రగ్రంథాన్ని బట్టి నాటి సామాజిక జీవనాన్ని విశ్లేషించారు. సామాజిక వాస్తవాన్ని వర్ణిస్తూనే, గణపతిదేవ చక్రవర్తి మరిది జాయపసేనాని 'నృత్తరత్నావళి'; విద్యానాథుని 'ప్రతాపరుద్రయశోభూషణం; వెలువడినవి. ఈ కాకతీయ యుగంలోనే! ప్రతాపరుద్రని ఆస్థానంలో సుమారు 200 మంది తెలుగు కవులు ఉండేవారనీ (పు.19) అందరి గురించి తెలుసుకొనే అవకాశం లేకపోయినా, తెలియవచ్చినంతమందిని వివరిస్తానన్నారు. తిక్కన, వారికుటుంబం మంత్రుల పోషణలో ఉండగానే అనేక రచనలు వెలువరించారు. మనుమసిద్ధికి రాయబారం వహించిన అనుభవంతో భారతంలోని 'ఉద్యోగ పర్వం' 'యుద్ధపంచకం' కళ్ళకుకట్టినట్లు వర్ణించగలిగారన్నారు. (పు.ము II-106) రాజుల పోషణలో తిక్కన ఉన్నట్లు, ఆ అనుభవం రచనకి ఉపయోగపడినట్లు చెప్పడం కూడా ఆరుద్ర తాను చేసుకొన్న 'యుగవిభజన'ను సమర్థించుకోవడమే అవుతుంది.

ఈ యుగంలో శివదేవయ్య అనేకవి గణపతిదేవచక్రవర్తి, రుద్రమదేవి, ప్రతాపరుద్రుడు దగ్గర మంత్రిగా ఉంటూనే, (పు.ము II పు.131) శివదేవధీమణి శతకం రచించినట్లు తెలుస్తుందని (పు.133) అన్నారు. కేతన 'దశకుమార చరిత్ర'ను తిక్కనకు అంకితమివ్వడంలో కూడా పరోక్షంగా ఏదొక పోషణకై జరిగిన ప్రయత్నం ఉండొచ్చు. మెజారిటి అభిప్రాయాన్ని రాజు గౌరవించవలసి వచ్చేదంటూ, కేతన అనువదించిన 'విజ్ఞానేశ్వరీయం' లో "పెక్కుంద్రు గుడి సమయం/ బొక్కటి గల్పించి నడుపుచుండు మరేనిన్ / నిక్కముగా నాసమయము/ దక్కొని చెల్లించుటయును ధర్మము పతికిన్" అనే పద్యాన్ని వివరించారు (పు.ము2-165) 'కేయూర బాహుచరిత్ర' రచించిన మంచెన,1182-1206 ప్రాంతాల్లో వెలనాటి చోడులలో ఆఖరివాడైన పృథీశ్వరుని దగ్గర మంత్రిగా పనిచేసే నండూరి గుండయ మంత్రికి అంకితమిచ్చాడు (పు.ము II-172) మనుమసిద్ధి చనిపోయాక 1285 నుంచీ నెల్లూరును రెండవ తిక్కరాజు పరిపాలించాడు. ఈతని ఆస్థానంలో పెద్దయామాత్యుడు అనేకవి ఉన్నట్లు జక్కన విక్రమార్కచరిత్రను బట్టి తెలుస్తుంది (పు.ము II-184) ఇలా కొంతమందిని రాజులు,మంత్రులు, మంత్రుల దగ్గర పనిచేసే కవిమంత్రులూ 'కవుల్ని' పోషించినా, మరికొంత మందిని పోషించకపోయినా, కాలానుక్రమణలో చారిత్ర వాస్తవాల్ని వివరించడానికి రాజుల, పోషకుల యుగవిభజనను

ఆరుద్ర చేశారనీ, అలాచేయడంలోనూ, ఆకాలంలో ప్రసిద్ధమైన తెలుగుపాలకుల పేరుని పెట్టారని అర్థమవుతుంది. అందుకనే, మొదట్లో 'తిక్కనయుగం' అంటే బాగుంటుందని కూడా కాకతీయ యుగమని పేరుపెట్టడమే సమంజసమని, విశ్వనాథవారు మళ్ళీ ఆరుద్ర యుగవిభజనను సమర్థించారనుకోవచ్చు. ఈ రెండవ సంపుటి (కాకతీయ యుగం) ని తొ.ము.లో "రాజ్యస్థాపన క్రీ.శ.**1000** లో జరిగినా, గణపతిదేవ చక్రవర్తి తో కాకతీయ ప్రాభవం ప్రస్ఫుటంగా కనబడుతుంది. అందుకు యుగం **1199** నుండి ప్రారంభం అది రుద్రమదేవితోనే తగ్గిందని చెప్పవచ్చు. రెండవ ప్రతాపరుద్రుని కాలంలో కొత్త గాలులు వీచాయి. కనుక యుగం **1290** తో అంతం వచ్చు" అని చెప్పగా, పు.ము II లో " ఇది మహాసామ్రాజ్యమైంది క్రీ.శ.**1200** తర్వాతనే. క్రీ.శ.**1323**లో ఈ వంశంలోని ఆఖరురాజు ప్రతాపరుద్రుడు ఢిల్లీ సైన్యాలకు పట్టుబడి ఈ మహాసామ్రాజ్యం అంతరించింది. కాబట్టి కాకతీయ యుగం క్రీ.శ.**1200** నుండి **1325** దాకా అని ఉజ్జాయింపుగా పరిగణిద్దాం" అన్నారు. 'లక్షణదీపిక' రచించిన గౌరన క్రీ.శ.**1445** ప్రాంతాల్లో జీవించాడనీ, అధర్వణాచార్యుడితో తనగ్రంథంలో పేర్కొనడం వల్ల కనీసం అథర్వణా చార్యుడు, గౌరనకంటే ఒక శతాబ్దం ముందు వాడై ఉంటాడని,(పు : 252) అథర్వణాచార్యుడితో, రెండవ సంపుటిని ముగించారు. దీన్ని బట్టి కూడా కాలానుక్రమంగా, చారిత్రక దృష్టితో యుగవిభజన చేశారని తెలుస్తుంది.

యుగవిభజన గురించి మరికొంత మంది చేసిన విమర్శల్ని పరిశీలించి, సాహిత్య చరిత్ర, పరిశోధకుడిగా ఆరుద్ర కృషిని బేరీజు వేసే ప్రయత్నం చేయవచ్చు.

'గిడుగుసీతాపతి ఆరుద్ర యుగవిభజనను విమర్శిస్తూ "సాహిత్యపోషకులయిన ప్రభువంశముల పేళ్ళు పెట్టి యుగవిభజన చేయడం మంచిదే కాని, ఈ అయిదవ సంపుటికి పెట్టిన పేరు తిక్కన సంపుటాలకు పెట్టిన పేళ్ళవలే అంతగా సార్థకం కాదని నా అభిప్రాయం. గజపతులు సంస్కృత సాహిత్యమును పోషించలేదు. అంతేకాదు; శ్రీనాథుని విషాద విషయం తలచుకొంటే దుర్భరము కాకతప్పదు. ఈ విషయం ఆరుద్రగారు గుర్తించకపోలేదు. ఏదో ఒకసాకు చూపి గజపతుల పేర ఒక యుగాన్ని పేర్కొని దానిని రెడ్డిరాజుల, తొలిరాయల యుగాలకు అనుబంధంగా జమకట్టుకుందాం'అన్నారు". అని యుగవిభజన లో గల కొన్ని లోపాల్ని ఎత్తిచూపారు[82].

"తొలిరాయలయుగం అనేపేరు బాగానే ఉన్నది. అయినా గజపతుల పేర ఒక సంపుటం వెలయుగా నరపతుల పేర ఎందుకుండరాదు అందుగుల వెంకయ్య అనే కవి 'నరపతి విజయం' వ్రాశాడు. ఆర్వీటి వంశ చరిత్ర వరకే దాని నతడు పరిమితం చేశాడు" అని ఖండవల్లి లక్ష్మీరంజనం విమర్శించారు[83].

నేలటూరు వెంకటరమణయ్య దీనిపై తన అభిప్రాయాన్ని తెలుపుతూ "యుగవిభజన బహు విడ్డూరంగా ఉంది......తెనాలి రామకృష్ణుని చిత్ర లేఖనం వలే వికటంగా కనపడుతుంది. రెడ్లతో సంబంధంలేని కవులు రెడ్లయుగంలోను, పద్మనాయకుల పోలు పొందెరుగని కవులు పద్మనాయక యుగంలోను వస్తారు. నవాబుల యుగం అనిపేరుపెట్టినారు ఒక యుగానికి సుల్తానుల యుగం అంటే యుక్తంగా ఉండేది. వచ్చిపోయి ఆంధ్ర వాఙ్మయాన్ని ఆదరించి పోషించిన వాండ్లు కుతుబుశాహీ

సుల్తానులు ఇద్దరు–మల్కిభరామున్ను, ఆయన కొడుకున్ను 'ఏసింగిల్‌శ్వాలో డజ్ నాట్ మేక్ సమ్మర్' అన్నట్లు వీరిద్దరి మూలాన ఆదివాబుల యుగం అవుతుందా?" అని ప్రశ్నించారు[84].

తె.ము. పదకొండవ సంపుటి–నాయక రాజులయుగానికి కప్పగంతుల లక్ష్మణశాస్త్రి రాసిన 'పీఠిక' లో "సాహిత్య చరిత్రలో పదునేడవ శతాబ్ది కాలమును ఏ యుగముగా పరిగణింపవలయునను విషయము వివాదాస్పదముగానున్నది. ఇది క్షీణయుగమనియు అనంతర ప్రబంధ యుగమనియు, నాయకరాజుల యుగమనియు సాహిత్య చరిత్రకారులు వివిధముగ బేర్కొనినారు. సాహిత్య ప్రక్రియా వైవిధ్యముగల యీ యుగమును అనంతర ప్రబంధయుగమనుటయే సమంజసముగా నున్నది" అన్నారు[85].

వీటిని పరిశీలించినప్పుడు కింది విమర్శనా అంశాలు సమీక్షించుకోవాల్సి వస్తుంది.

1. తన ప్రణాళికను సమర్థించుకోవడానికి అవసరం లేకపోయినా ఆరుద్ర ఏదొక సాకుచూపి పోషకుల పేరుతోనే యుగవిభజన చేస్తుంటారు.

2. పోషకుల పేరు పెట్టినా, ఆనాటి ప్రసిద్ధులైన, ఆ సంపుటిలో విస్తృతంగా చర్చించిన కవి పేరుతోనే ఆయుగాన్ని పిలవడం జరుగుతుందనేది గిడుగు సీతాపతి విమర్శ.

3. యుగ విభజన సమంజసంగా, సమర్థనీయంగా లేదు. విచిత్రంగా ఉంది.

4. ఏదో ఒకరిద్దరు పోషకులవల్ల ప్రత్యేకంగా ఒక యుగానికి ఆ వంశం పేరు పెట్టవలసిన అవసరం లేదు.

5. కేవలం పోషకుల్ని అనుసరించి మాత్రమే యుగవిభజన చేయడం వల్ల ప్రక్రియా ప్రత్యేకతను విస్మరించి నట్లవుతుంది.

6. ఒక యుగంలో ఉండవలసిన కవులు మరొక యుగంలోకి వెళ్ళిపోయారు. కాలానుసరణను తప్పినట్లయ్యింది.

7. తెలుగు సాహిత్యాన్ని పోషించని పాలకుల పేరుతో యుగవిభజన చేయడం లోపభూయిష్టమైన పద్ధతి.

8. పోషించిన వారి పేరు పెట్టడానికి ఒక్క కావ్యం, కవి ఆధారం దొరికినా ఒక యుగాన్ని పెట్టవచ్చు. కానీ కొన్నింటిని వదిలేశారు.

9. రాజులు పోయారు, రాజ్యాలు పోయాయి. ప్రజాపాలన వచ్చింది. కవులు మిగిలారు. కవుల సృష్టించిన కవితా సామ్రాజ్యం మిగిలింది. సాహిత్యంలో కవులకీ, కావ్యాలకీ స్థానమివ్వవలసింది పోయి, రాజుల,పోషకులకి సాహిత్యంలో స్థానమిచ్చి, వారిపేరుతో సాహిత్యయుగవిభజనచేయడం సరైందికాదు.

ఇలా విశ్లేషణకు అవసరమైన అనేకాంశాలుగా విమర్శకుల అభిప్రాయాల్ని తీసుకొనే అవకాశం ఉంది. వీటిని సమగ్ర ఆంధ్ర సాహిత్యం తొలిముద్రణ, పునర్ముద్రణలను అధ్యయనం చేస్తూ సమీక్షించడం వల్ల 'యుగవిభజన' ఏకసూత్రత స్పష్టమవుతూనే సాహిత్య చరిత్ర కారుడుగా, పరిశోధకుడుగా ఆరుద్ర కృషిని తెలుసుకోవచ్చు.

## 5.8.3.2.2. యుగవిభజనకు ఏదొక సాకుచూపడం :

యుగవిభజనను ముందుగానే పరిశీలించినట్లు ఆరుద్రలో కొంత పరిణామం కన్పిస్తుంది. అయినా ఇంచుమించు తన యుగవిభజనను ప్రతి సంపుటిలోనూ, సమర్థించుకొనే ప్రయత్నం కన్పిస్తుంది.

శ్రీనాథుని వంటి కవిని బాధించారన్న కోపంతో గజపతుల చరిత్రను అపార్థం చేసుకొనక దాన్ని సానుభూతితో పరిశీలించడం మంచిదనీ, ఈ కవి కష్టాలకు లోనయ్యాడని, ఈ రాజ్యాన్ని కర్కోటకరాజ్యంగా భావించడంలో తప్పులేదనీ, కానీ, గజపతుల వల్ల మొత్తంమీద భారతదేశానికి ఉపకారమే జరిగిందన్నారు(తొ.ము V పు.2) తురష్కుల్ని ఎదుర్కొని, హిందూధర్మాన్ని కాపాడారన్నారు. ఈ అభిప్రాయాలకు తోడు తెలుగు పండితుల్ని పోషించకపోలేదనీ,16వ శతాబ్ది ప్రథమభాగంలో జీవించిన అజ్జరపు పేరయలింగం అనేకవి "ఒడయనంబి విలాసం" లో తనపూర్వులకు గజపతులు అగ్రహారాల్ని దానం చేసినట్లు చెప్పుకున్నారన్నారు. పునర్ముద్రణలో ఈ యుగ విభజనను మరింతగా సమర్థించుకోవడానికి ఏనుగు లక్ష్మణకవి ఇంటిపేరు "ఏనుగు" గా స్థిరపడడానికి వారి వంశంలోని వారికి గజపతుల ఆదరణే ప్రబలసాక్ష్యంగా చెప్పారు. (పు.ము. VI పు.4-5) జయదేవుని గీతగోవిందంలోని అష్టపదుల్ని అభినయంతో, గానం చేయడానికి తెలంగాణానుండి వెళ్ళి పూరిలో స్థిరపడ్డ "నట్టువమేళం" ఆటకత్తెలకే చెందేటట్లు ప్రతాపరుద్ర గజపతి ఒరియాలో వేయించిన శాసనాన్ని వివరించారు. (పు.ము IV పు.15) శ్రీనాథుణ్ణి శిక్షించిన వాళ్ళ పేరుతో యుగవిభజన సమంజసం కాదనే విమర్శకు సమాధానంగా 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' లో సురవరం ప్రతాపరెడ్డి "ఒడ్డెరాజులే యీ శిక్షలన్నింటినీ ప్రవేశపెట్టి నారనుట కాదు. అంతకు ముందును ఇట్టివి యాచారములందుండెనేమో" అనే అభిప్రాయాల్ని చూపారు[86]. ఇంకా గజపతుల యుగంలోనే ఉన్న అనంతామాత్యుడు 'భోజరాజీయం' లో కొన్ని శిక్షల్ని వర్ణించాడు. తురుష్కుల సంపర్కం వల్ల కాకతీయ యుగం లోగల కేతన విజ్ఞానేశ్వరీయం లోనూ కన్పిస్తున్నాయి. శ్రీనాథుని సమకాలికుడైన కపిలేశ్వర గజపతి ప్రజారంజక పాలకుడే నన్నారు. (పు.ము IV పు.19) కపిలేశ్వర గజపతి పేరుతో అనేక అగ్రహారాలు తెలుగు జిల్లాలో కన్పిస్తున్నాయి. తెలుగు సాహిత్యాన్ని పోషించారని (పు.20) గజపతుల పేర చేసిన యుగవిభజనను ఆరుద్ర ఆధారాల్ని చూపిస్తూ సమర్థించుకున్నారు. ఇన్ని ఆకరాల్ని చూపడం సాకు చెప్పడం అవ్వదు.

## 5.8.3.2.3. పేరు పోషకులదైనా కవిప్రభావమే అధికం :

పోషకుల పేరుపెట్టినా, ఆ సంపుటిలో ఉన్న ప్రసిద్ధ కవిపేరుతోనే యుగాన్ని పిలవడమనేది, వైయక్తిక దృష్టికోణమే అవుతుంది. కొందరి కవుల పట్ల అభిమానం వల్ల కూడా అలా పిలిచే అవకాశం ఉంది. ముదిగంటి సుజాతారెడ్డి 'తెలుగు సాహిత్య చరిత్ర' లో కృష్ణశాస్త్రి, శ్రీశ్రీల పేరుతో కూడా

యుగవిభజన చేశారు. కానీ, అది అనేక విమర్శలకు కారణమైంది. కనుక ఇటువంటి విమర్శనిలవదు. కానీ, ఒకో కాలంలో ఒకో కవి ఉదా: నన్నయ, తిక్కన, వంటివారి ప్రభావం అధికంగా కన్పించడం వల్లకూడా కొంతమంది సాహిత్య చరిత్రకారులు, వారి ప్రణాళికను అనుసరించి పేరు పెట్టారు.

## 5.8.3.2.4. విడ్డూరమైన యుగ విభజన :

యుగవిభజన సమంజసంగా ఉండటమనేది కూడా, ఒకోచరిత్రకారునికి ఒకో ప్రణాళిక ఆధారంగా ఉంటుంది. దాని ప్రకారం విభజన చేసుకుంటారు. అయినప్పటికీ, కొన్ని ప్రమాణాల్ని పాటించవలసి ఉంటుంది కనుక, అందరికీ నచ్చకపోయినా, హేతువుల్ని చూపుతూ సాధ్యమైనంతలో అధికుల ఆదరణకు పాత్రం కావలసి ఉంటుంది. ఈ విమర్శలో కొన్ని ఆలోచించవలసిన అంశాలు కన్పిస్తున్నాయి. వేసుకొన్న ప్రణాళికలో మార్పులూ, చేర్పులూ చేయడం, యుగవిభజన దృక్పథం సరిగ్గా అర్థం చేసుకోగలిగినప్పుడు ఈ యుగవిభజన విడ్డూరంగా కన్పించదు. అదొక ప్రత్యేక పద్ధతిగా భావించగలుగుతారు. కాలాన్ని అనుసరిస్తూనే, చారిత్రక అంశాల్ని వివరిస్తూ, సామాజిక, ఆర్థిక, సాంఘిక కోణాల్ని వివరిస్తూ, మార్క్సిస్టు దృక్పథాన్ని చూసే సాహిత్య చరిత్ర లేకపోవడం వల్ల, అంతకుముందు ఇటువంటి సమ్మిళిత రచనా విధానం లేకపోవడమూ విచిత్రమనిపించే అవకాశం ఉంది.

## 5.8.3.2.5. ఒకరిద్దరి పేర్లతో యుగం :

ఒకరిద్దరి గురించి ఒక యుగాన్ని ప్రత్యేకంగా చేయవలసి అవసరం లేదనే విమర్శను దృష్టిలో పెట్టుకొని, పునర్ముద్రణ ఆరవసంపుటిని 'నవాబులు- ఆరవీటి రాజుల యుగాలు' గా కలిపేసి ప్రచురించారు. "సుల్తానుల" యుగం అని మాత్రం మార్పు చేయలేదు. కవుల్ని పోషించిన వారందరూ సుల్తానులే అనుకోవడానికి వీలులేదు. ఇబ్రహీమ్ కుతుబ్‌షా ఆస్థానంలోని మీర్‌జుమ్లా పదవిలో ఉన్న, అమీర్‌ఖాన్ కూడా తెలుగు కవుల్ని పోషించినట్లు తెలుస్తుంది. నేలటూరి వారి విమర్శలో 'నవాబుల యుగం' బదులు 'సూల్తానుల యుగం' అని మార్చుకుంటే బాగుంటుందనేది, గత ప్రణాళికకు కట్టుబడే ఆరుద్ర మార్పుచేయలేదనిపిస్తుంది. అలాగే 'నరపతి యుగం' అనిపేరు పెట్టడం కూడా సరైందికాదనేది ఇద్దరి కృషి వల్ల నవాబుల యుగం ఎలా సరైందికాదో, 'నరపతి విజయం' గ్రంథాల్ని ఒక కావ్యం రాసినంత మాత్రం వల్ల సాధ్యం కాదనేది గుర్తించారు. కనుకనే పు.ము.లో 'గజపతి యుగాన్ని' అలాగే ఉంచేసినా, 'నరపతి యుగం' అనేమీ ప్రత్యేకించి పెట్టలేదు. అయినా, ఖండవల్లి వారు 'నరపతియుగం ఎందుకుండకూడదనడం'లో వ్యంగ్యమే తప్ప, సీరియస్ విమర్శకాదని, లోతుగా ఆలోచిస్తే అర్థమవుతుంది.

## 5.8.3.2.6. విస్మరించిన ప్రక్రియావైవిధ్యం :

సాహిత్యప్రక్రియా వైవిధ్యం గల 17వ శతాబ్ది సాహిత్య కాలాన్ని 'నాయకరాజుల యుగం' గా పెట్టడం వల్ల ప్రక్రియాప్రత్యేకతను విస్మరించినట్లవుతుందనే విమర్శ పరిశీలనాంశమే!

దీన్ని ఒక్కమాటలో చెప్పుకోవాలంటే, కాలానుక్రమణతో చారిత్రకాంశాల్ని మిళితం చేసి సాహిత్య చరిత్రను అవగాహన చేసుకోవడానికే తప్ప "ప్రక్రియ" ప్రత్యేకతను విస్మరించాలని కాదు. క్రీ.శ.1550 లో తంజావూరు నాయక రాజ్యస్థాపన జరిగినా, రఘునాథుడు ప్రాజ్ఞుడయ్యేవరకూ సాహిత్యం మొగ్గతొడగలేదు. క్రీ.శ.1600 నుండి 1675 వరకూ గల రాజకీయ చరిత్రను అవగాహన చేసుకోవడం ద్వారా సాహిత్య చరిత్రను స్పష్టంగా అర్థంచేసుకోవచ్చునని ఆరుద్ర భావించారు (పు.ము.VII 7-1) దీనిలో కాలాన్నే చారిత్రక స్పష్టతకు ఆధారంగా తీసుకున్నారని అర్థమవుతుంది. అయితే, పద్మనాయక, రెడ్డిరాజుల యుగం నుండీ 'భాస్కర రామాయణ కవులు' (పు.23) కావ్య వస్తువుని బట్టి పేరు పెట్టినట్లు కన్పించినా, గజపతుల, తొలిరాయల యుగం (నాల్గవ సంపుటి) లో అడిదంకవులు (పు.226) మలిరాయల యుగం (అయిదవ సంపుటి) లో పిడపర్తి కవులూ, తాళ్ళపాక కవులూ (పు.205), నవాబుల, ఆరవీటి రాజులయుగాలు (ఆరవ సంపుట) లో పెనుమత్సకవులు (పు : 38) తెనాలి కవుల బంధువులు (పు.61) వంటి కవుల ఇంటిపేర్లు, కవుల బంధుత్వాలతో పేరు పెట్టి ప్రత్యేక ప్రకరణాలుగా పరిశీలించినా, ప్రక్రియాపరంగా పరిశీలించినట్టు భావించినట్లుకాదు. కానీ, ఆరవ సంపుటి రచనకొనసాగించేసరికి ప్రక్రియాపరంగా 'యుగవిభజన' కి అంతటికీ 'పేరుపెట్ట లేకపోయిన పరిస్థితుల్లో' కూరుకుపోయినా, దాన్ని ప్రకరణలుగా పెట్టి పరిశీలించడం ద్వారా కొంతవరకూ విమర్శలనుండి బయటపడవచ్చునని భావించినట్లు కన్పిస్తుంది.

నాయక రాజుల యుగంలో వచ్చిన వివిధ ప్రక్రియల్ని విస్మరించలేదని చెప్పడానికి వీలుగా పునర్ముద్రణ పదవసంపుటి (పు.237) లో కృష్ణ దండకం (టేకుమళ్ళరంగశాయి) రాజగోపాలదండకం (కావటూరి రాఘవయ్య ) విద్యావతీ దండకం (గణపవరపు వెంకటకవి) వంటివాటిని పేర్కొన్నారు. తన ప్రణాళికలో వేసుకొన్న యుగవిభజనను సమర్థించుకొన్నట్లే రెండు ప్రయోజనాలు నెరవేరతాయని భావించి ఉండవచ్చు. "కుల పురాణాలు, స్థలపురాణాలూ, సిసలు పురాణాలూ", శీర్శికతో (పు.ము VI-319) ఒక ప్రకరణాన్ని పెట్టడమే ప్రకియాపరమైన విభజన ఆవశ్యకతకు నాంది పలికినట్లుగా భావించాలి. దక్షిణాన ఉన్న నాయ. కరాజుల కాలంలో గల సాహిత్యంలో వచ్చిన ప్రక్రియల్ని సమీక్షించడం కూడా యుగవిభజనను సమర్థించుకొంటూనే రచనను కొనసాగించారు. 'ద్విపద భారత కవిత్రయం' వంటి విభాగం చేసి పరిశీలించి నందుకు ఈ యుగసాహిత్య వికాసానికి ఒక పరిపూర్ణత సమకూరిందని తాపీ ధర్మారావు ప్రశంసించారు. 'ఆధునిక అభ్యుదయయుగం' అనడంలో 'ఆధునికత' అనేది తాత్త్వికార్థంలో కన్పిస్తుంది. 'ఆధునికత' అనేది కాలవాచిగానూ, తాత్త్వికార్థంలోనూ ప్రయోగిస్తుంటారు. కాలవాచిగా భావిస్తే 'ఆధునిక' అనేదొక నిత్యస్రవంతికనుక కుదరదు. 'తాత్త్విక అంశంగా' భావించడంవల్ల భావజాలాన్ని అర్థం చేసుకోవడాని బాగా అవకాశం కలుగుతుంది. ప్రాచీనం, అర్వాచీనం, సమకాలీన వంటివికూడా చర్చనీయాంశాలే. ఒక కవితరువాత వెంటనే ఉన్న కవిని చెప్పడానికి అర్వాచీన శబ్దం, అంతకుముందున్న కవిని చెప్పడానికి ప్రాచీనం, ఒకే కాలంలో ఉన్నవారికి చెప్పడానికి 'సమకాలీన' శబ్దాల్ని గ్రహించవలసింది. ఈ దృష్టితో ఆధునిక అనేది కాలవాచిగా తీసుకున్నా, తాత్త్వికార్థంలోనే ఆరుద్ర ఎక్కువగా ఉపయోగించుకున్నట్లు తెలుస్తుంది. ఆధునిక కాలంలో ఆంగ్ల ప్రభావంలో వచ్చిన కథ, నవల వంటి ప్రక్రియల్ని చెప్పడానికే, భావకవిత్వం, అభ్యుదయ కవిత్వాన్ని వివరించడానికి తాత్త్వికార్థాన్నే తీసుకొని ;

ప్రక్రియాపరమైన యుగవిభజన ఏక సూత్రతకు కట్టుబడినట్లూ తాత్త్వికార్థంలో విశ్లేషించినప్పుడు యుగవిభజనలో ఏకసూత్రతలోపించినట్లు నిరూపితమవుతుంది.

## 5.8.3.2.7. కవుల్ని విస్మరించడం–తారుమారు చేయడం :

చాలామంది కవుల్ని ఒకోయుగంలో పేర్కొనకుండా విస్మరించారనీ, ఒకయుగంలో ఉండవలసి కొంతమంది కవుల్ని మరొక యుగంలో వివరించారని నిడదవోలు, దివాకర్ల, నేలటూరి మొదలైన వారు విమర్శించారు. భారతి పత్రికల్లో ఈ విమర్శలు, స. ఆం.సా. వెలువడుతున్నప్పుడే కొన్నింటిని చేశారు[87]. మరికొన్నింటిని తొ.ము. పీఠికల్లో పేర్కొన్నారు. కనుక, వస్తున్న విమర్శల్ని ఎప్పటికప్పుడు ఆరుద్ర సహృదయంతో స్వీకరించి మార్పుల్ని చేసుకోవడం తొ.ము. సంపుటాల్లోనూ కన్పిస్తుంది. కానీ, పునర్ముద్రణ నాటికి వీటిని సరిచేయడానికి ప్రయత్నించారు. ఈ వివరాలన్నీ 'మార్పులు చేర్పులు' వివరించిన అధ్యాయంలోనూ,కవుల్ని వరసగా పేర్కొన్న అనుబంధంలోనూ గమనించవచ్చు. ఎప్పటికప్పుడు సరిచేసుకొంటూ సంపుటాల్ని విడుదల చేయడం వల్ల కొంతమంది కవులు పునరావృతమైన పరిస్థితి ఏర్పడింది దీన్నీ 'అనుబంధం' లో గమనించవచ్చు రచనాపద్ధతి కొంత గందరగోళంగా ఉండి, చర్చించవలసి విషయాన్ని పక్కదోవపట్టిస్తున్నట్లు అన్పించడానికి ఈ పరిస్థితి కూడా కొంతవరకూ దోహదం చేసిందనుకోవచ్చు. పునర్ముద్రణ లోనూ ఈ గందరగోళ పరిస్థితి నుండి తప్పించుకోలేక, పాదసూచికల్నిచ్చి, కొంత కొత్త సమాచారాన్ని చేర్చడానికి ప్రయత్నించారు. దీనికి మరొక కారణాన్ని కూడా ఊహించే అవకాశం ఉంది. రచన కొనసాగుతున్నప్పుడో, కొనసాగించేసి, ముద్రణకెళ్ళిపోయిన తర్వాతనో మరికొన్ని ఆకరాలు లభ్యం కావడం, వాటిని "పరిశోధకుడు"గా వదిలేయులేక మరిన్ని విషయాల్ని అందించాలనే జిజ్ఞాస వల్ల కూడా పాదసూచికల వంటి వాటిలో వివరించారు. పునర్ముద్రణలో మార్పులు-చేర్పులూ కొన్ని చేయవచ్చు గానీ, రచనను అంతటినీ మళ్ళీ రాయడమంటే, కొత్తగా 'సాహిత్య చరిత్ర' ను రాయడమే అయ్యి ఉండేది. ఒక పరిశోధకుడుగా తాను సేకరించిన ఆకరాలతో నిర్మితమైన విషయాన్ని పూర్తిగా తొలగించడాకిష్టపడకుండా, వాటినే మార్పులు చేసుకోవడానికి ప్రయత్నించడం వల్లకూడా పాదసూచికలతో కొత్తవిషయాల్ని చేర్చినా, 'గందరగోళం' నుండి తప్పించుకోలేకపోయారు.

కవుల తారుమారు గురించి నేలటూరివారు విమర్శిస్తూ ఆరవీటిరాజుల యుగం (తొ.ము)లో పింగళి సూరపరాజు ఉండడం అసమంజసమన్నారు. కానీ, రామరాజు రంగప్పరాజు, బొడ్డుచెర్ల తిమ్మన ఈ యుగంలో కొస్తారన్నారు. అలాగే పచ్చకప్పురం తిరువేంగళరాజు ఆరవీటి యుగంవాడుకాడు, అచ్యుతదేవరాయుల కాలంవాడు. మధురను క్రీ.శ.1530 ప్రాంతంలో పరిపాలిస్తున్న గోళ్ళనాయకులకు ఆశ్రితుడు. ఈ కవిని ఆరవీటి యుగంలో చేర్చడం సబబుకాదన్నారు.

పునర్ముద్రణలో ఆరుద్ర, ఈ కవుల్ని వివిధ యుగాల్లోకి మార్చేశారు. పింగళిసూరనను ఆరవసంపుటి (పు.93)లోనూ, తొ.ము IX (పు.22) లో ఉన్న పచ్చకప్పురపు తిరువేంగళరాజుని ఆరవసంపుటి (పు.ము.పు.161) లోకి మార్చేశారు. ఇలాగే మిగిలిన కవుల్ని కూడా మార్పుచేశారు. కానీ, కారణాల్ని

చెప్పడానికి ప్రయత్నించలేదు. విమర్శకులు సూచించికకాలాన్ని బట్టే ఆరుద్ర ఈ మార్పులు చేసినట్లు అర్థంచేసుకోవలసి ఉంది.

"కవిత్వపు జిలుగులు నగిషీలు మలచలేకపోయినా మంచి కథలను సూటిగా చెప్పగల దూబగుంట నారాయణ కవి ఉపేక్షింపదగినవాడు కాదు నామతం లో" అని ఖండవల్లి లక్ష్మీరంజనం వ్యక్తం చేసిన అభిప్రాయం, ఈ కవిని ఆరుద్ర విస్మరించారనే భావాన్ని స్ఫురింపజేస్తుంది. తొ.ము(VI పు.123-140) లోనూ, పు.ము (IV పు.232-242) లోనూ ఆరుద్ర సుదీర్ఘంగానే వివరించారు. ఖండవల్లి వారి అభిప్రాయం దూబగుంట నారాయణ కవి గొప్పతనాన్ని చెప్పడమే అయినా, దురవగాహనకల్గించే వాక్యరచనా పద్ధతి కన్పిస్తుంది. దీనివల్ల ఆరుద్ర, దూబగుంట నారాయణ కవి ని విస్మరించారనుకొనే విమర్శకు తావిస్తుంది.

నిడదవోలు వారు 'భారతి' పత్రికల్లో స. ఆం.సా.తొలి ముద్రణ సంపుటిల్ని సమీక్షిస్తూ, విస్మరించిన కవుల్ని కొంతమందిని పేర్కొనగా, తరువాత సంపుటాల్లో ఆరుద్ర సరిచేసుకున్నారు. అంగర నరసింహకవి గురించి నిడదవోలు వారు 1966 ఫిబ్రవరి 'భారతి' లో విమర్శించగా, బహుశా అప్పటికే ముద్రణకు పంపేయడంవల్లనో, మరోకారణం చేతనో తొ.ము. 9వ సంపుటిలోనూ, పదవ సంపుటిలోగాని చేర్చకుండా పదకొండవ సంపుటి (తొ.ము.XI పు.267) లో చేర్చారు. ఈ కవి కాలాన్ని క్రీ.శ.1510 ప్రాంతంగా నిడదవోలు వారు సూచించగా ఆరుద్ర మాత్రం తగిన ఉపపత్తుల్ని చూపిస్తూ 1650 ప్రాంతాలవాడను కోవచ్చు అన్నారు. సమకాలీన విమర్శకుల, పరిశోధకుల అభిప్రాయాన్ని ఎప్పటికప్పుడు (up to date) గమనిస్తూనే, పరిశోధనకు ఏచిన్న ఆకరం లభించినా, దాన్ని గురించి ఆలోచించే పరిశోధన జిజ్ఞాస, ఉత్సాహం, శ్రద్ధ ఆరుద్రలో కన్పిస్తున్నాయని తెలుస్తుంది. సత్యాన్వేషణ లో పరిశోధకుడు నిరంతరం జాగృతమై ఉంటూ వర్తమానంతో పయనించగలిగినప్పుడే ఉత్తమ పరిశోధన ఫలితాన్ని సాధించడానికి అవకాశం ఉంటుందని భావించిన వారిలో ఆరుద్ర ఒకరని ఈ నిరూపణలు తెలుపుతున్నాయి. అయితే, స. ఆం.సా.లో యుగవిభజన ప్రణాళికను మార్పుచేసుకొంటూ వస్తున్నట్లు తొ.ము. లొ వివిధసంపుటాల్లో కన్పిస్తుంది. పునర్ముద్రణ అన్ని సంపుటాలకూ ఉమ్మడిగా రాసిన 'మనవిమాటలు' లో "ఆదిలో వేసుకొన్న ప్రణాళికనే తెలపడం, సురవరం ప్రతాపరెడ్డి, ఆంధ్రుల సాంఘిక చరిత్ర"లో పాటించిన యుగవిభాగం లో యుగాల అంకెల్ని, రాజవంశాల ప్రాముఖ్యాల్ని పెంచవలసి వచ్చిందన్నా, పునర్ముద్రణ లో చేసిన "కాలవిభజన" ను ప్రత్యేకించి స్పష్టం చేయలేదు. కనుక, యుగవిభజనలో కాలాన్ని పరిశీలించవలసి ఉంది.

## 5.8.3.3. యుగవిభజనలో కాలస్పష్టత:

చరిత్రకైనా, సాహిత్యచరిత్రకైనా కాలస్పష్టత చాలా ముఖ్యమైంది. ఆరుద్ర, సమగ్ర ఆంధ్ర సాహిత్యంలో కాలానుసరణని, చారిత్రక, సామాజిక అంశాల్ని మిళితం చేసి సాహిత్య చరిత్రను రచించినా, కాలాన్ని స్పష్టంగా చెప్పకుండా, రాజులపాలనా కాలాన్ని పేర్కొని, యుగవిభజనచేసి, రచనకొనసాగించారు. కాలనిర్దేశంలో వివిధ రాజులపాలనాకాలాలు కలిసిపోవటం వల్ల స్పష్టంగా గీతగీసినట్లు చెప్పకుండా తప్పించుకున్నారు. కానీ, సురవరం ప్రతాపరెడ్డి చేసిన యుగవిభజన ప్రభావం ఆరుద్రలో కన్పిస్తుంది.

## 5.౪.3.3.1. యుగవిభజన–ఆరుద్ర అనుసరణ :

సురవరం ప్రతాపరెడ్డి 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర' 'విషయసూచికలో యుగ' విభజనను కింది విధంగా పేర్కొన్నారు.

1. తూర్పుచాళుక్యయుగం 2. కాకతీయుల యుగం 3. రెడ్డిరాజుల యుగం 4. విజయనగర సామ్రాజ్యకాలం (క్రీ.శ.1339 నుండి1530 వరకూ) 5. విజయనగర సామ్రాజ్యకాలం (క్రీ.శ.1530–1630వరకు) 6. క్రీ.శ.1600 నుండి 1757 వరకూ. 7. క్రీ.శ.1757 నుండి 1857 వరకు, 8. క్రీ.శ.1857 నుండి 1907 వరకు.

వీటిలో మొదటి మూడు యుగాలకీ కాలాన్ని, చివరిమూడు యుగాలకే పేర్లనీ వీటిలో సురవరం వారు సూచించలేదు. కానీ,విషయవివరణలో తూర్పు చాళుక్యుల కాల చరిత్ర సరిగ్గా తెలియదని, నన్నయకాలాన్నుండి కాకతీయ ప్రాబల్యం వరకూ, ఇంచుమించు క్రీ.శ.1000–1200 వరకూ ఈ 'తూర్పు చాళుక్య యుగం' లో చర్చించేది స్పష్టం చేశారు[88].

అదికవి నన్నయ క్రీ.శ.1050 ప్రాంతానికి చెందినవాడనీ, తూర్పుచాళుక్యుల కవి కనుక చాళుక్య, కాకతీయ కాలాలు రెండూ కలవడం వల్ల, 'కాకతీయ యుగం' క్రీ.శ.1050 నుండి 1323 వరకూ వివరిస్తున్నట్లు సురవరం వారు చెప్పారు.

కాకతీయ సామ్రాజ్యం పడిపోయినతర్వాత సామంతులు, సేనానులు స్వతంత్ర రాజ్యాన్ని స్థాపించుకొన్నా, అందులో రెడ్డి, వెలమ రాజ్యాలే ముఖ్యమైనవనీ, అసమయంలోనే విజయనగర రాజ్యం కూడా అంకురించినా, మూడింటి కాలంలో రెడ్డిరాజ్యమే, దానిపతనకాలం వరకూ ప్రాధాన్యత వహించిందన్నారు. రెడ్డిరాజులు క్రీ.శ.1324నుండి ఇంచుమించు క్రీ.శ. 1434 వరకూ రాజ్యం చేశారని, 'రెడ్డి రాజుల యుగాన్ని' వివరించారు. స్పష్టంగా కాలాన్ని చెప్పలేదు.

విజయనగర సామ్రాజ్యకాలాన్ని విషయసూచికలో చెప్పినట్లే క్రీ.శ.1339–1530, క్రీ.శ. 1530–1630 వరకూ రెండు యుగాలుగా వివరించి, తర్వాత కాలాన్ని గురించి క్రీ.శ. 1565లో జరిగిన తళ్ళికోట (రాక్షసి-తంగడి) యుద్ధం తర్వాత రాజకీయదౌర్బల్యం ఏర్పడిందన్నారు. "క్రీ.శ.1600 వరకూ గోలకొండసుల్తానులు తప్ప తక్కిన తురకలెవ్వరును" రాజ్యం చెయ్యలేదన్నారు. క్రీ.శ.1600 తర్వాత150యేళ్ళపాటు "తురకల" దాడులెక్కువైయున్నారు. (పు.288) క్రీ.శ.1600 నుండి ఆంధ్రుల రాజకీయం పతనమైనా, దక్షిణంలో రఘునాథనాయకుని కాలం (క్రీ.శ. 1614–1633) లో ఆంధ్రుల గొప్పతనం నిలిచింది. (పు.306) క్రీ.శ.1757 నుండి 1857 వరకూ మరొక యుగాన్ని పరిశీలిస్తూ, 1857లో సిరాజుద్దౌలా చనిపోవడం, మొగల్ సామ్రాజ్య క్షీణత, మహారాష్ట్రుల ఆధిక్యత కన్పిస్తున్నాయి. (పు.308) విజయనగర సామ్రాజ్య కాలం తరువాత, విదేశీయులలో పోర్చుగీసు, ఫ్రెంచి, ఆంగ్లేయుల ప్రభావం 1857 వరకూ ప్రముఖంగా కన్పిస్తుంది. భారతచరిత్రలో ముఖ్యఘట్టం 1857. దీంతో ఆధునికయుగంలో ప్రవేశించినట్లు (పు.346) చెప్పి, 1857 లో ఆంగ్లరాజ్యం దేశమంతా స్థిరపడిందన్నారు

(పు.348) ఇది "ఆధునిక యంత్ర యుగం" కావడంతో **90** ఏళ్ళ చరిత్ర విద్యావంతులకందరికీ బాగాపరిచమైంది. అందుచేత **1857-1907** వరకూ ఒక యుగంగా భావించి వివరించారు. దీన్నెంతవరకూ ఆరుద్ర అనుసరించారో, అనుకరించారో పరిశీలిస్తూనే ఆరుద్ర చేసిన యుగవిభజనలో కాలస్పష్టతను అర్థం చేసుకోవచ్చు.

## 5.8.3.3.2. కాలానుసరణలో ఆరుద్ర నైపుణ్యం :

అనుసరణలో ప్రామాణికంగా స్వీకరించడం జరిగితే, 'అనుకరణ' లో మూలభావాన్ని గ్రహిస్తున్న విషయాన్ని గుప్తంగా దాచేసి, ఆకరాల్ని చూపకుండా తానే ఆద్యుడనే స్ఫురణకలిగించడం ఉంటుంది. ఆరుద్ర, సురవరం వారిని అనుసరించారు తప్ప అనుకరించలేదు. అయితే, దాన్ని అనుసరించినా, తనదైన నైపుణ్యాన్ని ఆరుద్ర ప్రదర్శించారు. ఆరుద్ర ఆదిలో వేసుకున్న ప్రణాళిక :

1. ఆదిమ, చాళుక్య యుగాలు (క్రీ.శ.12వ శతాబ్దం చివరిదాకా);
2. కాకతీయ యుగం (క్రీ.శ.1200-1290);
3. పద్మనాయకయుగం (క్రీ.శ.1337-1399);
4. రెడ్డిరాజులయుగం (క్రీ.శ.1400-1450);
5. తొలిరాయల యుగం (క్రీ.శ.1450-1500);
6. మలిరాయల యుగం (క్రీ.శ.1500-1550);
7. నవాబులయుగం (క్రీ.శ.1500-1600);
8. నాయక రాజులయుగం (క్రీ.శ.1600-1670);
9. కడపటిరాజులయుగం (క్రీ.శ.1670-1750);
10. కుంఫిణీ యుగం (క్రీ.శ.1750-1850);
11. జమిందారీ యుగం (క్రీ.శ.1850-1900);
12. ఆధునిక యుగం (క్రీ.శ.1900 నుండి.....)

కానీ, ఈ ప్రణాళికలోని కాలాన్ని అనుసరించి సమగ్ర ఆంధ్ర సాహిత్యం తొలిముద్రణగానీ, పునర్ముద్రణ గానీ వెలువడలేదు. పునర్ముద్రణలో సమగ్ర ఆంధ్ర సాహిత్య యుగవిభజన కాలాన్ని కింది విధంగా గుర్తించే అవకాశం కన్పిస్తుంది.

## 5.8.3.3.2.1. ఆదిమ, చాళుక్యయుగం (12వ శతాబ్ది చివరివరకూ):

మొదటి సంపుటిని మల్లికారాధ్యుడు (కీ.శ.1197 మరణించాడని (పు.ము.పు.283) అనడంలో 12వ శతాబ్ది చివరివరకూ కొనసాగించారు. ఆంధ్రుల జాతి,భాష, శాసనాలు, సాహిత్య పుట్టుక అభివృద్ధుల్నివివరించి, నన్నయ సాహిత్యాన్ని ప్రధానంగా విశ్లేషించి, చాళుక్యులు కాలాన్ని వివరించారు.

## 5.8.3.3.2.2. కాకతీయ యుగం (క్రీ.శ.1200–1325):

రెండవ సంపుటి కాలం : క్రీ.శ.900–912కి మూడు తరాల ముందే కాకతీయుల పరిపాలన ప్రారంభమైనా, క్రీ.శ.1200 తర్వాతనే మహాసామ్రాజ్యం కావడం, ఆఖరిరాజు ప్రతాపరుద్రుడు ఢిల్లీ సైన్యాలకి పట్టుబడటంతో క్రీ.శ.1323 తో అంతరించింది. కనుక కాకతీయ యుగం క్రీ.శ.1200–1325 వరకూ పరిగణిస్తున్నట్లు వివరించారు. ఆదిలో వేసుకున్న ప్రణాళికలో క్రీ.శ.1200–1290 అని చెప్పుకున్నా, దాన్ని పాటించకుండా మార్పుచేశారు. సురవరం వారు క్రీ.శ.1323 వరకూ విభజించారు. రెండు సంవత్సరాల తేడాతో సురవరం వారిని అనుసరించారు.

## 5.8.3.3.2.3. పద్మనాయక, రెడ్డిరాజులయుగం (క్రీ.శ.1325–1450):

మూడవసంపుటి (పు.ము) పద్మనాయక, రెడ్డిరాజులయుగం : రేచర్లవారు వెలమవీరులు. వీరినే పద్మనాయకులు అంటారు. కాకతీయుల కాలంనుంచీ సేనానులైన వీరు, రుద్రమదేవి గద్దెనెక్కడంలో అండగా నిలవడంవల్ల ప్రతాపరుద్రని కాలం వరకూ, వీరికి ప్రముఖ పదవులే లభించాయి. వీరిలో రేచర్ల సింగమనాయకుడు బలవంతుడైనా, సోమవంశక్షత్రియులు క్రీ.శ.1340ప్రాంతాల్లో మాయోపాయంతో చంపారు. సింగమనాయకుని కొడుకులు శత్రువుల్ని చంపి, పద్మనాయకరాజ్యాన్ని సుస్థిరం చేశారు. తెలంగాణాలో ఈ రాజ్యవిస్తరణ జరుగుతుంటే, అద్దంకిలో రెడ్డిరాజులు స్వతంత్ర రాజ్యం నిర్మించుకున్నారు. ఒకరకంగా పద్మనాయకులూ, రెడ్డిరాజులూ ఆనాటి తెలుగురథానికి రెండు చక్రాలు వంటివికనుక, కాకతీయ సామ్రాజ్యం అస్తమించిన తర్వాత, విజయనగరం విస్తరించి రాయలయుగం ప్రారంభమయ్యేవరకూవున్న మధ్యకాలం 150 సంవత్సరాలలో, పూర్వార్థాన్ని పద్మనాయక యుగమనీ, ఉత్తరార్థాన్ని రెడ్డిరాజుల యుగమని పేర్కొన్నారు. పద్మనాయకుల యుగంలోని ఇతర రాజుల ప్రాపకంలో ఉన్నకవులవరకూ క్రీ.శ.1375 వరకూ పద్మనాయకయుగం అన్నారు. అది ప్రణాళికలో అనుకొన్నట్లు నిర్దిష్టంగా కాలాన్ని స్పష్టం చేయలేదు. కానీ, అంతరిక సాక్ష్యాల్ని అనుసరించి క్రీ.శ.1450 వరకూ ఈ యుగాన్ని నిర్ణయించే వీలుంది

## 5.8.3.3.2.4. గజపతుల, తొలిరాయల యుగం (క్రీ.శ.1450–1500):

నాల్గవ సంపుటి (పు.ము) గజపతుల, తొలిరాయలయుగాలుగా గుర్తిస్తున్నట్లు చెప్పినా, కాలాన్ని స్పష్టంచేయకుండా, రాజుల కాలాన్ని వివరించారు. గజపతుల రాజకీయ చరిత్ర తొలిదశరెడ్డిరాజుల అవసాన కాలంతోనూ, చివరిదశ మలిరాయుల యుగంతోనూ పెనవేసుకొందన్నారు. (పు.20) మొదటి హరిహర, బుక్కరాయలు యుగం, సంగమవంశంలో కడపటి రాజులూ, సాళువ వంశపు వారూ పరిపాలించిన (క్రీ.శ.1450–1500) కాలాన్ని తొలిరాయల యుగంగా చర్చిస్తున్నట్లు చెప్పారు (పు.25).

## 5.8.3.3.2.5. మలిరాయులయుగం (క్రీ.శ.1500–1543)

అయిదవ సంపుటి (పు.ము) గా వివరించిన మలిరాయలయుగం ఒకవిధంగా 'కృష్ణదేవరాయల యుగం' అనే అవకాశం ఉన్నా, తరువాత ఇంకా మరికొంతమంది పాలనా కాలం వరకూ ఉన్న

కవుల్ని వివరించి సదాశివరాయులు క్రీ.శ.1576 వరకూ పాలించినా, 1543 లో రామరాజు ఆధ్వర్యంలో సదాశివరాయలు విజయనగర సామ్రాజ్యాధిపతి అయినప్పటినుండే ఆరవీటి ప్రాభవం ప్రారంభమైంది. అంటే క్రీ.శ.1500-1543 వరకూ మలిరాయలయుగమని తెలుస్తుంది.

### 5.8.3.3.2.6. నవాబుల – ఆరవీటి రాజుల యుగం (క్రీ.శ.1543-1572):

క్రీ.శ.1518లో బహమనీ ప్రభువు మరణించిన తర్వాత క్రీ.శ.1543 వరకూ సుల్తాన్ కులీకుతుబ్‌షా పరిపాలించాడు. మహ్మద్ కులీ క్రీ.శ.1580 నుంచి 1612 వరకు పరిపాలించాడు. విజయనగర వంశంలోని ఆరవీటి రాజుల్లో తిరుమల దేవరాయలు పాలనలో, విజయనగర విశాల రాజ్యం ముక్కలై, అమరనాయకులు స్వతంత్రులైయ్యారు (పు.14), ముగ్గరు కొడుకులూ పెనుగొండ, శ్రీరంగపట్టణం, చంద్రగిరిలకు పాలకులైయ్యారు. తిరుమల దేవరాయలు క్రీ.శ.1572 లో మరణించాడు. దీన్నే వివరణాత్మకంగా చెప్పారుతప్ప నిర్దిష్టమైన కాల నిర్ణయం చేయలేదు. ఆరుద్ర విశ్లేషణనుబట్టి క్రీ.శ.1543-1572 వరకూ ఆరవసంపుటిలో ఈ యుగానికి కాలనిర్ణయాన్ని చేసుకొనే అవకాశం కన్పిస్తుంది.

### 5.8.3.3.2.7. నాయకరాజుల యుగం :(క్రీ.శ.1600-1674):

ఇది ఏడవసంపుటి, ఈ యుగప్రారంభాన్ని క్రీ.శ.1600 నుండి అనిచెప్పి, మధర, తంజావూరు, చెంజి మూడు నాయకరాజ్యాల్లో చెంజిరాజులే సీనియర్లనీ, క్రీ.శ.1550-1650 వరకూ వీరి సేవకన్పిస్తుందన్నారు. (పు.4) క్రీ.శ.1529 లోనే మధుర నాయక రాజ్యస్థాపన జరిగినా, క్రీ.శ.1623 వరకూ ఎందరో కవుల్ని ఆదరించినా ఆ కవులు పేర్లు తెలియమనారు. క్రీ.శ.1623 లో రాజ్యానికి వచ్చిన తిరుమల నాయకుడు మీద క్షేత్రయ్య రెండువేల పదాల వరకూ చెప్పాడు. తిరుమల నాయకుడు క్రీ.శ. 1659 లో మరణించాడు. తర్వాత నాయకరాజుల్లో ముద్దు అళగిరి తంజావూరుని క్రీ.శ.1674 వరకూ పాలించాడని వివిధ సందర్భాల్లో తెలిపారు తప్ప, ఈ యుగానికీ కాలాన్ని నిర్దుష్టంగా చెప్పలేదు. ఈ యుగకాలాన్ని ఆరుద్ర విశ్లేషణను బట్టి క్రీ.శ.1600-1674 గా (ఏడవ సంపుటి) నాయకరాజుల యుగంగా చెప్పుకొవచ్చు.

### 5.8.3.3.2.8. కడపటి రాజుల యుగం (క్రీ.శ.1674-1762):

క్రీ.శ.1674 లో ఈ యుగం ప్రారంభమవుతుంది, ఇది శివాజీ పట్టాభిషిక్తుడైన సంవత్సరం, క్రీ.శ.1680 లో శివాజీ మరణంతో ఔరంగజేబు సేవలు దక్షిణాపథాన్ని ముట్టడించి, క్రీ.శ. 1686 లో ఒరంగజేబు అక్కన్నమాదన్నను హత్యచేసి, గోల్కొండను స్వాధీనం చేసుకొని, తంజావూరు, మధుర రాజ్యాల్ని కూడా మొగల్ సామ్రాజ్యంలో కలుపుకున్నాయి. ఈ కాలంలోనే డచ్చి, ఫ్రెంచి, ఇంగ్లీషువాళ్ళు వ్యాపారాన్ని అభివృద్ధి చేసుకొని, రాజకీయాల్లోనూ అడుగుపెట్టారు. క్రమేపి వ్యాపారాన్ని అభివృద్ధి చేసుకొంటూనే తమ చాతుర్యంతో దేశమంతా వ్యాపించి, తమ ఆధిక్యతను చెలాయించారు. క్రీ.శ.1762 నాటికి ఇంగ్లీషువాళ్ళ పరిస్థితిని ఆరుద్ర వివరించారు. ఇంగ్లీషువాళ్ళ ప్రాబల్యాన్ని చూసి, తనకి సైనిక సహాయం చేయమని నిజామ్ ఆలీ క్రీ.శ.1761 లో వాలుగు సర్కార్లనిచ్చాడు. కానీ,

ఇంగ్లీషువాళ్ళు అప్పుడుతీసుకోకుండా, నాలుగేళ్ళు ఆగి, నిజామ్ ఆలీ రాజ్యకాంక్షను గమనించి, క్రీ.శ.1762 లో తీసుకున్నారు. అంతటితో కడపటి రాజులయుగం అంతమై కుంఫిణీయుగం ప్రారంభమైందన్నారు. అంటే క్రీ.శ.1674-1762 వరకూ కడపటి రాజుల యుగం (ఎనిమిదవ సంపుటి) గాని నిర్ణయించుకొన్నట్లు స్పష్టమవుతుంది.

## 5.౮.3.3.2.9. కుంఫిణీయుగం-I-II (క్రీ.శ.1757-1857):

దీన్నొక విలక్షణమైన సంధియుగమన్నారు. క్రీ.శ.1757 లో జరిగిన ప్లాసీ యుద్ధం మొదలుకొని క్రీ.శ. 1857 లో ప్రారంభమైన ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామం వరకూ కుంఫిణీ వారు మనదేశాన్ని పరిపాలించారు అంటే కుంఫిణీయుగం రెండు భాగాల్లో రెండు (తొమ్మిది, పది) సంపుటాలో కలిపి వివరించారనీ, క్రీ.శ.1757-1857 కాలాన్ని ఈ యుగకాలం గా నిర్ణయించారని తెలుస్తుంది. కుంఫిణియుగం II (పదోసంపుటి) లో అందుకనే యుగకాలవిభజనను ప్రత్యేకించి వివరించలేదు.

## 5.8.3.3.2.10. జమీందారీ నవ్యసాహిత్య యుగాలు-I-II (క్రీ.శ.1857-1930)

క్రీ.శ.1757 నుండి 1857 వరకూ కుంఫిణియుగమని చెప్పుకున్నామని చెప్పి, క్రీ.శ.1857 నుండి జమీందారీ యుగంగా భావిస్తున్నట్లు స్పష్టంగా చెప్పినా, కుంఫిణీయుగ లక్షణాల ప్రాదుర్భావం లేకపోలేదన్నారు. వీటిని రెండు (పదకొండు, పన్నెండు) సంపుటాలుగా విభజించారు! శతాబ్దాల రాచరిక సేవలకు అలవాటుపడ్డ పాలితులు, అందులోనూ సైనికులు ఒక ప్రభుత్వాన్ని ఎదిరిస్తే, దానికి ప్రత్యామ్నాయంగా మరొక ప్రభుత్వపు కాడికి మెడవంచక తప్పదు. కుంఫిణీ వారి దొరతనాన్ని ప్రతిఘటిస్తున్న సైనికులు 1857 లో ఢిల్లీ ఎర్రకోటను స్వాధీనం చేసుకొని రెండవ బహదూరుషా (1837-1857) అనే పాదుషాను కుంఫిణీవారు అధికారం నుండి తొలిగించి, పింఛను నిచ్చి ఎక్కడో పడి ఉండమన్నారు. క్రీ.శ.1757 ప్లాసీయుద్ధంలో విజయం పొందిన కుంఫిణీ వారికి, సరిగ్గా నూరేళ్ళకు 1857 లో చుక్కెదురయ్యిందన్నారు. అంటే 1857 నుండీ జమీందారీ యుగం ప్రారంభం చెప్పినా, ఈ యుగాలముగింపును మాత్రం ఎక్కడివరకో స్పష్టం చేయలేదు. కానీ, జమీందారీ నవ్యసాహిత్య యుగం II (పు : 367) లో "మొదలైనవారు మిగిలిన" వారు ప్రకరణలో గురజాడ అప్పారావు గారు జమీందారీ యుగం లోని పుస్తకాలకు గుర్తింపు ఎలా తెచ్చివారో స్పష్టంచేశారని, పాదసూచికలో 'డిసెంటుపత్రం' వివరాలిచ్చి కొంత 'కోట్' చేశారు. మరోచోట జమీందారుల పోషణలో మొదలు పెట్టిన ఈ నిఘంటు నిర్మాణం (శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటువు) ఆధునిక యుగంలో పూర్తయ్యిందని, ఆసంగతులు తర్వాత యుగంలో చెప్పుకుందామన్నారు. (పు : 359) నిఘంటునిర్మాణం విషయమై జయంతి రామయ్య 1912లో ఒకవ్యాసం రాసి పండితులకి పంపారని మరోచోట (పు : 358) రాశారు. "పదమూడవ సంపుటి (ఆధునికయుగం)": అని అట్టపై ఉన్నా "ఆధునిక అభ్యుదయ యుగం" అని మొదటి ప్రకరణం 1929 సంవత్సరంతో ప్రారంభమవుతుంది. వెంటనే 1930 నుండి 1940 దాకా జాతీయంగానూ, అంతర్జాతీయంగానూ, అందులోనూ తెలుగు సాహిత్యంలో గొప్పమార్పులు

వచ్చాయన్నారు : (పు:1) ఈవివరాలన్నింటినీ బట్టి, పదకొండు, పన్నెండవ సంపుటాల్ని జమీందారీ నవ్యసాహిత్యయుగం క్రీ.శ.1857-1930 నిర్ణయించవచ్చు.

## 5.8.3.3.2.11. ఆధునిక అభ్యుదయ యుగం (1930-1980) :

ఈ పదమూడవ (చివరి) సంపుటిని 1930 లో గుర్తించదగిన మార్పుతో ప్రారంభించి, అభ్యుదయసాహిత్య ఉద్యమాన్ని, వచనకవితా పరిణామాన్ని తెలంగాణా సమర సాహిత్యాల్ని వివరిస్తూ, చివరిగా తుమ్మల వెంకట్రామయ్య (1914-1987) సాహిత్యకృషితో 'స్వస్తివాచకం' పలికారు. దీనిలోనూ కాలాన్ని స్పష్టంచేయలేదు. కానీ, అంతర్గత సాక్ష్యాధారాల్ని బట్టి ఈ నిర్ణయాలు చేయడానికి వీలవుతుంది. ఆధునిక యుగాన్ని కూడా ఇంతకుముందున్న కొన్నియుగాల్లో 50 సంవత్సరాల కాలవ్యవధిని అనుసరించడాన్ని బట్టి, 1987 వరకూ జీవించిన తుమ్మల వెంకట్రావు గురించి వివరించినా, 1987 వరకూ సాహిత్యాన్ని వివరించలేదు. 1975 తర్వాత కూడా అభ్యుదయ ఉద్యమమే కొనసాగిందని శ్రీశ్రీ రచనల విశ్లేషణలను బట్టి అవగాహన చేసుకొని, 1980 వరకూ ఈ నిర్ణయం చేయడానికి వీలవుతుంది. కాలనిర్ణయంలోనూ అభ్యుదయ దృష్టి ఉండడం వల్లనే, 1980 నాటికే సాహిత్యంలో కన్పిస్తున్న స్త్రీవాద ధోరణిని చెప్పకుండా, అభ్యుదయ ఉద్యమంతో, ఆరుద్ర లక్ష్యాన్ని సాహిత్య ధృక్పథంతో మిళితం చేసి అందించారని గుర్తించగలిగే అవకాశం ఉంది. ఎందుచేతనంటే పునర్ముద్రణ లో తాళ్ళపాక తిమ్మక్క గురించి (పు.ము VI పు.294) వివరిస్తూ తాళ్ళపాక వారి కుటుంబం విస్మరించినా 'సుభద్ర కాల్యాణం' పాటల్ని పాడుకొనేవారు విస్మరించడం లేదన్నారు. "ఆడవారికి మగవారు ఎన్నో అన్యాయాలు చేశారు, చేస్తున్నారు. అందులో ఇదొకటి అనుకోవాలనడం"లో స్త్రీవాద సాహిత్య స్పృహ ఆరుద్రలో కన్పిస్తుంది. ఈ భావాలు పు.ము. నాల్గవ సంపుటిలో కన్పిస్తున్నాయి. ఈ నాల్గవసంపుటి 1990లో ప్రచురితమైంది. స్త్రీవాద సాహిత్యం అప్పటికీ ఉన్నా, అభ్యుదయ సాహిత్యంతోనే సమగ్ర ఆంధ్ర సాహిత్యం ముగించాలనుకున్నారు. దీనికి వైయక్తికంగా రాసే ఓపిక లేకపోవడం గానీ, ప్రచురణ కర్తల ఆలోచనలను ఆశయాలను పరిగణనలోకి తీసుకోవడం కూడా కారణాలై ఉండవచ్చు. లేకపోతే,1975-1985ని మహిళా దశాబ్దంగా గుర్తించి, స్త్రీవాద ధోరణి, ఉద్యమస్థితిని (కొందరు వాదమంటున్నా) అందుకొంటూ వెలువడిన అనేక తెలుగు రచనల్ని ఏమాత్రం స్పర్శించలేదు. తెలుగు కవిత్వాన్నీ, సాహిత్యాన్నీ సుసంపన్నం చేసి, వస్తు, రూపాల్లో విశిష్టతను పొందిన రచనల్ని తీసుకోకపోవడం "ఆధునిక యుగం" సార్థకనామధేయం కాదు. అలాగే, 1984 నాటికే భారతీయ దళిత సాహిత్య అకాడమీ ఏర్పడడం తెలుగులో 1969 కంచకచెర్ల కోటేశుని చంపిన తర్వాత నుండీ దళిత స్పృహతో సాహిత్యం వెలువడి, అభ్యుదయ, విప్లవ సాహిత్యంలో అంతః స్రవంతిగా ప్రవహిస్తూ, 1980ల తర్వాత దళితవాదంగా, 1995 నాటికీ దళిత ఉద్యమంగా మారింది. "ఆధునిక అభ్యుదయ యుగం" అనే పేరుతో 1987 వరకూ ఉన్న సాహిత్యాన్ని రచించిన ఆరుద్ర స్త్రీ, దళిత స్పృహల్ని కూడా గుర్తించకపోవడం సరైన సాహిత్య రచనా విధానం అనిపించుకోదు. గుర్రం జాషువా (పు.ము XIII పు.69-78) లో గల "కవికోకిల" నే చూడగలిగారు గానీ, దళిత స్పృహను రానివ్వకుండా, "అంటరానికుల" భావనతోనే సమీక్షించారు. అయితే, ఆరుద్ర లో ఈ సంపుటి రచన కొనసాగేనాటికి

దళిత స్పృహలేదనుకోవడానికి అవకాశం లేదు. అప్పకవి గురించి చెప్తూ "బ్రాహ్మణేతరులకు కావ్యాలు రాసే అర్హతలేదంటాడు. ఆయన గారు అంఘ్రిభవుని కావ్యాన్ని ఆమోదించడు. ఆధునిక యుగంలో ఈ అనుశాసనాలు చెల్లవు".(స. ఆం.సా.పు.ము.XIII పు.69) అని అన్నారు. అంటే, ఆరుద్రకు స్త్రీ, దళిత స్పృహలున్నా, "ఏవో కొన్ని కారణాల వల్ల" వాటిని విస్మరించి, "అభ్యుదయ" సాహిత్యంతోనే ఈ సమగ్ర ఆంధ్ర సాహిత్య రచనను ఆపేయాలని భావించినట్లు స్పష్టమవుతుంది. ఇక, కాలనిర్ణయంలో సురవరం ప్రతాపరెడ్డి వారిని అనుసరిస్తూనే, సురవరం వారికిష్టం లేక పేరుపెట్టకుండానే వదిలేసిన వాటిని తెలివిగా పేరు పెట్టి, కొన్ని సంవత్సరాల్ని అటూ, ఇటూ జరుపుకొని, సాహిత్య చరిత్రకు సాహిత్యేతర ఆధారాన్ని గ్రహించి యుగవిభజన చేయడంలోనే 'సాహిత్యచరిత్ర కారుడు'గా, 'పరిశోధకుడుగా ఆరుద్ర' నైపుణ్యం స్పష్టమవుతుంది. అయితే, శ్రీశ్రీ పట్ల సాహిత్య చరిత్ర కారుడుగా, పరిశోధకుడుగా కూడా ఆరుద్ర కృషిలో కొంత కళంకం కనిపించక తప్పదు. "ఈ శతాబ్దం నాది" అని శ్రీశ్రీ అనడాన్ని విమర్శించి, ఆరుద్ర దాన్ని వక్రీకరణకు గురి చేశారు. ఈ విషయాన్ని తెలకపల్లి రవి చక్కని సమన్వయాన్ని చేయడానికి ప్రయత్నించారు[9]. "ఈ శతాబ్దం నాది" అని ఆయన (శ్రీశ్రీ) అలంకారంగా చెప్పివుండొచ్చు. (అదీ1972లో, అంటే 40 ఏళ్ళు ఆ స్థానంలో వున్నాక) ఆయనే (శ్రీశ్రీ) అంతకుముందు మరోచోట 'అరనిమిషం గడిచే సరికదే నాకు గత శతాబ్దే అనలేదా? ఈరెంటినీ ఎలా అన్వయించుకోవడం? అనితర సాధ్యం నామార్గం అన్నపెద్దమనిషి ప్రతియువకవిని పొగుడుతూ తనకు (ఉదాహరణకు ఆరుద్రను, గజ్జెల మల్లారెడ్డిని) ప్రత్యామ్నాయాలన్నట్లు మాట్లాడలేదా? వీటిలో ఏది ఏమేరకు అంతిమ సత్యం? కవులు, సాహిత్య జీవులు వివిధ దశల్లో ఇచ్చిన వివిధ స్టేట్‌మెంట్లను ముక్కస్యముక్కగా పట్టుకొని విపరీతార్థాలు తీయడం సమంజసమా?" దీనిలో శ్రీశ్రీ రచనా శిల్పాన్ని, కవి ఉద్దేశాన్ని అర్థం చేసుకోవల్సి ఉందనీ, కేవలవాచ్యార్థమే తీసుకొని, అనవసరవ్యాఖ్యానాలు చేయడం శ్రీశ్రీని సరిగ్గా అర్థం చేసుకోకపోగా, భావితరానికి శ్రీశ్రీని, కవిత్వాన్నీ వక్రమార్గంలోకి పయనింపజేయడమే అవుతుంది. సాహిత్య చరిత్రకారుడుగా, పరిశోధకుడుగా ఆరుద్రలో ఇదొక లోపంగానే మిగిలిపోతుంది. అయినా, ఇటువంటివి ఒక్కొక్కటి కన్పిస్తున్నా, తనదైన 'దృక్పథం' ప్రదర్శించి, 'సాహిత్య చరిత్ర' ను కొత్త పద్ధతిలో రాయవచ్చని నిరూపించగలిగారు. సాహిత్యేతర ఆధారాల్నీ స్వీకరించారు. ఈ లక్షణాలు ఆరుద్ర సాహిత్యచరిత్ర మార్క్సిస్టు దృక్పథంలో ప్రత్యేక రచనా పద్ధతి కూడా వెల్లడవుతుంది.

## 5.9. సాహిత్య చరిత్ర– ఆరుద్ర దృక్పథం :

'సాహిత్య చరిత్ర' రచనలో 'దృక్పథం' ఉండటం సమంజసమేనా? అనే ఆలోచనకు అవకాశం ఉంది. కానీ, ప్రతి రచయితకీ ఏదొక దృక్పథం ఉంటుంది. ఆ దృక్పథం ప్రధానంగా సాహిత్య చరిత్ర లో 'యుగవిభజన' చేయడంలో ప్రతిబింబిస్తుంటుంది. అయితే, రచనకు అనుకూలంగా మాత్రమే 'యుగవిభజన' చేసుకొనే వారిలో తమ దృక్పథాన్ని బట్టి మాత్రమే అంచెనా వేయడం సాధ్యం కాదు. సమగ్ర ఆంధ్ర సాహిత్య రచనలో ఆరుద్ర దృక్పథం అవసరమన్నారు. "దేశమంటే మనుషులు, ప్రజలే తమ చరిత్రను సృష్టించుకొన్నట్టు ప్రజలే తమ సాహిత్యాన్ని సృష్టించుకొంటారు.

పామరులు పాడుకొనే నోటిపాటల్లో, సామెతలు, పొడుపు కథలు ప్రాచీన విజ్ఞానానికీ, ఒకనాటి సాహిత్యానికీ గనులు తవ్వి తలకెత్తు కోవలసినవి చాలా ఉన్నాయ" నడంలో సాహిత్య చరిత్ర రచనకి లిఖితమైన ఆధారాలే కాకుండా మౌఖిక ఆధారాల్ని కూడా గ్రహించాలనే అభిప్రాయం వ్యక్తమవుతుంది. వీటన్నింటిలోనూ ఆరుద్ర దృక్పథాన్ని అర్థం చేసుకోవచ్చు. భారతం, అష్టాదశ పురాణాలు వ్యాసప్రోక్తమని చెప్పి, బ్రాహ్మణులకి సకల సౌకర్యాల్నీ కల్పించడంలో పాలక వర్గాల ప్రయోజనం ఉందన్నారు. నన్నయభట్టుని పరిచయం చేస్తూ "ఆంధ్ర సాహితీ పరులంతా ఏటేటా పండుగ చేసుకోదగిన రోజు తెలుగు భారతం పుట్టినరోజు" అన్నారు. 'తెలుగుభాష' లోకి రావడానికే ఈ పండుగ రోజు తప్ప 'తెలుగు భారతం' లో ఉన్నవన్నీ వ్యాసప్రోక్తాలనడం సరికాదు. ఇది "మూలంలో జానెడు బ్రాహ్మణాధిక్య ప్రశంస ఉంటే అనువాదంలో బారెడు చేశారు" అనీ ఆ సన్నివేశాల్ని కొన్నింటిని సోదాహరణంగా నిరూపించడమే నిదర్శనం. శ్రీనాథుని గురించి వ్యాఖ్యానిస్తూ కూడా "తెలుగు భాష" గురించే స్వర్గప్రస్తావన తేవడానికి కూడా ఆరుద్ర వెనుకాడలేదు. "స్వర్గంలోకూడా దేశభాషలందు తెలుగులెస్స అనిచాటే కవి ఉండడం మన సాహిత్యం చేసుకొన్న అదృష్టమే" ( III-పు.378) అనడంలో ఆరుద్రకి 'స్వర్గనరాకాలపట్ల నమ్మకం ఉందని అనుకోవడానికి వీలులేదు. 'అరుగుచున్నాడు శ్రీనాథుడమరపురికి' అని శ్రీనాథుడే స్వయంగా చెప్పుకున్న దాన్నిబట్టి, ఆరుద్ర స్వర్గప్రస్తావన చేశారని అవగాహన చేసుకోవడానికి శ్రీనాథుడు గురించి చేసిన ఒక నిర్ణయం, ఆరుద్ర దృక్పథాన్ని పట్టిస్తుంది. "మూలంలోంచి నాలుగు నూలుపోగులు తీసుకొని వాటిని తన వర్ణనల జలతారుతో నేశాడు. కథ లేకపోయినా ఫరవాలేదు. కమ్మని వర్ణనలుంటే చాలు అనే దృక్పథాన్ని మన సాహిత్యంలో ఇతడు ఈ (భీమఖండం) కావ్యంతో ప్రవేశపెట్టాడు". అని చెప్పడంలో "కళకోసమే కళ" అని భావించిన కవిగా శ్రీనాథుణ్ణి నిర్ణయించారు.

కవికి ఆలోచించవలసిన బాధ్యత ఉంది. ఆ ఆలోచన సామాన్యుల కష్టాల్ని కూడా తీర్చగలిగే ఆలోచనను పురిగొల్పేటట్లు ఉండాలి. కానీ, బతుకు తెరువులు చూపించే ప్రభుత్వాలను శ్లాఘించడమే వందిమాగధుల వంటి కవులకు చేతనైన విద్య. కుంపిణీవారిని 'కుంభిని వంటి ప్రభుత్వము రంభాభోగమ్ము వంటి రతిసౌఖ్యము! మరెక్కడాలేవని, వర్ణించిన చాటువులు కన్పిస్తున్నాయి. కవులు ఎంతపొగిడినా కాలం కళ్ళు తెరిపిస్తుందని ఆరుద్ర అనడంలో కవికి సమాజం పట్ల సరైన 'దృక్పథం' ఉండాలనే ఆలోచన కన్పిస్తుంది. 'కాకతీయ యుగం'లో కవులు తమ కావ్యాల్ని అంకితమివ్వడాన్ని గురించి "తమ కావ్యాలను కన్యలుగా భావించడం కూడా ఇప్పుడే (ఈయుగంలోనే) మొదలైంది. కూళలకు కావ్యకన్యకనిచ్చి ధనం పొందడం పడుపు కూటికింద పరిగణించి బాధపడేటంత దుస్థితికి అంకితాలు పుచ్చుకోవటం దిగజారింది " (పు.ము.II.పు : 18) నడంలో ఆర్థికంగా కవులు తమ జీవనోపాధికి ఆధారపడవలసిన పరిస్థితుల్ని వివరించారు.

కడపటి రాజుల యుగం (8వ సంపుటి) ని విశ్లేషిస్తూ, ప్రజల కడగండ్లకు అంతులేదు. ఎక్కడచూసినా యుద్ధాలే. సైనికులు ఊళ్ళను కొల్లగొట్టడం సామాన్యమైపోయింది. పన్నులు వసూలు చేయడమే తప్పించి ప్రజలకు సౌకర్యాలు సమకూర్చడమన్నదే అబ్బురమైంది. పాతకాలపు నాటి వనరులు పాడై పోతూవుంటే పాలకులు చూస్తూ ఊరుకొన్నారుగాని, తమసంచులు విప్పి మరమ్మతు చేయించలేదు. వ్యవసాయం చేసే రైతును అందరూ పీక్కుతినేవాళ్ళే. ఈ యుగంలో ప్రముఖ కవి కూచిమంచి

తిమ్మయ్య తన "కుక్కుటేశ్వర శతకం"లో రైతుల స్థితిని వర్ణించారన్నారు (పు.6) ఈ యుగంలోనే కాటమరాజు కథనుండి బొబ్బిలి యుద్ధం వరకూ వీరగాథల్ని ప్రజలు పాడుకొన్నారనడంలో రాజ్యస్వభావాన్ని ప్రజాసాహిత్యం నుండి చూసే పద్ధతి (దృక్పథం) ఉందని స్పష్టమవుతుంది. పదమూడవ సంపుటి 'ఆధునిక అభ్యుదయ యుగం'లో భావకవిత్వం గురించి విశ్లేషిస్తూ "భావకవిత్వం రోజుల్లోనూ, అవధానాలయుగంలోనూ మనకు చాలామంది ప్రతిభావ్యుత్పత్తులు లేని కవులుండేవారు. ఆమాటకొస్తే రెండుమూడువందలేళ్ళ సాహిత్య చరిత్రలో బళ్ళకొద్దీ రొడ్డ వ్రాసిన వాళ్ళను బళ్ళకొద్దీ నేను చూపించగలను. వాళ్ళందరూ కవులూకారు, వాళ్ళది కవిత్వమూకాదు (పు.ము.VIII పు.12) అనడంలో ఆరుద్ర సాహిత్య చరిత్రదృక్పథం మార్క్సిస్టు దృక్పథమని స్పష్టమవుతుంది.

ప్రతియుగంలోని రచనల్లోనూ, వర్గ స్వభావాలూ, వర్గప్రయోజనాలూ ప్రస్ఫుటమవుతుంటాయి. ఆస్వభావాల్ని బట్టి రచయిత దేనికి చెందుతాడో తేల్చుకోవాలని, బ్రౌన్ చెప్పిన "పులి-మనిషి" కథను విశ్లేషించి, రచయితల వర్గ స్వభావాల్ని బట్టే రచనలు వెలువడతాయనే సత్యాన్ని తెలియజేస్తుందన్నారు. "పులి-మానవుడు" సంభాషించుకొంటూ, ఇద్దరిలో ఎవరు గొప్ప అనే విషయాన్ని తర్కించుకొంటుండగా, 'పులిని చంపుతున్న మనిషి బొమ్మ' ని మనిషి చూపించి, మనిషే గొప్ప అని తన వాదనను సమర్థించుకున్నాడట! దానికి పులి సమాధానమిస్తూ, ఆ చిత్తరువుని మనిషి రాశాడు. కనుక, పులిని చంపినట్లుంది. ఆ చిత్తరువుని పులి చిత్రించినట్లయితే, మనిషిని పులి చంపినట్లు వేసేదన్నదట. ఈ కథలో మరొక విషయాన్ని కూడా జతచేస్తే స్త్రీ రాసినట్లయితే, తన ఆలోచల్ని, ఆశయాల్ని ప్రతిబింబించేటట్లు చేయడానికి వీలుంటుంది. రాసేవారి స్వభావాన్ని బట్టి రచన రూపు దిద్దు కొంటుందనే నిర్ణయం చేశారు. 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' లో కూడా తన దృక్పథాన్ని దీనిలో సమన్వయం చేయడానికి అవకాశం ఉంది.

మెకంజీ సేకరించిన విలువైన గ్రంథాలకు కారణమైన కావలి సోదరులపై పరిశోధన జరగాలని ఆరుద్ర భావించడం లో 'తాజ్‌మహల్ నిర్మాణానికి రాళ్లెత్తిన కూలీల్ని' తెలుసుకోవడంలోనే నిజమైన 'చరిత్ర' ఉందనే మార్క్సిస్టు దృక్పథం కన్పిస్తుంది. "తెలుగు చరిత్రకూ, సాహిత్యానికీ ఇంత సంపదను ఇచ్చిపోయిన మెకంజీ దొరగారిపైన, ఆయన్ని నమ్ముకొన్న కావలి సోదరులపై సమగ్ర పరిశోధనలు జరగలేదు" అని ఆరుద్ర అన్నారు. మరొక చోట "శాస్త్రీయ సామ్యవాద దృక్పథంతో ఈ (కుంపిణీ) యుగ చరిత్రను అధ్యయనం చేయడం అవసరం" అన్నారు. ఎందుచేత ఈ దృక్పథంతో అధ్యయనం చేయాలో కూడా వివరించడానికి ప్రయత్నించారు. 'గతితార్కిక, చారిత్రక భౌతిక వాదాల ప్రాతిపదికపై శాస్త్రీయ సామ్యవాద స్థాపనాచార్యులైన కారల్‌మార్క్స్, ప్రేడరిల్ ఏంగెల్స్ భారతదేశ చరిత్రను, తూర్పు ఇండియా కంపెనీ పుట్టుపూర్వోత్తరాలనూ, దానికి కట్టకడపటి దశనూ, భావిఫలితాలనూ చర్చిస్తూ, తమ రచనలలో చక్కని విశ్లేషణ చేశారు'. అని మార్క్స్ భావాల్నీ ఈ సందర్భంగా వివరించారు. శాస్త్రీయ సామ్యవాద దృక్పథం అంటే ఏమిటో కేతవరపు రామకోటిశాస్త్రీ చెప్తూ "ఏ విషయం గురించైనా సరే వైజ్ఞానికంగానూ, నైతికంగానూ బాధ్యతాయుతంగా ప్రవర్తించడాన్ని అసిధారావ్రతంగా పాటించాలన్న లక్షణమే శాస్త్రీయ సామ్యవాదం. కార్యకారణ సంబంధసమన్వయమే ఆదృక్పథం యొక్క

శాస్త్రీయతకు నిదర్శనం" కనుక, ఏ రాజుల కాలంలో ఎలాంటి రచనలు వచ్చాయో, దానికిగల కారణాల్ని మార్క్స్ విశ్లేషణతో కుంపిణీ యుగాన్ని ఆరుద్ర అంచెనావేశారు.

జమిందారీయుగంలో కొక్కొండ వేంకటరత్నం రచించిన 'ప్రిన్స్ ఆఫ్ వేల్స్ తారావళి' 'ప్రిన్సి ఆఫ్ వేల్స్ హిందూస్థాన్ సందర్శనం' 'గ్రంథాల్ని బట్టి ప్రచారకవుల్లో తొలితరంలో మొదటి లెక్కలో కొక్కొండ వారిని పరిగణించాలని ఆరుద్ర అన్నారు. అయితే, జమీందారీ యుగంలోనే ఉన్న కందుకూరి వీరేశలింగం 'విక్టోరియాజ్యూబిలీనవరత్నాలు' వర్ణించారు "ఆంగ్లేయదొరతనం బేలుగాక, ధర్మమతితోడ నాచంద్ర తారకంబు" అని వర్ణించిన చిలకమర్తివారు 'భరతఖండంబు చక్కని పాడియావు'....... ఏపద్యంలో 'తెల్లదొరలను గడుసరి గొల్లవారు పితుకుతున్నారు మూతులు బియగట్టి' ని బట్టి ఒకే కవిలోని వైరుధ్యభావాలు ఉన్నాయి. గురజాడ అప్పారావు "ఆంగిలేయుల ధర్మరాజ్యము" అని వర్ణించారు. ఇలా, కొంతమంది కవులు తెల్లవారిపాలనను పొగుడుతూ వర్ణించిన పద్యాలు కన్పిస్తున్నాయి. వీటిని ఆరుద్ర ఏ దృక్పథంతో చూశారనేది ఆలోచించవలసి ఉంది. ఒకకవి తన జీవితకాలంలో ఆయాపరిస్థితుల్ని బట్టి కొన్ని రచనల్ని చేయవచ్చు. కానీ, జీవితాంతం వరకూ ఏభావజాలాన్నీ జీర్ణించికోకుండా పరిస్థితుల్ని బట్టే వ్యవహరించడం సరైందికాదు. కొక్కొండవారు తెల్లదొరల్నీ, పాలననూ కీర్తించడమేకాదు, సామాన్యులకి తనసాహిత్యంలో ఏనాడూ స్థానమివ్వలేదు. సంస్కరణను అంగీకరించడం ఎలాగులేదు, కనీసం ఆమాటనే వ్యతిరేకించి స్వభావం కొక్కొండవారిలో ఉంది. ఆధునిక కాలంలో గ్రాంథిక భాషనే సమర్థించారు. ఇంట్లోనూ, బిక్షగాడితోనూ గ్రాంథికమే మాట్లాడు వారి భావజాలాన్ని తెలుపుతుంది. కందుకూరి ఆంగ్లేయుల్ని కీర్తించినా, 'పాశ్యాత్య విద్యా ప్రభావంతో సంస్కరణ వైపు పయనించారు. సంస్కరణవాదిగా మారారు. గురజాడ కూడా జమిందారీ ఆస్థానంలో ఉన్నా, తనభావాలతో వారినికూడా ఒప్పించి 'కన్యాశుల్కం' వంటి సమస్యపై ఆలోచించేటట్లు చేశారు. తర్వాత అభ్యుదయ భావజాలానికి ఆయనే ఆధ్యుడనే స్థాయిలో రచనల ద్వారా వ్యక్తం చేశారు. అందుకనే, వీరేశలింగం, గిడుగు, గురజాడ వారిని, 'ఆంగ్లేయుల ప్రగతినుండి ఉత్తేజితులై సాధారణ ప్రజల కష్టసుఖాలను సాహిత్యంలో ప్రతిఫ లించాలని విశ్వసించారని శాస్త్రీయదృక్పథంతో ఆరుద్ర వివరించారు.

జమీందారీ వ్యవస్థలో బానిసలకంటే హీనస్థితిలో స్త్రీ పరిస్థితి ఉందని, ఫ్యూడలు-వ్యవస్థలో స్త్రీ అసహాయస్థితిలో ఉన్నారని, 'వేశ్యల' స్థితిని వివరించారు. సమాజంలోని పాలకవర్గాలు దేవుడి పేరుతో బాగు పడటం అన్నిదేశాలలోనూ సహజంగా కన్పిస్తుందని, "స్త్రీ" అభ్యుదయాన్ని ఆకాంక్షించారు. గజపతుల, తొలిరాయలయుగంలో ఉన్న తాళ్ళపాక తిమ్మక్కను అన్నమాచార్యుల భార్య అయితే వారి కుటుంబం, ఆమెను రచయిత్రిగా గుర్తించకపోవడం అన్యాయమన్నారు (పు.294)

యుగధర్మాన్నిబట్టి ఉత్పత్తి విధానాలకు ఆర్థిక సంబంధాలకూ అనుగుణంగానే 'కాకతీయ యుగం' లో సాహిత్యం రూపొందిందనీ, భోగలాలసతతోపాటు, అవినీతికూడా పెరిగిపోయిందన్నారు. కేతన రచించిన 'విజ్ఞానేశ్వరీయం' వంటి ధర్మశాస్త్రగ్రంథాల్లో కవిత్వం ఏమీ ఉండదు గానీ, సాంఘిక చరిత్రకు అవసరమైన ముడిసరుకు చాలా ఉంది. కావ్యమైనా మహాకావ్యమైనా ఎరుకసమగ్రం చేయడం ముఖ్యమని ఆరుద్ర అభిప్రాయపడ్డారు.

శైవులు కులాతీతంగా మతాన్ని ప్రచారం చేసుకున్నా, మల్లికార్జున పండితారాధ్యుడు బ్రాహ్మణ్యాన్ని వీడలేనని చెప్పుకున్నాడు. శివకవుల రచనల్ని సమీక్షిస్తూ ఆరుద్ర, వర్గ భేదాల్ని రూపుమాపకుండా వర్ణ భేదాల్ని తొలగించడానికి ప్రయత్నించడం పునాదులు లేని ఇళ్ళు కట్టడం వంటిదనడంలో మార్క్సిస్టు దృక్పథమే వెల్లడవుతుంది. సమస్యపరిష్కారానికి ఉపరితలం మీద అంశాల్నే కాకుండా పునాది నుండే ఆలోచించడం వల్ల నిర్మాణాత్మకమైన పరిష్కారం లభిస్తుందనే ఆలోచనలో మానవసంబంధాలన్నీ ఆర్థిక సంబంధాలతో ముడిపెట్టి వర్గ దృక్పథంతో చూడటం మార్క్సిస్టు దృక్పథంలో కన్పించినట్లే ఆరుద్ర 'సాహిత్యచరిత్ర' రచనలోనూ కన్పిస్తుంది.

నన్నయ భారతాన్ని తెనిగించేటప్పుడు మూలం భీముడు మాంసాహారాన్ని తిన్నట్లు ఉన్నదాన్ని తెలుగు భారతంలో ఆహారనియమాల్ని మార్చుచేసి, శాకాహారిగా చేశారు. ఇటువంటివన్నీ చిన్నచిన్నవే. కానీ కొన్ని కులాల్ని హీనంగానూ, మరికొన్ని కులాల్ని 'ఆధిక్యత' కలిగినట్లు వర్ణించడంలో పాలక వర్గ స్వభావాన్ని, ఆరుద్ర మార్క్సిస్టు భావజాలతో పరిశీలించారు. వైయక్తికంగా బ్రాహ్మణుల్ని కాకుండా, బ్రాహ్మణీయ భావజాలాన్ని పాలకవర్గం తమ ప్రయోజనాలకోసం పోషించిందనేది ఆరుద్ర దృక్పథం.

సాహిత్య చరిత్రలో ఆయాకాలాల్లో 'ఉత్పత్తి' అయిన సాహిత్య స్వభావాన్ని శాస్త్రీయ దృక్పథంతోనే ఆరుద్ర అందించారని ఆయన చేసిన విశ్లేషణ తెలియజేస్తుంది. దీన్ని ఆరుద్ర జమీందారీయుగం గురించి చేసిన విశ్లేషణలో పరిశీలించడం మరింత చక్కగా అవగాహన కొస్తుంది.

"జమిందారీ పోషణలో వచ్చిన సాహిత్యంలో భ్యాడలు విలువల ప్రశంసలే ఎక్కువ. ఇలాంటి సాహిత్యాన్ని ప్రోత్సహించినందుకు సంబరపడనక్కరలేదు. కాకులను కొట్టి గెద్దలకు వేయడం కార్యంకాదు. అలాగే, ప్రజలను ఆర్థికంగా దోచుకున్నవాడుచీమలకు పంచదార పెడితే సుకృతాన్ని ఆర్జించుకోలేడు. పేదరైతుల గోళ్ళూడగొట్టి సంపాదించిన శిస్తులతో అత్యంత స్వల్పకాలాన్ని తమ ఇతర విలాసాలతోపాటు సాహిత్య సేవకు వెచ్చిస్తే ఆ గోరంత కార్యాన్ని కొండంతగా పొగడనక్కరలేదు" అనడంలో రాజులు, పోషకుల పేర్లతో యుగవిభజన చేసినంత మాత్రాన, సాహిత్యచరిత్రలో ఉన్న కవులంతా పోషణకు గురయ్యారనే ఆలోచనతో యుగవిభజనచేసింది కాదనేదీ తెలుస్తుంది. కాలాన్ని తెలుసుకోవడానికే ప్రధానంగా యుగవిభజన చేసినా, లోపలి కవుల్ని, కావ్యాల్ని మార్క్సిస్టు దృక్పథంతో పరిశీలిస్తూ, అది లోతుగా పరిశీలిస్తే తప్ప వెంటనే స్ఫురించని ఈప్రత్యేక పద్ధతిలో రాశారు. తొలిముద్రణ కంటే పునర్ముద్రణలోనే ఆరుద్ర దృక్పథం బాగాస్పష్టమవుతుంది. పరిశోధనలో దృక్పథాన్ని ప్రదర్శించడమే కాకుండా, పరిశోధనలో శాస్త్రీయంగా ఫలితాల్ని గమనించడానికి వీలుగా కొన్ని పట్టికలు ప్రత్యేకంగా పేర్కొన్నారు.

## 5.10. పట్టికలు–పరిశోధన :

పరిశోధనలో పట్టిక (Tables) లకు చాలా ప్రాధాన్యత ఉంది. ఇవి విశ్లేషణకు, ఫలితాల నిర్ధారణకు చాలా ఉపయోగపడుతుంటాయి. గణాంకాల్ని సేకరించి కాల ప్రకారంగాని, సాహిత్యంలో అయితే ఆశ్వాసాలలోగల పద్యాల రకాలు, సంఖ్య, యతి, ప్రాసలు, అలంకారాది భేదాలతో పాటు, విషయాన్ని

కూడా వర్గీకరించి విశ్లేషిస్తుంటారు. కొన్నిసార్లు ఒకే ఇతివృత్తంగల కావ్యాల్ని రచించిన వారిని పేర్కొనడానికి కవుల కాలాల్ని, పద్యాల సంఖ్యల్ని, ఆశ్వాసాలపేర్లనీ, సంఖ్య వంటి విషయాల్ని వింగడిస్తుంటారు. ఇది కేవల బౌద్ధికమైన పని అయినప్పటికీ చాలా "కాలం" పట్టడంతోపాటు, శ్రమించవలసి ఉంటుంది. పరిశోధనాసక్తి ఉంటేనే ఇది సాధ్యమవుతుంది. సమగ్ర ఆంధ్ర సాహిత్యంలో ఆరుద్ర కొన్ని అకారాది సూచికలతో సహా కొన్ని పట్టికల్ని పేర్కొన్నారు. కొన్నింటిని తానే తయారు చేశారు.

ఈ పట్టికలను తయారు చేయడంలో తోడ్పడిన భాగవతుల సూర్యనారాయణ శాస్త్రి, గొల్లకోట విజయకుమార్‌లకి తొ.ము.లో ధన్యవాదాలు చెప్పుకొన్నా, పు.ము.లో "ధన్యవాదాలు" తొలగించారు. కానీ, తొ.ము.లోని పట్టికల్నే పు.ము.లోనూ ఉపయోగించారు. పెంచిన సంపుటాల్లో కూడా చాలా పట్టికలు కన్పిస్తున్నాయి.

వివిధ శాసనాల్లో గల తెలుగు పదాల్ని అకారాదిగానే కాకుండా, కాలానుక్రమంగా 'ప్రాచీన శాసనాలలోని తెలుగు పదాల పట్టిక' : "గాథా సప్తశతిలోని తెలుగు మాటలు" పట్టికలు ( స. ఆం.సా.I పు.ము.పు.**5,11**) పరిశోధన వికాసాన్ని అవగాహన చేసుకోవడానికెంతగానో ఉపయోగపడతాయి. తెలుగు ఛందస్సులో మొట్టమొదటి పద్యాలు దొరికిన శాసనాల్ని కాలానుక్రమంగా పద్యాల పేర్లను తెలిపిన పట్టిక వల్ల, ప్రాచీన కాలంలోనుండే ప్రచారంలో ఉన్న పద్యరచనాతీరుతెన్నులు తెలుస్తున్నాయి.

'కుమార సంభవం' లో నన్నెచోడుడు ప్రతి ఆశ్వాసంలో కంద పద్యంతోనే మొదలవుతుంది. విభక్తులతో అంతమయ్యేటట్లు ఆశ్వాసముల ఆద్యంత పద్యాలను రచించినా వాళ్ళలో 'నన్నెచోడుడే' ప్రథముడని ఆరుద్ర చెప్పారు. ఈ విధమైన పద్యరచననురాయడాన్ని ఇదొక సంవిధాన శిల్పమనీ, ఈ నియమాన్ని తర్వాత కవులైన తిక్కన, కేతన ఇంకొకమెట్టుకి తీసుకెళ్ళారని వివరించారు. వీటిని ఒక పట్టిక (పు.ము.I పు.**202**)లో తిక్కన 'నిర్వచనోత్తర రామాయణం' కేతన 'దశకుమార చరిత్ర' లతో పోల్చి కుమార సంభవం లో గల ఆశ్వాసముల మొదటి విభక్తులు గల గద్యాల్ని తులనాత్మక పరిశోధనతో పరిశీలించారు.

మద్రాసు ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో గల సుమతీ శతకానికి గల తాళపత్ర ప్రతుల్ని పట్టిక (పు.ము.I పు.**264**)రూపంలో అందించడం వల్ల ఈ విషయంపై ప్రత్యేక పరిశోధన చేయాలనుకొనే వారికి ఎంతో సహకరించేటట్లు ఉంది. Primary Sources ని సూచించినట్లయ్యింది.

"శివతత్త్వసారం" లోని మకుటాల వివరాల్ని పద్య సంఖ్యతో సహా పట్టిక(పు.ము.I పు.**287**)నిచ్చారు. వీటిని విశ్లేషించి 'శివా' అనే మకుటమే శతాధికం దాటిందని వివరించారు.

తిక్కన 'ఆంధ్ర మహాభారతం' లో వర్ణించిన గద్యపద్యాల్ని ఆశ్వాసాది క్రమంలో గణాంక పట్టిక(పు.ము.II పు.**84**)ను రూపొందించడానికి చాలా కాలం పడుతుంది. అయినా దీన్ని 'పట్టిక' రూపంలో అందించి ఒక్కొ ఆశ్వాసంలో ఒక్కొక్క ప్రత్యేకమైన పద్యాల్ని, గద్యాల్ని ప్రయోగించడంలో తిక్కన ఛందః శిల్ప ఆంతర్యాన్ని చక్కగా వివరించారు.

నాచన సోమన నవీన గుణాలు ప్రచారంలోకి రాకముందు కవులు కృత్యాదిని శ్రీకారం పద్యాలు వర్ణించినా, భక్తిభావాలతో ఉండేవనీ, కానీ, నాచనసోముడు తర్వాత కవులు మంగళ శ్లోకం లేదా పద్యంలో శృంగార రసంతో కూడిన వర్ణనలు చేశారని విరూపించడానికి, నాచనసోమునికి ముందున్న కథలు వర్ణించిన కవుల్ని, కావ్యాల్ని, పద్యపాదాన్ని పట్టిక (పు.ము.III పు.150) రూపంలో అందించారు.

వివిధ రామాయణాలలో అవాల్మీకగాథలు కన్పిస్తున్నాయని, అవి గల కాండ ల వివరాల్నే కాక ఉపశీర్షికల్ని స్పష్టంగా విశదీకరించే పట్టిక (పు.ము.III పు.180)ఆరుద్ర పరిశోధనాసక్తినీ, శక్తినీ తెలుపుతుంది. మనదేశంలోని వివిధ గ్రంథాలయాల్లోగల రామాయణ ప్రతుల్ని ఆరుద్ర పరిశీలించి, కేటలాగు సంఖ్యను పేర్కొన్నారు. రంగనాథరామాయణం ప్రతులు మనరాష్ట్రంలోనే కాదు. విదేశాల్లో కూడా కన్పిస్తున్నాయని, వాటిని వివరించారు. పారిస్‌లోని నేషనల్ లైబ్రరీ లో రంగనాథ రామాయణ ప్రతి కార్డునెం : **38-938-4271.** అని వివరించారు. ఇలా వివిధ రామాయణాల్లో గల అవాల్మీక గాథల్లో అహల్యరాయిగా మారిపోవడం, రావణుడు రాముని విలువిద్యను మెచ్చుకోవడం వంటివి భాస్కర, రంగనాథ, ఆనంద రామాయణాల్లో పొందిన మార్పుల్ని వివరించే పట్టిక ఆరుద్ర పరిశోధన విశిష్టతను తెలుపుతుంది.

శ్రీనాథుడు చాలా విలువైన కావ్యాల్ని వర్ణించడమేకాదు, **1402-1420** మధ్యకాలంలో విద్యాధికారిగా ఉంటూ **12** శాసన కావ్యాల్ని రచించాడు. వాటిని కాలానుక్రమంలో వివరించిన పట్టిక (పు.ము.III పు.296)ను బట్టి కావ్యాల్లో-శాసనాల్లో శ్రీనాథుని భాషాశైలీ వర్ణనలు అవగతం కావడమేకాదు, శాసనాల్లో తెలుగు భాషావికాసాన్ని అంచెనా వేయడానికి ఎంతగానో ఉపయోగిస్తాయి. అలాగే, శ్రీనాథుడు రచించిన గ్రంథాల్ని వాటి కాలాల్నీ కొమర్రాజు, కందుకూరి, బండారు, మల్లంపల్లి, చాగంటి శేషయ్య, వేటూరి ప్రభాకర శాస్త్రి, నేలటూరి వెంకటరమణయ్యలు వివరించిన వాటిని క్రోడీకరించి పట్టిక (పు.ము.III పు.372) రూపంలో అందించారు.

పోతన 'ఆంధ్ర మహాభాగవతం'లో పద్యగద్యాల్ని స్కంధాల వారిగా గణాంకవివరాల్ని తెలిపే పట్టిక (పు.ము. IV పు.156) ఉంది. భాగవతంలో **2817** కంద పద్యాల్ని అత్యధిక సంఖ్యలో వర్ణించినా, కేవలం 35 మాత్రమే 'మత్తకోకిల' ఛందస్సుని ఉపయోగించినా, మిగతా జాతి, వృత్తాలకంటే 'మత్తకోకిల' అంటేనే పోతనకిష్టమన్నారు.

శ్రీకృష్ణ దేవరాయల ఆస్థానంలో గల అష్టదిగ్గజాలు ఎవరనే విషయంలో నేటికీ పరిశోధకుల్లో చర్చలు జరుగుతూనే ఉన్నాయి. గురజాడ శ్రీరామమూర్తి, కందుకూరి వీరేశలింగం, కొమర్రాజు వేంకటరావు, వేటూరి ప్రభాకరశాస్త్రి, నేలటూరి వెంకట రమణయ్య, చాగంటి శేషయ్య, నిడదవోలు వెంకటరావు, ఈయుణ్ణి వెంకట వీరరాఘవచార్యులు మొదలైన పరిశోధకులు చర్చించిన విషయాల్ని పట్టిక (పు.ము.V పు.97) గా క్రోడీకరించారు. వీరంతా తిమ్మన, ధూర్జటి, పెద్దన, మల్లన, తెనాలిరామకృష్ణ, అయ్యలరాజురామభద్రుడు, భట్టుమూర్తి అష్టదిగ్గజాల్లో ఉన్నారని కొంతమంది చెప్పగా, మరికొంతమంది మరో విధంగా చెప్పారు. దీన్ని ఆరుద్ర వివరిస్తూ, 'భువన విజయం'లో ఆసీనులైన ఎనిమిదిమంది కవులెవరో నికరంగా చెప్పలేమనీ, (పు : 95) ఆకవులపేర్లు స్పష్టంగా

చెప్పలేమనీ, సంకుసాలనరసయ్య అష్టదిగ్గజాల్లో ఒకడేమో అనీ చెప్పారు (పు : 95) అయితే అష్టదిగ్గజములు అనేది కవుల సంస్థ అని నాగయ్య అభిప్రాయపడుతున్నారు. (పు:3) అయినా అష్టదిగ్గజకవులుగా, 1. అల్లసాని పెద్దన, 2. నంది (ముక్కు) తిమ్మన, 3 మాదయ గారి మల్లన 4 ధూర్జటి 5 అయ్యలరాజు రామభద్రుడు లేదా పుత్తేటి రామభద్రుడు, 6 తెనాలి రామకృష్ణుడు, 7. పింగళి సూరన, 8. కందుకూరి రుద్రకవి అని చెప్తున్నారు. వెల్చేరు నారాయణరావు, తెనాలి రామలింగకవి అనేది ప్రజలు తమ భావాల్ని స్వేచ్ఛగా వ్యక్తీకరించేందుకు రూపొందించుకొన్న ఊహాపాత్రగా భావిస్తున్నారు. ఆరుద్ర 'సంకుసాలన నరసయ్య' అష్టదిగ్గజాలలో ఒకడై ఉంటాడన్నారు. కానీ చారిత్రక ఆధారాలు లేవని పరిశోధకులు భావిస్తున్నారు. (సంగయ్య-పు.:17) మరికొంతమంది చింతలపూడి ఎల్లనామాత్యుడు (రాధామాధవ కవి) విని చేర్చారు.

వీటన్నింటినీ చాల సంయమనంతో సమన్వయించడం ఆరుద్ర పరిశోధన విశిష్టత. 'అష్టదిగ్గజకవుల పట్టిక' పాఠకుల కే ఏదొక నిర్ణయం చేసుకోవడానికి తోడ్పడుతుంది.

'ఒక అజ్ఞాత గ్రంథ సంధాత' ఉదహరించిన 32 మందికవుల కావ్యాల పట్టిక (పు.ము.VI పు.230)విజయ రాఘవనాయకుడు సుమారు 40 గ్రంథాల్లో రకరకాల ప్రశ్నలను వివరించిన పట్టిక (పు.ము.VII పు.189-191) క్షేత్రయ్య దర్శించిన క్షేత్రాలు, ఆసందర్భాన్ని వివరించే పదాల సంఖ్యల్ని తెలిపే పట్టిక (పు.ము.VII పు.243), రామాయణ రచయితల పట్టిక (పు.ము.VII పు.268)ల్ని వివరించారు.

తొ.ము.లోగల 12 సంపుటాల్ని ఎనిమిది సంపుటాలుగా ప్రచురించిన వాటిలోనే కాకుండా, తర్వాత 13వ సంపుటి వరకూ పూర్తిగా కొత్త సమాచారం అందించిన అయిదు సంపుటాల్లోనూ ఆరుద్ర పరిశోధనకృషిని గుర్తించగలిగే పట్టికలు కన్పిస్తున్నాయి.

కుంపిణీ కైవసం చేసుకొన్న భూభాగాల్ని తేదీ,జిల్లా, వైశాల్యం వంటివివరాల్ని పట్టిక (పు.ము.IX పు.34) పేర్కొన్నారు.

కుంపిణీయుగం-I అనుబంధం లో బ్రౌన్ సాహిత్య సేవా వివరాల్ని తెలిపే విలువైన పట్టికల్ని జతపరిచారు. బ్రౌన్ జీవిత-రచనల్ని సూటిగా సమగ్రంగా విశ్లేషించుకోవడానికీ, ఒక అవగాహనకు రావడానికీ ఇవి ఎంతగానో ఉపయోగిస్తాయి.

పద్దెనిమిది మహాపురాణాల్ని, ఆ పురాణాల్లో ఘనతవహించిన దేవుళ్ళనీ, ప్రస్తుతం లభిస్తున్న శ్లోక సంఖ్యవంటి వివరాల్ని పట్టిక (పు.ము.X పు.275)VIIలో అందించడం వల్ల ఏపురాణం ఏ విషయానికి సంబంధించిందో సామాన్యులకు సహితం సులభంగా అవగాహన కొస్తుంది.

కుంపిణీయుగం లో పేర్కొన్నా, శతకకవుల పట్టిక, క్రైస్తవమత విస్తరణ జరిగిన క్రమ పరిణామాల్ని తెలిపే పట్టిక (పు.ము.X పు.314)ల్ని వివరించారు.

తా.ము.లో పట్టికల్ని గ్రంథ విషయంగానే పరిగణించగా, పునర్ముద్రణలోనూ వాటిని అలాగే ఉంచేశారు. కానీ, కొత్తగా రచించిన సంపుటాల్లో అవసరం మేరకే కొన్ని పట్టికల్ని ప్రధాన విషయ భాగంలో పేర్కొనగా, మరికొన్నింటిని అనుబంధాల్లో చేర్చారు. దీనివల్ల పఠనయోగ్యతకు ఆటంకం కలగకుండా ఉంటుందనే గ్రహింపు మరింత పరిశోధన చేయడం వల్ల అవగాహన కొచ్చారని తెలుస్తుంది. బ్రౌన్, వీరేశలింగం రచనల్నీ, వారి ప్రణాళిక, ఆంధ్ర వర్తమాన లేఖక సంఘం వారి ప్రణాళిక,(పు.ము.XIII పు.397) కొన్ని ఆంగ్ల కవితల్ని అనుబంధాల్లోనే చేర్చారు. (పు.ము.XI పు.481) తొలి తెలుగు కథానిక ఏదో తెలుసుకోవడానికి వీలుగా ఆచంట వెంకటసాంఖ్యాయన శర్మ రచించిన విశాఖ కథను (పు.ము.XII పు.384) అనుబంధంలో చేర్చారు.

పరిశోధనకు పట్టికల్ని శాస్త్ర,సామాజిక, పరిశోధనలో ఎక్కువగా ఉపయోగిస్తుంటారు. దీనివల్ల శాస్త్రీయ పద్ధతి లో విషయాన్ని నిరూపించవచ్చు. పట్టికల్ని సాహిత్య పరిశోధన లో ఉపయోగించుకోవడం వల్ల విశ్లేషణ పద్ధతిలోనే పరిశోధనకొనసాగినా, దానికి శాస్త్రీయత మరింతగా పెరుగుతుంది. ఆరుద్ర సాహిత్య పరిశోధన శాస్త్రీయతను అందుకొనే లక్షణాన్ని దీని వల్ల ఇంకా సాధించింది. ఇటువంటి విశిష్ట లక్షణాలు ఆరుద్ర పరిశోధనల్లో కన్పించినా, మార్క్సిస్టుదృక్పథం, పట్టికల పరిశోధనలను గమనించకుండా, విమర్శకులు చాలా విమర్శలు చేశారు. వాటిలో చాలావరకూ సవిమర్శలని తేలడం, ఆరుద్ర దానికి స్పందించిన కృషినీ పరిశీలించడం జరిగింది. అయితే కొన్నింటి పట్ల ఆరుద్ర ఏ స్పందననూ తెలపకుండా, నిర్ణయాల్ని నిదానంగా ప్రకటించాలనేధోరణిని ప్రదర్శించినట్లు తెలుస్తుంది.

## 5.11. లోపాలున్నా, నిర్ణయాల ప్రకటనలో నిదానం :

సూటిదనం, స్పష్టత పరిశోధనకు ముఖ్యమైనప్పటికీ, పరిశోధనలో తాను కనుగొన్న లేదా సమన్వయం చేసిన ఫలితాంశాల్ని పరిశోధకులు సంయమనంతో తొందరపాటు ప్రదర్శించకుండా నిర్ణయాల్ని ప్రకటించడం ఉత్తమ పరిశోధన లక్షణాల్లో ఒకటని, పరిశోధన స్వరూప స్వభావాలు తెలుపుతున్నాయి. ఆరుద్ర తన పరిశోధనల్లో "ఒక్క విషయాన్ని" గురించి చెప్పాలన్నా పీఠిక అయినా సరే ఆకరాల్ని చూపుతూ, ఏమాత్రం తొందరపడకుండా నిర్ణయాన్ని ప్రకటిస్తూ ఉంటారు. ఈ పద్ధతివల్ల "పరిశోధన సమస్యల్ని రేకెత్తించేది" గా సాధారణ పాఠకులకు అన్పించే గందరగోళానికి దారితీసి, అసల చెప్పదలచినదేమిటో బోధపడని పరిస్థితి ఎదురవుతుంది. పరిశోధనలో సృజనాత్మక లక్షణాలు ఉండటంవల్ల, ఆరుద్ర పరిశోధనలో పరిశోధన స్వభావం కోల్పోకపోయినా సూటిదనం లోపించడంవల్ల కొంత అస్పష్టత, అసమగ్రత తప్పలేదు. విశ్వసనీయత కలగడానికి విసుగు లేకుండా పరిశోధన దృష్టితో పాఠకుడు చదువుకోవాల్సి ఉంటుంది.

ఒక కవి స్థల,కాల, కర్తృత్వాది విషయాల్ని వివరించడానికి, ప్రతీ దానికీ ఆకరాల్ని చూపాలనే అత్యాసక్తి వల్ల, తులనాత్మకంగా వివరిస్తూ పోలికల్ని,తేడాల్ని పూర్వ కావ్యాలనుండి పదేపదే ఉదాహరించడం వల్లకూడా సూటితనంతోపాటు చెప్పే ప్రధాన విషయం పట్ల దృష్టిమళ్ళిపోతుంది. 'కవి- రచన' పట్ల

పరిపూర్ణ అవగాహన కల్గించడం అసాధ్యమైనా, సాధ్యమైనంత స్పష్టంగా చెప్పడం అవసరమనే ఆలోచనే ఆరుద్రను ఇటువంటి రచనా పద్ధతికి గురిచేసి ఉంటుంది. పూర్వపరిశోధకుల అభిప్రాయాల్ని చర్చించి, వాటిలో గల లోపాల్ని విశ్లేషించి, "ఇంకాపరిశోదించవలసిన అవసరం ఉంద"నే ముగింపులు చేశారు. పరిశోధకుడు తానేమి భావిస్తున్నాడో చెప్పడం కూడా అవసరమే. కానీ, కొన్నింటికి ఆకరాలు లేక చెప్పలేకపోతున్నట్లు చెప్పుకున్నా, జాగ్రత్తగా తప్పించుకొన్నారనే అన్పిస్తుంది. 'క్షేత్రయ్య' గురించి చాలా వరకూ విశదీకరించి, చివరికి "క్షేత్రయ్య జీవితచరిత్ర నిన్నటిదాకా ఎవరికీ తెలియదు. రేపటికి గాని తేలదు. ఇవాళమాత్రం ఎవరికితోచినట్లు వాళ్ళు ఉహించుకోవాలి" (స. ఆం.సా. VII పు.ము.పు.223) అని తన నిర్ణయాన్ని ప్రకటించారు.

అయితే, పూర్తిగా అన్నివిషయాల్లోనూ ఈ రచనా పద్ధతినే కొనసాగించలేదు. చాలా విషయాలపట్ల పరిశోధకుల నిర్ణయాన్ని ప్రకటిస్తూనే, తన నిర్ణయాన్ని ప్రకటించేటప్పుడు కూడా సంయమనంతో పూరాఃపరిశోధకుల్ని సమన్వయించడమో, పూర్వ పక్షం చేయడమో, సమర్థించడమో ఏదొకటి చేశారు. అష్టదిగ్గజకవుల గురించి సంయమనాన్ని ప్రకటించి, పూర్వ పరిశోధకుల్ని సమన్వయం చేసి తప్పించుకొన్నారు. కొన్నిచోట్ల తన నిర్ణయాన్ని తానే ఖండించుకోవడం పరిశోధనలో ఫలితాలు సరిచూసుకోకపోవడాన్ని తెలుపుతుంది. నన్నెచోడుని కుమారసంభవం కవికాలాన్ని, కర్తృత్వాన్ని చాలామంది పరిశోధనలు చేశారు. వాటిని ఆరుద్ర సమన్వయంతో పరిశీలించి, 'సంయమన' దృష్టిని ప్రదర్శిస్తూ తననిర్ణయాన్ని చెప్పారు. పాల్కురికి సోమనాథుడు స్థల,కాల చర్చల్లోనూ (పు.ము. II పు.210). దీన్ని గమనించవచ్చు

మానవల్లి రామకృష్ణ, నడకుదుటి వీరరాజు, నేలటూరివెంకట రమణయ్యలు నన్నెచోడుని కాలాన్ని క్రీ.శ.940 అనీ, చిలుకూరి వీరభద్రరావు, వేటూరి ప్రభాకర శాస్త్రి, జయంతిరామయ్యలు క్రీ.శ.1120 ప్రాంతమనీ, శ్రీపాదలక్ష్మీపతి శాస్త్రి క్రీ.శ.1325 ప్రాంతమనీ, చాగంటిశేషయ్య క్రీ.శ.1028-1078 అనీ, ఒక్కొక్కరూ ఒక్కో మతాన్ని నిర్ణయించారు. నిడదవోలు వెంకటరావు, ఖండవల్లి లక్ష్మీరంజనం, దివాకర్ల వేంకటావధాని మొదలైనవారు వీరేశలింగం వాదననే సమర్థిస్తూ, నన్నయ,తిక్కనలమధ్య కాలంవాడిగా నన్నెచోడుడి కాలాన్ని నిర్ణయించగా, ఆరుద్ర వీటన్నింటినీ పరిశీలించిన తర్వాత, ఈ మెజారిటీవాదాన్నే ఒప్పుకొని కాలనిర్ణయ వివాదంలోకి దిగలేద"న్నారు. (పు.ము I పు.188) అయితే, వీరేశలింగం నిర్ణయం ప్రకారం నన్నెచోడుని కాలాన్ని క్రీ.శ.1160-1170 గా పేర్కొన్నదాన్నే ఆరుద్ర నిర్ణయంగా ప్రకటించినట్లు భావించడానికి అవకాశం ఉంది. కానీ, "బద్దెన" కాలనిర్ణయం చేస్తూ కుమారసంభవకర్త నన్నెచోడుని కాలమని ఇప్పుడు మనం నిర్ణయించిన క్రీ.శ.1082-1130 నాటికి ఒక బద్దెన ఉన్నట్లు శాసనప్రమాణం వల్ల తెలుస్తుంది". అని (పు.ము I పు.219) అన్నారు. ఆరుద్ర నిర్ణయంలో స్పష్టత లేకపోవడమే కాకుండా, తన నిర్ణయాన్నే తానే ఖండించుకున్నట్లు తెలుస్తుంది. కొన్నిసార్లు ఒకచోట ప్రకటించిన నిర్ణయానికీ, మరొక చోట ప్రకటించిన నిర్ణయానికి పొంతన ఉండదు. ఒకవేళ పాఠకుడు మొదటి దాన్నే లేదా చివరిదాన్నే చదివినట్లయితే, ఆరుద్ర పరిశోధననే శంకించే పరిస్థితికి రావడం జరగవచ్చు. సత్యాన్వేషణ చేసికూడా ఫలితాంశాల్ని సక్రమంగా అందించలేకపోవడంవల్ల,

ఇది దురవగాహనకు అవకాశం ఉంది.

మడికిసింగన కాలాన్ని గురించి ఒక్కోచోట ఒక్కో నిర్ణయాన్ని వెల్లడించారు. తొ.ము.లో కొన్నిలోపాలున్నా, వాటిని పు.ము.లో సరిచేసుకోవడానికి చేసిన ప్రయత్నంలో కూడా ఇలాంటివి జరిగి ఉండవచ్చు. తొ.ము.లో పొరపాట్లని తొలగించి, పునర్ముద్రణలోనైనా ప్రచురిస్తే బాగుండేది. కనుక, పునర్ముద్రణలో మడికిసింగన కాలాన్ని గమనించినా ఆరుద్ర కాలనిర్ణయాలు కొందరి విషయంలో ఎలా ఉండేవో తెలుస్తుంది.

"క్రీ.శ.**1347** ప్రాంతాలలోవాడైన మడికిసింగన చిన్నప్పుడే బర్దైన నీతిని వల్లెవేసి ఉంటాడు" (పు.ము I పు.**221**)

"క్రీ.శ.**1347** ప్రాంతాల్లో మడికి సింగన" అని (పు.ము.II పు.**40**), పేర్కొని, మల్లంపల్లి సోమశేఖర శర్మ, వేదంవెంకటరాయశాస్త్రిని ఉటంకించారు. క్రీ.శ.**1420** ప్రాంతాల వాడని ఇతరులంటారనీ అన్నారు. తెలుగు క్షేమేంద్రుడు క్రీ.శ.**1200** ప్రాంతాల్లో జీవించి ఉండాలనీ, మడికి సింగన కాలమైన క్రీ.శ.**1347** కి పూర్వుడన్నది తథ్యమంటూ, మడికి సింగన కాలప్రస్తావన (పు.ము II పు.**41**) తెచ్చారు. మరోచోట క్రీ.శ.**1370** ప్రాంతాలలోనే మడికి సింగన ఉండిఉండొన్నారు. (పు.ము**2** పు.**121,126**) అయితే, ఇదే సంపుటిలో సింగన 'సకలనీతి సమ్మతం' లో శివదేవయ్య పద్యాల్ని గురించి వివరిస్తూ, మడికి సింగన కాలం **1347** (పు.**134**) అన్నారు. క్రీ.శ.**1350** ప్రాంతాలలో మడికి సింగన్నను చేపట్టిన శ్రీమంతులు కందనామాత్యుడు, ముప్పభూపాలుడూ కీర్తివంతులు అయ్యారు. (పు.ము II పు **226**) ఈ సంపుటిలోనే మడికి సింగన కాలాన్ని చర్చిస్తూ అనపోతనాయకుడు వేయించిన క్రీ.శ.**1347** నాటి శాసనాన్ని బట్టి, అయ్యలమంత్రి జీవించి ఉన్నట్లు తెలుస్తున్నందువల్ల, అతని కమారుడు మడికి సింగన కూడా ఈ కాలంవాడే అవుతాడన్నారు. మహాఅయితే ఒకతరం అర్వాచీనుడు కావచ్చునని, తరానికి ముప్ఫయి సంవత్సరాలు లెక్కించినా మడికిసింగన **1377** వాడు కాగలడన్నారు (పు.ము.III పు.**230**). క్రీ.శ.**1385** ప్రాంతాలలో శ్రీనాథుడు, మామిడి సింగన్న, పెదకోమటి వేమారెడ్డి కలిసి సాహిత్య వ్యాసంగం చేస్తుండే వారుకాబోలు (పు.ము.III పు.**289** మడికిసింగన్న నాటికి ఒక పంచతంత్రం తెలుగులో ప్రసిద్ధమయినది అన్నారు. మరోచోట (పు.ము.IV.పు.**181**) "క్రీ.శ.**1347-1400** ప్రాంతాల్లో ఉన్న మడికిసింగన్నకు అనంతయ్య అనే సోదరుడున్నాడు అనిచెప్పారు.

మడికిసింగన కాలాన్ని వివిధచోట్ల వివిధ రకాలుగా ఆరుద్ర చెప్పిన విషయాన్ని గమనిస్తే, కాలనిర్ణయాల్లో స్పష్టత లోపించిందనే తెలుస్తుంది. అప్పకవి కాలాన్ని కూడా క్రీ.శ.**1656,1658** గా కొన్నిచోట్ల (పు.ము II పు.**133**, III పు.**270,273**,IV పు.**189**) రాశారు.

చారిత్రక పద్ధతిలో కాలాన్ని చెప్పడం కూడా అవసరమే. కానీ, చాలామంది కవుల కాలాన్నిస్పర్శామాత్రంగా కూడా చెప్పకుండా, వారి రచనల్లోని అంశాల్ని, ప్రకియా విశ్లేషణమూ, సామాజికాంశాల్ని వివరిస్తూ సాగిపోయినప్పుడు ఆకవుల్ని పేర్కొన్న యుగాన్ని బట్టి యుగకాలమే కవుల శతాబ్దంగా భావించుకోవల్సివస్తుంది. కానీ, అనేకమంది కవుల్ని పునరావృత్తి చేస్తూ ప్రక్రియా

వైవిధ్యాన్ని పేర్కొనేటప్పుడు 'కాలం' కూడా పేర్కొంటే బాగుండేది. ఇటువంటి వాటిని గందరగోళం లేకుండా అవగాహన చేసుకో వాలంటే ఆరుద్ర కొనసాగించిన గొలుసుకట్టు పద్ధతిని గుర్తించగలగాలి.

## 5.12. గొలుసు కట్టు నిర్ణయాలు :

ఒక యుగం (సంపుటి) లో ఒక దాన్ని ప్రతిపాదించి, మరో యుగంలో దాన్ని చెప్పటం, దాన్ని మళ్ళీ మరోయుగంలో విమర్శించడం, ఏదో యుగంలో సరైన ఫలితాంశమని భావించిన దాన్ని,మరేదొక సందర్భంలో వెల్లడించేయడం. ఈ రచనా విధానంలో కొంత గొలుసు కట్టు పద్ధతి (Link System) ఉన్నప్పటికీ, అదీ క్రమంలో లేదు. ఒకటి ఒకచోట ప్రతిపాదిస్తే, లేదా సూచిస్తే, మరోచోట దాన్ని మరింత వివరించి, మళ్ళీ ఎక్కడ దాన్ని స్పష్టంగా తెలుసుకోవచ్చో ఈ గొలుసు కట్టు పద్ధతిలో ఉంటుంది. కానీ, ఆరుద్ర నిర్ణయాల్ని చాలా సూక్ష్మపరిశీలనతో కొన్నింటిని అవగతం చేసుకొంటేనే, గొలుసుకట్టు పద్ధతిలో, సందర్భానుసారంగా వివరిస్తున్నారని తెలుస్తుంది. 'ప్రతిదృశ్యపైనా పదంపాడి లక్షణ గ్రంథాలకే బిక్షపెట్టిన జాణ' అని క్షేత్రయ్యని పరిచయం చేసినా ఆ పదాల్లో కన్పించే కొత్త లక్షణమేమిటో చెప్పడానికెక్కడా ప్రయత్నం కనపడలేదు. 'సంకుసాల నరసయ్య' శ్రీకృష్ణదేవరాయల ఆస్థానంలోని అష్టదిగ్గజకవుల్లో ఉండవచ్చునన్నా, సంకుసాలనరసయ్య గురించి ప్రత్యేకించి వివరించినప్పుడు కూడా ఈ విషయం వివరించడానికి ప్రయత్నించలేదు..

ఒక యుగంలో ఒక విషయం గురించి చర్చిస్తూ, మధ్యలో ఏదో ఒక ముఖ్యమైన విషయాన్ని స్పర్శించి, మళ్ళీ దాన్ని చర్చించకుండా వదిలేస్తూ, ఎక్కడో దాన్ని చర్చించే పద్ధతిని గమనించడానికి "తొలితెలుగు నవల" గురించి ఆరుద్ర చేసిన నిర్ణయాల్ని పరిశీలించవచ్చు.

అన్నాకేథరిన్ అనే మహిళ ఆంగ్లంలో రచించిన ఓగ్రంథాన్ని[92] "ఫుల్మనీకరుణాల చరిత్ర" పేరుతో జాన్ ఎడ్మండ్ షార్క్ తెలుగులోకి అనువదించారనీ, మూల గ్రంథం బ్రిటీష్ మ్యూజియం లైబ్రరీలో ఉందన్నారు. (పు.ము.X పు.23) **1858**లో ముద్రితమైన దీన్ని నవలగా భావిస్తే "తెలుగులో ఆంగ్ల ప్రభావం వల్ల ఆప్రక్రియలో వెలువడిన తొలిరచనగా స్వీకరించవచ్చు" అన్నారు. దీన్ని కొనసాగిస్తూ నరహరి గోపాలకృష్ణమ శెట్టి "శ్రీరంగరాజు చరిత్ర **1872** లోనూ, కందుకూరి వీరేశలింగం, 'రాజశేఖర చరిత్ర **1878** లోనూ ప్రచురితమయ్యాయన్నారు.కానీ, మళ్ళీ నవలల్లో తొలితెలుగు నవలగా దేన్ని భావించాలో చెప్పలేదు. ఆ చర్చా లేదు!

పదకొండవ (పు.ము) సంపుటిని కందుకూరి వీరేశలింగంతో ప్రారంభించారు. కందుకూరి గురించి వివరిస్తూ తొలితెలుగు నవల ప్రస్తావన చేశారు. తెలుగు నవలా పరిణామంపై కృషి చేసినవాళ్ళ (మొదలి నాగభూషణ శర్మ)కు నరహరి శెట్టి 'రంగరాజచరిత్ర' ప్రథమంగానూ, వీరేశలింగంపై సమగ్ర పరిశీలన చేసిన వారికి 'రంగరాజచరిత్ర' ప్రసిద్ధిని పొందలేదు కనుక, రాజశేఖర చరిత్రే ఆద్యమనిపిస్తుందని భావిస్తున్నారని (పు.**88**) అన్నారు. దీనిలో ఆరుద్ర అభిప్రాయం ఏమిటో తన నిర్ణయాన్ని స్పష్టంగా చెప్పలేదు. మళ్ళీ కొక్కొండ వేంకటరత్నం గురించి వివరించేటప్పుడు 'మహాశ్వేత' (**1867**) ను ప్రప్రథమ నవల అనడాన్ని ఖండించి, అక్కిరాజు రమాపతిరావు 'మహాశ్వేత' "తొలితెలుగు నవలకాదని

కొన్ని ఋజువులు చూపారు. కొక్కొండవారు 1871లోనే 'ఆంధ్ర భాషా సంజీవిని" పత్రికను స్థాపించుకొనీ, నాలుగైదేళ్ళ ముందే రాసిపెట్టుకొన్న 'మహాశ్వేత' నవల్ని తన పత్రికలో ప్రచురించుకోలేదు. 1895 లో పనప్పాకం అనంతాచార్యుల 'వైజయంతి" లో సీరియల్ గా ప్రచురించినా, సంపూర్ణంగా లేదు. అంటే 1895కి మహాశ్వేత పూర్తిగాలేదు. (పు.ము XI పు.432-438) పైగా తన 72వ యేట కొక్కొండ ప్రకటించుకొన్న రచనల జాబితాలో 'మహాశ్వేత' లేదు. అసంపూర్ణ రచన కనుకనే తొలి నవలకాదని రచయిత కూడా దీనిపేరు చేర్చలేదు. (పు.438) అన్నారు.

'మహాశ్వేత' తొలితెలుగు నవలకాదనే స్పష్టత ఉన్నా ఏది తొలి తెలుగు నవలో ఇంతవరకూ స్పష్టంగా చెప్పలేదు. పన్నెండో సంపుటిలో 'నవలలు నానారకాలు' అనే ప్రకరణంలో గోపాలకృష్ణమ్మ 1872 లో రచించిన శ్రీరంగరాజ చరిత్ర తెలుగులో మొట్టమొదటి నవల (పు.127) అని ఆరుద్ర చెప్పారు. గోపాలకృష్ణమ్మకి గోపాలకృష్ణ మూర్తి, గోపాలకృష్ణమ చెట్టి అనే వ్యవహార నామాలు కూడా ఉన్నట్లు ఇంటిపేరు నరహరి వారని తెలిపారు. అంటే గోపాలకృష్ణమ్మనే నరహరి చెట్టి, గోపాలకృష్ణగా పిలిచేవారని తెలుస్తుంది. ఇంతవరకూపరిశీలకుడు లేదా పాఠకుడు గొలుసుకట్టుగా చదివితే గాని 'తొలితెలుగు నవల' అని ఆరుద్ర దేన్ని చెప్పాడో తెలియని పరిస్థితి ఉంటుంది. ఒకవేళ మొదటి సంపుటినో ఏదొక సంపుటిని మాత్రమే చూస్తే, అందులో సందర్భానుసారంగా చెప్పిన అభిప్రాయమే నిర్ణయమనుకొనే ప్రమాదం లేకపోలేదు. పోనీ, ఇంతవరకూ 'గొలుసుగట్టు' గా చదివిన తర్వాత పన్నెండో సంపుటికైనా స్పష్టంగా చెప్పినా, అదే ఆరుద్ర నిర్ణయమనే విశ్వసనీయత కలగడం కూడా కష్టమే.

ఫలితాంశాన్ని ధృవీకరించుకోవడానికి పాఠకుడే మళ్ళీ చాలా ప్రయత్నం చేయవలసి ఉంటుంది. ఇదే సంపుటి 127వ పుటలో "అదే తెలుగులోని మొట్టమొదటి నవల" అని ప్రకటించిన ఆరుద్ర పుట 129 లో "శ్రీరంగరాజ చరిత్ర" ను నవీన ప్రబంధం అన్నారు. నరహరి గోపాలకృష్ణను చెట్టి శ్రీరంగరాజ చరిత్ర 'సోనాబాయి పరిణయము' హిందువుల ఆచారాన్ని తెలిపే నవీన ప్రబంధమని గ్రంథముఖ చిత్రం మీద ప్రకటించుకోవడం, ఇంగ్లీషు పీఠికలో "This attempt to delineate the manners and customs of the Telugu, in the form of a novel"... అని చెప్పుకోవడం వల్ల, తెలుగులో మొట్టమొదటి 'నవల' అనే ప్రక్రియను ప్రవేశ పెడుతున్నా, సమానమైన పారిభాషిక పదం తెలుగులో లేక 'నవీన ప్రబంధం' గా పెట్టుకున్నారని, ఆరుద్ర వివరించారు. "కథనూ టూకీ"గా తెలుసుకొందామంటూ ఈ చర్చను ముగించారు.

నన్నెచోడుడు, భీమన్న, మడికి సింగన, అప్పకవి, మొల్ల, అష్టదిగ్గజకవులు, క్షేత్రయ్య, తాళ్ళపాక తిమ్మక్క, వేమన, గురజాడ మొదలైన వారి స్థల,కాల కర్తృత్వాది విషయాల్ని ఆరుద్ర కొనసాగించిన 'గొలుసుకట్టు పద్ధతి' లో పరిశీలిస్తేనే 'స్పష్టత' అవగాహనకొస్తుంది. ఇటువంటి పద్ధతిని కొనసాగించడానికి కారణాల్ని అన్వేషిస్తు, నిరంతర అధ్యయశీలి అయిన ఆరుద్ర, ఏ చిన్న ఆకరాన్ని దొరికినా, దాన్నెక్కడో చోటు చూపించాలనే ఆలోచన ఉండి ఉండవచ్చు. సమగ్ర ఆంధ్ర సాహిత్య రచనను ఒక పత్రికవలే నెలనెలా వెలుపరించారు. వెలువడుతున్నప్పుడే పత్రికల్లో వివిధ వాదోపవాదాలు జరిగేవి. మారన,

మడికి సింగన, మొల్ల వంటివారి కాల నిర్ణయాలు భారతి మాసపత్రికల్లో వరుసగా పరిశీలిస్తే కన్పిస్తున్నాయి. సమగ్ర ఆంధ్ర సాహిత్యంలో కందుకూరి వీరేశలింగం, గురజాడ శ్రీరామమూర్తి, చాగంటి శేషయ్య రచనల్నే అధికంగా ఉపయోగించుకున్నా, పత్రికల్లోని వ్యాసాలపై ఆరుద్ర ఎక్కువగా ఆధారపడటం వల్ల కూడా 'గొలుసుకట్టు పద్ధతి' తప్పలేదు. అయినంత మాత్రం చేత, అందరికవుల్నీ ఈ పద్ధతిలోనే వివరించారనడానికి అస్కారం లేదు. ప్రాచీన కవుల్లో నన్నయ్య, తిక్కన, ఎర్రాప్రెగడ, నాచనసోమనాథుడు శ్రీనాథుడు, పోతన, శ్రీ కృష్ణదేవరాయులు, అల్లసాని పెద్దన, పొన్నికంటి తెలగన, పింగళిసూరన, రామరాజభూషణుడు, మొదలైన వారిగురించి స్పష్టత, విశ్వసనీయంగా సూటిగా వివరించారు. ఆధునిక కవుల్ని వివరించడంలో చాలా స్పష్టత కన్పిస్తుంది.

## 5.13. భాషా, గౌరవవాచకాలు– ఏకరూపత? :

ఆరుద్ర, సమగ్ర ఆంధ్ర సాహిత్యంలో సరళమైన భాషను, కొన్నిచోట్ల కవిత్వానికి అనుకూలమైన వర్ణనలతో కూడిన భాషను ప్రయోగించారు. తొ.ము. పీఠికల్లో ఈ విషయాన్ని ఎంతోమంది కొనియాడారు. కానీ, సరళమైన భాషను వాడటంలో సృజనాత్మకత ను పరిశోధనకు వినియోగించుకోవడానికి జరిగిన ప్రయత్నంఅని పరిశోధనను జనరంజకంగా తీర్చిదిద్దగలగడమనీ ఈ పరిశోధనలో అవగతమవుతుంది. అయితే, భాషను ప్రయోగించడంలో కొన్ని పలుకుబళ్ళనీ, పడికట్టు పదాల్నీ ప్రయోగించడం కన్పిస్తుంది. గౌరవవాచకాలు వాడటంలో నన్నయ్య, తిక్కన, ఎఱ్ఱన వంటి కవుల్ని ఒక విధంగానూ, కొంతమంది కవుల్ని మరొక రకంగానూ ప్రయోగించిన శైలి వల్ల, ఏకరూపత కొరవడింది. ఈ విధమైన సంబోధనకు ప్రత్యేకమైన కారణమేదైనా ఉందేమోనని పరిశీలిస్తే, ఆరుద్ర దాన్ని ఎక్కడా స్పష్టం చేయడానికి ప్రయత్నించినట్లు కన్పించలేదు.

తెలుగులో "ఓం ప్రథమం" వెలువడ్డ పత్రిక ఏది? (స. ఆం.సా.IX పు.ము-1) " ఒకటిమాత్రం ఖచ్చితంగా చెప్పుకోవచ్చు, జక్కన చెప్పిన దానిని బట్టి వెన్నెలకంటి జన్నమంత్రి దేవకీవందన శతకం చెప్పాడు (స.ఆం.సా.III పు.ము-276). అంతేకాక,వాక్యంలో కలిసిపోయే ఆంగ్లభాషాపదాలతో మణిప్రవాళ శైలిలో కూడా రచన కొనసాగించారు. తిక్కన గారి తాత, శ్రీనాథుని పితామహుడు ఒకే "బోటు" లో పయనిస్తున్నారు (స.ఆం.సా.II పు.ము-171). గౌరవ వాచకాలలో ఏకరూపత లేని దానికి ఉదాహరణగా ఈ పేరాను చూడవచ్చు. "శ్రీనాథునికి సాక్షాత్తూ బావమరుదులు ముగ్గురున్నారు. వాళ్ళు దగ్గుపల్లి తిప్పయ్య గారి కుమారుడు పోతన, ఎర్రన, దుగ్గన అనేవాళ్ళు. శ్రీనాథుని బావమరుదులలో ఒక పోతన్న ఉన్నాడు. కనుక, అనంతర కవులూ, ప్రజలూ పొరపడి బమ్మెరపోతన్న గారినే శ్రీనాథుని బావమరిదిగా భావించి కట్టుకథలు కల్పించారు". (స. ఆం.సా.III పు.ము-301); "మడికి సింగన్న సకలనీతిసమ్మతంలో ఉదాహరించాడు" (స. ఆం.సా.III పు.ము-1) కొన్ని లోపాలున్నా, గౌరవ వాచకాల ప్రయోగంలో ఏకరూపత లేకపోయినా, మరికొంత మందిని అగౌరపరచాలనే ఉద్దేశం కాకపోయినా, సాన్నిహిత్యం తీసుకున్నారనిపిస్తుంది. ఇక, ఫలితాంశ నిర్ణయాల్లో, గొలుసుకట్టుపద్ధతి నిర్ణయాలలో ఆ లోపాలు రావడానికి ఆరుద్ర 'పరిశోధన జిజ్ఞాస ' కారణమవ్వడమే కాకుండా, కొంత తప్పించుకొనే

ఆలోచన ఉన్నా మొత్తం మీద పరిశోధనలో నిర్ణయాల్ని, ఫలితాంశాల్ని నిదానంగా, సంయమనంతో ప్రకటించే పద్ధతిగానే భావించవలసి ఉంది. అయితే, వీటిలో కొన్ని చర్చనీయాంశాలు కూడా ఉన్నాయి.

## 5.14. చర్చనీయాంశాలు– భవిష్యత్తు పరిశోధనకు ప్రేరణలు:

ఆరుద్ర చాలా విషయాల్ని పరిశోధించాలనే సూచన చేసి వదిలేసిన వాటిలో కొన్ని చర్చనీయాంశాలు ఉన్నాయి. భవిష్యత్తులో సాహిత్య చరిత్ర రాయాలనుకొనేవారికి పరిశోధకులకు, కొన్ని 'పరిశోధన సమస్యల్ని' ముందుపెట్టి ఆ దిశగా జరగవలసిన కృషిని వివరించారు. చర్చనీయాంశాల్లో పరిశోధకులకు సూచించినవే కాకుండా కొంతమంది సమగ్ర ఆంధ్ర సాహిత్య రచనలోని అంశాల్ని విమర్శించిన ఇంతకుముందు పరిశీలించని అంశాల్ని కూడా తెలుసుకోవచ్చు. కొన్ని వ్యాప్తిలో ఉన్న అభిప్రాయాల్ని తరచి చూడకుండా చేర్చారని రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ చెప్తూ "చెంబు" అనే పదంలో ఉండేది. 'బు' ప్రత్యయం కాదు. 'చెంబొ' ఇది 'చెంబు' గా మారి తామర పాత్రగా ప్రసిద్ధి లోకి వచ్చిందన్నారు. ఇది అసలు సిసలు తెలుగు పదంఅనుకోలేమని అరవ మలయాళాల్లో 'శెంబు' కన్నడంలో 'చెంబు' అని వివరించారు. క్రీ.పూ.200 క్రీ.శ.200 మధ్య కాలానికి చెందిన అమరావతీ స్తూపం మీద గుర్తించిన 'నాగ' పదానికి సంస్కృతంలో అనేక అర్థాలున్నాయని ప్రభాకరశాస్త్రి 'నాగబు' తెలుగు పదం అనడంలో ఆంతర్యాన్ని ప్రామాణికత్వాన్ని పరిశీలించవలసిన అవసరం ఉందనే సూచన చేశారు[91].

'నాగబు' తొలి తెలుగు మాటగా భావించటం[93] వల్ల సమగ్ర ఆంధ్రసాహిత్యం గ్రంథానికి రంగ పీఠికగా తీసుకొని, ముఖచిత్రం మీద అగ్రశీర్షికగా ఆగ్రపీఠమిచ్చినట్లుగా ఆరుద్ర వివరించారు (తొ.ము I పు.6 పు.ము I పు.4) ఈ పదం గురించి వివరిస్తూ ఆరుద్ర 'నాగబు' పదమే నాగమ్బు, నాగంబు, నాగమ్ము, నాగము, నాగం అని మార్పులు చెందింది. 'నాగంబు' అనేది చెంబు అనే తెలుగు పదం వంటిదేనని (తొ.ము.I పు.6) చెప్పిన దాన్ని రాళ్ళపల్లి వారి విశ్లేషణ తరవాత ఆరుద్ర పునర్ముద్రణలో తెలుగు భాషాపదం అనేదాన్ని మార్చేసి '*అసలు సిసలు ద్రావిడ భాషా పదం*' అని మార్చారు. రాళ్ళపల్లి వారు అరవ, మలయాళం, కన్నడ భాషల్లో ఉన్న 'శెంబు' పదం అనే దాన్ని ద్రావిడ భాషా పదం అని ఆరుద్ర చెప్పారు. అరవ (తమిళం) మలయాళం, తెలుగు భాషలు ద్రావిడ భాషా కుటుంబానికి చెందినవి. తెలుగు మూల మధ్య ద్రావిడ భాషలో అంతర్లీనమైనదనీ, తెలుగులో "కెంపు" మొదలైన కొన్ని పదాల్లో తాలవ్యాచ్చుముందున్న "క" కారం "చ" కారంగా మారలేదనీ, తెలుగు పదాల్లో తాలవ్యీకరణం జరిగి ఆగిపోయిన తరువాత కన్నడం నుంచి ఎరువు తెచ్చుకొన్న పదమై ఉంటుందని భాషాశాస్త్రవేత్తలు భావిస్తున్నారు.[94]

ఆరుద్ర "బు" ప్రత్యయం తెలుగులో ఉందనీ, ఇదే "నాగ" శబ్దానికి చేరిందనీ వేటూరి ప్రభాకరశాస్త్రి భావించిన అభిప్రాయాన్నే స్థిరీకరించుకొన్నారు. తెలుగు భాషాచరిత్రలో 'నాగబు' తొలి తెలుగు పదమనే చర్చలేదు. కానీ, "ము" వర్ణానికి రూపాంతరాలుగా "మ్బు, మ్ము," లు శాసనాల్లో (క్రీ.శ.575-600) 'కొట్టంబు' వంటి పదాల్ని సూచిస్తున్నారు[95].

కొంతమంది సాహిత్య చరిత్రకారులు[96] 'నాగబు' తొలివెలుగు పదంగా వేటూరివారు భావిస్తున్నట్లు చెప్పినా, కారణాల్ని ఆరుద్ర చూసినట్లు చెప్పడానికి ప్రయత్నించలేదు.

"నాగబు" లో 'నాగ' సంస్కృత లేదా ప్రాకృత శబ్దమనీ, 'బు' ప్రత్యయమనీ, శెంబు-చెంబు పదాలలోని 'బు' వంటిదే నాగబు లో బిందువులోపించి ఏర్పడింది వంటివి చర్చనీయాంశాలే!

తెలుగులోని 'కందం' ప్రభావమే సంస్కృత కందానికి కారణమనీ, కన్నడ ప్రభావం కాదనీ, 'తెలుఛందో వికాసం' లో సంపత్కుమారాచార్య నిరూపించిన అంశాన్ని ఆధారం చేసుకొని ఆరుద్ర, తెలుగు కవిత్వానికి 'కందమే' మూలకందం అనీ, తెలుగునుండి ప్రాకృతంలోకి, ప్రాకృతంలో నుండి సంస్కృతంలోకి వెళ్ళిందనీ, దీన్ని సంస్కృతంలో ఆర్య అంటారన్నారు. (తొ.ము. I పు.36, పు.ము I.32).

దీన్ని రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ సమీక్షించారు." పింగళాచార్యుడు లక్షించి ఉదహరించిన పద్యం ఆర్యాగీతయే తెలుగుకన్నడాల కందం. పాణినికాలంవాడు. ప్రాకృత లాక్షిణికులు దీనికి 'ఖందయ' అని పేరు పెట్టారు. 'స్కందం' అని దాని సంస్కృతోచ్చారణ. ఎప్పుడు, ఎందుకు ఈ పేరు మార్పు కల్గిందో తెలియదు. అదే 'కందం' గా తెలుగు కన్నడులు వాడినారు. తాము వాడిన సంస్కృత వృత్తాలన్నింటికీ తెలుగువాళ్ళు మూలంలో లేని యతిప్రాసల్ని దిగ్గొట్టార"నీ అన్నారు.

'కందం' తెలుగు నుండి 'సంస్కృతం 'లోకి వెళ్ళిందని ఛందస్సుమీద పరిశోధన చేసిన వారంటున్నా, రాళ్ళపల్లివారు దీన్నిలా సమీక్షిస్తూన్నారు. ఆరుద్ర దీన్ని పట్టించుకొన్న దాఖలాలేమీ లేవు. అయినా ఇదొక చర్చనీయాంశంగా పరిశోధకుల ముందుపెట్టినట్లే అవుతుంది.

'రాఘవ పాండవీయం' రాసిన తర్వాత పింగళి సూరన దృక్పథంలో మార్పులు వచ్చాయనీ, పూర్వం లలాటేక్షణ భక్తిశీలుడు. ఇప్పుడు (కళాపూర్ణోదయ రచనా కాలానికి) విశిష్టా ద్వైతిగా మారాడని (తొ.ము.VIII పు.203) ఆరుద్ర వివరించారు. దీన్ని రాళ్ళపల్లి వారు విమర్శిస్తూ 202వ పుటలో ఈ విషయమున్నట్లు చెప్పి, "అది మార్పు" అనలేమనీ, నంద్యాల ప్రభువులకై చేసుకొన్న దాక్షిణం పెండ్లి, మరి ప్రభావతి ప్రద్యుమ్నకాలానికి శివభక్తుడే అయినాడు. ప్రాయశ : అల్లసాని పెద్దన్న, తెనాలి రామకృష్ణుడు మొదలైన వారిదంతా- ఒక తాళ్ళపాక వారిది విడిచి - ఇటువంటి కప్పుకొన్న వైష్ణవమే అని తన అభిప్రాయాల్ని చెప్పారు.

దీన్ని ఆరుద్ర (పు.ము VI పు-105) ఎలాంటి మార్పుచేయలేదు. పింగళి సూరన కళాపూర్ణోదయం తర్వాతనే 'ప్రభావతీ ప్రద్యుమ్నం' రచించి, తండ్రి (అమరన) కే అంకితమిచ్చాడు.[98] వజ్రనాభుడనే రాక్షసుని కుమార్తె అయిన ప్రభావతికీ, కృష్ణుని కుమారుడైన ప్రద్యుమ్నుడికీ జరిగిన వివాహమే దీనిలో ఉండే ప్రధాన ఇతివృత్తం. ఇతడిని 'లలాటేక్షణ భక్తిశీలుడు' గానే కొంతమంది[99] భావిస్తున్నారు. జి.నాగయ్య వంటివారు ఏవిషయం తేల్చకుండా తప్పుకొన్నారు. కవుల దృక్పథం, వారు రచించిన కావ్యాల్ని బట్టి మాత్రమే కాకుండా, వారి జీవితాన్ని కూడా పరిశీలించినప్పుడే ఒక నిర్ణయానికి రావడానికి

అవకాశం ఉంటుంది. రాళ్ళపల్లి వారన్నట్లు, 'కప్పుకొన్న వైష్ణవమే' కాదు, మరికొన్న మతసిద్ధాంతాల్లోనూ ఇటువంటివి కన్పిస్తుంటుంది. జీవనోపాధీ కోసమో, తన రచన వెలుగులోకి రావాలనో, మరే కారణాల చేతనైనా కొన్ని కావ్యాల్ని వర్ణించవలసివస్తుంది. కావ్యవస్తువుని అనుసరించి, ఆ కవుల్ని 'దృక్పథాన్ని' అంచెనావేయడం సరైన నిర్ణయం కాదు. సమకాలీనుల రచనల్నీ పరిశీలించవలసి ఉంటుంది. ఇదికూడా పరిశీలనాంశమని తెలుస్తుంది. ఆరుద్ర రచన గురించి విమర్శించిన రాళ్ళపల్లివారే మరికొన్ని సూచించి వదిలేశారు. అంటే ఇది కూడా చర్చనీయాంశమే!

శంకరాచార్యులు బుద్ధుణ్ణి విష్ణుమూర్తి తొమ్మిదవ అవతరాం చేసి సామాన్యుల్ని మంత్రముగ్ధుల్ని చేశారని ఆరుద్ర **(తొ.ము I పు.108)** అనడాన్నీ, 'మన ఆడవాళ్ళ పాటలన్నీ తరువోజలలోనే ఉంటాయనీ **(తొ.ము.I పు.77)** తిక్కన్నది ఆనాటి శిష్టవ్యవహారికం అనీ **(తొ.ము II పు.94)**, తిక్కన్న భారతం ఆనందపదాంకితమని రామలింగారెడ్డి అభిప్రాయంగా చెప్పడం **(తొ.ము II పు.132)** వేసవికాలవర్ణన ఉన్న వాసిరాజు రామయ్య పద్యం మల్లికావన......పద్యాన్ని "గంగను వర్ణిస్తున్న" పద్యంగా **(తొ.ము VIII పు.90)** అపార్థం చెప్పారనీ, దాని ముగింపులో కూడా స్పష్టంగా "ఘర్మసమయమేది పర్వె" అని ఉందనీ వీటిలో కొన్ని 'ధోరణి' అభిప్రాయాలుగా ఆరుద్ర రచనలోని లోపాల్ని రాళ్ళపల్లి వారు వివరించారు.

వీటిలో తిక్కన్న భారతంలో ఆనంద పదాల గురించి పునర్ముద్రణ **(II పు.117)** లో రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ అభిప్రాయాలుగా ఆరుద్ర మార్పుచేశారు. వేసవిని వర్ణించే పద్యం గురించి కూడా **(పు.ము V పు.250)** మార్పు చేస్తూ "గంగను భగీరథుడు సంపాదించాడు. వాసిరాజు రామయ్య గంగను వర్ణిస్తున్న పద్యం ఏదీ లభించలేదు గాని, వేసవివర్ణన ఒకటి లభ్యమైంది చూడండి" అని ఆరుద్ర వాక్యాన్ని మార్పుచేశారు.

కొన్ని సూక్తులు మూల భారతంలో లేవనడం సరికాదని వాటిని ఆధారాలతో రాళ్ళపల్లి వారు చూపారు. ఆదిలో శ్రీరామచంద్రుడు అంతటివాడు దేశిని ఈసడించిమార్గపద్ధతి గానాన్ని మెచ్చుకున్నాడని **(తొ.ము I పు.100)** అనడం శ్రీరామునికి గానీ, వాల్మీకికి గాని ఆభావాలు లేకపోయినా, ఆరుద్ర అపవాదం వేశారని, వాల్మీకి మూలాన్ని చూడలేదన్నారు. దీన్ని ఆరుద్ర పునర్ముద్రణ **(I పు.139)** లో జాగ్రత్తగా వాక్యాన్ని మార్పు చేశారు. 'ఆదిలో శ్రీరామచంద్రుడంతటివాడు దేశిని ఈసడించి మార్గ పద్ధతి గానాన్నే *మెచ్చుకొన్నాడన్న భావం పండితలోకంలో వ్యాప్తించిందంటే*, మధుర కవితలు ఎటువంటి పరిస్థితులో ఉండేవో ఆలోచించుకోవచ్చు అని మార్పుచేసి పాదసూచికలో వావికొలను సుబ్బారావు 'మందరం' బాలకాండ పుట : **366** ని పేర్కొన్నారు. ఈ వివరణ తొలిముద్రణ లో లేదు. దీన్నిబట్టి తనకు సరైన ఆధారాలు లభ్యమైతే తన అభిప్రాయాల్ని సరిచేసుకొనే స్వభావం ఆరుద్రలో ఉందని తెలుస్తుంది. కానీ, ఆధారాలతో తాను చెప్పింది సరైందని భావిస్తే, వాటిని విమర్శలు వచ్చినా, హేతుపూర్వకంగా కన్పించకపోతే, పూర్వ అభిప్రాయాల్ని యధాతథంగా ఉంచేస్తారు. రాళ్ళపల్లి వారే ఒక సూచన చేస్తూ, తొలిముద్రణలో "బాలభారతం అనే భాసుని భారతనాటకం" భాసునిదేనా? అనే అనుమానాన్ని వ్యక్తం చేశారు తప్ప, అదేవరిదో చెప్పలేదు. దీన్ని ఆరుద్ర పునర్ముద్రణలోనూ మార్పుచేయలేదు.

"బాలభారతం" గురించి పరిశీలిస్తే తెలుగు, సంస్కృతాల్లో ఈ పేరుతో కావ్యాలు, నాటకాలు కన్పిస్తున్నాయి.

'బాలభారతమ్' సంస్కృతంలో అగస్త్యుడు ఒక కావ్యం రాశాడు. కర్త తెలియక పోయినా, కామినేని (మొగటి) మల్లారెడ్డికి అంకితమిచ్చిన 'బాలభారతం' తెలుగులో ఒకటి, మరొకటి, కాకమాని గంగాధరుడు రచించిన 'బాలభారతం' ఇంకొకటి, ప్రోలుగంటి చెన్నశౌరి, 'బాలభారతం' కన్పిస్తున్నాయి" (తె.సా.కో-తె.అ.198 : 690-691).

మల్లాది సూర్యనారాయణ శాస్త్రి, సంస్కృత వాఙ్మయ చరిత్ర (ద్వి.సం) లో భాసుడు 'బాలభారతం' నాటకం రాసినట్లు చెప్పారు. అయితే, కొంతమంది భాసుని నాటకం కాదనేవారూ ఉన్నా, రెండింటినీ పరిశీలించినప్పుడు భాసుని నాటకమనడమే సరైందన్నారు. రెండు అంకాలు మాత్రమే ఈ బాలభారతం లభ్యమవుతుందన్నారు[199] (పు: 413). బహుశా ఆరుద్ర ఈ గ్రంథంనుండి ఈ భావాల్ని స్వీకరించి ఉండవచ్చు. తొ.ము.లోగానీ, పు.ము.లో గానీ వివరాలేమి చెప్పలేకపోవడంతో ఇది ఆరుద్ర అభిప్రాయంగా విమర్శకు గురైంది. వీటిలో చాలా వాటిని పరిశీలించినప్పుడు కొన్నింటిని గొప్పగానో, అందంగానో చెప్పాలనే ప్రయత్నంలో గొప్పగొప్ప విశేషణాలు చేసి ప్రకటనలు (statements) ఇవ్వడంవల్లనే 'ధోరణి అభిప్రాయాలు' గా విమర్శలకు గురికావలసి వచ్చింది.

తొలిముద్రణ నాటి నుండీ పునర్ముద్రణ వరకూ 'తప్పులు' 'పొరపాట్లు' రావడానికి ఒకే వ్యక్తి ఏకధాటిగా రాయడం, ప్రూఫులు చూసేటప్పుడు కూడా మార్పులకి గురికావడం వంటివి జరిగాయని చాలాసార్లు చెప్పుకున్నారు. అయినా, చాలావరకూ పునర్ముద్రణలో వీటిని సరిచేసి అందివ్వడానికే ప్రయత్నించారు. పొరపాట్లు కొన్ని ఉన్నప్పటికీ సమగ్ర ఆంధ్ర సాహిత్యంలో ఎంతో విశిష్టమైన రచనగా, ఇంతవరకూ వివిధ శీర్షికలతో వివరించడం తెలుపుతుంది. అంతేకాకుండా దీన్ని ప్రామాణిక రచనగానే అనేకమంది విమర్శకులు పరిశోధకులు భావించారు.

తెలిసినా,కావాలని చేస్తే దానిలో 'తప్పు'; తెలియకపోవడం, ఆకరాలకు ప్రయత్నించినా, సకాలంలో లభించకపోవడం తో తొందరగా పూర్తి చేసేయాలని ఉన్నవాటితోనే సరిపెట్టేయాలను కోవడంలో 'లోపం' సాధ్యమైనంతవరకూ ప్రయత్నించినా సమన్వయం కుదరనప్పుడు పొరపాట్లు జరుగుతుంటాయి. ఆరుద్ర సమగ్ర ఆంధ్ర సాహిత్యంలో లోపాటు, పొరపాట్లు కన్పిస్తున్నా, విశిష్టతే ఎక్కువగా ఉంది. దీన్ని సాహిత్య చరిత్రలలో సమగ్ర ఆంధ్ర సాహిత్య స్థానాన్ని గుర్తించాడాన్ని బట్టి కూడా గుర్తించవచ్చు.

## 5.15. సాహిత్యచరిత్రలలో సమగ్రఆంధ్రసాహిత్యస్థానం:

ఆరుద్ర సమగ్ర ఆంధ్ర సాహిత్య చరిత్ర రచించేనాటికీ, తర్వాత వివిధ పేర్లతో కవుల, సాహిత్య చరిత్రలు వెలువడ్డాయి. వీటితో తులనాత్మకంగా విశ్లేషిస్తే ఆరుద్ర సమగ్ర ఆంధ్ర సాహిత్య స్థానం తెలుస్తుంది. 'తెలుగులో సాహిత్య చరిత్రలు' పేరుతో పరిశోధన కొనసాగించిన ఎస్.వి. సూర్యకుమారి కవుల, సాహిత్య చరిత్రలన్నింటినీ, అధ్యయన సౌలభ్యం కోసం 'సాహిత్య చరిత్ర' లుగానే పరిగణించి,

వాటిని ఆరు దశలుగా వివరించారు[101]. మౌఖిక సంప్రదాయాంశాలు తొలిదశగా చెప్తూ 19వ శతాబ్దపు తొలిరోజుల్లో, మెకంజీ, కావలి సోదరులు, బ్రౌన్, వీరేశలింగం వంటివారు శాస్త్రీయమైన సాహిత్య చరిత్ర పరిశోధన మొదలు పెట్టే నాటికి ఉన్న కవుల చరిత్రల్లో కథలు, నమ్మకాలు గ్రంథస్థమైయ్యాయి. వీటిని ఇటీవలచేసిన పరిశోధనలు శాస్త్రీయమైన పద్ధతులతో నిరూపించి, కట్టుకథలని చెప్పిన సాహిత్య చరిత్రకారులలో ఆరుద్ర ఒకరు.

నన్నయ్య-వేములవాడ భీమకవికీ, శ్రీనాథుడు-పోతనలమధ్య, అష్టదిగ్గజ కవుల నిర్ణయ సమస్యవంటివి ఈ దశలోకొస్తాయి. కావలి సోదరులు "దక్కనకవుల చరిత్ర" లో ఇటువంటి కథలు కన్పిస్తాయి.

వీటిని చర్చించి, సోదాహరణంగా నిరూపించి సమగ్ర ఆంధ్ర సాహిత్యం ఈ దశను చాటింది.

రెండవదైన 'సేకరణ-పాఠం పరిష్కరణ' దశలో ముద్రణా యంత్రాలు రాకముందున్న తాళపత్ర గ్రంథాలను సేకరించి, సాహిత్య చరిత్రకు ఒక బలమైన 'ఆకరాల నిధిని' అందించిన దశ. ప్రాచీన సాహిత్యంలో వసుచరిత్ర, రాఘవపాండవీయం, వేమన పద్యాలు సేకరించడంలో బ్రౌన్ కృషి అపారమైంది. ఆంధ్ర కవుల చరిత్ర రాయడానికి కందుకూరి వివిధ ప్రాంతాలకు, గ్రంథాలయాలకు స్వయంగా తాళపత్ర గ్రంథాల్ని, సేకరించి రచించినా, అప్పటికి అవి లభ్యమైనవే. కందుకూరి వారు, అంతవరకూ వెలుగు చూడని వాటిని బయట పెట్టారు. కనుక, సేకరణ కూడా ఒకదశలో పరిశోధన అనిపించుకొంది. క్షేత్రయ్య పదనిర్ణయంలో తంజావూరులోని కొన్ని గ్రామాలకి ఆరుద్ర స్వయంగా వెళ్ళి క్షేత్రకృషి (Field work) చేశారు. కానీ, సమగ్ర ఆంధ్రసాహిత్యంలో సేకరణకే ప్రాధాన్యతనివ్వకుండా, కావ్యాల చరిత్రకు, కావ్యాంగాల విశ్లేషణకీ ప్రాధాన్యతనివ్వడం వల్ల ఈ దశకూడా దాటిముందు కెళ్ళారని చెప్పవచ్చు. పాఠపరిష్కారంలో బ్రౌన్ పండితుల కృషి, విశేషంగా గుర్తించవలసి ఉంది. ఆరుద్ర కొన్ని వేమన పద్యాలకు 'పరిష్కరణ' లు చేసినా అవి వేమన దార్శనిక పరిణామాన్ని తెలుసుకోవడానికే కనుక, ఈ దశనుకుడా సమగ్ర ఆంధ్రసాహిత్య అధిగమించిందని అర్థమవుతుంది.

మూడవదైన 'కాలక్రమ నిర్ణయం-కవిజీవితాల దశ'ను పరిశీలిస్తే, ఈ దశలో కవుల కాలనిర్ణయాలను, కావ్యావతారికలను బట్టి నిర్ణయించే వీలుండటంవల్ల, ఈ దిశగా కవుల కాలం, స్థల చర్చలతో చాలామంది 'కవుల చరిత్రలు' రాశారు. కావలి రామస్వామి "దక్కనుకవుల చరిత్ర", గురజాడ శ్రీరామమూర్తి 'కవిజీవితములు' జయంతిరామయ్య పంతులు 'కవిజీవితములు' కందుకూరి వీరేశలింగం 'ఆంధ్ర కవుల చరిత్రము', మధునా పంతుల సత్యానారయణ 'ఆంధ్ర రచయితలు' నిడదవోలు వెంకటరావు 'తెలుగు కవుల చరిత్ర', బులుసు వెంకట రమణయ్య 'కవుల చరిత్ర' ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ 'ఆంధ్రకవయిత్రులు', చాగంటి శేషయ్య 'ఆంధ్ర కవితరంగిణి' మొదలైన వాటిలో కులగోత్రాది విషయాలు జనవ్యవహారంలో ఉన్న కథలు, కర్తృత్వ వివాదాలను చర్చిస్తూనే, భారతాంధ్ర కవులు' రామాయణాంధ్రకవులు, ఆంధ్ర పంచకావ్య కవులు, ఆంధ్ర ద్వ్యర్థికావ్యకవులు, ప్రౌఢ ప్రబంధ కవులు, పురాణకవులు వంటి విభజనలు - గురజాడ శ్రీరామమూర్తి కవిజీవితములు కన్పిస్తాయి. ఈ దశలోనే నిడదవోలు వారు నన్నయ;, శివకవి, తిక్కన, ఎఱ్ఱప్రగడ శ్రీనాథయుగాల పేర్లతో యుగవిభజన చేయడం కన్పిస్తుంది.

'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' లో కూడా కాలనిర్ణయాల్ని, కవి జీవితాల్ని చర్చించారు. కొన్నింటిని పూర్వపరిశోధకుల అభిప్రాయాలతో సమన్వయం చేశారు. కొన్నింటికి తన అభిప్రాయాల్ని స్పష్టంచేశారు. 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' లో ఈ దశ స్వభావం కొంత కన్పిస్తున్నా, కవి కాలనిర్ణయాల్లో జన్మ, కుల, గోత్ర శాఖ చర్చోపచర్చల్ని కొన్ని కావ్యాల కాలనిర్ణయాన్ని బట్టి, కవి దృక్పథ పరిశీలనకు కొంత ఈ రకమైన చర్చలు కన్పిస్తున్నా దృక్పథంలో తేడా ఉండటం వల్ల ఈ దశను అధిగమించిన రచనగానే భావించవచ్చు. చాగంటి శేషయ్య 'ఆంధ్ర కవితరంగిణి' లోగల కులగోత్ర, వంశాది చర్చలు ఆరుద్ర చాలా వరకూ స్వీకరించడం వల్లనే నేలటూరి వారి విమర్శకు గురైనా, ఆరుద్ర వీటిని ఒక సామాజిక కోణాన్ని చూపడానికి చేసిన ప్రయత్నమే కానీ, అదే ప్రధానంకాదు.నన్నెచోడుడు రాజవంశానికి, రేచన వైశ్యకులానికి, చేమకూర వెంకటకవి బ్రాహ్మణుడు కాదనీ,మొల్ల కుమ్మరికులం అనిభావిస్తున్నా, అప్పకవి వంటివారు కొన్ని కులాల వారి కావ్యప్రయోగాలను స్వీకరించకపోవడానికి గల కారణాల్ని అన్వేషించే దృక్పథాన్ని వివరించడం వంటి వాటిని స్పష్టం చేయడానికీ కుల చర్చలు కన్పించినా, తిక్కన వంశ గోత్రాది చర్చల్ని వారి కుటుంబాన్ని పరిశీలించడం వల్ల ఖడ్గతిక్కన, కవి తిక్కన వేర్వేరని చెప్పేందుకు అవసరమైనంతవరకే చర్చించారు. వేమన 'రెడ్డి' కులమనడంలో కాలాన్ని తెలుసుకోవడానికి జరిగిన ప్రయత్నంలోనే అని గమనించనపుడు, ఈకాలక్రమ నిర్ణయ-కవి జీవితాలదశ స్వభావం కన్పిస్తున్నా, 'దృక్పథం' వేరని తెలుస్తుంది.

నాల్గవ దశ – 'సాహిత్య చరిత్ర నిర్మాణ దశ' – ప్రక్రియల చరిత్రలలో స్థల,కాల, కుల చర్చలనుండి, కావ్య సమీక్షల వరకూ చేరిన దశ. 'సాహిత్య చరిత్ర' నిర్మాణం ఆరంభమైన దశగా చెప్పుకోవచ్చు. ఈదశలో వంగూరి సుబ్బారావు రచించిన 'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర' ని పరిశోధకులు తొలి 'ఆంధ్ర సాహిత్య చరిత్ర' గా పేర్కొంటున్న రచన నుండి, సాహిత్య చరిత్రకారులు కావ్య సమీక్షల్ని, సాహిత్య ప్రక్రియల్ని యుగవిభజనలో ఒక అంశంగా గుర్తించడం ప్రారంభించారు. కవిత్వవేది కల్లూరి వేంకటనారాయణరావు 'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహము', బసవరాజు, 'ఆంధ్ర కవిత్వ చరిత్రలు', కాశీనాథుని నాగేశ్వరరావు 'ఆంధ్ర వాఙ్మయ చరిత్రము', ఖండవల్లి లక్ష్మీరంజనం 'ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము', శిష్ట్లా రామకృష్ణ శాస్త్రి 'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సర్వస్వము', దివాకర్ల వేంకటావధాని 'ఆంధ్ర వాఙ్మయ చరిత్రము', ఈ రచనా పద్ధతిలోనే ఆరుద్ర 'సమగ్ర ఆంధ్ర సాహిత్యాన్ని' కూడా ఈ దశలో కలిపేశారు సాహిత్య చరిత్రలపై పరిశోధన చేసిన ఎస్.వి.సూర్యకుమారి. కానీ, అయిదవదైన 'సమగ్ర సాహిత్య చరిత్ర' నిర్మాణ ప్రయత్న దశ లో 'సమగ్ర సాహిత్య' చరిత్ర నిర్మాణ ప్రయత్న దశ లో 'సమగ్ర ఆంధ్ర సాహిత్య చరిత్ర' వెలువరించాలనే సంకల్పం మాత్రం ఆరుద్ర వ్యక్తం చేశారని[102], 'అయితే ఈ విధంగా పూర్వం పరిశీలించబడ్డ అంశాలను గురించి ఏమంత లోతుగా, మరింత విస్తృతమైన సమాచారంతో చర్చించడమే, సమగ్రాంధ్ర సాహిత్య చరిత్ర ప్రయోజనం అనుకుంటే పొరపాటు'వుతుందనీ[103] సమగ్రత గురించి, మార్క్సిస్టు సిద్ధాంతాన్ని ఉపయోగించినట్లయితే 'సమగ్రాంధ్ర సాహిత్య చరిత్ర'ను నిర్మించే అవకాశం ఉందన్నారు[104].

ఆరవదైన 'పరిణామ పరిశీలన దశ-వికాస చరిత్రలు' దశలో 'కవిత్వవేది' ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహం నుండీ ఈ సాహిత్య పరిణామం కన్పిస్తున్నా, సమగ్ర సాహిత్య చరిత్ర నిర్మాణ స్పృహ **1965**లో 'ఆరుద్ర సమగ్ర ఆంధ్ర సాహిత్యం' లో కన్పిస్తుందని, సాహిత్య వికాస చరిత్ర జి.వి.సుబ్రహ్మణ్యం వ్యాసాల్లో ప్రస్ఫుటమవుతుందని ఎస్.వి. సూర్య కుమారి అన్నారు[105]. సాహిత్య విమర్శను సరళమైన శైలిలో చేసినా, ఆద్యంతమూ ఒకే విమర్శ సూత్రంతోపరిశీలించే ప్రణాళిక లేద[106] ఒకచోటా మరొకచోట "కొంతవరకూ ఏకసూత్రతను పాటించారని[107] సూర్యకుమారి చేసిన విభాగంలో ఆద్యంతమూ ఏకసూత్రత కన్పించినప్పటికీ, ఇది సాహిత్య యుగవిభజనకు, సాహిత్యేతరమైన ప్రాతిపదికనుపయోగించేపద్ధతి కనుక దీని సామాజస్యం చర్చనీయాంశమౌతుంది అన్నారు[108].

సూర్యకుమారి 'సాహిత్య చరిత్ర' లపై పరిశోధనచేసి 'సాహిత్య చరిత్ర'ల వివిధ దశల్ని వివరించి విశ్లేషించిన దాన్ని అనుసరించి చూసినా, ప్రక్రియాపరమైన 'సాహిత్యచరిత్రల రచనా దశ'లోనూ, 'వికాస చరిత్రల నిర్మాణ దశ'లో సమగ్ర సాహిత్య నిర్మాణ స్పృహ,ను వ్యక్తం చేసిన రచనగా ఆరుద్ర 'సమగ్ర ఆంధ్ర సాహిత్యా'నికి ఒక విశిష్ట స్థానం ఉందని స్పష్టమవుతుంది.

కానీ, మార్క్సిస్టు దృక్పథంతో చరిత్ర, సాంఘిక, ఆర్థిక, రాజకీయ ప్రభావాలన్నింటినీ పరిశీలిస్తూ, అంతకుమునుందు 'సాహిత్య చరిత్ర'లు అందించలేని అనేకాంశాల్ని స్పర్శమాత్రంగానైనా అందించి 'సమగ్ర' శబ్దాన్ని సార్థకం చేసుకొంటూనే, కవుల చరిత్రనూ, కావ్యవిశ్లేషణల్ని వివరిస్తూ, కాలస్వభావాన్ని అనుసరించి వెలువడిన ప్రకియా స్వభావాల్ని, వికాసాన్ని వివరించడానికి ప్రయత్నించిన గ్రంథంగా, 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' ఒక విశిష్ట స్థానాన్ని సాధించుకొంది.

## 5.16. సమగ్రఆంధ్రసాహిత్యవైశిష్ట్యం :

'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' లో చేసిన వివిధ ప్రతిపాదనల్ని, తరువాత చరిత్రకారులూ, పరిశోధకులు, విమర్శకులూ స్వీకరించడమే, ఆరుద్ర పరిశోధకుడుగా, సాహిత్య చరిత్ర కారుడుగా, విమర్శకుడుగా విజయవంతమైన కృషిని కొనసాగించారని తెలియజేస్తుంది.

తక్కువ కాలంలోనే సాధ్యమైనంత 'సమగ్రంగా' సాహిత్యాన్ని, సామాన్యులకు సహితం అందించాలనే తపనతో పదమూడు సంపుటాల్లో తెలుగు సాహిత్యాన్ని అందించటం గొప్పపనే! కొన్నినెలల్లోనే నెలనెలా ఓ సంపుటిగా అందించినా, ఆ సమాచారాన్ని సేకరించి, చారిత్రక్రమంలో సమన్వయించి, సరళమైన శైలిలో అందించడం వెనుక, కొన్ని సంవత్సరాల పరిశోధన దాగి ఉంటుంది.

కేవలం కవిత్వం మాత్రమే సాహిత్య చరిత్రకు ఆధారంగా రచనకొనసాగించకుండా, సాహిత్యంలో గల వివిధ ప్రకియ ల్ని సమగ్ర ఆంధ్ర సాహిత్యంలో వివరించడం ఒక విశిష్టత.

'సాహిత్య చరిత్ర' విమర్శకులకు విలువలను ప్రసాదించేదిగా, రచయితలకు నవ్యతను వెలిగించి రవ్వలు కురిపించేదిగా ఉండాలి. ఈ రెండూ సాధిస్తే సాహిత్యచరిత్ర సృజనాత్మక శక్తి గల ప్రక్రియగా

పరిణతి చెందుతుంది[109]. సాహిత్య చరిత్రలో విమర్శకులకు విలువల్ని ప్రసాదిస్తూ, రచయితలకు నవ్యతను అందించే సృజనాత్మ ప్రకియా విశిష్టితను సాధించింది. భవిష్యత్తులో సాహిత్య చరిత్ర, వికాస చరిత్రలు రాసేవారికి ఎన్నో ఆకరాలను అందించే రాచమార్గాన్ని వేయడం సమగ్ర ఆంధ్ర సాహిత్యంలో కన్పించే మరో విశిష్టత.

సాంఘిక, రాజకీయ, సాహిత్యరచనల్లో, కవుల్ని, కావ్యాల్ని విలువకడుతూ, ఒక అవగాహన కల్పించి, సమన్వయ దృక్పథాన్ని ప్రదర్శించింది.

'సాహిత్య చరిత్ర' అంటేనే సామాన్య పాఠకులు చాలా దూరంలో ఉండవలసిన పనిలేదనీ, అందరికీ అర్థమయ్యేటట్లు, సాధ్యమైనంత ఆసక్తిగా, సులభగ్రాహ్యంగా రచన కొనసాగించవచ్చని నిరూపించిన రచన 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం'.

సాహిత్య చరిత్రలో చదివే వారి అభిరుచుల్ని బట్టి ఏ అంశం కావాలో దాన్నే చదువుకొనే అవకాశాన్ని కలిగించిన రచనగా కూడా రూపొందింది. మంచి పద్యాలు కావాలనుకొన్నవారికి మంచి పద్యాలు ఉటంకించారు. కవిస్థలకాల నిర్ణయాలే ప్రధానంగా చూడాలనుకొంటే, అవీ ఉన్నాయి. కర్తృత్వ వివాదాన్ని పరిశీలించాలంటే, కర్తృత్వ చర్చలున్నాయి. వివిధ సాహిత్య చరిత్రకారులు ఒక అంశంపై చెప్పిన అభిప్రాయాలేమిటని పరిశీలించాలంటే, అని ఒకేచోట పేర్కొన్నారు. కేవలం కావ్యంలో కథను మాత్రమే తెలుసుకోవాలనుకొనే వారికి కథాసార సంగ్రహం ఉంది. కవితా శిల్పవైవిధ్యాన్ని, ఛందస్సుని పరిశీలించాలనుకొనే వారికి అవీ ఉన్నాయి. తెలుగు సాహిత్యంలో వివిధ ప్రకియల సమాచారం ఒకేచోట సంక్షిప్తంగా, సమగ్రంగా కావాలను కొనే వారికీ వీలు కల్పిస్తుంది. పాలకుల-కవుల పరస్పర సహకారం ఎలా ఉండేదో తెలుసుకోవాలనే వారికీ, వివిధ రాజుల కాలంలో రచనలు వెలువడిన తీరుతెన్నుల్ని, సామాజిక పరిస్థితుల్నీ గమనించగలిగే రచనా విధానమూ ఈ రచనలో ఉంది.

కవి, కావ్య చారిత్రక నేపథ్యాల్ని కావాలనుకొంటే వారికీ అవీ లభిస్తాయి. రాజులు అంకితం పుచ్చుకోవడమే కాకుండా, కొందరు స్వయంగా రచనలు చేసినవారున్నారు. వారిని స్పష్టంగా గుర్తించగలిగారు.

కొంతమంది కవుల సంబంధబాంధవ్యాల్ని కూడా చర్చించారు. శ్రీనాథుడు - పోతన బావాబావమరుదులు కాదనేదీ, శ్రీనాథుడు-దుగ్గనల మధ్య సంబంధాలు వంటి బాంధవ్యాన్ని తెలుసుకోవడానికి చక్కని అవకాశం ఉంది.

ఒక కావ్య వస్తువు, మరొక కావ్య వస్తువులో పరిణమించిన విధానం కూడా చర్చించడం వల్ల, కవి దృక్పథ పరిణామాన్ని అర్థంచేసుకోవచ్చు. తెనాలిరామలింగ (రామకృష్ణ) కవి, పింగళి సూరనల కావ్యాల్ని ఈ పద్ధతిలో పరిశీలించారు.

వచనం, ద్విపద, పద్యం, నాటకం - వంటి ప్రక్రియల్లో ఒకే వస్తువుగల రచనలు తులనాత్మక స్పర్శతో పరిశీలించడం కూడా ఒక సాహిత్య చరిత్ర రచనలో విశిష్టమైన పద్ధతిగానే సాహిత్య చరిత్రకారులు భావిస్తున్నారు.

## 5.17 సాహిత్య చరిత్రకారుడు–పరిశోధకుడుగా ఆరుద్ర :

సమగ్ర ఆంధ్ర సాహిత్యంలో చేసిన వివిధ ప్రతిపాదనల్ని, తరువాత చరిత్రకారులూ, పరిశోధకులు, విమర్శకులూ స్వీకరించడమే, ఆరుద్ర పరిశోధకుడుగా, సాహిత్య చరిత్రకారుడుగా, విమర్శకుడుగా విజయవంతమైన కృషిని కొనసాగించారని తెలియజేస్తుంది. వెల్చేరు నారాయణరావు 'తెలుగు కవితా విప్లవాల స్వరూపం'లో రాజులు, కవుల్ని పోషించిన దృక్పథాన్ని వివరించడంలో సమగ్ర ఆంధ్ర సాహిత్య ప్రభావం కన్పిస్తుంది. బి.ఏ.స్పెషల్ తెలుగు విద్యార్థులకు పాఠ్యాంశంగా కలిదిండి వేంకటరామరాజు సంపాదకత్వంలో వెలువడిన "తెలుగు సాహిత్య చరిత్ర" లో ఆరుద్ర ప్రతిపాదనలు, సిద్ధాంతాల్ని స్వీకరించారు. జి.నాగయ్య రచించిన "తెలుగు సాహిత్య సమీక్ష" రెండు సంపుటాల్లోనూ; జి.వి.సుబ్రహ్మణ్యం 'సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు' లోనూ; ఎన్.గోపి 'ప్రజాకవి వేమన' లోనూ, తెలుగు అకాడమీ, బి.విజయభారతి పరిష్కర్తృత్వ సారథ్యంలో వెలువడిన "తెలుగు సాహిత్యకోశము"లోనూ, బి.ఎస్.ఎల్.హనుమంతరావు 'ఆంధ్రుల చరిత్ర' లోనూ, ఇంకా, 'సాహిత్య చరిత్ర', 'ఆంధ్రుల చరిత్ర'ల గురించి ఆరుద్ర తర్వాత రచించిన వారంతా ఇంచుమించు ప్రామాణిక గ్రంథంగానే సమగ్ర ఆంధ్రసాహిత్యాన్ని స్వీకరించారు. పూర్వపక్షం చేయడానికైనా, సమర్థించడానికైనా సమగ్ర ఆంధ్ర సాహిత్యాన్ని గ్రహించడమే సాహిత్య చరిత్రకారుడుగా, పరిశోధకుడుగా ఆరుద్ర కృషి స్పష్టమవుతున్నా, ఆరుద్ర రచించిన మరికొన్ని గ్రంథాలు, వ్యాసాలవల్ల కూడా "పరిశోధకుడుగా ఆరుద్ర" ను తరువాత అధ్యాయాల్లో పరిశీలించే అవకాశం ఇంకా కన్పిస్తుంది.

# సూచికలు (References)


1. ఆరుద్ర, సమగ్ర ఆంధ్ర సాహిత్యం, తొలి ముద్రణ, మొదటి సంపుటి (చాళుక్యయుగం), సికింద్రాబాదు: యం.శేషాచలం అండ్ కంపెనీ, ఏప్రియల్, 1965. పు iii &11

2. ప్రకాశకులు-ఆరుద్ర-సమగ్ర ఆంధ్ర సాహిత్యం, తొలిముద్రణ, పంద్రెండవ సంపుటి (కడపటి రాజుల యుగం), సికింద్రారాబాదు: యం. శేషాచలం అండ్ కంపెనీ, ఫిబ్రవరి, 1968. పు.iv

3. అనుబంధం - II: సమగ్ర ఆంధ్ర సాహిత్య ముఖచిత్రాలు-పీఠికలు

4. అదే.

5. అదే.

6. ఎస్.వి.రామారావు. తెలుగులో సాహిత్య విమర్శ - అవతరణ వికాసములు, పు.287

7. అదే. పు.288

8. గిడుగు సీతాపతి పీఠిక - ఆరుద్ర సమగ్ర ఆంధ్ర సాహిత్యం, అయిదవ సంపుటి.చూడుః అనుబంధం -II

9. నిడదవోలు వెంకటరావు (సమీక్ష) భారతి ఫిబ్రవరి, 1966.పు.48-59.

10. ముదిగొండ వీరేశలింగము (లేఖ) భారతి ఫిబ్రవరి,సెప్టెంబర్,1966,పు.74-75

11. నిడదవోలు వెంకటరావు (సమీక్ష) భారతి ఫిబ్రవరి, 1966,పు.50

12. ఆదే పు.51

13. కప్పగంతులలక్ష్మన శాస్త్రి, స.ఆం.సా.పదకొండవ సంపుటికి రాసిన పీఠిక. చూడు అనుబంధం-II

14. దివాకర్ల వేంకటావధాని. స.ఆం.పా. ఏడవ సంపుటికి రాసిన పీఠిక చూడు: అనుబంధం -II

15. కొర్లపాటి శ్రీరామమూర్తి,తెలుగు సాహిత్య చరిత్ర ((ప్ర.భా).పు.2-3.

16. జి.నాగయ్య,తెలుగు సాహిత్య సమీక్ష (మొ.సం.) మొదటి ముద్రణ, 1983, రెండవ కూర్పు, 1990, నవ్య పరిశోధక ప్రచురణలు, తిరుపతి,పు.3.

17. అదే.పు.4.

18. అదే. పు.4.

19. సమగ్ర ఆంధ్ర సాహిత్యం (తొలిముద్రణ) ముఖచిత్రం,చూడుః అనుబంధం -II.

20. జి.వి.సుబ్రహ్మణ్యం, సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు; పు.228

21. కొర్లపాటి శ్రీరామమూర్తి, తెలుగు సాహిత్య చరిత్ర (ప్ర.భా), పు.14-15.

22. అదే.పు.14.

23. అదే.పు.14.

24. అదే.పు.15.

25. అదే.పు.16.

26. అదే.పు.16.

27. వైద్యుల కృష్ణారావు, వాడవల్లి, చక్రపాణిరావు, తెలుగు సాహిత్య చరిత్ర, (సం.) కదిలింది వెంకట రామరాజు, తెలుగు అకాడమి: హైదరాబాదు.1986.

28. కె.బాలగోపాల్ (అను), ప్రాచీన భారతదేశచరిత్ర,(మూ) డి.డి.కోశాంబి, హైదరాబాద్, బుక్ ట్రస్టు,హైదరాబాద్,1986,పు.1

29. అదే.పు.5.

30. జె.సి.అగర్వాల్, టీచింగ్ ఆఫ్ హిస్టరీ, వికాస్ పబ్లిషింగ్ హౌస్, ప్రైవేట్ లిమిటెడ్, న్యూఢిల్లీ, 1986,పు.1-2

a). History is the record of what one age finds worthy of note in another - Burckardt.

b). History is a continuous process of interaction between the historian and his facts, an ananding dialogue between the present and the past - Carr.E.H.

c). History of all witherto existing societies is a history of class struggle -Hegel.

d). History is the story of Man's struggle through the ages against nature and the clements (against wild beasts and the jungle and some of his own kind who have tried to keep him down and to exploit him for their own benefit - Nehru.

31. కె.కె.రంగనాథాచార్యులు, తెలుగు సాహిత్యం మరో చూపు, పు.(XI)

32. అదే.పు.22.

33. కొర్లపాటి శ్రీరామమూర్తి, తెలుగు సాహిత్య చరిత్ర, (ప్ర.భా).పు.14.

34. వైద్యులకృష్ణారావు, వాడవల్లి చక్రపాణిరావు, తెలుగు సాహిత్య చరిత్ర,పు.5.

35. జి.నాగయ్య, తెలుగు సాహిత్య సమీక్ష (మొ.సం) పు.9.

36. పూర్వోక్తం. పు.5

37. జి.నాగయ్య, తెలుగ సాహిత్య సమీక్ష (మొ.సం) పు.9

38. అదే.పు.10.

39. అదే.పు.16 &18

40. ఆరుద్ర, సమగ్ర ఆంధ్ర సాహిత్యం (పు.ము) తొమ్మిదవ సంపుటి (కుంఫిణీ యుగం-I, పు.123-124 మధ్యపుటలు.పుటసంఖ్యలు లేవు.

41. ఆరుద్ర, సమగ్ర ఆంధ్ర సాహిత్యం (పు.ము/నాలుగు, ఏడవ సంపుటులు,పు.2, 178. (గజపతులనాటి ఆంధ్ర దేశం, నాయకరాజుల నాటి దక్షిణ దేశం పటాలు)

42. నేలటూరి వెంకటరమణయ్య, 'పీఠిక' స.ఆం.సా. (తొలిముద్రణ) తొమ్మిదవ సంపుటి. చూడు. అనుబంధం-II.

43. ఆరుద్ర సమగ్ర ఆంధ్ర సాహిత్యం పు.ము. ఏడవ సంపుటి, (రాయకరాజుల యుగం, పు.79 పాదసూచిక 13.

44. శనగల నరసింహస్వామి, (లేఖ) *తెలుగు కాలనిర్ణయము* భారతి మాస పత్రిక.1964.పు.88.

45. దివాకర్ల వేంకటావధాని, 'పీఠిక' - ఆరుద్ర స.ఆం.సా.,తొ.ము పు.IX-XII, చూడు : అనుబంధం-II

46. త్రిపురనేని మధుసూదనరావు, సాహిత్యంలో వస్తు శిల్పాలు. పర్‌స్పెక్టివ్ ప్రచురణ, హైదరాబాద్.పు.83.

47. కొర్లపాటి శ్రీరామమూర్తి, తెలుగు సాహిత్య చరిత్ర (ప్ర.భా) పు.17.

48. దివాకర్ల వేంకటావధాని, ఆంధ్ర వాఙ్మయ చరిత్రము. (ప్ర.ము) 1958,పద్నాల్గవముద్రణ.1994.పు.5.

49. పింగళి లక్ష్మీకాంతం. ఆంధ్ర సాహిత్య చరిత్ర,పు.3-9.

50. సి.నారాయణరెడ్డి, అధునికాంధ్ర కవిత్వము-సంప్రదాయములు: ప్రయోగములు,1967.పు.188.

51. జి.వి.సుబ్రహ్మణ్యం, సాహిత్యచరిత్రలో చర్చనీయాంశాలు, పు.200.

52. జి.నాగయ్య, తెలుగు సాహిత్య సమీక్ష (మొ.సం.), పు.20

53. ఎస్వి.సూ ర్యకుమారి, తెలుగులో సాహిత్య చరిత్రలు. (ఎం.ఫిల్.అముద్రిత పరిశోధన వ్యాసం), పర్యవేక్షణ. జి.వి.సుబ్రహ్మణ్యం, హైదరాబాదు విశ్వవిద్యాలయం,1989.పు.61.

54. అదే.పు.62.

55. త్రిపురనేని మధుసూదనరావు. సాహిత్యంలో వస్తుశిల్పాలు. పు.81.

56. అక్కిరాజురమాపతిరావు. వీరేశలింగం పంతులు రచనలు సమగ్ర పరిశీలన.పు.242-254.

57. ఎస్వి.సూర్యకుమారి -పు.78.

58. కల్లూరి వేంకటనారాయణరావు. ఆంధ్ర వాఙ్మయ చరిత్ర సంగ్రహము.

59. పూర్వోక్తం, పు.82.

60. అదే.82.

61. ఎస్వి.సూర్యకుమారి పు.76.

62. కాశీనాథుని నాగేశ్వరరావు. ఆంధ్ర వాఙ్మయ సూచిక, ప్ర.ము, 1929.పు.ము.1994. ప్రాచీ పబ్లికేషన్స్ హైదరాబాద్. పు.11.

63. ఎస్వి.రామారావు.తెలుగులో సాహిత్య విమర్శ అవతరణ వికాసములు. పు.286.

64. ఖండవల్లి లక్ష్మీరంజనం. ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము, వేంకటరమణ పబ్లికేషన్స్ 4వ.ముద్రణ, హైదరాబాద్,పు.198-210.

65. ఎస్వి.సూర్యకుమారి, పు.67.

66. అదే.పు.70.

67. అదే.పు.71.

68. అదే.పు.71.

69. అదే.పు.87.

70. దివాకర్ల వేంకటావధాని. ఆంధ్ర వాఙ్మయ చరిత్రము. విషయసూచిక

71. పూర్వోక్తం.పు.88-92.

72. జి.నాగయ్య.తెలుగు సాహిత్య సమీక్ష (మొ.సం), 32.

73. ఎస్వి.సూర్యకుమారి, పు.95.

74. జి.ఎన్.రెడ్డి 'పీఠిక' 'అభినందన' జి.నాగయ్య, తెలుగు సాహిత్య సమీక్ష (మొ.సం) పు.V

75. వైద్యుల కృష్ణారావు, వాడవల్లి చక్రపాణి రావు. తెలుగు సాహిత్య చరిత్ర.పు.8.

76. ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి, ఆరుయుగాల ఆంధ్ర కవిత, ఆంధ్రసారస్వత పరిషత్తు, హైదరాబాద్,1986, విషయ సూచిక.

77. ఆరుద్ర, సమగ్ర ఆంధ్ర సాహిత్యం (పునర్ముద్రణ) 'మునవిమాటలు' పదమూడవ సంపుటి.పు.VI (చూడు: అనుబంధం- II)

78. చూడు:అనుబంధం- II సమగ్ర ఆంధ్ర సాహిత్యం తొలిముద్రణ పీఠికలు.

79. నేలటూరి వెంకట రమణయ్య 'పీఠిక' - ఆరుద్ర, స.ఆం.సాం. (తొమ్మిదవ సంపుటి) తొ.ము.XI

80. విశ్వనాథ సత్యనారాయణ 'పీఠిక' - ఆరుద్ర. స.ఆం.సా. (రెం.సం) తొ.ము, చూడు. అనుబంధం-II

81. స.ఆం.సా. II 'పీఠిక' చూడు.అనుబంధం-II

82. అనుబంధం-II స.ఆం.సా.5వ సంపుటి 'పీఠిక'

83. అనుబంధం-II స.ఆం.సా.6వ సంపుటి 'పీఠిక'

84. అనుబంధం-II స.ఆం.సా.9వ సంపుటి 'పీఠిక'

85. అనుబంధం-II స.ఆం.సా. పదకొండవ సంపుటి 'పీఠిక'

86. సురవరం ప్రతాపరెడ్డి, ఆంధ్రుల సాంఘిక చరిత్ర.పు.

87. నిడదవోలు వెంకటరావు, భారతి (మా.ప) ఫిబ్రవరి 1966.

88. సురవరం ప్రతాపరెడ్డి, ఆంధ్రుల సాంఘిక చరిత్ర.పు.1.

89. తెలకపల్లి రవి. 'మహాకవిపై మళ్లీ మళ్లీ దాడులు-సత్యం-సంయమనం ఎక్కడ? (వ్యా) ప్రజాశక్తి (ది.ప).(సం.) వి.శ్రీనివాసరావు 4-7-2003,ప్రజాశక్తి సాహితీ సంస్థ: హైదరాబాదు: పు.6.

90. వెల్చేరు నారాయణరావు, తెలుగులో కవితా విప్లవాల స్వరూపం.పు.64.

91. రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ 'పీఠిక' స.ఆం.సా. (తొ.ము.) ఎనిమిదవ సంపుటి చూడు. అనుబంధం -II

92. గ్రంథనామం ఆరుద్ర పేర్కొనలేదు.

93. వేటూరి ప్రభాకర శాస్త్రి, భారతి (మా.ప) జూన్ 1928.

94. భద్రిరాజు కృష్ణమూర్తి (సం). తెలుగు విశ్వవిద్యాలయం.-1995. హైదరాబాదు: పు.51,25.

95. అదే.పు.467

96. జి.నాగయ్య,తెలుగు సాహిత్య సమీక్ష,తెలుగు సాహిత్య చరిత్ర, (సం) కదిలిండి వేంకటరామరాజా.

97. కలిదిండి వేంకట రామరాజు, (సం) తెలుగు సాహిత్య చరిత్ర.పు.208.

98. అదే.పు.198.

99 బి.విజయభారతి,(పరిష్కర్త)-తెలుగు సాహిత్య కోశము, తెలుగు అకాడమి. పు.690-691

100. మల్లాది సూర్యనారాయణ శాస్త్రి, సంస్కృత వాఙ్మయ చరిత్ర, (ద్వి.సం.) ఆంధ్ర సాహిత్య పరిషత్తు హైదరాబాదు: తృ.ము. 1982.పు.413.

101. ఎస్.వి. సూర్యకుమారి. పు.34.

102. అదే.పు.110.

103. అదే.పు.113.

104. అదే.పు.116.

105. అదే.పు.121.

106. అదే.పు.147.

107. అదే.పు.167.

108. అదే.పు.171.

109. జి.వి.సుబ్రహ్మణ్యం.సాహిత్య చరిత్రలో చర్చనీయాంశాలు. పు.11.

# జానపద విజ్ఞానపరిశోధన

**6.0.** '**సమగ్ర ఆంధ్ర సాహిత్యం**' రచనల ద్వారా తెలుగు సాహిత్య పరిశోధకుడుగా చిరస్థాయిగా నిలిచిపోయిన *ఆరుద్ర* జానపద విజ్ఞానానికి సంబంధించిన రచనల్లో కూడా కృషిచేశారు. వీరు రాసిన *ప్రజాకళలూ ప్రగతివాదులూ; రాముడికి సీత ఏమవుతుంది?* అనే గ్రంథాల్లోనూ, మరికొన్ని వ్యాసాల్లోనూ జానపద సాహిత్యం, జానపద విజ్ఞాన విషయాలకు సంబంధించిన కొన్ని పరిశీలనలు కనిపిస్తున్నాయి. జానపద గేయాలు, సామెతలు, పొడుపు కథలు వంటి వాటి గురించీ, కళాకారుల వేషధారణ, కళారూపాల గురించీ కూడా కొన్ని విషయాల్ని చర్చించారు. ఆరుద్ర చెప్పిన ఈ అంశాలు జానపద సాహిత్యానికీ, జానపద విజ్ఞానానికీ చెందుతాయి. ఒకే వ్యాసంలో కూడా జానపద సాహిత్య విషయాలు చెప్పినా, మొత్తంమీద జానపద విజ్ఞానానికి సంబంధించినవిగా కొన్ని, మరికొన్ని కేవలం జానపద సాహిత్యానికే చెందినవీ కన్పిస్తున్నందు వల్ల '*జానపద సాహిత్యం*' '*జానపద విజ్ఞానం*' అంటే ఏమిటో, పరిశోధకులు ఏమని నిర్వచించి, లక్షణాలు చెప్పారో సంక్షిప్తంగా నైనా తెలుసుకొని, ఆరుద్ర రాసిన వ్యాసాలు ఏవిభాగానికి చెందుతాయో గమనించవచ్చు.

## 6.1. జానపదులు–జానపదసాహిత్యం :

జానపద సాహిత్యంలో పామరుల, పాండిత్య ప్రకర్ష లేని వారిని జానపదులని బిరుదురాజు రామరాజు[1]; గ్రామీణులనే అర్థంలో కాకుండా సమాన సంప్రదాయాలు కలిగిన ఆటవికులైనా, గిరిజనులైనా, గ్రామీణులైనా, జానపదులని, వారిదొక తత్వంగా ఆర్.వి.యస్. సుందరం[2]; ప్రత్యేకమైన సంప్రదాయాలు, నమ్మకాలు, ఆచారాలు, అలవాట్లు, కట్టుబాట్లు, అభిరుచులు, సాహిత్యం, కళలు ఉన్న మానవ సమూహాన్ని జానపదులని ఎం.కె.దేవకి[3] అన్నారు. కేవలం పల్లెల్లో నివశించే వారు ఆదరించేదే జానపద సాహిత్యం కానవసరం లేదనీ, అటువంటి సాహిత్యాన్ని ఆదరించే వాళ్ళు పట్టణాల్లో ఉన్నా అది జానపద సంస్కృతినీ, జీవనాన్ని ప్రతిబింబించినట్లయితే ఆ సాహిత్యం జానపద సాహిత్యం అవుతుందనీ, దాన్ని సృష్టించేవాళ్ళు జానపదులవుతారనీ ఎస్. శరత్ జ్యోత్స్నరాణి నిర్వచించారు[4]. నాయని కృష్ణకుమారి, జి.ఎస్. మోహన్ వంటి వారుకూడా ఇంచుమించు ఇవే అభిప్రాయాల్ని వెలిబుచ్చారు. తాము నివశించే పరిసరాలతో మమేకమై, తరతరాలనుండీ సంక్రమిస్తు న్న ఆచారాలు, నమ్మకాలను ఎక్కడికి వెళ్ళినా విడిచి పెట్టకుండా, వేష, భాష, సంస్కృతులలో ఒక ప్రత్యేక మనస్తత్వాన్ని కలిగి ప్రకృతిని ఆరాధిస్తూ, అభివృద్ధి చెందుతున్న నాగరికతతో పోల్చినప్పుడు వెనుకబాటు తనం కన్పించే ప్రజలను "*జానపదులు*" అని నిర్వచించవచ్చు[5] అనే ఎస్. శరత్ జ్యోత్స్నరాణి పరిశీలన ఆధునిక సమాజంలో మానవుని అస్తిత్వంలో జానపద లక్షణాల్ని కూడా వివరించ గలుగుతుందని భావించవచ్చు.

## 6.1.1. జానపద విజ్ఞానం (Folk lore):

జానపదులకు సంబంధించిన విజ్ఞానమంతా జానపద విజ్ఞానం అవుతుందనీ, దీనిలో జానపద కథా, జానపద కథా వాఙ్మయం, మూఢ విశ్వాసాలు, ఆచార వ్యవహారాలు, మంత్ర తంత్రాలు, శాస్త్ర విజ్ఞానం - అంటే భౌతిక పార మార్థిక విషయాలపై ఆధార పడిన జనవాసుల పరిజ్ఞానం, వారి భావాలు, పొడుపు కథలు, సామెతలు, వినోదాలు, వేడుకలు, ఆటలు వంటివన్నీ చేరతాయని బిరుదురాజు రామరాజు చెప్పారు. జానపద సాహిత్యంలో యక్ష గానాలు, దాసరి భాగవతులు, హరికథలు, బయలాటలు, చిందు భాగవతాలు వంటివి చేరతాయనీ, 'జానపద విజ్ఞానం'లో 'జానపద వాఙ్మయం' ఒక భాగం మాత్రమే ననీ రామరాజు వివరించారు[6]. ఆర్వీయస్ సుందరం 'జానపద విజ్ఞానం' 'సంస్కృతి'లో ఒక భాగం, 'సంస్కృతి'ని 'నాగరికత'కు పర్యాయపదంగా కొందరు వాడతారు కానీ, అది సరికాదు. ఆది మానవుని కాలం నుంచి నేటి నాగరిక మానవుని వరకూ ఆయా కాలాల్లో మనిషి తన అభ్యున్నతి కోసం చేసిన కృషి "*సంస్కృతి*". అంటే మానవకృతి సంస్కృతి అన్నమాట. ఈ సంస్కృతిలో జానపదుల జీవనానికి సంబంధించిన గేయాలు, కథలు,సామెతలు, భాష, నమ్మకాలు, దుస్తులు, ఆటలు, వంట, వైద్యం, కళలు,మొదలైనవన్నీ జానపద విజ్ఞానం లో భాగాలే అని అన్నారు[7]. జానపద విజ్ఞానం గురించే వీరు మరింతగా వివరిస్తూ బ్రూన్ వాండ్ ఇచ్చిన నిర్వచనాన్ని ఉటంకించారు[8].

"Those meterials in culture that circulate traditionally among members of any group in different versions, whether in oral form or by means of customs any example."

ఇంత వరకూ పరిశీలించిన పరిశోధకుల నిర్వచనాలు, వివరణలను బట్టి జానపద సాహిత్యం అనేది జానపద విజ్ఞానం లో ఒక భాగం అవుతుందని తెలుస్తుంది. దీనితో పాటు ఒక సంస్కృతికి చెందిన అనేక విషయాలు జానపద సాహిత్యం వల్ల, విజ్ఞానం ద్వారా బహిర్గతమవుతుంటాయని, అవి మౌఖికంగా గాని, సంప్రదాయ పద్ధతులద్వారా గాని ఒకతరం నుండి మరొక తరానికి పరంపరా గతంగా పరిణమిస్తుంటాయనీ, ఈ పరిణామంలో కొన్ని మార్పులు, చేర్పులు చెందే అవకాశం ఉందని స్పష్టమవుతుంది.

## 6.2. జానపద విజ్ఞానం – ఆరుద్ర అవగాహన:

"*జానపదులు ఉమ్మడిగా తమ బ్రతుకు తెరువు కోసం అనుభవం వల్ల నేర్చుకున్న విషయాలే జానపద విజ్ఞానం. ఇది నిజానికి ఏకాండీ గానే వుంటుంది. దీనిని శాఖలుగా విభజించుకోవడంమన అవగాహనకోసమే*" అన్నారు ఆరుద్ర (ప్ర.ప్ర పు:25) అంతటితో ముగించకుండా హమానాయక్ చేసిన వర్గీకరణను, ఆర్వీయస్.సుందరం చేసిన అనువాదాభాగాన్ని ఉటంకించారు. "జానపద విజ్ఞానం సామాన్యంగా నాలుగు విధాలుగా ఉంటుంది. సాహిత్య సంబంధమైనది, భాషాసంబంధమైనది, వైజ్ఞానికం, క్రియాత్మకం, పురాణం, జానపదకథ, గేయం మొదటి జట్టును చేరతాయి. మాట, సన్న,పొడుపు కథ, సామెత రెండవ జట్టుకి చేరతాయి. మందు, చికిత్స, ఇంద్ర జాలం, భవిష్యం, వివిధ నమ్మకాలు, వైజ్ఞానికాలు, చివరిదానిలో నృత్యం, సంగీతం, ఆట, వినోదం,

నాటకం,దుస్తులు, వంట కళలు మొదలైనవి చేరతాయి". అనేది నిర్వచనం (ప్ర.ప్ర......పు.2). దీన్ని పేర్కొన్న తర్వాత ఎక్కడా మరోనిర్వచనం చేయడానికి ఆరుద్ర ప్రయత్నించిన దాఖలాలు లేవు. కనుక, వీరు దీన్నే ఆధారం చేసుకొని తన జానపద విజ్ఞాన వ్యాసాలు రచించారని భావించవచ్చు. ఆరుద్ర రచనలపై పరిశోదన చేసిన ఎల్. సంగయ్య ఆరుద్ర వ్యాసాల్ని విభజిస్తూ కేవలం రెండు వ్యాసాల్ని మాత్రమే *జానపద సాహిత్యం* విభాగంలో పేర్కొన్నారు'. వీటిని కూడా పరిశీలించి నప్పుడు జానపద సాహిత్య విషయాలే అయినప్పటికీ, అవికూడా జానపద విజ్ఞాన విభాగంలో ఒక భాగంగానే గుర్తించవలసి ఉంటుంది. కనుక, ఇవికూడా ఈ పరిశోధనలో భాగమవుతుంది.

## 6.2.1. జానపదవిజ్ఞాన పరిశోధన – ఆరుద్ర రచనలు:

ఆరుద్ర రాసిన వ్యాసాల్ని '*జానపద విజ్ఞానం*' '*జానపద సాహిత్యం*' అనే రెండు విభాగాలుచేసి పరిశీలించే అవకాశం ఉంది. '*ప్రజాకళలూ–ప్రగతివాదులూ*' గ్రంథంలో జానపద విజ్ఞానానికి సంబంధించిన వ్యాసాలు, '*రాముడికి సీత ఏమవుతుంది?*' గ్రంథంలో జానపద సాహిత్య పరిశోధన వ్యాసాలు కన్పిస్తున్నాయి.

జానపద విజ్ఞానానికి సంబంధించిన వ్యాసాల్లో ప్రాచ్య, పాశ్చాత్య పరిశోధకుల విషయాలను పేర్కొని, వాటికి ఆరుద్ర, సమన్వయాత్మక పరిశోధనలు చేయడం కన్పిస్తుంది. పత్రికలకు రాసిన వ్యాసాలు కావడం వల్లనో, విషయవివరణనే ప్రధానంగా భావించడం వల్లనో, తాను గ్రహించిన గ్రంథాల విషయవివరణలనూ, రచయితలనూ నిర్దిష్టంగా పేర్కొనక పోవడం వల్ల, ఆ విషయాలు ఆరుద్ర మొట్టమొదట చెప్పారనుకొనే అవకాశం లేకపోలేదు. కానీ, ఆరుద్ర పేర్కొన్న కళారూపాలు గురించి ప్రాచ్య, ప్రాశ్చాత్య పరిశోధకులు వాటిని ముందే వెలువరించారు. ఈ విషయాలను జానపద సాహిత్యంలో ఎంతో విశిష్ట కృషి చేసిన పరిశోధకులు వివరించడం కూడా గమనించ వచ్చు. బి.రామరాజు, మిక్కిలినేని, జయధీర్ తిరుమలరావు, ఆర్వీయస్.సుందరం, జి.నాగయ్య, జి. ఎస్.మోహన్, కసిరెడ్డి వెంకటరెడ్డి వంటి వారు వీరిలో ప్రముఖులు. వీరి అభిప్రాయాల్ని కూడా పరిశీలించడం వల్ల ఆరుద్ర పరిశీలించిన 'కళరూపాల' గురించి మరింతగా అవగతమయ్యే అవకాశం కలుగుతుంది. ఈ అభిప్రాయాలను ఆరుద్ర చెప్పిన అంశాలతో సమన్వయం చేస్తూ వివరించడం వల్ల జానపద కళల స్థితిగతులు, వాటి తత్వం వెల్లడవుతూనే ఆరుద్ర చేసిన కృషిని గుర్తించడానికి వీలవుతుంది. 'ప్రజాకళలూ– ప్రగతి వాదులూ' అనే గ్రంథంలో ఆరుద్ర, కళారూపాల గురించి చక్కని ప్రతిపాదన, సిద్ధాంతీకరణ చేశారు.

### 6.2.1.1. ఆదిమసమాజం – కళావిర్భావం:

శ్రమలోనించి, శ్రమకోసం కళలు పుట్టాయనీ, ఆదిమవర్గరహిత సమాజాలలో కళలన్నీ కూటి పెంపుదలకోసం తోడ్పడే ప్రయోజన కరమైన విద్యలేనని ఆరుద్ర అన్నారు (ప్ర.ప్ర.పు.5). ఆదిమ సమాజంలో జీవనానికి అవసరమైన భాష, భావవ్యక్తీకరణ, వినోదం వంటి వేటినైనా ఏదోక రూపంలో వ్యక్తం చేయవలసిందే. ఒకరి ఉద్దేశాలను ఇంకొకరు సైగలతో చెప్పుకుంటూ వేటాడేదశలో కలిసి కట్టుగా కూతలు పెట్టినా, కుప్పిగంతులు వేసినా, కూని రాగాలు తీసినా, కూటపు చిందులు తొక్కినా,

గుహగోడలపై కొంకి బొమ్మలు గీసినా, ఏమానవ వ్యాపారమైనా కూటి కోసమే జరిగేవి. ఆదిమసమాజంలో మానవులందరూ కలిసి ఉన్నట్టే కళలన్నీ కూడా కలిసి ఉమ్మడిగా ఉండేవనీ ఊహిస్తారు. (ప్ర.పు.పు.5) మాటలు నేర్చుకున్న మానవులు పాటలు పాడారనీ, మాటలు, పాటలూ శ్రమలోంచి పుట్టాయనీ, పనిచేసేటప్పుడు శరీర కదలికలకు అనుగుణంగానే లయ,తాళం నిర్ణయమై అవే కళలయ్యాయని చెప్తారు.

ఇంచుమించు ఇదే అభిప్రాయాన్ని ప్రజాకళారూపాల పుట్టుకను వివరించిన పరిశోధకులూ వెల్లడించారు సామాజిక ఒడంబడిక సిద్ధాంతాలు వివిధ దృక్కోణాల్లో వివరించినా *ఆదిమసమాజం* గురించే రూసో, లాక్, హాబ్స్ వంటి తత్త్వవేత్తలు కూడా చెప్పడం, ఈ సత్యాన్ని మరింతగా ధృవీకరిస్తుంది. ఆరుద్ర ఊహించిన *కళావిర్భావం* భరతుని నాట్యశాస్త్రంలో గల కొన్ని *అభినయ పద్ధతులతో* నిరూపించటం ఈ సందర్భంగా గమనించ వలసి ఉంది. కేవలం శ్రమ చేసేటప్పుడు (శ్రమించేటప్పుడు) పాటల వల్ల మాత్రమే కాకుండా ఆదిమ మానవులు వేటకెళ్ళేటప్పుడు పక్షుల, జంతువుల నడక, కూతలు, అరుపులు వంటి వాటిని అనుసరించి,వాటిని అభ్యసించటం ద్వారా కళలు ఎలాపరిణితి చెందాయో




చిత్రం-1 జానపదకళా రూపాల ప్రాదుర్భావ వికాస ప్రయోగం దర్శనం.

వివరించి, ఆటవికదశలోని ఈ పశుపక్ష్యాదుల అనుకరణే అభినయానికి ప్రాతిపదిక అన్నారు (వ్య.పు.పు.6). ఈ కళారుపాల్లో *జానపద కళారూపాల ప్రాదుర్భావ వికాస ప్రయోగ సమగ్ర దర్శనాన్ని* గురించి వివరిస్తూ కసిరెడ్డి వెంకట రెడ్డి ఒక చట్రం నిర్మించి చూపారు[10].

జానపద కళల్ని ఈ చట్రం ప్రకారం పరిశీలించినా, ఆదిమదశలో కళలు "*వేట*" తోనే ప్రారంభమయ్యాయనే విషయం స్పష్టమవుతుంది. ఆరుద్ర కూడా శ్రమలోంచి, వేటతో ప్రారంభమయ్యాయని చెబుతున్న కళలు నుండి "*వృత్తికళలు*" గా "*వృత్తులు*' గా మారిన వైనాన్ని కూడా చారిత్రక, సామాజిక దృక్కోణంతో వివరించినట్లు తెలుస్తుంది. కొన్ని పరిశోధన విషయాల్ని స్పర్శించేటప్పుడు ఓ నిర్దిష్ట శాస్త్రంతో మాత్రమే తన పరిశీలన ఆపేస్తే, తన ప్రతిపాదనను సమగ్రంగా నిరూపించడం చాలాకష్టం. కనుక, సంబంధిత శాస్త్రాల పరిచయం, వాటి అవగాహన చాలా అవసరం. అందుచేతనే పరిశోధకులు కూడా ఇదే విషయాన్ని వివరిస్తూ "సాహిత్యంలోని సామాజికాంశాలు కానీ, భాషకానీ, రచనా నిర్మాణం కానీ, సాహిత్యం ద్వారా ఉద్దేశించే భావ వికాసంకానీ, సేంద్రీయ స్పందన కానీ, ఒక దానికొకటి సంబంధంలేని అంశాలు కావు; మన చరిత్రలోనూ, సమాజ పరిణామంతోనూ సంబంధం లేని విషయాలు కావు. అవి పరస్పర సంబంధమైన అంశాలు; పరస్పర ప్రభావకమైన అంశాలు చరిత్రతో, సమాజ పరిణామంతో సజీవ సంబంధం గల అంశాలు" అన్నారు[11]. ఆరుద్ర ఈ విషయాలపట్లగల అవగాహన వల్లనే జానపదకళలు, రంజన కళలు, ప్రజాకళలు అనే పారిభాషిక పదాలు వాడినా "*కళలు*" ఆవిర్భావానికి గల కారణాలను చారిత్రక, సామాజిక దృక్పథంతో ఆవిష్కరించారు.

ఆరుద్ర రాసినట్లు కేవలం కళావిర్భావం మాత్రమే కాకుండా, సంప్రదాయకంగా కొనసాగుతున్న ఒక ఆలోచనాధార భరతుని నాట్యశాస్త్రంలో కన్పిస్తుంది. అది ప్రధానంగా అభినయానికి సంబంధించింది. అభినయం నాట్యశాస్త్రంలో ఒక ముఖ్య విభాగం. ఈ నాట్యం, నాటక ఉత్పత్తి వికాసాలను భరతుని నాట్యశాస్త్రం ప్రకారం పరిశీలించి నట్లయితే, దైవసృష్టి గా తెలుస్తుంది. కానీ, ఆరుద్ర భరతుని సిద్ధాంతాన్ని అంగీకరించలేదనేది ఆయన ప్రతిపాదించిన అభినయం అనుకరణ ప్రాతిపదిక అనడమే దీనికి నిదర్శనం. అయితే, భరతుని నాట్యశాస్త్రంలో అభినయ పద్ధతులు, వాటిని నేర్చుకోవడంలో ఆరుద్ర ఎలాంటి భేదాభిప్రాయాల్ని వ్యక్తీకరించలేదు. కానీ, "దైవసృష్టి" కంటే, అవసరాలే కళల్ని సృష్టించాయనేది ఆరుద్ర సిద్ధాంతంగా అర్థమవుతుంది.

## 6.2.1.2. 'అభినయానికి ప్రాతిపదిక–పశుపక్ష్యాదుల అనుకరణ':

పత్రిక కోసం రాసిన వ్యాసాలే కావచ్చుగానీ, ఈ వ్యాసాల్లో ప్రతిపాదించిన అంశం మాత్రం అభినయం దైవసృష్టి అనే సిద్ధాంత అస్తిత్వాన్నే ప్రశ్నించేటట్లు ఉంది. '**అభినయం**' పట్ల ఆరుద్ర కున్న అభిప్రాయం మాత్రం స్పష్టంగా వ్యక్తమైంది.

అభినయానికి ప్రాతిపదికలుగా చెపుతున్న పశుపక్ష్యాదుల అనుకరణల్లో భరతుని నాట్యశాస్త్రం, ఇతర గ్రంథాల్లో కన్పించే హస్తాలూ, కరణాలలో, అసంయుత, సంయుత హస్తాలలో వేటకు సంబంధించినవిగా ఆరుద్ర కింది వాటిని పేర్కొన్నారు.

1. కర్తరీముఖం (అమ్మెముక్కు)
2. మయూర (నెమలి)
3. శుకతుండం (చిలక ముక్కు)
4. సర్పశిఖరం (పాముపడగ)
5. మృగశీర్షం (లేడి తల)
6. లాంగూలం (తోక)
7. సింహవచనం (సింహం మోము)
8. హంసాస్యం (హంసముఖం)
9. భ్రమరం (తుమ్మెద)
10. హంస పక్షం (హంసరెక్క)
11. సందంశం (గట్టిపట్టు)
12. ఊర్ణనాభం (సాలీడు)
13. ముష్టి (పిడికిలి)
14. కపోత (పావురం)
15. కటక (ఎండ్రకాయ)
16. మత్స్య (చేప)
17. కూర్మ (తాబేలు)
18. వరాహ (పంది)
19. గరుడపక్షి (గద్దరెక్క)
20. గజదంత (ఏనుగుదంతం)

ఈ నృత్య హస్తాలలోనే కాకుండా 108 కరణాలలో భుజంగ త్రాసితం, వృశ్చికం, గజక్రీడితం, గరుడప్లుతం, సర్పితం, హరిణప్లుతం, సింహక్రీడితం, వృషభక్రీడితం మొదలైనవి కూడా ఆటవిక దశలో మానవుడు అనుకరించినవేనని అన్నారు. (ప్ర.ప్ర.పు:7)

ఇవి కాలక్రమంలో వివిధ ప్రాంతాలకూ, మానవ పరిణామదశలకూ సంబంధించి మార్పులు చోటుచేసుకున్నాయంటారు. వీటినుంచే అభినయ కళకూడా ఈ దశలోనే మొలకెత్తగా, సంగీతం కూడా ఈ దశలోనే ప్రాథమిక స్థితిలో ఉండేదన్నారు. అంతేకాకుండా ప్రాచీనులు అరవైనాలుగు కళలుగా పేర్కొన్న వాటిలో కూడా చర్మాలను తీయడం, లోహాలతో వస్తువుల్ని తయారు చేయడం, ఇళ్ళు కట్టడం వంటి వాటిని పేర్కొని, వీటిలో కొన్ని పనుల్ని చేసేవారిని Artisans (పంచాణం) గా మారారని చెప్పారు (( ప్ర.ప్ర.పు:8) వీటినుంచే ప్రజాకళారూపాలుగా పిలుస్తున్న కళలు పుట్టాయన్నారు. వీటిని సంక్షిప్తంగా వివరించారు.

1. మాల, మాదిగలలో పూజారి వర్గాన్ని చెందిన వారు'ఆసాది'
2. ఎల్లమ్మ కథను నృత్యగానాలతో చెప్పేవారు'ఉగ్గగొల్లలు'
3. తెలంగాణా ప్రాంతంలో యాచన చేస్తూ గాథలు చెప్పేవారు'ఎర్రగొల్లలు'
4. నూతులూ, చెరువులూ తవ్వుతూ, పచ్చబొట్లు పొడుస్తూ, ఉపశమనానికి పాటలు పాడేవారు 'ఒడ్డెవారు'.
5. తిత్తి, తాళం, వీరణాలు, కొమ్ములూ ఉపయోగిస్తూ గంగకథలు, కాటమరాజు కథలను చెప్పేవారు'కొమ్ములవారు'

6. ఎద్దులకు శిక్షణ నిచ్చి, వాటితో ఇళ్ళముందు జాంతవ నాటకం ప్రదర్శించే వారు 'గంగిరెద్దుల వాళ్ళు'

7. వీరగాథలను గానం చేసే యాచకగాయకులు 'గరుడ స్తంభందాసర్లు'

8. జోస్యం చెప్తూ రాగయుక్తంగా, వరసలతో మేలుకీడులను గానం చేసే స్త్రీలు 'గద్దెచెప్పువారు.'

9. మరాఠీనుంచి వచ్చి, అమ్మవారి కొలువు జరిపాక, కొరివి చిందులు వేసే 'గొండలవారు.'

10. కొన్ని శాఖలకు చెందిన గొల్లలు, తమ వీరగాథల్ని చెప్పేవారిని పోషిస్తూ మరికొంతమంది తామే వీర గాథాకథనం చేసే 'గొల్లలు'.

11. జాతర్లలో పగటి పూట జానపద కళారూపాలతో, ప్రాచీనతను తెలిపే ఆహార్యంతో బయలాటలాడే వారు 'చిందువూదిగలు'.

12. కాలికి మువ్వలు, అందెలు ధరించి, సితారా మీటుతూ వంతవాడితో కలిసి నాట్యం చేస్తూ శైవగాథలను చెప్పే 'జంగంవారు'.

13. నాట్యాలనూ, నాట్యరూపకాలనూ ప్రాచీన కాలం నుంచీ ప్రదర్శించే 'జక్కులువారు'

14. తెలంగాణాలోని కొన్ని చోట్ల శవాన్ని శ్మశానానికి తీసుకొని పోతున్నప్పుడు నృత్యం చేస్తూ మనిషి పరిణామ దశల్ని వివరిస్తూ కాటి దాకా నృత్యంద్వారా వివరణ చేసే 'జోగువారు'.

15. పురుషులు స్త్రీ వేషం వేసి, ఊరూరా వైష్ణవాన్ని ప్రచారం చేసే పాటలు పాడే గూలిందాసర్లు, చిన్నదాసర్లు, దండెదాసర్లు, నక్కదాసర్లు, పాగాదాసర్లు, బక్కదాసర్లు, బట్టదాసర్లు, 'భాగవత దాసర్లువారు'.

16. సాము గరిడీ విద్యలను జనరంజకంగా ప్రదర్శించే దొమ్మరులు గడమీద ఒంటికాలిపై నిలుచి, తలమీద దొంతర కుండల్ని పెట్టుకొని గిరగిర తిరిగే 'దొమ్మరివారు'.

17. పంబలివారు.
18. పగటి వేషగాళ్ళు.
19. పాండవులవారు.
20. పిచ్చుక కుంట్లవారు
21. పాడపోతులవారు
22. బాలసంతులవారు
23. బీరన్నలవారు
24. బుడబుక్కలవారు
25. బైనీండ్లు
26. బొమ్మలాటలవాళ్ళు
27. భట్రాజుల
28. భాగవతులు
29. మ్యాక్తీలు
30. రుంజలు
31. వీరఖడ్గాలు
32. వీరముష్టివారు
33. వీరవిద్యావంతులు
34. శారదకాండ్రు

35. సాతానివారు 36. సానివారు

37. సుద్దులగొల్లలు 38. సోదిచెప్పువారు

39. హడ్డివారు 40. హరిదాసులు

అని సామాన్య ప్రజలనుంచి సామాన్య ప్రజలకోసమే ఉద్భవించిన కళారూపాల్ని వివరించడానికి ప్రయత్నించారు అన్నారు. (ప్ర.ప్ర.పు:18) ఇవే కాలక్రమేణా ఆలయకళలుగా, ఆస్థాన కళలుగా మారాయనీ, గ్రామశిల్పులైన 'పంచాణం' వారు ఆలయ శిల్పులుగా, ఆస్థాన శిల్పులుగా ప్రత్యేకతలను పొందారంటారు. ఈ సందర్భంలో జయధీర్ తిరుమలరావు అభిప్రాయాన్ని పరిశీలిస్తే ''శ్రమజీవులు తమకు తాము వెలువరించుకున్న సాహిత్యాన్ని శ్రమజీవులు కోసం వారి సాహిత్య లక్షణాలతో ఇతరులు వెలువరించిన సాహిత్యన్ని ప్రజాసాహిత్యం అనవచ్చు'' అన్నారు.[12] ప్రజలంటే శ్రమజీవులన్నారు. అంతేకాకుండా సాహిత్యం రెండురకాలుగా ఉంటుందని, అది 1. ప్రజాసాహిత్యం కళలూ 2. పాలకవర్గ సాహిత్యం కళలుగా మారిపోతాయనీ, రూపం ప్రజలదైనా వస్తువు లేదా భావన పాలక వర్గానిదై పోతుందంటారు. ఈ విశ్లేషణను అనుసరించి చూసినా ఆరుద్ర చేసిన విభజనలో కళలు - వృత్తులుగా పరిణమించిన విధానం స్పష్టమవుతుంది. ఆలయకళలు, ఆస్థానకళలు అనే పేర్లు వేరైనా జయధీర్ తిరుమలరావు భావించినట్లు ప్రజాకళల్లోనూ వర్గాల విభజన తప్పదని తెలుస్తుంది.

ఇంత వరకూ పేర్కొన్న ఆరుద్ర ప్రతిపాదనల్లో ప్రధానంగా కింది అంశాలను గమంచవచ్చు.

(i) కళలపుట్టుక కు మూలంశ్రమ.

(ii) పశుపక్ష్యాదుల అనుకరణే అభినయానికి ప్రాతిపదిక

(iii) ఆదిమసమాజంలోని సామూహిక కళలు, తర్వాత విభజనకు గురయ్యాయి.

(iv) కళలనుండి వృత్తి కళాకారులు విడిపోయారు. అంటే ప్రత్యేక వర్గకళలు గా విడిపోయాయి.

(v) వృత్తి కళాకారులనుండి కులం ఏర్పడింది.

(vi) కొన్ని కళలకు, ఆ కళాకారులకు గౌరవం పెరిగింది.

(vii) కళలు, అభినయం వంటివి ఆదిమ సమాజ అవసరాలకు అనుగుణంగా మారాయి తప్ప, దైవ నిర్ణయం వల్ల పుట్టలేదు.

(viii) ప్రాచీన సంప్రదాయాలను, చరిత్రను, ఆచార వ్యవహారాలను కళల వల్ల సజీవం చేసుకోగలిగారు.

(ix) ఆశ్రితులు, ఆశ్రయకులాలు అనే తెగలు ఈ కళల వల్ల ఏర్పడ్డాయి.

(x) అవసరం, వినోదంతో బాటు 'యాచకత్వాన్ని' కూడా కళ పరంపరాగతం చేసి, వారసత్వ సంపదగా మారిపోయింది.

(xi) కొన్ని కళలపై కొందరి ఆధిపత్యం పెరిగి, కొంతమందే వాటిని చేజిక్కుంచుకొన్నారు.

(xii) ఆదిమ సమాజంలో 'సామూహిక కళలు' లుగా ఉన్న ప్రజాకళల్లో వైయక్తికత చోటు చేసుకొని, వర్గ ప్రయోజనాలకు కారణ మయ్యాయి.

(xiii) ప్రజాకళల వల్ల ప్రాచీనకాలంలో కేవలం అవసరంతో పాటు వినోదం ప్రధాన ప్రయోజనమైతే, ఆధునిక కాలంలో కొందరి చేతిలో దోపిడీ సాధనాలుగా కొన్ని కళలు - కళాకారులు రూపాంతరం చెందారు.

(xiv) ఉద్దేశించిన భావాల్ని ప్రజలదగ్గరకి తీసుకొనిపోవడానికి ఫ్యూడల్ వ్యవస్థ గాని, ఏవ్యవస్థ గాని, ప్రజలనుండి వచ్చిన ఈ కళారూపాలు ప్రభలమైన సాధనాలుగా పని చేస్తున్నాయి.

పై క్రోడీకరణ అంశాల్లో అభినయప్రాతిపదిక - పశుపక్ష్యాదుల అనుకరణ అనేది ఆరుద్ర శోధించిన అంశమని స్పష్టమవుతుంది. దీన్ని భరతుని నాట్య శాస్త్రంలో నాట్యోత్పత్తి, అభినయాల పుట్టు పూర్వోత్తర కథనాల ద్వారా పరిశీలించ వచ్చు.

ప్రజల్ని స్వధర్మ నిరతుల్ని చేయడానికి దేవతలు బ్రహ్మను ప్రార్థించగా, నాలుగు వేదాలనుండీ నాలుగు నాట్యంగాల్ని గ్రహించి నాట్యవేదాన్ని రచించినట్లు నాట్యశాస్త్రం పేర్కొంటుంది[13]. ఋగ్వేదం నుండి పాఠ్యాన్ని, సామవేదంనుండి గీతాన్ని, యజుర్వేదం నుండి అభినయాన్ని అధర్వవేదం నుండి రసాల్ని గ్రహించి లలితాత్మకమైన వేదాన్ని బ్రహ్మ సృష్టించి, భరతునికి చ్చాడని తెలుస్తుంది. ఆరుద్ర 'ప్రజాకళాలూ - ప్రగతివాదులూ' లో వివరించిన కరణములు, భరతుని నాట్యశాస్త్రంలో ఉన్నాయి. భుజంగత్రాసితము (వరుస సంఖ్య **24**), గజక్రీడితము (వ.సం.**68**), మయూరలలితము ( వ.సం.**80**), సింహావిక్రీడితము (**89**), వృషభక్రీడితము (**104**) వంటివి కన్పిస్తున్నాయి[14]. అసంయుత సంయుత హస్తముద్రలను గురించి ఆరుద్ర వివరించినవి చిత్రరూపసహితముగా భరతుని నాట్య శాస్త్రంలో కన్పిస్తున్నాయి. వీటిలోని ముద్రలనుండి ఒక ఉదాహరణ. ఆరుద్ర కర్తరీముఖము (ప.పు.వా.పుట :7) గురించి చెప్పారు. దీన్ని నాట్యశాస్త్రంలో వివరిస్తూ 'త్రిపతాకం'లో తర్జనిని నడిమి వేలు వెనుక భాగంలో ఉంచి నట్లయితే దాన్ని కర్తరీముఖం అంటారు. "*రురు, చమర, మహిష, సురగజ, వృష, గోపుర, శైల శిఖరములను ప్రదర్శించుటకు అసంయుత కర్తరీముఖ హస్తమును కాని, సంయుత కర్తరీముఖ హస్తములను కాని ప్రయోగించాల*"ని పేర్కొన్నారు.

కళారూపాలను గురించి పరిశోధన చేసిన వారుకూడా కళలు శ్రమ నుంచే పుట్టాయన్నారు. కానీ, ఆరుద్ర ఇంకొంచెం ముందుకెళ్ళి అభినయానికి ప్రాతిపదికే పశుపక్ష్యాదుల అనుకరణాలనడం ఒక కీలకాంశమే అవుతుంది. ఈ ప్రతిపాదన చేసేనాటికే ఆరుద్ర నృత్యానికి సంబంధించిన ఎన్నోసందేహాలను ఆ రంగంలో ప్రసిద్ధులైన వారికే తీర్చేవారని బి. ఎస్.ఆర్ కృష్ణ అభిప్రాయాన్ని బట్టి తెలుస్తుంది. "*నాట్య శాస్త్ర లోతు పాతులను ఆయనెంత క్షుణ్ణంగా తెలిసిన వాడో తమిళులకు తెలుసు. మదరాసు నగరంలో ఈ నాటి అగ్రశ్రేణి నర్తకీమణుల, నాట్యాచార్యుల మన్నన పొందిన నాట్య, సంగీత శాస్త్ర నిపుణుడు ఆరుద్ర. ఒక పద్మా సుబ్రమణ్యం, ఒక చిత్రా విశ్వేశ్వరన్, ఒక కళానిధి నారాయణన్, ఒక చంద్రలేఖ - ఒక రేమిటి దాదాపు ప్రతి ఒక్కరు తరచు తమ సందేహాలు తీర్చుకొనటానికి ఆరుద్ర ను సంప్రదిస్తుంటారు* (ఆ.అ.సం.పు:**122**) కనుక,

ఆరు ద్ర ప్రతిపాదన అభినయానికి ప్రాతిపదిక పశుపక్ష్యాదుల అనుకరణే అనడం ఒక నూతనావిష్కరణే అవుతుంది. అంతేకాకుండా, నృత్యంలో విశేషంగా కృషిచేసిన చంద్రలేఖ *"Militant origins in Indian Dance"* అనేవ్యాసంలో శ్రమనుండి కళలు పుట్టాయనే అభిప్రాయాన్ని కింది విధంగా తెల్పడం విశేషం. *"All the primary Indian dance forms originating in primitive and tribal societies are solidly linked with work activity. They were intimately related to functions of dialy life like food gathering, hunting, fishing, cultivating and harvesting"* (ఆ.అ.సం.పు:231). అయితే ఈ సందర్భంలో చంద్రలేఖ ఈ సిద్ధాంత ప్రతి పాదన చేసినట్లు అర్థంచేసుకొనే వీలుంది. కానీ, చంద్రలేఖ ఆరుద్ర దగ్గర సందేహాలు తీర్చుకొనేవారనటం ద్వారాను, ఈ వ్యాసం ఆరుద్ర తర్వాతనే రాయడం గమనించాల్సి ఉంది. 1984 ముందే ఆరుద్ర వ్యాసాలు ప్రచురితంకాగా, చంద్రలేఖ వ్యాసం 1985 లో ప్రచురితమయ్యింది వీటన్నింటినీ పరీశీలించి నప్పుడు సంప్రదాయ నృత్యాలను ప్రాతిపదికలు లేదా భావనలకు జానపదవిజ్ఞానమే ఆధారమని స్పష్టమవుతుంది. '*ఆంధ్ర నాట్యం– దాని ప్రత్యేకతలు* అనేవ్యాసంలో కుడా ఆరుద్ర నృత్యం, నాట్యం మధ్యగల వ్యత్యాసాలను వివరిస్తూనే 'నృత్తం' కూడా ఆహార సేకరణ దశనుండే వచ్చిందంటారు. భాషాసాహిత్యాలు లేని అనాగరిక జాతులు వుంటాయోమోగాని, నాట్యం లేని మానవ సంఘాలు వుండవు. శాస్త్రకారులు దీనిని నాట్యం అనరుగాని, నృత్తం అంటారు. వారి నిర్వచనం ప్రకారం నృత్తం రసభావ విహీనం. నృత్త్యం భావవిహీనమైతే కావచ్చునుగాని, దానికి ప్రభావం మాత్రం ఉంటుంది. అన్నీ ఆదిమ మానవ సంఘూలలో నృత్తం ఆహారోత్పాదక ప్రక్రియ. వేటాడ వలసిన జంతువుల సంఖ్య పెరుగుదలకోసం ఆహార సేకరణ దశలో నరులు నృత్యాన్ని ఉపయాగించేవారు (పు:44) ఈ వ్యాసంలో 'ఆంధ్ర నాట్యం' పుట్టుక గురించి చెప్తూ అనాదిగా 'ఆంధ్ర నాట్యం' అనేది ఒకటి లేకపోలేదనీ, ఐతరేయ బ్రాహ్మణంలో ఆంధ్రుల ప్రసక్తి కన్పించడం, అందులోనే శబరులు కూడా ఒక తెగవారు ఉండేవారనీ, వారికే నాట్యమున్న ప్పుడు, ఆంధ్రులకు అనే ప్రత్యేక నాట్యం ఉంటుందంటారు ఆరుద్ర. ఈ ఆదివాసులందరికీ వారి వారి ఆచారవ్యవహారాలను బట్టి నృత్తరీతులున్నాయనీ, ఇవే ఆంధ్ర నాట్యకేదారానికి ఆదిలో విత్తులు అంటారు. (ప్ర.ప్ర.పు:46) సంప్రదాయ నృత్యాలకు మాతృక జానపద విజ్ఞానంలోని అంశాలేనని దీన్ని బట్టి తెలుస్తుంది.

## 6.2.1.3. పొడుపు కథలు – సమన్వయాత్మక వివేచన:

'*జానపద విజ్ఞానం – పొడుపు కథలు* అనే వ్యాసంలో జానపద విజ్ఞానంలో కృషి చేసిన పాశ్చాత్యుల పరిశోధనలను సమీక్షించి తనదైన విమర్శనా శక్తిని ప్రదర్శించారు ఆరుద్ర. పొడుపు కథల గురించి ప్రాచ్య, పాశ్చాత్యులలో కొంతమంది రచనలను అధ్యయనం చేస్తూ సర్‌జేమ్స్ ఫ్రెజర్ తనగ్రంథం '*గోల్డెన్ బౌ*' లో - వివిధ దేశాలలోని వివిధ జాతుల వాళ్ళు, వివిధ తెగలవాళ్ళు కొన్ని కొన్ని సమయాల్లోనూ, కొన్ని కొన్ని సందర్భాలలోను మాత్రమే పొడుపు కథల్ని విప్పి చెపుతారని, చాలాచోట్ల వివరించినా, ఆ ప్రత్యేక సమాయాల్లోనూ, సందర్భాల్లోనూ మాత్రమే వాటినెందుకు వాడారో చెప్పలేక పోయాడని ఆరుద్ర వ్యాఖ్యానించారు . అలా లోపాల్ని చెప్పడమే కాకుండా "*స్టాండర్డ్ డిక్షనరీ ఆఫ్ ఫోక్‌లోర్*" "*మైథాలజీ అండ్ లెజెండ్*" అనే నిఘంటువుల్లో ఇలాంటి వాటికి గల

సమన్వయాల్ని గమనించి, వాటినీ సందర్భంలో పేర్కొన్నారు. వానలు కురిపించే తతంగంలోనూ, పంటలు పండించేటప్పుడూ, కుర్రవాళ్లకు సుస్తీ చేసినప్పుడూ, పెళ్ళిళ్ళలోనూ, ఎవరైనా మరణించి నప్పుడూ ఆదిమ జాతుల వాళ్ళు పొడుపు కథలను వాడుకుంటారనే విషయాన్ని ఈ సందర్భంగా తెలిపారు. అంతటితో ఆగకుండా తెలుగులో పొడుపు కథల గురించి పరిశోధనలు చేసిన కాశీనాథుని నాగేశ్వర రావు, నందివాడ చలపతిరావు, నేదునూరి గంగాధరం, జి.శంకర రావు, వెలగా వెంకటప్పయ్య, కసిరెడ్డి వెంకటరెడ్డి తదితరుల రచనలను కూడా వివరించారు. వీటిని బట్టి ఒక సమన్వయం ఉండాలనే విమర్శనాత్మక దృక్పథం మాత్రం కన్పిస్తుంది.

ఆరుద్ర రచనలో సమీక్ష, విమర్శ లక్షణాలు ఉన్నప్పటికీ, అది కూడా ఒకరకంగా సమన్వయాత్మక పరిశోధనలో భాగంగా స్వీకరించే అవకాశం లేకపోలేదు.

పొడుపు కథల్ని వివరించే ప్రయత్నంలోనే, పరిశుద్ధ గ్రంథం (బైబిల్) పాతనిబంధనలో గల కథను పొడుపు కథగా ఓ ఉదాహరణ చూపాలని ఆరుద్ర ప్రయత్నించినట్లు కన్పిస్తుంది. ఆరుద్ర కూర్చిన ఆ పొడుపు కథ ఇది -

*"ఒక తల్లి బిడ్డతో అందికదా*
*మీ నాన్నే మానాన్న*
*మీ తాత నామొగుడు*
*నువ్వు నా బిడ్డవూ నేను నీ అక్కనీ"*

అని పేర్కొని, ఇది బైబిలు ఆదికాండ అష్టా దశాధ్యాయంలో 30 నుంచి 35 దాకా ఉన్న పద్యాల ఉదంతంపై ఆధారపడి ఉందని అన్నారు. (ప్ర.ప్ర.పు:17) బైబిలులో పందొమ్మిదవ అధ్యాయంలో ఇలాంటి కథ ఒకటి కన్పిస్తుంది. ఈయన ఈకథను పేర్కొనడం కేవలం ప్రాచీనకాలం నాటి వావి వరుస లను తెలిపే కథల్ని ప్రస్తావించడానికే అనేది గమనించాల్సి ఉంది. ఒక ప్రాంతంలో కొన్ని కులాలలో ఉండే ఒక ప్రత్యేకమైన వావివరుసల్ని సూచిస్తాయంటూ ఈ కథను పేర్కొనడమే దీనికి తార్కాణం గా చెప్పు కోవచ్చు. తానుకనుగొన్న విషయాల్ని సందర్భాను సారంగా తెలపాలనేది ఆరుద్ర పరిశోధనా ఆకాంక్షల్లో ఒకటని దీన్ని బట్టి తెలుస్తుంది.

## 6.3. రాముడికి సీత ఏమవుతుంది? జనరంజక పరిశోధన:

రామాయణం జరిగిందా లేదా అనేదానికంటే, రామకథ ప్రపంచవ్యాప్తంగా ప్రచారంలో ఉందా? లేదా? అనే ప్రశ్నకి సమాధానం సులభంగా లభిస్తుందేమో! అనేక రకాలుగా రామకథ ప్రచారంలో ఉందనే సమాధానం ముక్త కంఠంతో వినిపించే అవకాశం ఉంది. ఇలా ప్రపంచ వ్యాప్తంగా ప్రచారంలో ఉన్న రామకథల్ని ఆధారంగా చేసుకొని రాముడికి సీత ఏమవుతుంది? అనే గ్రంథాన్ని ఆరుద్ర రాశారు. ఈ గ్రంథంలో గల వ్యాసాలు ముందుగా ఒకతెలుగు పత్రికలో ధారావాహికంగా, వ్యాస పరంపరగా ప్రకటిస్తూ వచ్చారు. పత్రిక కోసం రాసిన ఈ వ్యాసాలన్నింటినీ ఓ చోటికి చేర్చి గ్రంథంగా ప్రచురించారు. స్వయంగా ఆరుద్ర ఈవ్యాసాల్ని పరిశోధన వ్యాసాలుగా చెప్పుకున్నారు.(రా.సీ.ఏ.పు:5) ఈపరిశోధన

రామాయణ చరిత్రలో సత్య నిర్ణయానికి దోహదకారి కావాలనే ఆశయంతో కొనసాగించాననీ చెప్పుకున్నారు. రామాయణాల్లో కన్పించే విద్వాంసాలన్నీ పరిశోధకులకే కాకుండా, ప్రజల దృష్టిలోనికి కూడా రావాలనే ఆలోచనతో కూడా ఆరుద్ర ఈ వ్యాసాల్ని రాశారు (ప్ర. ప్ర. పు:84) "ప్రజలు" అంటే ఎవరు? అని ప్రశ్నించుకొంటే, "సామాన్య ప్రజలు" అని అవగాహన చేసుకొనే వీలుంది. ఈ అవగాహనకు కింది హేతువుల్ని ఊహించ వచ్చు.

(i) '**పరిశోధకులే కాకుండా**' అనడంలో సామాన్య ప్రజలకి కూడా అందుబాటు లోకి రావాలనే దృష్టి ఉంది.

(ii) వ్యాసాల్ని పత్రికలో ధారావాహికంగా అందించారు. దానిలో సూచికలు (రిఫరెన్స్) ఇవ్వడంకంటే సారాంశాన్ని చెప్పి, జన రంజకంగా తన అభిప్రాయాన్ని వెల్లడించ గలిగారు. ఇక్కడ జనరంజకత్వం అంటే పాఠకులకు ఎలాంటి ఆటంకాలు (ఆధారాలు, రిఫరెన్స్‌లు, గ్రంథవివరాలు, తేదీలు వంటివి) లేకుండా సరళసుందర మైన వచనంలో కథాకథన శైలిలో వివరించారు. జనరంజకత్వం పాఠకుల స్థాయిని బట్టి ఉంటుంది. కొంత మందికి పూర్తి ఆధారాలు ఉంటేనే జనరంజకత్వం కలగవచ్చు. కానీ, ఆరుద్ర ఉద్దేశించింది సామాన్య ప్రజలకు కూడా జనరంజకత్వం కలిగించడం. చిన్న చిన్న వాక్యాల్లో, కథచెప్తున్నట్లుగానే వ్యాసాల్ని కొనసాగించారు. మరీ నమ్మశక్యం కాదేమో అనిపించే కథనాలు, వ్యాఖ్యనాలు వచ్చినప్పుడు పాఠకుణ్ణి మరింత ముందుకి వెళ్ళి చదివించేటట్లు కొన్ని గ్రంథా ఆధారాల్ని కూడా ప్రక టించేవారు. ఇటువంటి శైలిగల వ్యాసం చదవరులను రంజింప జేస్తుంది. పైగా రాముని కథ కొద్దిగా తెలిసిన సామాన్యుణ్ణి సైతం 'ఇలాంటికథ' కూడా ఉంటుందా? అనే ఆలోచనతో రంజింపజేస్తూ మరిన్ని వ్యాసాల్ని చదివిస్తుంది. కనుక 'జనరంజకం' అంటే జనానికి ఇష్టమైన కథను వారి కిష్టంకల్గించేటట్లు శైలిలో చారిత్రక విషయాల్ని మిళితం చేసి తన పరిశోధవలో తెలిసిన విషయాల్ని దర్శింపజేసే ఒక విశిష్ట రచనా విధానం గల పరిశోధనగా భావించవచ్చు. ఇది సృజనాత్మక పరిశోధనకు దగ్గరలో ఉంటుంది.

ఈ వ్యాసాల్లో ఆరుద్ర పరిశోధనా పటిమను పట్టి చూపే అంశాల్ని కిందివిధంగా పేర్కొనవచ్చు.

(i) ప్రపంచంలో ప్రచారంలో ఉన్న సీతారామకథలకు సంబంధించిన విషయాల్ని ఓచోటకి చేర్చడం.

(ii) భారత దేశంలోనే కాకుండా, మిగిలిన మరికొన్ని దేశాల్లో కూడా రామకథ ను పోలిన కథల్ని పరిశీలించడం.

(iii) సీతారాములకు ఉండే సంబంధ బాంధవ్యాలను చర్చించడం.

(iv) సాంఘిక, ఆర్థిక, చారిత్రక కోణాలనుండి, వాటి వరసలను విశ్లేషించడం.

(v) ప్రచారంలో ఉన్న మౌఖిక, లిఖిత వాఙ్మయాన్ని తన పరిశీలనకు స్వీకరించడం.

(vi) లిఖిత వాఙ్మయం మార్పులకు, చేర్పులకు లోనై, సమకాలీన పరిస్థితులకు అనుగుణంగా రూపొంది, వాస్తవాల్ని కప్పిపుచ్చేందుకు ప్రయత్నం జరిగిందేమో పరిశీలించడం.

(vii) వివిధ దేశ, భాషలలో గల రామాయణాలతో తులనాత్మక పరిశీలన చేయడం

(viii) వాల్మీకి రామాయణం ప్రామాణిక మవుతుందా? దాని కంటే ముందు రామకథ లేదా ప్రామాణిక రామాయణమేదో నిర్ణయించ డానికి ప్రయత్నించడం.

(ix) 'సీత-రాముడి' కి మధ్యగల సంబంధ బాంధవ్యాల్ని పరిశీలించినా, తన పరిశోధన ప్రధానంగా సీత పాత్ర చుట్టూనే కేంద్రీకరించి పరిశీలించడం.

ఈ విధంగా ఆరుద్ర రామాయణాల్ని, సీత పాత్రను నవ దృక్కోణాల నుండీ నవ్య దృష్టిని ప్రదర్శించిన తీరుని సోదాహరణంగా వివరించడానికి కింది విధంగా ప్రయత్నించ వచ్చు.

## 6.3.1. రామాయణంలో సీత-నవదృక్కోణాల ఆరుద్ర నవ్యదృష్టి

### 6.3.1.1. ప్రపంచంలో సీతా రామకథలు:

సీతారాములకు సంబంధించిన ఏచిన్న విషయం కనిపించినా, సీతా రాములకథకి సంబంధించిదని పించినా, వాటిని పేర్కొనడం వల్ల తన పరిశీలనాంశం ఏమిటో ఆరుద్ర గుర్తించగలిగారు. అష్టాదశ పురాణాలనుండి, భారత, భాగవత కథలలో కూడా రామకథ కన్పిస్తుందన్నారు (రా.సీ.ఏ.పు:2) కానీ, వాటిలో ఎక్కడ, ఏకథా రూపంలో ఉందో వివరించడానికి ప్రయత్నించలేదు. కానీ, సంస్కృతంలో వాల్మీకి రామాయణం మొదలు, బాసుడు (*ప్రతిమానాటకం*), కాళిదాసు (*రఘువంశం*), భవభూతి (*ఉత్తర రామచరిత్ర*) దిజ్ఞాగుడు (*కుందమాల*), భట్టి (*రావణవధ*), ల రచనల్లోని రామకథల్ని, అద్భుత, ఆధ్యాత్మ, ఆనంద రామాయణాలలో కన్పించే కథల్ని పేర్కొన్నారు. బౌద్ధులూ, జైనులూ రామాయణాన్ని ఉపయోగించుకున్నారని, ఆ కథల్ని కూడా పరిశీలించారు. జానపధ గాథల్ని కూడా పరిగణనలోకి తీసుకున్నారు (రా.సీ.ఏ.పు:3) భారత దేశంలోనే కాకుండా శ్రీలంక, టిబెట్, ఖోటాను, మంగోలియా, సైబీరియా, చైనా, జపాను, లావోస్, చంప, కాంబోడియా, థాయ్‌లాండ్ ఇండోనేషియా, మలేషియా, ఫిలిప్పీన్ జర్మనీ మొదలైన వంటి దేశాల్లో ప్రచారంలో ఉన్న రామకథల్ని పరిశోధకుల రచనల ఆధారంగా ఆరుద్ర స్వీకరించారు (రా.సీ.ఏ.పు:5).

### 6.3.1.2. రామకథను పోలినకథలు:

భారత దేశంతో పాటు, ప్రపంచ వ్యాప్తంగా రామకథను పోలిన కథల్ని పరిశీలించి, వాటిపై తన అభిప్రాయాల్ని తెల్పడం ఇందులో ప్రధానం. మొదటి శీర్షికలో కేవలం సీతారామకథలు ప్రపంచ వ్యాప్తంగా ఉన్నవాటివి వివరిస్తే, ఈ శీర్షికలో ఆరుద్ర పరిశీలించిన 'రామకథను పోలిన కథల్ని' ఎలా స్వీకరించారో గమనించ వచ్చు.

(i) 'బౌద్ధవాఙ్మయంలో రామకథలు - I'. శీర్షికతో, పేరు తెలియని రాజు జాతకకథను వివరించి, ఇది చైనాభాషలోనే గాని పాళీ భాషలో కనబడద (రా.సీ.ఏ.పుట:8) ని అన్నారు. ఈ కథలో ఒక బోధిసత్త్వుడు, ధర్మపరాయణు డైన రాజు (ఆరాజు పేరు తెలియదు) రాజ్యాన్ని పరిపాలించడం, తనమేనమామ రాజ్యాన్ని కబళించాలని చూడటం, యుద్ధంలో రక్తపాతానికి ఇష్టపడక బోధిసత్త్వుడు

రాజ్యాన్ని మంత్రులకు అప్పగించి రాణితోపాటు పర్వత సీమల్లోని అరణ్యాలకువెళ్ళిపోయాడు. అరణ్యంలో ఒక దుర్మార్గుడు నాగుడు ఉండటం, రాణిమీద కన్ను పడటం, మునివేషంలో రావటం, అదనుచూసి రాణిని అపహరించడం, తర్వాత రాణిని సంపాదించుకోవడానికి ఒక వానరుని సహాయం తీసుకోవడం ద్వారా యుద్ధంచేసి రాణిని మళ్ళీ పొందడం, ప్రజల అనుమానాల్ని తీర్చడానికి రాణి వాక్కు వల్ల భూమిచీలిపోవడం వంటి కథలున్నాయి. ఇది బౌద్ధ జాతక కథ అనీ, ఈకథే వాల్మీకి రామాయాణానికి భీజప్రాయమని ఆరుద్ర అంటారు (రా.సీ.ఏ.పు:8)

(ii) బౌద్ధ జాతక కథల్లోని **దశరథ జాతక** కథలో పూర్వజన్మలో దశరథుడు శుద్ధోధనుడని, సీత రాహులమాత అని, రామపండితుడు తానేనని బుద్ధుడు చెప్పినట్లు ఒక రామకథను పోలినకథను వివరించారు.

(iii) ఖోటాన్ రామాయణం క్రీ. శ.9వ శతాబ్దికే ప్రచారంలో ఉందనీ, ఇదికూడా బౌద్ధజాతక కథ వంటిదేననీ, దీనిలో మైత్రేయుడు రాముడనీ, రైస్మణుడు బుద్ధుడనీ, చెప్పినట్లు, ఇది కూడా రామకథను **పోలినకథ** అని వివరించారు (రా.సీ.ఏ.పు:17)

(iv) లావోస్ లో '**రామజాతకం**' లో ప్రథమ భాగంలో రామకథను పోలిన కథ ఉంది. (రా.సీ.ఏ.పు:22)

(v) ప్రస్తుతం థాయ్‌లాండ్ అని వ్యవహరిస్తున్న దేశానికి '**సయాం**' అనే పేరుండేది. 18వ శతాబ్దినుంచి సయాం నుచక్రి వంశపు రాజులు పాలించారు. వీళ్ళందరూ రామనామధారులే. ఒకటవ రాముడు, రెండవ రాముడు అని ఈ రాజుల్ని చరిత్ర కారులు పరిగణిస్తారు. చక్రి వంశ సంస్థాపకుడు ఒకటవ రాముడు రామాయణాన్ని మహాకావ్యంగా రాశాడు. దాని పేరు 'రామకియన్ 'అంటే రామకీర్తి అని అర్థం. ఇందులో వాల్మీకి రామాయణంలో కనిపించని బంధుత్వాలూ, సంఘటనలూ ఉంటాయి. ఈ శతాబ్దిలోని ఆరవ రామరాజు (1910-25) వాల్మీకి రామాయణాన్ని అనుసరిస్తూ వేరే రామకీర్తిని రచించాడు (రా.సీ.ఏ.పు:23)

(vi) ఇంకా రామకథలను పోలిన కథలు గల మలేషియాలో కావ్యప్రశస్తిని పొందిన 'హికాయత్ శ్రీరామ' లో కూడా ఆరుద్ర కొన్ని కథల్ని స్వీకరించారు.

(vii) శ్రీలంకలో, 'కొహంబ కంకరియ' అనే జాతర లో నృత్యగీతాలతో మేళతాళాలతో ఉత్సవం జరిపేటప్పుడు, నర్తకులు ప్రాచీన గాథలు కథనం చేశారనీ, అందులో ఒక గాథ 'సీత' కు సంబంధించింది ఉందనీ, దాన్ని స్వీకరించి నట్లు తెలుస్తుంది (రా.సీ.ఏ.పు:42)

## 6.3.1.3. సీతారాముల సంబంధ బాంధవ్యాలు:

"సీతారాముడు" భార్యాభర్తలుగా భావించే ఈ సమాజంలో ఆరుద్ర వివరించిన సీతారాముల సంబంధ బాంధవ్యాలు చాలా ఆశ్చర్యాన్ని, ఆసక్తిని, అద్భుతాన్ని కలిగిస్తాయి. అంతేకాకుండా, సీతారామ లక్ష్మణులను పుణ్యపురుషులుగా భావించే వారిలో, పవిత్ర భావనలో ఉన్నవారికి కొంత నిరాశను కల్గించినా, లోకంలో ప్రచారంలో ఉన్న రామకథల్ని, బాంధవ్యాల్ని ఎలాంటి సంకోచం లేకుండా ఆరుద్ర వివరించారు.

(i) దశరథ **జాతకం** అనే జాతక కథలో వారణాసిని పరిపాలిస్తున్న దశరథుడికి గల పదహారువేల మంది భార్యలలో, పట్టపురాణికి ఇద్దరు కొడుకులు, ఒక కూతురుపుట్టారు. పెద్ద కొడుకు రామపండితుడు, చిన్న కొడుకు లక్ష్మణ పండితుడు, కూమార్తె పేరు సీతాదేవి (రా.సీ.ఏ.పు:10) ఈ కథలో రామపండితులు సీతాదేవిని పట్టపురాణిని చేసుకొని రాజ్యాన్ని పాలిస్తాడు (రా.సీ.ఏ.పు:12) దీన్ని బట్టి ఈ కథలో '**రామపండితుడికి సీతాదేవి చెల్లెలు**' అవుతుంది.

(ii) చైనాదేశంలో గల '**ఖోటాన్ రామాయణం**' లో దశరథునికొడుకు సహస్రబాహుడు. సహస్రబాహుడికి రైస్మణుడు, రాముడు అని ఇద్దరు కొడుకులు. దశగ్రీవుడనే రాక్షసునికి ఒక కుమార్తె జన్మించింది. ఆమెపేరు సీత. దశగ్రీవుడికి తనకుమార్తె వల్లనే మరణం సంభవిస్తుందని తెలియడం వల్ల ఆ శిశువుని పెంచడం, పెరిగిన ఆమెను అన్న దమ్ములిద్దరూ రైస్మణుడూ, రాముడూ మోహించడం, తర్వాత దశగ్రీవుడు ఆమెను ఎత్తుకుపోవడం, మళ్ళీ అన్నదమ్ములిద్దరూ కలిసి వధించడానికి ప్రయత్నించగా, క్షమాపణకోరి, కప్పంకట్టడానికి దశగ్రీవుడు అంగీకరించడంతో క్షమించి అతణ్ణి వదిలేసి, అన్నదమ్ములిద్దరూ సీత తో నూరేళ్ళు జీవించారు. (రా.సీ.ఏ.పు:17). ఈ కథలో సీత - ఇద్దరు అన్నదమ్ములకి భార్య అని తెలుస్తుంది.

(iii) ఋగ్వేదంలో సీతారామలక్ష్మణుల కథ ఉందనీ, దాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే తెలుస్తుందని చెప్తూ ఋగ్వేదంలోని సీత రాముడి భార్యకాదు. ఇంద్రుడి పెళ్ళాం. తైత్తరీయ బ్రాహ్మణం (2-3-10) ప్రకారం వచ్చిందని (వీబరు, జాకోబ్ వంటి) పండితులు భావిస్తున్నారనీ, ఋగ్వేదం 4 వ మండలంలోని '*ఇంద్రః సీతాం నిగృహ్ణాంతు తాం పూషానుయచ్ఛతు*' (5-67)ని పేర్కొన్నారు (రా.సీ.ఏ.పు:99)

వేదాల్లో 'సీత' శబ్దం ఉన్నా, అది రామునికి ఎలాంటి సంబంధాన్ని కలిగిలేదనీ, అయితే తైత్తరీయంలో సీత చంద్రుణ్ణి పొందింది. వాల్మీకంలో రామచంద్రుణ్ణి పొందింది. ఋగ్వేదంలో సీత కథే వాల్మీకి రామాయణానికి మూలకందమని పాశ్చాత్య పండితులు నిరూపించడానికి ప్రయత్నించారు. ఇంద్రుడే రామచంద్రుడన్నారు. ఆమాటకొస్తే శ్రీరాముడే బలరాముడన్నారు. ఈ వాదంలో నిజంలేకపోలేదు. (రా.సీ.ఏ.పు:100) అన్నారు ఆరుద్ర. దీన్ని బట్టి '*రాముడికి సీత భార్య*' అవుతుంది. ఆదిలో రాముడికీ, ఇంద్రుడికీ ఏవిధమైన సంబంధం లేకపోవచ్చు. కాల క్రమేణా ఇంద్ర గాథలను కొద్ది మార్పులతో రాముడికి ఆపాదించి ఉంటారనే జర్మనీ పండితుడు హెర్మన్‌జాకోబీ, సర్ ఆల్‌ఫ్రెడ్ లియాల్ ల సిద్ధాంతాన్ని ఉటంకించి, ఈ సమన్వయం శాస్త్రీయ దృక్పథం, హేతువాద దృక్పథం, హేతువాద దృక్పథం వున్నాయి అన్నారు (రా.సీ.ఏ.పు:104). దీన్నిబట్టి '*రాముడికి సీత భార్య*' అవుతుంది

(iv) జైనుల మొట్టమొదటి తీర్థంకరుడు ఋషభనాథుడు మార్చేదాకా కవల పిల్లలుగా పుట్టే స్త్రీ పురుషులే ఆలుమగలుగా కాపురం చేసేవారు. అందుకే సీతారాములు బౌద్ధ జాతక కథలో ఏకోదరులయ్యారు (రా.సీ.ఏ.పు:127)

(v) ప్రజానీకం తమ ఉమ్మడి మనసులో సీతారాములు ఏ విధంగా ఉండాలని యుగధర్మాన్ని బట్టి ఆయాయుగాలలో భావిస్తే ఆవిధంగా సీతా రాములు వుంటారు. (రా.సీ.ఏ.పు:130) అని ముగించారు.

దీన్ని బట్టి ప్రచారంలో ఉన్న రామకథల్ని పరిశీలించినపుడు ఆయా సామాజిక సంబంధాలను అనుసరించి, ప్రజలలో ఉన్న వావివరసలనే సీతారాముల సంబంధాలుగా మార్చుకొన్నారని స్పష్టమవుతుంది ఆరుద్ర ఈ గ్రంథంలో తన ఫలితాంశాన్ని "ఆనాటి స్త్రీ పురుషులు ఆలుమగలు కావడానికి ఏ అర్హతలు, ఏరక్త సంబంధాలు అవసరమో, ఆమట్టరికమే సీతారాములకు ఆనాటి కథకులు ఆపాదించారు" (రా.సీ.ఏ.పు:127) అన్నారు కానీ ,చివరికి రాముడి సీత భార్య అవుతుందనీ, సీతను తెలుగువాళ్ళ అమ్మవారుగా భావిస్తారనీ, ఆదిమయుగాల నుంచి అవిచ్ఛిన్నంగా వస్తున్న దేవీ ఉపాసనకు ఆమె సంకేతమైందనీ చెప్పి (రా.సీ.ఏ.పు:125), "భక్తులు ఏమౌతుందను కుంటే సీత రాముడికి అదే అవుతుంది" (రా.సీ.ఏ.పు:131) అని ముగించారు.

జానపదత్వ లక్షణాలతో సీతారాముల కథను జనరంజకం చేసి, ఆయా కాలాల్లో ఉన్న స్త్రీ పురుష సంబంధాలను ఆరుద్ర పరి శోధ నాత్మకంగా వివరించారు.

## 6.3.1.4. వావివరసలు – సామాజిక విశ్లేషణ:

ఆరుద్ర అష్టాదశపురాణాలనుండి, జైన, బౌద్ధ కాలాలనాటి వరకూ భారత దేశంలో స్త్రీ పురుషుల మధ్య కొనసాగిన లైంగిక సంబంధాలను సీతా రాముడు, లక్ష్మణుడు, హనుమంతుడు, మండోదరి, లక్ష్మి వంటి పాత్రలద్వారా విశదీకరించారు. అయా దేశ, కాల పరిస్థితులను బట్టి, సంస్కృతీ సంప్రదాయాలను బట్టి లైంగిక సంబంధాలు ఎలా మారుతుంటాయో ఈ గ్రంథంలో చర్చించటం కన్పిస్తుంది. ఒకప్పుడు అతిథిగా వచ్చిన వారిని అన్ని విధాలా సంతృప్తి పరచడానికి, చివరికి భార్యనుకూడా ఇవ్వడానికి ప్రయత్నించే పరిస్థితిని మ లేషియాలో మండోధరి కథ లో దశరథుడు పరిపాలిస్తున్న మందూరపురికి వెళ్ళడం, శాస్త్రో క్తమైన ఆతిథ్యసేవలో భాగంగా రావణుడు తనకు మండోధరిని ఇమ్మని అడగడం, కాదనలేక దశరథుడు ఇవ్వడం, మండోధరికి ఇష్టంలేకపోవడంతో ఆమె తన చర్మంనుంచి ఒక ఛాయా మండోధరిని సృష్టించడం (రా.సీ.ఏ.పు:29) వంటి వన్నా ఆనాటి సమాజంలో లైంగిక సంబంధాల్లో వస్తున్న మార్పుల్ని సూచిస్తున్నాయని చెప్పుకోవచ్చు. ఇంకా ఆరుద్ర మాటల్లోనే ఈ లైంగిక సంబంధాల సామాజిక, చారిత్రిక పరిస్థితుల వ్యాఖ్యానం తెలుసుకోవచ్చు. పితృ కన్యలను వివాహమాడే అత్యంత ప్రాచీనమైన ఆచారం ఈజిప్టు దేశాలలో, ఏకోదరులైన అన్నా చెల్లెళ్ళు పెళ్ళి చేసుకోవడంలోనే కన్పిస్తుందనీ, వేద కాలంలో కూడా పితృ కన్యల వివాహాలకు సాక్ష్యాలున్నాయి. యమ, యమి ఏకోదరుల కామ సంబంధంగల జంట... యమి తన సంతానం కోసం తన అన్నతోనే లైంగికంగా కలవాలని భావిస్తుంది. (రా.సీ.ఏ.పు:128) ఇది ఋగ్వేదంలో దశమ మండలం, ప్రథమానువాదం, పదవ సూత్రంలోని పధ్నాలుగు ఋక్కులూ 'యమ– యమీ' సంవాదానికి చెందినవేనని, ఆయితే, యముడు అది అక్రమ సంబంధం అని వారించడం, రాగల యుగాలలో తోడపుట్టు పడుచులు సోదరుణ్ణే కాక, అన్యులను భర్తగా వరించగలరని

చెప్తాడు (రా.సీ.ఏ.పు: 128) ఇలా అనడంద్వారా లైంగిక సంబంధాల్లో వచ్చిన మార్పులు తెలుస్తున్నాయి. ఆస్తి వారసత్వ విషయాల్ని తెలిపే అంశంకూడా, 'పేరుతెనియని రాజు జాతక కథ' లో ఉంది.

## 6.3.1.5. మౌఖిక- లిఖితవాఙ్మయంలో రామకథలు :

'రాముడికి సీత ఏమవుతుంది?' గ్రంథం ఆరుద్ర, లోకంలో ప్రచారం లో ఉన్న కథ ల్ని, లిఖితరూపంలో ఉన్న కథల్ని స్వీకరించి, తనదైన దృష్టిపథంతో లోకానికి అందించారు. జానపద కథల రూపంలో జాతరల సమయాల్లోనూ, (రా.సీ.ఏ.పు:43) తోలు బొమ్మలాటలలోనూ (రా.సీ.ఏ.పు:23) జానపద వాఙ్మయంలోని (రా.సీ.ఏ.పు:88) కథల్ని, లిఖిత రామాయణాల్ని పరిశీలించి, ఈ పరిశోధన కొనసాగించడం వల్ల శాస్త్రీయత చేకూరడానికి, ప్రజలలో దైవస్వరూపిణిగా, అవతారంగా కొలుస్తున్న సీతాదేవి ని రాముడికి చెల్లెలిగా, భార్యగా వివరించినా, పాఠకులు ఆదరించగలిగారు. జైన, బౌద్ధవాఙ్మయాలవారు ఉన్నది ఉన్నట్లు చెప్పారనే వాటికీ కొంతవరకూ ఆధారాల్ని చూపడం కూడా ఆరుద్ర లోగల పరిశోధనా దృష్టి గోచరమవుతుంది.

మొత్తం మీద లిఖిత ఆధారాలను స్వీకరించినా, మౌఖిక కథలకు ప్రాచుర్యం కల్పించి, కేవలం వాల్మీకి రామాయణం లో పేర్కొన్నట్లే కథ ఉండాలనేమీ లేదనీ, దేశ,కాలమాన పరిస్థితులను బట్టి సీతారామ కథ ను తమకు అనుకూలంగా మార్చుకుంటారనడం ద్వారా దీన్ని మరింత జనరంజకత్వం చేశారు.

## 6.3.1.6. లిఖిత వాఙ్మయంలో వాస్తవ వక్రీకరణ:

సీతరాముల కథను పరిశీలిస్తూ ఆరుద్ర 'మన భారతదేశంలో, మన ఆచార వ్యావహారాలకు, నైతిక విలువలకు అనుకూలంగా పురాణాలను దిద్దేయడం మన మానసిక దౌర్బల్యాన్ని సూచిస్తుందనీ (రా.సీ.ఏ.పు:13) బుద్ధుని కాలానికి పితృ కన్యలతో పెళ్ళి అనే ఆచారం అడుగంటిందనీ, అయినా ప్రాచీన గాథను మార్చకుండా బౌద్ధులు కథనం చేశారంటే వాళ్ళ సత్యనిరతిని మెచ్చుకోవాలన్నారు (రా.సీ.ఏ.పు:13). ఈ సందర్భంలో ఒక సందేహం రావడానికి ఆవకాశం ఉంది. ఆయా కాలపరిస్థితులను బట్టి సీతారామ సంబంధాలు మార్చుకున్నారనే అభిప్రాయాన్ని వ్యక్తం చేసిన ఆరుద్ర ఈ విధంగా వ్యాఖ్యానించడంలో ఆంతర్యమేమిటని? కానీ, ఆనాటి సమాజంలోని ఆచారాల్ని నేడు తెలుసుకోవడం వల్ల చిన్నతన మేమీరాదనీ, చరిత్ర గతిలో వచ్చిన పరిణామాలని భావించగడమే జరుగుతుందనీ, కానీ వ్యాఖ్యాతలు, పరిష్కర్తలు మార్పులు చేయడం సరైంది కాదని, ఋగ్వేదం (రా.సీ.ఏ.పు:122) దేవీభాగవతం, (రా.సీ.ఏ.పు:112,115) పురాణాలలోని కథల్నీ (రా.సీ.ఏ.పు:94) మారవ రాసిన మార్కెండేయ పురాణాన్ని ఉదాహరించి, చరిత్ర ను మార్చినా, ఏదొక ఆధారంతో బయటపడుతుందని ఆరుద్ర నిరూపించారు.

## 6.3.1.7. రామాయణాల తులనాత్మక పరిశీలన:

ఆరుద్ర వివిధ దేశాల్లో మౌఖిక, లిఖితరూపంలో ప్రచారంలో ఉన్న రామాయణాల్ని ఇతివృత్త ఆధారం కొంత పరిశీలన చేశారు. స్థూల ప్రపంచాన్ని సూక్ష్మీ కరించుకోవడానికి మానవ సంబంధాలను

విస్తృత పరుచుకోవడానికి తులనాత్మక దృష్టి అవసరం. జీవితం పట్ల సాహిత్యం పట్ల గల సంకుచిత భావాలను వదులుకోవడానికి ఈ దృష్టి తోడ్పడుతుంది[15] అందుచేత, తులనాత్మక పరిశీలన చాలా అవసరం. ఆరుద్ర తన పరిశీలనను కేవలం ఒక భాషకో, ఒకదేశానికో పరిమితం చేయకుండా, వివిధ భాషలు, దేశాలలో గల రామాయణ కథలను తలనాత్మక పరిశీలన చేసి రాముడికి సీత ఏమవుతుందో వివరించడానికి ప్రయత్నించారు. వాల్మీకి రామాయణం, అద్భుతరామాయణం, అధ్యాత్మరామాయణం, ఆనందరామాయణం వంటి వాటినే కాకుండా జైన, బౌద్ధ రామకథల్ని, ఇతర భాషలలోని ఇతర దేశాలలోని రామాయణాన్ని కూడా పరిశీలించారు. వి.రాఘవన్ వంటి గొప్ప పండితులు వివిధ దేశాలలోని రామాయణాలను, మనదేశంలోని రామాయణాలను తులనాత్మకంగా పరిశీలించి,"*The Greater Ramayana, The Ramayana in Greater India*" వంటి గ్రంథాలను ప్రచురించారు. వీటిని ఆరుద్ర పరిశీలించి, '*ఎందరెందరో విద్వద్వరేణ్యుల పరిశోధనా ఫలితాలను, ఉడతా భక్తిగా నా పరిశోధనా ఫలితాలను మేళవించి, వివిధదేశాల రామాయణాది విశేషాలను వ్యాసపరంపరగా పాఠకులకు అందించ దలిచాను. ఇది రామాయణ చరిత్రలో సత్య నిర్ణయానికి దోహదకారి కావాలన్న ఆశయంతో ఈ గ్రంథాన్ని రాశాను* (రా.సీ.ఏ.పు:5) అని ప్రకటించుకొన్నారు.

తులనాత్మక పరిశీలన ద్వారా ఆరుద్ర చెప్పిన అంశాలను కింది విధంగా వివరించ వచ్చు.

(i) వాణిజ్య సంబంధాల వల్ల రామకథ ఇతరదేశాలలోనూ వ్యాపించింది (రా.సీ.ఏ.పు:3)

(ii) దేశ,కాల మాన పరిస్థితులను బట్టి పాత్రలపేర్లు, కథ మార్పుకి గురయ్యింది.

(iii) "వైదికుల్లాగే బౌద్ధులు, జైనులూకూడా రామాయణాన్ని ఉపయోగించుకున్నారు. బుద్ధుణ్ణి వైదికులు దశావతారాల్లో కలుపుకొంటే, రాముణ్ణి బౌద్ధులు బుద్ధుడి పూర్వజన్మలో ఒక జన్మగా చెప్పుకున్నారు" (రా.సీ.ఏ.పు:3)

(iv) జైన కథలనే శైవ శాక్త వైష్ణవ ప్రాధాన్యాలకు అనువుగా మలచు కొంటూ వైదికులు మన భారత దేశంలోనే సంస్కృతంలో వాల్మీకేతర రామాయణాలను రచించక తప్పకనే, కొత్త కొత్త రామాయణాల పుట్టుకకు దారితీశాయి (రా.సీ.ఏ.పు:34)

(v) జైన కథల ప్రాచుర్యంతో వాల్మీకి రామాయణంలోనే కొన్ని ఘట్టాల్ని చేర్చుకుంటే, ఇతర దేశాల రామాయణాల్లో ఎన్నో విడ్డూరాలు వచ్చిచే రడంలో ఆశ్చర్యంలేదనీ, అందుకనే రామాయణాల్లో వివిధ మార్పులు సంతరించుకున్నాయి. (రా.సీ.ఏ.పు:35)

(vi) వివిధ దేశ, భాషల రామాయణాలలో గల పాత్రల మార్పులు, సంబంధ బాంధవ్యాల్ని గురించిచెప్తూ 'బౌద్ధ రామాయణంలో రాముడికి సీత చెల్లెలు, ఒక్క చెల్లెలు మాత్రమే కాదు. పెళ్ళాం కూడా! ఖోటాన్ రామాయణంలో రామ లక్ష్మణుల ఇద్దరికీ భార్య, లావోస్ రామాయణంలో హనుమంతుడు రాముని కొడుకు. మలేషియా రామాయణంలో మండోదరి దశరథుని పెద్ద భార్య. కైకేయి స్థానంలో ఉన్న బాల్యాదారి ఉంపుడుకత్తె మాత్రమే. దశరథుని కొడుకు రావణాసురుని పుత్రికను పెళ్ళాడి రావణుని చంపుతాడు. ఆ పుత్రిక పుత్రకామేష్టిలో పవిత్రమైన ఒక అన్నం ముద్ద

వల్లపుట్టినదే. విడ్డూరాలలాగా కనబడే ఈ విభిన్న రామాయణాంశాలన్ని శ్రద్ధగా పరిశీలిస్తేనే తెలుస్తుందన్నారు (రా.సీ.ఏ.పు:4).

(vii) జానపదుల్లో విశేషప్రచారంలో ఉన్న రామాయణ సంఘటనల్లో సీతమ్మ *పటం గీయటం* ఒకటి. సీతాదేవి రావణుని చిత్రపటం గీయడం, దాన్ని చూసి రాముడు సీతను అనుమానించి అడవులకు పంపించాడనేది జానపదస్త్రీలు పాడుకొనే రామాయణాల్లో ఒక చక్కని సంఘటన. దీన్ని శ్వేతాంబర జైన రామాయణంలో సీత, ఆమె సవతులు కోరడం వల్ల '*రావణుని పటం*' గీస్తుంది. ఇదే స్త్రీల రామాయణాల్లో మార్పులు చేసుకొందంటారు ఆరుద్ర (రా.సీ.ఏ.పు:91) తెలుగు రాముడు ఏకపత్నీ వ్రతుడు కనుక సవతుల స్థానంలో శూర్పణక వచ్చింది. ఈ మార్పులు దూర ప్రాచ్యానికీ పాకింది. అలా ఖండాంతరాలకు వెళ్ళడంలో తెలుగు మార్పు మరొకసారి మార్పు చెందింది. థాయ్‌లాండ్ లోని ఒక రామకథలో శూర్పణక కాక, ఆమెకూతురు '**అద్దుల్**' అనే రాక్షస కన్య సీత చేత బొమ్మగీయించి పగ తీర్చుకొంటుంది. లంక రామాయణంలో ఉన్న సీతచేత, కంబోడియా రామకథలో యక్షిణివచ్చి, మలేషియా రామకథలో కైకేయి కూతురు కుకువా, బెంగాలీలోని చంద్రవతి రామాయణంలో కుకువా దేవి వల్ల సీతాదేవి రావణుని బొమ్మ (చిత్రపటం) గీస్తుందట! (రా.సీ.ఏ.పు:92).

రామాయణాలను తులనాత్మకంగా పరిశీలిస్తే ఇతి వృత్తం, పాత్రలు, తత్వంలో అనేక చేర్పులు మార్పులు కన్పిస్తుంటాయనీ, అవన్నీ ఆయా ప్రభావాలఫలితంగా జరిగినవేనంటారు ఆరుద్ర.

## 6.3.1.8. ప్రామాణిక (మూల) రామాయణం?

ఆరుద్ర ఎక్కడా ప్రామాణిక అనే పదాన్ని ప్రయోగించక పోయినా, "*మూలమనే*" పదాన్ని ఉపయోగించారు (రా.సీ.ఏ.పు:1)

వాల్మీకి రామాయణం రాసే నాటికే రామకథ ప్రచారంలో ఉందనీ, ప్రజలలో అప్పటికే ప్రచారంలో ఉండగా, నారదుడు దాన్ని విని, ఉత్తమ పురుషునికి ఉండదగిన గుణాలన్ని ఉన్న వాడు రాముడని వాల్మీకి చెప్పటంతో రామాయణం ఆవిర్భవించిందంటారు.(రా.సీ.ఏ.పు:1) దీన్ని కూడా వివిధ ప్రభావాలకులోనై వైదికులు మార్పులు చేసినా, ఉన్నంతలో వాల్మీకి రామాయణాన్నే మూల రామాయణమని జనులు విశ్వసిస్తారన్నారు (రా.సీ.ఏ.పు:1)

## 6.3.1.9. సీత కేంద్రంగా కొనసాగిన పరిశోధన:

**రాముడికి సీత ఏమవుతుంది?** గ్రంథంలో ఆరుద్ర వివిధాంశాలును పరిశోధనలో స్పర్శించినా, ప్రధాన లక్ష్యం మాత్రం సీత పాత్రపైనే కేంద్రీకరించి పరిశోధన కొనసాగించారు.

1. వివిధ రామకథలు, రామాయణాలను, పౌరాణిక, ఇతిహాసాలను, పరిశీంచిన తర్వాత రాముడికి సీత భార్య అవుతుందనీ, అయితే భక్తులు ఏమౌతుందంటే అది అవుతుందన్నారు. ఇది ఎటూతేల్చని అంశంగా తేల్చడానికి వీలులేదు. ఏ జాతి అయినా ఆటవిక దశనుంచి పశుపాలన దశలోనికి వచ్చి,

అక్కడ నుంచి వ్యావసాయిక దశలోనికి ప్రవేశించినప్పుడు మాతృస్వామ్యం బలపడుతుంది. జాతికి స్త్రీ దేవతలే ఆరాధ్య దైవాలు అవుతారు. విత్తనంలోంచి మొక్కరావడం, అది ఎదగడం మొదలైన పరిణామ దశలను శ్రద్ధగా గమనించిన మానవుడికి సర్వజీవులను నడిపించే శక్తి స్త్రీ స్వరూపిణీ అనిస్ఫురిస్తుంది. (రా.సీ.ఏ.పు:116) అనిచెప్పి, స్త్రీని ప్రకృతి ప్రతిరూపం అని అభివర్ణించారు. దేవీ భాగవతం ప్రకారం ఈ మె పంచవిధ రూపిణి అయిన ప్రకృతి (రా.సీ.ఏ.పు:112). కనుకనే భక్తులు భావించినట్లు అవుతుందన్నారు.

విశేషమేమటంటే, వివిధ దేశాల్లో ఉన్న వాటిని ఆరుద్ర రామకథలు అన్నారు గాని రామాయణం లో కథలనలేదు. ఆ రామకథల్లో వివిధ పేర్లతో ఉన్న స్త్రీని సీతే అనీ చెప్పలేదు. ఇలా భావించే అవకాశం ఉందనీ, జానపదుల్లో 'కల్పితం' అనే లక్షణం ఎలా ఉంటుందో, అలాగే వివిధ రకాలుగా ఆ పాత్రని సృష్టించుకున్నారని ఆరుద్ర అనడం ద్వారా సీత కి రాముడికి మధ్యగల భార్యా భర్తలనే సంబంధంలో ఎలాంటి అనుమానం రాదని చెప్పవచ్చు.

## 6.4. జనరంజక పరిశోధన:

రామాయణాల్లోను, రామకథల్లోను ఉన్న సీత, సీతపోలిక పాత్రల్ని నవ దృక్కోణాలతో నవ్యదృష్టిని ప్రదర్శించారు ఆరుద్ర. ఈ దృష్టిని ప్రదర్శించడానికి జనరంజక పరిశోధనను మాధ్యమంగా స్వీకరించారు. జనరంజకత్వం కేవల శిష్టసాహిత్య వివరణల కంటే, జానపద సాహిత్యాన్ని ఆశ్రయించటం వల్ల మరింత వేగవంతమవుతుందని భావించి ఉండవచ్చని దీని వల్ల అర్థమవుతుంది.

సీతారాములకి చెందిన ఈ కథలో జానపదలక్షణాలే ఎక్కువగా కలిగి ఉండటం వల్ల శాస్త్రీయ, హేతబద్ధ నిరూపణలకు ప్రయత్నించినా, పరిశోధన జానపద సాహిత్య విభాగంలోనే చేరుతుంది.

ఈ సందర్భంగా జానపద సాహిత్యంలో, రామాయణంలోని కథల్ని వారి ప్రాంతాలకు, కులాలకు అనుకూలంగా ఎలా మార్చుకున్నారో గమనించే మలయవాసిని *'ఆంధ్ర జానపద సాహిత్యము రామాయణము'* అన్న తన పరిశోధనాగ్రంథంలో *'రామకథ భారతదేశమునందన్ని ప్రాంతము లందును పరిచయమ్మైయున్నది. ఆ కథను అందలిపాత్రలను ఆయా ప్రాంతములకు నప్పు పడునట్లు జానపదకవులు మలిచిరి'* అని తెల్పి, *'జానపద కవులు యాథావాల్మీకమునకె యవస్థ పడిన వారు కాదు. రామాయణ కథానరణి తమ ప్రాంత సంప్రదాయములకు మార్చియు, రామాయణ పాత్రలను తమ ప్రాంత వ్యక్తుల తీరులకు అనుసంధించియు స్వతంత్ర కథనమును త్రొక్కిరి'* అని వివరించారు[16]. వెల్చేరు నారా యణరావు ఈ గ్రంథానికి "మిత్రవాక్యం *"రాస్తూ రామాయణ కథావ్యవస్థను ఉపయోగించుకొని భారతదేశంలో, ఆమాటకొస్తే దక్షిణాఆసియా అంతటా అనేకులు అనేక రకాల సంగతులు చెప్పుకున్నారు. అందమైన కథగా అట్టేపెట్టి ఆనందించకుండా, రామాయణ కథా వ్యవస్థని ఒక భాషా వ్యవస్థగా ఎదిగించారు దక్షణాసియా ప్రజలు. ఇలా ఎదిగిన కథలు ప్రపంచంలో ఎన్నో లేవు*[17] అనడం కూడా రామాయణ కథ జానపద సాహిత్యంలో ఎంత ప్రాచుర్యంలో ఉండి, ఎన్ని మార్పులకి లోనయ్యిందో స్పష్టమవుతుంది.

జానపద సాహిత్యం సాధారణంగా లిఖితరూపంలోనే ఉండాలనేమీలేదు. అలిఖితంగా అంటే మౌఖిక రూపంలోను ప్రచారంలో ఉంటుంది. వాగ్రూపంలో ఒక వ్యక్తి నుంచి మరొకవ్యక్తికీ, ఒక తరం నుంచి మరోతరానికీ ఒక ప్రాంతం నుంచి మరోప్రాంతానికీ, ఒక దేశం నుంచి మరో దేశానికీ, అనుస్యూతంగా ప్రచారం పొందుతుంది. ఆచారాలు, సంప్రదాయాలను అనుసరించి కూడా వారి మనోభిప్రాయాలను బట్టి నవనవోన్మేషంగా మారుతుంది. గ్రామీణ ప్రజల, సామాన్య ప్రజల ఆలోచనలు, ఆశలు, ఆశయాలు, సుఖదుఃఖాదులు వంటివి కూడా కథలో అలవోకగా చేరిపోతుంటాయి. ఆయాకాలాల్లో జీవించే మానవ జీవనదృక్పథాలు స్వచ్ఛంగా తెలుసు కోవాలంటే జానపద సాహిత్యం చాలా తోడ్పడుతుంది. దీనివల్ల సామాజిక, చారిత్రక, ఆర్థిక, ఆచారవ్యవహారాలు ఆయాకాలాల్లో ఎలా ఉండడానికి ఆవకాశం ఉందో తెలుస్తుంది.

ఆరుద్ర రాసిన '*రాముడికి సీత ఏమవుతుంది?* లో వాల్మీకి రామాయణం నాటికే ప్రజలలో ప్రచారంలో ఉన్న కథను నారదుడు చెప్పగా, వాల్మీకి రాశాడు. వ్యాపారకారణాలవల్ల భారత దేశంనుండి ఇతర దేశాలకు రామకథలు ఎగుమతి అయ్యాయనడంలో మౌఖిక ప్రచారం అనే లక్షణం ఇమిడిఉంది. వివిధ ప్రాంతాలు, భాషల్లో ఉన్న రామాయణాల్లో కథల మార్పులు, పాత్రల మార్పులు, వావివరసలను బట్టి నిర్దిష్ట కథ గా ఉండక పోవటమనేవి జానపద సాహిత్య లక్షణాలుగా తెలుస్తున్నాయి. ఇంత ప్రసిద్ధమైన ఈ రచన గురించి ఇండియన్ ఎక్స్‌ప్రెస్ ఆంగ్ల దినపత్రికలో AS Raman రాస్తూ *'Arudra's most significant research work is 'Ramuniki sita Emautndi ? a serious, indept sociological enquiry into the problems of kinship affecting Rama and Sita, based on a study of various versions of the Ramayana, i.e.Buddhist, Jain, Hindu, South-East Asian etc."* అన్నారు. (ఆ.అ.సం.-పు:190)

హెచ్.ఎస్. బ్రహ్మానంద 'శిష్టసాహిత్యం'లో జానపద ధోరణుల్ని వివరిస్తూ రామాయణానికి వాల్మీకి ఒక రూపం ఇవ్వక ముందే దానికి ప్రజలలో నానారూపాలతో ప్రచారం ఉంది అన్నారు[18].

భిన్న రూపాలలో భిన్న శాస్త్ర నేపథ్యాల్లోకి ప్రవేశించగల శక్తి జానపధకథకి ఉంది. ఈ శక్తి వల్లనే 'రామాయణం' జనశ్రుతిలో అనేక కథనాల్ని అందించేటట్లు చేయగలిగింది.

'తెలుగు సాహిత్యంలో రామకథ' గురించి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి బహుమతి పొందిన పండా శమంతకమణి రచించిన గ్రంథంలో కూడా వివిధ రామాయణాల్లో సీత రాములకథల్ని గమనించవచ్చు.[19]

ఇలా వివిధ కోణాలనుండి పరిశీలించినప్పుడు, ఆరుద్ర రామాయాణాలపై మంచి పరిశోధానాంశాలను తెలుగు ప్రజలకు జనరంజకంగా అందించారని తెలుస్తుంది. రూపాలలో

అధ్యాయం–6

# సూచికలు (References)


1. బి.రామరాజు, *తెలుగు జానపదగేయ సాహిత్యము*, జానపద విజ్ఞాన ప్రచురణలు : హైదరాబాద్, 1978, పు:లా

2. ఆర్వీయస్. సుందరం, *ఆంధ్రుల జానపద విజ్ఞానం*, తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణః హైదరాబాద్ (ప.ము:1983, ద్వి.ము: 1992,పు:3.

3. ఎం.కె.దేవకి, *తెలుగు నాట జానపద వైద్యవిధానాలు*, పండు వెన్నెల ప్రచురణలు : అనంతపురం, 1999, పు:16.

4. ఎస్.శరత్ జ్యోత్స్నారాణి, *హైదరాబాద్, రంగారెడ్డి జిల్లాల బతుకమ్మ పాటలు సామాజికాంశాల పరిశీలన*, స్వీయ ప్రచురణ: 2001 పు:10.

5. పైదే.పు:11.

6. బి.రామరాజు, *తెలుగు జానపద గేయసాహిత్యము*, జానపద విజ్ఞాన ప్రచురణలు : హైదరాబాదు 1978, ప్ర :

7. ఆర్వీయస్ సుందరం, *ఆంధ్రుల జానపద విజ్ఞానం* పు:1

8. పైదే.పు:4

9. ఎల్.సంగయ్య, *ఆరుద్ర జీవితం–రచనలు సమగ్ర పరిశీలన*, మాధురీ ప్రచురణలుః నందిగామః 1991:పు:446

10. కసిరెడ్డి, *జానపద కళాదర్శనం*. జానపద సాహిత్యపరిషత్ ప్రచురణ : హైదరాబాద్, 1997.పు:170.

11. కేతు విశ్వనాథరెడ్డి, *దృష్టి (సాహిత్యవ్యాసాలు)*, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ః హైదరాబాద్, 1998. పు:5.

12. జయధీర్ తిరుమల రావు, *తెలంగాణా రైతాంగ పోరాటం* ప్రజా సాహిత్యం, సాహితీ సర్కిల్ ప్రచురణ : హైదరాబాద్, (ప.ము.1988), ద్వి.ము.1995,పు:1

13. భరతుడు, *నాట్యశాస్త్రము* (అను) పోణంగి శ్రీరామ అప్పారావు, నాట్యమాల ప్రచురణ : హైదరాబాదు, (ప.ము. విళంబి (1959) పుష్యము.,ద్వి.ము, దుందుభి (1982) పుష్యము. పు:6.

14. పైదే.పు83–110.

15. రాచపాళెం చంద్రశేఖర రెడ్డి, హెచ్. ఎస్. బ్రహ్మానంద, *సాహిత్య పరిశోధన సూత్రాలు*, పు.54.

16. మలయవాసిని, *ఆంధ్ర జానపద సాహిత్యము–రామాయణము*, స్వీయ ప్రచురణ : విశాఖపట్టణము, 1986, పు.1.

17. వెల్చేరు నారాయణరావు, *మిత్రవాక్యం, (పీ), మలయవాసిని– ఆంధ్ర జానపద సాహిత్యము– రామాయణము*– పు.xi

18. హెచ్. ఎస్. బ్రహ్మానంద, *శిష్ట సాహిత్యంలో జానపద ధోరణులు*, అక్షర ప్రసార ప్రచురణలు : అనంతపురం, 1989, పు.85.

19. పండా శమంతకమణి, *తెలుగు సాహిత్యములో రామకథ*, ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రచురణ : హైదరాబాదు, 1972.

# పరిశోధకుడుగా ఆరుద్ర

పరిశోధకుడుగా వివిధ దృక్కోణాల్లో దర్శించ గలిగిన అధ్యాయమిది. వివిధ పరిశోధన పద్ధతులను తన పరిశోధనకు వాడుకున్న విధానం కూడా ఈ అధ్యాయంలో ప్రధానంగా తెలుస్తుంది. అయితే సిద్ధాంత గ్రంథం అంతా అవగతం చేసుకున్నపుడే సిద్ధాంత శీర్షిక పరిశోధకుడుగా ఆరుద్ర అర్థవంతమవుతుంది. అంతేగానీ, కేవలం ఈ శీర్షిక గల ఈ అధ్యాయమే దీన్ని ప్రతిబింబిస్తున్నట్లు కాదని గుర్తిస్తూ దీన్ని గమనించవచ్చు.

## 7.1. ఆరుద్ర పరిశోధనా దృక్పథం:

పరిశోధన అంటేనే ఏదొక విషయాన్ని స్పష్టంగా తెలిసికోవటం కోసం ప్రారంభమవుతుంది. అటువంటి వాటిలో సాహిత్య పరిశోధనలో కవి లేదా కావ్య వస్తువుల్ని అనేక కోణాలనుంచి పరిశోధించి, తనెందుకు పరిశోధనచేశాడో, శోధించగా "అది" బయటపడటం వల్ల, తన పరిశోధన వల్ల తేలిన ఫలితాంశం, తన ఊహించుకున్న దానికంటే భిన్నంగా గాని, అనుకూలంగా గాని బయట పడినపుడు సత్యం తెలిసికోగలిగినందుకు, తన కున్న భ్రమలు పోయినందుకు పరిశోధకుడు నిజమైన ఆనందానికి గురవుతుంటాడు. తాను శోధించిన ఫలితాంశాల్ని తర్వాత తరంవారికి భద్రపరిచి అందించ వచ్చు. వాటితో, ఆ తరం వాళ్ళు అంగీకరించడమో, పూర్వపక్షంచేయాడమో మరింత ముందుకి పోవడానికి మార్గాన్ని సరళతరం చేశాడని భావించడమో, తప్పుడు ఫలితాలు వచ్చాయని, మరోకోణంలో పరిశోధించడానికో కూడా ఆ పరిశోధన ఫలితాంశాలు ప్రేరణలుగా నిలవవచ్చు. 'ఒక ప్రమాణం ఆధారంగా, ఒక దృక్పథం నేపథ్యంగా విశ్లేషించి సిద్ధాంత ప్రతిపాదనలు చేసే సాహిత్య పరిశోధన'[1] లో సమాజానికీ, సాహిత్యానికీ మధ్యగల సంబంధాలను విశ్లేషించుకొంటూ, 'రచయిత అనుసరించిన శిల్పాన్ని, అందులో కన్పించే ప్రాపంచిక దృక్పథాన్ని విడదీసి చూపుతుంది'[2] కనుక "ఆత్మీయతా గుణం" కూడా సాహిత్య పరిశోధనల్లో ఉండటం వల్ల[3], కొందరిపై లేదా కొన్ని గ్రంథాలపై ప్రత్యేక దృష్టిని నిలిపి పరిశోధించటం జరుగుతుంటుంది. అయితే, ఈ సందర్భంగా గమనించ వలసిందేమిటంటే కొందరిపైన, లేదా కొన్ని గ్రంథాలపైనా అనేది, వారి లేదా వాటి ప్రభావం సమాజం మీద చూపిన ప్రభావాన్ని బట్టి కూడా ఆ ఆసక్తి మొదలవుతుంది. ఇదే తాత్త్విక నేపథ్యానికి సంబంధించిన అంశం, దీన్ని అనుసరించే పరిశోధకుడిలో దృక్పథాన్ని అర్థంచేసుకోవాలి. 'తాత్త్విక నేపథ్యం, ఒక రచన మీద, రచయిత మీద ఏర్పరుచు కొనేది కాదు. ఈ సమాజం మీద ప్రపంచం మీద ఏర్పరుచుకొనేది. సమాజం మీద అవగాహన లేకుండా దేనినీ పరిశీలించలేం. తాత్త్విక నేపథ్యం అంటే ఒక ఆలోచనా విధానం, ఒక ప్రాపంచిక దృక్పథం[4]గా అర్థం చేసుకోవాల్సి ఉంది. తెలుగు సాహిత్యంలో వేమన, గురజాడ, శ్రీ శ్రీ వంటి వారు సమాజం పట్ల ఒక బాధ్యతాయుతమైన పద్ధతిలో రచనలు కొనసాగించారు. వీరిని పరిశీలించేటప్పుడు ఒక *ప్రాపంచిక దృక్పథం* ఉండాలి. ప్రాపంచిక

దృక్పథం సమాజ అవగాహనకు సంబంధించింది. అప్పుడే ఆ కవులు ఆశించిన లక్ష్యాన్ని పరిశోధకుడు గుర్తించ గలుగుతాడు.

సమాజంలో కొన్ని దురాచారాలు ప్రబలిపోతున్నప్పుడు, ఆ సమాజాన్ని సరైన మార్గంలోకి పయనించేట్లు చేయడానికి తమ భావజాలాన్ని వినియోగించడానికి ఈ ప్రాపంచిక దృక్పథంతో ప్రయత్నించిన వారున్నారు. సరిగ్గా ఇలాంటి భావాల పట్ల ఆకర్షితులైన వారెంతో మంది వీరి మార్గంలోనే రచనల్ని కొనసాగించారు. అలాగే వీరి భావాల్ని పరిశీలించి, పరిశోధనాత్మకంగా వెలుగులోకి తేవాలనుకున్న వారూ ఉన్నారు. ప్రగతి శీల భావాల్ని పరిశీలించడానికి ప్రగతిశీల దృక్పథాన్ని అనుసరిస్తేనే అది శాస్త్రీయ దృక్పథమవుతుంది. ఆరుద్ర తన పరిశోధనలో శాస్త్రీయ దృక్పథాన్ని అనుసరించారు. అయితే, అది కేవలం పరిశోధనలోనే అయితే దృక్పథం ప్రభావం ఎక్కువైపోతుంది కనుక, విమర్శను తన పరిశోధనలో అంతర్వాహినిగా చేసుకుని, విమర్శలో ఎక్కువగా మార్క్సిస్టు దృక్పథాన్ని అనుసరించారు. "బాహ్య ప్రపంచాన్ని మార్చడానికి అన్ని శాస్త్రాల పరిజ్ఞానం ఎలాగైతే దోహదపడిందో అదే విధంగా సామాజికాధ్యయనంలో శాస్త్రీయ దృక్పథం ఫలితంగా లభించిన విజ్ఞానం సమాజాన్ని మార్చేందుకు వినియోగ పడగలదు. మరొక విషయం కూడా స్పష్టంకావలసి వుంది. అదేమిటంటే సామాజిక చలనాన్ని నియంత్రించే సాధారణ నియమాలు కూడా బాహ్య జగత్తుకు చెందిన నియమాలవంటివే. మానవులకు, వస్తువులకు వర్తించే విశ్వజనీనమైన యీ నియమాలను వివరించే దానిని మార్క్సిస్టు తత్త్వశాస్త్రము లేదా ప్రాపంచిక దృక్పథం అంటారు[5]. ఈ దృక్పథం ఆరుద్ర రచనల్లో ఎలా వ్యక్తమయ్యిందో విమర్శనా దృక్పథం ప్రత్యేక అధ్యయనంలో తెలిసింది. ఇప్పుడు, ఆరుద్ర పరిశోధనలో పరిశోధకుడుగా ఏపరిశోధనా పద్ధతుల్ని పాటిస్తూ, పరిశోధనా దృక్పథాన్ని కొనసాగించారో గమనించడం జరుగుతుంది.

తెలుగు సాహిత్యం లో పరిశోధకుడుగా ఆరుద్ర ప్రసిద్ధి వహించడానికి కారణమైనదానిగా చాలా మంది పేర్కొనేది సమగ్ర ఆంధ్ర సాహిత్యం (13 సంపుటాల) రచన. అయితే, చాలామంది గురజాడ, వేమన, శ్రీ శ్రీ, రామాయణం ప్రజాకళలపైనా ఆరుద్ర పరిశోధనలు చేశారన్నారు. ఆ పరిశోధన ఫలితాలేమిటో ప్రత్యేకించి వివరించడానికెవరూ ప్రయత్నం చేసినట్లు కనబడట్లేదు! కనుక ఆరుద్ర పరిశోధనను తెలుసుకొనే దిశగా ఈ పరిశోధన కొనసాగుతుంది.

'*సమగ్ర ఆంధ్ర సాహిత్యం*' లో సాహిత్య చరిత్ర రచనకు వినియోగపడే పరిశోధనా పద్ధతి కన్పిస్తుంటే, మిగిలిన రచనల్లో వివిధ పద్ధతుల్లో పరిశోధన కొనసాగింది. '*సమగ్ర ఆంధ్ర సాహిత్యం*' ప్రత్యేక అధ్యాయంలో పరిశీలించడం జరిగింది. కనుక, మిగిలిన వాటిలో పేర్కొనదగినవి తులనాత్మక పరిశోధన, (Comparative Research) కవి జీవిత పరిశోధన, (Biographical Research), గ్రంథ పరిష్కరణ పరిశోధన (Bibliographical Textual Research) జానపద విజ్ఞాన పరిశోధన (Folklore Research). వీటన్నింటిలోనూ, విమర్శనాత్మక పరిశోధన (Critical Research) ఉంటూనే రచనలన్నింటిలోనూ సృజనాత్మక పరిశోధకుడు (Creative Researcher)గా ఆరుద్ర కన్పిస్తుంటారు. ఇవన్నీ సాహిత్య పరిశోధన (Literary Research) అనే చట్రంలో (Circle) లో వివిధ భాగాలు గానే కన్పిస్తాయి.

## 7.1.1 ఆరుద్ర: తులనాత్మక–పరిశోధన:

తన పరిశోధనల్లో, చాలా విషయాల్లో ఆరుద్ర తులనాత్మక పరిశోధన పద్ధతిని అనుసరించారు. 'తులనాత్మక అధ్యయన ప్రధానలక్ష్యం భేదసాదృశ్య విశ్లేషణ, కారణాల వివేచనే గాని హెచ్చుతగ్గుల నిర్ణయం కాదు'[6]. 'భిన్న భాషలలోని విభిన్న అంశాల్ని పోల్చి చూడడం' ఒకే భాషలో భిన్నాంశాలను పోల్చి చూడడం తులనాత్మక అధ్యయనంలో ప్రధాన లక్ష్యాలు. గురజాడను, కన్యాశుల్కాలను ప్రధానంగా తులనాత్మక పరిశోధనా పద్ధతిలోనే ఆరుద్ర పరిశీలించారు. 'కన్యాశుల్కం'– తొలి ప్రతికీ, మలిప్రతికీ మధ్య గల తేడాల్ని వివరించారు. వీరేశలింగం, 'బ్రాహ్మ వివాహం' ప్రహసనంతో, గురజాడ అప్పారావు 'కన్యాశుల్కం' నాటకాన్ని తులనాత్మకంగా అధ్యయనం చేశారు. ఆరుద్ర రచించిన 'గురజాడ గురుపీఠం' లో ఈ తులనాత్మక పరిశోధనా పద్ధతిని గమనించ వచ్చు.

*(ప్రధానంగా సమాన పోలికలు, తేడాలు కలిగిన వస్తువు గల రచనల్ని లేదా భావజాలంలో, కాలంలో పోలికలు గల భిన్న కవుల/రచయితల్ని భేదసాదృశ్య విశ్లేషణల్ని చేసి, ఆయా నేపథ్యాలను, తాత్త్వికాంశాల్ని, కారణాల్ని నిరూపించడం తులనాత్మక పరిశోధనగా భావించవచ్చు).*

తులనాత్మక అధ్యయనంలో మళ్ళీ భిన్న పద్ధతులూ, విభిన్న సిద్ధాంతాలు కూడా ఉన్నాయి. తులనాత్మక పరిశోధన ఒకే భాషలోగాని, భిన్న భాషల్లో గాని, అలాగే ఒకే కాలంలో వెలువడిన రెండు గ్రంథాల్ని గురించి గాని, వేర్వేరు కాలాల్లో వచ్చిన వస్తువు (ఇతి వృత్తా)లకు సంబంధించినవి గాని అధ్యయనం చేయడానికి అవకాశం ఉంది. ఇది ముఖ్యంగా సాహిత్యంలో పోకడల్ని పోల్చడానికీ, సాంస్కృతిక విషయాల్ని, భాషా–వ్యాకరణాంశాల్ని పోల్చడానికి వివిధ దృక్పథాల్ని అనుసరిస్తున్నట్లు భీమ్ సేన్‌నిర్మల్ భావిస్తున్నారు[7] ఇంకా, సాహిత్య ధోరణుల్ని ఒక్కో కళాఖండం, గ్రంథాల రచయితల, పరస్పర ప్రభావాల మధ్య ఈ పరిశీలన జరగవచ్చునన్నారు[8] తులనాత్మక పరిశోధకుడు పరిశోధనలో ప్రసంగానుకూలమయిన వ్యాఖ్యానం, సమానత–అసమానతల నిరూపణం, ఏకరూపతనిర్దేశనం, అనే మూడు విషయాలూ ప్రధానంగా, సుస్పష్టం కావాలని పరిశోధకులు భావిస్తున్నారు[9]. వీటితో పాటు ఇతర భాషాజ్ఞానం కూడా చాలా అవసరం. దీనిలోని తన, పర భేదం ఉండకుండా నిష్పక్షపాత దృష్టి చాలా అవసరం. కాలాన్ని పరిగణనలోకి తీసుకోవడం వల్ల ఏది ముందు వచ్చిందో స్పష్టమైన నిరూపణకు అవకాశం కలుగుతుంది.

తులనాత్మక విమర్శలోనూ ఈ అంశాలనే ప్రధానంగా కేంద్రీకరించుకొని విశ్లేషణ కొనసాగినప్పటికీ, ఆకరాలు (Sources) పట్ల బాధ్యత కంటే, గుణగణాల మధ్య సమన్వయం, కావ్య విలువలే ముఖ్యమవుతాయి. కానీ, పరిశోధనలో వివిధ ఆధారాల సేకరణ (Collection) కు ప్రయత్నించి సరిపోల్చడం వల్ల తులనాత్మక పరిశోధనలో ఫలితాలు వెలువడుతుంటాయి. తులనాత్మక విమర్శకీ, పరిశోధనకీ మధ్యగల ప్రధానమైన ఈభేదాన్ని గమనించకపోతే, రెండింటినీ ఒకటే అనుకొనే అవకాశం ఉంటుంది. అయితే పరిశోధన ఫలితాల్ని విమర్శ ఉపయోగించుకోవచ్చు. అప్పుడది

విమర్శనాత్మక పరిశోధనలో చేరిపోతుంది. ఆరుద్రలో విమర్శనాత్మక పరిశోధన లక్షణాలు చాలా చోట్ల గమనించవచ్చు. ఇక, ఆరుద్ర చేసిన తులనాత్మక పరిశోధనల్ని కింది విధంగా పరిశీలించవచ్చు.

## 7.1.1.1. గురజాడ – తెలుగు రచనల ఆంతర్యం

గురజాడ అప్పారావుకి తన రచనలు చాలా వాటిని మొదట తెలుగులో రాద్దామనే ఆలోచన లేదు. డైరీలు, లేఖలూ తెలుగులోకి అనువాదం చేసుకోవలసి వచ్చింది[10]. అంతేకాదు గురజాడ తన చాల రచనల్ని ఆంగ్లంలోనే రాసుకున్నప్పుడు, 'కన్యాశుల్కం' తెలుగులోనే రాయాల్సిన ఆగత్య మేమిటనేది ఆలోచిస్తే, దానికి సమాధానం సరిగ్గా రాబట్టడానికి ఒక పరిశోధనగా చాలా మంది వివిధ ఆలోచనలు చేశారు. ఆరుద్ర దీన్ని పరిశోధనగానే భావించారు. దీనికి సంబంధించిన సామాగ్రి సేకరణలో గురజాడను సాహిత్యంలో ప్రోత్సాహించిన శంబుచంద్ర ముఖర్జీ లేఖల్నీ (గు.గు.పీ.–పు:36), కన్యాశుల్కం పీఠికనూ కె.వి రమణారెడ్డి, గురజాడ రామదాసుల వ్యాసాల్నీ, కన్యాశుల్క సమస్య పరిష్కారానికి ఆనంద గజపతి ప్రత్యేకమైన శ్రద్ధలన్నింటినీ పరిశీలించి, గురజాడ తెలుగులో రచనలు చేయడానికి గల కారణాల్ని ఆరుద్ర ఇలా చెప్పారు.

1. "విజయనగరంలో ఆనాటి మేధావులందరూ ఈ సమస్యకు (కన్యాశుల్కం) పరిష్కార మార్గాలు ఆలోచించడానికి ప్రయత్నించి వుంటారు". (గు.గు.పీ.–పు.36).
2. "డిబేటింగ్ క్లబ్బులో ఉత్తరోత్తరా కన్యాశుల్క సమస్య మీద జరిగిన చర్చ ఫలితంగా నాటక రచన చేయాలనే సంకల్పం అప్పారావు గారికి ఉంటుంది". (గు.గు.పీ.పు.37).
3. "సోషల్ రిఫార్మ్ గురించీ, స్పోకెన్ తెలుగు గురించీ తమకున్న విశ్వాసాలను ఒకే కావ్యంలో ఉద్ఘాటించారు". (గు.గు.పీ.పు.37).
4. "పాత్రోచిత భాషను వాడాలనే సంకల్పం ఆనాటి నాటక కర్తలలో లేకపోలేదు గానీ, అది ఎంతసేపూ నీచపాత్రలకు గ్రామ్యాన్ని వాడటం దాకానే పరిమితమైంది. అప్పారావుగారు కన్యాశుల్కాన్ని రచించే నాటికి వెలువడ్డ తెలుగు నాటకాల జాబితాను చూస్తేచాలు" అనిచెప్పి, వాటిని వివరించారు. (గు.గు.పీ.పు.38).

ఈ చివరిదే ఆరుద్ర పరిశోధన తెలిపే ప్రముఖ అంశంగా చెప్పవచ్చు. ఆ నాటికున్న నాటకాల్ని సేకరించడం, వాటిలో సాంఘిక సమస్యలు, వ్యవహార భాషా ప్రయోగాలు సాంఘిక చైతన్యం లేక పోవడమనేది నిరూపించే అంశం. గురజాడ తన కన్యా శుల్కం (తొలి ప్రతి) పీఠికలో సాహిత్య దృక్పథం, తెలుగు భాషలో నాటకమే రాయడానికి గల కారణాల్ని చక్కగా స్పష్టం చేశారు. "ఇటువంటి దురాచారాన్ని ఎండగట్టి, ఉన్నతమైన నైతిక ప్రమాణాలను వ్యాపింప చేయటానికి మించిన కర్తవ్యం సాహిత్యానికి మించింది (మరొకటి) లేదు. ప్రజాబాహుళ్యానికి పుస్తక పఠనం అలవాటయ్యే దాకా అలాంటి ఆరోగ్య ప్రభావవ్యాప్తికై నాటకరంగాన్ని ఆశ్రయించవలసి వుంటుంది. కన్యాశుల్కం నాటక రచనకు నన్ను ప్రేరేపించింది ఇదే. నేను ఈ నాటకాన్ని వాడుక భాషలో రాశాను. ఎందు కంటే ఇది గ్రాంథిక భాషకన్నా నాటకాలు చూసే ప్రజలకు బాగా అర్థమవుతుందనే కాక, ఇది

హాస్యరసానికి తగిన దనినా నిశ్చితాభిప్రాయం". (గు.గు.పీ.పు.18) అయితే, జి. ఎస్. రెడ్డి, గురజాడ తెలుగులో సాహిత్య రచన ప్రారంభించడానికి గల కారణాల్ని *"ఆంగ్ల రచన కేవలం ఆత్మ సుఖదాయమే కాని సామాజిక శ్రేయోదాయకం కాదని గ్రహించి అభ్యుదయ దృష్టి" గల వారు*[11] *గా భావించడం గురజాడ తెలుగు రచనా ధ్యేయాన్ని తెలియజేస్తుంది.*

## 7.1.1.2 గురజాడ "కన్యాశుల్కం" – కర్తృత్వ పరిశీలన:

ఈ శీర్షిక ఆశ్చర్యాన్ని కల్గించినట్టే, గురజాడ అప్పారావు రచించిన 'కన్యాశుల్కం' కర్తృత్వ విషయంలో చెలరేగిన చర్చ ఇరవయ్యో శతాబ్ది ఉత్తారార్థం ప్రథమ పాదంలో సాహితీ వేత్తల్లో ఆశ్చర్యాన్నే కల్గించి, వాదోపవాదాలకు దారి తీసింది. 1955మార్చి 13వ తేదీ నుండి, మే నెల మొదటివారం వరకు ఈ 'చర్చ' కొనసాగింది. ఆంధ్రప్రతికలో ప్రారంభమైనా, మిగిలిన కొన్ని పత్రికల్లోనూ ఈ విషయాలు ప్రచురించక తప్పని పరిస్థితిని సాహితీ వేత్తలు కల్గించారు. ఈ వివరాలన్ని కె.వి.రమణారెడ్డి 'మహోదయం' లోనూ, ఆరుద్ర 'గురజాడ గురు పీఠం' గ్రంథం (గు.గు.పీ.పు.131-132) లోనూ, మొదలి నాగభూషణ శర్మ సంపాదకత్వంలో వెలువడిన 'కన్యాశుల్కం-నూరేళ్ళసమాలోచనం బృహద్గ్రంథంలోను కన్పిస్తూనే ఉన్నాయి.

కన్యాశుల్కం కర్తృత్వంపై వాదోపవాదాలు రావడంతోటే బంగోరె (బండి గోపాల రెడ్డి) ఎంతో పరిశోధన, పరిశీలన, పరిశ్రమచేసి, విపుల వ్యాఖ్యాసహితంగా 1969 లో 'కన్యాశుల్కం' ప్రచురించారు. దానికి తానే పర్యవేక్షణ వహించినట్లు ఆరుద్ర ప్రకటించుకున్నారు.(గు.గు.పీ.పు.146) "కన్యాశుల్కం రచన ఎవరిది?" అనే వ్యాసం ఆంధ్రపత్రికలో మార్చి 13వ తేది 1955 న 'జయంతి కుమారస్వామి' పేరుతో అచ్చయ్యింది. దీనిలో గురజాడ కన్యాశుల్కాన్ని ఆంగ్లంలోనే రచించారనీ, కాని తెనిగించింది అప్పారావు కాదనీ, గోమఠం శ్రీనివాసాచార్యులు అనీ ఉన్న వ్యాఖ్యతో సుమారు నెలా పదిహేను రోజుల పాటు చర్చోప చర్చలు జరిగాయి[12]. ఆరుద్ర ఈ చర్చలో పాల్గొంటూ, గురజాడ లేఖల్నీ, డైరీలను చూసి, శ్రీనివాసాచారి అనే పేరు ఉండటాన్ని గమనించానన్నారు[13]. కానీ, ఎక్కడా ఆంగ్లంనుండి తెలుగులోకి అనువదించిన వారు శ్రీనివాసాచారి అనేది పేర్కొన లేదన్నారు[14] శ్రీనివాసాచారితో కలిసి నాటకాలు చూడటం, వివిధ సందర్భాల్లో కలిసి మెలసి ఉండటం ఇవన్నీ రాసుకున్న గురజాడ, ఈ విషయాన్ని తన డైరీల్లో రాసుకోకుండా ఉండడు కదా! అనేది ఆరుద్ర అభిప్రాయం. 'గురజాడ అప్పారావు మిగిలిన తెలుగు రచనలకు, కన్యాశుల్కం తెలుగు రచనకూ చాలా తేడా ఉంది. ముఖ్యంగా భాషలో ఉంది. ఈ తేడా "అని జయంతి కుమార స్వామి రాసిన దాన్ని పూర్వ పక్షం చేస్తూ ఆరుద్ర "ఇది కొంతవరకూ నిజమేగాని, వారు ఊహించినట్లు కన్యాశుల్కం భాషకూ, అప్పారావుగారి తదనంతర రచనలకూ మరీ అంత తేడాలేదనీ, ఈ విషయమ్మై పరిశోధన చేస్తున్నాను అన్నారు[15] మరోవ్యాసం 'ఎవరు ఈ గోమఠం శ్రీనివాసాచార్యులు' అంటూ "అప్పారావు గారికీ ఆచార్యుల గారికీ స్నేహం లేకపోతే అసలు అనువాదం చేయడమన్నది పొసగదన్న అభిప్రాయంతో ఆ పరిశోధన చేశాను" అని పేర్కొన్నారు.[16] వావిళ్ళ వారి దగ్గర ఇంకా వివరాలున్నట్లు పత్రికాముఖంగా ప్రకటించడంతో

ఆరుద్ర స్వయంగా వెళ్ళి కలిశారు[17] అయినా సాక్ష్యాధారాలేమీ బయటపెట్టలేదన్నారు. ఇక గురజాడ రచనల్ని, గోమఠం శ్రీనివాసాచార్యుల రచనల్ని పరిశీలించి, భాషాశైలిని బట్టి, ఎట్టి పరిస్థితుల్లోనూ 'కన్యాశుల్కం' తెలుగులోకి అనువదించింది గోమఠం వారు కావడానికి వీలులేదనే నిర్ణయానికొచ్చారు. "ఈ పరిశోధనలో వావిళ్ళ వారు చేసిన ఒక గొప్ప ద్రోహాన్ని గుర్తించానని" ఆరుద్ర ప్రకటించారు[18]. సాహిత్య ద్రోహాలను ఎందుకు చేశారంటే అది వేరేకథ, కారణాలు మనం ఊహించాలే కాని, ఎవరూ చెప్పరన్నారు. (గు.గు.పీః:పు.46). అది కాపీరైట్‌కి సంబంధించిన విషయంగా స్ఫురింప జేశారు. (గు.గు.పీః:పు.134) 'ముత్యాల సరాలే కాకుండా, 'నీలగిరి పాటలు' కూడా కలిపి చిన్న పుస్తకంగా అచ్చువేసి, దానిలో గోమఠం శ్రీనివాసాచారి రచనల్ని కూడా కలిపేసి, పుస్తకానికి అప్పారావు కర్తృత్వమే వావిళ్ళ వారు ప్రకటించారన్నారు. (గు.గు.పీః:పు.45). 1969లో బంగోరే 'గురజాడ కన్యాశుల్కం' తొలిప్రతిని విపులవ్యాఖ్యానంతో ప్రచురించినప్పుడు 'కన్యాశుల్కం' కర్తృత్వానికి సంబంధించిన అసలు రహస్యాన్ని ఆరుద్ర బయటపెట్టారు.

1955 ఎన్నికల్లో శ్రీ శ్రీ పాల్గొన్నారు. శ్రీ శ్రీ ఆ ఎన్నికల 'కోలాహలం - హాలాహలాన్ని' తట్టు కోలేక పోవడంతో ఒక ఆసుపత్రిలో పెట్టి శ్రీ శ్రీకి కొంతమంది చికిత్స చేయించారు. శ్రీ శ్రీపై వస్తున్న దూషణ సాహిత్యం ఆపడానికి మిత్రులు ఓమార్గాన్ని ఆలోచించి, ఒక తీర్మానాన్ని పత్రికలకు పంపారు. రాజకీయాలకు దూరంగా ఉన్న దానిలో, ఆరుద్ర సంతకం చేయకపోయినా, పేరు రావడం, తాను సంతకం పెట్టలేదని ఆరుద్ర పత్రికలకు లేఖలు రాశారు. ఆరుద్రకు జరిగిన అన్యాయానికి జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రికి బాధ కలిగి, మేలు చేయబోయి అభిమన్యుడిలా ఈ పద్మవ్యూహంలో ఇరుక్కొన్నారని ఆరుద్ర బాధపడ్డారు. దీనికి ప్రతీకారం చేయాలని భావించి చాలా కాలం కిందట వావిళ్ళ శాస్త్రులు చెప్పిన కన్యాశుల్కం నాటకాన్ని శ్రీనివాసాచారి రాశారనే స్కాండల్, జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి పుట్టించడంతో, 'గురజాడ కర్తృత్వ చర్చ మొదలైందని, దానినేపథ్యాన్నంతటినీ ఆరుద్ర వివరించారు. (గు.గు.పీః:పు.43-44).

ఆరుద్ర 'గురజాడ' కన్యాశుల్కం విషయంలో జరిగిన చర్చలు, వాదోప వాదాలు జరుగుతున్న "కన్యాశుల్కం" రచన ఎవరిది?" వంటి వ్యాసాల్ని చూస్తే, తర్వాత అనేక మంది అనేక వ్యాఖ్యానాల్ని ఆధారాల్ని చూపిస్తూ, వాదోప వాదాలు కొన సాగించడం వల్ల ఏమైనా కొత్త విషయాలు బయట పడతాయేమోననే 'పరిశోధన ఆశ' ఉండవచ్చు నేమోగాని, ఆ పద్ధతి సరైంది కాదనిపిస్తుంది. 'కన్యాశుల్కం-నూరేళ్ళ సమాలోచనం' సంకలన గ్రంథంలో, సంపాదకుడు మొదలినాగభూషణశర్మ ఈ విషయాన్ని వ్యాఖ్యానిస్తూ "*చివరకు ఆ నాటకం ఆసాంతమూ అప్పారావుదేనని వేంకటేశ్వర శాస్త్రి ఒప్పుకోలుతో యీవాద ప్రతిపాదనలు ముగిశాయి. దీనినేపథ్యాన్ని గురించి 'బంగోరె పుస్తకానికి రాసిన "అభిఘూరము" లో వివరంగా చర్చించారు ఆరుద్ర. అయినా ఒక మహాకావ్యాన్ని గురించి దాని రచయితను గురించి, మరొకరికెవరికో న్యాయం చెయ్యడం కోసం? అయినా, దీనివల్ల కొంతమంచి జరిగిందని ఒప్పుకోక తప్పదు*" అన్నారు[19]. ఈ పరిశోధనలో ఆరుద్ర పరిశోధన గురించి ఆలోచిస్తే, ప్రచురణ కర్తలు కొంతమంది చేసేపనిని

బయట పెట్టడం, అలాంటి వాటిని కొంతమంది గుడ్డిగా సమర్థించడం, వ్యతిరేకించడం, వాటికి ఏవో కొన్ని ఉపపత్తులు చూపడానికి ప్రయత్నిస్తారని నిరూపించినట్లు తెలుస్తుంది. అయితే, ఆరుద్ర కూడా "గుడ్డి" గానే "గోమఠం" గురించి పరిశోధించినట్లేనా? అనిపిస్తుంటుంది. కానీ, గోమఠం వారి "ప్రమేయం" ఏదీలేదని సాక్ష్యాధారాలతో నిరూపించడానికి, తనూ పరిశోధన చేస్తూ, ఆ వివరాల్ని ఎప్పటికప్పుడు ప్రకటిస్తూ వచ్చారని అవగతమవుతుంది. షేక్సిపియర్ వంటి నాటక కర్తలకూ ఇలాంటి 'కర్తృత్వ వివాదాలు' తప్పలేదు కనుక, కొంతమంది ప్రచురణకర్తలు 'జలసూత్రం' వంటి వాళ్ళను భవిష్యత్తులో "కన్యాశుల్కం" పట్ల వినియోగించుకొని, లాభపడటానికి అవకాశం లేకుండా, సాహితీ వేత్తల్లో అనుమానాలు రేకెత్తకుండా ఉండడానికి 'చాలామందిని' పరిశోధన చర్చల్లో పాలుపంచు కొనేటట్లు చేయడానికీ ఆరుద్ర చేసిన ఈ పరిశోధన ఉపయోగపడిందని భావించవచ్చు.

## 7.1.1.3 కన్యాశుల్కం – నాందీ ప్రస్తావనలు:

గురజాడ "కన్యాశుల్కం" మొదటి ప్రదర్శన జరిగినప్పుడు ముడుంబై వరాహనరసింహస్వామి "నాందీ - ప్రస్తావన' రచించగా, మేడేపల్లి వెంకట రమణా చార్యులు పఠనం చేసినట్లు (కన్యాశుల్కం తొలికూర్పు-1897) సెట్టి ఈశ్వరరావు సంపాదకుడు గా వెలువడిన విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారి 1986 నాటి ప్రచురణలో కూడా పీఠికగా పేర్కొన్నారు[20]. దానిలోనే

*"కన్యాశుల్క ప్రహసన మకార్షీద్రూపకం మహాత్*
*వ్యాస వంశో జగన్నాథ సహాయోపచితాశయః*" అనే శ్లోకం ఒకటి కన్పిస్తుంది[21].

అంటే "వ్యాస వంశం వాడైన జగన్నాథం సహకారిగా ఉన్నాడని" స్పష్టంగా తెలుస్తుంది. దీన్ని ఆరుద్ర పరిశీలించారు. ఈ 'నాందీ ప్రస్తావన' లను 'బంగోరె' ప్రచురించిన 'కన్యాశుల్కం' ప్రతిలో కొన్ని చారిత్రక ప్రయోజనాల కోసం చేర్చారనీ, అయితే, అవసరాల సూర్యారావు 'మాటా-మంతీ' లో 'వ్యాసా' వారి పేరు అనువాదంలో వదిలేశారనీ, బులుసు వెంకటరమణయ్య ఈ పేరుని అనువాదంలో పేర్కొన్నారనీ, కానీ, కె.వి.రమణారెడ్డి కూడా ఈ పేరుని పేర్కొన లేదనీ ఆరుద్ర అన్నారు. (గు.గు.పీ.పు:143) "వ్యాసా" వారి పేరెందుకు అనువాదంలో తొలగించినా గానీ, అప్పారావు సమ కాలికుల్లో ఒక వ్యక్తి సహాయం చేశాడని పబ్లిక్కుగా చెప్పడం వల్ల గతాన్ని తవ్వవలసి వచ్చిందని, తన పరిశోధనకు కారణాన్ని పరోక్షంగా చెప్పారు.

కన్యాశుల్కం ప్రదర్శనకీ, తొలి ప్రచురణకీ అయిదేళ్ళ వ్యవధి పట్టింది. ప్రదర్శన సమయంలో "ప్రస్తావన" లో చెప్పడానికి అంగీకరించడంలో గురజాడ ఆంతర్యాన్ని ఆరుద్ర అన్వేషించారు. 'భావి పరిశోధనవల్ల తప్ప వాస్తవం ఏమిటో తేలదు'. (గు.గు.పీ.పు:143) అని ప్రకటించిన ఆరుద్ర, ప్రదర్శనకు బహుశా, సహాయం చేసి ఉంటాడనీ, నాటక రచయితకు కాదనీ తేల్చి, 'కన్యాశుల్క కర్తృత్వం విషయంలో నాకెప్పుడూ సందేహం లేదన్నారు. (గు.గు.పీ.పు:149)

ఆరుద్ర పరిశోధనలో ఇక్కడ వైరుధ్యభావాలు కన్పిస్తున్నాయి. మొదట ఒక అనుమానాన్ని (ఊహ) రేకెత్తించి, చివరికి కాదనడానికి సరైన ఆధారాల్ని మరిన్ని చూపినట్లయితే, పరిశోధన మరింత మౌలికంగా ఉండేది.

ఏ పరిశోధనకైనా మొదట కొన్ని ఊహలు (Assumptions) చేయువలసిందే[22] 'ఆలోచనలు ఊహలుగా పుట్టి, ఊహలుగానే నిలిచిపోతే ఆ పరిశోధన పరిపూర్ణం కాదు. ఆ ఊహను సత్యంగా నిరూపించ గలగాలి[23] అలాంటప్పుడు ఆ పరిశోధన స్పష్టమైనదిగా భావించడానికి వీలవుతుందీ. కానీ, చివర్లో కొన్ని ఆలోచనల్ని, కొన్ని ప్రశ్నల్ని రేకెత్తించడమే అయితే అది సమీక్ష స్వభావంతోనే మిగిలిపోతుంది.[24] 'కన్యాశుల్కం-నాందీ ప్రస్తావనల' విషయంలో ఆరుద్ర తన పరిశోధనను మరింత స్పష్టం చేస్తేబాగుండేది.

## 7.1.1.4 "కన్యాశుల్కం" రచన– ప్రదర్శనల కాలనిర్ణయం:

కన్యాశుల్కం రచన, ప్రదర్శనల కాలనిర్ణయంలో ఆరుద్ర కింది అంశాల్ని కేంద్రీ కరించి పరిశీలన చేశారు.

(i) నాటకం విజయ నగరంలో ప్రదర్శించడానికి **1892** ఆగస్టు **13**న సంస్కృతంలో "ప్రస్తావన" రచన చేశారు.

(ii) 'ప్రస్తావన' రచన జరిగిన కొన్నాళ్ళకు ప్రదర్శన జరిగి ఉండవచ్చు.

(iii) 'తెలుగుహార్పు' పత్రిక కన్యాశుల్కం నాటక ప్రదర్శన సమీక్ష **1892** ఆగస్టు **26.** దీనిలో 'గతశనివారం' ప్రదర్శించినట్లు ఉంది. "ఆయేడు ఆగస్టు **13**వ తారీఖు మంగళ వారం నాడూ, పదిహేడో తారీఖు, ఇరవైనాలుగో తారీఖూ మాత్రమే "శనివారం" వచ్చాయి. ఈ రెండింటిలో ఏదొక రోజున, బహుశా **24**వ తారీఖున ప్రదర్శన జరగవచ్చు" (గు.గు.పీ:పు:**34;145**) అని ఆరుద్ర నిర్ణయానికొచ్చారు.

'కన్యాశుల్కం' సెట్టి ఈశ్వరరావు '**1892** ఆగస్టు **13**' ని ప్రదర్శన జరిగినట్లు పేర్కొంటున్నారు[25]

నరాలవీరయ్య చారిత్రక, సామాజిక విశ్లేషణతో, కె.వి.రమణారెడ్డి, ఆరుద్ర అభిప్రాయాల్ని పూర్వ పక్షం చేసి **1887-1892** సంవత్సరాల మధ్యలో గురజాడ అప్పారావు నాటక రచన ప్రారంభించి, పూర్తి చేశారని చెప్పడం సమంజసమన్నారు[26]. నాటక ప్రదర్శన విషయంలో **1872** నాటి గురజాడ డైరీలో ఆవిషయం రాసి ఉండాలనీ, పూర్తి డైరీ విశేషాలు లభ్యమైతేనే నూతనాంశాలు బయట పడగలవనీ నరాలవీరయ్య అన్నారు[27].

తన గొప్పతనం చెప్పుకోవడానికి గ్లాడ్‌స్టన్‌ని ప్రస్తావించడం వల్ల, గ్లాడ్‌స్టన్ కాలాన్ని నిర్ణయించడానికి ఆరుద్ర ప్రయత్నించి, కన్యాశుల్కం రచనా కాలాన్ని ఊహించడానికి గల అవకాశాల్ని వెదికారు. బ్రిటీష్ ప్రధాని గ్లాడ్‌స్టన్ **1868** నుండి **1892** వరకూ ప్రధాన మంత్రిగా ఉండటం వల్ల, గ్గిరీశం గ్లాడ్‌స్టన్ పేరుని వాడ టాన్ని బట్టి **1892** లోనే నాటకాన్ని పూర్తి చేయువచ్చు నన్నారు. అయితే ఈ నిర్ణయం అంత సమంజసంగా,హేతు పూర్వకంగా కన్పించడం లేదు. కానీ, గ్లాడ్‌స్టన్ కాలంలోనే ఈ రచన పూర్తి చేశారనేది ఆరుద్ర పరిశీలనలో ప్రధాన ప్రతిపాదనగా తెలుస్తుంది. దీనితో పాటు, ఆనంద గజపతితో గల గురజాడ స్నేహాన్ని కూడా చారిత్రక సంఘటనలతో పరిశీలన చేశారు.

1-2-1888 నాటి గురజాడ డైరీని అనుసరించి 1887 నుండి ఆనంద గజపతితో గురజాడకు స్నేహం పెరిగిందని తెలుస్తుందన్నారు. చెన్నపురి శాసన మండలిలో 'కన్యాశుల్కం బిల్లు' శాసన సభ్యుడిగా ఆనందగజపతి ప్రవేశ పెట్టడం, అ బిల్లు చట్టంగా రూపొందకుండా పళ్ళ చెంచల్ రావు, సుబ్రహ్మణ్య అయ్యరు అడ్డు పడటంతో చట్టంగా రూపొందడంలో వైఫల్యం పొందడం, దీనికి ప్రజాభి ప్రాయాన్ని సేకరించ వలసిన అవసరాన్ని గురజాడ గుర్తించి, రచనకు పూనుకున్నారని ఆరుద్ర చెప్పారు. (గు.గు.పీ.పు.66).

కన్యాశుల్కాన్ని 1892 జూన్, జూలై నెలల్లో మొదలు పెట్టి పూర్తి చేసి ఉంటారన్నారు. నాటకం తయారైన వెను వెంటనే స్థానిక సమాజం వారు ఆగస్టులో ప్రదర్శించారని తలంచ వచ్చుననీ, ఒద్దికలకు మహా అయితే రెండు మూడు వారాలు పట్టిందేమోనన్నారు. నాందీ-ప్రస్తావనలను రచించిన తేదీ నాటికి ఒద్దికలు ఒక దారిలో పడ్డాయనికూడా ఊహించవచ్చునన్నారు (గు.గు.పీ.పు:37). ఈ నిర్ణయాలకు ముందు 1885-1887 సంవత్సరాల మధ్య రష్యాతో తెల్లవాళ్ళకు యుద్ధం వచ్చే సూచనలు కన్పించడం వల్లా, ఆ మాటలే నాటకంలో ఉండడం వల్లా, ఈ మధ్యకాలంలో నే నాటక రచన జరిగి ఉండవచ్చుననే కె.వి. రమణారెడ్డి వాదనను ఆరుద్ర పూర్వ పక్షం చేశారు (గు.గు.పీ.పు.35). 1887 లో కన్యాశుల్కం రచించి, 1892 వరకూ అయిదేళ్ళపాటు ప్రదర్శించకుండా ఉండరనీ, దీనికి సంతృప్తికరమైన సమాధానాలు లేకపోతే ఆతేదీని కొట్టి వేయాలనీ చెప్పి, శంబు చంద్ర ముఖర్జీ వంటి వారి వల్ల సాహిత్య ప్రయోజనాన్ని, సామాజిక చైతన్యాన్ని గురజాడ అవగాహన చేసుకొన్నారు. ఆనందగజపతి వారి ప్రత్యేక శ్రద్ధతో చెన్నపట్నం లెజిస్లేటివ్ కౌన్సిల్ లో 'కన్యాశుల్కం' విషయాలు ప్రస్తావించడం, తర్వాత 1889 ఆగస్టు 10 న విజయ నగరం డిబేటింగ్ క్లబ్బు ఉపాధ్యక్షుడుగా గురజాడ ఎన్నికయ్యారు. ఈ క్లబ్బులో జరిగే మేధావుల చర్చల వల్ల, నాటి సమాజంలో సాంఘిక సమస్యల్ని ప్రతిబింబించే సరైన నాటకాలు లేకపోవడం వల్ల ప్రజలకి అర్థమైయ్యే భాషలో 1892 జూన్, జూలైలో నాటక రచన ప్రారంభించి, ఆగస్టులో ప్రదర్శనికిచ్చారని ఆరుద్ర చెప్తున్నారు (గు.గు.పీ.పు:35-37). అయితే, నాటకాన్ని ప్రదర్శించిన ఆయిదేళ్ళకు గానీ అచ్చు వేయించలేదనీ, అది 1897 జనవరిలో నిర్వహించారని అన్నారు (గు.గు.పీ.పు.41).

కె.వి.రమణారెడ్డి, ఆరుద్ర అభిప్రాయాల్ని నరాలవీరయ్య పూర్వపక్షం చేశారు. తన పరిశోధన వ్యాసం 'కన్యాశుల్కం తొలిమలి కూర్పుల తులనాత్మక పరిశీలన ' లో నరాలవీరయ్య 1980లో పరిశోధన చేసినా, దాన్ని 1985 మే నెలలో ప్రచురించారు. ఈ సందర్భంగా నరాలవీరయ్య తన పరిశోధన గ్రంథ ప్రచురణని గురజాడ వారి కన్యాశుల్కం ప్రచురణతో పోల్చుకొని అయిదేళ్ళకే పూర్తికావడం యాదృచ్ఛికం అనడంలో అయిదేళ్ళ తర్వాతనే కన్యాశుల్కం ప్రచురణ విషయాన్ని సమర్థించుకొంటున్నారని తెలుస్తుంది. కన్యాశుల్కం రచన, ప్రదర్శనల ప్రతిపాదనల్ని 1969 నాటికే ఆరుద్ర వ్యక్తీకరించినా[28] ఈ వ్యాసాల్నే 'గురజాడ గురుపీఠం ' పేరుతో సెప్టెంబరు 1985 లో గ్రంథంగా ప్రచురించినప్పుడు గానీ, తారీఖుల్లో గానీ ఏమార్పునీ చేయని ఆరుద్ర, సమగ్ర ఆంధ్ర సాహిత్యం లో 'బహుశా 1891 లో కన్యాశుల్కం నాటక రచన మొదలు పెట్టి 1892 ఆగస్టు నెలలో జగన్నాథ విలాసినీ నాటక సమాజం వారు ప్రదర్శించడానికి నిశ్చయించారని' రాశారు

(స.మ.వసం.పు.పు.ఆం.సా.పు.ము. I పు.124). దీనిలో కాలనిర్ణయం చేస్తూ "రచన ఎప్పుడు ప్రారంభించారో, ఎప్పుడు పూర్తిచేశారో ప్రస్తుతం లభిస్తున్న ఆకరాలను బట్టి ఖచ్చితంగా చెప్పలేమనీ, మళ్ళీ, 1892లోనే కన్యాశుల్కం రచన పూర్తిచేసి ఉంటారని ( స. ఆ.సా.11వ.సం.పు:144) ఆరుద్ర తన అభిప్రాయాల్ని చెప్పారు. తర్వాత జరిగిన పరిశోధన ఫలితాల్ని దృష్టిలో ఉంచుకొని మార్పులూ, చేర్పులూ చేసి ప్రజాశక్తి ప్రచురణకర్తలు 1991 లో ప్రచురించిన నాటికి ఆరుద్ర భావాల్లో మార్పులు కన్పిస్తున్నాయి. వీటన్నింటికీ తర్వాత అంటే 10-8-1992 లో మందలపర్తి కిశోర్ 'ఉదయం' పత్రికలో కన్యాశుల్కం తొలిప్రదర్శన గురించి, కె.వి.రమణారెడ్డి, ఆరుద్ర, సెట్టి ఈశ్వరరావుల అభిప్రాయాల్ని పూర్వ పక్షం చేస్తూ, కన్యాశుల్కం తొలిప్రదర్శన 13 శనివారమే అయ్యిందన్నారు[29]. ఆయితే, Telugu Harps పత్రిక సమీక్షకుడి దృష్టిలో గత శనివారం అనేది 1892 ఆగస్టు పదమూడా? ఇరవయ్యా? అన్నది తేలాల్సి ఉందన్నారు[30]. ఇంకా తన ప్రతిపాదనను సిద్ధాంతీకరించడానికి ప్రయత్నిస్తూ, 1892 ఆగస్టు 13 నందన నామ సంవత్సరం శ్రావణమాసం బహుళ షష్ఠి అవుతోందని, శుభకార్యాన్ని ఆనాడు తలపెట్టలేదనీ, ఆగస్టు 20 త్రయోదశి (పుష్యమీ నక్షత్రం) అవుతుంది గనుక అది శుభకరమైన, అనువైన మూహూర్తమనీ, అందుచేత 1892 ఆగస్టు 20వ తేదీనే తొలిప్రదర్శన జరిగి ఉంటుంది. స్పష్టమైన రిఫరెన్సులు లేని పక్షంలో రచనల్లోని అంతర్గత సాక్ష్యాధారాన్ని ఆధారం చేసుకొంటే 'ఆరుద్ర' అభిప్రాయాల్ని అంగీకరించవలసి ఉంటుంది[31] అని మందలపర్తి కిశోర్ అన్నారు. పరిశోధన గ్రంథానికి 'ముందుమాట' రాస్తూ కె.వి.రమణారెడ్డి "గురజాడ అప్పారావు కలం నుంచి అది ఎప్పుడు వెలువడిందో ఆరుద్ర, నేనూ, చేసి వున్న వూహా నిర్మిత నిర్ధారణ లను తోసివేస్తూ, తగిన ఉపపత్తులతోటి తాను మరో (నరాల వీరయ్య) నిర్ధారణ చేయ గలిగారంటేనే, తన పరిశోధన చర్విత చర్వణ మనిపించేట్టుగా సాగించలేదని తెలుస్తుంది అని ప్రశంసించారు[32]. దీన్ని అనుసరించి కె.వి.రమణారెడ్డి పరోక్షంగా వీరయ్య ప్రతిపాదించిన సిద్ధాంతాన్ని అంగీకరించినట్లు స్పష్టమవుతుంది.

ఈ ప్రతిపాదనల్ని, సిద్ధాంతాల్ని పరిశీలించినప్పుడు అందరికీ ఆమోదయోగ్యమైన అంశం 1892 నాటికి కన్యాశుల్కం రచన పూర్తయ్యిందనే తెలుస్తుంది. ఇది ఆరుద్ర పరిశోధనలోనూ కన్పిస్తుంది. అయితే రచనా కాలంలో కేవలం జూన్, జూలై నెలల్లో ప్రారంభించి, ఆగస్టులోనే పూర్తి చేయడమనేది అసాధ్యమని స్ఫురిస్తుంది. అందుకనే ఆరుద్ర ఆలోచన, పరిశోధనా పరిణామం సమగ్ర ఆంధ్ర సాహిత్యంలో చక్కగా స్పష్టమవుతూ, మార్పులు అంగీకరిస్తున్నట్లు తెలుస్తుంది.

## 7.1.1.5 "కన్యాశుల్కం"-పూర్వోత్తరప్రతులు : తులనాత్మకశ్లేషణ:

గురజాడవారి కన్యాశుల్కం రచన 1892 నాటికి పూర్తయి, 1897కి మొదటి ప్రచురణ పొందింది (పు:4 ). 1909 నాటికి రెండవకన్యా శుల్కం ప్రతి రూపొందింది. ఈ మధ్యకాలంలో కన్యాశుల్కం నాటకంలో గురజాడ చాలామార్పులూ, చేర్పులూ చేశారు. రెండింటినీ చదివినట్లయితే, ప్రతిపాఠకునికీ ఈ వ్యత్యాసాలు తెలుస్తుంటాయి. అయితే, బంగోరె ప్రచురించిన కన్యాశుల్కం (1969) కి ఆరుద్ర రాసిన ముందుమాటలోనే ఈ రెండింటిలోగల పోలికన్నీ, తేడాల్నీ వివరిస్తూ, గురజాడ దృక్పథంలో వచ్చిన పరిణామాన్ని తొలిసారిగా గుర్తించారు[33]. ఈ విషయాన్ని బంగోరె, నరాల వీరయ్య కూడా

తమ పరిశోధన వ్యాసాల్లో తెలిపారు. రెండునాటకాల్ని తులనాత్మకంగా పరిశీలించడానికి స్వీకరించిన అంశాలు, వస్తువు, సామాజిక సాహిత్య ప్రభావాలు, పాత్ర చిత్రణలను బట్టి ఆరుద్ర తులనాత్మక పరిశోధనను పరిశీలించవచ్చు.

## 7.1.1.6. "కన్యాశుల్కం" వస్తుపరిణామం:

కన్యాశుల్కంలో వస్తువు (ఇతివృత్తం) సంఘ సంస్కరణ (సోషల్ రిఫార్మ్), వ్యవహారిక భాషాభివృద్ధి (స్పోకెన్ తెలుగు) అనే రెండింటిని దృష్టిలో పెట్టుకొనే ప్రధానంగా గురజాడ ఈ నాటకం రచించారన్నారు ఆరుద్ర (గు.గు.పీ.పు.2)

ఆనాటి సమాజంలో బాల్య వివాహాల నిషేధం పట్ల అనందగజపతి కూడా ఆసక్తిని ప్రదర్శించడం, బాల్యవివాహాలు జరుగుతున్నాయనే ఆ నాటికి లభించిన లెక్కలూ గురజాడకి వస్తునిర్దేశం చేశాయనీ, అయితే ఆరుద్ర ప్రత్యేకించి చెప్పిన అంశంగా, మొదటి కన్యాశుల్కంలో స్పోకెన్ తెలుగు ఉన్నప్పటికీ, ఆ రచనకి ప్రముఖ ప్రయోజనం సోషల్ రిఫార్మే ననీ, అప్పటికి సోషల్ రిఫార్మ్ అంటే, విడోమేరేజీ, ఇన్ఫేంటు మేరేజీ (విధవా వివాహాలు, బాల్యవివాహాలు) సమస్యలేననీ, అందుచేతనే నాచికొచ్చిన్ అత్యల్పమని చెప్పారు ఆరుద్ర. కనుకనే మొదటి కన్యాశుల్కంలో మధురవాణి పాత్రకి పెద్ద ప్రాధాన్యత లేదన్నారు (గు.గు.పీ.పు:3) గురజాడ రచనల్లో ఆనాటికి ఉన్న సాహిత్య ప్రభావం కూడా కన్యాశుల్కం నాటక ప్రక్రియలో రచించటానికి కారణమయ్యిందన్నారు. అప్పటికి, ప్రపంచ వ్యాప్తంగా ఆంగ్లనాటకాల ప్రభావం గురజాడపై పడి ఉంటుందనీ ఆంగ్ల నాటక రీతుల్ని క్షుణ్ణంగా ఆకళించుకున్నారన్నారు (పు:5 3). అందుకనే వచనంలో స్పోకెన్ తెలుగుని ఉపయోగిస్తూ, బాల్యవివాహాల్ని నిరసిస్తూ, వేశ్యాసమస్య, వితంతు సమస్యల్ని సమాజదృష్టికి తెచ్చి, వాటి వల్ల కలిగే అనర్థాల్ని వివరించారన్నారు. ఆనాటికి ప్రపంచ వ్యాప్తంగా సంస్కృత, ఆంగ్ల నాటకాల్ని ప్రదర్శించటం, శ్రీనివాసా చారితో, అప్పారావు వాటిలో చాలావాటిని చూసినట్లు, గురజాడ తనడైరీల్లో సాక్ష్యాలు కన్పిస్తుండటాన్నీ ఆరుద్ర గమనించారు.

## 7.1.1.7. "కన్యాశుల్కం"లో పాత్రచిత్రణ:

కన్యాశుల్కం తొలి, మలి ప్రతుల్లో పాత్రలస్వభావాల్లో వచ్చిన మార్పుల్ని పరిశోధించినట్లు ఆరుద్ర చాలా చోట్ల చెప్పుకున్నారు ఈ పాత్రల్లో మధురవాణి సౌజన్యారావుల విశిష్టతల్ని పరిశీలించారు. తులనాత్మక పద్ధతిలో రెండు పాత్రల్లో ఉన్న స్వభావాల్ని విశ్లేషించారు. గిరీశం ఎవరై ఉంటారనే దానికి నాటకంలో గల కొన్ని సంఘటల్ని ఆధారంగా స్వీకరించి కొన్నినిర్ణయాలు చేశారు.

## 7.1.1.8 మధురవాణి పాత్ర – ఆరుద్ర పరిశీలన:

'మధురవాణి పాత్ర ఒక పరిశీలన ఒక పరిశోధన' పేరుతో ఒక వ్యాసాన్నీ 'పునః పరిశీలన, పునఃపరిశోధన' పేరుతో ఇంకొక వ్యాసాన్నీ ప్రత్యేకించి మధురవాణి పాత్ర ఔచిత్యాన్ని చెప్పడమే ప్రధాన విషయంగా పేర్కొనగలిగేవ్యాసాలు. వీటితోపాటు మరికొన్ని వ్యాసాల్లోను, ఈ పాత్ర పట్ల తన అభిప్రాయాల్ని ఆరుద్ర వ్యక్తీకరించారు. మొదటి (తొలి) కన్యాశుల్కంలో మధురవాణి ఉన్నా ఆపాత్రలో జీవంలేదు.

ఆమె వేశ్యాశిఖామణి కాదు. మొదటి మధురవాణి పట్ల రచయితకే సద్భావంలేదు. కనుక, మధురవాణి పట్ల పరిశోధన చేస్తేనే గురజాడ అప్పారావు దృక్పథం ఏమిటో, అదెలా మరుతూవచ్చిందో తెలుస్తుందన్నారు. మొదటి మధురవాణి పాత్ర సజీవంగా లేక పోవటానికి, అప్పటికి సమాజంలో వేశ్యాసమస్య పెద్దగా లేకపోవటమేననీ (గు.గు.పీ.పు:3) మొదటి (తొలి) కన్యాశుల్కంలో గిరీశం మరిగిన మహాలక్ష్మి అనే వేశ్యని మధురవాణిగా మార్చాలనే ఆలోచన వచ్చి ఉంటుంది, దానికి కారణం, మహాలక్ష్మి చోటులో మధురవాణిని ప్రవేశపెడితే, రామప్పంతులు ఉంచుకొన్న సానిగా మరొక పాత్రని సృష్టించాలా వద్దా? అనే సందేహంలో ఆరెండు పాత్రల్నీ ఒకటే చేశారన్నారు (గు.గు.పీ.పు:3) దీని వల్ల కథకి నష్టం కలగలేదు. 'కొండుబొట్టీయం'లోని మంజువాణి, 'స్టూపింగ్ టురెయిజ్'[34] ఆంగ్ల కథానాయికి సరళలను పరిశీలించి, మంజువాణి పాత్రలోనుండే తీసుకొని, సరళలోని తెలివిని కలిపి రెండవ మధురవాణిని గురజాడ సృష్టించారని ఆరుద్ర ఊహించారు (గు.గు.పీ.పు.13). దీనికి తులనాత్మక పరిశీలనగా 'కొండుబొట్టీయం' లోని మొదటి దృశ్యాన్నీ, రెండవ కన్యాశుల్కంలోని మొదటి దృశ్యానీ ఆరుద్ర, తన పరిశీలనకు తీసుకున్నారు. మధురవాణి పాత్రను అప్పారావు జీవితంలో నుంచే తీసుకున్నా, అది ఏ ఒక్కవ్యక్తికీ ఫోటోగ్రాపు కాదనీ, ఉండవలసిన ఔన్నత్యాన్ని అందుకున్న ఆదర్శమూర్తిగా తీర్చిదిద్దారన్నారు (గు.గు.పీ.పు.66). ఇది ప్రధానంగా ఆరుద్రతన పరిశోధనలో మధురవాణి పాత్రపట్ల చేసిన ప్రతిపాదనలు వీటిని నిరూపించడంలో ఆరుద్ర ఎంతవరకూ సఫలీకృతులయ్యారో సమన్వయం చేయడానికి కింది విధంగా ప్రయత్నించవచ్చు.

కొండు బొట్టీయం లో మంజువాణి పాత్రస్వభావాన్ని సంభాషణలతో సహా పేర్కొన్నారు.(గు.గు.పీ.పు:4) మంజువాణి ఒక శూద్రపుపిల్ల. పేదరికం వల్ల తనని కొనుక్కొన్న తల్లి రామసాని, కొండు బొట్ల దగ్గర వదిలి వేయడమూ, కొన్నాళ్ళ తర్వాత, కొండు బొట్లు సానిరికంచేయిస్తూ, విటుల్ని తానే తీసుకొస్తుంటాడు. తెచ్చిన ప్రతివాణ్ణీ తనదగ్గరకి రానివ్వదు. ఒకసారి, ఒకసాహెబుని తెస్తే, అతన్ని దగ్గరకు రానివ్వదు. అతన్నితెచ్చి నందుకు దెబ్బలు కొడితే కొండుబొట్ల నే తినమని, తాను మాత్రం తప్పించుకొంటుంది. తనని ఉంచుకొన్న వరహారిరావు పంతులు, అతనే కాకుండా, మరికొంతమంది సరసుల్ని రప్పించుకొన్నావేమని ఆమెను నిలదీస్తే, నేను వేశ్యననీ, నావృత్తి ధర్మం నేను మాననని చెప్తుంది. కానీ తన వృత్తిపట్ల ఆమెకి ఏవగింపు ఉంది. రామస్వామి చనిపోగానే *రత్నాంగి* తనే వేశ్య మంజువాణిని ఆదుకొని, రామసాని చనిపోయినందుకు, లోకం మెప్పుకోసమైనా కన్నీళ్ళు పెట్టమని సలహా ఇస్తే,దానికి మంజువాణి ఒప్పుకోదు పైగా, ఆ రామసాని చచ్చినందుకు సంతోషించి, ఆమె దాచిపెట్టిన ముప్పైవేలు తీసుకొని, మంజువాణి స్వేచ్ఛగా బ్రతకాలనుకొంటుంది. అంతేకాకుండా, పంతులుకూడా త్వరగా చావాలనుకొంటుంది. ఈ పరిస్థితుల్లో *రత్నాంగి* మంజువాణిని చేరదీసి, ఆదరించి, లోకంకోసం కొన్నాళ్ళు పాతతోవలోనే జరగనివ్వమని సలహా ఇస్తే, దానికి అంగీకరించి, అలానేకొన సాగిస్తుంది. దీన్ని గురించి ఆరుద్ర విశ్లేషిస్తూ, మంజువాణి తనగత చరిత్రని తలచుకొంటూ, వర్తమానాన్ని ఏవగించుకొంటూ, భవిష్యత్తు గురించి కలలు కంటుందనీ, ఇవే మీ మొదటి మధురవాణిలో లేవనీ, ఇద్దరిలోనూ డబ్బు సంపాదించాలనే తపన ఉన్నా ప్రతివాళ్ళనీ తన దగ్గరకి రానిచ్చే స్వభావం మంజువాణికి లేదని సాహెబుని నిరాకరించడం

ద్వారా నిరూపించి, ఈ విచక్షణాజ్ఞానం, మొదటి మధురవాణిలో లేకుండా, పూర్తిగా ద్రవ్యాశ గలదానిగానే చిత్రితం కావడం గమనించవచ్చునని అన్నారు (గు.గు.పీ.పు:8).

మంజువాణికి సరసంతోపాటు, మాటకారితనం, కోపం, పెంకితనాలు ఉన్నాయన్నారు. దీనికి కొండుబొట్లు, మంజువాణి అందాన్ని పొగిడినప్పుడు "నేను మాపంతులుగారి వెధవప్పగారికేమాత్రం సాటి" వంటి సంభాషణలవల్ల, మంజువాణి మాటకారి తనాన్నీ; పంతులుగారు, కొండుబొట్లుతో జరిగిన సంభాషణలో దానం విషయం వచ్చినప్పుడు సువర్ణదానం వైపుకి సంభాషణను త్రిప్పగలగటం వంటివాటిని సమయస్ఫూర్తి సంభాషణాచాతుర్యాలకు నిదర్శనాలుగా నిరూపించారు (గు.గు.పీ.పు:10) ఈ లక్షణాలేమీ మొదటి మధురవాణిలో లేవని చెప్పి, ద్వితీయాంకంలో ఒక దృశ్యాన్ని వివరించారు.

మొదటి మధురవాణికీ, మంజువాణికీ ఎంత భేదం ఉందో, మంజువాణికీ, రెండవ మధురవాణికీ అంత దగ్గర పోలికలు ఉంటాయని చెప్తూనే, (గు.గు.పీ.పు:11) ఇద్దరిలోనూ మానవత్వం, మంచితనం, తమవృత్తిలో గలహైన్యతను గుర్తించగలగటం ఉన్నప్పటికీ, రెండవ మధురవాణే కొన్ని మెట్లుపైన ఉంటుందన్నారు (గు.గు.పీ.పు:12). అది ఎలాగో కింది సమన్వయం వల్ల తెలుసుకోగలిగే అవకాశం ఉంది.

మంజువాణి తల్లి రాక్షస స్వభావం గలదైతే, రెండవ మధురవాణి తల్లి మంచిది! "చెడని వారిని చెడగొట్టవద్దని చెప్పడం వల్ల మధురవాణి కృతజ్ఞతకు పాత్రరాలైంది (గు.గు.పీ.పు:12). కానీ, మంజువాణి తల్లి రామసానిని, మధురవాణి ద్వేషించడానికి గల కారణం, ఆమె మంచిదికాకపోవడం. ఇద్దరూ వేశ్యలయినా, డబ్బు సంపాదించడానికే మంజువాణి ప్రయత్నిస్తే, రెండవ మధురవాణి అవసరమైతే విటులకి డబ్బు సహాయం కూడా చేస్తుందనేది కరకటశాస్త్రులకి డబ్బు ఇబ్బందిలో ఉన్నప్పుడు, మధురవాణి తనమెడలో ఉన్న నగల్ని తీసి, ఇచ్చి, అతని అవసరాలకి వాడుకోమంటుంది. " మొగాడికయినా, ఆడదానికయినా నీతి ఉండాల"నే మాటను రెండవ మధురవాణి పలకడమే ఈ పాత్ర గొప్పతనాన్ని చెప్తుంది. అందువల్లనే ఆరుద్ర, "మంజువాణి" పాత్రలోనించే "రెండవ మధురవాణి"ని గురజాడ సృష్టించారనే ప్రతిపాదన చేయగలిగారు.

మంజువాణిలో గల సంభాషణా చాతుర్యాన్ని గ్రహించారని, ఆ చాతుర్యం రెండవ మధురవాణిలో పరిణితి సాధించిందనీ తెలుస్తుంది.

మరో తేడాని ఆరుద్ర వివరిస్తూ రత్నాంగి చెప్పిన మాటప్రకారం మళ్ళీ పాత దారిలోకే మంజువాణి వెళ్ళిపోవడానికి అంగీకరించినా, సౌజన్యరావు గారి మాటప్రకారం వృత్తిని మానలేవా? అంటే, ఆవృత్తిని మానేసి, చివరికి ఆయనకంటే గడుసుగా వ్యవరించిన పాత్ర రెండవ మధురవాణి *స్టూపింగ్ టురెయిజ్* లో సరళ వేశ్యఅయినా, బాగా చదువుకొన్న కళా జిజ్ఞాస కలిగిన యువతి[35], ఈ కథ (సంస్కారి) లో కాలేజీ ప్రొఫెసర్ రంగనాథయ్యరు యాంటీ నాచ్ ఉద్యమాన్ని కొనసాగించడం వల్ల, ఆయన్ని కలవాలని ప్రయత్నించి, పలకరింపులు, పరిచయాలు, రోజూ సంభాషణలు కొనసాగించగలిగే వరకూ వెళ్ళిన తర్వాత, సరళ తన జీవిత వ్యథని చెప్పి, తనని ఏమర్యాదస్థుడు పెళ్ళి చేసుకొంటారో చెప్పండని,

ఆయన్నే అడగటం, ఆమె మేధోవికాసనాన్ని తెలుపుతుంది. ఈ తెలివి తేటల్నే రెండవ మధురవాణిలో గురజాడ ప్రవేశపెట్టారని ఆరుద్ర విశ్లేషించారు.

ఈ రెండు పాత్రల్నీ, ఈ సన్నివేశాన్నీ, ఈ సమస్యనీ తీసుకొని అప్పారావు రెండవ కన్యాశుల్కంలోని చివరి అంకం, చివరిదృశ్యాన్ని రాశారు, ఈ దృశ్యంలోనే మధురవాణిలో గల మేధోవికసనం మనకి బోధ పడుతుంది, అందులోనే ఆమె నాచికొచ్చెన్ యొక్కపునాధినే పెకలించగలిగింది, సౌజన్యరావుతో చర్చించ గలగింది, సరళే మధురవాణిలోనూ, రంగనాథయ్యరే, సౌజన్యరావులోనూ పరిణిత పాత్రలుగా కన్పిస్తున్నాయని ఆరుద్ర వివేచించారు (గు.గు.పీ.పు.17).

తాను ప్రతిపాదించిన మొదటి మధురవాణి, మంజువాణిలో సరళలో ఎలా పరిణామం చెందిందో నిరూపించి, ప్రొఫెసర్ రంగనాథయ్యర్ గారు కన్నా ఉన్నతమైన పాత్ర ప్లీడరు సౌజన్యరావులోనూ కన్పిస్తున్నారని అన్నారు (గు.గు.పీ.పు.17) "*అందరికన్నా మహోదయుమైన పాత్ర మధురవాణిదె,* నేనే ఆమెను చూసి భ్రమసి పోతున్నాను" అని గురజాడ అప్పారావు ఒక లేఖలో ఆశ్చర్యపోవడంలో నిజమైన సారస్యం ఉందన్నారు (గు.గు.పీ.పు.20).

ఆరుద్ర తులనాత్మక పరిశోధనకు తెలుసుకోవడానికి గురజాడవారి కన్యాశుల్కం లో వస్తు, పాత్రల విశ్లేషణలను చక్కని నిదర్శనంగా నిలిచే పరిశీలనగా పేర్కొనవచ్చు. ఇవేకాకుండా, కన్యాశుల్కం వీరే నాటకాన్ని, కందుకూరి వీరేశలింగం '*బ్రహ్మవివాహం*'తో నూ తులనాత్మకంగా పరిశీలించడం వల్ల కూడా ఆరుద్ర తులనాత్మక పరిశోధనను తెలియజేస్తుంది.

## 7.1.1.9 గురజాడ 'కన్యాశుల్కం' – వీరేశలింగం 'బ్రహ్మవివాహం': తులనాత్మక పరిశీలన:

గురజాడ 'కన్యాశుల్కం' నాటకాన్ని రాసిన నాటినుండి రెండవ ప్రతి (మలిప్రతి) ప్రచురణ చేసే నాటి వరకూ చేర్పులూ, మార్పులూ చేశారని తొలి మలి ప్రతుల్నిగమనించిన వారికి తెలుస్తుంది. అయితే, గురజాడ 'కన్యాశుల్కం' రాసేనాటికే కందుకూరి వీరేశలింగం 'కన్యాశుల్కం' 'బ్రాహ్మవివాహం ప్రహసనాన్ని రచించారు. ఆరుద్ర వీటి మధ్యగల పోలికల్నీ, తేడాల్ని తులనాత్మకంగా పరిశీలించారు. ఒక అంకంలో గల అంశాలకేపరిమితం చేసి ఆరుద్ర ఈ పరిశీలన కొనసాగించారు. (గు.గు.పీ.పు.47).

'బ్రహ్మవివాహం' పీఠికలో ఏ అంకంలో, ఏ దురాచారాన్ని ఖండించారో వీరేశలింగం వివరించారు[35]. ఆవిషయాల్ని ఆరుద్ర కూడా పేర్కొన్నారు. కానీ, ఆ వివరాల్ని పేర్కొనలేదు. కందుకూరి వారిపీఠికలో ఉన్న దురాచారాలు ఏమిటో గమనిస్తే, కన్యాశుల్కం తీసుకొని పెళ్ళిళ్ళు చేయుటం వల్ల వచ్చే అనర్థాల్ని సూచనగా చెప్తుందన్నారు మొదటి అంకంలో కొంతమంది భార్యాభర్తల మధ్య ఉండే ఐకమత్యభావన ఎలాంటిదో తెలుపుతుందని అన్నారు. బ్రహ్మవివాహంలోని ఈ అంకాన్ని గురజాడ తొలి, మలి ప్రతుల్ని ఆరుద్ర తన పరిశీలనకు తీసుకున్నారు.

అజ్ఞానమ్మ తన రెండేళ్ళ కూతుర్ని, తన నలభై ఏళ్ళ మేనల్లుడికిచ్చి పెళ్ళిచేయాలను కొంటుంది కానీ, భర్త కామయ్య ధనాశవల్ల, భార్యని వ్యామోహంలో పడేసి పట్టెమంచం, పరుపు కొనుక్కోవచ్చనీ,

నగలు చేసుకోవచ్చుననీ, నాలుగో పెళ్ళికి సిద్ధమైన ధనవంతుడైన పెద్దింటి పెద్దయ్యకిచ్చి పెళ్ళిచేయాలని భావిస్తే,దానికి అజ్ఞానమ్మ అంగీకరించేస్తుంది[36].

మొదటి కన్యాశుల్కంలో వెంకమ్మకూడా మేనరికం ఇవ్వాలని ఎంతో పట్టు పడుతుంది. అజ్ఞానమ్మకీ, వెంకమ్మకీ మధ్యగల పోలిక ఇంతే అని అన్నారు ఆరుద్ర (గు.గు.పీ.పు.48).

రెండవ కన్యాశుల్కంలో వెంకమ్మ పాత్రచిత్రణలో గురజాడ ఎంతో జాగ్రత్తను తీసుకున్నారని, దీని కోసం, గిరీశం, వెంకటేశం పాత్రల్లోనూ వైవిధ్యం కల్పించారనీ, కన్యాశుల్కంలో వెంకమ్మ తనకూతురి కోసం చివరికి నూతిలో పడటానికైనా వెనుకాడకపోవటం, అన్నంతపనీ చేస్తుందేమోనని, తన సోదరుడు కరకట శాస్త్రులు 'నాటకం'ఆడవలసి వచ్చిందన్నారు. వెంకమ్మపాత్ర, 'బ్రహ్మవివాహం'లో అజ్ఞానమ్మ వంటిది కాదనీ ఉదాత్తమైందని ఈ పోలికల్ని, తేడాల్ని సోదాహరణంగా వివరించారు (గు.గు.పీ.పు.50) ఇంకా, రెండింటిలో గల తేడాల్ని బాల్యంలో వివాహం చేయడానికీ, పెద్దవాళ్ళకిచ్చి పెళ్ళి చేయడానికి చెప్పేహేతువుల్ని వివరించి చూపారు (గు.గు.పీ.పు.50-52)

వీరేశలింగం 'బ్రాహ్మవివాహం' 'కన్యాశుల్కం' లలో కన్యాదానం శిష్టాచారంగా ఉందని చెప్పేందుకు కొన్ని శ్లోకాల్ని వివరించడం కన్పిస్తుంది[37] ఇంచుమించు ఇటువంటి హేతువుల్నే మొదటి కన్యాశుల్కం లో చెప్పించడం ఉందన్నారు. కన్యాశుల్కం శిష్టాచారమని అగ్నిహోత్రవధాని నమ్మకంగా,సౌజన్యారావు పంతులు ప్రశ్నకి సమాధానం చెప్తాడు వాటిని వివరించి, 'బ్రాహ్మవివాహం' ప్రభావం అప్పారావు మీద అతిస్వల్పంగానే ఉన్నట్లే, మొదటి కన్యాశుల్కం అచ్చుపడ్డాక ఆగ్రంథం కొద్దిగా వీరేశలింగం మీద పనిచేసిందని స్పష్టంచేశారు (గు.గు.పీ.పు.52). కందుకూరి వీరేశలింగం 1897 లో రాసిన 'కన్యాశుల్కం' అనే ప్రహసనతుల్య సంభాషణ రాశారనీ, దాన్ని పేర్కొని, అది ఒకరకంగా అప్పారావు కన్యాశుల్కం పీఠికకు వ్యాఖ్యానం అని చెప్పవచ్చునని నిరూపించారు. కడుపులో వున్న శిశువులను సైతం అప్పుడప్పుడూ అడగడానికి కొంతమంది వస్తున్నట్లు గురజాడ 'కన్యాశుల్కం' పీఠికలో కన్యాశుల్కంవివరాల్ని రాశారు. దీన్ని కందుకూరి కన్యాశుల్కం ప్రహసనానికి రాసిన సంభాషణతో పోల్చి, ఇవన్నీ అప్పారావు పీఠికలో ఒక వాక్యానికి వ్యాఖ్యానం అని ముగించారు ఆరుద్ర (గు.గు.పీ.పు.54)

ఈ పరిశీలనలో ఆరుద్ర తులనాత్మక పరిశీలన కన్పిస్తుంది. అయితే, ఆరుద్ర పేర్కొన్నట్లు 'బ్రాహ్మవివాహం' ప్రభావం గురజాడ మీద ఉన్నప్పటికీ, కందుకూరి వారు 'బ్రాహ్మవివాహాన్ని' వినోదం కోసమే కాకుండా వృద్ధవివాహం, 'కన్యాశుల్కం' దూరాచారాలనుండి ప్రజల్ని విముఖుల్ని చేయాలనే తలంపుతో రాసినట్లు చెప్పుకున్నారు అంటే 'వినోదం' ప్రధాన ఆశ్రయంగానూ, దూరాచారనిర్మూలన ద్వితీయ ప్రాధాన్యత లోనూ కన్పిస్తుంటే, దురాచారనిర్మూలన ప్రధాన ఆశయంగానూ, వినోదం ద్వితీయప్రాధాన్యతగా గురజాడ వారు ఆశించటం గమనించవలసి అంశం.

### 7.1.1.10 గురజాడ–తెలుగు కవులు:

భిన్నకాలాలకు చెందిన కవుల్ని, రచనల్ని తులనాత్మక పరిశీలన చేసి పోలికల్ని గమనిస్తూనే, తేడాల్ని వివరిస్తూ, వారి వారి ప్రత్యేకతలను గుర్తించడం వల్ల ఆ కవుల భావపరిణామంతో పాటు సాహిత్యపయనం,

క్రొత్త శిల్పవిధానాలు రూపొందటం లేదా అభివృద్ధికి అవకాశం కలగడం వంటి విషయాలెన్నో తెలుస్తుంటాయి. గురజాడ అప్పారావుని తెలుగు సాహిత్య చరిత్రలో ఆధునిక సాహిత్యయుగకర్త (గు.గు.పీ.పు.70)గా గుర్తించడానికి గల కారణాల్ని ఆరుద్ర, తెలుగు కవులలో కొంతమందితో తులనాత్మకంగా పరిశీలించారు.

గురజాడ కంటే ముందూ, తర్వాతా తెలుగు సాహిత్యంలో చాలామంది కవుల ప్రగతిశీల భావాలతో రచనలు కొనసాగించినా, వారిలో కన్పించే ప్రత్యేకతలు ఏమిటో ఆరుద్ర స్పష్టించేయడానికి ప్రయత్నించారు.

భాష విషయంలో తిక్కననూ, భావాలలో వేమనను గురజాడ వారు పోల్చుతారన్నారు ఆరుద్ర *సుదీర్ఘ పరిశీలన చేసి చెప్పింది కాక పోవచ్చుగానీ, ఆదికాలంలో తిక్కన, మధ్యకాలంలో వేమన, ఆధునిక కాలంలో గురజాడ మన తెలుగులో మహాకవులని శ్రీ శ్రీ కరెక్టుగానే* చెప్పాడన్నారు (గు.గు.పీ.పు.79). శ్రీ శ్రీ ఈ అభిప్రాయాన్ని 'మత్యాల సరాలు' సంపుటికి పరిచయంరాస్తు **1958**లో అన్నారు[39]. శ్రీ శ్రీ వివరంగా హేతువుల్ని ఆ వ్యాసంలో ఆరుద్ర భావించినట్లే చూపలేదు. ఆరుద్ర,గురజాడను భాషలో తిక్కన భావాలలో వేమనగా చెప్పడమే కాకుండా, వాటిని తులనాత్మకంగా నిరూపించారు.

తిక్కన 'నిర్వచనోత్తర రామయణం' లో కవినింద, సత్కవీంద్ర మార్గసంస్కరణా చేస్తూ, ఆనాటికి భాషావ్యవస్థలో కన్పిస్తున్న దురాచారాల్ని గర్హిస్తూ సంస్కరణను ప్రకటించారన్నారు.

*" ముత్తెనా ముత్యాలసరములు*
*కూర్చుకొనితేట్టైన మాటలు*
*కొత్తపాతలమేలు కలయిక.*
*క్రొమ్మెరుంగులు జిమ్మగా"*

అంటూ గురజాడ తెలుగు కవిత్వానికి తగిన భాష ఏమిటో చెప్పారు.

వేమన భావాలు గురజాడలో చూడవచ్చునంటూ, కులమత భేదాల్ని ఖండిస్తూ వేమన పద్యాల్ని కొన్నింటిని ఉదాహరించి, గురజాడ చెప్పిన

*" ఎల్లలోకము లొక్క యిల్లై*
*వర్ణభేదము లెల్ల కల్లై*
*వేలనెరుగని ప్రేమబంధము*
*వేడుకలు కురియు*
*మతములన్నియు మాసిపోవును*
*జ్ఞానమొక్కటె నిలిచి వెలుగును "*

*అనే యుత్యల సరముల* ఖండితో పోల్చి చూపారు ఆరుద్ర (గు.గు.పీ.పు.81). భాషలో తిక్కననూ, భావాల్లో వేమునగా కన్పిస్తూనే గురజాడ సంస్కృత ఛందస్సులను త్రోసిరాజని కూడా కొత్త ఛందస్సునిచేపట్టారనీ, గురజాడ తెచ్చిన విప్లవం భావకవిత్వపు హయాంలోనూ, అభ్యుదయ కవిత్వపు ఆరంభంలోనూ ఫలించలేదనీ, దీనికి కారణం మన కవుల్లో ఉన్న శబ్దాడంబరాన్ని వదిలించు కోలేక పోవడమే నన్నారు (గు.గు.పీ.పు.2) ఈ కారణాలన్నింటినీ గమనించినపుడు గురజాడ భావపరిణామం, సాహిత్యపయనం, కొత్త శిల్ప, ఛందోమర్మాల్ని అవలంబించడం ద్వారా తెలుగు సాహిత్య అభివృద్ధికి తోడ్పడిన విధానాన్ని ఆరుద్ర చక్కగాతులనాత్మక పరిశీలనతో నిరూపించగలిగారు.

## 7.1.1.11 గురజాడ ఆంధ్రేతర కవులు:

కేవలం తెలుగు కవుల భాషాభావజాలాలతో గురజాడ రచనల్ని సమకాలిన సమాజంతో పరిశీలించడమే కాకుండా, గురజాడ పయనం భావపరంగా గమనించడానికి వీలుగా ఆరుద్ర వివిధ దేశాల సాహిత్యాన్ని తులనాత్మకంగా పరిశీలించారు. వీరిలో పంజాబీసాహితీవేత్త పూరణ్‌సింగ్ (1887-1931), మలయాళీకవి కూమారన్ ఆశాన్(1873-1924) లతో గురజాడను పోల్చి చూపారు.

పూరణ్‌సింగ్, గురజాడ ఇద్దరూ ఫ్యూడల్ వ్యవస్థలో ఉంటూనే రాజభక్తిని ప్రచారంచేశారు. పూరణ్‌సింగ్ రచన, 'ఖులేమైదాన్', గురజాడ రచించిన సారంగధర చరిత్రతో పోలికను చెప్పారు. భాషలు వేరయినా భావాలు ఒకటేననీ, దూరాలెంతయినా, ధోరణులు ఒకటేనన్నారు (గు.గు.పీ.పు.98).

తిరునాళ్ళలో కనబడే వెదురు కర్రల గుడ్డగుర్రాలతో ఆశాన్‌పోలిస్తే, పండిత జన ప్రమోదాలుగా చాలామణీ అయ్యేమహాకావ్యాన్ని కొయ్యబొమ్మలుగా గురజాడ పోల్చారన్నారు (గు.గు.పీ.పు.99) అయితే వీరిద్దరిలో పోలికలు ఉన్నప్పటికీ, ఆశాన్ తెలుగులో రాయప్రోలు సుబ్బారావు రచనలతోనే ఎక్కువగా పాలికలు కన్పిస్తున్నాయన్నారు. ఆశాన్ కావ్యాలు "దురవస్థ" "చండాలభిక్ష" ల్లో తీసుకున్న సమస్య వంటిదే గురజాడ "లవణ రాజుకల"లో కన్పిస్తుందని నిరూపించారు.(గు.గు.పీ.పు.102).

## 7.1.1.12. తొలి తెలుగు చిన్నకథ:

గురజాడ అప్పారావు రచించిన "దిద్దుబాటు" 1910 ఫిబ్రవరి నెలలో భారతి పత్రికలో ప్రచురించారు. 'దిద్దుబాటు' తెలుగు కథానికా సాహిత్యంలో మొట్టమొదటి 'కథ' అనేది నిర్వివాదాంశం కాదన్నారు ఆరుద్ర[40] 1902 లో అచంట వెంకటసాంఖ్యాయన శర్మ 'కల్పలత' అనే పత్రికలో ప్రచురించిన 'లలిత' మొట్టమొదటి తెలుగుకథ అనే ప్రతిపాదన వెలువడిందన్నారు[41]. దీనిని కొంతమంది సరైన పరిశోధన చేయక ఖండించారన్నారు[42]. " 'లలిత' కథ దాని కథనం, భాషాశైలి, అన్నీ పూర్వ ఫక్కీవే. అవి ఆధునికమైనవి కావు" అని సెట్టి ఈశ్వరరావు 'గురజాడ రచనలు-కథానికలు' లో పేర్కొన్న అభిప్రాయాన్ని గమనించిన ఆరుద్ర, సెట్టి ఈశ్వరరావు చెప్పిన విషయాలు సమంజసాలే అని ఒప్పుకొంటూనే, ఆచంట వారి 'విశాఖ' కథ ప్రథమ స్థానానికి పోటి చేస్తుందన్నారు[43]. రెండు కథల్లోని భాషను పోల్చి 'దిద్దుబాటు' కూడా తొలుత గ్రాంథిక వాసనలతోనే వెలువడిందనీ, ఆచంట

వారు 1904 లో రాసిన 'విశాఖ' చిన్నకథ అని అన్ని రకాలా చెప్పుకోవచ్చు సాంఖ్యాయన శర్మ ప్రభావం గురజాడ మీదపడి ఉండుందన్నారు[44] 'విశాఖ' మొట్టమొదటి తెలుగు కథానిక అయినంత మాత్రాన గురజాడ గురు పీఠానికి చలనం లేదు. ఆయన ఇంకెన్నో విషయాలతోనో ఆద్యుడు అని ఆరుద్ర ముగించారు[45]. సత్యాన్ని బహిర్గతం చేయడంలో ఆరుద్ర రాగద్వేషాలకు అతీతుడుగానే వ్యవహరిస్తుండటం గమనించదగ్గది.

తులనాత్మక పరిశోధనకు ఆరుద్ర చేసిన ప్రయత్నం ఇంతవరకు అధ్యయనం చేసిన 'గురజాడ వ్యక్తిత్వం, రచనల'న్నింటిలోను కన్పిస్తుంది.

## 7.2. కవి జీవిత పరిశోధన (Bio-graphical Research):

ఆరుద్ర చేసిన కొన్ని పరిశోధనల్లో "కవిజీవిత పరిశోధన" కన్పిస్తుంది. కవితత్త్వాన్ని అతని రచనల ద్వారా దర్శించడం కవిజీవిత పరిశోధనలో ప్రధానలక్ష్యం. కానీ, ఇది మనో విశ్లేషణ అంశానికి చెందిందికాదు. మనో విశ్లేషణ కూడా సహకారి కావచ్చు. ఒక కవి లేదా రచయిత తన జీవిత కాలంలో చేసిన రచనలన్నింటినీ అనుసరించి, ఆ కవిని లేదా ఆ రచయితను ఒక అంచెనా వేయడానికి కవి జీవిత పరిశోధన పద్ధతిని అనుసరించడం తెలుగు పరిశోధనలో గమనించ వచ్చు. అయితే, ఆ పరిశోధనలు ఈ పేరుతో చాలా మంది పేర్కొనలేదు. కవులు, రచయితలు, రచయిత్రుల రచనలపై 'సమగ్ర పరిశీలన' పేరుతో జరుగుతున్న పరిశోధనలన్నీ ఈ పద్ధతిలోకే చెందుతాయి. డిగ్రీల కోసమే కాకపోయినా, ఒక రచయిత/కవి రచనలన్నింటినీ సమగ్రంగా అందించాలనే తలంపుతో కొన్ని సంపుటాలుగా ప్రచురించినప్పుడు, ఆ రచయిత/కవి గురించి విశేషకృషి చేసిన వారు అందించే ముందు మాటలోనూ, కవిజీవిత పరిశోధనల వంటివి కొన్ని కన్పిస్తున్నాయి. గురజాడ అప్పారావు రచనలకు సెట్టి ఈశ్వరరావు, బంగోరెల వ్యాసాలూ, కందుకూరి వీరేశలింగం రచనల సంపుటాలకు అక్కిరాజు రమాపతిరావు, కొడవటి గంటి కుటుంబరావు, సాహిత్య సంపుటాలకు కేతువిశ్వనాథారెడ్డి, శ్రీ శ్రీ రచనలకు ఏటుకూరి ప్రసాద్ వంటి వారు రాసినవి ఈ కోవకే చెందుతాయి. ఈ సందర్భంలో గమనించ వలసిందాంట్లో, కవిజీవిత విమర్శ (Bio-graphical criticism) దీన్నే మరికొంత మంది కవిజీవిత సమన్వయ విమర్శగా కూడా పేర్కొన్నారు.[46] 'కవి జీవిత పరిశోధన' కీ గల భేదం విమర్శకీ పరిశోధనకి ఉన్నట్లే ఉంటుంది. 'కవుల జీవిత ఘట్టాలూ, వారి మానసిక స్థితులూ, వారి తాత్త్విక భావనలూ' వారి రచనలలో ఎలా ప్రతిబింబించాయని కాని, వారి వ్యక్తిత్వాలు కృతులనెలా రూపొందించ జేశాయని కాని వివేచించే విమర్శపద్ధతిని 'కవిజీవిత కావ్య సమన్వయ విమర్శ' గా జి.వి.సుబ్రహ్మణ్యం భావించారు[47]. ఎస్వీ. రామారావు అభిప్రాయంలో 'కవి జీవితానికీ, కావ్యరచనకీ ఉన్న సంబంధాన్ని పరిశీలించి, వాటిని సమన్వయంలో విమర్శకు పూనుకోవడం గా చెప్పి, కవి ఆత్మీయత రచనలో ప్రతిఫలిస్తుంద'న్నారు[48]. కవి వ్యక్తిత్వం,అతని జీవితంలోని భౌతిక, మానసిక, తాత్త్విక విశేషాలు, అతని కావ్యంలో ఎలాప్రతి ఫలిస్తాయో విశదీకరించడం ప్రధాన మవుతాయన్నారు. ఈ పద్ధతిలోనే 'కవిజీవిత పరిశోధన' కూడా కొనసాగినప్పటికే పరిశోధాన ఫలితాలపైనే విమర్శకుడు అధారపడవలసివస్తుంది. సేకరణ, చారిత్రక సత్యప్రకటనల వంటివన్నీ

ఆకరాలు మీద ఆధారపడకుండా విమర్శ కొనసాగడానికి అవకాశం లేదు. కవిజీవిత సమన్వయ విమర్శ కొనసాగాలంటే ఈ విమర్శపద్ధతికి పరిశోధనలోనే ఆకరాలు లభిస్తాయి. పరిశోధకుడు, విమర్శలక్షణాల్ని కూడా అవగతం చేసుకొని తన అధ్యయనం కొనసాగించ గలిగినప్పుడు రెండింటినీ తాను ఒకే పద్ధతిలో వ్యక్తీకరించవచ్చు. ఈ కవిజీవిత పరిశోధనపైనా, ఈ కవిజీవిత కావ్యసమన్వయ విమర్శకైనా బాసటగా నిలిచే వాటిలో చారిత్రక, మనోవిశ్లేషణ పరిశోధన, విమర్శల సహకారం చాలా ఉంటుంది. కవి కాలనిర్ణయం, జన్మస్థల చర్చ, గ్రంథ రచనాకాలం కవి జీవితాన్ని ప్రభావితంచేసిన దేశకాల పరిస్థితులవంటి వన్నీ చరిత్ర పరిశోధనకు చెందినవైతే, కవి మానసిక అనుభూతులు, ఆత్మీయతలు వంటివన్నీ మనోవిశ్లేషణ నుండి స్వీకరించి, 'కవిజీవిత పరిశోధన' రూపొంది, కవి సర్వవిషయాల్ని విశ్లేషించడానికి అవకాశం కలుగుతుంది. చారిత్రక పరిశోధనలో అంతగా ప్రాధాన్యతలభించని సాహిత్య విషయాల్లోశైలి, భాషాప్రయోగాలు, శిల్పపద్ధతులు పాఠ పరిష్కారాలు వంటివన్నీ 'కవిజీవితపరిశోధన'లో ప్రాధాన్యతను వహించి, సమగ్రతకు తోడ్పతుంటాయి. ఈ దృష్టితో ఆరుద్ర కొనసాగించిన పరిశోధనలో కవిజీవిత పరిశోధన ను పరిశీలించే అవకాశం ఉంది.

సమగ్ర ఆంధ్ర సాహిత్యంలో కవిజీవిత పరిశోధన విమర్శలను 'సాహిత్య చరిత్ర పరిశోధన'లో అంతర్భాగంగా చేసుకోవటం ఆరుద్ర పరిశోధనలో ప్రత్యేకత. అదే సమగ్ర ఆంధ్ర సాహిత్యంలో రాసిన కవులైనప్పటికీ, ప్రత్యేక కృషిచేసి వ్యాసాలరూపంలో అందించిన వారిలో *వేమన*, *గురజాడ*లు ప్రధానంగా కన్పిస్తున్నారు. వీరిలో గురజాడని చారిత్ర కోణంతో సాహిత్య పరిశోధనలో కొన్ని అంశాల్ని తులనాత్మక పరిశోధన విమర్శ పద్ధతిలో పరిశీలించారు. సమగ్ర ఆంధ్ర సాహిత్యంలో గురజాడ రచనల్ని సాహిత్య చరిత్ర పరిశోధనలో అంతర్భాగంగానే చేసుకొంటే, వేమన గురించి మాత్రం కవిజీవిత పరిశోధన పద్ధతిలో పరిశీలించారు.

వేమన కాలం, స్థలం, కులం, కుటుంబం, తాత్త్విక నేపథ్యం, పద్యపరిష్కారం, శైలీ, భాష వంటి అంశాల్ని అధ్యయనం చేసి, వేమన జీవితాన్ని పరిశోధించారు. కేవలం కాలం, స్థలం, కులం, దేశకాలప్రభావాలను మాత్రమే అధ్యయనం చేసినట్లయితే అది చారిత్రకపరిశోధనలో చేరిపోయి ఉండేది. అలా కాకుండా వేమన పద్యాల్లో కన్పిస్తున్న శైలీ, భాష, వంటివాటిని బట్టి సాహిత్యంలో వేమన కవిగా తెలుగు సాహిత్యంలో విశిష్టస్థానం ఉందని నిరూపించారు. చరిత్ర అంశాల్ని మాత్రమే నిరూపించడానికి పరిశోధనను వినియోగించి నట్లయితే వేమనను ఒక చారిత్రక వ్యక్తిగానే చారిత్రక పరిశోధవ వల్ల ఆరుద్ర తేల్చి ఉండేవారు. చారిత్ర కోణాన్ని కల్గి ఉన్నా, ఆరుద్ర తన అధ్యయానాన్ని సాహిత్య ఆధారాలలో తిక్కన, శ్రీకృష్ణదేవరాయలు, తెనాలి రామలింగకవి, `పాలవేకరికదరీపతి' వంటి కవుల ప్రయోగాల్ని, కవిస్తుతుల్లో ఎరపాటి ఎర్రన, నిమ్మల లక్ష్మన్న వంటివారు పేర్కొన్న పద్యాల్ని బట్టి, వేమన జీవితాన్ని అంచెనా వేశారు. కేవలం చరిత్రకారులైతే శాసనాలు, కైఫీయత్తులు, రాజులపాలనా కాలనిర్ణయాలు, నాణేలు వంటి వాటిని ప్రధాన ఆకరాలుగా స్వీకరించేవారు. వాటిలో కొన్నింటిని పరిశీలించినా, సాహిత్య ఆధారాలతోపాటు, ఆంత్రోపాలజీని కూడా సహకారంగా తీసుకోవటం కన్పిస్తుంది. మానవజీవితంలో కులం, వర్గం, వృత్తుల పట్ల ప్రత్యేక అధ్యయనం 'ఆంత్రోపాలజీ'లో

జరుగుతుంది. కనుక వీటినీ తీసుకోవడం వల్ల ఆరుద్ర పరిశోధనలో సాహిత్యపరిశోధనకి సాహిత్యేతర శాస్త్రాల సహాయంకూడా అవసరమైందని తెలుస్తుంది. వేమన పద్యాల్లో కన్పిస్తున్న గ్రామనామాలకు సామాజికి భాషాశాస్త్ర సహాయంకూడా తీసుకున్నారు. వీటితోపాటు పూర్వపరిశోధకుల పరిశీలనలను గమనించి, తనదైన పరిశోధనా ఫలితాంశాల్ని ప్రకటించారు. వీటిని కింది విధంగా పరిశీలించ వచ్చు.

## 7.2.1 వేమన కాలం:

వేమన కాల నిర్ణయం విషయంలో పండితుల్లో ఏకాభిప్రాయంలేదు. వేమన కాలనిర్ణయం చేయడానికి ఆరుద్ర కొంత ప్రయత్నించారు. కవి తనకావ్యంలో పేర్కొన్న సుప్రసిద్ధ చారిత్రక వ్యక్తుల కాలాన్నిగాని, వర్ణించిన సంఘటనలను ఆధారంగా తీసుకొని గాని ఒక కవి కాలనిర్ణయం చేస్తుంటారు. ఈ పద్ధతిలోనే ఆరుద్ర పరిశీలన చేశారు.

లోకంలో వేమన పద్యలుగా ప్రచారంలో ఉన్న పద్యాల్లో వర్ణించిన సంఘటనలను బట్టి, అలాగే, వేమన ప్రభావంతో కవులు వర్ణించిన కవిస్తుతి పద్యాలను పరిశీలించారు. దీనితో పాటు ఆ కవులు జీవించిన చారిత్రక వ్యక్తుల (పాలకులు) కాలాన్ని కూడా పరిగణనలోకి తీసుకున్నారు. విదేశాల నుండి మనదేశానికి మత ప్రచారానికి వచ్చిన వారు ఆంధ్రరాష్ట్రంలో గల కావ్య ప్రతుల్ని సేకరించి, వారిదేశాలకు తీసుకొని పోయిన గ్రంథాల్లో వేమన వివరాల్ని ఆరుద్ర పరిశీలించారు. తమకు పూర్వం వేమన గురించి చేసిన పరిశోధకుల నిర్ణయాల్ని తన అధ్యయనానికి వినియోగించుకొని, హేతుబద్ధమైన సమన్వయాన్ని చేయడానికి ప్రయత్నించారు. గతంలో తాను వేమన కాలనిర్ణయంలో చేసిన పరిశోధనల్ని, మళ్ళీ మరికొన్ని ఆకరాలు లభించడంవల్ల కొత్త ఫలితాలశాల్ని ప్రకటించారు.

ఆరుద్ర గతంలో చేసిన వేమన కాలనిర్ణయంలో చేసిన పరిశోధనల్ని అనుసరించి, సమగ్ర ఆంధ్ర సాహిత్యం (12సం.) (తొ.ము.) లో ములా బ్రౌనుదొర నోట్సు ఆధారంగా వేమనకాలం 1650 ప్రాంతంగా చెప్పారు. కానీ, ఇటీవల దొరికిన మరికొన్ని ఆకరాలు (Sources) కారణంగా, తన పరిశోధన ఫలితాన్ని తానే కాదని ఒప్పుకొని, కొత్త ఫలితాంశాన్ని వివరించారు.

వేమన కాలాన్ని వంగూరి సుబ్బారావు **1412-1480** గానూ, శేషాద్రి రమణకవుల **1460-1600** గానూ, వేదం వెంకటకృష్ణశర్మ **1565-1625** గాను, వేటూరి ప్రభాకర శాస్త్రి **1650**గానూ, బండారు తమ్మయ్య **1652-1725**గానూ, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ **1700-?** గాను సురవరం ప్రతాపరెడ్డి **1600-1757** గానూ, బ్రౌను **1652-1725**గానూ, ఎన్.గోపి **1650** ప్రాంతాలుగానూ పేర్కొన్నారు[49] వేమన కాలనిర్ణయానికి తనసిద్ధాంత గ్రంథంలో వివిధ వాదోపవాదాల్ని ఎన్.గోపి చర్చించారు. ఈ గ్రంథాన్ని చదివినట్లు ఆరుద్ర పేర్కొన్న పాదసూచికలను బట్టి తెలుస్తుంది. ఎన్.గోపి వాదనకంటే ఆరుద్ర చెప్పిన ప్రత్యేకాంశాలనూ పరిశీలించడానికి కిందివిధంగా ప్రయత్నించవచ్చు.

'వేమన గురించి మొట్టమొదట పేర్కొన్న పాశ్చాత్య పండితుడు ఫ్రెంచిమత గురువు అబే. దుబాయ్ ' **1792** నుండి **1823** వరకూ భారతదేశంలో మతబోధ చేశాడు. **1806**లో ఆయన రాసినగ్రంథం

"Hindu manners, customs and ceremonies". దీన్ని ఆరుద్ర "హిందువుల ఆచారాలు" అనే గ్రంథంగా పేర్కొన్నారు (మ.వే.పు.13) అబేదుబాయ్ ఈ గ్రంథంలో వేమనను ప్రస్తావిస్తూ గడచిన నూట ఏభైసంవత్సరాలమధ్య జీవించి, 17వ శతాబ్దం చరమపాదంలో మృతి చెందినట్లు రాశాడు[50]. అంటే 1650 తర్వాత 17శతాబ్ది చరమ పాదం అవుతుంది. దీన్ని ఎన్.గోపి 1675 తర్వాతగా పేర్కొని, 1650 ప్రాంతంలో వేమన బ్రతికే ఉన్నట్లు నిర్ధారించారు. దీన్ని ఆరుద్ర 1656 ప్రాంతంలో వేమన జీవించినట్లు భావించారు (మ.వే.పు.13) ఈ కాలన్నిర్ణయం వాస్తవానికి దరిదాపుల్లోనే ఉందంటూ, తన పరిశీలనను కొనసాగించారు.

వేమనను పూర్వకవిస్తుతిలో వర్ణించిన ఎరపాటి ఎర్రన (ఎడపాటి ఎర్రనగా కూడ పాఠాంతరం కన్పిస్తుంది). నిమ్మల లక్ష్మన్న, సోమేశ్వరాచార్యులు, తురగారాజకవి[51] – అయ్యంకి సరస్వతి (జంట కవులు) వేమనను పేర్కొన్న వేమననూ, వీరి కాలాన్ని వీరికృతుల్ని అంకితం చేసుకొన్న వారి కాలా న్ని అనుసరించి వేమన కాలాన్ని నిర్ణయించడానికి అవకాశం ఉంది. కనుక ఈ పద్ధతినీ ఆరుద్ర అనుసరించారు.

ఎరపాటి ఎర్రన '*మల్హణ చరిత్ర* 'ను రాసి చుండికాళయ్య అనే కరణానికి అంకితమిచ్చాడు. (మ.వే.పు.34) కృత్యాదిలో తనకావ్యాన్ని "*కృష్ణరాయ జనకాంతునికి ఇవ్వకుండా దాచి, కాళయ్యకిస్తున్నట్లు*" వర్ణించారు. దీనిలో '*కృష్ణరాయలు* శ్రీకృష్ణదేవరాయలు కాదనీ, "నంధ్యాల కృష్ణంరాజు" అన్నారు ఆరుద్ర. ఈ రాజు చుండి, వేజెళ్ళ, తెట్టు సంస్థానాధీశ్వరులలోని వాడన్నారు (మ.వే.పు.37). ఈ *మల్హణ చరిత్ర*ను ప్రచురిస్తూ దానికి పీఠికరాసిన చోడవరపు జానకిరామయ్య చుండికాళయ్యను 16వ శతాబ్దానికి చెందినవాడు కాదనీ, 17వ శతాబ్దంలో ఉండి ఉండవచ్చునే ఆధారాన్ని ఆసరాగా చేసుకొని *కృష్ణరాయలు* గా ఎరపాటి ఎర్రన వర్ణించిన రాజు *(శ్రీకృష్ణదేవరాయలు* కాదని ఆరుద్ర ఒక నిర్ణయానికొచ్చారు. వేజెళ్ళ వంశంలో ఇద్దరు కృష్ణంరాజులు ఉన్నారు. మొదటి కృష్ణంరాజు 1600 నుండి 1630 వరకూ పరిపాలిస్తే ఆతని మనవడైన రెండవ కృష్ణంరాజు 1678 నుండి 1693 వరకూ పాలించారు[52]. వీరిద్దరిమధ్యా ఎరపాటి ఎర్రన కు సంబంధం ఉంటుంది. మొదటి కృష్ణరాయలకి పరిణితవయసు లేనందున కృతి అంకితమివ్వలేదు. దాన్ని తన బంధువు, కరణీకం చేస్తున్న చుండికాళయ్యకు అంకితమిచ్చాడు. ఇతడు రెండ వ కృష్ణంరాజుకి సమకాలికుడే, దీన్ని అనుసరించి చుండి కాళయ్య 1678-1693 సంవత్సరాల మధ్య వాడవుతాడని ఆరుద్ర చెప్పారు (మ.వే.పు.37). కృతి స్వీకర్త కాలాన్ని తెలుసుకోవటాన్నిది ఉపయోగ పడుతుంది. చుండికాళయ్య జీవించిన కాలాన్ని బట్టి వేమన కాలాన్ని నిర్ణయించడానికి అవకాశం ఉన్నా, దీనితోనే తన నిర్ణయాల్ని ఆరుద్ర ప్రకటించలేదు.

వేమన పూర్వ కవిస్తుతిలో వర్ణించిన నిమ్మలలక్ష్మన్న "ఏకామ్ర లింగశతకం" తాళపత్ర గ్రంథాన్నీ పరిశీలించి, "*మొగలాయి దెబ్బలకె మురిగెను నీకథ తెల్ల, తగపార్థు దెబ్బకు తాళితెట్లు*" అనే ఒక ఎత్తి పొడుపు ని అనుసరించి, 1680 లో ఛత్రపతి శివాజీ మరణించటం, 1686లో అక్కన్న మాదన్నల హత్య, ఆ తరువాతనే మొగలాయిలు కంచి, తిరుపతి లపై దాడి చేశారన్నారు. నిమ్మల

లక్ష్మన్న 17వ శతాబ్దానికి చెందిన వాడవుతారన్నారు. కనుక ఈ కవి స్తుతించింది "వేమన్న" నేనని ఆరుద్ర అన్నారు.(మ.వే.పు.39) ఈ పరిశీలనలోనూ వేమన 17వ శతాబ్దానికి చెందినవాడవుతాడనేదే ఆరుద్ర అభిప్రాయం. కానీ ఇంకా ఈ విషయమై పరిశీలన కొనసాగించారు.వేమనను పూర్వకవిస్తుతుల్లో 'అన్యవాద కోలాహలం' శతకం 1750 పూర్వానిది కావచ్చుననీ, 'నాగరఖండం' రచించిన జంటకవులు (తురగా రాజకవి, అయ్యంకి బాలసరస్వతి) కూడా వేమన ను స్తుతించారు. దీన్ని 17వ శతాబ్దానికి చెందిన దానిగానే పరిశీలించారు. ఈ విధంగా బ్రౌనుదొర 1652 లో వేమన జన్మించినట్లూ, 1725లో సిద్ధిపొందినట్లు గుర్తించినదాన్నీ ఆరుద్ర పరిశీలించారు.

వేమన ఎప్పుడు పుట్టారో వారి పద్యాల వల్ల తెలియక పోయినా, కనీసం జీవించిన కాలం గుర్తించటానికి వీలుంటుందేమోనని కొన్ని పద్యాల్ని పరిశీలించారు. పారిస్ ప్రతిలోని...

*"బాల్యవార్ధకములు పరగంగబొందిది*
*సప్తదశకమునెడు సరణిసుమ్ము*
*(వివరమెంచి) జూచి వేదాంత మెరుగడే*
*విశ్వదాభిరామ వినురవేమ"*

అనే పద్యంలో సప్తదశకం ను బట్టి వేమన 70 సంవత్సరాలు జీవించి ఉండవచ్చు ననీ, 1650 నుండి 1700 వరకూ దేశంలో వేమన సంచారం చేసి ఉంటారని ఆరుద్ర ఊహించారు.(స. ఆం.సా., పు.ము.viii.పు.34)

తంజవూరు సరస్వతి మహలు లో గల వేమన తాళపత్ర ప్రతుల్ని పరిశీలిస్తే, దానిలో 'కొంకణం' "మొరుగు" పదాలు కన్పిస్తున్నాయి. దీని ఆధారంగానూ, 1715 లో వచ్చి, మతప్రబోధం చేస్తూనే, తెలుగు గ్రంథాల్ని కొన్నింటిని పారిస్ నగర గ్రంథాలయానికి 1730 లో ఫాదర్‌లీగాక్ (సంజీవ నాథస్వామి పేరుతో మత ప్రచారం నిర్వహించారు) పంపిన గ్రంథాల్లో వేమన పద్యాల సంకలనం కూడా ఉండటం, దానితో ఒక పద్యం సప్త దశకం పదాల్ని చరిత్ర ఆధారంగా వేమన కాలాన్ని ఆరుద్ర నిర్ణయించటానికి ప్రయత్నించారు. తంజావూరి ప్రతిలో వేమన పద్యం.

*"మొరుగు రాజ్యమెల్ల ముక్క బోవును కొంత*
*రామునాథమేగి రట్టుపడును*
*వినని వింతలెల్లె వినును కొంకణమందు*
*విశ్వధాభిరామ వినురవేమ"*

లో "మొరుగు" అసాధు పాఠమనీ, 'మొరకు' రాజ్యం అని వేమన ఉద్దేశించి ఉంటారన్నారు ఆరుద్ర. (స. ఆం.సా.,పు.ము.viii.పు.61) ఈపద్యాన్ని బంగోరె 'మొరసు' రాజ్యం అనే పాఠాంతరాన్ని ఇచ్చారు. శహాజీ పరిపాలనా కాలంలో ఛత్రపతి శివాజీ కుమారుడు రాజారాం చెంజికోటలో ఉండేవారు మొగలాయి సైన్యాలు చెంజిని 1691 నుండి 1697 వరకూ ముట్టడించాయి. రాజారాం సహాయార్థం

శహాజీ సేనలు పంపించవలసిన తరుణంలోనే సేతుపతి తన రాజ్యాన్ని మధుర నాయకరాజులు కల్లోల పరుస్తున్నారని మొరపెట్టుకొంటూ సహాయం అర్థించాడు. శహాజీ తన సేనలను చెంజికి పంపించకుండా రామనాథునికి పంపాడు. ఆసేనలు శత్రువుల్ని ఓడించి సేతుపతి రాజ్యాన్ని నిలబెట్టాయి. రామనాథునికి వెళ్ళి రట్టుపడిన వాళ్ళు మధుర నాయక రాజు 'మొరకు' అన్నదే వేమన చెప్పిన పాఠం అయితే ఈ చరిత్ర విషయాలు సరిపోతాయన్నారు. చెంజి కోట మొగలాయి ముట్టడిని తట్టుకోవడనీ, "కొంకణం" లో ఈ వార్త వింతగానే కనబడి ఉండవచ్చునీ ఆరుద్ర అన్నారు. ఇది వేమన పద్యమే అయితే, వేమన తంజావూరు లో 1697 లోపున ఉండడానికి అవకాశం ఉంటుందన్నారు. ఈ చారిత్ర కోణంతో 'బంగోరె' 1980లో ఒక పరిశీలన చేసినా, ఈ విధమైన సమన్వయం కన్పించలేదు[53]. ఆరుద్ర శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో రెండు ఉపన్యాసాలిచ్చింది 1981లో నని "మనవేమన"ను బట్టి తెలుస్తుంది. 'కొంకణం' గురించి వివరిస్తూ ఆరుద్ర మహారాష్ట్రుల మాతృదేశం 'కొంకణం' మనీ, వేమనకాలంలో మహారాష్ట్రాన్ని 'కొంకణం' గా పిలవడానికి అవకాశం ఉందన్నారు. ఈ పరిశీలనలో పూర్వకవిస్తుతుల్లో పేర్కొన్న కవుల పద్యాల్ని, అంకితం పొందిన వారి కాలాల్ని అనుసరించి, 1678-1693 ఒక కాలాన్నీ, జంటకవుల కవిస్తుతి వర్ణనలను బట్టి, 17వ శతబ్దంగానూ, బ్రౌను గుర్తించిన కాలం 1652-1725 లనూ, పరిశీలించి, చివరిగా చారిత్రక ఆధారాలతోనూ, పద్యంలో ఉన్న భావాల్ని అనుసరించి తంజావూరులో 1697 లోపున ఉండడానికి అవసరం ఉందంటూనే, 1650 నుండి 1700 వరకూ దేశంలో వేమన సంచారం చేసి ఉండవచ్చునన్నారు.. వేమన మరొక పద్యంలో కన్పిస్తున్న 'సప్తదశకం'అనేపదాన్ని అనుసరించి 1697లో తన డెబ్బయ్యోయేట తంజావూరులో ఉండి "మొరకు రాజ్యం" పద్యం చెప్పారనుకొంటే 1627 ప్రాంతంలో వేమన జన్మించారని ఊహించవచ్చునన్నారు.(మ.వే.,పు.44) దీన్ని సమగ్ర ఆంధ్ర సాహిత్యం, పునర్ముద్రణ ఆరవసంపుటి (పు.2. 4) లో వేమన కాలాన్ని ధృవీకరించి నట్లు స్పష్టం చేశారు.

ఆరుద్ర కంటే ముందే వేమన కాలనిర్ణయంలో పరిశోధన చేసిన ఎన్.గోపి పూర్వ కవి స్తుతుల్లో వర్ణించిన వేమన గురించి చెప్తూ, యోగిగానే మన పూర్వులు భావించారు కానీ, కవిగా భావించలేదనీ, బండారు తమ్మయ్య వాదనతో ఏకీభవించారు[54]. పాశ్చాత్యులైన అబే దుబాయ్, బ్రౌనులు పేర్కొన్న వేమన కాల నిర్ణయాల్నీ పరిశీలించిన ఎన్.గోపి, వేమనకాలాన్ని 1650ప్రాంతంగా నిర్ణయించారు[55] వీటిని పరిశీలించినా ఆరుద్ర మన వేమన గ్రంథంలోగానీ, సమగ్ర ఆంధ్ర సాహిత్యం (8వ సం.పు.ము) లో గాని వేమనకాలాన్ని నిర్ణయించడంలో తన పరిశోధనకే కట్టుబడటం కన్పిస్తూనే, మరిన్ని ఆధారాలు దొరికితే మంచిదనే అభిప్రాయాన్ని వ్యక్తీకరించారు.(మ.వే.పు.42)

## 7.2.3. వేమన స్థలం – కులం– కుటుంబం:

వేమన జీవితాన్ని సమగ్రంగా అవగాహన చేసుకోవడానికి కాలంతో పాటు, స్థలం, కులం, కుటుంబం, తాత్త్విక నేపథ్యం వంటివాటిని పరిశీలించడం పరిశోధకులకు,చరిత్ర కారులకు అవసరమవు తాయి[56].భారతీయ సమాజంలో ప్రతివారికీ పుట్టకముందే 'కులం' నిర్ణయమవుతుంది. పుట్టిన కులాన్ని బట్టి, పెరిగిన వాతావరణాని బట్టి ఆ వ్యక్తి మూర్తిమత్వం వికాసం చెందుతుంది. స్వయంగా

వేమన తన పద్యాల్లో, తన ఊరునీ, కులాన్ని చెప్పుకున్న పద్యాలు కన్పిస్తుండడం వల్ల, వేమన జీవితాన్ని అర్థం చెసుకోవడానికి సులభ మవుతుంది. అయితే, పద్యాల్లో పాఠాంతరాలు కన్పించడం వల్ల 'ప్రాంతం', 'కులం' విషయంలో సందేహాలు కూడా వ్యక్తమయ్యాయి. పరిశోధకులు భిన్న ఫలితాంశాలను ప్రకటించారు. వేమన కేవలం తెలుగు ప్రాంతాల్లోనే కాకుండా తంజావూరు వంటి ఆంధ్రేతర పాంతాల్లోనూ పర్యటించడం, ఆ భాషల్లోనూ వేమన పద్యాలు కన్పించడం వంటి వాటి వల్ల వేమన ప్రాంతాన్ని, కులాన్ని సాధ్యమైనంత విస్పష్టంగా కనుగొనవలసిన అవసరం ఉంది. ఈ స్పష్టత సాహిత్య చరిత్రకు చాలా అవసరమవుతుంది.

ఆరుద్ర తన పరిశీలనలో, వేమన స్థలం, కులం, కుటుంబాలను, వేమన పద్యాలు, ఇతర సాహిత్య చారిత్రక ఆధారాలతో పరిశోధించారు.

'ఒక కవి స్వస్థలాన్ని, అందులోనూ వేమన వంటి చాటుకవి ఉనికి పట్టును నిర్ణయించేటప్పుడు కేవలం ఒక పద్యాన్ని పట్టుకొని పాకులాడడం సముచితం కాదు, వే మన తమ పద్యాలన్నింటిలోనూ వాడిన స్థల నామాలను పరిశీలించవలసి ఉటుందని, కొన్ని స్థలనామాల్ని అకారాది క్రమంలో, పద్య సంఖ్యతో సహ విభజించి, పరిశీలించారు.(మ.వే.పు.112)

వేమన పద్యాల్లో కన్పిస్తున్న స్థలనామాల్ని పరిశీలించి, 32గ్రామ నామాలుగా కనుగొన్నారు. (మ.వే.పు.114). వీటిలో మళ్ళీ తెలుగు ప్రాంతాలకు చెందిన గ్రామాల్ని 21గా గుర్తించారు. మిగిలిన గ్రామనామాలను వేమన తన తాత్త్విక భావాల్ని చెప్పడానికి, పద్యాల్లో ఛందస్సుకి అనుకూలంగా ఉపయోగించుకొంటూనే "ఉత్తరాన గోదావరి నుండి దక్షిణాన సేతువు (తమిళనాడు) వరకూ, తూర్పున దివిసీమ లోని 'మోపిదేవి' నుండి, పశ్చిమాన కొంకణం వరకూ వేమన పర్యటించిన ప్రాంతంగా ఆరుద్ర చెప్పారు. (మ.వే.పు.115) ఆరుద్ర గుర్తించిన స్థల నామాలను చూస్తే, ఉదయ పర్వతం, కంబం, కటారు పల్లె, కదిరి, కంచి, *కొండవీడు*, గండికోట, తిరుపతి, తిరుమల, నందిదుర్గం, *మూగచింతల*, మోపిదేవి, శ్రీశైలం (పర్వతం) గోదావరి మొదలైనవిగా తెలుస్తున్నాయి. ఇవి ఎక్కువగా రాయలసీమ పాంతానికి చెందినవని స్పష్టమవుతున్నాయి. వీటిలో కొండవీడు మూగచింతలను బట్టి ప్రాచీన లేఖకులు 'కొండవీటి పద్యం'లో మూగచింతల ఏ కారణాల వల్ల చేర్చారో గాని వేమన పూర్వీకుల గ్రామం అదే అయితే, చిత్తూరు జిల్లా వాయిల్పాడు తాలూకాలో గ్రామం బహుశా వేమన గారి కుటుంబానికి సంబందించినదే అవుతుంది" అని ఆరుద్ర తేల్చారు. (మ.వే.పు.117).

ఈ ఫలితాంశంలో ఇంకా కొంత పరిశోదించాల్సిన అవసరం ఉందనే భావాన్ని "*అదే అయితే*" '*బహుశా*' వంటి పదాలు స్ఫురింపజేస్తున్నాయి. అందువల్ల, ఆరుద్ర తన అన్వేషణను మరింత కొనసాగించారు. చారిత్రక ప్రాంతమైన *కొండవీడు*తో ఎలాంటి వివాదం కన్పించక పోయినా, వేమన పేర్కొన్న *మూగచింతలపల్లి* తోనే పరిశోధనలో ఆరుద్రకి సమస్య కన్పించింది. ఈ *మూగచింతలపల్లి* ఆంధ్రరాష్ట్రంలో మూడు చోట్లే కనిపిస్తుందనీ, వీటిలో ఏ *మూగచింతలపల్లి* గురించి వేమన చెప్పాడనేది ఆరుద్ర పరిశీలనాంశం!

ఈ స్థలం వేమన పద్యాల్లో భిన్న రూపాల్లో కన్పిస్తుంది. వివిధ పాఠపరిష్కారాలను అనుసరించి ఆ పద్యలు కింది విధంగా ఉన్నాయి.(మ.వే.పు.106,107-111).

"ఊరు కొండవీడు ఉనికి పశ్చిమ వీధి
'మూగసేతకెల్ల' మొదటియిల్లు
యరసి చూడ చూడ నదె ముక్తి మార్గమే
విశ్వదాభి రామ వినుర వేమ" (D 174పు. 467)

వేమన సూక్తి రత్నాకరం (సంకలనకర్త: రాయ వరపు పూర్ణయాచారి (బందరుప్రతిగా ప్రసిద్ధి ప్రతిలో...

"ఊరు కొండవీడు నునికి పశ్చిమవీధి
'మూగచింతపల్లె' మొదటి ఇల్లు
అరసిచూడ బయలునదె ముక్తిశివుడయా
విశ్వదాభిరామ వినుర వేమ "(వే.సూ.ర:569)

ఇంకా మరికొన్ని పాఠాంతరాలు కన్పిస్తున్న వని ఎన్.గోపి గుర్తించిన వాటిని ఆరుద్ర పేర్కొన్నారు.

1. 'మూగ **చింతపల్లి** మొదటి ఇల్లు'(D 1723–504)

2. 'ఊరుకొండపల్లె ఉనికి పశ్చిమవీధి
   '**మూక చింతపల్లె** మొదటి యిల్లు
   ఆత్మ రాక పోక అదియె పోతత్త్వంబు'(D 1725–646)

3. 'మూలచింత కడకు ముందరిల్లు
   అరశి చూడ బయలు ఆడనెశివుడుండు'(D 1727–324)

వీటితో పాటు 'వావిళ్ళ వారిసంకలనం'లో పద్యాన్ని ఆరుద్ర గుర్తించారు.

'ఊరుకొండవీడు నునికి పశ్చిమవీధి
'మూగ చింతలెల్ల మొదటి యిల్లు
వడ్డి రెడ్డి కుల మదేమని తెల్పుదు
విశ్వదాభి రామ వినుర వేమ' (వావిళ్ళ (1955) పు.1034)

వీటితో పాటు పారిస్‌ప్రతిలో పద్యాన్ని కూడా పరిశీలించి "పరిష్కరణ" చేసి ఆరుద్ర ప్రకటించారు:(మ.వే.పు.**109**).

**అసలు ప్రతిలోపద్యం:**

'విడుకొండ్ల విడు విధి పంచ్చమహావిధి
మొలక చింత్తలలొన మొదటి యిల్లు
వెర్రి వెమననంగ వెదాంత వెత్తరా
విశ్వదాభిరామ వినరవేమ' (౨)

**పరిష్కరణ పద్యం:**

'వీడుకొండ వీడు వీధి పశ్చిమవీధి
మొలక చింతలోన మొదటి యిల్లు
వెర్రి వేమననగా వేదాంత వేత్తరా
విశ్వదాభిరామ వినురవేమ.'

ఈ పద్యాల న్నింటినీ పరిశీలిస్తే "మూగ సేతకొల్ల "మూగ చింతపల్లె" "మూగ చింతపల్లి" "మూక చింతపల్లె" "మూలచింత" "మూగచింతల" "మొలక చింతల" లలో పాఠాంతరాలు స్పష్టమవుతున్నాయి. వీటిని ఆధారం చేసుకొని వేమన స్థల నిర్ణయానికి ప్రయత్నించారు. ముందుగా "చింత" పదప్రయోగాన్ని తీసుకొని, అది తాత్త్విక చింతనకు పర్యాయ పదంగా చాలాసార్లు వాడారని "చింతలోనే చింత చిన్మయంబు' (వే.సూ.ర.**3806**) "చింతదీర్చి చూడ చిన్మయ జ్యోతి" (వే.సూ.ర.**3809**) లను ఆధారంగా విశ్లేషించారు (మ.వే.పు.**109**). యాగంటి వారి వచనాలలో ...

*"కాంతలా పాలెములోనా*
*'**చింత**' మూను పుట్టేగదరా*
*'**చింత**' అసలు కొనుట సాగగా*
*యాగంటి లింగా*
*'**చింత**' బూని బండు పండెరా*
*ఆకసాన కోడికూసె*
*చీకటింట్లో పొద్దుపొడిచె*
*'మూక చిత్తాలో మధ్యమూన*
*యాగంటి లింగా*
*మూకమై వెన్నెల కాసెరో"*

*లలో "చింత, మూక చిత్తలో"*

పదాల్ని చూస్తే తాత్త్విక భావంలోనే ప్రయోగించడం కన్పిస్తుంది. శివకవుల దారిలోనే వేమనకూడా పయనించినట్లు చాలా పద్యాలు కన్పిస్తున్నాయి. అంతే కాకుండా యాగంటివారి రచనల్లో ఉదయగిరి, చంద్రగిరి వంటి స్థలనామాలు కన్పిస్తున్నాయి. ఈ బాణీనే వేమన కొనసాగించినట్లు కొన్ని పద్యాలు కన్పిస్తున్నాయాని కింది పద్యాన్ని పేర్కొన్నారు.

*కొండరేడు మామ కొండ కూతురు ఆలు*

*కొండయిల్లు, పసిడి కొండ విల్లు*

*కొండవంటి దొరవు కుంటెన నడతురా*

*విశ్వదాభి రామ వినురవేమ (అకాడమీప్రతి – 287)*

ఈ పద్యంలో శివుని ఇల్లు "కొండ" అన్నది వేమన భావమని ఎలా తెలుస్తున్నదో, "*వీడు కొండవీడు*" పద్యంలో "కొండవీడు" అనడం శివపరమైన అర్థంలోనే గాని, తన స్వంత చిరునామాను చెప్పుకోవటం కాదన్నారు ఆరుద్ర (మ.వే.పు.**111**) అది కైలాసాన్ని ఉద్దేశించిందన్నారు. "కొండవీటి" నే ఎందుకు ప్రయోగించి ఉంటారనే దానికి సమాధానం చెప్తూ ఆరుద్ర 'యాగంటివారు తమకు తెలిసిన మాటల్నే ప్రయోగించినట్లే "కొండవీటి" తోపరిచయం ఉండటం వల్ల, వేమన కూడా తన పద్యాల్లో ప్రయోగించి ఉండ వచ్చునని సమన్వయం చేశారు (మ.వే.పు.**112**)

పద్యంలోగల "పశ్చిమవీధి" అనే ప్రయోగం గురించి కూడా ఆరుద్ర సమన్వయం చేస్తూ, తాత్త్విక మైన అర్థంలోనే వాడారన్నారు. శివ ప్రోక్తమైన అరవైనాలుగు తంత్రాల్లో ఒక తంత్రంగా చెప్పి, పూర్వ, పశ్చిమ, దక్షిణ తంత్రాలనే నాటిని పరిశోధిస్తేమరిన్ని విషయాలు తెలియడానికి అవకాశం ఉందన్నారు.(మ.వే.పు.**111**)

ఈ పద్యాన్ని **1824**లో బ్రౌన్ రాయించిన ప్రతుల్లో కనబడుతున్నా తర్వాత ప్రకటించిన **1829**, **1839** ప్రచురించక పోవడానికి ఆ పద్యంలో ఒక గూఢార్థం ఉందని భావించడమేనన్నారు. (మ.వే.పు.**106**) దాని: ఉపపత్తిగా బ్రౌన్ ఆంగ్లంలో ఇచ్చిన వివరణనూ పేర్కొన్నారు[57].

శివపార్వతులనే శైవులు తమతల్లి దండ్రులుగా భావించే సంప్రదాయం ఉంది. వేమన "జంగం" గా మారిన తర్వాత కైలాసమే తన స్వగృహమనీ, పార్వతీ, పరమేశ్వరులను తన తల్లిదండ్రులుగా భావించాడని చెప్పడానికి ఆధారమైన ఒక పద్యాన్ని పేర్కొన్ని, దానికి అన్వయం చేశారు.

*"తల్లి గౌరియగుచు దండ్రి యాశంభుండు*

*ప్రమథ గణము లఖిల బంధుసతతి*

*తనకు బుట్టినిల్లు తనర కైలాసంబు*

*విశ్వదాభిరామ వినుర వేమ" (వే.సూ.ర.1847)*

ఇంత వరకూ జరిగిన పరిశీలనలో "*చింత*" "*కొండవీడు*" "*పశ్చిమ వీధి*" ప్రయోగాల తాత్త్విక అర్థంలో వేమన ప్రయోగించాడని చెప్తునే, "*కొండవీడు*" వేమనకి పరిచయం ఉన్న స్థలంగా ఆరుద్ర పేర్కొన్నారు. "*మొలక చింత*", "*మూగ సీత*" అనే పదాల్ని లేఖకులు 'మూగచింతల' చేసి ఉంటారని చెప్పి, "*మూగ చింతల*" గురించి పరిశోధన కొనసాగించారు.

*"వేమనగారి పూర్వీకులు మూగ చింత పల్లెలో ఉండేవారనీ, ఎప్పుడో కొండవీడు వలస వెళ్లి అక్కడ పడమట వీధిలో స్థిరపడ్డారని ఈ పద్యం వల్ల పూర్వ పరిశోధకులు భావించారు"* అని (మ.వే.పు.106) పేర్కొన్నా, ఆ పరిశోధకులు ఎవరో ఆరుద్ర వివరాలు చెప్పలేదు.

పరిశీలన చేస్తే ఈ ఫలితాంశాన్ని చెప్పిన పరిశోధకుడు బండారుతమ్మయ్యని తెలుస్తుంది[58].

ఈ పద్యంలో "కొండవీడు" తో ఎవరికీ పేచీలేదని, మూగచింత పల్లె ఎక్కడుంది? అని ఆరుద్ర అన్వేషణ ప్రారంభించి, 1924 లో చెన్న రాజధాని లోని గ్రామాల నామాల్ని జిల్లాల, తాలూకాల వింగడింపుతో ప్రభుత్వం ప్రకటించిన వివరాల్ని పరిశీలించారు. వీటిలో చిత్తూరు జిల్లా చంద్రగిరి తాలుకాలోనే "మూగచింతనపల్లె "అని కనపడుతుందని ఇదే వేమన పద్యంలో మూగచింతపల్లె గా ఉహించానన్నారు. ఇది సమగ్ర ఆంధ్ర సాహిత్యం (12 వ సంపుటి-తొ.ము.పు:65) లో ఉంది కానీ, సమగ్ర ఆంధ్ర సాహిత్యం (పునర్ముద్రణ) లో మార్పుచేశారు. అంతే కాకుండా "కొండ వీడు" కి 'శివుడి నివాస స్థలమనీ, తన నివాసస్థలం చెప్పుకోవటం కాదనే వివరాలు కన్పించవు[59] "కానీ", "మూగచింత పల్లె" లో 'చింత' తాత్త్విక అర్థమేనని 'మనవేమన' గ్రంథంలో ఆరుద్ర 'మూగచింతపల్లె' గురించి చెప్పారు! దీన్ని మరింత వివరిస్తూ....

డి.చెంగారెడ్డి సిద్ధాంత వ్యాసం "చిత్తూరు జిల్లా గ్రామనామాలు - భాషాసామాజిక పరిశీలన" ను బట్టి "*మూగచింతన*" అనే పదం "*మూగ చింతల*"గా రూపాంతరం చెందిందనీ, చంద్రగిరి తాలూకాలోనే కాకుండా, వాయల్పాడలో కూడా ఒక "*మూగ చింతల*" ఉన్నట్లు అదనపు ఆకరం లభించిందన్నారు. నెల్లూరి జిల్లా కందుకూరు తాలుకాలో ఒకటీ, పాదిలి డివిజన్‌లో ఒకటీ ఉన్నట్లు చెన్న రాజధాని గ్రామనామాల్లో కనపడతాయి (మ.వే.పు:107) వీటిని బట్టి పరిశోధన చేసి, వేమన తన పద్యాల్లో వాడిన స్థలనామాల్ని 33గా గుర్తించారు. వీటిలో మళ్ళీ 12 మాత్రమే తెలుగు ప్రాంతాల్ని తెలిపే గ్రామనా మాలుగా పేర్కొన్నారు. వీటితో పాటు వేమన పద్య తాళ పత్ర ప్రతులు లభించిన భౌగోళిక వివరాల్ని పరిశీలించారు. "*వేమనగారి పూర్వీకులు చంద్రగిరి రాజ్యంలో మూగ చింతల గానీ, మూగ చింతల పల్లెలోగానీ ఉండేవారనీ ఉత్తరోత్తరా కొండ వీటి రాజ్యంలోనికి గాని గండికోట రాజ్యంలోనికి గాని వలస వెళ్ళారని పూర్వపరిశోధకులలాగ మనమూ భావించ వచ్చు*" అన్నారు (మ.వే.పు: 118)

అరుద్ర పరిశోధనలో చిత్తూరుజిల్లా చంద్రగిరి దగ్గర మూగ చింత పల్లె వేమన పూర్వీకులదనేది ఫలితాంశం. అయితే, రాళ్ళ పల్లి, వారిని బలపరిచిన ఎన్.గోపి చెప్పిన "రాయలసీమ" లోనే వేమన పూర్వీకులు ఉండేవారనేది స్పష్టమవుతుంది[60]. రాళ్ళపల్లి, ఎన్.గోపి లు వేమన పద్యాల్లో వాడిన పదజాలం ముఖ్యంగా మాండలిక పదాల వల్ల నిర్ణయిస్తే, ఆరుద్ర, వేమన పద్యాల్లో కన్పిస్తున్న స్థలనామల్నే ప్రధానంగా పరిశీలనకు తీసుకున్నారు. దీనితో పాటు వేమన పర్యటించిన స్థలాన్ని కూడా ఆరుద్ర వివరించ గలిగారు. ఉత్తరాన గోదావరి నుండి దక్షిణాన సేతువు వరకూ, తూర్పున దివిసీమలోని మోపిదేవి నుండి పశ్చిమాన కొంకణం వరకూ వేమన పర్యటించిన విస్తృత దేశమని చెప్ప వచ్చునని

దాన్ని ఆరుద్ర, వేమన స్థలనిర్ణయంలో ఫలితాంశంగా తెలుస్తుంది. కానీ, సమగ్రఆంధ్ర సాహిత్యం (పునర్ముద్రణ మూడవ సంపుటి పు.317) లో శ్రీనాథుడు గురించి చర్చిస్తూ "*శ్రీశైలం అడివార నుండి తూర్పు సముద్రం దాకా విస్తరించిన సీమను 'పాకనాడు' అనిపిలిచేవారని* అన్నారు.

చిత్తూరు జిల్లాలోని '*మూగ చింతల* లేదా '*మూగచింతల పల్లె* పాకనాటికి చెందిందని 'మన వేమన'లో పేర్కొన్నారు. (మ.వే.,పు:121). ఆరుద్ర పేర్కొన్న పైరెండు అంశాలు భౌగోళకంగా 'పాకనాటి' ని నిర్దేశించటంలో వైరుధ్యాలు కన్పిస్తున్నాయి. శాసనాలు, సాహిత్య ఆధారాలతో కుందూరి ఈశ్వరదత్తు తూర్పున సముద్ర తీరం నుండి ఉత్తరాన కందుకూరు, దక్షిణాన నెల్లూరు జిల్లాలలో వెంకటగిరి, పశ్చిమాన ఉదయగిరి తాలూకాల మధ్య భాగాన్ని "*పాకనాడు*" గా భావించ వచ్చునన్నారు[61] నెల్లూరు వెంకటగిరి, ఉదయగిరి తాలూకాల భూభాగమని "ఒక ఊరు" గ్రంథంలో యార్లగడ్డ బాల గంగాధర రావు పేర్కొన్నారు[62].

వీరి అభిప్రాయాల్ని పరిశీలించినా "*పాకనాటి*" కీ, చిత్తూరు జిల్లలోని చంద్రగిరికి సంబంధం లేదని తెలుస్తుంది. ఈ ప్రాంతంలో పాకనాటి రెడ్లు ఉండ వచ్చు కానీ, పాకనాటికి చెందిన 'మూగ చింతపల్లి' వేమన పూర్వీకాల స్థలంగా గుర్తించటం చారిత్రక ఆధారాలు అసమంజసమంటున్నాయి.

ఆరుద్ర వేమన స్థలాన్ని నిర్ణయించటానికి చేసిన పరిశీలనను గమనించినట్లయితే, "కొండవీడు" "మూగ చింతల పల్లి" లలో గల పదాలకు వ్యాఖ్యానం చేశారు. వీటిని తాత్త్విక అర్థంలో నేవేమన ప్రయోగించారనీ మళ్ళీ, "కొండువీడు" తో వేమనకు పరిచయం ఉండటం వల్లనే ఆగ్రామాన్ని పేర్కొన్నారనీ, అది చారిత్రక స్థలమనీ, దానితో వివాదం లేదన్నారు. "మూగ చింతల" "మూగ చింతల పల్లె" లను తాత్త్విక అర్థంలో వ్యాఖ్యానిస్తునే, ఆ ఊర్లు ఎక్కడ ఉంటాయో కూడా పరిశీలించారు. పరిశోధనలో అన్వేషణ అనేది దీనిలో కన్పిస్తున్నా, 'స్పష్టత' విషయంలో "పాకనాడు" ని గుర్తించటానికి మరింత శాస్త్రీయత అవసరమవుతుంది.

ఒంగోలు తాలూకాలో ఈ పేరు (మూగచింతపల్లి) తో ఒక గ్రామం ఉందని శేషాద్రి రమణ కవులు, కడప జిల్లాలో ఉందని రాళ్ళపల్లి అనంత కృష్ణ శర్మ పేర్కొన్నారు కడప జిల్లాలోనిది కాదని నెల్లూరు జిల్లా పొదిలి తాలూకాలో 'మూగచింతల' అనే గ్రామమున్నదని, పూర్వమిది కొండవీటిసీమలో చేరి ఉండచ్చునని బండారుతమ్మయ్యలు భావించారు.

ఎస్. సుభాని పరిశోధనలో పల్నాడు దగ్గర కారెంపూడి సమీపంలోని "చింతపల్లి" నే వేమన పేర్కొన్న "మూగచింతలపల్లె" అనీ, అదే వేమన జన్మస్థలమని, నివాస స్థలం "కొండ వీడు" గా నిర్ణయించారు[65]. కానీ, దీనిలో నివాస స్థలం తప్ప మిగిలినవి వాదానికి నిలబడని అంశాలు.

మొత్తం మీద పరిశీలించినట్లయితే వేమన స్థలనామాల్నీ, పద్యాల్లో కన్పించే మాండలిక శబ్దాల్ని బట్టి రాయలసీమ ప్రాంతానికి చెందిన వాడనీ, "కొండ వీటి" కి వలస వచ్చి ఉంటాడనే నిర్ణయం సమంజస మవుతుంది.

## 7.2.4.వేమన దార్శనిక పరిణామం- ఆరుద్ర దృక్పథం:

"వేమన్న భౌతిక జీవితాన్ని గూర్చి కొంచమైనా చెప్పడానికి వేమన పద్యాలే ఆధారం. ఏకవి కవిత్వమయినా, కొంతవరకు అతని ఆత్మకథ వంటిదే. కవి అభిరుచులు, అభ్యంతరాలు, పుట్టి పెరిగిన వాతావరణం, స్వభావాన్ని తీర్చి దిద్దిన పరిస్థితులు, అభిప్రాయాలు, వాటి పరిణామం మొదలైన వన్నీ భావుకుని రచనలలో ఏదో ఒక ప్రమాణంలో, రూపంలో బయట పడక తప్పదు. కాని వేమన వంటి ఆశుకవిని గూర్చి ఆధారాల మీద నిర్మించే ఊహా సౌధమే కాని, తిరుగులేని సాక్ష్యలను ప్రదర్శించడం కష్టం. వేమన వంటి వారి జీవితాన్ని గూర్చి చెప్పకునే కథ, కదిలే అలల మీద నీడ బొమ్మేకాని, స్థిరమైన బిత్తికా చిత్రం కాదు. ఇంత వరకు ఈ పనిలో కృత కృత్యులైన వారిలో శ్రీ రాళ్ళపల్లి, శ్రీ నార్ల, శ్రీ ఆరుద్ర ముఖ్యులు" అని ఎస్.గోపి పేర్కొన్నారు**.

వేమన భౌతిక జీవిత నిర్మాణం ఎంత కష్టంతో కూడిన పనో అంత కంటే అధిక కష్టంతో కూడింది అతని తత్వాన్ని దర్శింప చేయు గల్గటం. భౌతికనిర్మాణం కంటే మానసిక నిర్మాణం క్లిష్టతతో కూడింది కదా. పైకి పంచేంద్రియాలకు అందనిది. వాటిని నడిపించేది వేమన గురించి పరిశోధనలు చేసిన వారందరు ఆయన తాత్త్వికదర్శనం ఏది? అని ప్రశ్నించుకొంటే అనేక సమాధానలు చెప్పారు. ఆరుద్ర భావాలు: ప్రభావాలు" అన్న వ్యాసంలో వేమన తత్త్వంలో ఆలోచన ధోరణిలో కలిగిన పరిణామాల్ని దర్శించారు. దానికి నాటి చారిత్రిక ఆధారాలు, సమకాలీన సాహిత్యం. సమాజ స్థితిగతులు, లభిస్తున్న వేమన పద్యాల్లో వేమన వ్యక్తపరిచిన అభిప్రాయాలకి అందిపుచ్చుకొని వేమన తత్త్వాన్ని వివరించారు.

వేమన జన్మతః శైవుడని తెలుస్తుంది. వేమన కాలానికి రాయలసీమ ప్రాంతంలో వీరశైవం ప్రచారంలో ఉంది. సామాన్య ప్రజలకోసం వారి భాషలో ద్విపద కావ్యాలని, గేయాలని వీరశైవం ప్రోత్సహించింది. కర్నూలు జిల్లాలోని యాగంటి పల్లె ఉంది. ఆ గ్రామంలో స్థిరపడి యాగంటి లక్ష్మయ్య ఉన్నాడు. ఆయన తత్త్వాల ప్రభావం బాల్యంలోనే వేమనపై పడింది. ఆయన సుప్రసిద్ధ శైవ సంకీర్తనలు రాశారు. ఆ కీర్తనల్లోయాగంటి గురుడు, యాగంటి హరుడు, యాగంటి శివుడు ముద్రలు కనిపిస్తున్నాయి. వేమన పద్యాలపై యాగంటి శైవ సంకీర్తనల ప్రభావాన్ని ఆరుద్ర గుర్తించారు. అలాగే యాగంటి భావాలకి వేమన విస్తరించి పద్యాలు రాశారు.(మ.వే.పు.49,57)

### వేమన మతం:

నిత్యాన్వేషి అయిన వేమన జ్ఞాన తృష్ణని శైవం సంతృప్తి పరచ లేక పోయింది. వారు గిరిగీసుకొని శైవులు కాని వారిని నిందించటం శైవంలోని లోపాలు, అనటం పైగా శైవం వచ్చిన ఉద్దేశం వారిని 'భవులు' వెనక్కి పోవటం లింగా ధారులకన్న దొంగలు లేరనే స్థాయికి వచ్చి శైవాన్ని, చివరికి యాగంటి వారిలోని లోపాలకి కూడా తిరుగుబాటు చేసి (మ.వే.పు.75) జైనం వైపు పయనించాడు. వీర శైవులకు, జైనులకి పడదు జైనాన్ని అన్యమతంగా శైవులు భావిస్తారు.

"అన్యమతము కన్న నధికమైన మతము
లింగ మతము కన్నలేదు జగతి
లింగ దారికన్న దొంగలు లేరయా ॥విశ్వ॥

వీరశైవంలో కులభేదాలు లేవు. అందరిదీ ఒకే వర్గం. కాబట్టి లింగ ధారుల మతం అన్యమతం కన్నా అధికంగా వేమనకు కనిపించింది. అయితే జైనంలో వేమనని ఆకర్షించింది భూతదయ, అహింస జీవహింస ఏ రూపంలో ఉన్నా, దాన్ని చేయకూడదనేది సిద్ధాంతం. (మ.వే.పు.60) ఈ ప్రభావం తోనే "జీవి, జీవి జంప శివుని జంపుచేయగు జీవహింసకులకు చిక్కునా మోక్షంబు" అని, చెప్పి,

చంపదగిన యట్టి శత్రువు తనచేత
చిక్కినేని కీడు సేయరాదు

పొసగ మేలు చేసి పొమ్మన్నచంపుట"

అన్నాడు. ఈ భావాల్లో పరిణితి కనిపిస్తుంది.(మ.వే.,పు.62) "వేమనపై జైన ప్రభావం ఉండటానికి అవకాశం తక్కువ. ఆంధ్రదేశంలో అప్పటికి జైనం ఉందో లేదో అని అనుమానం అని రాళ్ళపల్లి వారు అన్న దానికి ఆరుద్ర సప్రమాణంగా (పు.63-67) బౌద్ధంకన్నా ముందు ఆంధ్రదేశంలో జైనం ప్రవేశించిన తీరు వేమన కాలంలో ఉన్న జైన వసతులు, వీరశైవులు, బ్రాహ్మణులు నాశనం చేసిన కొన్ని జైన వసతుల వివరాలు, ఇందులో అందించి వేమనపై జైన మత ప్రభావం ఉంది అని నిరూపించారు. వేమనలో చార్వాకం,లోకాయత ప్రభావాల్ని ఆరుద్ర సోదాహరణంగా నిరూపించారు. వేమన దార్శనిక పరిణామాన్ని సమకాలిక అంశాల్ని ఆధారం చేసుకొని రూపొందిందని నిరూపించారు.

## 7.3.సృజనాత్మక పరిశోధకుడుగా ఆరుద్ర

"హృదయమున్న విమర్శ
మెదడు కలదు విమర్శ
తిట్టు నెచ్చెలి స్పర్శ
ఓ కూనలమ్మ!"[67].

ఇది ఆరుద్ర 'కూనలమ్మపదాల్లో' చెప్పిన ఓ పదం. విమర్శకి హృదయం, మెదడులతో ఉండే సంబంధాన్ని సూచనా మాత్రంగా చెప్తున్న కూనలమ్మపదమిది. విమర్శకైనా, పరిశోధనకైనా కేవలం మెదడుతో మాత్రమేపని అనుకోవటం సరికాదు, విమర్శ, పరిశోధన రెండింటిలోనూ సృజనాత్మకత ఉండాలి. అలాంటప్పుడే అది వాస్తవాన్ని బహిర్గతం చేయడంలో కవి పయనించిన దారిలో పయనించడానికి చాలా వరకూ దోహదపడుతుంది. ఇది 'భావుకత' వల్ల సాధ్యమవుతుంది, *కవి ప్రయాణం చేసిన మార్గాన్నీ విమర్శకుడూ పయనాన్ని సాగించాలి. అలా కవితో ప్రయాణం చేయగలిగిన విమర్శకుని సామర్థ్యమే భావుకత*[2]. ఈ భావుకత కేవలం విమర్శకునికే కాకుండా పరిశోధకునికీ అవసరమవుతుంది.

ముఖ్యంగా గ్రంథపరిష్కరణ పరిశోధన లో ఈ భావుకత చాలా ఉపయోగపడుతుంది. విమర్శ పరిశోధనల్లో ఉండవలసినంత భావుకత ఉంటేనే అది సృజనాత్మకత కలిగిన విమర్శ/పరిశోధన అవుతుంది. ఎంత ఉండాలనే దానిపైనే అది కేవల సృజనాత్మక రచనగా అవుతుందో విమర్శ, పరిశోధనగా భావింపబడుతుందో తెలుస్తుంది.

ఆరుద్ర చేసిన పరిశోధనల్లో ఉన్న, సృజనాత్మక తత్త్వం వల్ల వ్యాసాన్ని సహితం హృద్యంగా చదివించగలిగే శైలిని ఏర్పరుచుకోగలిగారు. కొన్ని సార్లు పఠనాసక్తిని పెంపొందించాలనే తపనతో కొన్ని వింత చర్చల్ని కూడా పెట్టడం వల్ల 'పరిశోధన' విషయాలు ఉన్నప్పటికీ, ఆ సీరియస్‌నెస్ తగ్గి, పత్రికల్లో సాధారణంగా ప్రచురించే 'చర్చావ్యాసాలు'గా వాటిని భావించ వచ్చనే ఆలోచనకు దారితీసే అవకాశాలు ఉన్నాయి. తన భావాల్ని వివరించడంలో ఎవరు ఎటువంటి విమర్శలు చేసినా, రాసిన ప్రతీవ్యాసాన్నీ "పరిశోధన"గా పరిగణించలేక పోయినా, తనకు తోచిన, విషయాన్ని పత్రికా ముఖంగా ప్రజల ముంగిటకు తేవాలనే ప్రయత్నం మాత్రం ఆరుద్ర వ్యాసాల్లో కన్పిస్తుంది. ఈ ప్రయత్నంలోనే 'జనరంజకత్వం'ఇమిడి ఉంది. 'జనరంజకత్వమ'నేది కొన్నిసార్లు చాలా చిన్న విషయాన్ని కూడా విపులంగా వర్ణించే పద్ధతిలో ఉండొచ్చు. సాధ్యమైనంత సులభమైన పద్ధతిలో అవగతం కావాలనే ఆశయం దీనితో ఉండటం వల్ల, విస్తరించ బడుతున్నట్లు కూడా అన్పించవచ్చు. జనసామాన్యంలో ఉన్న అనుమానాన్ని, నమ్మకాల్నీ కూడా జతచేసి, తనదైన అభిప్రాయాన్ని స్థిరీకరించే దిశలో ఉంటుంది. శాస్త్రీయ మైన పద్ధతిలో కొనసాగుతూనే గతంలో వెలువడిన కొన్ని ఫలితాలను ప్రామాణికంగా స్వీకరిస్తున్నట్లు అన్పిస్తున్నా, వాటికంటే ప్రజల్లో "నమ్మకం" కల్గించేటట్లు, ఆసక్తిదాయకంగా కొనసాగుతుంది. "ప్రమాణాలు" అంటే స్థిరంగా కలకాలం నిలిచిపోయేవని కాదు. కానీ, సంఘర్షణ నుంచి నూతన చైతన్యమావిర్భవించినట్లే కాలమాన పరిస్థితులనుబట్టి భావనలు, సిద్ధాంతాల్లోనూ మార్పులు వస్తుంటాయి. అయితే, అప్పటికి ఉన్నవిలువలు, ప్రమాణాలనేవే తాత్కాలిక కొలబద్ధలుగా గ్రహించటం సర్వసాధారణంగా జరుగుతుంటుంది. కనుకనే జనరంజకత్వాన్ని నిర్ణయించడంలో కూడా కొన్ని లక్షణాల్ని ఏర్పరుచుకోవడమనేది, గతంలో 'జనరంజకరచనలు'గా భావింపబడినవారి రచనలనుండి గ్రహించడమే అవుతుంది. పండితపామర జనామోదయోగ్యమైన పద్ధతిలో ఏదైనా ఒకవిషయాన్ని అందించడానికి చేసే ప్రయత్నం 'జనరంజక రచన'లో ఉంటుంది. ఆరుద్ర వ్యాసాల్లో ఈ లక్షణం కన్పిస్తుంది.

## 7.3.1 ప్రమాణాలు, కాలానుసరణాలు:

మార్పుకి తప్ప ప్రతిదానికీ మార్పు ఉంటుందని భావించే ప్రస్తుతకాలంలో, భావనలు, సిద్ధాంతాలు, ఏర్పరుచుకున్న ప్రమాణాలు ఆయా కాలాలను బట్టి కొత్త ప్రమాణాలు రూపొందుతుంటాయి. సంఘర్షణ నుండి నూతన చైతన్య మావిర్భవించినట్లే, కాలమాన పరిస్థితులను బట్టి ఆలోచనల్లో కొత్త ధోరణులు వస్తుంటాయి. ఆరుద్ర చేసిన పరిశోధనలు "ఇలాగే" ఉండాలంటే అవే నియమాల్ని పాటించడం జరిగిందా? కొత్త మార్గాలనేమైనా అన్వేషించాడా? అనేది, కొన్ని ప్రమాణాలను బట్టి నిరూపించడానికి ప్రయత్నించ వలసి ఉంటుంది. 'ప్రామాణికత' అనేది కాలాన్ని బట్టి మారడం, విలువల్లో మార్పులు రావడం జరిగినా, అప్పటికి ఉన్న విలువలు, ప్రమాణాలనేవే తాత్కాలికంగానైనా

కాలమా నాలుగా గ్రహిస్తుంటాం. అవి మాత్రమే కొలమానాలు కాక పోయినా, వాటికంటే కొత్త ఆలోచనలూ, తత్కాల శాస్త్రీయ పద్ధతులు, నిరూపణలూ వచ్చేవరకూ "కొన్ని" ప్రామాణిక విలువలుగా ఆ సూత్రాలు, ఆ సిద్ధాంతాలు తమ ఆధిక్యతను నిలబెట్టుకుంటూనే ఉంటాయి. వీటిని ఆధారం చేసుకొనే విలువలు నిర్ణయం చేయడం, చారిత్రక దృష్టిని ప్రదర్శించటం జరుగుతుంటుంది. మార్క్స్‌సిద్ధాంతం వచ్చేవరకూ ప్రపంచంలో కొన్ని సిద్ధాంతాలు ఆధిక్యతను చెలాయించాయి. మార్క్స్‌సిద్ధాంతంతో ప్రపంచ వ్యాప్తంగా పాతుకొని పోయి ఉన్న 'విలువలు ప్రమాణాలు-సిద్ధాంతాలు' ఒక్కసారిగా పటాపంచలై పోయాయి. మార్క్స్‌సిద్ధాంతం కంటే గొప్ప సిద్ధాంతం ఏదైనా వచ్చేవరకూ ఈ సిద్ధాంతమే ప్రపంచా వ్యాప్తంగా తన ఆధిక్యతను చెలాయిస్తుంటుంది.మార్క్సిస్టు సిద్ధాంతానికి వ్యతిరేక దిశలో ' పోస్ట్‌మాడర్నిజమ్' వచ్చిందని చాలామంది భావించినా, అది పుట్టుకలోనే మరణమున్న సిద్ధాంతంగా విమర్శించిన వారూ ఉన్నారు. అయితే ఇప్పటివరకూ తెలుగులోగానీ, ప్రపంచవ్యాప్తంగా గాని, మార్క్సిస్టు సిద్ధాంతాన్ని 'ఢీ' కొనగల సిద్ధాంతం రాలేదనే చెప్పవచ్చు.పిండితార్థ మేమిటంటే, విజ్ఞాన పరిధి విస్తరించే నేపథ్యంలో "ప్రమాణాల్లో" భేదం కన్పించి, భావనలు, నూతన సిద్ధాంతాలు వస్తుంటాయి. ఈ అవగాహనతోనే ఆరుద్ర రచనల్లో, ముఖ్యంగా పరిశోధనాత్మక రచనల్లో ఇది మరింత స్పష్టం కావాలంటే సృజనాత్మక రచనకూ, సృజనాత్మక పరిశోధనకు మధ్యగల వ్యత్యాసాల్ని గుర్తించ వలసి ఉంది.

## 7.3.2. సృజనాత్మక రచన:

వాస్తవ, అవాస్త వికమైన ఏదైనా ఒక ఇతివృత్తాన్ని తీసుకొని, దాన్ని హృద్యంగా వర్ణించ గలిగినట్లయితే దాన్ని సృజనాత్మక రచన అనవచ్చు. కవిత్వం, కథ, నవల, గేయం, నాటిక, నాటకం వంటి ప్రక్రియలకి ఇటువంటి ఇతివృత్తాలు/ వస్తువుగా గ్రహించవచ్చు. కేవల కాల్పనిక వస్తువు/ ఇతివృత్తం తో విమర్శించిన సాహిత్యం కూడా సృజనాత్మక సాహిత్యంలో ఒక విభాగం అవుతుంది. వాస్తవేతివృత్తాన్నే 'వస్తువు'గా గ్రహించినా, తన భావనా బలంతో, తనకున్న ప్రత్యేకశైలితో అలరింపజేసి ఆలోచనకు పురిగొల్పే పద్ధతికూడా సృజనాత్మక సాహిత్య విభాగంలో ఉంది. అయితే, గమనించ వలసిందేమిటంటే, ఈ ప్రక్రియల్లోని సృజనాత్మక రచన పాఠకుణ్ణి/ ప్రేక్షకుణ్ణి ఆహ్లాద పరచడమో, ఆనందింప జేయడమో మాత్రమే ప్రధానంగా ఉంటుంది. అంతేకాకుండా, ఈ ప్రక్రియల్లో కన్పించే సృజనాత్మక ప్రతిభ రచన మొత్తంలో ఆలోచనకు అవకాశం ఉన్నప్పటికీ, ఆలోచన ద్వితీయ ప్రాధాన్యాన్నే సంతరించుకొని, అక్కడక్కడా శాస్త్రీయమైన,హేతుబద్ధమైన తార్కికత మెరుపులా వచ్చిపోతుంటుంది. కేవలం ప్రతిమాట, ప్రతి వాక్యం, ప్రతి సంఘటనా వాస్తవంపైనే ఆధారపడికొనసాగినా, వర్ణనల్లోనూ, సన్నివేశ కల్పనల్లోనూ, కొన్నిసార్లు స్థల,కాలాల్లోనూ, ముగింపుల్లోనూ, లక్ష్యనిర్దేశంలోనూ, ఆ రచన సాగించిన వారి వైయక్తిక ఊహ ఆకాంక్షకు అనుగుణంగా వస్తువు మారడమో, పాత్రలు రూపొందడమో జరిగే వైపుగా సృజనాత్మక నైపుణ్యం పయనిస్తుంది. ఎంత చారిత్రక విషయాన్ని తీసుకున్నా సాహిత్యవిలువలకు, శిల్పానికే ప్రాధాన్యతనిస్తూ రచనా నిర్మాణం కొనసాగించడం కేవల సృజనాత్మక రచనల్లో కన్పిస్తుంది. అంటే దీని లక్ష్యం తటిల్లతలా ఓ నూతన భావననో, అభిప్రాయాన్నో అందించేసి, మళ్ళీ హృదయాహ్లాదం

వైపు వెళ్ళిపోతుంది. కానీ, సృజనాత్మక పరిశోధన లక్ష్యంతో రచనా శైలికూడా భిన్నంగా ఉంటుంది. హృదయాహ్లాదం నుండి మేధో వికసన, తార్కికత, సిద్ధాంతదర్శనం కల్గిస్తుంది.

## 7.3.3. విమర్శ, పరిశోధనలలో సృజనాత్మకత:

హృదయం లేని బౌద్ధిక వ్యాపారాన్ని, బౌద్ధిక వ్యాపారం లేని హృదయాన్ని ఏరచన నుండీ వింగడించి ప్రత్యేకంగా చూపలేక పోయినా, వీటి ప్రాధాన్యాంశ వివక్షను బట్టే ఆ రచన మేధోగత విభాగంలో చేరుతుందా? హృదయగత విభాగంలోకి చేరుతుందా? అనే దాన్నను సరించే విభజన అనేది జరుగుతుంటుంది. అలా విభాజితమైనవే కవిత్వం, కథ, గేయం, నవల, నాటిక, నాటకం వంటిప్రక్రియలన్నీ ఇవన్నీ సృజనాత్మక విభాగంగానే పరిగణిస్తుండటం జరుగుతుంది. ఈ విభాగమే హృదయగత విభాగం. దీని ప్రధాన లక్ష్యం మానసిక ఉల్లాసాన్నీ, మనోవికాసాన్ని కల్గించడం. అంటే ఆనందం ప్రధాన ప్రయోజనమవుతుంది. ఇక విమర్శ, పరిశోధన వంటివి బౌద్ధిక వ్యాపారమైనవిగా భావించడం జరుగుతుంది. వీటిలోనూ సృజనాత్మక నైపుణ్యం ఉన్నప్పటికీ, మేధోగతమైన వ్యాపారం (పని) కావడం వల్ల బుద్ధికుశలతకు పాధాన్యతనిస్తుంది. తార్కిక శక్తికీ, విశ్లేషణకూ, నూతన విషయాల అన్వేషణకూ ప్రధాన వాహికగామారుతుంది. ప్రతిభావంతులైనవారు వీటిలోనూ సృజనాత్మక నైపుణ్యాన్ని ప్రదర్శించి హృదయాహ్లాదానికీ తోడ్పడుతుంటారు. కానీ ఇక్కడ ఇది ప్రాథమిక స్థానాన్ని పొందడం మాత్రం జరగదు. ఇది ఎటువంటిదంటే, ఒకే పనిని అనేకమంది చేసినా, కొంతమంది చేసిన పని మాత్రమే అనుకూలంగానో, ఆకర్షణీయంగానో, అర్థవంతంగానో కన్పిస్తుండడానికి కారణం ఆ పనిలో సృజనాత్మకత ప్రతి ఫలించడమే కారణం. ప్రతిదానిలోనూ 'సృజనశీలత' అనేది ఒకటి ఉంటుంది. అయితే, అది ఎంత వరకూ ఉండాలో, దాని పరిధి మించకుండా సృజనశీలతను ప్రదర్శించినపుడే, దానిలో ఉన్న మెరుగుకి విలువ ఏర్పడుతుంది. కేవల సృజనాత్మక రచనల్లో శాస్త్రీయ,హేతుబద్ధమైన తార్కిక ఆలోచనతోనే నింపేసి వాస్తవాల్నే చెప్పాలనుకున్నప్పుడు సృజనాత్మక సాహిత్యం అనిపించుకోవడం కాకుండా, దానికి ఏదొక పేరుపెట్టి పిలవవలసి ఉంటుంది. అలాగే విమర్శ, పరిశోధనల్లో కూడా కేవలం సృజన శీలతనే కొనసాగించినట్లయితే దాని లక్ష్యమే దెబ్బతిని దీన్ని మరింకో దేనిలాగానో పిలవవలసి వస్తుంది.

ఒక వాస్తవ అవాస్తవ విషయాన్ని (వస్తువుని) తీసుకొని పాఠకులకి ప్రేక్షకులకి రమణీయంగా అందించటానికి ఏవేవో ప్రతీకలతోనో, ప్రయోగాలతోనో రచన కొనసాగించినట్లయితే, దాన్ని విమర్శకుడు విశ్లేషించాలంటే, పాండిత్యంతోపాటు, సమకాలీన అంశాలపట్ల అవగాహన, రచనను అర్థం చేసుకోగలిగే సామర్థ్యం, ఆ రచనా నిర్మాణ శిల్ప పద్ధతుల్ని హృదయగతం చేసుకోగల భావనా బలం ఆ విమర్శకుడికి ఉండగలగాలి. అలాంటి భావనా బలం వల్ల ఆ రచనలో ఉండే విశిష్ట లక్షణాల్ని తనదైన సృజన శీలతతో బహిర్గతం చేయగలుగుతాడు. ఒక్కొక్కసారి ఇలాంటి గొప్పభావనా బలం గల విమర్శకుడు, ఆ రచన చేసిన వారికంటే కూడా పాఠకుల్ని లోతుల్లోకి, తీసుకొని పోగలిగేది ఈసృజనాత్మప్రతిభ మాత్రమేనని గమనించాలి. విమర్శకుడిలో ఉండే సృజనాత్మక శక్తి, ఆ రచనాకారుని భావననో, అభిప్రాయాన్నో, నైపుణ్యాన్నో, అవగాహననో, పాండిత్యాన్నో, అవగాహనా రాహిత్యాన్నో బహిర్గత

పరిచి, తనదైన ఆలోచనలతో వ్యాఖ్యానించేలా చేస్తూ, హేతువుని లక్ష్యంగా చేస్తుంది. అభిరుచి విమర్శలోనో, నిబద్ధ విమర్శలోనో అయితే వస్తు నిష్ఠకంటే, వ్యక్తి నిష్ఠకు ప్రాధాన్యత నివ్వడం వల్ల స్వీయ అనుభవాలతో నిర్ణయాలు, విశ్లేషణలు చేసే అవకాశం ఎక్కువగా ఉంటుంది. కానీ, కేవల సృజనాత్మక రచన వంటి స్వీయ నిర్ణయాలు విమర్శకులు కూడా చేస్తే, అది విమర్శ అనిపించుకోవడం జరగదు. విమర్శకు సృజన ఉపయోగపడాలి కాని, సృజనకే విమర్శ అంకితం అయిపోకూడదు. అక్కడక్కడా ఆరుద్ర రచనల్లో 'విమర్శకుడు' కన్పిస్తుంటాడు. మొత్తం మీద రచనలన్నింటినీ, పరిశీలించినప్పుడు పరిశోధకుడికి ఉండే లక్షణాలే అధికంగా ఉండటం గమనించవచ్చు. ఆరుద్ర పరిశోధనల్లో 'సృజనాత్మక పరిశోధన'(Creative Research) విశిష్టంగా కన్పించే అంశం. విమర్శలో వస్తుతత్త్వ నిరూపణ కెంత ప్రాధాన్యత వుందో, పరిశోధనలో సోపపత్తిక నిరూపణతో యథార్థతకు అంత నిబద్ధత అవసరమవుతూనే సృజనాత్మకతను ప్రదర్శించవలసి ఉంటుంది. ఈ సృజనాత్మకత అనేది పరిశోధనకు ఖచ్చితంగా ఉండవలసిన లక్షణమని పరిశోధకులు భావించటంలేదు. కానీ, ఆధునిక పరిశోధనల్లో సృజనాత్మకత కూడా ఉండటాన్ని కొంతమంది పరిశోధకులు గుర్తిస్తున్నారు[69]. ఆధునికులు పరిశోధనలో కూడా సృజనాత్మకతను కోరుకొంటున్నారనేవారూ కన్పిస్తున్నారు[70] అయితే 'సృజనాత్మక పరిశోధన పట్ల' చర్చ జరగవలసి ఉందనేవారూ ఉన్నారు[71]. కేవలం పరిశోధనలో మాత్రమే కాకుండా విమర్శలో సృజనాత్మకతను బట్టి కూడ సృజనాత్మక పరిశోధనకు కొన్ని మౌలిక భావవలు కన్పిస్తున్నాయి. విమర్శలో సృజనాత్మకతను వడలిమందేశ్వరరావు వివరించాడానికి ప్రయత్నిస్తూ ఎట్టి విమర్శలోనైనా కొంత సృజనాత్మకంగా, కొంత వస్త్వాశ్రయంగానూ ఉంటుంది. అందులో సృజనాత్మకమైన అంశం మన గుండెలను తాకుతుంది. వస్త్వాశ్రయమైన అంశం మన గుండెలను తాకుతుంది. వస్త్వాశ్రయమైన అంశం మేధను తృప్తిపరుస్తుందని, కావ్యం మీద కల్గించిన భావముద్రను చదువరిలో పునికొల్పడానికి విమర్శకుడు సృజనాత్మక పద్ధతినే ఆశ్రయిస్తాడనీ అన్నారు. విమర్శకుని సృజనశక్తి ఉన్నతంగా ఉంటే, రచనను మరింత గొప్పదిగా చూపుతుందనీ, అలాకాక, విమర్శకుని స్థాయి తక్కువగా ఉంటే రచనను ఆ స్థాయికి దిగజార్చే ప్రమాదంకూడా ఉందని వడలి మందేశ్వరరావు సృజనాత్మకత విమర్శలో నిర్వహించే పాత్రను వివరించారు. వీటిని పరిశీలించినా, ఆరుద్ర పరిశోధనలతో, దీన్ని సమన్వయించినప్పుడు ఆత్మాశ్రయంగా ప్రారంభమై వస్త్వాశ్రయంగా తీసుకొని పోయి సిద్ధాంత దర్శనాన్ని కల్గించేది పరిశోధనలో సృజనాత్మకతకు ఉంటుంది.

## 7.3.4.సృజనాత్మక పరిశోధన:

వినూత్న సిద్ధాంత రూపకల్పనం చేసే లక్ష్యంతో సాగే పరిశోధన ఒక విధంగా సృజనాత్మక పరిశోధన మని పించుకొంటుంది. సిద్ధాంతదర్శనమే పరిశోధనలోని సృజనాత్మకత. పరిశోధనలో సృజనాత్మకత అంటే వినూత్న దృక్పథంతో సాహిత్యాన్ని చూసేచూపును ప్రసాదించటం గా పరిశోధకులు భావిస్తున్నారు[72].

## 7.3.5. సృజనాత్మక పరిశోధన లక్షణాలు:

(i) వివరించే పద్ధతిలో ఆకర్షణీయమైన శైలిని ఎన్నుకొంటుంది.

(ii) చర్చల్ని రేకెత్తస్తూ ఉత్సుకతను కల్గిస్తుంది.

(iii) ఆకరాల్ని చూపుతూ సత్యాన్వేషణ వైపే పయనించేటట్లు చేస్తుంది.

(iv) ఒక సిద్ధాంతం/సమన్వయం/నూతన సిద్ధాంత ప్రతిపాదనం/ సిద్ధాంతస్థిరీకరణలలో ఏదొకదాన్ని స్పష్టం చేస్తుంది.

(v) సంయమన పూరణను కలిగి ఉంటుంది.

(vi) భావుకత మిళితం కావడం వల్ల స్పష్టతలో కొంత సూటితనం లోపించి వెంటనే విషయ అవగాహన కావలనుకొనే కేవల పరిశోధక పాఠకులకు కొంత విసుగు కల్గిస్తుంది.

(vii) పరిశోధనలో తేలిన/ తేలివలసిన ఫలితాంశాల్ని దర్శింప చేస్తుంది.

(viii) హృద్యతనుండి బుద్ధికుశలత వైపుకి నడిపిస్తుంది.

(ix) విమర్శను అంతర్భాగంగా చేసుకొంటూ, తార్కికతను ప్రదర్శిస్తూ, వస్తు నిష్ఠను కలిగి ఉంటుంది.

వీటన్నింటినీ అధ్యయనం చేసిన తరువాత "సృజనాత్మక పరిశోధన"ను కింది విధంగా నిర్వచించుకొనేవీలుంది.

ఆకర్షణీయమైన శైలిలో, ఉత్సుకతను కల్గిస్తూ, ఆకరాల్ని విడనాడకుండా సంయమన పూరణతో పరిశోధకుని శక్తి సామర్థ్యాల్ని వినియోగించు కొంటూ హృద్యతనుండి బుద్ధి కుశలత వైపు విశ్లేషణాత్మకంగా కొనసాగే పరిశోధన ఫలితాంశదర్శనం "సృజనాత్మక పరిశోధన". 'పరిశోధన' లో 'సాహిత్య పరిశోధన' విభాగాన్ని పరిశీలించడం వంటిదే, పరిశోధనలో సృజనాత్మక పరిశోధన. కనుక, 'పరిశోధన' లక్షణాలు దీనిలో అంతర్భాగమే సృజనాత్మక పరిశోధన !

ఈ అవగాహనతో, ఈ దృష్టితో ఆరుద్ర రచనల్లో కన్పిస్తున్న "సృజనాత్మక పరిశోధన"ను కింది విధంగా విశ్లేషించ వచ్చు.

## 7.3.6 సృజనాత్మక పరిశోధన–సమన్వయాత్మక విశ్లేషణ:

'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' లో గల సృజనాత్మక పరిశోధనలో గల కొన్ని ముఖ్యాంశాలు.

'మనవి మాటలు' లో ఆరుద్ర "సాహిత్యాభిలాష గల సాధారణ పాఠకులు ఆంధ్ర సాహిత్యం గురించి సంపూర్ణంగా తెలుసు కోవాలను కొంటే, వాళ్ళకు ఉపయోగించే అన్ని పుస్తకాలు నేడు అందు బాటులో లేవు. లభించిన పుస్తకాలైనా అన్నీ సాధారణ పాఠకులుకు బోధపడే వివరణలతో లేవు. ఈ కొరతను తొలగించ వలసిన బాధ్యత[74] ను గమనించి వెలువరించిన రచన 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' గా చెప్పుకున్నారు.

సమగ్ర ఆంధ్ర సాహిత్యం ప్రథమ సంపుటి ప్రారంభం ఇలా ఉంది.

అనగనగా ఒక ఈగ ఇల్లలుక్కొంటూ తన పేరు మరిచిపోయిందట. "పేదరాశి పెద్దమ్మ ! పెద్దమ్మ కొడుకా! కొడుకు చేతి గొడ్డలీ!.. నాపేరేమిటి?" అని ఎందరెందరినో పేరు పేరునా వరసపెట్టి అడిగిందట.

అచ్చంగా అలాగే 'తెలుగు వాడ'నే తేనెటీగ తన సంగతి మరిచి పోవడం జరిగింది. ఆదిలో తన పేరేమిటి? తనదేశం పేరేమిటి? తన భాషను ఏమని పిలిచే వారు? తన జాతి ఎలావ్యవహరించేది? ఇటువంటి ప్రశ్నలకి జవాబులు ఎంద రెందరినో అడిగి తెలుసు కొంటేగాని దొరకవు". ఇలా ప్రారంభించి, పరిశోధనలోకి పాఠకుణ్ణి తీసుకొని పోతారు.

సృజనాత్మక పరిశోధన లక్షణాల్లో ఆకర్షణీయమైన శైలితో పాఠకుడిలో ఉత్సుకతను పెంచుతూ, హృద్యత నుండి, బుద్ధి కుశలత వైపు పయనించేటట్లు చేయటం ఈ ప్రారంభంలోనే కన్పిస్తుంది. లోనికి వెళ్ళేకొద్దీ ఆంధ్ర, తెలుగు, తెనుగు పుట్టు పూర్వోత్తరాలన్నీ ఆకరాలతో సహా వివరించడానికి ప్రయత్నించారు.

తెలుగులో నన్నయ 'ఆదికవి' అనే చర్చలోనూ, నన్నయ ప్రాంతాన్ని వివరించడంలోనూ సాధారణ పాఠకునిలో కలిగకే అనుమానాల్ని ప్రశ్నల రూపంలో లేవనెత్తి, వాటిని ఒక సమన్వయంచేయడం సృజనాత్మక పరిశోధనలో ఉండే చర్చోపచర్చలకి ఉత్సుకతను కల్గిస్తూ, సత్యాన్వేషణకు పురికొల్పడం అనే లక్షణంలో కన్పిస్తుంది.

'మల్లికార్జున పండితా రాధ్యుడ్ని' వివరిస్తూ కథాకథన శైలిని ఎన్నుకున్నారు[1]. కేవలం మల్లికార్జున పండితా రాధ్యుడి వివరాలే కాకుండా అతని రచనల్నీ, రచనల్లోని ఇతివృత్తాన్నీ కథ చెప్తునట్లు వివరిస్తూనే, పరిశోధకుల్లో ఉన్న వివిధ వాదోప వాదాల్ని చిన్న చిన్న వాక్యాల్లో వివరిస్తారు. తను వివరించే వాటికి ఆకరాల్నీ చూపుతారు. బాదాల రామయ్య చేసిన పరిశోధన "బస వేశ్వర వచనాలు– సమగ్ర సమీక్ష" ను ఆకరంగా చూపుతూనే, కన్నడం నుంచి తెలుగులోకి ఆరుద్ర అనువదించి కథాకథనంలో అందించారు.

'చక్రపాణిరంగనాథుడు' గురించి ఆరుద్ర ఇలా ప్రారంభించారు. "ఆదికవి వాల్మీకి పాడుకోవడానికి వీలుగా అనుష్టుప్ ఛందంలో రామాయణం మొట్టమొదట సంస్కృతంలో వ్రాస్తే, అదే రీతిగా పాడుకోవడానికి అనువైన ద్విపదచ్ఛందస్సులో తెలుగులోనూ ఒక కవి తొలిసారి రామాయణాన్ని రచించారు. ఆ ద్విపద కావ్యానికి 'రంగనాథ రామాయణం' అనేది రూఢమైన పేరు. రంగనాథుడు అనే కవి వ్రాయబట్టే దానికాపేరు ఏర్పడిందని లోకం చెప్పుకొంటున్నది 'తెలుగు కవులలో రంగనాథుడనే పేరున్న వాడు చక్రపాణి రంగనాథుడు తప్ప ఇంకెవ్వరూ లేకపోబట్టి ఇతడే ఈ రామాయణాన్ని రచించినట్టు చాలా మంది భావిస్తున్నారు. అయితే, ఆంతరంగికి సాక్ష్యాన్ని బట్టి రంగనాథుడనే వాడేవడూ అసలు రామాయణాన్ని వ్రాయలేదు. ఒకవేళ ఎవరైనా వ్రాసి ఉన్నా చక్రపాణి రంగనాథుడు మాత్రం దానిని వ్రాసి ఉండడానికి వీల్లేదు. ఎందు చేతో వివరిస్తాను"అని రాశారు.[75]

ఈ పేరాలోనే కొన్ని ప్రశ్నలు రేకెత్తించడం, దానికి సమాధానాల్ని అన్వేషించి, సమన్వయం చేయడం తర్వాత ఆరుద్ర రచనలో కన్పిస్తుంది.

ఒక కవిని గురించి వివరించడానికి ఉపశీర్షికల్ని ఆకర్షణీయంగా సూచించడం పరిశోధన పద్ధతిమాత్రమే కాకుండా సృజనాత్మకతలో భాగమే! ఉదాహరణకు మొదటి సంపుటిలో నన్నయభట్టు గురించి వివరిస్తూ ఆరుద్ర పెట్టిన సూచికలు:

1. ఆకాంక్ష, ఆమోదం. 2. తెలుగుపై అప్పటి చిన్న చూపు. 3. అన్యమతాలుకు ఆదరణ. 4. రాజరాజు 'రాజా' సంకల్పం – నన్నయ శ్రీకారం. 5. భారతానికి భారీప్రచారం. 6. భారత ప్రారంభం. 7. రాజుగా రాజ రాజు పాట్లు. 8. నారాయణ భట్టు. 9. రచనలో చిక్కులు ఉత్తుత్త వార్తలు. 10. 'శబ్దశాసన' బిరుదుకు అసలు కారణం. 11. కావ్యభాష–శైలి–స్పెల్లింగులు. 12. పద సంపద పెంపు – పెంపులో నష్టము. 13. అర్ధాంతరంగా వచ్చిన అరసున్న. 14. సజీవభాష చంపినా చావదు. 15. మారని మానవ స్వభావం. 16. మాటల్లో ఔచిత్యం. 17. అలవాటులో పొరపాటు. 18. మర్యాదలు మన్ననలు – తెలుగు దనం. 19. అను వాదమైనా అనువాదం కాని పంథా. 20. ఔచిత్యంపై దీక్ష సారస్యాలు. 21. కావ్యానికి ఉజ్జీవనం – ఉపదేశం. 22. అక్షర రమ్యత 23. ఆంధ్ర శబ్దచింతామణి–వాదులు అపవాదులు. 24. గారడీ రచన కులబ్రాహ్మణ కల్లోలం. 26. కవిలెల్లోనె కవిత రచన. 27. కావ్యనిర్వచనం. 28. విద్వత్సభల ప్రాబల్యం. 29. ప్రసన్న కథా కవితార్థయుక్తి.

ఇలా ఉపశీర్షికలుగా విభజించటం వల్ల పఠనాసక్తి పెరగడమే కాకుండా, కావలసిన విషయాన్ని కాలం వృథాకాకుండా త్వరగా అవగాహన చేసుకోవడానికి వీలవుతుంది.

నన్నెచోడుని గురించి పరిచయం చేస్తూ, ఆరుద్ర రచించిన వాక్యాలుకుడా ఆసక్తిని కలిగించే విధంగా ఉన్నాయి.

"ఆంధ్ర కవితా సామ్రాజ్యాన్ని 'ఆదికవి' అనే బిరుదు గద్దెపై నుండి, నన్నయగారు, ఆదినుంచి క్రీ.శ. 1910 దాకా ఏమాత్రం ఒడిదుడుకులూ లేకుండా పరిపాలిస్తూ వచ్చారు. ఆ సంవత్సరం తెలుగు సాహిత్యంలో గొప్ప సంచలనం కలిగింది. నన్నయ గారిని ఆదికవి సింహాసనం నుంచి దింపి ఆపట్టం కవి రాజ శిఖామణి నన్నెచోడునికి కట్టడానికి ప్రయత్నాలు జరిగాయి. కొందరు ఈ 'విప్లవానికి' సహాయం చేశారు. నన్నయాభిమానులు దీనివి శాయశక్తులా ఎదిరించారు. నయాభిమానులు తోడ్పడ్డాక సాహిత్యరాజ్యంలో హోరాహోరిగా జరిగిన ఈ అంతః కలహంతో సంకులసమరంలో కొందరు సాహితీపరులు విజాయితీలు గాయపడ్డాయి. నన్నయగారి తరువాత ఉన్న పూర్వకవులులో ఇంత మంది స్థానాలకు కూడా చలనమేర్పడింది. ఈ 'పితూరి' చివరకు లాభమే చేకూర్చింది. అప్పటి దాకా తెలియని ఒక సరికొత్త పాతకవిని దేశానికి పరిచయం చేసింది" (స. ఆం.సా.I .పు.ము.పు:18).

కథను ఒకటి రెండు వాక్యాల్లో వివరించి, వాటి లోతున్ని చర్చించడం సాహిత్య చరిత్రలలో ఉంటుంది. సైద్ధాంతిక చర్చకూ, ఆ కావ్య ఆ విర్భావానికి గల నేపథ్యవివరణలు ఉంటాయి. కానీ, ఆరుద్ర తన 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' రచనలో కావ్యాల్లోని కథాసారాంశాన్ని వివరించడం, ఒకోసారి ఆశ్వాసాల ప్రకారం కూడా వివరిస్తుంటారు. దీని వల్ల పరిశోధనాత్మక గ్రంథం చదువుతున్నామనే స్పృహనుండి ఆకవి రాసిన కావ్యాన్ని చదువుతున్న అనుభూతికి కూడా పాఠకులు లోనవుతుంటారు. అయితే కొంత మంది పాఠకులు కేవలం కథకోసం కాకుండా రచనలో ఇమిడి ఉండే ఛందో ప్రయోగాలు, భావనలు, శైలి, నూతన ప్రయోగాలు,

కవి చెప్పేవిధానం, ఏసందర్భానికి ఎలా చెపుతున్నారు? వంటివన్నీ గమనించే వారూ ఉంటారు. కానీ, సామాన్య పాఠకుడికి కథా సారసంగ్రహం చాలా అవసరమవుతుంది. కొన్ని సార్లు ఉద్దండ పండితులు కూడా కొన్ని కావ్యాల్లో/ రచనల్లో ప్రధాన / ఇతివృత్తం ఏమిటో తెలిసినా బావుండుననే వారు ఉండవచ్చు. కొత్తగా లభించిన "కావ్యం" ఏదైనా ఉంటే వెంటనే చదువు కోవడానికి అందరికీ అందుబాటులోకి రాక పోవచ్చు. అలాంటప్పుడు సారసంగ్రహ వివరణనూ, విశేషాంశాన్నీ వివరించడం చాలా ప్రయోజనాన్ని కల్గిస్తుంది. ఆరుద్ర ఈ పద్ధతిలో చాలా కావ్యాలకి కథాసారసంగ్రహాల్ని ఆశ్వాసాది విభాగాల్లో వివరించడం 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' లో కన్పిస్తుంది. దీని వల్ల పరిశోధకుడు వివరించే అంశాల్ని అవగాహన చేసుకోవడానికి ఎంతో ప్రయోజం కలుగుతుంది. కొన్ని సార్లు కావ్యంలోని కథను తానే కొత్తగా కథను చెప్తున్నంత చక్కని శైలిలో ' కూడా ఆరుద్ర వివరిస్తుంటారు.

పరిశోధనలో అలంకారిక శైలిని ప్రయోగించటం కంటే, స్పష్టంగా అర్థమయ్యే సాధారణ శైలిని ఎన్నుకోవటం పరిశోధకులలో వస్తున్న సంప్రదాయం. 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' సామాన్యులకు కూడా ఉద్దేశించి నందు వల్ల బహుశా కొన్ని సార్లు ఆరుద్ర అలంకారిక శైలిని ఉపయోగిస్తారు. అయితే, ఇది కేవలం ప్రారంభంలోనో, ముగింపులోనో మాత్రమే ఉంటుంది.

సమగ్ర ఆంధ్ర సాహిత్యం 'మలిరాయలయుగం'(5వసంపుటి) దానిప్రాధాన్యతను వివరించి, ''భారతదేశ చరిత్రలోనే కాక, ప్రపంచ చరిత్రలోనే చిరస్థాయిగా నిలిచిపోయే మహా వ్యక్తి కృష్ణదేవరాయల పరిపాలన ఈ యుగంలోనే ప్రజాక్షేమానికి మంగళకైశికీగీతిలను పాడింది. చాణుక్యుణ్ణే చంపి పుట్టి యుగంధరుని తలదన్నే మహామంత్రి అప్పాజీ తిమ్మరుసయ్య స్వహస్తాలతో ఈ యుగానికి రూపు రేఖలు దిద్దాడు. అతని అమృత హస్తాల చలువ వల్ల విజయ నగర సామ్రాజ్యం వికసించిన పువ్వులాగ గుభాళించింది. అతని విగత నేత్రాల నుండి కారిన రక్తాశ్రువుల కుత్తుకలో కత్తులు పాట పాడాయి. ఈ యుగంలోని విజయనగర సామ్రాజ్య చరిత్ర ఆంధ్రుల విస్మరించలేని పుట్టుమచ్చ' (స. ఆం.సా. V.పు:2) దీనిలో కవిత్వ ప్రవాహం ఉంది, అది ఆకర్షణకు దారి తీసేలా చేస్తుంది. తర్వాత పేరానుంచి సామాన్యశైలిలోనే రచనను కొనసాగించారు. పరిశోధనను ముందుకి నడిపించారు.

కొన్నిసార్లు కథాసారసంగ్రహాన్ని చెప్తూనే మధ్యలో ముఖ్యమైన పద్యాల్ని వివరిస్తుంటారు.

(పు.వు) ఉదా. సమగ్ర ఆంధ్ర సాహిత్యం నాల్గవ సంపుటిలో తెనాలి రామకృష్ణుడి పాండురంగమాహాత్మ్యంలో 'నిగమశర్మోపాఖ్యానం'. పు.289-293. వంటి వాటిని ఎన్నింటినో చూడవచ్చు.

కేవలం కావ్యాల్లో కథను రమణీయమైన శైలిలో వివరించడమేకాదు, కవుల్ని గురించిగానీ, ఊళ్ళగురించిగానీ, వీటినీ ఆకర్షణీయమైన శైలిలోనే చెప్తారు.

ఉదా. సమగ్ర ఆంధ్రా సాహిత్యం (పు.ము. VII) లో కనుపర్తి అబ్బయ్యగురించి ఈ పద్ధతిలో వివరించడం గమనించవచ్చు.

"కనుపర్తి అనే గ్రామం కొండవీటి సీమలో ఉంది. గుంటూరు జిల్లా నర్సారావుపేట తాలూకా లోని కనుపర్తిలో అబ్బయ్యగారి పూర్వీకులు కరణాలుగా ఉండేవారు. (పు.165) ఇలా కథ చెప్తున్నట్లు కొనసాగుతుంది. కొంతదూరం పోయిన తర్వాత అబ్బయ్య ఏకాలంవాడో నిర్ణయించడానికి ప్రత్యక్ష ప్రమాణాలేమీ లేవు. ఇతడు పద్దెనిమిదో శతాబ్దపు మధ్యకాలంలో, అంటే క్రీ.శ.1750 లో ఉండేవాడని మల్లీ వీరేశం లింగం, కొమర్రాజు లక్ష్మణరావులు చెప్పిన ఆకారాల్ని వివరిస్తారు.

సృజనాత్మక పరిశోధనలో ఆకర్షణీయమైన శైలి, చర్చోపచర్చలతో ఉత్సుకతను కల్గించడం, భావుకత మిళితమైనా స్పష్టతను కలిగి ఉండటం, ఫలితాంశాల్ని దర్శింపజేయడం, సంయమనపూరణను కల్గి ఉటుంది. విమర్శను అంతర్భాగం చేసుకొంటూనే వస్తు నిష్ఠను కలిగి ఉండటమనేవి 'పరిశోధన' లో 'సృజనాత్మకత'ను నిరూపించే ప్రత్యేకాంశాలుగా గుర్తించవచ్చు. వీటిలో ఆకర్షణీయమైన శైలి, చర్చోప చర్చలతో ఉత్సుకతను కల్గించడం, భావుకతను మిళితం చేసి స్పష్టంగా ఫలితాంశాల్ని దర్శింప జేసిన విశ్లేషణలను ఇంతవరకూ గమనించగా, విమర్శను అంతర్భాగంగా చేసుకొని కవి పయనించిన దారిలో పరిశోధకుడు పయనిస్తూ పాఠకుణ్ణి పయనింపజేస్తూ, వస్తునిష్ఠను ప్రదర్శిస్తూనే, సిద్ధాంత ప్రతిపాదననో, సమన్వయాన్నో, సిద్ధాంతస్థిరీకరణనో ప్రదర్శించిన విధానాన్ని కింది విధంగా తెలుసుకోవచ్చు.

గురజాడ ఆంగ్లంలో రచించిన stooping to raise కథానికను 'సంస్కర్త హృదయం' పేరుతో అవసరాల సూర్యారావు అనువదించారు. దీన్ని భారతి 1951 లో ప్రచురించారు. గురజాడ కన్యాశుల్కం లో 'ప్లీడర్' సౌజన్యరావు మధురవాణికి 'భగవద్గీత'ను బహూకరించాడు. 'సంస్కర్త హృదయం' లో (ప్రొఫెసర్ రంగనాథయ్యరు సరళకి 'భగవద్గీత' ను బహూకరించడంలో గల అంతర్యాన్ని చాలా లోతుగా పరిశీలించిన ఆరుద్ర, గురజాడ దృక్పథాన్ని ప్రకటించడంలో చాలా సంయమనాన్ని ప్రదర్శించారు. కానీ, గురజాడ రచనల్లో పూర్ణమ్మ, కన్యక, లవణరాజు కలవంటివాటిని బట్టి గురజాడ అభ్యుదయవాదా? హేతువాదా? భావజాలాల సంఘర్షణ ఆరుద్రకి తప్పలేదు ! ఈ సంఘర్షణ అంతా 'గురజాడ గురు పీఠం' గ్రంథంలో కన్పిస్తుంది. 1892 లో రాసిన మొదటి మధురవాణి వేశ్యపాత్రకీ, 1906 లో చిత్రించిన మంజువాణికీ, తేడా గమనించి గురజాడ దృక్పథం మారిందన్నారు. (గు.గు.పీ.పు.11.) ఆరుద్ర రాసిన కొన్ని వాక్యాలు గురజాడను పరిశీలించిన వివిధ కోణాలకు అద్దంపడుతున్నాయి.

"ఆధునిక సాహిత్యంలో *అభ్యుదయ భావాలు* ఆయన (గురజాడ) వచనంలోనే అంకురించాయి. (గు.గు.పీ.,పు. iii)

"1943లో అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడ్డాక ప్రజలకోసం రచనలు చేసిన గురజాడను ప్రజలదగ్గరకు ప్రజానాట్య మండలి తీసుకెళ్ళింది, *అభ్యుదయ రచయిత అప్పారావు గారినే* అభ్యునిగా ప్రకటించుకొన్నారు". (గు.గు.పీ.పు. IV.)

"అప్పారావు గారి సాహిత్య రథానికి కూడా రెండే చక్రాలు. ఒకటి *సోషల్ రిఫార్మ్*, రెండోది స్పోకెన్ తెలుగు" (గు.గు.పీ.,పు.2)

"అప్పారావు గారికి స్వామి భక్తిలోనూ, ఉద్యోగ నిర్వహణలోనూ కొన్ని నమ్మకాలు ఉన్నాయి. "ఆయన ఆజ్ఞాపించిన వన్నీ శాయశక్తులా చేయడానికే ప్రయత్నించాలని నా ఉద్దేశం. మహారాజువారు పూర్తిగా పొరబడుతున్నారని గానీ, లేక *( దేవుడు దయవల్ల అలాంటి పరిస్థితికి రాకూడదు గానీ)* వారికి మతి స్థిమితం తప్పిందని గాని నికరంగా తేలేదాకా వారి ఆజ్ఞలు పాటించడమేనా విధి" అని అప్పారావు గారు వ్రాసుకొన్నారు. (గు.గు.పీ., పు.26) గురజాడ అప్పారావు *స్వర్గనరకాల* ప్రస్తావన చేసిన సందర్భాన్ని యథాతథంగా ఆరుద్ర పేర్కొన్నారు.

"ఆరోజుల్లో మహారజా వారితో నాకు అంతగా సాన్నిహిత్యం లేదు. అంతేకాదు, అడపాదడపా మాత్రమే వారిని దర్శించుకొనేవాడిని. ఎప్పుడు పడితే అప్పుడు వారిని చూడగలిగే అవకాశాలు ఉండేవి. అయితే, చచ్చి స్వర్గాన వున్న మా ప్రిన్సిపాలు గారు చెప్పినట్లు మహారాజా వారి దర్శనం చేసుకొనడానికి నేను ఏమాత్రం ఉబలాటపడేవాణ్ణి కాదు. అప్పటి నావిశ్వాసాల ప్రకారం ప్రిన్సిపాలు గారి ముందు మహారాజా వారు దిగదుడుపే..... గత ఆరేడు సంవత్సరాల్లో నాకు పర్యాలోకన శక్తీ, జీవన పరిజ్ఞానమూ అధికమయ్యాయి. నా అయిష్టాలూ, విరోదాలూ, విద్వేషాలూ అదుపులో పెట్టుకోవడం నేర్చుకొన్నాను. అందరినీ *సానుభూతితో చూడడానికి* ప్రయత్నించాను" (గు.గు.పీ.పు.27,28)

"అప్పారావు గారిలో సుప్తమైన *సాంఘికచైతన్యాన్ని* ముఖర్జీ గారు మేలు కొలిపినట్లు కనపడుతుంది". (గు.గు.పీ., పు.35)

"వారి నైతిక ప్రయోజనం *మనుష్యుల మనస్సులను మార్చడం*
ఎంత కరడు కట్టిన పాషాణ హృదయంలోనైనా కనికరముంటుందనే
విశ్వాసం అప్పారావు గారికుంది". (గు.గు.పీ., పు.68)

"*విశ్వ మానవ ప్రేమని మూర్తీభవింప చేయడమే అప్పారావు గారి లక్ష్యం*".(గు.గు.పీ.పు.,69.)

"అప్పారావు గారి ప్రతిభ అనన్యమైంది. వ్యుత్పత్తి అపారమైనది. *దృక్పథం ఆధునికం. ఆదర్శం అభ్యుదయం.* భాష సజీవమైనదైతే భావాలు సంచలనాత్మకమైనవి" (గు.గు.పీ., పు.73)

"*మతభేదాలు యెంచకపోవడంలో అప్పారావు గారూ వేమనగారూ ఒకటే..*
*ఎల్లలోకములొక్క యిల్లై*
*వర్ణభేదములెల్ల కల్లై*
*వేలనెరుగని ప్రేమబంధము*
*వేడుకలు కురియు*
*మతములన్నియు మాసిపోవును*
*జ్ఞాన మొక్కటి నిలిచి వెలుగును అని అప్పారావు గారు*
*కలలు గన్నారు. వేమనగారు కూడా*" (గు.గు.పీ., పు.81)

"రసానందం కోసం కన్యాశుల్కం చదువు కొనడం హాయిగా ఉంటుంది. అయితే, *పరిశోధనా దృష్టితో వియర్శ నాత్మకంగా* చదువుకొనే వాడికి అడుగడుగునా సందేహాలే! వికసించే వసంత కాలపు పద్మాల్లా ! (గు.గు.పీ.,పు.86)

"థియోసోఫీ పైన అప్పారావు గారికి ఎటువంటి సద్భావమూ లేదు. బ్రహ్మ సమాజం పట్ల కొన్ని సద్భావాలున్నా ఆ మతాన్ని ఆదరిస్తున్న పెద్దల పాలిటిక్సును ఆయన 'కొండు భట్టీయం' లో ఘాటుగానే విమర్శించారు. *అప్పారావు గారు హేతువాదే గాని నాస్తికులు కారు.* ఆయన భగవద్గీత వైపు మొగ్గు చూపుతారు. కళకు ప్రయోజనముందని గుర్తించి కళకోసమే కళ అన్న వాదాన్ని ఖండించినా ఆయన కర్మ సిద్ధాంతాన్ని పరోక్షంగా అంగీకరిస్తున్నట్లు కనపడుతుంది. (గు.గు.పీ.,పు.87.)

"జీవిత వ్యత్యాసాలు ఎందుకు ఏర్పడతాయో ఇబ్సనీయ సిద్ధాంతాన్ని ఇంకొంచెం ముందుకు తీసుకెళ్ళి శాస్త్రీయంగా చర్చించే *సోషలిజం సిద్ధాంతాలు,* కూలంకుషంగా వివరించే *శాస్త్రీయ సామ్యవాద సిద్ధాంతాలు* అప్పటికి అప్పారావు గారికి *పరిచయం కాకపోవచ్చు* అప్పారావు గారు *కర్మ సిద్ధాంతాన్నే నమ్ముతారు.*"(గు.గు.పీ.,పు.87)

గురజాడకు సంబంధించి ఆరుద్ర ప్రకటించిన అభిప్రాయాల్లో వివిధ భావజాలాలతో గురజాడ సంఘర్షించిన నేపథ్యం తెలుస్తుంది. వీటన్నింటిలో *శాస్త్రీయ సామ్యవాద సిద్ధాంతాలు* అప్పటికి పరిచయం కాకపోవడమనే ప్రకటనను బట్టి ఆరుద్ర, గురజాడను"హేతువాది"గా భావించినా, రచనలన్నింటిలో గల "*అభ్యుదయ భావాల్ని*" వివరించడమూ కన్పిస్తుంది.

జ్ఞాన సముపార్జనకు హేతువు (బుద్ధి) ప్రధాన సాధనం, గీటురాయి అని చెప్పే ఒక దర్శనం హేతువాదం అని చెప్పి బ్రిటీష్ రేషనలిస్ట్ ప్రెస్ అసోసియేషన్ వారు తమ మెమొరాండంలో హేతువాదాన్ని నిర్వచించిన దాన్ని ఆవుల మంజులత ఒక వ్యాసంలో పేర్కొన్నారు[76].

హేతువాదమంటే హేతువు (reason) సర్వాధిక్యాన్ని నిర్నిబంధంగా అంగీకరించే ఒక మానసిక వైఖరి (Mental attitude) నిర్దేశితంకమైన భావనలకు, ప్రమాణాలకూ (Authority)తావులేకుండా, ప్రయోగాత్మకంగా నిరూపణ చేసుకోవడానికి వీలయిన దర్శనాన్ని(Philosophy) నీతి శాస్త్రాన్ని (ethics) రూపొందించుకోవడమే దానిలక్ష్యం."

'అభ్యుదయం' అనే శబ్దం 'ప్రగతి', 'పురోగమనం' వంటి అర్థాల్లో ప్రయోగిస్తున్నారు. అభ్యుదయ వాద సాహిత్యంలో చైతన్యం, వాస్తవికత, సుందరత, తాత్త్వికతల వంటివి పునాదులవుతాయి. అభ్యుదయ సాహిత్యం 'దృక్పథానికి' ప్రాధాన్యతనిచ్చింది. ఈ దృక్పథం మార్క్సిజమేనని విమర్శకులు భావిస్తున్నారు[77]. అంతేకాక, అభ్యుదయవాద తక్షణ ధ్యేయం సోషలిజం, కమ్యూనిజం స్థాపనకాదు[78]. సామ్యవాద సంస్థాపనకు సాహిత్య ప్రక్రియల ద్వారా దోహదం చేయడం దీని లక్ష్యం. ఈ ఉద్యమం మార్క్సుగతి తార్కిక భౌతికవాదం తాత్త్విక పునాదిగా గల ఉద్యమం[79]. విమర్శకులు గురజాడ రచనల్ని విశ్లేషిస్తూ, ఆరోగ్య ప్రదమైన గురజాడ వారసత్వాన్ని అభ్యుదయోద్యమం మాత్రమే ముందుకు తీసుకెళ్ళిందన్నారు[80].

వీటన్నింటినీ జాగ్రత్తగా పరిశీలించినప్పుడు, ఆరుద్ర, గురజాడను ఒకేదృక్పథానికి కట్టేయడానికి ప్రయత్నించడం మంచిది కాదని భావించడం వల్లనే, భిన్న భిన్న ప్రకటనలు వెలువరించినా, చాలా సంయమనంతో వ్యవహరించారని తెలుస్తుంది.

'స్వర్గ నరకాల' ప్రస్తావన, 'కర్మసిద్ధాంతాల పట్ల నమ్మకాన్ని' వ్యక్తం చేసిన నట్లు గురజాడ వ్యక్తిత్వాన్ని నిర్ణయించినపుడు 'అభ్యుదయ వాది'గా గుర్తించే అవకాశం లేదు. 'మతములన్నియు మాసి పోవును జ్ఞానమొక్కటే వెలుగునిలుచును' వంటి వాటివల్ల హేతువునే నమ్మినట్లు భావించవలసి ఉంది. అందుకనే, గురజాడ' హేతువాదే' గాని 'నాస్తికుడు' కాదనేది చాలా సంయమనంలో చెప్పిన మాట. హేతువాది 'జ్ఞానానికి' ప్రాధాన్యతనిస్తే, నాస్తికుడికి దేవుడు ఉన్నాడా లేడా అనేది శోధన లక్ష్యం (goal)లో ఉంటుంది. ఇక్కడ, గురజాడ ను ఆరుద్ర హేతువాదే కాని నాస్తికుడు కాడు అనడంలో ఈ అభిప్రాయం ఉండవచ్చు. గురజాడ పై పరిశోధన చేసిన నరాల వీరయ్య అభిప్రాయంలో చారిత్రక వాస్తవికతా దృష్టి, ఆధునిక శాస్త్రీయ దృష్టిగల అభ్యుదయ సంప్రదాయానికి యుగకర్తగా గురజాడను అభ్యుదయ విమర్శకులు గుర్తించారన్నారు[81].

ఆరుద్ర తన పరిశోధనలో సంయమనాన్ని పాటిస్తుంటారనేది వీటన్నింటినీ అవగాహన చేసుకున్నప్పుడు తెలుస్తుంది.

గ్రంథ పరిష్కరణ పరిశోధనలో కూడా పరిశోధకుడు కవి పయనించిన మార్గాన్ని కనుగొనగలిగినట్లయితేనే లక్ష్యం దెబ్బతినకుండా ఉంటుంది. ఇక్కడ పరిశోధకుడిలో 'భావుకత' నెరవేరుస్తూ దీన్ని ప్రతిభ వన్నె కెక్కేటట్లు చేస్తుంది.

వేమన పద్యాలలో అనేక భావాలు కన్పిస్తున్నాయి. దీనికి కారణం పద్యాల్లో కన్పించే పాఠాంతరాలు. వీటిని సంయమనంతో వివిధ ఆకరాల్ని, భావజాలాల్ని అనుసరించి పూరించవలసి ఉంటుంది.

వేమన పద్యాల్లో వేటూరి ప్రభాకరశాస్త్రి సంకలనం చేసిన చాటుపద్యమణి మంజరి (ప్ర. భా)లో ఒక పద్యాన్ని తీసుకొని[82], దానిలోని పాఠాంతరాల్ని పరిశీలించి, పరిష్కరించిన ఆరుద్ర భావుకతను క్రింది విధంగా గమనించవచ్చు.

"పడుచు విడిన వాని బుద్యమిచ్చున వాని
గడుపు కిడిన వాని నడుప వలయు
నడుపలేనివాని నయవిదులెంతురా
విశ్వదాభిరామ వినురవేమ".

ఈ పద్యంలో ' *పడుచు నిచ్చిన వారి భత్య మిచ్చిన వాని* అన్న పాఠాంతరం ఉందన్నారు[83].

మూడవ పాదంలో మోటుదనం వేటూరి వారు పేర్కొన్న పద్యంలో కొంచెం ఘాటు తగ్గే ఉంది. బ్రౌన్ **1839** లో ప్రచురించిన సంకలనంలో ఇది అచ్చుపడలేదు! గానీ వ్రాతపతులలో కొంచెం పచ్చిగావే ఉందని దాన్ని ఆరుద్ర పేర్కొన్నారు[84].

"పడుచు నిచ్చువాని పద్యమిచ్చిన వాని

కడుపు చల్లచేసి ఘనత చేసి

వడువ నేరవోడు నాబుల్ల గుడువనా

విశ్వదాభి రామ వినుర వేమ".

ఈ పద్యాన్ని బ్రౌన్ "అశ్లీల పర్వం" అనే ఒక విభాగంలో పెట్టి, తాత్పర్యాల్ని ఇంగ్లీషులో కాకుండా, లాటిన్‌లో చెప్పారన్నారు[85].

వీటిని ఉదాహరించి "వేమన గారి సుప్రసిద్ధ పద్యాలు ఇతరుల పేరు మీదుగావో, లేక ఇతరుల ప్రఖ్యాత చాటువులు వేమన గారి ముద్ర అలికించడంతోవో ప్రచారమవుతున్నాయని ఒక డజను ఉదాహరణలను చూపగలను "అని కొన్ని పద్యాల్ని వివరించారు[86]. ఇక్కడ ఆరుద్ర పాఠపరిష్కరణలను చూపడం ద్వారా వేమన పద్యాలుగా ప్రచారంలో ఉన్నవి, వేమననే కాదనీ నిరూపించడానికి ప్రయత్నం కన్పిస్తుంది.

సంయమనపూరణను భావుకతతో ఆరుద్ర పూరిస్తారనే నిరూపణకు సౌలభ్యం కోసం, గతంలో ఈ పరిశోధనలోనే నిరూపించిన *ఊరుకొండ వీడు* పద్యాన్ని తీసుకోవడం మరింత సులభమవుతుంది[87].

"ఆనాటి లేఖన పద్ధతుల్ని అవగాహన చేసుకొని, లేఖక దోషాల్ని పరిహరించి, మాత్రాధిక్యతను తొలిగించి, వేమన చెప్పిన పద్యాల భావజాలనికి అనుగుణంగా పద్యాల్ని ఆరుద్ర పరిష్కరించడాన్ని గమనించవచ్చు.

"వీడుకొండవీడు వీధి పశ్చిమవీధి

మొలక చింతలోన మొదటి యిల్లు

వెర్రి వేమనవగ వేదాంత వేత్తరా

విశ్వదాభిరామ వినుర వేమ".

'ఈ పద్యంలో మూడవ పాదం లోని పాఠాంతరం అన్నింటికన్నా విభిన్నంగా విలక్షణంగా ఉంది. ఇందులో కుల ప్రసక్తి గాని, బయలుగాని, శివుడు గాని, ముక్తి మార్గంగానీ లేవు. ఇది కేవలం వేమన గారి ప్రశస్తి. ఆయన తమ్ముతాము 'వెర్రి వేమన' అని పిలుచుకోవడం కూడ కనబడుతుంది. ఈ ముచ్చట ఇతర వేమన పద్యాల్లోనూ ఉంది' అని కొన్ని ఉదాహరించి చూపారు. ఇంకా ఈ'వెర్రి వేమన' 'మూగ చింత పల్లి' వంటి పదాల్ని వివరించడంలో వేమన భావుకతతో ఆరుద్ర వయనించారు[89].

పరిశోధన ఫలితాంశాల్ని దర్శింపజేయడాన్ని వేమన తాత్త్విక పరిణామాన్ని వివరించడంలో గమనించవచ్చు. అలాగే 'రాముడికి సీత ఏమవుతుంది 'లో వివిధ రామాయణ కథల్ని వివరించడం లోనూ పాఠకులకి సిద్ధాంత దర్శనం చేయించడం కన్పిస్తుంది. ఇటువంటి లక్షణాల్ని సూక్ష్మంగా పరిశీలించినప్పుడు విమర్శను ఆసరాగా తీసుకొని 'సృజనాత్మక పరిశోధన'(Creative research) కొనసాగించడం ఆరుద్ర పరిశోధన విశిష్టతగా చెప్పుకోవచ్చు. ఆరుద్ర పేర్కొన్నట్లు పరిశోధనలో

విమర్శనాత్మక విశ్లేషణ (Critical analysis) ని పొందు పరచటం కూడా ఆరుద్ర పరిశోధనలో ఒక ప్రత్యేక ముద్రను కల్గిస్తుంది[90] చాలామంది ఆరుద్ర శైలి సరళంగా, ఆహ్లాదకరంగా ఉంటుందని పేర్కొన్నారు[91] అయితే 'సృజనాత్మక పరిశోధన' అనే పదాన్ని మాత్రం ప్రయోగించలేదు. ఇది శైలీపరమైన అంశం మాత్రమే కాదనీ, ఆరుద్ర పరిశోధనలో 'సృజనాత్మకత' ను 'విశిష్ట లక్షణం'గా గుర్తించేటట్లు చేసింది .

'కాటమరాజుకథ'ను స్టేజినాటకంగా రూపొందించడాన్ని పరిశీలిస్తే, ఆరుద్రసృజనాత్మక రచనకూ, సృజనాత్మక పరిశోధనకూ గల మధ్య వ్యత్యాసం మరింత సులభంగా గుర్తించవచ్చు. 'ఎర్రగడ్డపాటి పోట్లాటను ప్రధానంగా గ్రహించి ఈ నాటకాన్ని రచించారు[92]. మూల కథాతత్త్వాన్ని తారుమారు చేసే కల్పనలు కూడా ఈ నాటకంలో ఎక్కడాలేవు[93]. ఈ అంశంలో ప్రత్యేక పరిశోధన చేసిన 'తంగిరాల'వారు దీనికి పీఠిక రాస్తూ "ఈ కథా చక్రంలో నల్లసిద్ధిరాజు, ఖడ్గతిక్కన ఇద్దరే చారిత్రక వ్యక్తులు. ఓరుగంటి ప్రతాపరుద్రుని ప్రసక్తి ఉన్న వీరగాథలు కూడా నాకు లభించాయి. పల్నాటి యుద్ధం క్రీ.శ.12వ. శతాబ్ది చతుర్థపాదంలో జరుగగా, కాటమరాజు ఎఱ్ఱగడ్డ పాటి పోట్లాట క్రీ.శ.13వ శతాబ్ది చతుర్థ పాదంలో జరిగింది' ఇది కాకతీయ మహారాణి రుద్రమదేవి పాలనాకాలం చివరిభాగంలో, అంటే ప్రతాపరుద్రుడు యువరాజుగా ఉన్నప్పుడు జరిగిందని శాసనాధారాలను బట్టి వీరగాథలను బట్టి తెలుస్తుంది. అంటే కాటమరాజు నల్లసిద్ధిరాజుల యుద్ధం క్రీ.శ.1280-1297 మధ్యకాలంలో జరిగింది. మనుమసిద్ధే 'నల్లసిద్ధి' అనడం సరికాదు. మనుమసిద్ధి కొడుకు నల్లసిద్ధి ఇతడు నెల్లూరును పాలంచిన తెలుగు చోళరాజు. ప్రతాపరుద్రుని యువరాజు కాలమే (క్రీ.శ.1280-1296)నల్లసిద్ధి కాలం. ఈ నల్లసిద్ధియే కాటమరాజునకు ప్రత్యర్థి[94] అన్నారు. ఇదే విషయాన్ని ఆరుద్ర 'వ్యాసపీఠం' లో సోదాహరణంగా సవిమర్శకంగా నిరూపిస్తూ రాశారు[95]. వేటూరి ప్రభాకరశాస్త్రి కాటమరాజు కథ గురించి రాస్తూ నెల్లూరును పరిపాలించిన మనుమసిద్ధికి ఎర్రగడ్డపాటి పాలిక కాటమరాజుకు జరిగిన యుద్ధం అన్నారు. మద్రాసు విశ్వవిద్యాలయం వారు ప్రచురించిన 'ఆంధ్రవాఙ్మయ చరిత్ర సర్వస్వం' లో శిష్ట్లా రామకృష్ణ శాస్త్రి మనుమసిద్ధిరాజు కాలంలో 'కనిగిరి సీమ'లో ఎర్రగడ్డను పాలించే కాటమరాజుకు మధ్య యుద్ధం ఏర్పడిందన్నారు. అలాగే బి.యస్. ఎల్. హనుమంత రావు' మనుమసిద్ధికి ఎర్రగడ్డపాడు ఆధిపతి కాటమరాజుకి యుద్ధం సంభవించిందన్నారు. విశాలాంధ్ర ప్రచురణాలయం వారు 1959 తో ప్రచురించిన 'ఆంధ్ర దర్శిని' లో ఎర్రగడ్డపాడును కాటమరాజు పాలిస్తున్నాడన్నారు. వీటన్నింటిని పేర్కొని ఆరుద్ర ఇందరింత కచ్చితంగా వ్రాస్తున్నా- ఇది నిజం కాదు. కాటమరాజు కి నెల్లూరు సిద్ధిరాజుకి ఎర్రగడ్డపాడు వద్ద యుద్ధం జరిగింది గాని ఆ గ్రామం కాటమరాజు ఏలుబడిలో లేదు. కాటమరాజు కథనీ దాని అనుబంధ గాథలనీ శ్రద్ధగా చదివితే ఈ విషయం తెలుస్తుంది అన్నారు. ఖడ్గతిక్కన గురించి పరిశోధనలో చెప్పే పద్ధతి వేరేగా కన్పిస్తుంది. కాకతీయ యుగం (రెండవ సంపుటి)లో తిక్కనగారి వంశం శీర్షిక (పు.95)లో సోదాహరణంగా వివరించారు.

భాస్కర మంత్రికి నలుగురు కొడుకులు. పెద్దవాడు కేతన ప్రగ్గడు, రెండవవాడు మల్లన, మూడవవాడు సిద్ధన, కడగొట్టువాడు కొమ్మన. ఈయనే తిక్కనగారి తండ్రి. భాస్కరుని మూడవకొడుకు సిద్ధన మంత్రి. ఇతడు చోడతిక్కరాజుకుమంత్రి. ఈ సిద్ధన మంత్రి కుమారుడే ఖడ్గతిక్కన (పు.ము.2 పు.96) అని వివరించారు. దీన్ని మరింత స్పష్టంగా తిక్కనగారి వంశ వృక్షం (పు.100-101) లో నిరూపించి,

కవితిక్కన– ఖడ్గతిక్కనకే మధ్య గల సంబంధం ఏమిటో నిరూపించారు. ఇద్దరూ వేరు వేరనీ, ఖడ్గతిక్కనవే కవి తిక్కన అనీ, కవి తిక్కనవే ఖడ్గతిక్కన అనీ పొరపడడానికి అవకాశం లేకుండా వివిధ ఆకరాలతో వహా పరిశోధనలో నిరూపించారు. ఇప్పుడు కాటమరాజు కథలో గల ఒక సన్నివేశాన్ని పరిశీలిస్తే సృజనాత్మక సాహిత్యానికీ, సృజనాత్మక పరిశోధనకే భేదం అవగతమవుతుంది. కాటమరాజు కథలో సిద్ధిరాజు తరపున పోరాడిన ఖడ్గతిక్కన యుద్ధం నుండి తిరిగి వచ్చిన సంఘటన చాలా ప్రసిద్ధమైంది. యుద్ధం నుండి తిరిగి వచ్చిం ఖడ్గ తిక్కన తో భార్య (జానమ్మ)............

"పగలకు వెన్నిచ్చినచో
వగరేనిను మగతనంపు నాయకులెందున్
ముగురాడు వారమైతిమి
వగపేటికి జలకమాడ వచ్చిన చోటన్"

అని అంటుంది. అయితే, యుద్ధం నుండి ఎందుకు తిరిగి వచ్చాడో ఆరుద్ర చక్కని సృజనాత్మక నైపుణ్యాన్ని ప్రదర్శించి సన్నివేశ కల్పన చేశారు. ఇంటికొచ్చిన ఖడ్గతిక్కన తో తండ్రి (సిద్ధన మంత్రి) సంభాషణ ".......

"సిద్ధ : అందుచేతనే యాదవులు ధర్మాత్ములయ్యారా !

తిక్కన : అదికాదు నాన్నా! వీరతాంబూలం పుచ్చుకున్న తర్వాత విజయవిహారం చెయ్యాలని నాకూ తెలుసు.

సిద్ధ : అందుకేనా ఇంటికి విజయం చేశావు.

తిక్కన : కాదు. హోరాహోరీగా పోరాటం సాగించాను. వెంట వచ్చిన బంట్లు నేల కూలారు. వంటరిగా మిగిలాను. అయినా కత్తిపట్టుకుని ముందుకే మిగిలాను.

సిద్ధ : వారిని చంపి చావడానికి ఏం అడ్డమొచ్చింది.

తిక్కన : ఇదే, ఇదే అడ్డమొచ్చింది.

(అని జంధ్యం చూపుతాడు.)

బ్రాహ్మణునితో యుద్ధం చేయమని వాళ్ళు కత్తులు ఒరలో పెట్టారు. చేతులు ముడుచుకున్నారు. నిరాయుధులపై కలబడమని నీవు నాకెన్నడూ బోధించలేదు. ఎలా పొడవమన్నావు.

సిద్ధ : ఎవిటి కత్తులు ఒరలో పెట్టారా?

తిక్క : అవును. ఎంత రెచ్చగొట్టినా వాళ్ళు ఉద్రేకులు కాందే బ్రహ్మహత్య కట్టుకోలేమన్నారు. నిరాయుధులై నిలబడి తమ్ము వధించమన్నారు. అంతకన్నా అధర్మముంటుందా......!

సిద్ధ : నీతికి కట్టుబడి నీవు తిరిగివచ్చినట్లు లోకానికి ఎలా తెలుస్తుంది.?

తిక్క : అయినవారు మీరే అర్థంచేసుకోలేదు. లోకానికేంపట్టింది. కన్నతల్లి, గారాబంగా పెంచిన తండ్రి, కట్టుకున్న భార్య వీళ్ళే తొందరపడ్డారు. నన్ను తూలనాడారు. లోకమెందుకు గౌరవిస్తుంది. ఇప్పటికైనా దానిలో తప్పులేదని మీరు భావిస్తే నాకదే చాలు.

సిద్ధ : లేదు ! నీవు చేసినది తప్పే !

తిక్క : తప్పా.......?

సిద్ధ : ముమ్మాటికీ తప్పు. ఆ యాదవ సేనలో ఒక్క బ్రాహ్మణుడు కూడా లేడా? అతని పైన నీవు కత్తి దూయవచ్చునే! అలా చేసావా వారు ఆశితులను రక్షించడానికైనా కత్తులు తీస్తారు. అప్పుడు యుద్ధంచేసి వీరుడన్న పేరుదక్కించుకోవచ్చునే! అలా చేశావా? లేదు-లేదు. ఈ మాత్రం వివేకం కూడా లేనివాడివి వీరతాంబూలం ఎందుకర్థించావు. నిన్ను యుద్ధానికి పంపించకపోతే నా ఉద్యోగం వదులు కుంటానన్నావే? దానికిదా ప్రతి ఫలం.

తిక్క : క్షమించు నాన్నా యుద్ధభూమిలో నాకీ ఆలోచన తట్టలేదు. వాళ్ళసేనలో చల్లపిన్నమనేని మంత్రి బ్రహ్మరుద్రయ్య ఉన్నాడు. అతడు శైవ బ్రాహ్మణుడు. అతనిపై కత్తిదూసి కదనానికి పిలుస్తాను. యాదవులు అతనికోసమైనా నాతో యుద్ధం చేయక తప్పదు. జై హరహర మహాదేవ! (అని కత్తిలాగుతాడు )".

దీనిలో ఒక చారిత్రక వాస్తవాన్ని ఆరుద్ర చక్కగా తెలియ చేశారు. సమాజంలో బ్రాహ్మణ హత్య మహాపాతకం అనే దాన్ని ఎలా తీసుకునే వారో అది ఎలా ఉపయోగపడేదో చారిత్రక, రాజకీయ, సామాజిక నేపథ్యాన్ని చక్కగా వివరించారు. సమగ్ర ఆంధ్ర సాహిత్యం (సం.ము1 పు.174) లో బ్రాహ్మణుల్ని పాలక వర్గం ఉపయోగించుకోవడం లోని రహస్యాన్ని తనదైన దృక్పథం తో భారతాన్ని గానీ, అష్టాదశ పురాణాలను గాని వ్యాసప్రోక్తమని చెప్పి ప్రచారం చేసినది పాలక వర్గ ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొనే! రాచరికాన్ని రక్షించే బ్రాహ్మణునికి సకల సౌకర్యాలు కల్పించాలి. వాళ్ళ జీవనోపాధికి ఇబ్బంది కలగ కూడదు. దానాలూ, దక్షిణలు పుష్కలంగా ఉండాలి. అందుకే వీలైనన్ని చోట్ల బ్రాహ్మణులకు అందరిచేతా దక్షిణ కల్పించారు అని ఆరుద్ర అభిప్రాయపడ్డారు. బ్రాహ్మణుని చంపకూడదనేది మనుస్మృతి నుండే వస్తున్న సంప్రదాయం. చంపితే మహా పాతకం చుట్టుకొంటుందని ప్రచారం చేశారు. ఈ పరిశోధన అంశం కూడా ఖడ్గతిక్కన యుద్ధభూమి నుండి తిరిగి వచ్చేసిన సంఘటనకు చారిత్రక నేపథ్యాన్ని అందిస్తుంది. బ్రాహ్మణుల్ని ఇలా రక్షిస్తుండగా కొన్ని వర్ణాల వారిని శిక్షించడానికి కఠినమైన శిక్షల్ని అమలు చేసేవారని విజ్ఞానేశ్వరీయం (కేతన) గ్రంథాన్ని సమీక్షిస్తూ కూడా బ్రాహ్మణుల్ని పాలకులు రక్షించడంలో గల ఆంతర్యాన్ని పరిశోధనాత్మకంగా వివరించారు. అయితే దీన్ని సృజనాత్మక సాహిత్యంలో పరిశోధన ను ఎలా నిక్షిప్తం చేయవచ్చో తెలిపేందుకు ఒక ఉదాహరణగా తీసుకోవచ్చు. పరిశోధనను సృజనాత్మక సాహిత్యం పద్ధతిలో కంటే పరిశోధనలో సృజనాత్మకతను ప్రవేశపెట్టి శైలిలో ప్రధానంగా మార్పుచేసి సృజనాత్మక పరిశోధనను కొనసాగించారు. ' ఖడ్గతిక్కన భార్య పేరు 'చానమ్మ' కాదు. 'జానమ్మ' అని ఆరుద్ర చక్కగా గుర్తించారనీ,

నెల్లూరు జిల్లాలో 'జానపాడు' అనే గ్రామం ఉంది. అక్కడ 'జానమ్మ' అనే గ్రామ దేవత ఉంది. ఈ దేవత పేరునే ఆమెకు పెట్టి ఉంటారు. ఆమె తలిదండ్రులు లేదా ఖడ్గ తిక్కన భార్య జానమ్మ పేరంటాలుగా మారి ఆమె పేరుతో అక్కడ గ్రామం వెలిసి ఉంటుందన్నారు తంగిరాల వేంకట సుబ్బారావు[7]. దీన్ని బట్టి కూడా తరతరాలుగా ఖడ్గ తిక్కన భార్య పేరు 'చానమ్మ'గా వ్యాప్తిలో ఉన్నప్పటికీ, 'జానమ్మ'అనే పేరే వాస్తవమని ఆరుద్ర నిరూపించారు. సృజనాత్మక సాహిత్యంలో సుదీర్ఘంగా చెప్పే అశాన్నికూడ చక్కని శైలిలో ఆధారాలతో సహా ఆరుద్ర నిరూపిస్తూంటారనే దానికి నిదర్శనంగా ఋగ్వేదంలో యమి-యముల సంబంధాల్ని "రాముడికి సీత ఏమవుతుంది" గ్రంథంలోని పరిశోధనాంశాల్ని, " మనిషి- ఆడమనిషి" పేరుతో ఆరుద్ర రాసిన మహాకావ్యం లోనూ చూడవచ్చు.[8]

" ఆదిలో ఋగ్వేదమందున యమీ యమ సంవాదము

సోదరీ సోదరుల సెక్సు నికాదులే ఆమోదము

పాదుకొలిపెను వేదసూక్తము వావివరసు బీజము

చేదు విషమో చెరకు రసమో చిందే సంస్థా భూజము"

అని వర్ణించి, యమి తన అన్నతో శారీరక సంబంధం కోసం పౌరణికేతి హాసాల్లో ఉన్న సంఘటల్ని వివరిస్తూ చాతుర్యంతో సంభాషణ కొనసాగిస్తుంది.

లజ్జ వీడితి సజ్జ చేరితి లాలసను ఎదచేర్చరా

లొజ్జు చేయక బుజ్జగించుచు లోలుడా తమి తీర్చరా

గజ్జు రేగును నీకు కొడుకును కనాలని మనసుందిరా

సెజ్జ పరిచెతి ఏకశయ్యను చేరి రతులను తేల్చరా

అని యమి-తన సోదరుడైన యమ తో నిర్లజ్జ గా అడుగుతుంది 'ఇలా' దీన్ని రసవంతం చేస్తూ, సృజనాత్మక సాహిత్యం గా దాన్ని ఆరుద్ర తీర్చిదిద్దారు. ఇదే విషయాన్ని సృజనాత్మక పరిశోధన గా రాముడికి సీత ఏమవుతుంది ? (పు : 128-129) లో ఇలా వివరించారు.

"ఋగ్వేదంలో యముడు-యమి ఒక తల్లి బిడ్డలు, కవలలు, యమి సంతానాభి వృద్ధి కోసం, వంశ విస్తరణ కోసం తన సోదరునితో లైంగిక సంబంధాలు పెట్టుకొందామని చూస్తుంది. యముడు అది అక్రమ మని వారిస్తాడు. రాగల యుగాలలో తోడ బుట్టు వడుచులు సోదరుణ్ణే కాక అన్యులను భర్తగావరించగలరనీ చెప్తాడు...... ఋగ్వేదం-దశమమండలం-పదవ సూత్రం లోలోని పధ్నాలుగు బుక్కులూ యమ-యమి సంవాదమే, అని చెప్పి, కార్తీక శుద్ధ విదియనాడు యమ-యమీలు భార్యాభర్తలుగా కాక అన్న చెల్లెళ్ళుగా ఉండాలనే దాన్ని గుర్తు చేయడానికే భాతృద్వితీయ పండుగ చేస్తారన్నారు. సృజనాత్మక సాహిత్యంలో సుదీర్ఘంగా ఉండేది, పరిశోధనలో వర్ణనలకంటే స్పష్టతతో పాటు సంక్షిప్తత ఉంటుందనే దాన్ని ఇది నిరూపిస్తుంది.

శ్రీకృష్ణ దేవరాయులు గురించి రాసిన సంగీత రూపకంలో కూడా చారిత్రక వాస్తవాల్ని ఆరుద్ర సృజనీకరించారు. చారిత్రక అంశాల్ని సృజనాత్మక రచనగా రూపొందించారు.

కాటమరాజు కథ (స్టేజి నాటకం) 'మనిషి- ఆడమనిషి' కావ్యం శ్రీకృష్ణ దేవరాయులు (రూపకం) వంటివాటిని పరిశీలించడం ద్వారా సృజనాత్మక సాహిత్యం వేరూ, సృజనాత్మక పరిశోధన వేరనే అంశం నిరూపితం అయ్యింది. పైగా సృజనాత్మక పరిశోధన వేరనే అంశం నిరూపితం అయ్యింది. పైగా సృజనాత్మక సాహిత్యంలో ప్రతిభలేనివారో, రాణించలేనివారో విమర్శ, పరిశోధనల్లో ప్రవేశిస్తుంటారనీ, వీటిలో అక్కడక్కడా సృజనాత్మకత ను ప్రదర్శిస్తుంటారనీ, అపోహ మాత్రమేననీ ఆరుద్ర జీవితం, రచనా విశేషాలు కూడా బుజువు చేస్తున్నాయి. కవిత్వం విమర్శ పరిశోధన రంగాల్లో వివిధ బహుమతులు రావడం ఆ ప్రక్రియా ప్రత్యేకతలతో పాటు, వాటి గౌరవాన్ని తెలియజేస్తున్నాయి.

ఐతే కేవల పరిశోధనకు సంక్షిప్తంగా, సమగ్రంగా, సూటిగా చెప్పడం అవసరం. ఆరుద్రది సృజనాత్మక పరిశోధన కనుక విస్తరించే స్వభావం కన్పిస్తుంది. ఇది సమగ్ర ఆంధ్ర సాహిత్యం లో మరీ ఎక్కువగా ఉండడాన్నీ గమనించవచ్చు.

పునర్ముద్రణ పదవ సంపుటిలో చిన్నయసూరిని పరిచయం చేస్తూ ఆరుద్ర " సర్వసామాన్యంగా లోకులు తమకు పదహారవ యేడు వచ్చే సరికి ప్రాథమిక విద్యను పూర్తి చేసుకొనడం పరిపాటి. అయితే ఒక అసాధా రణ వ్యక్తి తన పదహారవయేట అక్షరాభ్యాసం మొదలుపెట్టి ఇసుకలో గుంటోనములు దిద్దడం ప్రారంభించాడట. కుశాగ్రబుద్ధి కనుక అతనిలో విద్యాబీజాలు "దున్నకజల్లితే" "కొయ్యకపండినట్టు" అచిర కాలంలోనే పంటకు వచ్చాయట. ఇతని పేరు పరవస్తు చిన్నయసూరి" (స. ఆం.సా. X పు.25)అని రాశారు.

దీన్నే సూటిగా, సంక్షిప్తంగా సమగ్రంగా కింది విధంగా చెప్పడానికి అవకాశం ఉంది.

సామాన్యంగా ప్రాథమిక విద్య పూర్తి చేసే పదహారేళ్ళ వయసు లో చిన్నయసూరి అక్షరాభ్యాసం ప్రారంభించాడు.

ఈపద్ధతిలో రచన కొనసాగించడం ఆరుద్రకు తెలియదనో, రాదనో అనుకోవడానికి వీలులేదు. కావ్యాలకీ పరిణయాలు, విలాసాలు, అభ్యుదయం వంటి వాటిని చివరపెట్టి రాసిన కవుల్ని ప్రక్రియాపరంగా వివరించేటప్పుడు చాల సంక్షిప్తంగా, సమగ్రంగా, సూటిగా వివరించారు. శతకకవులు, నాటకాలు, క్రైస్తవ కావ్యాలు, చరిత్రలూ, ఉపాఖ్యానాలు రచించిన వారిని ఒకేచోట వివరించేటప్పుడు ఇటువంటి పద్ధతి అన్ని సంపుటాల్లోనూ పాటించారు.

ఇలారాస్తే సాహిత్య పరిశోధనలో శైలీ విధానంలో ఒక భాగంగానే పరిగణించడానికి అవకాశం ఉండేది. కానీ ఒక ప్రత్యేక పద్ధతిని అంటే, కొన్ని చోట్ల సృజనాత్మకతను ప్రదర్శించడం సంక్షిప్తంగా చెప్పేటప్పుడు సూటిగా విషయాన్ని మాత్రమే వివరించేయడం అనే పద్ధతిని పాటించడం వల్ల సృజనాత్మక పరిశోధకుడుగా గుర్తించవలసి వస్తుంది. ఇది ఒక ప్రత్యేక లక్షణమే కాని పరిశోధనకు అటంకమయ్యేదికాదు.

పరిశోధనలో మొత్తంమీద పరిశోధకుడుగా ఆరుద్ర లో తులనాత్మక ( Comparitive ) కవిజీవిత (Biographical) గ్రంథపరిష్కరణ (Biographical-Texual) జానపద విజ్ఞాన (Folklore) పరిశోధన పద్ధతులు కన్పిస్తున్నాయనీ, వాటిలోనూ విమర్శనాత్మక పరిశోధన (Critical research) ఉంటూనే, వాటిన్నింటినీ వ్యక్తీకరించడానికి సృజనాత్మక పరిశోధన ( Creative research) నని ఉపయోగించుకొని సాహిత్య పరిశోధనను సామన్యులస్థాయి వరకూ నడిపించగలిగారని నిరూపితమయ్యింది. 'సృజనాత్మక పరిశోధన' అనేది 'పరిశోధనలోనే ఒక అంశంగా భావించాలి తప్ప ప్రత్యేక అస్తిత్వాన్ని కలిగించడం వల్లనో, కలిగించక పోవడం వల్లనో పరిశోధకుడుగా ఆరుద్ర కు కలిగే నష్టమైతే ఏమీ ఉండదు. కానీ, అదొక్క అదనపు లక్షణం అవుతుంది. వీటన్నింటినీ అధ్యయనం చేసినప్పుడు పరిశోధకుడుగా ఆరుద్రని సత్యాన్వేషణకు ప్రయత్నించారనీ, సాహిత్య పరిశోధకుడుగా విజయవంతమైయ్యారని నిరూపితమయ్యింది.!

# సూచికలు (References)

1. రాచపాళెం చంద్ర శేఖరరెడ్డి, హెచ్.ఎస్.బ్రహ్మానంద, *సాహిత్య పరిశోధన సూత్రాలు*, పు.4.

2. అదే. పు.5

3. అదే. పు.8

4. అదే. పు.27

5. ఎమిలీ బరన్స్, *మార్క్సిజం అంటే ఏమిటి?* (అను) పాతిమా, (ప్రజాశక్తి బుక్ హౌస్ ప్రచురణ: హైదరాబాదు, 1998, పు.2

6. రాచపాళెం చంద్ర శేఖరరెడ్డి, హెచ్.ఎస్.బ్రహ్మానంద, *పరిశోధన సూత్రాలు*, పు.56

7. భీమ్‌సేన్ నిర్మల్, *తులనాత్మక పరిశోధనలు*(వ్యా), తెలుగులో పరిశోధన, (సం), దేవులపల్లి రామానుజరావు, ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ : హైదరాబాదు, 1983, పు.318.

8. అదే. పు.318

9. అదే. పు.319

10. గురజాడ, *గురజాడ జాబులు– జవాబులు*, దినచర్యలు (సం.) సెట్టి ఈశ్వరరావు, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ ప్రచురణ: హైదరాబాదు, 2000, పు.III.

11. జి.ఎన్.రెడ్డి *అభినందన* (పీ), వరాలవీరయ్య కన్యాశుల్కం, తొలిమలి కూర్పుల తులనాత్మక పరిశీలన, సునందా పబ్లికేషన్స్: తిరుపతి, 1985, పు.VIII.

12. *కన్యాశుల్కం – నూరేళ్ళ సమాలోచనం* (సం.లు) మొదలి నాగభూషణ శర్మ, ఏటుకూరిప్రసాద్, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ ప్రచురణ: హైదరాబాదు, 1994, పు.1

13. ఆరుద్ర, *కన్యాశుల్కం రచన ఎవరిది?* (వ్యా), కన్యాశుల్కం– నూరేళ్ళ సమాలోచనం, (సం.లు) మొదలినాభూషణశర్మ, ఏటుకూరి ప్రసాద్, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ ప్రచురణ : హైదరాబాదు, 1999, పు.4.

14. అదే. పు.5.

15. అదే. పు.6.

16. అదే.పు.26.

17. అదే.పు.24.

18. అదే.పు.25.

19. మొదలి నాగభూషణ శర్మ, *కన్యాశుల్కం–నూరేళ్ళ సమాలోచనం*, పు.16.

20. గురజాడ అప్పారావు, *కన్యాశుల్కం (1897) తొలికూర్పు*, (సం) సెట్టి ఈశ్వరరావు, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ ప్రచురణ : హైదారాబాదు, 1986, పు..13.

21. అదే.పు.14.

22.. ఆర్వీ. ఎస్. సుందరం, *పరిశోధన పద్ధతులు*, పు.21.

23. అదే.పు.36.

24. రాచపాళెం చంద్రశేఖర రెడ్డి, హెచ్. ఎస్. బ్రహ్మానంద, *సాహిత్య పరిశోధన సూత్రాలు*, పు.59.

25. సెట్టి ఈశ్వరరావు. *గురజాడ కన్యాశుల్కం (1897)* తొలి కూర్పు. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ ప్రచురణ : 1986, పు.5.

26. నరాల వీరయ్య, *కన్యాశుల్కం తొలి మలి కూర్పుల తులనాత్మక పరిశీలన*, పు.68.

27. అదే. పు.95. "కన్యాశుల్కం తొలిమలి కూర్పుల తారతమ్యాన్ని తెలుసు కోవాలని ప్రయత్నించిన విమర్శకులలో శ్రీ ఆరుద్ర ఆద్యులు" - నరాల వీరయ్య -

28. మొట్టమొదటి *కన్యాశుల్కము – బంగొరె – 1969* కి ఆరుద్ర పీఠిక *అభిఘారము*, కన్యాశుల్కం–నూరేళ్ళ సమాలోచనం, పు.204.

29. *కన్యాశుల్కం–నూరేళ్ళ సమాలోచనం*, పు.204.

30. అదే.పు.908.

31. అదే.పు.908.

32. కె.వి.రమణారెడ్డి, *ఇది మాత్రం (అపరాధ) పరిశోధన కాదు* (పీ), నరాల వీరయ్య–కన్యాశుల్కం తొలిమలి కూర్పుల తులనాత్మక పరిశీలన - 1985, పు.xi.

33. నరాల వీరయ్య, *కన్యాశుల్కం తొలిమలి కూర్పుల తులనాత్మక పరిశీలన*-1985, పు.64.

34. గురజాడ అప్పారావు రచించిన 'stooping to raise' అనే ఆంగ్ల కథను అవసరాల సూర్యారావు 'సంస్కర్త హృదయం' అనే పేరుతో తెలుగులోకి అనువదించారు. 1951 జూలై, భారతి మాసపత్రిక (ఖర- ఆషాఢము-భారతి-సంపుటము 28, సంచిక, 7 పుటలు : 715-726) లో ప్రచురితం.

35. గురజాడ అప్పారావు, *సంస్కర్త హృదయము.* (అను) అవసరాల సూర్యారావు, భారతి (మా.ప) జూలై, 1951, (సం) శివలెంకశంభుప్రసాద్,పు.715-726. ఈకథలో సరళ-రంగనాథయ్యరు సంభాషణలో సరళ తెలివిని తెలిపే కొన్ని సంభాషణలు.....

సరళ,రంగనాథయ్యరుతో...."మీవంటి విజ్ఞానుల ముందర,మాబోటి అజ్ఞానులం నోరు మెదపగలమా?" అంటుంది. దీనికి రంగనాథయ్యరు "నోరుమెదపలేరు కాని, మీవంటి శిష్యురాళ్ళు మావంటి గురువుల చేత నానా సందర్భాల్ని మాట్లాడించగలరు"

సరళ : "చెడుపెరుగుతున్న కొద్దీ మంచి క్షీణిస్తూ ఉంటుంది లోక సహజమే మరి".

రంగ : "అందుకే అవినీతిని మటుమాయం చేయాలి"

సరళ : "ఎలా పారద్రోలాడమో చెప్పండి? విజ్ఞానం ఉదయించే వరకూ, మంచీ చెడ్డా, ఒకే సరసన పెరిగాయి కదా 'మాయ' అనేది ఒకటుంటుందంటూన్నేను. ఆ మాయకీ, నీతి అవినీతి అనేవి రెండూ రెండు కవల పిల్లలు. మరిమాయ లేని సృష్టే లేదు!" సరళ చెప్పిన యీ మాటల అర్థం తెలియక రంగనాథయ్యరు తికమక పడ్డాడంటారు రచయిత. (పు.724)

కందుకూరి వీరేశలింగం, *(బహ్మవివాహము పీఠిక,* కందుకూరి రచనలు 4వ సంపుటి ప్రహసనములు, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ : హైదరాబాదు. పు.iv,ix

36. నరాల వీరయ్య, కన్యాశుల్కం తొలి మరి కూర్పుల తులనాత్మక పరిశీలన, పు.56. నుండి "ఉదాహృతం ఆదదీత న శూద్రోపి శుల్కం దుహితం దదత్

శుల్కం హి గృహ్ణన్ కురుతేచ్ఛన్నం దుహిత్ర విక్రయమ్ (మనుస్మృతి)

క్రియక్రీతాతు యానారీ నసాపత్న్యభి ధీయతే

నసాదైవేచ పిత్రేచ దాసీం తాం కశ్య పోబ్రవీత్ "- దీన్ని 1880 మే నల 'వివేక వర్ధిని' లో ఒక వ్యాసాన్ని రాసి, కన్యాశుల్కాన్ని కందుకూరి ఖండించడానికి పూర్వ శాస్త్ర ప్రమాణాల్ని చూపారు.

37. కందుకూరి వీరేశలింగం, కందుకూరి రచనలు-4వ సంపుటి. (సం.) అక్కిరాజు రమాపతిరావు విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్; హైదరాబాదు పు.x

38. శ్రీశ్రీ. మనగురజాడ, పు.61.

39. ఆరుద్ర,సమగ్ర ఆంధ్ర సాహిత్యం, 12వ సంపుటి, పు.181.

41. అభ్యుదయం–1978 మార్చి నెల సంచిక ఆరుద్ర, సమగ్ర ఆంధ్ర సాహిత్యం 12వ సంపుటి పు.181.

42. అదే.పు.181.

43. అదే.పు.183.

44. అదే.పు.183.

45. అదే.పు.184.

46. ఎస్.వి.రామారావు *కవిజీవిత విమర్శగానూ*, జి.వి.యస్ కవి జీవిత సమన్వయ విమర్శ గాను పేర్కొంటున్నారు.

47. జి.వి. సుబ్రహ్మణ్యం, *ఆంధ్ర సాహిత్య విమర్శ– ఆంగ్ల ప్రభావం*, యువభారతి ప్రచురణ : సికిందరాబాద్, 1983, పు.145.

48. ఎస్.వి. రామారావు, *తెలుగులో సాహిత్య విమర్శ–అవతరణ వికాసములు*, పసిడి ప్రచురణలు : హైదరాబాదు, ద్వి.ము.1989, పు.10.

49. ఎన్.గోపి, *ప్రజాకవి వేమన*, పు.146.

50. అదే.పు.95.

51. ఎన్.గోపి. *ప్రజాకవి వేమన* గ్రంథంలో 'తురగారామకవి' గా పేర్కొన్నారు. పు.120.

52. తూమాటి దోణప్ప, *ఆంధ్ర సంస్థానములు–సాహిత్య పోషణము*.పు.173.

53. బంగోరె, *ముందుమాటలు*, (పీ),వేమన పద్యాలు–సి.పి.బ్రౌన్ 1839 నాటి సంకలనం, (సం) బంగోరె, తిరుమల తిరుపతి దేవస్థానములు, ప్రచురణ : తిరుపతి, మొ.ము.జూలై, 1980, తృ.ము.1985.పు.xxxiii

54. ఎన్.గోపి. *ప్రజాకవి వేమన*, పు.116–121.

55. అదే.పు.95.

56. ఎస్. గోపి. *ప్రజాకవి వేమన*.పు.104. "మనసులో కులమత భేదాలు లోహకుడ్యాలను కూల్చి వేసుకొని, వాటిని నోరారా తిట్టిన వేమన్న కులాల్ని తెలుసుకోవడం కేవలం ఆయన చరిత్రను నిర్మించుకొనే సాధనాల కొరకే గాని వేరు కాదు".అని గోపి పేర్కొన్నారు.

57. ఆరుద్ర మన వేమన, పు.106 లో బ్రౌన్ వివరణల ఉటంకింపు........

(The village our body in which the diety dwells in Hill town (the head); his is in back street (the spine) There is silence is the first house. we gaze and continually view it, this is the road of beautiful (D-1774-Verse 46)

58. ఎన్.గోపి. *ప్రజాకవి వేమన*, పు.112.

59. ఆరుద్ర, సమగ్ర ఆంధ్ర సాహిత్యం, పు.ము viii, ప్రజాశక్తి బుక్ హౌస్ : విజయవాడ, 1990.

60. ఎన్.గోపి. *ప్రజాకవి వేమన.*, పు.145.

61. కుందూరు ఈశ్వరదత్తు, *ప్రాచీనాంధ్ర చారిత్రక భౌగోళము*, పు.212.

62. యార్లగడ్డ బాలగంగాధరరావు, *ఒక ఊరికథ*, వీజీయస్ పబ్లిషర్స్ : విజయవాడ, 1995, నాడులు-సీమలు శీర్షిక పు. ix.

63. ఎన్.గోపి, *ప్రజాకవి వేమన*, పు.143.

64. అదే.పు.143.

65. ఎస్.సుభాని, *వేమన జీవితము సాహిత్యము : సమగ్ర పరిశీలనము*, విశ్వశాంతి ప్రచురణ : పొన్నూరు, 1988, పు.

66. ఎన్.గోపి. *ప్రజాకవి వేమన*, పు.215.

67. ారుద్ర, *కూనలమ్మపదాలు*, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ ప్రచురణ : హైదరాబాదు, 2001,పు.21.

68. వడలి మందేశ్వరరావు, *అనుశీలన*, పు.33.

69. హెచ్. ఎస్. బ్రహ్మానంద, *తెలుగు భాషా సాహిత్య పరిశోధనలు—పుట్టు పూర్వోత్తరాలు (ప్రాథమిక దశ)*, *తెలుగులో పరిశోధన* (సం.) జి.వి. సుబ్రహ్మణ్యం, పు.43 లో...... " సృజన విమర్శ రంగాల్లో మాత్రమే అధికంగా ప్రభావం చూపిన భావవాద ధోరణి పరిశోధనలోనూ ప్రవేశించక పోలేదు" అన్నారు.

70. జి.వి. సుబ్రహ్మణ్యం, *తెలుగులో పరిశోధన*, పు.366

71. ఎమ్. చిదానందమూర్తి (మూ) *పరిశోధన—విమర్శ* (వ్యా), (అను) ఘట్టమరాజు, మిసిమి, సెప్టెంబరు,(మా.ప) 1998, పు.617. "సృజనాత్మక పరిశోధన అనే పదాన్ని కొంతమంది మాటల మధ్య ప్రస్తావించడం కద్దు. కాని, ఆ పదాన్ని వాడే వాళ్ళందరికీ ఆ పదవ్యాప్తి గురించి సరైన అవగాహన వుందా? అని నా అనుమానం............ సృజనాత్మక పదం చేర్చడానికి ఓ స్పష్టమైన కారణముంది. సాహిత్యంలో సృజనాత్మక సాహిత్యం, విమర్శ రెండు శాఖలున్నాయి.

ఈ రెండింటిలో మొదటి దానికే పెద్దపీట. మొదటి దానిలో నెగ్గుకు రాలేనివాడు రెండో దానిలో కృషి చేస్తాడనడంలో కొంత నిజం లేకపోలేదు. ఈ రెంటితో పాటు సృజనాత్మకేతర (విమర్శ) అని రెండు, భాగాలుగా విభజించు కొన్నారని తోస్తుంది. పైగా ఆ రెంటిలో సృజనాత్మక రచనలే గొప్పవని భావిస్తున్నట్లు భాసిస్తుంది. అలా అనుకొంటే పరిశోధన అనేదంతా ఒక విధంగా సృజనాత్మకమే....సాహిత్యం, విమర్శ పరిశోధనలకున్న మూలవ్యత్యాసం బహిరంగమైనదేనా? 'సృజానాత్మక' మన్న విశేషణం మూడింటికే అన్వయిస్తుందా? ఔననిపిస్తుంటుంది. చర్చించాలి మరి!' పు.623.

72. జి.వి.సుబ్రహ్మణ్యం, *తెలుగులో పరిశోధన*, పు.358 & 366

73. "సృజనాత్మక పరిశోధనకు పరిశోధకుడుగా ఆరుద్ర అనే అంశంతో కొనసాగిస్తున ఈ పరిశోధకుడు ప్రతిపాదిన్న లక్షణాలు. పరిశోధకులు ఒకవేళ అంగీకరించినా, అంగీకరించకపోయినా, పరిశోధకుడుగా ఆరుద్ర విశిష్టతను వివరించడంలో లోపం కన్పించినట్లు కాదని, మిగిలిన పరిశోధన పద్ధతులతో సమన్వయాన్ని బట్టి అవగాహన చేసుకోవచ్చు.

74. ఆరుద్ర, *వెనకవిచూపులు*, సమగ్ర ఆంధ్ర సాహిత్యం మొ.సం. (పు.ము) పు. 5

74. ఆరుద్ర, *సమగ్ర ఆంధ్ర సాహిత్యం* (మొ.సం.,పు.ము.,) పు.278-286.

75.. ఆరుద్ర, *సమగ్ర ఆంధ్ర సాహిత్యం* (రెం.సం.,పు.ము.,) పు.211.

76.. ఆవుల మంజులత, *తెలుగు సాహిత్యంలో హేతువాదం* (వ్యా) ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్న ధోరణులు (సం.) కె.కె.రంగనాథాచార్యులు.పు.93.

77. కంచెనపల్లి చినవెంకటరామారావు, *తెలుగు సాహిత్యంలో అభ్యుదయవాదం* (వ్యా) ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్న ధోరణలు, (సం.) కె.కె.రంగనాథాచార్యులు, పు.73-77.

78. అదే.పు.84.

79. అదే.పు.86.

80. అదే.పు.74.

81. నరాలవీరయ్య, పు.194.

82.. ఆరుద్ర, *వెనక వేపు*, పు.6.

83.అదే. *పాదపసూచిక* పు.6..

84.అదే.పు.7.

85. అదే.పు.7.

86. అదే.పు.7.

87. అదే.పు.107.

88. అదే.పు.109.

89. అదే.పు.109.

90. ఆరుద్ర, *గురజాడ గురుపీఠం*పు.86. 'పరిశోధనను విమర్శనాత్మక దృష్టితో పరిశీలిస్తానని, ఆరుద్ర ప్రకటించడంలో కూడా Critical analysis in research అనేది సూచిస్తుంది'.

91. ఆరుద్ర గురించి విమర్శకులు వెలువరించిన అభిప్రాయలు కొన్ని:

* 'సరళమైన సజీవ భాషలో సుబోధకంగా రచించిన సాహిత్య చరిత్ర' గా ఎస్.వి. రామారావు (తెలుగులో సాహిత్య విమర్శ - అవతరణ వికాసములు, పు.287) పేర్కొన్నారు.
* "ఆరుద్ర,'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' ఇంద్రగంటి, ఆరుయుగాల ఆంధ్రకవిత అసమగ్రాలైనా సాహిత్య చరిత్ర ప్రక్రియ కిచ్చిన కళారూపాలు" గా జి.వి.సుబ్రహ్మణ్యం (తెలుగు సాహిత్య చరిత్రలో చర్చనీయంశాలు. పు.10) వ్యాఖ్యానించారు.
* 'కొన్ని దశాబ్దాలుగా ఆంధ్ర సాహిత్యాన్ని గురించి గ్రంథాలు వెలువడ్డాయి. తర్కవితర్కాలు జరిగాయి. ఆ అనుభవాలన్నింటినీ వాడుకొని ఆరుద్ర నూతన మార్గంలో ఈ రచన సాగించారు. సాధారణంగా సాహిత్య చరిత్ర రాసేటప్పుడు అనేక పరిశోధనాత్మక విషయాలుంటాయి. కనుక సాధారణ పాఠకుడు, ఉదాహరణలు, పూర్వపక్షాలు వగైరాలు చదవడంలో విసుగు పొంది పుస్తకం మూసేస్తాడు. పరిశోధనాత్మక విషయాలు ఎన్ని చర్చించినా పాఠకునికి విసుగు కలగకుండా చేసే ఆరుద్ర శైలి అందమైనది. ఈ శైలి పాఠకుల్ని సాహిత్య చరిత్ర చదివేలా చేస్తుంది. అతి కఠిన విషయాలను సైతం సులభంగా చెప్పగలిగే పద్ధతి ఆరుద్రకు తెలుసు' అని ఎల్.సంగయ్య (ఆరుద్ర జీవితం - రచనలు సమగ్ర పరిశీలన, పు.331) విశ్లేషించారు.
* "His (Arudra) essays - to-read style is an added attraction in all his critical works" అని ముదిగొండ వీరభద్రయ్య (Major critics of Modern Telugu literature) p.31) అన్నారు.
* "సమగ్రాంధ్ర సాహిత్య సౌధాన్ని సుసంపన్నంగా నిర్మించిన విమర్శకళావిరించి" గా ఆరుద్రను బాలాంత్రపు రజనీకాంతరావు (ఆరుద్ర అభినందన సంచిక–పు.40) అభివర్ణించారు.
* "సీత రాముడికేమవుతుంది పేరిట నానాదేశాల రామాయణ గాథారూపాల పరిచయం– వీటికర్త (ఆరుద్ర) అసాధారణ సృజనాత్మక శక్తిగల రచయిత అని నిరూపించ గలుగుతాయి" అని కేవియార్ కవిపుంగవుడు (వ్యా)– ఆరుద్ర అభినందన సంచిక–పు.61) లో వ్యాఖ్యానించారు. 'రాముడికి సీత ఏమవుతుంది' అనేది ఆరుద్ర రాసిన గ్రంథం పేరు.
* 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం అతని చారిత్రక దృష్టికి చక్కని వచనానికీ పరాకాష్ఠ. పలకల వెండి గ్లాసులో కితకితలు పెట్టే కథాపాయసాన్ని నింపి పాఠకునిచ్చినవాడు ఆరుద్ర' గా 'లత' అరవైయేళ్ళ ఆరుద్రపారాయణం (వ్యా) ఆ.అ.సం.పు.105)లో ప్రశంసించారు.

* 'సాధారణంగా కవులు పరిశోధకులు కావడం, పరిశోధకులు కవుల కావడం అరుదు. ఇటువంటి అరుదైన వ్యక్తులలో ఆరుద్ర అగ్రశ్రేణికి చెందినవారు. ఆరుద్ర గారి అపారమైన పాండిత్యానికి యీ సాహిత్య చరిత్ర ప్రతిబింబంగా ఉంది' అని ద్వేపల్లి రామానురావు. (ఆ.అ.సం.పు.109) వ్యాఖ్యానించారు.
* "ఏవిషయాన్నైనా ఆరుద్రగారు సోపపత్తికంగా చెప్పడంతోపాటు కథలాగ కూడ చెప్తారు. ఆ చెప్పడంలో కొత్తది, లేదా కొత్తగా చెప్పాలనే తపన కనిపిస్తుంది. అని, ఎన్.గోపి., (ఆ.అ.సం.పు.145) విశ్లేషించారు.
* "Whatever may be the setting of a poem by Arudra, what matters is a social criticism of kind which keeps the reader alert and sustaines his interest - by Ronanki Appala Swamy, (ఆ.అ.సం.పు.192)

92. తంగిరాల వెంకట సుబ్బారావు, ఆరుద్ర - అద్భుతసృష్టి (వ్యా), ఆరుద్ర - కాటమరాజుకథ నాటకం (పీ), శ్రీ శక్తి ప్రచురణలు: చెన్నై, 1999, పు. XXIV

93. అదే. పు. VI

94. అదే. పు. XII, XIII

95. ఆరుద్ర 'వ్యాసపీఠం'.పు.105-115

96. ఆరుద్ర - కాటమరాజుకథ (స్టేజినాటకం) పు.107-108

97. తంగిరాల వెంకట సుబ్బారావు, ఆరుద్ర-అద్భుతసృష్టి (వ్యా), ఆరుద్ర - కాటమరాజుకథ (స్టేజినాటకం) (పీ), శ్రీ శక్తి ప్రచురణలు: చెన్నై, 1999, పు. XX-XXI.

అధ్యాయం-8

# సింహావలోకనం

తెలుగుసాహిత్యానికి సుమారు వెయ్యేళ్ళు, భాషకు అంతకంటే ముందే కొన్ని వందల యేండ్ల చరిత్ర ఉందని పరిశోధకులు చెప్తున్నారు. ఈ భాషా సాహిత్యాల అవగాహనకు ఒక క్రమ పద్ధతిలో కొంతమంది పరిశోధకులు వివిధ పేర్లతో కవుల చరిత్ర, సాహిత్య చరిత్రలను రచించారు. శాసనాలు, నాణేలు, జనశ్రుతులను ఆధారంగా చేసుకొని తెలుగు సాహిత్య స్థితి గతుల్ని వివరించడానికి సాహిత్య చరిత్ర కారులు చేసిన కృషిలో ఎంతో పరిశోధన నిక్షిప్తమై ఉంది. ఆ పరిశోధనల్లో రచయితలకు లభించిన ఆకరాలను (Sources) బట్టి రచనా పద్ధతిలో తేడాలు కన్పిస్తున్నాయి.

కావలి వెంకటరామస్వామి, గురజాడ శ్రీరామమూర్తి, కందుకూరి వీరేశలింగం వంటివారు తెలుగు సాహిత్య స్థితిని ఒక పద్ధతిలో వివరించడానికి కవుల జీవితాలను ఆధారం చేసుకొని 'కవుల చరిత్రలు' రాశారు. ఆ తరువాత, కవుల తాళపత్ర గ్రంథాల్నికైఫీయత్తుల్ని, జానపద కథాంశాల్ని, కావ్యావతారికల్ని ముఖ్యాధారాలుగా గ్రహించి 'వాఙ్మయ చరిత్ర'ల పేరుతో సాహిత్య చరిత్రలు నిర్మించారు.

కవుల చరిత్రలనుండి, కావ్య వస్తువుల్ని, ప్రక్రియల్ని, ప్రభావంచూపిన కవిని ఆధారంగా చేసుకొని, కాలానుసరణ పద్ధతిలో పూర్వ, మధ్యమ, ఆధునిక కవులు, భారత, రామాయణ కవులు, పురాణ కవులు, నన్నయ్య, తిక్కన, శ్రీనాథ యుగాలు వంటి యుగ విభజనలు చేసి వివిధ పేర్లతో సాహిత్య చరిత్రలు రచించిన వారున్నారు.

సాహిత్య ఆవిర్భావానికి కారణమైన పరిస్థితులన్నింటినీ గమనించాలనీ, చారిత్రక పద్ధతిలో కాలాను సరణ తో సమగ్రంగా 'సాహిత్య చరిత్ర' ని అందించాలని రచనలు చేసిన వారిలో ఆరుద్రను ప్రథమంగా పేర్కొనవచ్చు. ఆరుద్ర చేసిన ప్రయత్నం 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' లో కన్పిస్తుంది. రాజులు, రాజ్యాలు పోయినా, ఆ పేర్లతో సాహిత్య యుగవిభజన చేయడం సరైందికాదని కొంత మంది భావించి, కేవలం కాలాన్ని కవుల ప్రభావాన్ని, కావ్య విశిష్టతలను ఆధారంగా చేసుకొని 'సాహిత్య చరిత్ర'లను రాస్తున్నవారూ ఉన్నారు.

సాహిత్య చరిత్ర కారులలో యుగ విభజన చేయడంలో అనేక ప్రమాణాల్ని పాటించడం, అదొక అనుకూలమైన రచనా పద్ధతిగానూ, అవగాహన కలిగించగలమనే ఆలోచనతోనూ సాగే ప్రయత్నం. సాహిత్య చరిత్రకారులు భిన్న విధాలుగా యుగవిభజన చేయడంలో వారి పరిశోధనలో ఒక దృక్పథం ఉండటమే ప్రధాన కారణం. ఈ నేపథ్యంలో, రాగ ద్వేషాలకు అతీతంగా, సత్యాన్వేషణ ధ్యేయంగా పయనించే కృషిలో 'పరిశోధకుడు' గా 'రచయిత' ఎంతవరకూ కృతకృత్యుడయ్యాడ నేది పరిశీలించవలసిన అవసరం కన్పిస్తుంది. ఈ లక్ష్యాన్ని చేరుకోవడానికి ఒక 'రచయిత'ను కేవలం ఆతని ఏదొక రచనను మాత్రమే పరిశీలనకు తీసుకొంటే, ఆతని దృక్పథం పట్ల సరైన నిర్ణయానికి రావడం కుదరదు. ఆతని రచనలన్నింటినీ అధ్యయనం చేస్తూనే, ఆప్రక్రియలో లేదా, ఆ రంగంలో

ఆతని కృషిని ప్రతిబింబించే వాటిపై ప్రత్యేక పరిశీలన అవసరమవుతుంది. ఈ దృష్టితోనే 'పరిశోధకుడుగా ఆరుద్ర' అనే ఈ పరిశోధనాంశాల్ని అధ్యయనం చేయడం జరిగింది.

కవి, కథకుడు, సినీగేయ రచయిత, నాటక కర్త, విమర్శకుడు, పరిశోధకుడు గా ప్రసిద్ధి చెందిన ఆరుద్ర రచనల్లో వ్యక్తమైన వివిధ అంశాల్ని అధ్యయన సౌలభ్యం కోసం ఎనిమిది అధ్యాయాలుగా, విభజించినా, చివరి అధ్యాయమైన 'సింహావలోకనం' ఈ పరిశోధన సమీక్ష వంటిదే అవుతుంది. 'అనుబంధం' లో కవుల పట్టికలనూ, సమగ్ర ఆంధ్ర సాహిత్యం తొలిముద్రణ, పునర్ముద్రణల ముఖ చిత్రాలు, ముందుమాటలు, తొలిముద్రణకు విమర్శకులు, పరిశోధకులు రాసిన పీఠికల్ని చేర్చడం జరిగింది.

## 8.1. పరిశోధన ఫలితాంశాలు :

### 8.1.1 ఆరుద్ర జీవితం, రచనావిశేషాలు-పరిశోధన:

ఇది మొదటి అధ్యాయం ఈ పరిశోధనకు 'ఉపోద్ఘాతం' వంటిది. భాగవతుల సదాశివ శంకర శాస్త్రి అనేది పూర్తి పేరైనా, క లంపేరు 'ఆరుద్ర' తోనే తెలుగు సాహిత్యంలో ప్రసిద్ధి చెందిన వీరి జీవితంలో ఎదురైన కొన్ని సంఘటనలు, వీరిని పరిశోధనలో, జీవనభృతి కోసమే సినిమా కంపెనీలో చేరినా, కథల విభాగం లో పరిశీలన చేయడం ఎలాగో సాధన చేసి, 'ఖడ్గ తిక్కన-కవి తిక్కన' లు వేర్వేరని స్పష్టం చేయడానికి జరిగిన కృషితో 'సమగ్ర ఆంధ్ర సాహిత్య పరిశోధన'లోకి అడుగు పెట్టారని తెలిసింది. సృజనాత్మక సాహిత్యంలో రాణించలేని వారు, విమర్శ, పరిశోధనలవైపు పయనిస్తుంటారనేది నిజం కాదని, ఆరుద్ర రచనా విశేషాలలో వారు పొందిన పురస్కారాల వల్ల స్పష్టమయ్యింది. 'కూనలమ్మ పదాలు' లో కృష్ణశాస్త్రి, శ్రీ శ్రీ, వేమన, పోతన, విశ్వనాథ మొదలైన వారిని సృజనాత్మక సాహిత్యంలో ఎంత చమత్కారంగా వర్ణించవచ్చో కొన్నింటిని ఉదాహరించాను. సృజనాత్మక సాహిత్యానికీ, పరిశోధనకీ గల వ్యత్యాసాల్ని, ఆరుద్రకు గల అవగాహననూ తెలుసుకోవడానికి వీటివల్ల వీలైంది.

ఈ అధ్యాయంలోనే పరిశోధన, విమర్శ, సమీక్ష, కవులచరిత్ర, సాహిత్య చరిత్రల స్వరూప స్వభావాల్ని పేర్కొనడం వల్ల, ఆరుద్ర రచనల్లో గల ఈ అంశాలు, 'పరిశోధకుడుగా ఆరుద్ర' పరిశోధనకు లాక్షణిక అవగాహనను కల్గిస్తాయని భావించే వీలుంది.

### 8.1.2. తెలుగు పరిశోధన-ఆరుద్ర దృక్పథం:

ఈ రెండవ అధ్యాయం లో ఆరుద్ర దేన్ని పరిశోధన, సిద్ధాంతంగా భావిస్తున్నారో ఒక పార్శ్వంలోనూ, రచనల్లో వ్యక్తమైన దృక్పథాన్ని మరో పార్శ్వం లోనూ వివరించడానికి ప్రయత్నించాను . అనేక సందర్భాల్లో "పరిశోధన", "సిద్ధాంతం" అనే ప్రస్తావన చేయడం వల్ల సృజనాత్మక రచనలతో సహా, ఈ అభిప్రాయాల్లో, ఆరుద్రకున్న పరిశోధన అవగాహనను స్పష్టం చేయడానికి వీలైంది. కవిత్వం సామాన్యులకు సైతం అర్థమైతే, సిద్ధాంతం అంతసులభంగా అవగాహన కావడం కష్టమని అభిప్రాయపడి, దాన్ని

అందరికీ అర్థమయ్యే పద్ధతిలో వివరించగలగడంలోనే పరిశోధకుడు విజయవంతమవుతాడనే భావాల్ని వ్యక్తం చేశారని నిరూపితమైంది.పరిశోధనను సత్యాలతో కూడిన, మానవాళికి పనికొచ్చే ఒక తృష్ణగా భావించారని స్పష్టమైంది. 'పరిశోధన', 'సిద్ధాంతం' అనే పారిభాషిక పదాల్ని ఏకరూపతతో, ఒక స్పష్టమైన అవగాహనతో సృజనాత్మక, సృజనాత్మకేతర సాహిత్యాలలో ప్రయోగించారని సోదాహరణంగా నిరూపితమైంది. పరిశోధన పట్ల ఆరుద్ర అవగాహనను తెలుసుకొని, తెలుగు పరిశోధన ఆరంభ, పరిణామ, వికాసాలను పరిశీలించడం జరిగింది.

ప్రాచీన సాహిత్యంలో అప్పకవి, పోచిరాజు వీరనల గ్రంథాలలో పరిశోధన లక్షణాలు కన్పిస్తున్నా, బ్రౌన్ కాలంనుండే, పాశ్చాత్య ప్రభావంతో తెలుగు పరిశోధన ఒక స్పష్టమైన ఆకృతిని దాల్చింది.

అంతకు ముందు పరిశోధన ఉన్నప్పటికీ, అది ఆ పేరుతో లేదన్న పూర్వ పరిశోధకుల సిద్ధాంతాల్ని సమన్వయించి, తెలుగు కవుల, సాహిత్య చరిత్రల నిర్మాణానికి అంకురార్పణగా కావలి బొర్రయ్య, రామస్వామి రచించిన 'దక్కను కవుల చరిత్ర' నిలిచిందని వివరించడం జరిగింది.

19వ శతాబ్ది పూర్వార్థం పరిశోధనలో 'బ్రౌణ్య యుగం' గానూ, ఉత్తరార్థంలో కొమఱ్ఱాజు వేంకట లక్ష్మణరావు వంటి వారి వల్ల పాశ్చాత్య పరిశోధన పద్ధతులు తెలుగులో సక్రమ పద్ధతిని అనుసరించేటట్లు చేశాయని, తెలుగు పరిశోధనలో కొమఱ్ఱాజు వారే సృజనాత్మకతను ప్రవేశ పెట్టారనీ, సామగ్రీ సేకరణ దశనుండి గ్రంథ సేకరణ, పరిష్కరణ, సత్యాన్వేషణల దిశగా పరిశోధన వికాసం చెందిందని స్పష్టమైంది.

ఈ వికాసంలో సాహిత్య పరిశోధన విస్తృతమైన పరిధిని పొందడం వల్ల, 'దృక్పథం' కూడా అవసరమని కొందరు భావించడం తో 'పరిశోధనలో దృక్పథాన్ని' పరిశీలించడం జరిగింది. ఈ దృష్టితో అధ్యయనం చేసినపుడు శాస్త్ర పరిశోధన కంటే, కళాపరిశోధనలో భాగమైన సాహిత్య పరిశోధనలో "దృక్పథం" వల్లనే ప్రధానంగా భిన్న ఫలితాలు వెలువడుతుంటాయని స్పష్టమైంది.

భౌతిక వాస్తవిక దృక్పథమే వస్త్వాశ్రయ వాస్తవికతను వెల్లడిస్తుంది. దీనికి నాటి సామాజిక కాలమాన పరిస్థితులు తోడవుతుంటాయి. సాహిత్యాన్ని, సాహిత్యేతర శాస్త్రాలతో కూడా చూడటం తాత్త్విక నేపథ్యాన్ని, ప్రాపంచిక దృక్పథాన్ని కలిగి ఉండటం, పరిశోధన దృక్పథంలో ఉంటుందనే పరిశోధకుల ప్రమాణాల్ని అనుసరించి నిరూపించడానికి ప్రయత్నించాను. ఆరుద్ర కవిత్వంలో ప్రత్యక్షంగానూ, విమర్శ పరిశోధనల్లో వస్తు తత్త్వానికి ముడివేసి మార్క్సిస్టు దృక్పథాన్ని కొనసాగించారని సోదాహరణంగా నిరూపించడానికి దొక ప్రయత్నం. పరిశోధన దృక్పథ ఆవశ్యకత, విశ్లేషణాత్మకంగా రాబోయే అధ్యాయాల్లో విమర్శ, పరిశోధనల్లో పరిశీలించడానికి వీలుగా పరిశోధకుల తాత్త్విక ప్రమాణాలను, నేపథ్యాలను వివరించడం అవసరమని భావించి ఈ అధ్యాయంలో వాటిని పేర్కొనడం వలన స్పష్టతకు అవకాశం ఏర్పడుతుందని భావించాను.

## 8.1.3. ఆరుద్ర విమర్శనాత్మకదృక్పథం

ఈ మూడవ అధ్యాయం లో 'విమర్శకుడుగా ఆరుద్ర' దృక్పథాన్ని పరిశీలించాను. చారిత్రక, తులనాత్మక, కవిజీవిత విమర్శనా పద్ధతుల్ని అనుసరించినా, ప్రధానంగా మార్క్సిస్టు విమర్శనా దృక్పథాన్నే

పాటించడంవల్ల, 'మార్క్సిస్టు విమర్శకుడు' గా గుర్తించవచ్చునని నిరూపితమైంది. విమర్శలో దృక్పథాన్ని గుర్తించడానికి వీలయ్యే మౌలిక సూత్రాల్ని పేర్కొని, మార్క్స్ సూత్రాలతో సమన్వయించి, విమర్శలో దృక్పథ ప్రతిఫలనాన్ని నిరూపించడానికి ప్రామాణికుల అభిప్రాయాల్ని స్వీకరించాను.

వేమనలో మార్క్సిస్టు భావాల్ని వివరించడానికి ఆరుద్ర ప్రయత్నించినా, కొన్నివేలపద్యాల్లో, కొన్ని పద్యాలను బట్టి మాత్రమే వేమనను ఏదొక సిద్ధాంతానికి, ఏదొక దృక్పథానికి చెందినవాడని నిర్ణయించడం కంటే, మార్క్సిస్టు విమర్శనా దృక్పథానికి "అనువుగా" ఉన్న పద్యాల్నే తన విమర్శకు ఆరుద్ర గ్రహించారని తేలింది.

గురజాడను మార్క్సిస్టు దృక్పథంతో విశ్లేషించి, శాస్త్రీయ దృక్పథాన్ని విమర్శలో అనుసరించారని నిరూపితమైంది. నిష్పక్షపాత విమర్శనా దృష్టిగల విమర్శకుడుగా కన్యాశుల్కం లో సౌజన్యరావు పాత్రనీ, మధురవాణి పాత్రనీ, వస్తు విశ్లేషణనీ బట్టి గుర్తించవచ్చుని స్పష్టమైంది. దీనికి వివిధ విమర్శకుల, పరిశోధకుల అభిప్రాయాల్ని ప్రామాణికంగా స్వీకరించడం జరిగింది.

శ్రీ శ్రీ రచనల్ని విమర్శించడంలో ఆరుద్ర, విమర్శకునికి ఉండకూడని రాగద్వేషాలనుండి తప్పించుకోలేక పోయారని స్పష్టమైంది.

'వ్యాసపీఠం' లో ఏకలవ్యుడు పుట్టుపూర్వోత్తరాలు, కవితిక్కన, ఖడ్గతిక్కన, గురజాడ-టెన్నీసన్ ల విషయంలో 'తులనాత్మక విమర్శకుడు' గా ఆరుద్రను నిర్ణయించవచ్చునని తేలింది. ఇంటిపేర్ల నిర్ణయం, స్థలనామాల నిర్ణయంలో భాషాశాస్త్రాన్ని సహాయంగా తీసుకొని శాస్త్రీయ పద్ధతిని పాటించారని స్పష్టమైంది.

'ప్రజాకళలూ-ప్రగతివాదులూ' గ్రంథాన్ని విమర్శించిన ఆరుద్ర చారిత్రక పద్ధతిలో విమర్శచేసి, కళల్ని ఫ్యూడల్ విలువల కోసం ఒక వర్గం, సామ్యవాద సమాజ స్థాపనకు మరొక వర్గం సాధనాలుగా ఉపయోగించుకున్నాయనీ, కళల పతనోత్థానాలను చక్కగా విశ్లేషించి 'కళ ప్రజలకోసమ'నే సిద్ధాంతాన్ని సమర్థించారని తేలింది. 'గుడిలో సెక్స్' గ్రంథాన్ని డి.డి.కోశాంబి, రొమెల్లా థాపర్ వంటి చారిత్రకుల భావజాల ప్రభావంతో మార్క్సిస్టు దృక్పథంతో విశ్లేషించి, ఉత్పత్తి సంబంధాల్లో స్త్రీ భాగస్వామ్యాన్ని స్పష్టం చేయడానికి ప్రయత్నించారని నిరూపితమైంది. ఒకనాటి పౌరాణిక, సంస్కృత కావ్యాల్లో ఉండేవర్ణనల్లో ఉండే సంభోగ శృంగార వర్ణల స్థానాన్ని, రాజులు కట్టించిన దేవాలయాల్లో కామ శిల్పాలు ఆక్రమించుకున్నాయని, వాటి సామాజిక స్థితి గతుల్ని ప్రతిబింబిస్తున్నాయని ఆరుద్ర భావాల్ని వివరించడానికి ప్రయత్నం చేశాను. 'రాముడికి సీత ఏమవుతుంది?' గ్రంథంలో వివిధ కాలాల్లో, వివిధ దేశాల్లో నాటి సామాజిక సంబంధాల్ని రామకథ తెల్పుతుందని చారిత్రక విమర్శనా పద్ధతిలో వివరించారని విశ్లేషించడం జరిగింది. వివిధ గ్రంథాలకు రాసిన 'పీఠిక'ల్లో వర్ధమాన, సమకాలీన, ప్రాచీన కవుల రచనలకి రాసిన పీఠికల్లో, విమర్శకుడు అవసరమైతే సూచనలు చేసి విలువలు కాపాడవలసిన బాధ్యత ఉందని విమర్శకుడుగా ఆరుద్ర తన స్థానాన్ని నిరూపించుకొన్నారని తెలుస్తుంది.

మొత్తంమీద ఆరుద్ర విమర్శనాత్మక దృక్పథాన్ని విశ్లేషించినపుడు, శ్రీశ్రీ విషయంలో రాగద్వేషాలకు లోనై, కొన్ని విమర్శలకు లోనైనా, 'ఉత్తమ విమర్శకుడు' గా మాత్రమే కాకుండా, పరిశోధన స్థాయిలో

మిగిలిన అన్ని కావ్యాల విమర్శను చేసిన ఆరుద్రను 'పరిశోధక విమర్శకుడు'గా గుర్తించే వీలుందని ఈ పరిశోధనలో సమన్వయమైందిని భావిస్తున్నాను.

## 8.1.4 సమగ్ర ఆంధ్రసాహిత్యం తొలిముద్రణ-పునర్ముద్రణల మార్పులు, చేర్పులు:

ఈ నాల్గవ అధ్యాయంలో సత్యాన్వేషిగా, లోపాల్ని సరిదిద్దుకొనే ప్రయత్నం ఆరుద్రలో కన్పిస్తుంది. సమగ్ర ఆంధ్ర సాహిత్యం తొలి ముద్రణ ఉజ్జాయింపు ప్రణాళిక లోనూ, సంపుటలు వెలువడుతున్నప్పుడే పత్రికల్లో వస్తున్న సూచనలు, విమర్శలకు స్పందించిన పరిస్థితిని వివరించి, పునర్ముద్రణ ఆధారంగా, తొలిముద్రణలో చేసిన మార్పుల్నీ, చేర్పుల్నీ వివరించాను. మారిన సమాచారాన్ని సంక్షిప్తంగా వివరించడంతోపాటు, ఆమార్పులకు కారణాల్ని అన్వేషించడానికి ప్రయత్నించి, మార్పులకు గురైన కవుల్ని పునరుద్రణలో పేర్కొన్న వరస ప్రకారం, సంపుటాల వారీగా తులనాత్మకంగా అధ్యయన సౌలభ్యం కోసం విశ్లేషించాను. గుర్తించడానికి, అర్థం చేసుకోవడానికి వీలుగా తొలిముద్రణ (తొ.ము)గా పునర్ముద్రణను (పు.ము) గా వివరించి, రెండింటినీ తులనాత్మకంగా అధ్యయనం చేసినప్పుడు ఏమార్పు కన్పించినా అక్కడే సంపుటి, పుటలతో సహా వివరించడానికి ప్రయత్నించాను.

తొలిముద్రణలో వెలువరించిన 12 సంపుటాలలో గల విషయానికి మరికొంత సమాచారం చేరుస్తూకూడా, పునర్ముద్రణలో ఎనిమిది సంపుటాల్లోనే ఆరుద్ర సమగ్ర ఆంధ్ర సాహిత్యాన్ని అందించారు. పునర్ముద్రణలో గల 13 సంపుటాలలో అయిదింటిని కొత్త సంపుటాలగానే భావించవచ్చని తేలింది. ఏకవి తరువాత ఏ కవిని తొలిముద్రణ నుండి, పునర్ముద్రణలో మార్పులకు గురిచేసి, వరుసక్రమాన్ని కూడా మార్చారో వివరించడం వల్ల విమర్శకుల సూచనల్ని ఆరుద్ర ఒక పరిశోధకుడుగా, సహృదయ విమర్శకుడుగా ఎలా ప్రతిస్పందించారో తెలియడానికి వీలవుతుంది. కేవలం కవుల వరుసనే కాకుండా, ప్రకరణాల వరుసను కూడా పేర్కొనడం వల్ల, తొలిముద్రణకీ, పునర్ముద్రణకీ యుగ విభజనలో వచ్చిన పరిణామాన్ని అవగతం చేసుకోవడాని అనుకూలంగా ఉండి, 'పరిశోధకుడుగా ఆరుద్ర'ను మరింత స్పష్టంగా గమనించవచ్చునని భావించాను.

## 8.1.5. సమగ్ర ఆంధ్రసాహిత్య పరిశోధన:

ఈ ఐదవ అధ్యాయం లో 'సాహిత్య చరిత్ర కారుడు'గా, 'పరిశోధకుడుగా ఆరుద్ర' చేసిన కృషిని వివరించడానికి ప్రయత్నించాను. తెలుగు సాహిత్యాన్ని నిక్షిప్తం చేసిన గ్రంథాల్లో 'దక్కను కవుల చరిత్ర' నుండి ఆరుద్ర వరకు చూసినా, అనేక పేర్లతో కవుల చరిత్రలు, సాహిత్య చరిత్రలు వెలువడ్డాయి. ఈ పరిశోధన అంశానికి అవసరమైనంత మేరకు తెలుగు సాహిత్య చరిత్రలను తులనాత్మకంగా పరిశీలించినా, ఈ పరిశీలనను 'పరిశోధకుడు గా ఆరుద్ర' పరిశోధన అంశాన్ని ఫలప్రదం చేయడంపైనే కేంద్రీకరించి పరిశోధన కొనసాగించాను. కవుల చరిత్ర సాహిత్య చరిత్రల స్వరూప స్వభావాల్ని పరిశీలించి, సమగ్ర ఆంధ్ర సాహిత్యం 'సాహిత్య చరిత్ర' అనేది నిరూపించేప్రయత్నం

జరిగింది. కవుల చరిత్రలో ఉండే స్థల,కాల,కుల చర్చల స్వరూపం ఉన్నప్పటికీ వాటిని గ్రహించిన స్వభావం భిన్నంగా రూపొందిందని తేలింది. వీరేశలింగం 'కుమ్మరి మొల్ల' వంటి పేర్లతో పరిశీలించగా, సాహిత్య చరిత్రను జాగ్రత్తగా "దృక్పథం" తో రచించి, సామాజిక, ఆర్థిక, రాజకీయాది చారిత్రక కోణాల్ని స్పర్శిస్తూ, అప్పకవి వంటి వారు,తమ లాక్షణిక గ్రంథాల్లో కొన్ని కులాల వారి గ్రంథాల్ని నిరాకరించారని కొత్త కోణాల్ని ఆవిష్కరించిన 'సాహిత్య చరిత్ర'గా ఆరుద్ర, తన 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' రచనను కొనసాగించారు పత్రికల్లో వచ్చిన విమర్శల్ని సహృదయతతో స్వీకరించి మార్పులూ చేర్పులూ చేసి, నిత్యాన్వేషణా శీలం గల పరిశోధకుడుగా ఆరుద్ర కొనసాగించిన కృషి కొనియాడదగినదిగా తెలిసింది. కొన్ని తప్పని సరి పరిస్థితుల వల్ల, సాంకేతిక కారణాలవల్ల పునర్ముద్రణలోనూ కొన్ని లోపాలు తప్పలేదనీ స్పష్టమైంది.

యుగవిభజన చేయడంలో రాజుల్ని,పోషకుల్ని ఎన్నుకొన్నా, యుగవిభజనను సమర్థించుకొన్నా, రాజుల చరిత్రను చెప్పడానికి కాకుండా, ఆ కాలంలో ఉన్న చరిత్రను సామాజిక, ఆర్థిక, రాజకీయ కోణాలతో ఆవిష్కరించడానికి ఆ యుగ విభజనను స్వీకరించారని, సాహిత్య చరిత్ర రచనలో మార్క్సిస్టు దృక్పథాన్ని ప్రదర్శించారని నిరూపించే ప్రయత్నం ఈ పరిశోధనలో కన్పిస్తుంది.

సామాన్యులకు సైతం అవగాహన కావాలనే ధ్యేయంతో సరళమైన భాషను వాడేటమే అయితే ఆరుద్ర పరిశోధనలో ప్రత్యేకత పెద్దగా గుర్తించ వలసిన పనిలేదు. సమగ్ర ఆంధ్ర సాహిత్య రచనలో 'సృజనాత్మక పరిశోధన'తో సామాన్యుల్ని సైతం ఆకర్షించుకోవడంలోనూ, మార్క్సిస్టు దృక్పథం ప్రదర్శించడంలోనే ప్రత్యేకత వ్యక్తమైంది.

సాహిత్య చరిత్ర రచనకు ఆధారాలుగాదేన్ని గ్రహించాలో ప్రామాణిక భావనల్ని వివరించి, సమగ్ర ఆంధ్ర సాహిత్యం తో సమన్వయించడానికి ప్రయత్నం జరిగింది. తెలుగులో వచ్చిన సాహిత్య చరిత్రలతో తులనాత్మకంగా విశ్లేషించి, ఆంగ్లేయులు సాహిత్య రచనకు ఉపయోగించిన పద్ధతిని కొంతవరకూ ఆరుద్ర ఎన్నుకొన్నారని, కవుల చరిత్ర నుండి సమగ్ర ఆంధ్ర సాహిత్య, వికాస చరిత్రల పరిణామంలో 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' కవుల చరిత్ర వాసనలున్నా, సాహిత్య చరిత్రగా పరిణతిచెంది, సమగ్ర ఆంధ్ర సాహిత్య ప్రయత్నం చేసి, వికాస చరిత్రకు బీజాలు వేసిందని నిరూపించే ప్రయత్నం ఈ పరిశోధన ఫలితాంశాల్లో ఒకటి. ఈ నిరూపణకు సాహిత్య చరిత్రలపై ప్రత్యేక పరిశోధనలు చేసినవారి అభిప్రాయాల్ని కూడా ఆధారంగా చేసుకొని సమన్వయించడానికి ప్రయత్నించాను.

పరిశోధకుడుగా, సాహిత్య చరిత్ర కారుడుగా ఆరుద్ర స్థానం, సమగ్ర ఆంధ్ర సాహిత్య స్థానమే నిర్ణయిస్తుందని తేలింది. ఆరుద్ర తరువాత సాహిత్య, సాంఘిక చరిత్రలను రాసిన వారు, తెలుగు అకాడమీ వారు ప్రచురించిన 'తెలుగు సాహిత్య కోశం', విజ్ఞానసర్వస్వం, పరీక్షల కొరకు సిద్ధం చేస్తున్న సాహిత్య చరిత్రలోనూ, సాహిత్యచరిత్రలో చర్చనీయాంశాలు వంటి గ్రంథాలు, విశ్వవిద్యాలయ పరిశోధకులు సమగ్ర ఆంధ్ర సాహిత్యంలో గల వివిధ ప్రతిపాదనలు, సిద్ధాంతాలను, సమన్వయాలను స్వీకరించడానికైనా, కాదనడానికైనా ఆరుద్ర కృషిని పేర్కొన వలసిన పరిస్థితి ఉందంటేనే, 'పరిశోధకుడుగా ఆరుద్ర' విజయ వంతమయ్యారని చెప్పుకోవచ్చునని తేలింది.

సమగ్ర ఆంధ్ర సాహిత్య పరిశోధనకే సుమారు నూరు పుటలు కేటాయించిన ఈ పరిశోధనలో తెలుగులో వచ్చిన సాహిత్య చరిత్రలతో తులనాత్మక పరిశీలన చేసినా, పరిశోధకుడుగా ఆరుద్ర కృషిని సమన్వయం చేయడం ప్రధానం కనుక, ఒక్కో సిద్ధాంతాన్ని, ఒక్కో ప్రతిపాదననీ, సమాన్వయాన్ని సుదీర్ఘంగా చర్చించడం, పరిశోధన పరిధిలోనిది కాదు. కనుక, అచర్చల్ని కొనసాగించడానికి ప్రయత్నించలేదు. తెలుగులో అష్టదిగ్గజ కవులెవరు? అనే ఒక అంశాన్నే తీసుకొంటే, దానికి సాహిత్య చరిత్ర కారుల్లో బిన్న అభిప్రాయాలు కన్పిస్తున్నాయి, అష్టదిగ్గజకవులలో ఒకడుగా కొంతకాలం భావించిన తెనాలి రామలింగ (కృష్ణ) కవిని ప్రజలు తమ అభిప్రాయాల్ని స్వేచ్ఛగా వ్యక్తీకరించడానికి సృష్టించు కొన్న ఓ ఊహాగా కొంతమంది పరిశోధకులు భావించారు. మరి, తెనాలిరామలింగకవి, రామకృష్ణుడు పేర్లతో ఉన్నకవి కృతులుగా ఉన్న 'ఉద్భటారాధ్య చరిత్ర' 'పాండురంగమాహాత్మ్యం' 'మొదలైన కావ్యాల మాటేమిటి? ఇవన్నీలోతైన పరిశోధనాంశాలు. వీటిని ఆరుద్ర, 'కవి ద్వ్యక్తృత పరిణామం'తో చక్కగా సమన్వయించే ప్రయత్నం చేశారు. ఇలా ఈ దృష్టితో చూస్తే పరిశోధకుడుగా ఆరుద్ర, పరిశోధనాంశం ప్రక్కదోవపట్టే అవకాశం ఉందని, వాటినెంత వరకూ అవసరమో అంతవరకే పరిశీలించడం మంచిదని పించింది. పాఠకుల అభిరుచుల్ని గమనిస్తూ, వారికి కావలసిన అన్ని గుణాల్ని అందిస్తూనే, సాహిత్య సిద్ధాంత దర్శనాన్ని కల్గించే 'సృజనాత్మక పరిశోధకుడు'గా సమగ్ర ఆంధ్ర సాహిత్యంలోనూ కన్పిస్తారనే సైద్ధాంతిక పరిచయాన్ని నిరూపించే ప్రయత్నం ఈ పరిశోధనలో కన్పిస్తుంది.

## 8.1.6. జానపద విజ్ఞాన పరిశోధన:

ఈ ఆరవ అధ్యాయం లో జానపద విజ్ఞానం, సాహిత్యాల పట్ల ఆరుద్ర అవగాహనను వారి మాటల్లోనే పరిశీలించి ప్రామాణిక భావనలతో అధ్యయనం చేసి, సంప్రదాయ నృత్యాలకు జానపద విజ్ఞానంలో మాతృకలున్నాయనే ఆరుద్ర పరిశోధనను, భరతుని నాట్య శాస్త్రం, నాట్యశాస్త్రంలో కృషి చేసిన ఆరుద్ర సమకాలీనుల అభిప్రాయాలతో విశ్లేషించడానికి ప్రయత్నించాను. 'పశుపక్ష్యాదుల అనుకరణ అభినయానికి ప్రాతిపదిక' అనే సిద్ధాంతాన్ని, ఆదిమ సమాజ మానవుడు తన అవసరాల కోసం నేర్చుకొన్న విద్యలవరకూ పరిణామం చెంది, ప్రజాకళలు కావలసినకళలు, 'ఆస్థాన కళలు'గా మారిన వైనాల్ని ఆరుద్ర ప్రతిపాదనలతో సమన్వయించడానికి ప్రయత్నించాను.

ప్రపంచంలో గల రామకథల్ని జనరంజకంగా, తన సృజనాత్మక ప్రతిభను ఉపయోగించి, సిద్ధాంత దర్శనాన్ని సామాన్యులకు సైతం అవగానకొచ్చేటట్లు 'రాముడికి సీత ఏమవుతుంది' అనే గ్రంథంలోని పరిశోధనాంశాల్ని 'నవ దృక్కోణాలనుండి నవ్యదృష్టి'ని ప్రదర్శించడానికి, ఆరుద్ర చేసిన ప్రయత్నాన్ని వివరించడం జరిగింది. రామకథల్ని ఓ చోటనే చర్చించటం, రామకథను పోలిన కథల్ని వివరించడం, సీతారాములకు ఆయా రామకథల్లో, రామకథను పోలిన కథల్ని పౌరాణికాంశాలతో పోలుస్తూ విశ్లేషించడం, సాంఘిక ఆర్థిక కోణాలనుండి వావివరుసల్ని పరిశీలించి, లిఖిత వాఙ్మయంలో గల కథలతో, మౌఖిక వాఙ్మయ కథల్ని పోల్చి, సమకాలీన పరిస్థితులకు అనుగుణంగా వాస్తవాల్ని దాచడాని జరిగిన ప్రయత్నమేమైనా జరిగిందేమోనని చూడటం వంటివన్నీ ఆరుద్ర తన పరిశోధనలో నిర్వహించారని వింగడించి చూపడానికి కృషిచేశాను. మౌఖిక వాఙ్మయాన్ని ఎక్కువ ఆధారంగా తీసుకొని, తన సృజనాత్మక ప్రతిభతో

సిద్ధాంతదర్శనానికి ప్రయత్నించడం వంటి వాటివల్ల ఈ అంశాల్ని 'జానపద సాహిత్య పరిశోధన' గా నిరూపించే ప్రయత్నం జరిగింది. రామకథల్ని విశ్లేషిస్తూ సామాజిక సంబంధాల్లో వచ్చిన మార్పుల్ని ఆరుద్ర వివరించారు. రామాయణం శిష్టసాహిత్యంగా భావిస్తున్నా, స్త్రీలరామాయణ పాటల్లో, జానపదులు రామకథల్ని తమకిష్టమైన పద్ధతిలో మార్చుకొని పాడుకోవడానికి వీలుంది. రామాయణ, భారతాల్లో కూడా జానపద ధోరణుల్ని బిరుదురాజు రామరాజు, శిష్ట సాహిత్యంలో జానపద ధోరణుల్ని హెచ్.ఎస్. బ్రహ్మానంద, రామాయణాల్లో జానపద కథల్ని మలయవాసిని మొదలైన వారు పరిశోధనాత్మకంగా నిరూపించినట్లే, రామాయణ కథల్లో 'రాముడికి సీత ఏమవుతుంద'ని ప్రశ్నిస్తూ, ఉత్సుకతను, జనరంజకత్వాన్ని కల్గిస్తూ, ఒక్కో సమాజ మానవ సంబంధాల్ని మార్చివేస్తు దృక్పథంతో, ఆరుద్ర వివరించారనే సైద్ధాంతిక ప్రతిపాదనతో ఈ పరిశోధన చేయడానికి ప్రయత్నం చేశాను. జానపద విజ్ఞాన, సాహిత్య పరిశోధనల్లోనూ సామాజిక స్థితిగతుల వాస్తవిక రూపాన్ని బహిర్గత పరిచే 'సత్యాన్వేషణ దృష్టిగల పరిశోధకుడు'గా ఆరుద్రను పేర్కొనే అవకాశం ఉందని తేలింది.

## 8.1.7. పరిశోధకుడుగా ఆరుద్ర:

ఈ ఏడవ అధ్యాయం లో వివిధ వ్యాసాలు గ్రంథాలను అనుసరించి ఆరుద్ర చేసిన పరిశోధనలను విశ్లేషించి నిరూపించే ప్రయత్నంచేశాను.

ప్రధాన సిద్ధాంత నిరూపణకు ప్రయత్నం జరిగిన ఈ అధ్యాయంలో ఆరుద్ర పరిశోధనలో ప్రధానంగా సృజనాత్మక లక్షణాలను క్రోడీకరించే ప్రయత్నం చేశాను. సృజనాత్మక రచనకూ, సృజనాత్మక పరిశోధనకూ గల తేడాలను వివరించడానికి ప్రమాణాలతో ప్రయత్నించాను. పరిశోధన ఏదొక నూతన సిద్ధాంతాన్ని గానీ, ప్రతిపాదనను గానూ, సమన్వయాన్ని గాని, లోపాన్నిగాని ఎత్తి చూపుతూ, దానికొక నూతన ప్రతిపాదన ను గానీ ఏదొకటి చేయడం అవసరమని, పరిశోధకుల భావనలు తెలుపుతున్నట్లే, 'పరిశోధకుడుగా ఆరుద్ర' అనే ఈ పరిశోధనాంశంలో ఆరుద్ర చేసిన పరిశోధనల సమన్వయం చేస్తూనే, 'ఉత్తమ సాహిత్య పరిశోధకుడు' గా ఆరుద్ర చేసిన కృషిని సిద్ధాంతీకరించే ప్రయత్నం జరిగిందని భావిస్తున్నాను.

ఆరుద్ర చేసిన పరిశోధనలో పరిశోధకులకు నూతన ప్రతిపాదనలు ఉన్నాయనీ, అవి ఆరుద్ర అసంపూర్తి పరిశోధనలుగా భావించడానికి అవకాశంలేదనీ, ఏపరిశోధనైనా పరిపూర్ణంగా పూర్తయినట్లు, సాహిత్య పరిశోధనలో అసలేకుదరదనీ తేలింది. వేమన కాలాన్ని అనేకమంది పరిశోధకులు అనేక సిద్ధాంతాలు, సమన్వయాలు చేసి వివిధకాలాల్ని ప్రకటించినట్లే, ఆరుద్ర కూడా పరిశీలించినా, సాహిత్య పరిశోధన లో స్థలకాల నిర్ణయాలు చేయడంలో ఆరుద్ర, 'సమన్వయాత్మక పద్ధతి'ని పాటించారు. గురజాడ వ్యక్తిత్వాన్నీ, రచనల్నీ తులనాత్మక పద్ధతిలో చేసిన కృషి 'తులనాత్మక పరిశోధకుడు' గా ఆరుద్రని గొప్పస్థానంలో నిలుపుతుంది. పరిశీలనాంశానికి తగిన పద్ధతిని పాటించి సాహిత్యంలో శాస్త్రీయ పద్ధతిని పాటించారని నిరూపితమైంది.

వేమన, గురజాడ మొదలైన వారి సమగ్ర స్వరూపాన్ని విశదీకరించడానికి తన సృజనాత్మక ప్రతిభను, విమర్శనాత్మకంగా ఉపయోగించుకొన్నారు. పూర్వపరిశోధకుల పరిశోధనలను పరిశీలిస్తూనే, అనేక కోణాల నుండి అధ్యయనం చేస్తూ, నూతన సమన్వయాల్ని ఎలా చేయవచ్చో, ఆరుద్రలోతైన అన్వేషణ తెలుపుతుందని తేలింది. కేవలం సంఘటనల పూర్వాపరాల్ని వివరించి, చరిత్ర పరిశోధకుడుగా మిగిలిపోకుండా, కార్య కారణ సంబంధాల్ని కవి కావ్యంలో ప్రతిఫలింప జేయడానికి చేసిన ప్రయత్నాన్ని నిరూపించడంలో 'సాహిత్య పరిశోధకుడు' గా ఆరుద్ర కృషి స్పష్టమవుతుందని తేలింది. తులనాత్మక, కవి జీవిత, గ్రంథ పరిష్కరణ, జానపద విజ్ఞాన పరిశోధనలన్నింటిలోనూ సృజనాత్మకతనూ, విమర్శనాత్మక దృష్టిని ప్రదర్శించినా, ఇవన్నీ 'సాహిత్య పరిశోధన' అనే చక్రం (circle) లోనే ఇమిడి పోయే అంశాలని నిరూపితమైందని భావిస్తున్నాను.

వివిధ ప్రతిపాదనలు, సమన్వయాలతో పరిశోధనలో విశిష్టత కన్పిస్తున్నా, కొన్ని నిర్ణయాలు చేయడంలో గొలుసుకట్టు నిర్ణయాలు, సూటిదనం కోల్పోయి, స్పష్టతకు ఆటంకం కలిగించే పరిశోధనా పద్ధతికూడా ఆరుద్ర పరిశోధనలో కన్పిస్తుందని వెల్లడయ్యింది. వేమన పూర్వీకుల స్థలంగా పాకనాటికి చెందిన 'మూగచింతపల్లి' విషయంలో ఎన్ని కోణాలనుండి అధ్యయనం చేసినా, వైరుధ్య భావాలు, ఫలితాలు ఆరుద్ర వెల్లడించారనీ, వాటి చారిత్రక ఆధారాలు ఈ పరిశోధనలో అసమంజ సమంటున్నాయనీ నిరూపితమైంది. సాహిత్య పరిశోధనలో భిన్నఫలితాలు వెలువడుతుంటాయి. దానికి 'దృక్పథం' కూడా కొన్ని సార్లు కారణమవుతుంది. రాగద్వేషాలు ఉంటే పరిశోధన అనిపించుకోదుకదా! కనుకనే, రాగద్వేషాలకు అతీతంగా పరిశీలన కొనసాగితేనే అది పరిశోధన అవుతుంది. అలాకానప్పుడు అదొక పొగడ్త (appriciation) గానే మిగిలిపోతుంది.

సమాజంలో వివిధ సిద్ధాంతాలు, భావజాలాలు ఉన్నప్పుడు, వాటి ప్రభావం కొన్ని సార్లు పరిశోధకుడుపై కూడా పడుతుంటుంది. ఆరుద్ర కవిత్వంలో అభ్యుదయ భావాలూ, మార్క్సిస్టు సిద్ధాంతాల ప్రభావం కన్పిస్తుంది. విమర్శను ఆ సరాగాచేసుకొని పరిశోధన కొన సాగించడం వల్ల ఈ పరిశోధనలో మార్క్సిస్టు దృక్పథం కన్పిస్తుంది. సత్యాన్వేషణా తత్పరుడు కావాల్సిన పరిశోధకుడు, సిద్ధాంత ప్రభావాలకు గురైనప్పుడు సత్య ప్రకటనకు అవకాశం ఉందా! అనే ప్రశ్నా తలెత్తక మానదు. కానీ, పరిశోధకుడు గా ఒక 'ప్రాపంచిక దృక్పథం' కలిగి ఉన్నా, సమాజానికి ఉపయోగపడే దిశగా పరిశోధన జరగాలనే ఆకాంక్షతోనే, పరిశోధనలో మార్క్సిస్టు దృక్పథం ప్రతిఫలించింది తప్ప, తన సైద్ధాంతిక భావజాలంతో పరిశోధన నిర్ణయాలను ముందే ఊహించి ఫలితాలు రాబట్టే పద్ధతిలో ప్రయత్నించ లేదు. ఈ పరిశోధనలో వివిధ అధ్యాయాల్లో ప్రామాణిక భావనలతో సైద్ధాంతిక నేపధ్యాల్ని ఆయా సందర్భాలలో వివరించడం దాన్ని తెలుపుతుంది. సమగ్ర ఆంధ్ర సాహిత్యంలో రాజుల, పోషకులను ఆధారంగా యుగ విభజన చేసినా, చరిత్ర, కాలనిర్ణయాలను స్పష్టంగా విశదీకరించే ఆలోచన ఆరుద్ర సత్యాన్వేషణను ప్రతిబింబిస్తుందని ఈ పరిశోధనలో వెల్లడయ్యింది. వివిధ కాలాల్లో రాజులు, పోషకులు కవుల్ని పోషించారనీ, కవులు, రాజుల పోషణకు అర్రులు చాచారనీ, ఆ కార్యకారణ సంబంధాల్లో ఉన్న సామాజిక ఆర్థిక పరిస్థితుల్ని గతి తార్కిక 'చారిత్రక' భౌతిక విశ్లేషణలతో సత్యాన్వేషణ వైపే ఆరుద్ర

పయనించారని స్పష్టమయ్యింది.వెల్చేరు నారాయణరావు తన పరిశోధనలోనూ రాజులు పోషకుల కవుల మధ్య ఉండేసంబంధాల్ని మార్క్సిస్టు దృక్పథంతో చేసిన విశ్లేషణలు కన్పిస్తున్నాయి. ఆరుద్ర మార్క్సిస్టు దృక్పథం, సాహిత్య చరిత్ర పరిశోధనలో ఉన్నా, సంయమనం ప్రదర్శించి, కవికీ, కావ్యానికీ, నాటి సమకాలీన పరిస్థితుల్ని విశదీకరించే దిశగా కొనసాగించారని నిరూపితమైంది.

## 8.1.8. ముగింపు:

మొత్తంమీద 'పరిశోధకుడుగా ఆరుద్ర' అనే పేరుతోకొన సాగించిన ఈ పరిశోధన వల్ల ఆరుద్ర వ్యక్తిత్వాన్నీ, రచనాతత్వాన్నీ విమర్శన విధానాన్నీ, పరిశోధన పద్ధతుల్నీ, ఒక అవగాహన చేసుకోవడం వల్ల, పరిశోధనలో ఉండవలసిన వేమిటో, ఉండ కూడని వేమిటో గమనించ గలిగేందుకు ఈ పరిశోధన తోడ్పడుతుందని భావిస్తున్నాను. పరిశోధకుడుగా సాధించవలసిన లక్షణాల్ని ఆరుద్ర కృషి నుండి అనేక అంశాల్ని తెలుసుకొనే, కొత్త అంశాల్ని స్ఫురింపజేసే అవకాశానికి ఈ పరిశోధన కొంత దోహద పడుతుందనుకొంటున్నాను. పరిశోధనలో గమనించ వలసిన దృక్పథం సృజనాత్మకతల గురించి చేసిన ప్రతిపాదన, పరిశోధకులను ఈ దిశగా ఆలోచింపజేస్తుందనే నమ్ముతున్నాను.

సృజనాత్మక ప్రక్రియల్లో ఆహ్లాదం, ఆనందం లక్ష్యాలై, కొన్ని కొత్త ఆలోచనల్ని కలిగించినా, ఆనందమే పర్యవసానంగా మారిపోతుంది. సృజనాత్మక పరిశోధన హృదయాహ్లాదం నుండి మేధో వికసన, తార్కికతతో సిద్ధాంత దర్శనం కల్గించి, బుద్ధి కుశలతవైపు తీసుకెళ్ళి సత్యాన్వేషణ మార్గంలో నిలుపుతుంది. ఆనందం కేవల సృజనాత్మక రచన కల్గించే ఆనందానికీ, సృజనాత్మక పరిశోధన కల్గించే దానికీ వ్యత్యాసం ఉంటుంది. సృజనాత్మక ఆనందం హృదయ ఉల్లాసాన్ని కలిగించగా, సృజనాత్మక పరిశోధన ఆనందం హృదయ వికాసాన్ని కలిగిస్తుంది. ఇవన్నీ పరిశోధకులకు అన్వేషణాంశాలు. ఈ దిశగా భవిష్యత్తులో పరిశోధకులు అధ్యయనాలు చేయడంవల్ల విమర్శ, పరిశోధనల్లో ఉండే సృజనాత్మకత కుండే ప్రమాణాలు, లక్షణాలు ఏర్పడగలవనీ, ఏర్పడాలనే ప్రేరణకి ఈ పరిశోధన సహకరిస్తుందనే నమ్మకం ఆశాదీపంలా కలుగుతుంది.

విమర్శ, పరిశోధనల్లో సృజనాత్మకత ఉంటుందనే వారే గానీ, దాన్ని లాక్షణికంగా నిరూపించే ప్రయత్నం జరగలేదు. పైగా, సృజనాత్మక రచనలు చేయలేనివారే విమర్శ, పరిశోధనల్లో సృజనాత్మకతను ప్రదర్శిస్తారనే విమర్శలు కూడా చేస్తున్న ఈ నేపథ్యంలో, ఈ 'సృజనాత్మకత' అనే భావన (Concept) ని పరిశీలించనంతవరకూ ఒక అసందిగ్ధతత కొనసాగుతూనే ఉంటుంది. ప్రస్తుత పరిశోధన లో సృజనాత్మకను గుర్తించి, సైద్ధాంతిక పరిచయానికి ప్రయత్నించినా, ఇది తొలి ప్రయత్నం మాత్రమేనను కొంటున్నాను. ఆరుద్ర రామాయణంలో సీత గురించి, వివిధ రామాయణాల్ని సామాజిక, చారిత్రక నేపథ్యం సామాజిక సంబంధాలను, వావివరసలనూ పరిచయాత్మకంగా, జానపద కథల ఆధారంగా జనరంజకంగా కొనసాగించిన పరిశోధనను భవిష్యత్తులో 'ఆంత్రోపాలజీ' చరిత్ర లతో సమన్వయించే దిశలో పరిశోధనలను ప్రత్యేకంగా కొనసాగించవలసిన అవసరం ఉందనిపించింది.

విజ్ఞాన పరిధులను విస్తరించే దిశగా పరిశోధన కొనసాగవలసి ఉంటుందని పరిశోధకులు భావిస్తున్నట్లే, ఆరుద్ర పరిశోధన, తెలుగు సాహిత్య పరిధులను విస్తృత పరుస్తుందని ఈపరిశోధన వల్ల నాకు

అన్పిస్తుంది. ప్రమాణాలనేవి నూతన భావనలు వచ్చినప్పుడు కాలానుగుణ మార్పులకు లోనవుతుంటాయి. సాహిత్యంలో ఈ భావనలు మరీ వేగవంతమవుతుంటాయి. ఇటువంటి నూతన ప్రమాణాలతో, నూతన ప్రతిపాదనలతో పరిశీలించగలిగితే 'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' లోనూ, ఆరుద్ర రచించిన ఒక్కో గ్రంథంలోనూ ఒక్కో ప్రతి పాదనతో ఒక్కో ప్రత్యేక పరిశోధన చేసే అవకాశం ఉంది. ఆ విధంగా ఆరుద్ర అన్ని రచనల్ని సమగ్రంగా అధ్యయనం చేయగలిగినప్పుడే 'పరిశోధకుడుగా ఆరుద్ర' ను సమగ్రంగా నిర్ణయించడానికి అవకాశం కలుగుతుంది. అంతవరకూ మార్క్సిస్టు దృక్పథం గల సాహిత్య పరిశోధకుడుగా తెలుగు సాహిత్య చరిత్రలో ఒక ప్రత్యేక స్థానాన్ని పొందుతూనే, సాహిత్యంలో వివిధ సిద్ధాంతాల విశ్లేషణకు అవకాశం ఉండటం వల్ల వివిధ చర్చోపచర్చలకు కారణమవుతూ 'నిత్య ప్రవాహ పరిశోధకుడు'గా వెలుగొందుతుంటారని భావించవచ్చు.

| వరుస సంఖ్య | ఈ సంపుటిలో వరుస సంఖ్య | కవిపేరు | పునర్ముద్రణ సం.సంఖ్య | పుట సంఖ్య | తొలిముద్రణ సం. సంఖ్య | పుట సంఖ్య |
|---|---|---|---|---|---|---|
| 776 | 192 | ఎడపల్లి వెంకటకవి | 10 | 173 | | |
| 777 | 193 | పిడుగు వెంకట కవి | 10 | 173 | | |
| 778 | 194 | గూడూరు వెంకటదాసు | 10 | 173 | | |
| 779 | 195 | మరిగంటి వెంకటాచార్యులు | 10 | 174 | | |
| 780 | 196 | జగన్నాథుల శ్రీనివాసుడు | 10 | 175 | | |
| 781 | 197 | మాజేటి సర్వేశలింగం | 10 | 175 | | |
| 782 | 198 | సింగరాచారి గారి సింగరాచారి | 10 | 175 | | |
| 783 | 199 | ఏగంటి సోమన | 10 | 176 | | |
| 784 | 200 | దిట్టకవి నారాయణ | 10 | 176 | | |
| 785 | 201 | చాత్రాతి లక్ష్మీనరసు | 10 | 178 | | |
| 786 | 202 | అట్లూరి లక్ష్మీనరసింహం | 10 | 179 | | |
| 787 | 203 | శేషంతిరుమలయ్య | 10 | 180 | | |
| 788 | 204 | దంతులూరి బాపిరాజు | 10 | 180 | | |
| 789 | 205 | ఆతుకూరి పాపయ్య | 10 | 180 | | |
| 790 | 206 | మిక్కిలి మల్లికార్జునుడు | 10 | 181 | | |
| 791 | 207 | తెరికపల్లి రామలింగభట్టు | 10 | 181 | | |
| 792 | 208 | ఎక్కిరేల చిత్రకవి రామాచార్యులు | 10 | 182 | | |
| 793 | 209 | సముద్రాల రామానుజాచార్యులు | 10 | 182 | | |
| 794 | 210 | కంచి వీరశరభ కవి | 10 | 182 | | |
| 795 | 211 | శ్రీపాద వెంకటాచలం | 10 | 182 | | |
| 796 | 212 | కోట శివరామయ్య | 10 | 183 | | |

| వరుస సంఖ్య | ఈ సంపుటిలో వరుస సంఖ్య | కవిపేరు | పునర్ముద్రణ సం. సంఖ్య | పుట సంఖ్య | తొలిముద్రణ సం. సంఖ్య | పుట సంఖ్య |
|---|---|---|---|---|---|---|
| సంకావ్యాలూ సంచడబ్బులూ వగైరాలు | | | 10 | 184 | | |
| 797 | 213 | మతుకుపల్లి నరసింహ శాస్త్రి | 10 | 187 | | |
| మాటయాభైమంది శతకకవులు | | | 10 | 198 | | |
| దండకాలు | | | 10 | 232 | | |
| భగవద్గీతలు – బ్రహ్మవిద్యలు | | | 10 | 247 | | |
| 798 | 214 | అనంతకృష్ణ తీర్థులు | 10 | 248 | | |
| 799 | 215 | వెలుగోటి కుమారయాచేంద్రులు | 10 | 249 | | |
| 800 | 216 | కొండూరి జగ్గరాజు | 10 | 249 | | |
| 801 | 217 | వేముగంటి దత్తోజీ పండితుడు | 10 | | | |
| 802 | 218 | మిక్కిలి మల్లికార్జునుడు | 10 | | | |
| 803 | 219 | గిరిమనగారి మాధవయ్య | 10 | 250 | | |
| 804 | 220 | వల్లూరి లక్ష్మీనారాయణ | 10 | 250 | | |
| 805 | 221 | పోచిరాజు వీరన్న | 10 | 250 | | |
| 806 | 222 | మంత్రవాది వెంకటపతి కుమారుడు | 10 | 251 | | |
| 807 | 223 | గోపీనాథం వెంకయ్యశాస్త్రులు | 10 | 251 | | |
| 808 | 224 | తెలుగు శ్రీధరస్వామి | 10 | 251 | | |
| 809 | 225 | సుదర్శన తీర్థులు | 10 | 251 | | |
| 810 | 226 | కుమార రంగయ్యగారిసూరయ్య | 10 | 251 | | |

| వరుస సంఖ్య | ఈ సంపుటిలో వరుస సంఖ్య | కవిపేరు | పునర్ముద్రణ సం.సంఖ్య | పుట సంఖ్య | తొలిముద్రణ సం. సంఖ్య | పుట సంఖ్య |
|---|---|---|---|---|---|---|
| 811 | 227 | యాగంటి వారు | 10 | 255 | | |
| 812 | 228 | పోతులూరి వీరబ్రహ్మం | 10 | 258 | | |
| 813 | 229 | ముడుమాల సిద్దప్ప | 10 | 252 | | |
| 814 | 230 | పోతులూరి ఈశ్వరమ్మ | 10 | 263 | | |
| 815 | 231 | భాగవతుల కృష్ణయ్య | 10 | 266 | | |
| **పురాణాలూ-మాహాత్మ్యాలు** | | | 10 | 270 | | |
| **క్రైస్తవ కావ్యాలు** | | | 10 | 293 | | |
| 816 | 232 | పింగళి ఎల్లన్న | 10 | 296 | | |
| 817 | 233 | మల్లేల తిమ్మరాజు | 10 | 938 | | |
| 818 | 234 | సామంతపూడి మల్లయ్య | 10 | 300 | | |
| 819 | 235 | మంగళగిరి ఆనందయ్య | 10 | 303 | | |
| 820 | 236 | పోలవరపు రాయడు | 10 | 307 | | |
| 821 | 237 | చౌదరి పురుషోత్తం | 10 | 310 | | |
| 822 | 238 | అనుబంధం 1<br>కుంఫిణీయుగంలోని శతక కవుల పట్టికను ఇచ్చారు. దీనిలో 151 మందిని పేర్కొన్నారు | 10 | 314 | | |

| వరుస సంఖ్య | ఈ సంపుటిలో వరుస సంఖ్య | కవిపేరు | పునర్ముద్రణ సం. సంఖ్య | పుట సంఖ్య | తొలిముద్రణ సం. సంఖ్య | పుట సంఖ్య |
|---|---|---|---|---|---|---|
| పదకొండవ సంపుటి (జమీందారీ నవ్య సాహిత్య యుగాలు–I): | | | | | | |
| 823 | 1 | కందుకూరి వీరేశ లింగం పంతులు | 11 | 72 | | |
| 824 | 2 | గురజాడ వెంకట అప్పారావు | 11 | 106 | | |
| 825 | 3 | గిడుగు వెంకటరామమూర్తి | 11 | 231 | | |
| 826 | 4 | విక్రమదేవ వర్మ | 11 | 270 | | |
| 827 | 5 | మామిడన్నం కుమారస్వామి | 11 | 274 | | |
| 828 | 6 | వెల్ష్ మన్ | 11 | 275 | | |
| 829 | 7 | గిడుగు వెంకట సీతాపతి | 11 | 277 | | |
| 830 | 8 | బుర్రా శేషగిరి రావు | 11 | 281 | | |
| 831 | 9 | చిలుకూరి నారాయణ రావు | 11 | 283 | | |
| 832 | 10 | వఝల చినసీతారామశాస్త్రి | 11 | 288 | | |
| 833 | 11 | మల్లాది సూర్యనారాయణ శాస్త్రి | 11 | 291 | | |
| 834 | 12 | బంకుపల్లి మల్లయ్య శాస్త్రి | 11 | 294 | | |
| 835 | 13 | యల్లా పంతుల జగన్నాథం | 11 | 296 | | |
| 836 | 14 | లాపీధర్మారావు | 11 | 297 | | |
| 837 | 15 | వేకుమళ్ళ అచ్యుతరావు | 11 | 300 | | |
| 838 | 16 | సెట్టి లక్ష్మీ నరసింహం | 11 | 301 | | |
| 839 | 17 | వేకుమళ్ళ కామేశ్వర రావు | 11 | 306 | | |
| 840 | 18 | మండపాక పార్వతీశ్వర శాస్త్రి | 11 | 308 | | |
| 841 | 19 | కొమర్రాజు వెంకట లక్ష్మణరావు | 11 | 313 | | |

| వరుస సంఖ్య | ఈ సంపుటిలో వరుస సంఖ్య | కవిపేరు | పునర్ముద్రణ సం.సంఖ్య | పుట సంఖ్య | తొలిముద్రణ సం. సంఖ్య | పుట సంఖ్య |
|---|---|---|---|---|---|---|
| 842 | 20 | బండారు అచ్చమాంబ | 11 | 332 | | |
| 843 | 21 | నాయని వెంకట రంగారావు | 11 | 335 | | |
| 844 | 22 | రావి చెట్టు రంగారావు | 11 | 337 | | |
| 845 | 23 | ఆదిపూడి సోమనాథరావు | 11 | 339 | | |
| 846 | 24 | మైలవరం నరసింహ శాస్త్రి | 11 | 344 | | |
| 847 | 25 | అయ్యదేవర కాళేశ్వర రావు | 11 | 345 | | |
| 848 | 26 | గాడిచర్ల హరిసర్వోత్తమరావు | 11 | 345 | | |
| 849 | 27 | ఆచంట లక్ష్మీపతి | 11 | 348 | | |
| 850 | 28 | ఆదిరాజు వీరభద్రరావు | 11 | 350 | | |
| 851 | 29 | చిలుకూరి వీరభద్రరావు | 11 | 352 | | |
| 852 | 30 | మల్లంపల్లి సోమశేఖర శర్మ | 11 | 356 | | |
| 853 | 31 | రాయప్రోలు సుబ్బారావు | 11 | 360 | | |
| 854 | 32 | కందుకూరు బాలసూర్యప్రసాదరావు | 11 | 364 | | |
| 855 | 33 | మాగంటి బాపినీడు | 11 | 367 | | |
| వాడుక-వేడుక భాషలయుద్ధం | | | 11 | 368 | | |
| 856 | 34 | పరవస్తు వెంకట రంగాచార్యులు | 11 | 421 | | |
| 857 | 35 | మండపాక పార్వతీశ్వర శాస్త్రి | 11 | 422 | | |
| 858 | 36 | కొక్కొండ వేంకట రత్నం | 11 | 423 | | |
| 859 | 37 | దాసు శ్రీరాములు | 11 | 441 | | |
| 860 | 38 | వేదం వెంకటరాయశాస్త్రి | 11 | 447 | | |
| 861 | 39 | వడ్డాది సుబ్బారాయుడు | 11 | 448 | | |

| వరుస సంఖ్య | ఈ సంపుటిలో వరుస సంఖ్య | కవిపేరు | పునర్ముద్రణ సం. సంఖ్య | పుట సంఖ్య | తొలిముద్రణ సం. సంఖ్య | పుట సంఖ్య |
|---|---|---|---|---|---|---|
| 862 | 40 | శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి | 11 | 451 | | |
| 863 | 41 | కాశీభట్ల బ్రహ్మయ్య శాస్త్రి | 11 | 455 | | |
| 864 | 42 | పానుగంటి లక్ష్మీనరసింహారావు | 11 | 458 | | |
| 865 | 43 | కొచ్చెర్ల కోట రామచంద్ర వెంకట కృష్ణారావు | 11 | 461 | | |
| 866 | 44 | నాళం కృష్ణారావు | 11 | 464 | | |
| 867 | 45 | త్రిపురనేని రామస్వామి చౌదరి | 11 | 465 | | |
| 868 | 46 | ముక్కపాటి నరసింహ శాస్త్రి | 11 | 467 | | |
| 869 | 47 | పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రి | 11 | 469 | | |
| పన్నెండవ సంపుటి (జమీందారీ నవ్య సాహిత్య యుగాలు–II): | | | | | | |
| ఆశుకవితలు – అవధానాలు | | | 12 | 1 | | |
| 870 | 1 | మాడ భూషి వెంకటాచార్యులు | 12 | 4 | | |
| 871 | 2 | శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి | 12 | 4 | | |
| 872 | 3 | దాసు శ్రీరాములు | 12 | 4 | | |
| 873 | 4 | చెళ్ళ పిళ్ళ వెంకటశాస్త్రి | 12 | 5 | | |
| 874 | 5 | దివాకర్ల తిరుపతి శాస్త్రి | 12 | 6 | | |
| 875 | 6 | వెంకటరామకృష్ణ కవులు (ఓలేటి వెంకటరామ శాస్త్రి, వేదుల రామకృష్ణ శాస్త్రి) | 12 | 13 | | |

| వరుస సంఖ్య | ఈ సంపుటిలో వరుస సంఖ్య | కవిపేరు | పునర్ముద్రణ సం.సంఖ్య | పుట సంఖ్య | తొలిముద్రణ సం. సంఖ్య | పుట సంఖ్య |
|---|---|---|---|---|---|---|
| 876 | 7 | కొప్పరపు సోదరకవులు (కొప్పరపు, సుబ్బరాయకవి, కొప్పరపు వెంకటరమణ) | 12 | 13 | | |
| 877 | 8 | కాశీకృష్ణాచార్య | 12 | 16 | | |
| 878 | 9 | అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రి | 12 | 17 | | |
| 879 | 10 | దుర్భాకరాజ శేఖరం | 12 | 17 | | |
| 880 | 11 | శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి | 12 | 18 | | |
| 881 | 12 | పిశుపాటి చిదంబర శాస్త్రి | 12 | 18 | | |
| 882 | 13 | రాయప్రోలు సుబ్బారావు | 12 | 18 | | |
| 883 | 14 | మాధవ పెద్ది బుచ్చి సుందర రామశాస్త్రి | 12 | 19 | | |
| 884 | 15 | గడియారం వెంకట శేషశాస్త్రి | 12 | 19 | | |
| 885 | 16 | పింగళి లక్ష్మీకాంతం | 12 | 20 | | |
| 886 | 17 | కాటూరి వెంకటేశ్వర రావు | 12 | 20 | | |
| 887 | 18 | విశ్వనాథ సత్యనారాయణ | 12 | 20 | | |
| 888 | 19 | వేదుల సత్యనారాయణ శాస్త్రి | 12 | 21 | | |
| వీధి నాటకాలూ-స్టేజీ నాటకాలు | | | 12 | 23 | | |
| కథా సాహిత్యం-ప్రజాబాహుళ్యం | | | 12 | 72 | | |
| 889 | 20 | గురజాడ శ్రీరామమూర్తి | 12 | 73 | | |
| 890 | 21 | కొమాండూరు అనంతాచార్యులు | 12 | 78 | | |
| 891 | 22 | తడకమళ్ళ వెంకటకృష్ణారావు | 12 | 80 | | |

| వరుస సంఖ్య | ఈ సంపుటిలో వరుస సంఖ్య | కవిపేరు | పునర్ముద్రణ సం.సంఖ్య | పుట సంఖ్య | తొలిముద్రణ సం. సంఖ్య | పుట సంఖ్య |
|---|---|---|---|---|---|---|
| 892 | 23 | వేదం వెంకట రాయశాస్త్రి | 12 | 81 | | |
| 893 | 24 | మధిర సుబ్బన్న దీక్షితులు | 12 | 89 | | |
| 894 | 25 | నందిరాజు చలపతి రావు | 12 | 94 | | |
| 895 | 26 | మంత్రి ప్రగఢ భుజంగరావు | 12 | 96 | | |
| 896 | 27 | శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి | 12 | 100 | | |
| 897 | 28 | చదలవాడ సీతారామ శాస్త్రి | 12 | 103 | | |
| 898 | 29 | అక్కిరాజు ఉమాకాంతం | 12 | 104 | | |
| 899 | 30 | వంగూరి సుబ్బారావు | 12 | 107 | | |
| 900 | 31 | ఆదిభట్ల నారాయణ దాసు | 12 | 113 | | |
| 901 | 32 | తేకుమళ్ళ రాజగోపాలరావు | 12 | 118 | | |
| 902 | 33 | చింతా శంకర దీక్షితులు | 12 | 123 | | |
| వవలలు–వావారకాలు | | | **12** | **126** | | |
| 903 | 34 | గోటేటి కనకరాజు | 12 | 166 | | |
| 904 | 35 | బులుసు పాపయ్య శాస్త్రి | 12 | 166 | | |
| 905 | 36 | ఓ.వై దొరసామయ్య | 12 | 167 | | |
| 906 | 37 | భోగరాజు నారాయణ మూర్తి | 12 | 168 | | |
| 907 | 38 | కేతవరపు వెంకటశాస్త్రి | 12 | 170 | | |
| 908 | 39 | సోమరాజు రామానుజరావు | 12 | 171 | | |
| 909 | 40 | చాగంటి శేషయ్య | 12 | 172 | | |
| 910 | 41 | కొత్తపల్లి సూర్యారావు | 12 | 173 | | |
| 911 | 42 | పులుగుర్తి లక్ష్మీనరసమ్మ | 12 | 174 | | |

| వరుస సంఖ్య | ఈ సంపుటిలో వరుస సంఖ్య | కవిపేరు | పునర్ముద్రణ సం.సంఖ్య | పుట సంఖ్య | తొలిముద్రణ సం. సంఖ్య | పుట సంఖ్య |
|---|---|---|---|---|---|---|
| 912 | 43 | కాంచన పల్లి కనకమ్మ | 12 | 176 | | |
| 913 | 44 | మాగంటి అన్నపూర్ణా దేవి | 12 | 176 | | |
| 914 | 45 | పులవర్తి కమలావతి | 12 | 177 | | |
| 915 | 46 | సీరము సుభద్రమ్మ | 12 | 177 | | |
| 916 | 47 | చిల్కాలపాటి సీతమ్మ | 12 | 178 | | |
| చిన్నకథ-పెద్దకథకులు | | | | 12 | 181 | |
| 917 | 48 | ఆచంటి వెంకటరామ సాంఖ్యాయన శర్మ | 12 | 184 | | |
| 918 | 49 | మాడపాటి హనుమంతరావు | 12 | 185 | | |
| 919 | 50 | చింతాదీక్షితులు | 12 | 188 | | |
| 920 | 51 | వేలూరి శివరామశాస్త్రి | 12 | 189 | | |
| 921 | 52 | శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి | 12 | 190 | | |
| 922 | 53 | అడవి బాపిరాజు | 12 | 192 | | |
| 923 | 54 | మునిమాణిక్యం నరసింహారావు | 12 | 193 | | |
| 924 | 55 | విశ్వనాథ సత్యనారాయణ | 12 | 194 | | |
| 925 | 56 | శ్రీనివాస శిరోమణి | 12 | 195 | | |
| తెలుగు నవల-కొత్తమలుపులు | | | 12 | 196 | | |
| మైలురాళ్ళూ-దారిదీపాలు | | | 12 | 277 | | |
| 926 | 57 | కట్టమంచి రామలింగారెడ్డి | 12 | 277 | | |
| 927 | 58 | రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ | 12 | 284 | | |

| వరుస సంఖ్య | ఈ సంపుటిలో వరుస సంఖ్య | కవిపేరు | పునర్ముద్రణ సం.సంఖ్య | పుట సంఖ్య | తొలిముద్రణ సం. సంఖ్య | పుట సంఖ్య |
|---|---|---|---|---|---|---|
| 928 | 59 | పురాణం సూరి శాస్త్రి | 12 | 288 | | |
| 929 | 60 | కాశీనాథుని నాగేశ్వరరావు | 12 | 293 | | |
| కొందరు పత్రికా సంపాదకులు-గ్రంథసంచాలకులు | | | 12 | 317 | | |
| 930 | 61 | మానవల్లి రామకృష్ణకవి | 12 | 338 | | |
| 931 | 62 | వేటూరి ప్రభాకర శాస్త్రి | 12 | 340 | | |
| 932 | 63 | దీపాల పిచ్చయ్య శాస్త్రి | 12 | 341 | | |
| 933 | 64 | శేషాద్రి రమణ కవులు (దూపాటి శేషాచార్యులు, దూపాటి వెంకట రమణాచార్యులు) | 12 | 342 | | |
| 934 | 65 | నేదునూరి గంగాధరం | 12 | 346 | | |
| నిఘంటు నిర్మాతలు | | | 12 | 348 | | |
| 935 | 66 | బహుజనపల్లి సీతారామాచార్యులు | 12 | 348 | | |
| 936 | 67 | కొట్రా శ్యామల కామశాస్త్రి | 12 | 353 | | |
| 937 | 68 | మహంకాళి సుబ్బారాయుడు | 12 | 355 | | |
| 938 | 69 | జయంతి రామయ్య | 12 | 355 | | |
| ముస్లింలు-తెలుగు సాహిత్యం | | | 12 | 360 | | |
| 939 | 70 | మున్షీమీర్ సుజాయత్ అలీఖాన్ | 12 | 363 | | |
| 940 | 71 | ఉమర్ అలీషా | 12 | 363 | | |
| 941 | 72 | షేకు మౌలామున్షీ | 12 | 364 | | |

| వరుస సంఖ్య | ఈ సంపుటిలో వరుస సంఖ్య | కవిపేరు | పునర్ముద్రణ సం.సంఖ్య | పుట సంఖ్య | తొలిముద్రణ సం. సంఖ్య | పుట సంఖ్య |
|---|---|---|---|---|---|---|
| 942 | 73 | బజులుల్లా సాహెబు | 12 | 364 | | |
| 943 | 74 | మొహమ్మద్ ఖాసింఖాన్ | 12 | 364 | | |
| 944 | 75 | ఖాదరీ సాహెబ్ అహమదల్లీ | 12 | 365 | | |
| 945 | 76 | రషీద్ బాషా | 12 | 365 | | |
| 946 | 77 | మౌల్వీషాజిక్ (జ్ఞానేంద్ర దేవ్ సూఫీ) | 12 | 365 | | |
| 947 | 78 | "అల్‌హాజ్" మహమ్మద్ జైనుల్ ఆబెదీన్ | 12 | 365 | | |
| 948 | 79 | షేక్ మీరాజాన్ | 12 | 365 | | |
| మొదలైనవారు-మిగిలిన వారు | | | 12 | 360 | | |
| పదమూడవ సంపుటి (ఆధునిక అభ్యుదయ యుగం): | | | | | | |
| ఆధునిక అభ్యుదయ యుగం | | | 13 | 1 | | |
| నవ్యసాహిత్య పరిషత్తు | | | | 13 | 13 | |
| అభ్యుదయ సాహిత్యం- ఉద్యమచరిత్ర | | | | 13 | 26 | |
| కవికోకిలలు | | | 13 | 68 | | |
| 949 | 1 | గుర్రం జాషువా | 13 | 69 | | |
| 950 | 2 | దువ్వూరి రామిరెడ్డి | 13 | 78 | | |
| 951 | 3 | అబ్బూరి రామకృష్ణారావు | 13 | 88 | | |
| 952 | 4 | పురిపండా అప్పలస్వామి | 13 | 107 | | |

| వరుస సంఖ్య | ఈ సంపుటిలో వరుస సంఖ్య | కవిపేరు | పునర్ముద్రణ సం. సంఖ్య | పుట సంఖ్య | తొలిముద్రణ సం. సంఖ్య | పుట సంఖ్య |
|---|---|---|---|---|---|---|
| 953 | 5 | శిష్ట్లా ఉమామహేశ్వరరావు | 13 | 120 | | |
| 954 | 6 | సామినేని ముద్దుకృష్ణ | 13 | 139 | | |
| 955 | 7 | శ్రీరంగం నారాయణబాబు | 13 | 153 | | |
| 956 | 8 | శ్రీరంగం శ్రీనివాసరావు (శ్రీ శ్రీ) | 13 | 209 | | |
| వచనకవిత : ప్రారంభం-పరిణామం | | | 13 | 267 | | |
| తెలంగాణా సమర సాహిత్యం | | | 13 | 300 | | |
| కొందరు విభిన్నులు | | | 13 | 324 | | |
| 957 | 9 | పిఠాపురం యువరాజా | 13 | 324 | | |
| 958 | 10 | జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి | 13 | 328 | | |
| 959 | 11 | పఠాభి (తిక్కవరపు పట్టాభిరామిరెడ్డి) | 13 | 836 | | |
| 960 | 12 | ఆలూరి బైరాగి | 13 | 347 | | |
| ఛాయలు-పాయలు | | | 13 | 350 | | |
| 961 | 13 | దేవర కొండ బాలగంగాధర తిలక్ | 13 | 354 | | |
| 962 | 14 | కుందుర్తి ఆంజనేయులు | 13 | 361 | | |
| 963 | 15 | అనిసెట్టి సుబ్బారావు | 13 | 368 | | |
| 964 | 16 | బెల్లంకొండ రామదాసు | 13 | 376 | | |
| 965 | 17 | విద్వాన్ విశ్వం | 13 | 379 | | |
| 966 | 18 | తుమ్మల వెంకట్రామయ్య | 13 | 389 | | |

# అనుబంధం - II

## తొలిముద్రణ-పునర్ముద్రల వివరాల-పీఠికలు




తొలిముద్రణ (తొ.ము) ముఖ చిత్రం - లోపలి ముఖ చిత్రం.

A ANDHRA SAHITYAM (in 12 Vols.) — Vol. I:
Yugam—By *Arudra.* Introduction; By Dr. P. V. Raja-
Published by *M. Seshachalam & Co.,* Madras - Machili-
Secunderabad. Price Rs. 5.

*ition: April '65*

© M. Seshachalam & Co.

: Gangadhar

Press,
1 Road, Madras - 21.

ప్రాప్తిస్థానం :

HLP
APBD
BOOKS FOR YOU
Regd. 212864

బుక్ డిస్ట్రిబ్యూటర్స్
సికిందరాబాదు

# మా ఉద్దేశం

సాహిత్యాభిలాష గల సాధారణపాఠకులు ఆంధ్రసాహిత్యం గురించి సంపూర్ణంగా తెలుసుకోవాలనుకొంటే, వాళ్ళకు ఉపయోగించే పుస్తకాలు నేడు అందుబాటులో లేవు. నన్నయభట్టునుండి చిన్నయసూరిదాకా ఆంధ్రసాహిత్యం అనేకవిధాలుగా, బహుముఖాలుగా సాగింది. ప్రజ్ఞావంతులైన తెలుగుకవులు రచించిన గ్రంథాలు అన్నిటికీ అన్నీ అచ్చుపడి వెలుగుచూడలేదు. అచ్చయిన పుస్తకాలుగూడ అన్నీ అందరికీ లభించడంలేదు. లభించిన పుస్తకాలైనా అన్నీ సాధారణపాఠకులకు బోధపడేవివరణలతో లేవు. ఈ కొరతను తొలగించవలసిన బాధ్యత నేటి ప్రకాశకులపై ఉంది.

ఈ అవబోధంతోనే మేము అనిదంపూర్వమైన ఈ సాహిత్య సేవకు సమకట్టాము. వెయ్యిసంవత్సరాలపాటు వేవిధాలుగా పూచి, కాచి, పరిపరి పరిమళించిన నవరసాలనూ నవనవమైన నవకంతో, నేవళంతో తేనె వాకలూరించిన తెలుగు సాహిత్యాన్ని సార్వజనికోపయోగకరంగా, సర్వులకూ సులభావగాహంగా పన్నెండు సంపుటాలలోకి ఇమిడికగా కుదించి, తెలుగు మహాజనులకు అందింపబూనుకొన్నాము. సహస్ర సంవత్సరాల సాహిత్యాన్ని ఇంత శతాంశంలో క్రోడీకరించడం సాహసమైతే కావచ్చుగాని సాహిత్యపిపాస గల సాధారణపాఠకులు వెనువెంటనే పయనించడానికి ఈ సంపుటాలు చక్కని సోపానాలు కాగల వన దానికి ఎంతమాత్రమూ సందేహంలేదన్న సంకల్పదీక్షే మమ్ముల నీకృషికి ప్రేరేచింది. ఆంధ్రసాహిత్యాన్ని మూలగ్రంథాలనుండి తనివితీరా

**తొ.ము ప్రచురణ వివరాలు - ప్రచురణ కర్తల ఉద్దేశం.**

గ్రహించడానికి ఈ సంపుటాలు సర్వాత్మనా సాయపడతా యని ఆశిస్తున్నాము.

ఈ పండెండు సంపుటాలలో ప్రముఖకవుల జీవిత విశేషాలూ, వాళ్లు సాహిత్యాన్ని ఏయేవిధంగా, ఏయే వాతావరణాల్లో, ఏయే సాధకబాధకాలతో పెంపొందింపజేసింది, వాళ్ళ కావ్యాలలోని గొప్పతనమూ, వాటి నిగనిగ వెలుగులూ వివరించడం జరుగుతుంది. నిదర్శనకు ఆయాకవుల రచనలలోని రసవత్తర ఘట్టాలు కొన్ని ఉదాహరించడం కూడ జరుగుతుంది. ఆ రచనలలోని సొగసులూ, చమత్కారాలూ వివరించడమూ జరుగుతుంది. ఒక్కొక్క కవి ఏయే గ్రంథాలు వ్రాసినదీ సంగ్రాహికంగా వివరించి, అముద్రితమైనవీ అలభ్యమైనవీ అయితే ఆ గ్రంథాలనుండి తగిన ఉదాహరణలు సుదీర్ఘంగాకూడ ఇవ్వబడుతాయి.

సాహిత్యమంటే ఒక్క పద్యకావ్యాలే కావుగనుక ఈ సంపుటాలలో ముఖ్యులైన శతకకవులూ, యక్షగాన రచయితలూ, వచనకర్తలూ, వాగ్గేయకారులూ మొదలైన మధురకవులను గురించికూడ గావలసినన్ని జీవితవివరాలూ, ఉదాహరణలూ ఉంటాయి.

ఈ పన్నెండు సంపుటాలూ చదివాక ఎటువంటి సామాన్య పాఠకుడికైనా సమగ్ర ఆంధ్రసాహిత్యంతో సన్నిహితసంబంధం ఏర్పడాలని మా ఉద్దేశ్యం; ఏర్పడితీరుతుం దని మా దృఢాభిప్రాయం.

ఇవి అన్నీ పొంతం చదివాక సర్వసాధారణపాఠకుడు పైతం గొమ్ములుతిరిగిన సాహితీపరుల అగాధచర్చలను కూడ సాధికారంగా, కరతలామలకంగా బోధపరుచుకునే అవకాశ ముంటుందని ఆశిస్తున్నాము.

ఈ సాహిత్యచరిత్రలో కడచిన సహస్రాబ్దాలనూ పక్కపేజీల్లో ఉన్నట్లు అందికగా పంద్రెండుయుగాలుగా విభజించి, తదనుసారంగా ఆయా యుగాల సమీక్ష జరుగుతుంది. అందులో ఇది ఆదిమ - చాళుక్యయుగ సమీక్ష సంపుటి.



1. ఆదిమ - చాళుక్యయుగము (క్రీ. శ. 12 వ శతాబ్దం చివరదాకా)
   (రాజరాజు 1061 లో చనిపోయినా, చాళుక్యచోడులు 1180 దాకా ఆంధ్రపై అజమాయిషీ చేశారు. అందుకని.)

2. కాకతీయయుగం (క్రీ. శ. 1200 - 1290)
   (రాజ్యస్థాపన క్రీ. శ. 1000 లో జరిగినా, గణపతిదేవ చక్రవర్తితో కాకతీయ ప్రాభవం ప్రస్ఫుటంగా కనబడుతుంది. అందుచే యుగం 1199 నుండి ప్రారంభం. అది రుద్రమదేవితో నే తగ్గిందని చెప్పవచ్చు. రెండవప్రతాపరుద్రుని కాలంలో కొత్తగాలులు వీచాయి. కనుక యుగం 1290 తో అంతం చేయవచ్చు.)

3. పద్మనాయకయుగం (క్రీ. శ. 1337 - 1399)
   (మొదటి సర్వజ్ఞసింగమ నాయకుని రాజ్యాంతందాకా)

4. రెడ్డిరాజులయుగం (క్రీ. శ. 1400 - 1450)
   (స్థాపన 1325 లో జరిగినా... కొమరగిరిరెడ్డితో ప్రాభవం. ఒక అర్ధశతాబ్దం వీరియుగంగా పరిగణిద్దాం)

5. తొలిరాయలయుగం (క్రీ. శ. 1450 - 1500)
   (ప్రౌఢదేవరాయుల చివరికాలంనుండి, అనగా 1446 లేక 1450 నుండి సాళువరాయర్ల రాజ్యాంతందాకా)

6. మలిరాయలయుగం (క్రీ. శ. 1500 - 1550)
   (కృష్ణదేవరాయులయుగం)

7. నవాబులయుగం (క్రీ. శ. 1550 - 1600)
   (ఇబ్రహీం కుతుబ్ షాతో ప్రారంభం. కులీకుతుబ్ షా మరణానికి ఒకదశ ముందుదాకా)

8. నాయకరాజుల యుగం (క్రీ. శ. 1600 - 1670)
(రఘునాథ నాయకుడు, విజయరాఘవనాయకులదాకా)

9. కడపటి రాజుల యుగం (క్రీ. శ. 1670 - 1750)

10. కుంఫిణీయుగం (క్రీ. శ. 1750 - 1850)
(మెకంజీ, ఫ్రాన్సుల సేన. ఉత్తర సర్కారులను బుస్సీ పుచ్చుకున్నాడు. 1758 లో కంపెనీవారు ఉత్తర సర్కారులను స్వవశం చేసుకొన్నారు.)

11. జమీందారీయుగం (క్రీ. శ. 1850 - 1900)
(పరిపాలన మొదలు సాహిత్యానికి జమీందారులే పోషకులని కవులు భావించడంచేత)

12. ఆధునికయుగం (క్రీ. శ. 1900 నుండి - )

మా ఈ కృషి మహాజనానికి ఏమాత్రం సంతృప్తి కలిగించినా మహాభాగ్యంగా పరిగణిస్తాము.

ప్రకాశకులు.

---

# ప్రవేశిక

కందుకూరి వీరేశలింగం పంతులాదిగా అనేకపండితులు ఆంధ్రకవుల చరిత్రలు రచించారు. ఆంధ్రభాషాపరిణామంగురించి పలువురు పరిశోధకులు వ్యాసాలు, గ్రంథాలు వ్రాశారు. ఆంధ్రవాఙ్మయచరిత్రలుకూడా కొన్ని ఉన్నాయి. కాని, రమారమి రెండువేల సంవత్సరాల ఆంధ్రవాఙ్మయాన్ని—చాళుక్యయుగం మొదలు ఆధునికయుగం వరకు—సమగ్రంగా, సక్రమంగా, విపులంగా ప్రజాసామాన్యానికి అందజేసే పుస్తకం ఇదివరకూ లేదు. ఆ కొరత తీర్చడానికి సంకల్పించుకొన్న శేషాచలం కంపెనీవారి ఈ అసమానోద్యమాన్ని ఎంత మెచ్చుకొన్నా చాలదు. ఈ ప్రచురణలో కొన్ని ప్రశంసనీయాలైన అంశాలున్నాయి.

'మహీ మున్ వాగనుశాసనుండు సృజియింపన్' అని అన్నాడు రామరాజభూషణుడు. నన్నయ భారతమే తెలుగులో మొదటి కావ్యరచన అనే అభిప్రాయం—సాధారణంగా. అయితే ఒక్క క్షణం ఆలోచిస్తే హఠాత్తుగా ఎటువంటి ప్రతిభాశాలియైనా అంత పరిపక్వమైన భాషాస్వరూపాన్ని సృష్టించడం అసంభవమని తోచకమానదు. నన్నయకు పూర్వం ఎన్ని వందలేండ్ల నుంచో ఆంధ్రభాష పుట్టి పెరుగుతూ వచ్చివుండాలి. ఆ అజ్ఞాతయుగం గురించి కొంతైనా తెలిసినవారి సంఖ్య అతిస్వల్పం. ఈ ప్రచురణ మొదటి సంపుటంలో నన్నయపూర్వపు భాషాస్వరూపం, స్వభావం గురించి పరిశోధనాపూర్వమైన చర్చ ఉంది. ఇది ఒక ప్రశంసనీయమైన విషయం.

ఇంకొకటి. ఇదివరకు రచింపబడిన ఆంధ్రవాఙ్మయ చరిత్రల్లో ఆధునిక సాహిత్యానికి అర్హమైన స్థానం ఇయ్యలేదు. ఈ చరిత్రలో దానికి ఉచితమైన ప్రాముఖ్యత ఇచ్చి దాని సర్వతోముఖవికాసం వర్ణింపబడ్డది.

కవుల జాబితాలతో, గ్రంథాల పట్టీలతో నింపి సాహిత్యచరిత్ర వ్రాయవచ్చు—చప్పగా. అటువంటిది కాదిది. కవులను గురించిన కథలూ కబుర్లు, వాళ్ళ జీవితాల్లోని ప్రధానఘట్టాలు, సాహిత్యవిమర్శలు—వీటితో రసవంతంగా, ఆకర్షణీయంగా వ్రాసిన చరిత్ర ఇది.

ఇక రచయితగురించి రెండుమాటలు. ఆరుద్రకు అద్వితీయమైన ఆంధ్రసాహిత్యజ్ఞానం ఉంది. అంతేగాక ప్రపంచసాహిత్యపరిచయం సహా ఉంది. పరిశోధకకృషి విమర్శకదృష్టి ఉంది. సరళమైన సజీవభాషలో వ్రాయగల శక్తి ఉంది. వ్యవహారంలోని తెలుగు నుడికారం సొంపు అతనికి వెన్నతోడ పెట్టింది. సౌందర్యపిపాసి, రసికుడు, అన్నివిధాల ఇటువంటి చరిత్రకు తగిన రచయిత.

ఇంత సమగ్రమైన ఆంధ్రసాహిత్యచరిత్రను ప్రకటించడానికి పూనుకున్న శేషాచలం కంపెనీవారి ఆశయం శ్లాఘనీయం. ఆంధ్రభాషకు వారు ఒనర్చే సేవ అగణ్యం. ఆంధ్రలోకానికి ఇది ప్రశస్తమైన ఉగాదికానుక. చదువుకొన్న ప్రతి ఆంధ్రుడు ఈ కానుకను రెండు చేతుల్తో పుచ్చుకోవలెనని నా కోరిక.

విశ్వావసు, ఉగాది

పి. వి. రాజమన్నారు.

---

**తొ.ము. ప్రతులన్నింటికి పి.వి.రాజమన్నారు ఉమ్మడి 'ప్రవేశిక.'**

x

# మంగళాశాసనం

మనము వాడుకొనే మాటలకు మనకు తెలిసినంతలో వాని మూలపురుషు లెవరో, వారి వంశం ఏయే దశలలో ఎలా ఎలా ఇంతవరకూ వికసిస్తూ వచ్చిందో ఆ సంగతులు తెలపడానికి చేసే ప్రయత్నం ఈ 'సమగ్ర-ఆంధ్ర సాహిత్యం' అనే పన్నెండు సంపుటాల గ్రంథం. దీనిని కొంత వరకు చదువుతూ రాగా ఈ నా చిన్ననాటి విషయాలు గురుతు వచ్చేయి: నేను నాలుగవ తరగతి చదువుతున్నాను. మాకు చరిత్రమును గూర్చిన పాఠం ఉంది కాని పుస్తకం లేదు. మా అయ్యవారే చంద్రగుప్తుణ్ణిగూర్చి, నవనందులను గూర్చి, అశోకుణ్ణి గూర్చి ఆకాశపంచాంగం చెప్తూ ఉండేవాడు. 'అదిరా మన దేశం' అని నే ననుకొనేవాణ్ణి. 'అయ్యా, చంద్రగుప్తుణ్ణిగురించి, పురుషోత్తముణ్ణిగురించి, అశోకుణ్ణిగురించి ఇంకా చెప్పండి' అని అయ్యవారిని విసిగించేవాణ్ణి. వాళ్ల చరిత్ర ఇంకా చూడాలని దుర్భిణిలో చూచేవాణ్ణి. చూపు వెనుదిరిగి వచ్చేది. అటుతరువాత పద్యాలు అల్లడము అలవడినతరువాత శ్రీ కందుకూరి వీరేశలింగముగారి కవుల చరిత్ర కనబడ్డది. 'ఆహా! ఇక్కడ ఉన్నారు, మన బంధుగులంతా' అని ఇంకా వెనుకకు వెళ్లి చూడామని ఇంతవరకూ ప్రయతిస్తూనేవున్నాను. తెలియని పురాతనచరిత్రలో ఏమాత్రమయినా తెలియరావడంలో అతినూతనత్వం ఉంది. నూతనప్రియులకు గూడా ఆ పురాతన అంశం అత్యంతనూతనం అన్న సంగతికి ఎవరికి వారే ప్రమాణం. ఈ గ్రంథం చదవడం మొదలుపెట్టి ముగించే టంతవరకూ నాకు ఈ చందంగానే ఉంది. విశేషించి పాల్కురికి సోమన, నన్నెచోడుడు, భీమన మొదలయినవారి విషయాలు అజ్ఞాతసీమలో మెరుపుల చినుకులు కురిసినయ్.

సుమారు అరువదేండ్లనుండి పండితులు పరిశోధించి వెలి యిచ్చిన రత్నాలూ, తాము సేకరించిన పచ్చలూ ఈ సంపుటంలో శ్రీ ఆరుద్రగారు కుప్పలు పోశారు. తెలుగు భాషకు పీఠిక అయిన ఈ గ్రంథం తెలుగు పుస్తకాల నన్నిటినీ చదివించడమేకాక తన్నే తా నెన్నో మారులు చదివించుకుంటుంది. తెలుగుభాషాప్రపంచంలో ఈ ద్వాదశ సంపుటాలూ ద్వాదశాదిత్యులవలె వెలుగు ఇస్తవి. శ్రీ శేషాచలంగారు ఈ పనికి శ్రీ ఆరుద్రగారిని వినియోగించడమున్నూ, తాము చక్కగా ముద్రించడమున్నూ ఈ రెండు ఒకటి కొకటి తగిఉన్నవి. ఈ ప్రయత్నం సర్వోత్తమంగా నెఱవేరా లని నా మంగళాశాసనం.

చిరివాడ,
21-3-'65.

వేలూరి శివరామశాస్త్రి.

తొ.ము. మొదటి సంపుటికి వేలూరి శివరామశాస్త్రి పీఠిక 'మంగళాశాసనం'

# కృతజ్ఞతలు

పన్నెండు సంపుటాలలో సమగ్రఆంధ్రసాహిత్యం ప్రజానీకానికి పరిచయం చేద్దామనే సంకల్పం రెండేళ్ళకిందట కలిగింది. పుస్తక ప్రచురణలో కొత్తపోకడలు పోయే ప్రతిభావంతులు, మిత్రులు శ్రీ యం. ఎన్. రావుగారితో ఇది చర్చించాను. నా ఉద్దేశాన్ని వారు బహుముఖాల నుంచి పరిశీలించి ఇలాగ రూపొందించారు.

సమగ్రత ఆశయం. దాన్ని సాధించడానికి ఇది ప్రయత్నం. పూర్వులు కందుకూరి వీరేశలింగంగారు ప్రామాణిక సాహిత్యచరిత్ర రచనకు పునాదులు వేశారు. శ్రీయుతులు మానవల్లి రామకృష్ణకవిగారు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, చిలుకూరి వీరభద్రరావుగారు, కొమర్రాజు లక్ష్మణరావుగారు, మల్లంపల్లి సోమశేఖరశర్మగారు మొదలైన మహనీయులు సాహిత్యంతోపాటు దేశచరిత్రనుకూడా విశదపరిచారు. వీరి రచనలను ఆధారం చేసుకొని తమ ప్రతిభతో కొత్త కోణాలను గుర్తించి నూతనసిద్ధాంతాలను ప్రతిపాదించి సాహిత్యచరిత్రను అనేకమంది విద్వాంసులు, విమర్శకులు విఖ్యాతపత్రికలలో, వివిధ గ్రంథాలలో విరచిస్తున్నారు. ఈ అమూల్యరచనల నన్నింటిని నా దృక్పథంతో సమన్వయం చేయడానికి యిందులో ప్రయత్నిస్తున్నాను.

ఈ కృషిలో నాకు చేదోడువాదోడుగా ఉండి నేను కోరిన సమయాల పుస్తకాలను సంపాదించి, అడిగిన ఆకరాలను సేకరించి తోడ్పడుతున్న ప్రధాన సహాయకులు, సహృదయులు శ్రీ టి. వి. [illegible]చార్యులుగారికి నేను ప్రప్రథమంగా కృతజ్ఞుణ్ణి.

ఈ ప్రథమసంపుటంలో ఉపయోగించుకొనేందుకు కొన్ని అముద్రిత గ్రంథాలలోని ప్రయోగాలను ఇచ్చి నన్ను దీవించిన నా వ్యాకరణ గురువు శ్రీ [illegible] దొరస్వామిశర్మగారికి నా నమస్సులు.

xii

ఈ రచనలో అకారాది పట్టికలు, సూచికలు మొదలైనవి తయారు చేసి నేను కోరినమేరకు తోడ్పడుతున్న సహాయకులు, మా అన్నయ్య శ్రీ భాగవతుల సూర్యనారాయణశాస్త్రికి, మిత్రుడు గొల్లకోట విజయ కుమార్‌కు నా ధన్యవాదాలు.

ఈ ప్రణాళికను విని ప్రోత్సహించి తమ గ్రంథసంకలనం నుండి పుస్తకాలను ఎరువిచ్చిన మిత్రులు శ్రీయుతులు వేదం వెంకటరాయ శాస్త్రి, చల్లా రాధాకృష్ణశర్మ, వేదం లక్ష్మీనారాయణశాస్త్రి, ఇ. టి. చిన్నికృష్ణయ్యగార్లకు నేను కృతజ్ఞుణ్ణి.

ఈ కృషిని శ్లాఘించి బహువిధాల తోడ్పడుతున్న మిత్రులు ఈరంకి రాయన్న (మానేజరు, తెలుగుభాషాసమితి, మదరాసు) పర్వతనేని గంగాధరరావు (రీడరు, లైబ్రరీ సైన్సు, మదరాసు యూనివర్సిటీ)గార్ల ఉపకారం మరచి పోలేను. వారికి ధన్యవాదాలు.

ఈవిధంగా నాచేత సాహిత్యసేవ చేయిస్తున్న యం. శేషాచలం అండ్ కంపెనీ అధినేతలు శ్రీ మద్దూరి శేషాచలంగారికి, వారి కుమారులకు కృతజ్ఞుణ్ణి.

ప్రకాశకులమీదీ, నామీదీ అవ్యాజాభిమానంతో ఈ సంపుటికి ప్రవేశిక, మంగళాశాసనం అనుగ్రహించిన డా॥ పి. వి. రాజమన్నారు, శతావధాని వేలూరి శివరామశాస్త్రిగార్లకు ప్రకాశకులతోపాటు నేను కూడా చాలా చాలా కృతజ్ఞుణ్ణి.

చిట్టచివర చెప్తున్నా, మొట్టమొదట పేర్కొనవలసిన, సదుపాయాలు కల్పించి, అనుకూల వాతావరణాన్ని సృజించిన శ్రీమతి రామలక్ష్మికి — ఈ పరమార్థాన్ని సాధింపచేస్తున్న నా ఉత్తమార్థానికి నా అభివందనలు.

ఆరుద్ర.

తొ.ము. మొదటి సంపుటి లో ఆరుద్ర తెలిపిన 'కృతజ్ఞతలు'

మంచిపని. ఈ సంపుటిలో ఆరీతిగా యథావాక్యాల అన్నమయ్యగారివీ, ఆంధ్రభోజునివీ పద్యాలు, ఉపలభ్యమానములైనవన్నీ, ఉదాహరించి నట్లున్నది. ఇది చాలా బాగావుంది.

మరొకవిషయమేమిటంటే, కొందరుకవులనుగురించిన కాలమూ, మరికొన్ని విషయాలను గురించి చాలామంది వ్రాసిన భిన్నభిన్నాభిప్రాయాలను ఒకచోటపోగుచేసి, ఆపుస్తకాలన్నీ చదివి బాధపడేఅవసరం లేకుండా, పాఠకులకు వాటిసారాంశాలు ఒక్కచోట కనిపించేటట్లు చేయటం.

ఇటువంటి గ్రంథం సరదాకు చదివేవాళ్లు కొద్దిమందే ఉంటారు. మన సాహిత్యచరిత్ర ఎల్లాంటిది అనే జిజ్ఞాస ఎంతమందికి పుడుతుంది? పుట్టినా ఈ తారీఖులూ, ఈ చిక్కాలూ చూచి పుస్తకం అవతలపార వేస్తాడు. మరిన్నీ పద్యంనిండా అర్థమయ్యేమాటలే ఉన్నా పద్యమయ్యేటప్పటికి ఆపూర్వతో అలవాటులేకపోతే అర్థంకాదు. అందులో అనేక పద్యాలు ఉదాహరింపబడిన ఈ పుస్తకం ఆక్లిష్టాన్ని తొలగించలేదు. అది ఎవరికీ సాధ్యంకాదు. అభ్యాసంగా పద్యాలు చదువుతూ ఎవడికి వాడు ఈ కష్టాన్ని తొలగించుకోవలసిందే.

విశ్వవిద్యాలయాల విద్యార్థులకు మాత్రం ఈ సంపుటాలు చాలా ఉపకారంచేస్తాయి. చాగంటివారి పెద్దపెద్ద సంపుటాలూ, ఇతరులు అక్కడా అక్కడా వ్రాసినవీ అన్నీ పోగుచేసి కష్టపడడంకంటే వాళ్ల పరీక్షలకు కావలసినంతమాత్రం—ఒకప్రశ్నకు ఒకణ్ణిగురించి కావలసినంత సమాధానం ఈగ్రంథాలలో తేలిగ్గా దొరుకుతుంది.

ఇది గొప్ప ఉపకారమే.

ఆరుద్ర (ఇట్లాంటి పేర్లకు 'గారు' కలపటం విపరీతంగా ఉంటుంది. 'ఆరుద్రగారు' అంటే ఏదో వెగటుగా ఉంటుంది. అందుచేతనే అది వాడడంలేదు) చాలా మంచిపని చేస్తున్నారని చెప్పాలి. శేషాచలం కంపెనీవారు ఆయనను తనలోతులు తాను తెలుసుకొనేటట్లు చేస్తున్నారని అనాలి.

విజయవాడ,<br>
18-4-'65.

విశ్వనాథ సత్యనారాయణ.

# పీఠిక

ఏ సాహిత్యచరిత్ర అయినా నాలుగైదు విధములుగా రచించవచ్చు. ప్రస్తుత గ్రంథములో అవలంబించిన విధానము యుగవిభజన విధానము. సామాన్యముగా సాహిత్యయుగవిభజన చేసేటప్పుడు, ఆకాలపు గ్రంథకర్తలు ప్రముఖ రాజవంశము పేరు స్వీకరిస్తూ ఉంటారు. ఈ సంపుటికి పద్మనాయకయుగము అని పేరుపెట్టడం యుక్తమే. క్రీ. శ. 14-వ శతాబ్దిలో ప్రముఖులైన పద్మనాయకులు సమరములోనూ, సాహిత్యపోషణలోనూ చతురులే. కొందరు ప్రభువులు స్వయముగా సంస్కృతాంధ్రములలో విద్వాంసులై, గ్రంథరచన చేసి గణన కెక్కినారు. ఆదినుంచీ నేటివరకూ, పద్మనాయకప్రభువులు సంస్కృతాంధ్రకవులను ప్రోత్సహిస్తూ ఉండడమువల్లనే రెండు భాషలలోనూ చాలా ఉత్తమగ్రంథాలు వెలసినవి.

ఏదో యుగమని పేరు పెట్టినంతమాత్రాన ప్రస్ఫుటమైన విభాగము ఏర్పడ్డదనుకోనక్కరలేదు. ఆద్యంతాలలో అన్యయుగాల సంపర్కము కూడ కొంత కొంత ఏర్పడుతూ ఉంటుంది.

రచయిత హృదయం ఏదో గమనించడం ముఖ్యం. ఆయన దానిని ఏవిధముగా నిర్వహించినాడు, అది సమంజసముగా ఉన్నదా లేదా అని సమీక్షచేయడం సరసంగా ఉంటుంది. ఇందులో అవి లేవు, ఇవిలేవు; అవి ఎక్కువగా ఉన్నవి, ఇవి న్యూనముగా ఉన్నవి-అని విమర్శించడం న్యాయము కాదు. ఈ విధానమునుబట్టి ఈ సంపుటిని పరిశీలిస్తే రచయిత పెట్టిన లక్ష్యం నెరవేరినట్టు తోస్తుంది.

సాహిత్యక్షేత్రములో, విశేషించి గవేషణలో నిష్ణాతులైనవారు కొత్త అంశం దొరికినప్పుడు వ్యాసములు వ్రాసి వివిధ పత్రికలలో ప్రకటిస్తారు; చాలా అంశాలు లభించినప్పుడు నిండుగ్రంథాలే వ్రాస్తారు. వీని అన్నీ సమకూర్చుకొని సామాన్యపాఠకుడు పఠించలేడు. ఒకవేళ



ఓపికతో చదివినా సమగ్ర ఆంధ్ర సాహిత్యచరిత్ర అతనికి సులువుగా అవగతము కాదు. అందుకనే బహుగ్రంథావలోకనము చేస్తున్న ఆరుద్ర సామాన్యపాఠకునికోసం విషయాలు క్రోడీకరించి, విస్పష్టంచేసి, సరళభాషలో ఈ మహాగ్రంథం సంతరిస్తున్నాడు. దీనినిబట్టి ఈయన సాహిత్యములో కేవల కర్మకారుడు అనుకోకూడదు. ప్రతిభావంతుడు కావడంచేత చక్కగా సమీక్షించి, సారం దీసి పాఠకునికి సంతర్పణ చేస్తున్నాడు. కవికాలనిర్ణయం చేయడములోను, విరుద్ధాభిప్రాయాలను సంగ్రహించి సమన్వయం చేయడములోను, పిండితార్థం తేల్చడములోను ఈయన సమరసదృష్టితో వ్యవహరించినాడు. వైజ్ఞానికదృష్టి కలవాడు కావడంచేత ఏ సంశయాస్పదవిషయములోనూ నిజసిద్ధాంతము ఆ పేటి పెట్టుపోక, ఉపపత్తులు చూపిన సత్యాన్నే స్వీకరించినట్లు కనబడుతున్నది. ఇదమిత్థం అని తేలని విషయాలను, ఏపక్షానికీ ఒగ్గక, అనిశ్చితాలుగానే వదిలివేసినాడు. ఇది సమంజసము.

ఈ గ్రంథరచనలో స్వతంత్రతకూడా గోచరిస్తున్నది. ఏ విద్వాంసుడైనా, ఏ నూతనవిషయాన్ని చెప్పినా, గ్రంథకర్త దానిని చెప్పినవారికి కృతజ్ఞత తెలుపుతూ ఇందులో పొందుపరచినాడు. మనీషులైన కోరి నరసింహశాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ, సోమశేఖరశర్మ, అనంతకృష్ణశర్మ ప్రభృతుల వివరణాలను స్వీకరించి గ్రంథములో అనుప్రవిష్టము చేసినాడు.

కొందరు విద్వాంసులైనవారే కవికాలనిర్ణయము పట్ల శ్రద్ధధానులు కారు. ఎప్పటివాడైతేనేమి అంటారు. చివరకు గ్రంథమే ముఖ్యమైనప్పటికీ, కర్త ఎవరు అనే విషయంకూడా చేతనైనంతవరకూ నిరూపించాలి. ఔదాసీన్యం వహించడం సవిమర్శకసమగ్రవిద్వత్తు కాదు. అందుకే ఆరుద్ర సందిగ్ధస్థానాలలో సద్విమర్శ చేసినాడు.

ప్రధానముగా మెచ్చుకోతగ్గ విషయం ఉన్నది. చిమ్మపూడి అమరేశ్వరవిరచితమైన విక్రమసేనకావ్యము లభ్యం కాదు. కాని కొందరు కవులు ఇచ్చిన ఉదాహరణపద్యములనుబట్టి ఆ కావ్యాన్ని ఆరుద్ర రీకన్‌స్ట్రక్ట్ (Reconstruct) చేసినాడు. ఇది ప్రతిభతో కూడిన పని. ఈ నిర్మాణంవల్ల విక్రమసేనకావ్యం ఒకవిధముగా ఏ తీరున ఉండేదో ఊహించి రసాస్వాదన చేయవచ్చు.

**తొ.ము. మూడవ సంపుటికి శివశంకరస్వామి 'పీఠిక'**

విషయవిశదీకరణకు గ్రంథములో ఇమిడ్చిన పట్టికలు కూడా బాగా ఉన్నవి.

మెచ్చుకోదగిన ఇంకొక విషయం — ఈ రచయిత తులనాత్మక పరిశీలనవల్ల పాఠకుడికి వివిధరచనలలో తారతమ్యము, ఏది దేని వరవడి, ఎవరివల్ల అన్యకవులు ప్రభావితులైనారు సాహిత్యము ఏవిధముగా వృద్ధి పొందుతూవచ్చింది అనే విషయాలు సులభగ్రాహ్యమవుతవి. కావ్యవస్తు వివేకములో ఈయన చూపిన పద్ధతి ప్రశంసనీయము. Indology, Anthropology, Comparative Mythology, History of Religions పరిశీలించడంచేత ఈయనకు నిర్లిప్తతా, నిజము బయటపెట్టవలె ననే సంకల్పమూ ప్రస్ఫుటమవుతున్నవి. ముఖ్యముగా రామాయణవిశేషాలలో దీన్ని గమనించవచ్చు. ఆంధ్రములో విద్వాంసుడై, సంస్కృతాంగ్లాదిభాషలలో బాగా కృషిచేసినవాడు కావడంచేత, ఈ రచయిత దేని కెంత విలువ ఈయవలెనో, అంత విలువ ఇస్తూవచ్చినాడు. ఇంత మహాకోశము ఒకరే రచించడముకన్న విద్వత్సంఘము సిద్ధముచేయుడము మంచిదని కొందరి మతము. కాని సాహిత్యస్వరూపవిషయమై సమ్యగ్దర్శనము కల మేధావి ఒక్కచేతిమీదుగానే రచించడము కూడా మంచిదే.

గ్రంథరచన ఒక ఎత్తు, దాని ముద్రణప్రకాశనములు ఇంకొక ఎత్తు. ప్రసిద్ధ శేషాచలంకంపెనీవారి కార్యదర్శి మద్దూరి నరసింహారావు ఉన్నత పట్టభద్రుడైకూడా ఉద్యోగంలో చేరక తన తండ్రి గారు స్థాపించిన పుస్తకవ్యాపారాన్ని వివిధముఖముల వృద్ధిచేస్తూ, అమెరికా సంయుక్తరాష్ట్రాలకు వెళ్లి గ్రంథముద్రణ, ప్రచురణ, వ్యాపారవిధానాలను బాగా గ్రహించివచ్చి ఈ మహాకార్యం పూనుకొన్నాడు. ఈ సంస్థకు శుభం భూయాత్!

ఇతి శివం.

శ్రీ రామాశ్రమము
ఒంగోలు
మే 20, 1965

శివ శంకర స్వామి.

# పీఠిక

సమగ్రాంధ్ర సాహిత్యం – శైలల అరచాటున మిటారించు – తెలుగు తనం!

యింతవు నోచినవాడు – నిక్కమైన తెలుగుబిడ్డ:

గాథలు త్రివ్వగలవాడు:

అందుకు తలసిన నేర్పు, ఓర్పు, దండిగా, – కలిగినవాడు, – కావలెనని పనిగా, పూనిక మెయి అలవరచుకొనినవాడు:

ఈ సంపుటం, – ఆవ్వాడు, క్రమిమించని అతి వినయాన, ఆప్యాయనంగా అందిచ్చిన అపూపం:

కప్పుర వసంతరాయలు తన పేమ వేడుక తీర సంకల్పించు వసంతోత్సవానికి మన మాహాత్ములమై, పరవశించినట్లు, – లకుమ నాట్యవయాగారములకు పరవశించినట్లు, – అనుగ రమ్యతి చేకోడుగా, – రచయిత జాలమల్లిన కమనీయ భావన! –

ముచ్చట పడేందుకు, – మురిసేందుకు
అబ్బురంపడి అహో! అనేందుకు,
అలనాటివా రంతటి ఘనులా అని, –

అతి మన్ననగా అనందించేందుకు, – యీ సారస్వతోపాయనము, – చదువరుల, తగుపాటి రసికుల నోవరంచుచున్నది.

యిది, – కలకాలము నిలువదగిన మేలు!

మేల్బంతి!....

ముందర చను దినములలో – తెలుగు పీమ, – చదువరు లున్నంత మేర, – సాహితీ సమరాంగణము. ఒక్కొక్క చేత్తి తొక చందేలు –

x

ఎన్నిమాయలు లెక్కించినా, – దానికి మూలే గాథ్లు, – దంటువదినా తప్పింపులు మానకపోవడంతో, – అది ఒక ఎడతెగని రగడ కావడంతో, యింగితం మాత్రమే ఉన్న సజ్జనులు, – కావ్యాలాపములను తర్జించే స్థితిలోకి రావడమున్నూ జరిగినది.

యీ రచయిత చిరంజీవి శ్రీ ఆరుద్ర, ఆ తరానికి వారసుడే అయినా, – అటునుంచి సంక్రమించినది – పుణ్యం కొద్దీ – అవలేశం లేకపోవడంతో, – పుట్టెడు ఓపికతో, – సత్యానికే కట్ట యిచ్చి, – తాను భావనాలోలుపుడైనా ఊహాగానం ఉజ్జగించి, తీరికగా ఏరుకొన్న వాగదపూలతోనే మాలకట్టినాడు: ఇయ్యది విద్యావినోదులు ధరించదగినదైనది.

పద్మనాయక యుగంలో, – కావ్యకన్య, – యిలువీడి ఎరుగని ముద్దరాలు: కన్నవారితో మురిపించినది. ఉన్నచోటనే ఉన్నది.

రెడ్డిరాజుల హయాములో, – ఆరితేరి – అందలాలెక్కినది: ఏలేవారిని ఏల్బడిలోని వారిని అదమరిపించినది: అది శ్రీనాథుని చలువ:

యీ పట్టు – ఒక కథగాని కథ. శ్రీనాథుని పరముగా, – యింతకాలము అలలు కొడుతూన్న కథల కడలిని చిలికి, – అందున్న సుక్తిమంత సత్యాన్ని పుటుక్కడిగి వెలుగుకు తేవడం, – సామాన్యం కాదు:

ప్రౌఢదేవరాయల సభలో, – డిండిముడు తారసిల్లిన సందర్భములో, రాయల కోరికపై, – శ్రీనాథుడు చెప్పిన పద్యాలలో లభించిన ఆ ఒక్కటీ కాలను వర్ణించే సీసమూ,

రాయల సమార్తి చిక్క పరువాటి తాను వలచినవానిపై చెలిచి కత్తి గెడగి కన్నుంచినదని అలుకలు పోయినప్పుడు, అనునయింపుగా సుతారపు మందలింపుగా, కవి సార్వభౌముడు చూర్పిన సీసమున్నూ

("... హరుడే ప్రసూనమ్ము శిరమున దాల్చడా, – గేదంగికిని
ప్రాప్తి లేదు గాక ...ఎవ్వరెవ్వర భాగ్యమ్ము లెట్టిదొక్క

తొ.ము. వాల్గవ సంపుటికి మల్లాది రామకృష్ణ శాస్త్రి 'పీఠిక'

# పీఠిక

ఈ గ్రంథం సంపుటాలు అయిదున్నూ చదివినతోడనే ఈ గ్రంథం రచించడానికి ఆరుద్రగారు అన్నివిధాలా తగినవారని తోచినది. వీరు, ఎంత శ్రమపడియైనా యాథార్థ్యం తెలుసుకోవలెనన్న పట్టుదలతో పరిశోధన గావించినారనిన్నీ, పక్షపాతం లేని విమర్శకులనిన్నీ, సదసద్వివేకము గలవారనిన్నీ గ్రహించాను. తగిన పరిశీలన లేక గతానుగతికంగా వస్తూ ఉన్న సిద్ధాంతాలు విమర్శించి వాస్తవమయిన దేదో నిరూపించడానికి వీరు ప్రయత్నించినారు. 'తెనుగు' అనే రూపము నన్నయ వాడినారు. గనుక అదే మొదటి రూపమని కొందరంటున్నారు. అంతకు ముందు తెలుగు అనే భాష ఉండేదన్న విషయం వీరు తెలుసుకోగలిగినారు.

ఈ విషయం నేనిదివరకు కొన్ని వ్యాసాలలో తెలియజేశాను. మన తెలుగులోనే కాక ఇతర భాషలలోకూడా కొన్ని శబ్దాలలో 'ల' కారము 'న' కారముగా మారడం కలదని ఉదాహరించాను. మరియొక విషయంకూడ వీరు తెలియజేసినందుకు సంతోషిస్తున్నాను. తెలుగు భాష ద్రావిడ భాషా కుటుంబమునకు చెందినదేకాని ఆర్యభాషా కుటుంబమునకు చెందినది కాదు. సంస్కృత భాషాశబ్దాలు తత్సమాలుగా గాని, తద్భవాలుగా గాని వేలకొలదిగా తెలుగులోకి వచ్చినవి. అయినా అంతమాత్రాన ద్రావిడ భాషా లక్షణం తెలుగులో నశించిపోలేదు.

కందుకూరి వీరేశలింగం పంతులుగారు, గురజాడ శ్రీ రామమూర్తిగారు మొదలయినవారు కవులచరిత్ర అను పేరను కవులకు సంబంధించిన అంశములను ఎక్కువగా వివరించినారు; అంతేకాని కవుల గ్రంథ విమర్శ అంతగా చేయలేదు. ఇటీవల కొందరు సార్థకమయిన సాహిత్య చరిత్రలు వ్రాసుకొన్నారు.

ఆరుద్రగారు రచిస్తూ ఉన్న ఈ గ్రంథములో అన్ని విషయములూ సమగ్రముగా చర్చించుటకు అవకాశము కలిగినది. సమగ్ర శబ్దము సాపేక్షకము. ఒక దృష్టితో చూచిన యెడల ఎంత విపులముగా రచించినా ఏదిన్నీ సమగ్రము కాజాలదు. పదమూడు సంపుటములలో ఎంతవరకు సాధ్యము కాగలదో అంతవరకు సమగ్రంగానే వీరి సాహిత్య చరిత్ర

**సొ.ము. అయిదవ సంపుటికి గిడుగు వెంకట సీతాపతి పీఠిక**

...ంచువారని నా అభిప్రాయము. ఇందులో ఇదివరకు ప్రకటితములయిన గ్రంథములందు ఆయా గ్రంథకర్తలు తెలియజేసిన విషయములు పరిశీలించి తమకు తప్పుగా తోచినవి సవిమర్శకముగా ఖండించి తమకు నచ్చినవి ఎత్తుకొని రచన సాగించినారు. ముఖ్యులయిన కవులగురించి, వారి గ్రంథములగురించి అనేక విషయములు తెలియజేసినారు. తిక్కనను గురించి వ్రాసినది 85 పుటల గ్రంథ మయినది. శ్రీనాథునిగురించి వ్రాసినది 130 పుటల గ్రంథ మయినది. పోతరాజుగురించి వ్రాసినది 64 పుటలు పట్టినది.

మరియొక విషయము. ఆరుద్రగారు సాహిత్య పోషకులయిన ప్రభువంశముల పేళ్లుపెట్టి యుగవిభజన చేయడం మంచిదే కాని ఈ ఐదవ సంపుటానికి పెట్టిన పేరు తిక్కన సంపుటాలకు పెట్టిన పేళ్ళవలె అంతగా సార్థకం కాదని నా అభిప్రాయం. గజపతులు సంస్కృత సాహిత్యమును పోషించినా, తెలుగు సాహిత్యమును కొద్దిగానయినా పోషించలేదు. అంతే కాదు; శ్రీనాథుని విషాద విషయం తలుచుకుంటే కష్టరము కాకతప్పదు. ఈ విషయం ఆరుద్రగారు గుర్తించకపోలేదు. పైగా ఒక మాట చూపి ''గజపతుల పేర ఒక యుగాన్ని పేర్కొని కొని రెడ్డిరాజుల, సాళువరాయల యుగాలకు అనుబంధంగా జమకట్టుకుందాం'' అన్నారు (చూ : పుటలు 15-16). సరే; దానికేం? పేరో ఒక పేరు. మనకు ముఖ్యమయినది ఈ సంపుటంలోని గ్రంథ విషయం. అది నిండుగానూ, నిర్దుష్టంగానూ ఉన్నదని సంతోషిస్తున్నాను.

ఈ సంపుటములో గ్రంథకర్త పేర్కొన్న కావ్యములన్నీ శ్రద్ధతో చదువుతూ ముఖ్యములయిన అంశము లన్నీ గుర్తించుకొన్నట్లు కనబడుతున్నది. శ్రీనాథుడు, పోతరాజు, పెద్దన్న మొదలయిన మహాకవులు ఎట్లు తమకు పూర్వులయిన నన్నయ, ఎర్రయ, నాచనసోమన మొదలయిన పెద్దకవుల పద్యములందలి భావములను, రచనలో గల రీతులను అనుకరించారో పద్యము లెత్తిచూపించినారు.

పోతరాజు బాల్యకౌమార దశల కాలమందు శైవమతము నవలంబించినవారే అనిన్నీ, పాల్కురికి సోమనాథుని గ్రంథాలు లెస్సగా చదివి ఉంటారనిన్నీ ఆరుద్రగారు తెలియజేస్తూ ''మందార మకరంద...'' అనే పద్యమందలి భావాలు, ఉపమానాలు బసవ పురాణమందును,



చతుర్వేద సారమందును గలవనిన్నీ చూపినారు (చూ : పుటలు 282-288). పోతరాజు ఆదశలోనే వీరభద్ర విజయం రచించాడనిన్నీ, అకాలమందే కాస్త వయస్కుడయిన తరువాత సర్వజ్ఞ సింగభూపాలుని ఆశ్రయం అతనికి లభించినదనిన్నీ, ''రాజాశ్రయంలోనూ, సానివాడలోనూ సమానంగా వున్న పోతరాజుగారు'' భోగినీ దండకం రచించినారనిన్నీ ఆరుద్రగారు తెలియజేసినారు. మరియొక విషయముకూడ ఆరుద్రగారు లెస్సగా పరిశీలించినారు. పోతరాజు తన కంకితం చేయలేదన్న కోపముకలన సింగభూపాలుడు, పోతరాజు పూర్తిగా రచించిన భాగవతమును భూమిలో పాతిపెట్టించడంచేత శిథిలమయిన దనిన్నీ, పోయిన భాగములు పోతరాజు శిష్యులు పూరించినారనిన్నీ కూచిమంచి తిమ్మకవి చెప్పినది కేవలము కల్పితమే కాని వాస్తవము కాదన్న విషయము ఇదివరకు చర్చించబడినదే కాని నూతనవిషయము కాదు. [illegible] ఇరువై సంవత్సరముల క్రిందట పిఠాపురం మహారాజావారి కోరిక ననుసరించి సింగభూపాలుని రత్నపాంచాలిక (కువలయావళి) అనే సంస్కృత నాటకమును అనువదించిన నాటకమునకు రచితములయిన పీఠికలలో నేను వ్రాసినదానిలో ఇతరులు చెప్పిన అంశములతోపాటు మరియొక అంశము తెలియజేసినాను. భూమిలో పాతిపెట్టిన గ్రంథమును పురుగులు తినడమే వాస్తవమయినయెడల ఆ పురుగులు తమకు అనువుగా నున్న భాగములన్నీ తింటవి కాని స్కంధముల వరుసను కత్తిరించినట్లు తినడం సంభవింపదు గదా! అని తెలియజేసినాను.

ఇంకా ఎన్నో విషయములు ఆరుద్రగారు లెస్సగా చర్చించి తమ గ్రంథము తెలుగువారి కందించి సాహిత్యసేవ చేస్తూ ఉన్నందుకు వారిని అభినందిస్తున్నాను. భగవంతుడు వీరికి ఆయురారోగ్యభాగ్య భోగము లొసగి వీరింకా ఇతోధికముగ సాహిత్య సేవ చేయునట్లు అనుగ్రహించును గాక! ఈ పీఠిక వ్రాయవలసిన దని కోరి ఇందులో నా అభిప్రాయములు వ్యక్తపరచుటకు అవకాశము కలిగించిన శేషాచలం అండ్ కంపెనీవారికి నేను కృతజ్ఞుడను. ఈ సంస్థ తెలుగు సాహిత్య వికాసమునకు ఎక్కువ తోడ్పడుతున్నందుకు సంతోషిస్తున్నాను. ఇది చిరకాలము వర్ధిల్లును గాక!

ఇతిశమ్!

హైదరాబాదు,
22-7-'65

గిడుగు వేంకటసీతాపతి.

# పీఠిక

'సమగ్ర ఆంధ్ర సాహిత్యం' ఒక సరసమనోజ్ఞకథనం. ఇందులో 'తొలిరాయలయుగము' అనే సంపుటానికి పీఠిక వ్రాయమని కోరిన మిత్రులు శ్రీ ఆరుద్రగారికిని, గ్రంథప్రకాశకులు శ్రీ యమ్. శేషాచలం అండ్ కంపెనీ వారికిని కృతజ్ఞురాలను. ఆరుద్రగారు అభ్యుదయకవి శ్రేణిలో చిటారుకొమ్మను పూచిన మిటారిపూవుగా సుపరిచితులైనప్పటికి వారి శేముషికి రెండు వాదర లున్నాయని అనుకోలేదు. కాల్పనిక మేఘాల్లో విహరిస్తూఉండే కవులు గద్యపాదలాంటి విమర్శకరంగంలో కాలు పెడతారనికాని, చాలాకాలం కాలు నిలద్రొక్కుకొని అక్కడ నిలబడతా రనికాని ఎవ్వరూ ఆశించరు. సంశయాత్ముల శంకలను వమ్ముచేస్తూన్న ఆరుద్రగారు అభినందనీయులు. చరిత్ర అంటే కైతోలకే స్త్రీసమాజంకూడా అప్యాయతతో చదివేటట్లు ఆంగ్లదేశచరిత్ర వ్రాస్తానని మెకాలే అను ప్రసిద్ధాంగ్లరచయిత ప్రతిజ్ఞ చేసి చాలావరకు కృతకృత్యుడయాడని అంటారు. ఆరుద్రగారి సమగ్రాంధ్రచరిత్ర ఈ కోవలోనికి చెందగిన గ్రంథమని నా విశ్వాసము. దీనిలో భాషాకాఠిన్యముగాని, కాలనిర్ణయచర్చల మకరవ్యూహాదులుగాని చాలా తక్కువ. ఇటువంటి చర్చలు నిరర్థకమని నేను అనను. వాటి తలపోలమునుండియే ఆరుద్రగారి కథనము ఆరంభిస్తూంది. కావున ఈ సంపుటములు ఏకొంచెము సాహిత్య పరిజ్ఞానమైన కల పాఠకులకు సుబోధకంగా ఉన్నాయి.

'తొలిరాయలయుగం' అనే పేరు బాగానే ఉన్నది. అయినా గజపతుల పేర ఒక సంపుటం వెలయగా నరపతుల పేర ఎందు కుండ రాదు? అందుగుల వెంకయ్య అనే కవి నరపతివిజయం వ్రాశాడు. అర్వీటివంశచరిత్రకదాకే దాని వాసిని పరిమితం చేశాడు. ఈ యుగంలో, అనగా 1450-1500 నడిమికాలంలో సాంఘికరాజకీయపరిస్థితులు అంత స్థిమితంగా లేవు. అశ్వపతి (బహమనీరాజులు) గజపతినరపతుల నడుమ వింధ్యకు దక్షిణాన ఆధిపత్యానికై త్రికోణయుద్ధము సాగుతూంది.

తొ.ము. ఆరవ సంపుటికి ఖండవల్లి లక్ష్మీరంజనం 'పీఠిక'

# పీఠిక

శ్రీ ఆరుద్రగారు మా తమ్ముని శిష్యులు. బాల్యమున విశాఖపట్టణములో చదువుకొనునప్పుడు తనదగ్గర కొంత సంస్కృత మభ్యసించిన సంగతి వారు కనబడినప్పుడెల్ల చెప్పుచుందురు. ఇట్లు బాల్యమునందలి అల్పకాలపరిమితమైన గురుత్వమును - అందును పాఠశాలాసంబద్ధమైనదానిని - మఱవక కృతజ్ఞతతో స్మరించుట ఈనాడొక గుణవిశేషమే అనవలెను. తద్ద్వారా వారు నాకు శిష్యప్రాయులైనారు. వారు సమగ్రాంధ్రసాహిత్యచరిత్రసృష్టికి పూనుకొనుచున్నట్లు తొలిసారి ప్రకటనమువలన ఎఱిగి చాల సంతసించితిని. వారి ప్రతిభ నిశితమైనదని నాకు తెలియును. పద్యకథావ్యాఖ్యాత్మకములైన వారి రచనలు చదివినప్పుడు, మనోరంజకములైన వారి ఉపన్యాసములు విన్నప్పుడు అది పుష్కలముగా గోచరించి, ఎంతో తృప్తినొసగుచుండెను. ప్రకటితములైన ఆరు సంపుటములను చదువగా వారు చేసిన అపారమైన కృషి, చూపిన అసాధారణమైన పరిశోధనపరాయణత్వము మరింత తృప్తి కలిగించినవి. వారు వట్టి కవియేకాక మంచి పండితుడు, పరిశోధకుడు అని అందలి ప్రతిపుటయు చెప్పకచెప్పుచున్నది. ఆధునికయువకవులలో పాండితీపరిశోధనలందు మక్కువగలవారి సంఖ్య తక్కువ. శ్రీ ఆరుద్రగారు వారికి శుభోదర్కమైన ఒక చక్కని బాట చూపినారు. చిరకాలము కళాశాలలలో సాహిత్యచరిత్రపాఠములు చెప్పువారెవ్వరో చేయదగిన ఈ మహాకార్యమును వారొక్కరు అతిసమర్థముగా నిర్వహించుచుండుట ఎంతయు ప్రశంసింపదగియున్నది.

మన వాఙ్మయమున విస్తృతములైన కవిచరిత్రలు రెండుమూడున్నవి. వానివలన ఆయాకవుల కాలాదులు, వారు రచించిన గ్రంథముల పేర్లు మాత్రమే తెలియును కాని వాని సాహిత్యపు విలువ సరిగా తెలియదు. సాహిత్యచరిత్రలుకూడ కొన్ని ఉన్నను అవి అతిసంగ్రహములైనవి; సామాన్యప్రజానీకమునకు సాహిత్యముతో పరిచయము కలిగింపవలె ననుదృష్టితో వ్రాయబడినవి కావు. అందుచే తెలుగువారికి సమగ్రమైన తమ వాఙ్మయము సారస్యము నంతను చూరయిచ్చు సాహిత్య చరిత్ర వ్రాయవలసిన ఆవశ్యకత మెంతో యున్నది. శ్రీ ఆరుద్రగారి ఈ ప్రయత్నమా ఆవశ్యకతను చక్కగా పూరించుచున్నది. సుమారు రెండేండ్లనుండి ఈ విషయమున వారు చేయుచున్న కృషి వారి మిత్రులు పలువురితోపాటు నాకును తెలియును. ఆంధ్రవాఙ్మయమునందలి పెక్కుకావ్యములను స్వయముగా చదివి విలువకట్టుటయేకాక వారు వానినిగూర్చియు, వాని కర్తలనుగూర్చియు ప్రకటింపబడిన గ్రంథములను, విమర్శలను, వ్యాసములను సమగ్రముగా పరిశీలించి, ఆ పరిశీలనఫలితమునిందు సరసముగా సంగ్రహించి, సమగ్రాంధ్రసాహిత్య మను నామమునకు సార్థక్యము చేకూర్చినారు. కవులు సాహిత్యచరిత్ర వ్రాయుటలో ఒక సౌకర్యమున్నది. వారు కవిహృదయమును చక్కగా ఎఱుగజాలుటయేకాక చరిత్రనుకూడ కమ్మని కవిత్వముగా జాలువారింతురు. ఈ చరిత్రలో అట్టి కమ్మదనము పెక్కుచోట్ల ఆస్వాదనీయ మగుచుండును.

ఇది మలిరాయల యుగము. క్రీ. శ. 1500 నుండి సుమారు డెబ్బది సంవత్సరములు ప్రౌఢసుందరముగా సాగిన ఆంధ్రసాహిత్యముచరిత్ర. సాహితీసమరాంగణసార్వభౌముడు శ్రీకృష్ణదేవరాయల ఉదారపోషణమును పొందినకతమున ఇది స్వర్ణయుగమైనది. ఈ యుగమున కావ్యములెంత ఎక్కువగా సృష్టింపబడినవో అంత ప్రౌఢములై పరిఢవిల్లినవి. నిజమున కాంధ్రవాఙ్మయమునందలి కవితాప్రౌఢిమను ఆస్వాదింపవలెనన్న - అందలి ఆలంకారికరచనాసౌష్ఠవము నాని ఆనందింపవలెనన్న - అందలి కవుల భావనాపాండితీశౌండీర్యము చవిచూచి పరవశింపవలెనన్న - ప్రబంధములనే పఠింపవలెను. ఆంధ్రవాఙ్మయమహోద్యానమున ప్రబంధయుగము పూదేనియతేటికాలువలచే, పరిపక్వఫలరససంపదలచే, సురభిళకుసుమవిసరములచే పఠితృపాంథుల మనోనయనేంద్రియముల కానందోల్లాసములు కలిగించు హృద్యమైన ఉద్యానవనము. అందు చొచ్చినవారికి లోకమే స్వర్గమై ఆనందబ్రహ్మసాక్షాత్కారమగును. శ్రీ ఆరుద్రగా'రుద్వేలనిర్యాణభవ్యరసాస్వాదరసాయన'మైన ఆ కావ్యసౌందర్యమునిందు రెండువందల అరువదినాలుగు పుటలలో అందిచ్చినారు.

**తొ.ము. ఏడవ సంపుటికి దివాకర్ల వెంకటావధాని 'పీఠిక'**

మొట్టమొదట వారీ యుగమునందలి రాజకీయపరిస్థితుల పర్యాలోకనము కావించినారు. సాహిత్యముపై సమకాలిక మత సాంఘిక రాజకీయ పరిస్థితుల ప్రభావ మధికముగా నుండును. అందుచే వాని నన్నిటిని కలిపి సమీక్షింపవలసిన అవసర మున్నది. వైచరాజు వెంకటనాథుడు పంచతంత్రములో చెప్పినట్లు ఈ యుగమున పెంటివిద్యల ఆదరణము అంతరార్పణ మెట్లయ్యెనో, అది ప్రబంధములలో ఎట్లు ప్రతిఫలించెనో వారు చక్కగా సూచించినారు.

కవుల కాలములను నిర్ణయించుటలోకూడ శ్రీ ఆరుద్రగారు చేసిన కృషి శ్లాఘనీయము. ఉన్న అభిప్రాయముల నన్నిటిని పరిశీలించి అంతరసాక్ష్యము దేనిని బలపరచునో దానిని వారు నిష్పక్షపాతముగా ప్రకటించినారు. పినవీరభద్రుని పూర్వకవిస్తుతిలో నుతించిన కారణమున వారు గోపరాజు 1500–1530 వరకు జీవించియుండునని నిర్ణయించినారు. రాయలవారి భువనవిజయసభలో నుండిన అష్టదిగ్గజకవు లెవ్వరో ఇంతవరకును నిర్వివాదముగా నిర్ణీతము కాలేదు. అస లా యెనమండుగురు ఆంధ్రకవు లగుదురో కారో అను విషయమునకూడ భిన్నాభిప్రాయము లున్నవి. శ్రీ ఆరుద్రగారు పూర్వవిమర్శకుల అభిప్రాయము లన్నియు సూచించి నిర్ణయము పాఠకులకు విడిచినారు. సందిగ్ధమైయున్న ఈ విషయమున ఇంతకన్న చేయదగిన దేమియు లేదు. శ్రీ ఆరుద్రగారు అయ్యలరాజు రామభద్రుని విడిచి పుత్తేటి రామభద్రుని ఆ ఎనమండుగురిలో చేర్చుట యుక్తిసహ మగనే యున్నది. అట్లే విష్ణుమాయానాటకకర్తృత్వమునుగూర్చిన చర్చయు హేతువాదపూర్వకమై యింపునింపుచున్నది.

ప్రతికవి కావ్యమునందలి కథాంశములను వివరించుచునే వారు కావ్యవిమర్శకూడ కావించియున్నారు. ఆయా కావ్యములందలి రసవంతములైన పద్యములను ఉదాహరించి వాని సౌందర్యమును ప్రకటించినారు. లోకమున ప్రసిద్ధములై యున్న కథలను, చాటుపద్యములను అక్కడక్కడ సూచించి వానికి సమన్వయము కావించినారు. తత్కాల ప్రవృత్తు లా కావ్యములలో నెట్లు ప్రతిఫలించుచున్నవో విశదీకరించినారు. రాయలవారి ఆముక్తమాల్యదనుగూర్చి వారు చేసిన సమీక్ష సరసమును, సమగ్రము నై యున్నది. మనుమంచిభట్టు అశ్వలక్షణసారము తప్పు లేల వ్రాయవలసివచ్చెనో వారు సూచించిన హేతువు సమంజసముగా నున్నది. చరిగొండ ధర్మన్నను, నాదెండ్ల గోపమంత్రిని ఒక్కచో చేర్చుట ఉచితమే. ధర్మన్న తన కావ్యమునకు మూలము బ్రహ్మాండపురాణ మని చెప్పెను- కాని అది పరిశీలింపవలసి యున్నది. బ్రహ్మాండపురాణమున ఆ కథ కనిపించుట లేదు. కథాంశవిమర్శతో పాటు రసపాత్రపోషణ పరిశీలనముకూడ నింక కొంచెము విపులతరముగా నుండుట వాంఛనీయము.



సదాశివరాయలతో మలిరాయల యుగము ముగియుట కతన భట్టుమూర్తి, సూరన, రామకృష్ణుడు మున్నగు మహాకవుల నిందు చేర్చుట కవకాశము లేకపోయినది. గ్రంథపరిమాణదృష్టితో నారిభట్టు, వెన్నెలకంటి సూరన్న మున్నగువారి 'ఇతరకవు' లను పేరుతో సూచించి మాత్రము విడిచివేయవలసివచ్చినది. శ్రీ ఆరుద్రగారు చెప్పినట్లీయుగమున సాహిత్య 'మేనుగుపాడి', సంపుటముల సంఖ్యను దృష్టిలో నుంచుకొని చెప్పవలసిన విషయములను చెప్పమానినచో సమగ్రతకు భంగము వాటిల్లును.

ఇందలి రచనాపద్ధతినిగూర్చి ఒక్క మాట చెప్పి విరమింతును. రచన సర్వత్ర సరళమై, భావగంభీరమై, విశదమై, కథవలె సామాన్యులకుకూడ చదువవలెనను ఆసక్తి కలిగించుచున్నది. విమర్శ నిష్పక్షపాతము, సత్యనిష్ఠము నై అలరారుచున్నది. "అతని వికటనేత్రాలనుండి కారిన రక్తాశ్రువుల వేడివల్ల రాయల కీర్తికాంత పాదాల లత్తుక లావాగా మారింది. రాయల పత్తుకలో కత్తులు పాటపాడాయి" వంటి వాక్యములు కవిత్వమును గుబాళింపజేయుచున్నవి. మా తమ్ముని శిష్యుడు సాహిత్యచరిత్ర నింత సరసమంజులముగా వ్రాయగలవాడైనందు కానందముతో పులకరించుచు, దీని నింత రమ్యముగా ప్రకటించుచున్నందుకు యం. శేషాచలం కంపెనీవారి నభినందించుచు, మిగిలిన సంపుటములనుకూడ త్వరలో చదువవలె నను ఉత్కంఠతో ఉవ్విళులూరుచు, ముగించుచున్నాను.

బరకత్పుర,
హైదరాబాదు
2-10-65

దివాకర్ల వేంకటావధాని

# పీఠిక

శ్రీ ఆరుద్రగారి యీ 'సమగ్రాంధ్రసాహిత్యం' అపూర్వమైన, అసాధారణమైన రచన. ప్రయత్నం గొప్పదా, ఫలసిద్ధి గొప్పదా అని ఆశ్చర్యపడవలసిన పెద్ద పనితనం.

మరి విశేషమేమంటే, ఇప్పటి మునిసిపల్ పార్కులవంటి 'దేశి' వాఙ్మయవీధులలో స్వచ్ఛందంగా ఈదులాడుతూవుండిన ఆరుద్రగారు ఉన్నదున్నట్టు ఈ 'మార్గ' కావ్యమహాటవిలో ముండ్లనక, రాళ్ళనక పరిశోధనకు దిగి, పెడముఖం పెట్టకుండా ధీరంగా, దీర్ఘంగా ప్రయత్నం సాగిస్తావుండేది! ఈ సాహసకార్యంలో వారికి అప్పుడప్పుడు తమ అధునికరచనాలీలలు విశ్రాంతిస్థానాలుగామాత్రం ఉపకరించిందేమో అనిపిస్తుంది. సద్దు లేకుండా ఎన్నేండ్లుగానో ఈ పరిశోధనప్రయాస సాగుతావుండవలెను. లేకపోతే ఈసిద్ధి ఇంత సార్వభౌమంగా రూపొందదు.

రెండుచేతులా 'శాపాదపి శరాదపి' అన్నట్లు వీరు సాధిస్తావుండే యీ పరిశోధనలో మొదటిది కవి-కర్తల చరిత్ర. నూరేండ్లకుమించి పెద్దలు, చిన్నలు ఎందరో ఈ విషయం చర్చిస్తావున్నారు. 'కనుక ఇదేమంత కష్టమైన పనా?' అని ఒక మిత్రులన్నారు. కాని అది అన్యాయంమాట. మన కవుల చరిత్ర చాలాభాగం వేర్లు చేతికందకుండా పెరిగిన తీగపాద. ఎక్కడ వేలుపెట్టినా కథల, కింవదంతుల, అభిమానాల ముండ్లు వచ్చుకోక తప్పదు. ఈ విషయంగా రాసిన గ్రంథాల, వ్యాసాల రాశిని-అచ్చైనవీ, కానివీకూడా-సంగ్రహించి కడముట్టా చదివి అవిటిలోని సారాసారాలు తేల్చుకోని, ఆయాకవుల కావ్యాలు సొంతంగా చూచి కొత్తవిషయాలు కనిపెట్టి కూర్చుకోని, వంశవృక్షాల పౌర్వాపర్యం నిర్ణయించుకోని స్వతంత్రసిద్ధాంతం చేసేదంటే చిల్లరపనికాదు. ఆరుద్రగారు ఆ పని ఓరిమితో శ్రద్ధతో చేసినారు.

రెండోది ఆయాకవుల కాలపు సాంఘికవిపరిణామాల, విప్లవాల ప్రభావం, వాండ్ల వాండ్ల ప్రతిభలు పారిన దారి, వాండ్ల ఉపజీవ్యోపజీవకభావం, వారి కడుపుకక్కురితి-ఇత్యాదుల అన్యోన్యాశ్రయగుణదోషాల నీడలు ఆయారచనల్లో ఎంతమాత్రం పడిందో చూచే ప్రయత్నం. భావాశ్రయమైన యీ విమర్శ ఇంతవనకా చరిత్రకారులు ఎవరూ కావ్య



చిక్కంగా తప్ప క్రమంగా చేసింది కాదు. ఇందులోనూ ఆరుద్రగారి పరిశ్రమ స్వతంత్రం; శ్లాఘనీయమున్ను. ఇందుకని వారి కెంత అభివందించినా తెలుగువారి కృతజ్ఞతాధర్మం తీరదు.

కాని ఒట్టుమీద పై రెండు మహావిషయాలలో మొదటిదే ఈ సంపుటాల్లో ఎక్కువభాగం ఆక్రమించిందేమో అనిపిస్తుంది. కాని అది విషయమహత్వదోషం; గ్రంథకర్తది గాదు. ఏకకాలికంగా రెండు పెద్దపనులకు చేయిపెట్టే ఏదోవొకటి గౌణం కాకతప్పదు మరి. రెండవదే ముఖ్యంగా ఈరచన సాగించే తెలుగువారి సాహిత్యానుభవసంస్కారానికి శ్రీ ఆరుద్రగారి సహృదయభావాలు ఎంతో దోహదమిచ్చివుండేవి. కాని యిప్పుడేర్పరచుకొన్న సంపుటాల నియమంలో, కాలపరిమితిలో ఇంత జరిగిందే వింత.

కవిచరిత్రవిషయంలో సహేతుకమై స్వతంత్రమైన నిర్ణయాలు చేసినా ఈగ్రంథంలో, అనూచానంగా వచ్చిందే పద్ధతులను ఒకటి రెండు చోట్ల గ్రంథకర్తగారు అట్లనే సాగనిచ్చినారని తోస్తుంది. ఒక వుదాహరణం :—

పింగళిసూరన్న కృష్ణదేవరాయల అష్టదిగ్గజాలలో ఒకడుగా వుండే వీలులేదని కొందరు నమ్మినారు. ఆరుద్రగారూ దాన్నే స్థాపిస్తూ "విశ్వసాహిత్యంలోని ఈ కోవకు చెందిన సూరపరాజుగారు కృష్ణదేవరాయల అష్టదిగ్గజాలలో ఒకరు కాకపోతేనేం ?" (8-228) అని నిగమించినారు. కాకపోతే ఏమీలేదుగాని అయ్యుండగూడదా అనే ప్రశ్నమాత్రం నాకు మిగిలేవుంది.

సూరన్నకాలం నిర్ణయించేదాంట్లో ఒక పెద్ద ఘట్టముంది. దాన్ని చదును చేయడం చిక్కు. అళియరామరాయలు కృష్ణదేవరాయల అల్లుడుగదా. కనుక సమకాలికుడు. రామరాయలు అర్వీటి బుక్కరాయల పౌత్రుడు, రెండవపెండ్లాముసంతతిలో. సూరన్నగారి కళాపూర్ణోదయ కృతిభర్త నంద్యాల కృష్ణమరాజు పై బుక్కరాయల మొదటిభార్య సంతతిలో మునిమనమని మనమడు. అంటే ఒకభార్యవంశంలో అయిదోతరంమనిషీ, రెండోభార్యవంశంలో మూడవతరంవాడూ ఒక కాలంలోనే కృష్ణదేవరాయల సంస్థానంలో వుండగలరా అనేది చారిత్రిక చిక్కు.

**తొ.ము. ఎనిమిదవ సంపుటికి రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ 'పీఠిక'**

నా కేమో ఉండవచ్చు ననిపిస్తుంది. నిస్సందేహమైన నా జీవితంలో పోల్చుకుంటే చాలు నా వూహకు బలం హెచ్చుతుంది. మన్నించండి-ప్రకృతోపయోగిరైన నా వంశవృక్ష మిది:

అనంతాచార్యులు

(పెద్దభార్య శింగమ్మ) | (రెండో భార్య లక్ష్మమ్మ)

లక్ష్మమ్మ — అలమేలుమంగమ్మ

నరసింహాచార్లు — నేను

లక్ష్మీనరసమ్మ

లక్ష్మీదేవమ్మ

రఘునాథం

అతని చిరంజీవి

నా తాతగారిని నే నెరుగను. ఆయన గతించిన పదహారేండ్లకు నా జన్మం. ఇప్పటి నావయస్సు ౮౩. ఐతే మా పెద్దక్కగారి మొదలు క్రిందంగా ఆ పరంపరలో అందరినీ నేను చూచినాను. ఇంకొక తరంగూడా చూడవచ్చునేమో? కన్యాశుల్కమిచ్చి పెండ్లిండ్లు చేసుకొనే పూర్వ కాలంలో, కలిగినవారు కొడుకులకు పదహారేండ్ల లోపలి ప్రాయంలోనే వివాహసంస్కారం జరిపేది, సమానస్కంధులతో వియ్యాలు జరపవలసిన కారణ వంశాలలో తగిన సంబంధాలు దొరకనికారణంగా కొడుకుల, కూతుళ్ళ వివాహకాలం అనిశ్చితంగా ముందుకు పోయేది, సామాన్యమైన ప్రాచీనసాంఘికవ్యవహారాలే అనుకొంటే తప్పేమీ ఉండదు. గాబట్టి తలా ఇరవైయేండ్లు సగటు పంపకం శాస్త్రీయమైనా సత్యానికంటే సందేహానికే యెక్కువ అనుకూలించే పద్ధతేమో!

కొన్ని వ్యాప్తిలో వున్న అభిప్రాయాలను తరచి చూడకుండా ఆరుద్రగారు ఇందులో చేర్చినారు. కొన్నిటిని పేర్కొంటాను.

(౧) (౧ సం. వు. ?) 'చెంబు' అనే పదంలో వుండేది 'బు' ప్రత్యయం కాదు. 'చెంబొన్' అంటే ఎర్రని లోహం - రాగి. స్వర్ణం అంటే బంగారంకాక దానితో చేసిన నాణ్యంగూడా అర్థమైనట్లే 'చెంబొన్' 'చెంబు'గా మారి తామ్రపాత్రగా, అదీ ఒకరకమైనదిగా, వాడుకపడింది. మరి ఇది "అసలు సిసలు తెలుగుపదం" అని అనుకోలేం. అరవ-మళయాళాల్లో 'శెంబు,' కన్నడంలో 'చెంబు'. మరి శ్రీ ప్రభాకర శాస్త్రిగారు గుర్తించిన అక్షరాలు 'నాగబు' అన్నదాన్ని ఎవరూ కాదనలేరు. ఆయనప్రామాణికత్వం అట్లాంటిది. కాని అమరావతీ స్తూపం ముగియడానికి పట్టిన నన్నూరేండ్లలో ఆ రాతిపలకమీది ఆ మూడక్షరాలు ఏకాలంవో, ఏభాషో, ఏమర్థమో! అప్పటికే 'నాగ' పదానికి సంస్కృతంలో ఎన్నో అర్థాలు వచ్చినాయిగదా!

(౨) (౧-౩౭) కందం "తెలుగువాళ్ళనుంచి ప్రాకృతంలోకీ, ప్రాకృతంలోనుంచి సంస్కృతానికీ వెళ్ళింది." చాలా పెద్దమాట! పింగళాచార్యుడు లక్షించి ఉదాహరించిన పద్యం ఆర్యాగీతియే తెలుగు కన్నడాల కందం. పింగళుడు ప్రాచీనుడుగా ఇతిహాసపురాణప్రసిద్ధుడు. పాణినికాలంవాడని కొందరి మతం. ఇంకా పాతవాడనీ అనేవారున్నారు. అతడిచ్చిన లక్షణం "అర్ధే వసుగణ ఆర్యా గీతిః" (౪-౩౧) ఇచ్చిన లక్ష్యం చూడండి:

"అజమజరమమరమేకం ప్రత్యక్చైతన్య మీశ్వరం బ్రహ్మపరమ్
ఆత్మానం భావయతో భవముక్తిః స్యా దితియ మార్యా గీతిః"

ప్రాకృతలాక్షణికులు దీనికి 'ఖందయ' అని పేరుపెట్టినారు. 'స్కందకం' అని దాని సంస్కృతోచ్చారణ. ఎప్పుడు, ఎందుకు ఈ పేరు మార్పు కల్గిందో తెలియదు. అదే 'కందం'గా తెలుగుకన్నడులు వాడినారు. ఈ రూపపరిణామాన్ని కందం - ఖందయం - స్కందకంఅని తల్లక్రిందులుగా చూచుకొమ్మని సూచిస్తారు ఆరుద్రగారు! కర్నాటకులు ప్రాసమాత్రమే, తెలుగువారు యతినిగూడా, దాని కతికించినారంతే. 'సేతుబంధం' వంటి ప్రాకృతప్రాచీనకావ్యాలు కొన్ని యీ ఆర్యాగీతిలోనే ప్రాయశః నడిచినవి. ఇతరార్యాభేదాలవలెగాక ఇది రెండుసగాలలోనూ ఒకే ప్రమాణంతో శ్లోకంగా వుండేది దీని వ్యాప్తికి ముఖ్య కారణం కావచ్చు. తాము వాడిన సంస్కృతవృత్తాలన్నిటికీ తెలుగువాండ్లు మూలంలో లేని యతిప్రాసలను దిగగొట్టినారు. అంతమాత్రాన

శార్దూలం, స్రగ్ధర మొదలైన వృత్తాలన్నీ తెలుగునుంచే సంస్కృతానికి ఎగబాకిన వనుకునే అల్పసంతోషిత్వానికి నేను నోచుకోలేదు. మరి ఒక దేశంవారికి కొన్ని ఛందస్సులమీదనే అభిమానమూ, అభ్యాసమూ కలిగేందుకు సంప్రదాయభక్తి ముఖ్యకారణ మనేది నిజం.

(౩) "ఆదిలో శ్రీరామచంద్రుడంతటివాడు దేశిని ఈసడించి మార్గపద్ధతిగానాన్నే మెచ్చుకొన్నాడంటే మధురకవితలు ఎటువంటి పరిస్థితిలో ఉండేవో ఆలోచించుకోవచ్చు" (౧-౧౦౦) పాపం! శ్రీరామచంద్రుడికిగాని, వాల్మీకికిగాని యీ భావమే లేదు. కుశలవులు 'మార్గవిధానసంపదా' పాడిరని మాత్రమే అక్కడున్నమాట. వాండ్లు "దేశిపద్ధతిని పాడుతూ అభినయించసాగారు. ఆ గానానికి సదస్యులందరూ ఉప్పొంగిపోయారు. తన్మయులు అయినారు. అప్పుడు రాముడు ఆ కుశలవులను చూచి 'మార్గపద్ధతిన ఆ మహాకావ్యమును గానంచేయు'మని చెప్పాడు" అని శ్రీనివాసశిరోమణిగారి వాల్మీకి రామాయణానువాదంలో ఉందట! ఉంటే వుంటుంది. కాని ఆ వాల్మీకిమూలాన్ని కూడా ఒకమారు చూచింటే ఆరుద్రగారు ఈ అపవాదం రాముణి నెత్తిన వేసిందరు.

ఇట్టివి మరికొన్ని సూచించి విడుస్తాను.

(౪) (౧-౧౦౮) "శంకరాచార్యులు బుద్ధుడిని విష్ణుమూర్తి తొమ్మిదవ అవతారం చేసి జనసామాన్యాన్ని మంత్రముగ్ధుల్ని చేసినారు"

(౫) (౧-౧౧౦) బాలచరితం భాసుని భారతనాటకం.

(౬) (౧-౧౨౯) "ఈ సూక్తులు మూలంలో లేవు." ఉన్నవి. చూడండి ౧-౪౨-౭,౯ శ్లోకాలు.

(౭) (౧-౭౭) "మన ఆడవాళ్ళ పాటలన్నీ తరువోజలోనే ఉంటాయి"

(౮) (౨-౯౪) "తిక్కన్నది ఆనాటి శిష్టవ్యావహారికం" భావాలనూ శయ్యలనూ వ్యావహారికానికి సమీపంగా దించేది మహాకవుల లక్షణం. భాషారూపాలనుగూడా అట్లనే మార్చే మహాకవి కానరాడు, నాకు. కొన్నిటిని పరిగ్రహించివుండవచ్చును. అంతే.

(౯) (౨-౧౩౨) తిక్కన్నభారతం ఆనందపదాంకిత మనేది మొదట నేనే గమనించింది; రామలింగారెడ్డిగారు కాదు—నే నెరిగినంత



వరకు. మరి ఇదొక్కగొప్పగా నే నాయనతో చెప్పలేదు. ప్రాస్తావికంగా అన్నమాట మిత్రుడు జి.యస్. గారు అరచెవితో విన్నట్టుంది. కావ్యాలను అభిమానికపదాంకితంగా సంస్కృతంలో భారవి-మాఘాదులవలె తెలుగులోనూ కొందరు చేసినట్లుంది. తిక్కనవలె హరిహరోపాసకుడైన కొరవిగోపరాజు తన 'సింహాసనద్వాత్రింశిక'ను 'స్వహూపా' అనే మాటతో అంకితం చేసినాడని ఈవలనే నాకంటికి తట్టింది.

(౧౦) (౫-౧౧౦) భోజుడు రామాయణచంపులో "కిష్కింధాకాండను వ్రాశాడట." ఐతే తక్కిన కాండలు రాసిందెవరట? యుద్ధకాండమాత్రం అతడు రచించలేదని సంప్రదాయం. అది పూర్తిచేసినవాండ్లు కొందరున్నారు. పుస్తకం చూచింటే ఈ 'అట' అక్కరలేకుండేది.

(౧౧) (౭-౨౦౨) పింగళి సూరన్న "పూర్వం లలాటేక్షణభక్తి శీలుడు. ఇప్పుడు (కళాపూర్ణోదయరచనకాలానికి) విశిష్టాద్వైతిగా మారాడు"—అది మార్పు అనలేము. నంద్యాలప్రభువులకై చేసుకొన్న దాక్షిణ్యం పెండ్లి. మరి ప్రభావతీప్రద్యుమ్నకాలానికి శివభక్తుడే అయినాడు. ప్రాయశః అల్లసాని పెద్దన్న, తెనాలిరామకృష్ణుడు మొదలైనవారిదంతా—ఒక తాళ్ళపాకవారిది విడిచి—ఇటువంటి కప్పుకొన్న వైష్ణవమే.

(౧౨) (౭-౯౦) వాసిరాజు రామయ్య 'గంగను వర్ణిస్తున్న' సీసపద్యం స్పష్టంగా వేసవిని వర్ణించేది. "ఘర్మసమయ మేచి పర్వె" అనే దాని ముగింపు. ఈ అపార్థం ఎట్ల కలిగిందో ఊహించలేను.

ఇట్లాంటి 'ధోరణి' అభిప్రాయాలు మరికొన్ని ఎత్తిచూపవచ్చు. పీఠిక సామాన్యస్వరూపాన్ని దాటి పైమాటలు రాసినందుకు ఆరుద్రగారు నన్ను మన్నిస్తారని నమ్మినాను. ఈ స్వాతంత్రం నాకిచ్చి అనుగ్రహించినవారు ఈ గ్రంథం ప్రకటించే మహాకార్యం నిర్వహిస్తావుండే శ్రీ యం. యస్. రావుగారు. ఆ యిద్దరు మహాశయుల ప్రయత్నసిద్ధులందు నాకుండే గౌరవవిశ్వాసాలే నా యీ అధికప్రసంగానికి మూలం. ఇది కుదృష్టిచేతనో, అసూయచేతనో చేసిన కాతస్కృత విమర్శ కాదు. ఇట్లాంటి మహాకార్యం తేజస్విగా వెలయవలెనని చేసిన సూచన.

తిరుపతి
21-12-65

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

# పీఠిక

ఇది తొమ్మిదవ సంపుటం. దీనిని పూర్వసంపుటాలవలెనే ఆమూలాంతం చదివినాను. శైలి, ప్రెసెంటేషన్ దృష్ట్యా చూస్తే ఇదికూడా ముందరి సంపుటములవలె పాఠకులను ఆకర్షిస్తుంది. పూర్వ కవిచరిత్రకారుల మార్గాన నడిచినప్పటికిన్నీ మునుపటివలెనే ఇప్పుడున్నూ ఆరుద్ర కొంత నవీనత్వాన్ని అగపరుస్తున్నాడు. సినిమారంగంలో ప్రవర్తించే భావకవి పాతకవుల కవిత్వాన్ని ఇంత అభిరుచితో గ్రహించి, అందలి న్యూనాతిశయాలను సమబుద్ధితో పరిశీలించి విమర్శించడం అరుదే. ఆరుద్ర ప్రయత్నము ప్రశంసనీయమే. అతనిని ప్రోత్సహించి సమగ్ర ఆంధ్రసాహిత్యాన్ని వ్రాయించి ప్రకటించి ప్రకాశకులు ఆంధ్రలోకానికి మహోపకారం చేశారు. అక్షరాస్యుడైన ప్రతి ఆంధ్రుడున్నూ చదువదగినదిన్నీ, చదువవలసినదిన్నీ అయిన పుస్తకం ఇది.

ఇట్లనడంవల్ల ఆరుద్ర రచనలో నాకు సంపూర్ణంగా అంగీకారం కుదిరిందని కాదు. అందులో లోపాలు లేవని కాదు. మొట్టమొదట— ఆయనప్లాను నాకు నచ్చలేదు. యుగవిభజన బహువిదూరంగా ఉంది. ఆరుద్రగారి యుగవిభజనం తెనాలి రామకృష్ణుని చిత్రలేఖనంవలె వికటంగా కనపడుతుంది. రెడ్లతో సంబంధం లేని కవులు రెడ్లయుగంలోను, పద్మనాయకుల పోలుపొందరుగని కవులు పద్మనాయకయుగంలోను వస్తారు. నవాబుల యుగం అని పేరు పెట్టినారు ఒక యుగానికి. సుల్తానుల యుగం అంటే యుక్తంగా ఉండేది. వచ్చిపోయి ఆంధ్రవాఙ్మయాన్ని ఆదరించి పోషించినవాండ్లు కుతుబుశాహీసుల్తానులు ఇద్దరు— మల్కిభరామున్నూ, ఆయనకొడుకున్నూ. "ఎ సింగిల్ స్వాలో డజ్ నాట్ మేక సమ్మర్" అన్నట్లు వీరిద్దరి మూలాన అది నవాబుల యుగం

తొ.ము. తొమ్మిదవ సంపుటికి నేలటూరు వెంకటరమణయ్య 'పీఠిక'

అవుతుందా? ఇది అరవీటిరాజుల యుగం—అరవీటి రాజులతో సన్నిహిత సంబంధం గల కవులకు కొందరికి ఈ సంపుటంలో చోటే లేదు. అళియ రామరాజుగారి ఆదరణను పొంది, 'రామరాజభూషణుణ్ని' అని గర్వంగా చెప్పుకొన్నాతడున్నూ, ఆయన తమ్ముడు క్రీ. శ. ౧౫౭౦-౭౧ లో రాయపీఠాన్ని ఆక్రమించుకొని ఒకయేటి కాలం విజయనగరసామ్రాజ్యాన్ని పాలించిన తిరుమలదేవమహారాయలకు తా రచించిన వసుచరిత్రను అంకితం చేసినవాడున్నూ అయిన భట్టుమూర్తిని, క్రీ. శ. ౧౫౮౫ ప్రాంతాన వీరవెంకటపతిదేవమహారాయల కెదురుతిరిగి ఆ రాయలచే నోటుబడి కారాగృహబద్ధుడైన నందెల కృష్ణమరాజునకు తన కళాపూర్ణోదయాన్ని అంకితం యిచ్చిన పింగళి సూరపరాజున్నూ ఈ యుగం కవుల్లోకి రారు; కాని, వాళ్ళకు పూర్వీకులున్నూ, సమకాలికులున్నూ అయిన రామరాజు రంగప్పరాజున్నూ, బొడ్డుచెర్ల తిమ్మనాను ఈ సంపుటంలో వస్తారు. మరిన్నీ ఇందు ప్రథముడుగా ప్రవేశపెట్టబడిన పచ్చికప్పురం తిరువెంగళరాజు అరవీటి యుగంవాడు కాదు; అచ్యుతదేవమహారాయల కాలం వాడు. మధురను క్రీ. శ. ౧౫౩౦ సంవత్సర ప్రాంతంలో పాలించుచున్న గొల్ల నాయకుల కాశ్రితుడు. ఇతన్ని అరవీటియుగంలో చేర్చడం సబబు కాదు.

అయిదవ సంపుటానికి పీఠిక వ్రాస్తూ అన్నారు గదా శ్రీ గిడుగు వెంకటసీతాపతిగారు—"ఆరుద్రగారు ఎంత శ్రమపడియైనా యాథార్థ్యం తెలుసుకోవలెనన్న పట్టుదలతో పరిశోధన గావించినారనిన్నీ, పక్షపాతం లేని విమర్శకులనిన్నీ, సదసద్వివేకం గలవారనిన్నీ గ్రహించాను. తగిన పరిశీలన లేక గతానుగతికంగా వస్తూ ఉన్న సిద్ధాంతాలు విమర్శించి వాస్తవమైన దేదో నిరూపించడానికి ప్రయత్నించినారు" అని. నాకు కూడా కొన్ని రిజర్వేషన్లతో యిటువంటి అభిప్రాయమే ఉండినది. కాని ఈ సంపుటాన్ని చదివిన తరువాత అట్టి అభిప్రాయం సమంజసమైనదా అన్న సందేహం పుట్టింది. ఎందువల్లనంటే యీ సంపుటంలో



కదాచిత్తుగా ఎక్కడనో ఒకచోటతప్ప వీరి సొంత అభిప్రాయం కనపడదు. సర్వేసర్వత్ర చాగంటి శేషయ్య ఉవాచ, బులుసు వెంకటరమణయ్య ఉవాచలే కనబడుతున్నవి. వీరిద్దరున్నూ అంత విశ్వాసపాత్రులైన విమర్శకులని అనుకోవడానికిన్నీ వీలులేదు. దీనికి కారణం ఏమని తోస్తున్నదంటే ఆరుద్రగారు ప్రైమరీ సోర్సులతో పరిచయం కలిగించుకోలేదు. వేగిరపడి రచించడంవల్లనో, ప్రైమరీసోర్సు అందుబాటులో లేకపోవుట చేతనో, మరి యేకారణంచేతనో సెకండరీసోర్సులతో సంతృప్తిపడ్డట్లున్నది. ఈసంపుటంలో 210-262 పుటలవరకు గ్రంథము ఒక చిన్న డిస్క్రిప్టివ్ క్యాటలాగవడానికి తగివుంది. క్యాటలాగు కూడా చదువరులకు ఉపయోగపడుతుందికదా. ఇంకొక మాట. ఇటీవలి కవిచరిత్రకారులకు లక్షణగ్రంథాల్లో పేర్కొనబడివుండే కవులనూ, చాటుపద్యాల రచయితలనూ గూర్చిన విషయం—యేమీ లేకపోయినా—వ్రాయడం అలవాటైంది. ఇది కేవలం పేజీల పెంపకానికేనని నేననుకొంటాను. ఆరుద్రగారి గ్రంథంలోకూడా యిటువంటి రచన కొంత కనబడుతూవుంది. ఇంతదూరం ఎందుకు చెప్పాను అంటే ఆరుద్రగారి వంటి ఉత్తమశ్రేణికి చెందిన కవిచరిత్రకారులు ఆదర్శప్రాయమైన గ్రంథాలను తయారుచేస్తే బాగా వుంటుందని నివేదించుకోవడానికే. మొత్తంమీద యీ సంపుటం యింతకు ముందు వెలువడినవాని పంక్తిలో చేర్చదగినదే. ఆంధ్రవిద్యావిశారదులయొక్క ఆదరణకు పాత్రమైనదే.

హైదరాబాదు
14-2-66

నేలటూరు వెంకటరమణయ్య

# పీఠిక



నాయక రాజుల యుగం ఆంధ్రసాహిత్యచరిత్రలో ఒక స్వర్ణయుగమని—ఇంకా చెప్పవలెని వస్తే వజ్రయుగమని—అనవచ్చును. రాయల యుగంలో ఆంధ్ర కవులకూ, సాహిత్యానికీ కలిగిన ఆదరప్రోత్సాహాలు ఈ నాయకరాజుల యుగంలో మరికొంత విస్తరిల్లాయి. అంతే కాదు; సాహిత్య వికాసము సర్వతో ముఖంగా ప్రత్యక్షమయింది. చేమకూరకవి చెప్పినట్టు ఈ కాలములో

మాటల చేతవ్వలా, సరసమార్గములా, కొలువుండురీతులా_పాటల గంధులా, కళల భాగ్యములా, బహుదానవేలిలా_ నాటకశాలలా......

అనిన్నీ, 'సమస్త విద్యలు కనబిల్ల బాసి మెరసై వెలపెట్టి సభాంతరంబులన్' అనిన్నీ చెప్పిన మాటలు చారిత్రక సత్యాలు; వీటికి తోడు ఆరుద్రగారు స్వయంగా తంజావూరు వెళ్లి ప్రత్యక్షంగా చూచి తెలుసుకొన్న స్థానిక విషయాలనేకము. ఇన్ని విషయాలు సమకూడినప్పుడు

'ఈనికి శృంగారవనమట, ఒంటి వగలె
నట, విరహీ యట, ఎంత సేయును కీరిటి'

అని కవి అన్నట్టు మనము ఈ సాహిత్య చరిత్ర నవ్యసాచిని-ఆరుద్రగారిని-గూర్చి "ఎంత వ్రాయదు చరిత్ర" అనవచ్చునేమో! ఇంత వరకు కొంత కదం తొక్కుతూ సాగిన ఆరుద్ర కలము గ్యాలప్‌లోనికి మారింది.

దీనికి తోడు ద్విపద భారత కవిత్రయము, ఎలకూచి బాలసరస్వతి, పుష్పగిరి తిమ్మన్న అతని కవిమిత్రులూ మొదలైన విషయాలు చేర్చినందు వల్ల ఈ యుగసాహిత్య వికాసానికి ఒక పూర్ణత సమకూరింది. బాలసరస్వతిని గురించి, తిమ్మన్నను గురించి చాల పరిశ్రమ చేసి అనేక నూతన విషయాలను రచించి తెలుగు సాహిత్యానికి ఎనలేని ఉపకారము చేశారు.

ఇంక ఆంధ్రశబ్ద చింతామణి విషయం. ఆరుద్రగారు వ్రాసినదానిని పట్టి ఈ సారంగధర కథ మాళవదేశానిది. ఆ కథ కొందరు కవులలో చేతులు మారింది; దానితో రంగస్థలమూ మారి ఆంధ్రకువచ్చింది. ఈ కవులు కథలోని ఒడుదుకులకు ఆస చేసినవారే గాని, చారిత్రక విషయాలను వ్రాయాలన్న తలంపు కలవారుకాదు. ఈ సారంగధరుడుగాని చౌరంగిగాని మనవాడు కాదు. వానికి నన్నయభట్టు వ్యాకరణం చెప్పాడన్నమాటా అసత్యమే. దానిని 400 సంవత్సరాలు సిద్ధుడు దాచిపెట్టి బాలసరస్వతి కిచ్చాడనడం అంతకంటె నమ్మశక్యము కాదు. బాలసరస్వతి మహా మహోపాధ్యాయుడు-ఉద్దండపండితుడు. ఆ రోజులలో అథర్వణ కారికలు, అహోబల పండితీయము మొదలగువాని మీద ఆంధ్ర కవుల దృష్టి లగ్నమవుతూ ఉండేది. వాటిలో ఒక ప్రశస్త స్థానాన్ని ఆశించి బాలసరస్వతి మూల శ్లోకాలను వ్రాసి నన్నయ పేరు పెట్టాడనడంసత్యం. ఆ 400 సం॥లలో ఆంధ్ర సారంగధర కథ బహుళ వ్యాప్తిలోనికి రావడం వల్ల బాలసరస్వతి అదే నిజమనుకొని ఉంటాడు. అనగా మొదటి అసత్యం మీద నిర్మించిన మహా సృత మిది. సాహిత్యములో మహా తెంపరితనముతో కూడిన "కూట కల్పన" (లిటరరీ ఫోర్జరీ). ఇటువంటి దానిని నిష్కర్షగా ఖండించకుండా ఆరుద్రగారు గారు విడిచి పెట్టడం వారి సౌమ్య స్వభావాన్ని ప్రకటిస్తుందిగాని, అసత్య ఖండనాభిలాషను తెలిపేయదు.

తరువాత తాళ్ళపాక తిమ్మక్కగారి కర్తృత్వము. ఇదొక పండిత ప్రమాదంగా చేశారు వేటూరి ప్రభాకర శాస్త్రిగారు. 1950 లో తాము తిరుపతిలో ముద్రింపించిన సుభద్రా కల్యాణము (తాళపత్రంలో 'సుభద్రా బరిణము' అని ఉంది) పరిష్కర్త దానిని సుభద్రా పరిణయము అని ఉంచడం న్యాయము. ఈ ద్విపద స్త్రీల పాటను శాస్త్రిగారె మొట్టమొదట సారిగా అచ్చు వేస్తున్నామనుకొని ప్రమాదానికి లోనయారు. ఆ తిమ్మక్కను సంగీత సాహిత్యచతుర అని ప్రశంసించారు. ఈ ప్రశంసకు ఆధారము ఎంత ప్రయత్నించినా కనబడలేదు. తాళ్ళపాకవారి సంకీర్తనలు కొన్ని వేల సంఖ్యను ఉద్ధరించినవారు శాస్త్రిగారు. సాహిత్య విషయాల పరిశోధనలో అరితేరి, ఆంధ్రుల కెంతో మేలు చేశారు. వారు ఈ తిమ్మక్కను గురించి చెప్పిన మాటలు ఆధారసహితములయిన సత్యములే అని మన పండితులు, పరిశోధకులు, అధ్యాపకులు అందరు పెద్ద ఐన్ను ప్రమాదములో చిక్కి పోయారు. వారందరు శాస్త్రిగారి సిద్ధాంతము సమంజసమనే అనుకున్నారు.

కాని, ఇది ప్రథమ ముద్రణం కాదు. 1910 లో గోదావరి జిల్లాలో ఈ స్త్రీలపాట ముద్రణ జరిగింది. అప్పటికి తాళ్ళపాకవారంటె అభిమానదురభిమానా లేమీ ఉండడానికి ఆస్కారం లేదు. దానిని రచించిన వ్యక్తి
"ధరకవి తాళ్ళపాక తిమ్మప్ప చెప్పెను విష్ణు కథగను జగతిలోపలను"
అని చెప్పుకున్నాడు. తిమ్మక్క
"అవనిలో తాళ్ళపాకన్నయ్యగారి తరుణి తిమ్మక్క చెప్పె తాను సుభద్ర కల్యాణ మను పాట......"
అని చెప్పుకుంది. అసలు తాటాకు గ్రంథంలో ఉన్నదేమంటె,

"ధరలోను తాళ్ళపా కన్నయ్యగారు
ధరను తిమ్మక చెప్పె ధరలోను వెలయ"

తొ.ము. పదవ సంపుటికి తాపీ ధర్మారావు 'పీఠిక'

అది తరుణి కావచ్చు! తనయ కావచ్చు కదా! దీనిని పట్టుకొని తన కుందేటికి మూడేకాళ్ళని వేటూరివారు ప్రయత్నించారు.

దీనిలో నిర్ణయం కావలసిన విషయాలు చాలా ఉన్నాయి.

1. ఈ తాళ్ళపాక అన్నయ్యే సంకీర్తనాచార్యవర్యు డయి, దినముపాడిన పాట మరల పాడకుండ, దాదాపు 30 వేల కీర్తనలు పాడిన వాడని వారు భావించారు. అంత ప్రసిద్ధిపొందిన మహా భాగవతోత్తముని పేర్కొన్నప్పుడు 'అన్నయ్యగారు' పాడిమాటలలో, ఆ తిమ్మక్క తన భార్యయే అయి ఉంటే చెప్పకుండా ఉంటుందా ?

2. సంకీర్తనాచార్యుల కుమారుడు పెదతిరువెంకటనాథుడు తన వంశ గౌరవమును సుస్థిరంగా నిల్పడానికి అన్నమయ్యగారి కీర్తనలను రాగి రేకుల మీద చెక్కించి భద్రపరిచారు. అలాగే వారి మనుమడు చిన్నన్న (ద్విపదకవి) అన్నమార్యుని జీవితమును ద్విపదగా వ్రాసి ప్రకటించాడు. దానిలో ఆచార్యుల వారి కుటుంబమును గురించి కొంత వ్రాశాడు. అంతే గాని ఆ తిమ్మక్క సంగీత సాహిత్య చతుర అన్న భావం ఎక్కడా చూడ లేదు. చదువుకుందో లేదో కూడా తెలియదు.

3. తిమ్మక్కకు భర్త యందు భక్తిప్రపత్తులు లేకపోయినా అన్నమాచార్యుని యిష్ట దైవమగు శ్రీ వెంకటాచలపతికి తన ద్విపదపాటను అంకిత మియ్యకుండ ఉండగలదా ?

4. తిమ్మక్కే వ్రాసి ఉంటే ఆ తిమ్మక్క ఎప్పటిదో, తన భర్త ఏ అన్నయ్యో తెలుసుకోవలసి ఉంది....తాళ్ళపాక వారిలో ఈ పేరులు చాల తరుచుగా వినబడురుంటాయి.

5. ఈ స్త్రీల పాటలు, ఇప్పటికి గూడా చాలా వరకు పురుషులే వ్రాసి స్త్రీల కిచ్చేవారు. కొందరు పురుష రచయితలు పాట చివరను తన పేరును గూడ చెప్పేవారు. ఈ పురుష రచయితలు తమ కాలములో ఉండిన చక్కని కావ్యాలను రుచి చూచినవారు గూడ, అలాగా వర్ణనలను అనుకరించేవారు.

6. ఈ పాటకు, విజయవిలాస మహా కావ్యానికీ ఉన్న పూర్వాపరాలు నిర్ణయించవలసి ఉంది. అప్పుడుగాని ప్రబంధాన్ని ఆ పాట అనుకరించిందో, ఆపాటను ప్రబంధమే అనుకరించిందో తేలదు. కాబట్టి ఆ పోలిక లున్నంత మాత్రాన చేమకూరకవి తిమ్మక్కను కాపీ కొట్టాడని నిర్ణయించడం అక్రమము.



7. ఆరుద్రగారు సూచించిన తాళ్లపాక తిమ్మాచార్యుడు 1740 ప్రాంతంలో ఉన్నాడని, ఆతడు సాహిత్యము వ్రాతకోతలలో కొంత పరిశ్రమ చేసి గ్రంథ పరిచయం కలవాడని తెలుస్తుంది. ఈయనే గోదావరి జిల్లా ముద్రణములో తిమ్మప్ప వరకవీశ్వరుడు కావచ్చును.

8. అన్నిటికంటె ముఖ్యమయిన ఒక్క కారణము : పాటే అర్వాచీనమని రుజువు చేయుటకు మనకురుజువుంది. ప్రభాకరశాస్త్రిగారు ముద్రించిన ఈ పాటలో, 39 వ పేజీలో, చివర నుంచి 8 వ చరణంలో "మురవైరి వందిత మువ్వగోపాల" అని రుక్మిణి అంటుంది. 'మువ్వగోపాలుడు' క్షేత్రయ్యగారి ముద్దు పేరు ఇతడు 1650 ప్రాంతమువాడు. అతని ముద్దు పేరుతో కృష్ణుని సంబోధించడం గట్టిగా ఆలోచించవలసిన విషయం కాబట్టి ఈ తిమ్మక్క 1660 ప్రాంతాలది కావాలి. వేటూరి వారు ఈ పద ముతో చిక్కుపడ్డారు. క్షేత్రయ్యగారు 'మువ్వపురి గోపాల' అనే ఆనే వారని, ఈ మువ్వగోపాలుని కర్థం "మువ్వలు దాల్చిన బాలగోపాల" అని ఎంచవలెనట. సుభద్రా వివాహ ఘట్టంలో రుక్మిణి మొదలయిన అష్ట భార్య లున్నప్పుడు 'మువ్వలున్న బాలగోపాలా' అని అర్థం చెప్పడం మహాసాహసం.

ఇన్ని కారణాలచేత ఈ పాట ప్రబంధానికి చాల వెనుకను వ్రాశారని నిర్ధారణ చేయక తప్పదు.

సారంగధరలో గౌరన ననుకరించి, దానివలన పేరు ప్రతిష్ఠ కలుగవని చేమకూరకవి "ఛాయాచోరక" పద్ధతిని విసర్జించాడని మన మంగీకరించాలి. అందుచేతనే చేమకూరకవి ఇతర కవులను అనుకరించినట్లు కనిపించినా ఆ సాదృశ్యాన్ని తిర్చిదిద్ది ఏదో కొత్తవన్నట్లు చేయగల సమర్థుడు.

ఈ సమగ్రాంధ్ర సాహిత్య చరితమును ఇంత పరిశ్రమ చేసి ఇంత మనోహర రచనగా సాగించిన ఆరుద్రగారికి ఆంధ్ర పాఠకలోకం చాల ఋణపడి ఉంటుందని వేరుగా చెప్ప నక్కరలేదు. ఈ సంపుటాలు చిరస్థాయిగా ఆంధ్ర వాఙ్మయంలో నిలిచి, తరతరాల వారికి పఠన పాఠనోత్సాహాన్ని కలిగించును గాక!

హైదరాబాదు
26-9-1966

తాపీ ధర్మారావు

# పీఠిక

ఆరుద్రగారు రచించుచున్న సమగ్రాంధ్రసాహిత్యచరిత్రలో ఇది పదకొండవ సంపుటము-నాయకరాజులయుగమునకు సంబంధించిన సంపుటములలో రెండవ భాగము.

మొన్న మొన్నటివరకును అనంతర ప్రబంధయుగము 'క్షీణయుగము' అనునపప్రథపాలై యుండెను. పరిశోధకపండితులు ఇటీవల దాక్షిణాత్యాంధ్ర సాహిత్యమునుగూర్చి జరిపిన విపుల పరిశోధనలవలన ఎన్నియో నూత్న సాహిత్యప్రక్రియలకు ఆలవాలముగా నేర్పడిన ఈ యుగము విశిష్టమైన దని నిరూపితమైనది. పదకవిత, యక్షగానము, వచనము, నాటకము, శతకము, దండకము మున్నగు ప్రక్రియ లెన్నియో పరిపూర్ణవికాసము నొందిన దీ యుగములోనే.

ఈయుగమునకు సంబంధించినంతవరకు ఒకటిరెండు విశేషాంశములు ప్రధానముగ బరిశీలింపదగియున్నవి. ఆంధ్రసామ్రాజ్యలక్ష్మి తెలుగు పొలిమేరల దాటి దక్షిణాపథములో స్వేచ్ఛావిహార మొనర్చినది. సామ్రాజ్యాధీశ్వరులతో పాటు మండలాధీశ్వరులు, సంస్థానాధిపతులు, సామంతప్రభువులు, అధికారులు కవిపండితపోషకు లైనారు. చెంజి, తంజావూరు, మధుర మున్నగు రాజనగరములు ప్రధానసాహిత్యకేంద్రము లైనవి. రాజకీయ కల్లోలమునందును రమణీయకావ్యములు వెలువడినవి. రాజ్యలక్ష్మి వంశ పరంపరగా రాజుల నాశ్రయించినట్లు సాహిత్యసరస్వతియు కవిపండిత కుటుంబముల పరంపరగా ననుగ్రహించినది. పండితకుటుంబములు సాహిత్య చరిత్రలో ప్రముఖస్థానము నలంకరించినవి. చతుర్విధకవితలు పండితుల మన్ననల నొందినవి.

నాయకరాజుల యుగము పదునేడవ శతాబ్ది తెలుగు సాహిత్యచరిత్రకు పునాదివంటిది. ఈయుగసాహిత్యసమీక్షనొనర్చు విమర్శకుల దృష్టి నేటివరకును ప్రధానముగ మధుర తంజావూరు నాయకరాజులపై కేంద్రీకృతమై యుండెను. చెంజి రాజధానిగ విలసిల్లిన తుండీరమండలమునకు సాహిత్య చరిత్రలో సముచితస్థానము లభింపకుండెను.

ఆరుద్రగారు ఈయుగమునాటి రాజకీయసాంఘికచరిత్రను నిశిత దృష్టితో బరిశీలించి అట్టి వాతావరణములో వెలువడిన కావ్యములనుగూర్చి విపులముగ జర్చించిరి. తుండీరమండలమునుగూర్చి చారిత్రకులు వ్యక్తీకరించిన భిన్నాభిప్రాయములను సమన్వయపరచి తెలుగుకవులకును, తుండీర మండలాధిపతులకును గల సంబంధమును సోపపత్తికముగ నిరూపించి తెలుగుసాహిత్యకేంద్రములలో చెంజికి సముచితప్రాధాన్యమొసగుట ఆరుద్రగారి పరిశోధనాత్మకదృష్టికి తార్కాణముగ నున్నది. విస్మృతాంశము నింత సమగ్రముగ వివరించిన అంశ మొకటియే ఇది సమగ్రఆంధ్రసాహిత్యచరిత్ర యనుటకు నిదర్శనము.

ఈయుగములో వెలువడిన కొన్ని కావ్యములు సాహిత్యగౌరవము కలవి; మరికొన్ని పాండితీస్ఫోరకములు. పూర్వప్రబంధములకు అనుకరణప్రాయములయ్యు క్రొత్తదనమును సంతరించుకొనిన కావ్యములును కొన్ని కలవు. ధామెర్ల వెంగళరాజు బహుళాశ్వచరిత్ర, మూర్తికవి రాజవాహన విజయము, చెంగల్వ కాళకవి రాజగోపాలవిలాసము, సవరము చిననారాయణ కువలయాశ్వచరిత్ర, లింగనమఖి తిరుకామయ్య సత్యభామాసాంత్వనము మున్నగునవి ఈ కోవకు చెందినవి. ఇవి తెలుగుసాహిత్యముతో ప్రగాఢపరిచయము కలవారికే సుపరిచితములుగా నున్న కావ్యములు. సామాన్యపాఠకులకును సాహిత్యముతో పరిచయ మేర్పడునట్లుగను, సాహిత్యమునం దభిరుచిగలిగించునట్లుగను ఆరుద్రగా రీకావ్యములను విమర్శించిరి. కథాంశమును సుబోధమొనర్చిరి. పండితులకు, పరిశోధకులకును దోడ్పడునట్లు కావ్యములోని వివిధాంశములను విపులీకరించిరి. ఈకావ్యములు ఆంధ్రుల సాంఘికచరిత్రకు దర్పణమువంటివి. కీ. శే. సురవరము ప్రతాపరెడ్డి ప్రభృతులు వీనియందలి అమూల్యములైన అంశములను వివరించియుండిరి. ఆరుద్రగారు నాయకరాజులయుగములోని చారిత్రక వాఙ్మయవిశేషములను సమన్వయపరిచి నాటి సాంఘికచరిత్రను గ్రహించుట కనువుగానుండునట్లు ఈ కావ్యములను బరిశీలించుట ప్రశంసార్హము.

చిత్రకవిత్వముగాని, బంధకవిత్వముగాని సామాన్యులకందనివి. గణపవరపు వెంకటకవి రచించిన ప్రబంధరాజ వెంకటేశ్వరవిజయవిలాస మను

తొ. ము. పదకొండవ సంపుటికి కప్పగంతుల లక్ష్మణశాస్త్రి 'పీఠిక'

కావ్యమును బరిశీలించుపట్ల ఆరుద్రగారు చిత్రకవితారీతుల చిత్రవిచిత్రగతుల ప్రాశస్త్యమును సామాన్యులును సులభముగ గ్రహించునట్లు నిరూపించిరి.

యక్షగానములకును, పదకవితకును ఆరుద్రగారు సాహిత్యచరిత్రలో సముచితస్థానము నొసగియున్నారు. క్షేత్రయ్య పదములలో సాహిత్యపు విలువను ఆరుద్రగారు సోదాహరణముగ జూపియున్నారు.

రంగాజమ్మ, రామభద్రాంబ మున్నగు కవయిత్రు లాంధ్రసాహిత్యమున కొనర్చిన సేవను కూడ ఆరుద్రగారు నిశితముగా బరిశీలించినారు.

సాహిత్యచరిత్రలో పదునేడవశతాబ్దికాలమును ఏయుగముగా పరిగణింపవలయు ననువిషయము వివాదాస్పదముగా నున్నది. ఇది క్షీణయుగమనియు, అనంతరప్రబంధయుగ మనియు, నాయకరాజుల యుగ మనియు సాహిత్యచరిత్రకారులు వివిధముగ బేర్కొనినారు. సాహిత్యప్రక్రియావైవిధ్యముగల యీ యుగమును అనంతరప్రబంధయుగ మనుటయే సమంజసముగా నున్నది.

వివిధకావ్యములను బరిశీలించు సందర్భమున శ్రీ ఆరుద్రగారు కొన్ని అంశములను కేవలము సూత్రప్రాయముగా గాక, మరికొంత విశేషముగా చర్చించియుండినచో పాఠకుల కెంతయో యుపయోగముగా నుండెడిది.

సౌందరి అను రచయిత్రి రంగాజమ్మగ్రంథముల ననుసరించిన సందర్భములను విపులీకరించినచో సూక్ష్మాంశములను తెలిసికొనుట కవకాశము గలిగియుండెడిది. సౌందరి రచించిన గ్రంథము అముద్రితము. దాని నుండి కొన్ని యుదాహరణములు చూపియుండినచో రంగాజమ్మను ఆ కవయిత్రి అనుకరించిన సందర్భములు స్పష్టములై యుండెడివి.

శ్రీ ఆరుద్రగారి సునిశితమైన విమర్శనపద్ధతి, రచనావిధానము పండితులను, సామాన్యులను రంజింపజేయు ననుట కెలాటి సందేహము లేదు. వారు సమగ్రాంధ్రసాహిత్యచరిత్రను జనసామాన్యమునకు సుబోధకముగా నుండునట్లు మృదుమధురలలితశైలిలో రచించి ఆంధ్రలోకమునకు మహోపకారమును చేసియున్నారు. తేనెలు జాలువారు వారి భాషాశైలిని చదువునప్పుడు శ్రీ ఆరుద్రగారు కలమును అమృతములో నద్ది వ్రాసినారా యనునంత మనోహరముగ నున్నది. శ్రీ ఆరుద్రగారికి తెలుగుప్రజలు ఎంతయో ఋణపడియున్నారు.



ఇట్టి సర్వజనోపయోగిగ్రంథములను ఆరుద్రవంటి సునిశితవిమర్శకరచయితతో వ్రాయించి ముద్దులు మూటగట్టునట్లుగా ప్రచురించుచున్న శ్రీ యం. శేషాచలం అండ్ కో వారు మిక్కిలి ప్రశంసార్హులు. వారికిని, శ్రీ ఆరుద్రగారికిని నా హృదయపూర్వక ధన్యవాదములు.

హైదరాబాదు }
29.3.1967 }

కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

## ఆప్తుల కోక అభ్యర్థన

నల్లేరు మీద బండిలాగా, చెప్పిందిచెప్పినట్లు చకచకా సాగుతూవచ్చి నలుగురినీ ఆశ్చర్యపరచిన ఈ సాహిత్యసంపుటాల ప్రచురణ మావన్ను అలవితప్పిన అనేక అనివార్యకారణాలవల్ల ఆఖరుదశలో ఇలా వెనుకబట్టినందుకు మేమెంతో చింతిస్తున్నాం. పదకొండవ సంపుటం తర్వాత ఇన్నాళ్ళకిప్పటికి పన్నెండవ సంపుటం వెలువడుతున్నదంటే మాకే ఎంతో చిన్నతనంగా ఉన్నది. కారణాలు ఏకరువుపెట్టడంవల్ల కార్యమేమీ లేదు. అయిన ఆలస్యానికి దయయుంచి మన్నించవలసిందిగా మా శ్రేయోభిలాషులందరినీ ప్రార్థిస్తున్నాం. మిగిలిన మూడు సంపుటాల నైనా ఆ మొదటివడిలో, అదేఉరవడిలో ఎలాగైనా త్వరలోనే ప్రచురింప గలుగుతామని ఆశిస్తున్నాం.

పాఠకులకు మరొక్క మనవి. గత్యంతరంలేక సంపుటాల సంఖ్యను, మధ్యలో డజనునుంచి డజనుంబాతికకు పెంచినా, ఎలాగో కిందామీదా పడి, కొంచెం అటూ ఇటూగా అనుకొన్న పుటల పరిమితిలోనే పదకొండు సంపుటాలనూ ప్రచురింపగలిగాం.

కాని, ఈ పన్నెండవ సంపుటం వచ్చేసరికి పట్టుతప్పింది. ఈ యుగంలోని కవుల సంఖ్య, తీరా కలం కాగితంపట్టి లెక్కకట్టేసరికి తెగపెరిగిపోయింది. ఆరుద్రగారు అనుకొన్న అంచనా తప్పింది. ఎంత కుదించినా మామూలు మితిలోకి ఇమడలేదనీ, మరి కుదించడానికి వల్లకాదనీ, కారుగూడదని కుదిస్తే పాఠకులకు వాగ్దానంచేసిన సమగ్రత దెబ్బతింటుం దనీ ఆరుద్రగారు ఆత్మీయులుగా సలహాయిచ్చినందువల్ల విధిలేక ఈ సంపుటం పుటలు బాగా పెంచవలసి వచ్చింది. ఫలితంగా ఈ సంపుటం ధరను - మనసు ఎంత పీకుతున్నా - పెంచక తప్పిందికాదు. ఈ పుటల పెరుగుదలకూడా ఎటూగాకుండా-పరిమితిలోనూ ఇమడక, ఇంకొక సంపుటానికి చాలనూ చాలకుండా-ఇలా ఇబ్బంది తెచ్చింది.

సంగతి సందర్భాలు సాకల్యంగా ఎరుగజాలిన చదువరులు ఈ మా అసహాయతను అర్థంచేసుకొని, మాయందు అభిమానముంచి ఈ వెల పెంపును మన్నించి, వేరుగా భావించకుండా యథాప్రకారం ఆదరిస్తారని ఆశిస్తున్నాం. ఆదరించమని అడుగుకొంటున్నాం.

ప్రకాశకులు.

## కృతజ్ఞతలు

ఈ ప్రణాళికలో ఇది పదకొండోయుగం పన్నెండో భాగం—కడపటి రాజులయుగం. సమగ్రతకోసం, తెలిసిన విషయాలను విడిచిపెట్టకుండా, ఈయుగ సమీక్షను సవిస్తరంగా వ్రాశాను. ఇది ప్రకాశకులూ, నేనూ ఆదిలో-ప్రణాళికను రూపొందించేటప్పుడు - అనుకొన్న పుటల పరిమితిని దాటకూడదని, వ్రాసినదాన్ని చాలా కత్తిరించాను. అయినా గ్రంథం పెరిగింది. పుటలు మళ్లా తగ్గించమనకుండా, ఔదార్యంతో, గ్రంథాన్ని యథాతథంగా ప్రకటించడానికి మిత్రులు యస్. యస్. రావుగారు అంగీకరించారు. అందుకు వారికి కృతజ్ఞత.

ఈ సంపుటాలను ఆసక్తితో చదివి, సహృదయతతో విమర్శించి, ప్రోత్సహిస్తున్న వాళ్ళందరికీ నా ధన్యవాదాలు. చెల్లా చెదురుగా ఉన్న ఆకరాలను ఒక్క చేతో క్రోడీకరిస్తున్నప్పుడు రచనలో తప్పులు దొర్లడం తప్పదు. అవన్నీ రెండవ ముద్రణలో దిద్దుకొంటానని మనవి చేస్తున్నాను.

ఈ రచనకు కావలసిన గ్రంథాలు కొన్నింటిని మిత్రులు సర్వశ్రీ వేదం వెంకటరాయశాస్త్రి, వేదం లక్ష్మీనారాయణశాస్త్రి, దేవుళ్ళ చిన్ని కృష్ణయ్య, నిడుదవోలు సుందరేశ్వరరావు, డాక్టరు బిరుదురాజు రామరాజు మొదలైనవారు ఎరవిచ్చారు. వారికి నా ధన్యవాదాలు. ఈ కృషిని ప్రోత్సహిస్తున్న ఈరంకి రాయన్న, పర్వతనేని గంగాధరరావు గార్లకు నా కృతజ్ఞతలు.

ఈ ప్రణాళికకు ప్రవేశిక వ్రాసిన డాక్టరు పి. వి. రాజమన్నారు గార్కి ప్రకాశకులతోపాటు నా వందనాలు.

ఈ రచనను సాఫు వ్రాస్తున్న నా అర్ధాంగి శ్రీమతి రామలక్ష్మికి నా అభివందనాలు. పత్రికలు తయారుచేయడంలోనూ, పుస్తకాలు తెచ్చిపెట్టడంలోనూ సాయపడ్డ మిత్రుడు యం. వి. యల్. నరసింహారావుకు దీవనలు. ప్రూఫు దిద్దుతున్న మిత్రులకు నమస్కారాలు.

—ఆరుద్ర.

తొ.ము. పన్నెండవ సంపుటిలో ప్రచురణకర్తల 'అభ్యర్థన' - ఆరుద్ర 'కృతజ్ఞతలు.'







పునర్ముద్రణ 'ముఖ చిత్రం'- లోపలి 'ముఖ చిత్రం'

ప్రచురణ నెం:29బి
ముద్రణ: 1991, సెప్టెంబర్

© ఆరుద్ర
ముఖచిత్రం : బాపు

❀❀❀

సాదా ప్రతి : రు. 60
మేలు ప్రతి : రు. 65

❀❀❀

ప్రతులకు:
ప్రజాశక్తి బుక్‌హౌస్
కారల్‌మార్క్స్ రోడ్
విజయవాడ – 520 002

ముద్రణ:
ప్రజాశక్తి డైలీ ప్రింటింగ్ ప్రెస్
గవర్నరుపేట,
విజయవాడ 2

## మామాట

ఆదికాలం నుండి ఆధునిక యుగం వరకూ సాగిన సమగ్ర ఆంధ్ర సాహిత్య పరిణామాన్ని గురించి తెలుసుకోవాలనే ఆకాంక్షగల సాహిత్యాభిమానుల కోసం కవి, పండితుడు, పరిశోధకుడు, సాహితీ విమర్శకుడుగా పేరు ప్రతిష్ఠలను గడించిన ఆరుద్రగారు ఎంతగానో శ్రమించి ఒక్క చేతిమీదుగా సమగ్రాంధ్ర సాహిత్యాన్ని 12 సంపుటాల్లో ఆంధ్ర ప్రజలకు 1968 లోనే అందచేశారు.

అయితే ఈ రచన ఆధునికయుగం వరకూ పూర్తిగా సాగలేదు. అనివార్యకారణాల వలన ఆఖరి భాగాలను ఆయన పూర్తిచేయలేదు. అయినప్పటికీ అది ఆంధ్ర సాహిత్య చరిత్రకు సంబంధించి ప్రామాణిక గ్రంథంగా గుర్తించబడింది. తెలుగు సాహిత్య చరిత్రకు సంబంధించి ప్రామాణిక గ్రంథంగా గుర్తించబడింది. తెలుగు సాహిత్యంలోనూ, చరిత్ర అధ్యయనంలోనూ నిష్ణాతులుగా గుర్తించబడిన సర్వశ్రీ వేలూరు రామకృష్ణ శాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ, శివశంకర స్వామి, మల్లాది రామకృష్ణ శాస్త్రి, గిడుగు వెంకట సీతాపతి, ఖండవల్లి లక్ష్మీరంజనం, దివాకర్ల వెంకటావధాని, రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ, నేలటూరి వెంకటరమణయ్య, తాపీ ధర్మారావు, కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, పాకాల రాజమన్నారు లాంటి ప్రముఖుల ప్రశంసల నందుకున్న రచన అది.

ఆరుద్ర షష్టి పూర్తి ఉత్సవాల సందర్భంగా ఆయనకు ఆంధ్రావనిలో అనేక చోట్ల జరిగిన సన్మాన సభలన్నింటా, సమగ్రాంధ్ర చరిత్రను ఒక్కచేత్తో పూర్తిచేసి ఆయన ఆంధ్ర ప్రజలకు చేసగూర్చిన మహత్తర సేవను ప్రశంసించుతూనే, తతిమ్మాభాగాలను పూర్తిచేయాలనే ఆకాంక్షలు వెలిబుచ్చారు.

ఇప్పుడు ఆరోగ్యం చక్కబడి, పఠనానికి, రచనకు, ప్రచురణకు అవసరమైన సదుపాయాలు ఏర్పడగానే ఆంధ్ర సాహిత్యాభిమానుల చిరకాల వాంఛను నెరవేర్చడానికి ఆరుద్రగారు పూనుకోవడం అభినందించదగిన విషయం.

**పునర్ముద్రణ - ప్రచురణ వివరాలు - ప్రచురణ కర్తల ప్రకటన**

ఆరుద్రగారే తెలిపినట్లు ఒక భాషను మాట్లాడే ప్రజల దేశ చరిత్ర సాంఘిక చరిత్ర, సాహిత్య చరిత్ర ఒకదానికొకటి పెనవేసుకొని వుండటం వలన ఈ రచన అన్ని కోణాల నుండి తమ చరిత్రను, వారసత్వాన్ని అవగాహన చేసుకొనేందుకు ఆంధ్ర ప్రజలకు ఉపయోగపడగలదు.

ఇటీవల కాలంలో జరిగిన పరిశోధనల ఫలితంగా అందిన అదనపు సమాచారం, అంతకు ముందు రచనపై వచ్చిన విమర్శలను, సూచనలను దృష్టిలో వుంచుకొని గతంలో ప్రచురించిన సంపుటాల్లో కూడా అవసరమైన మార్పులను, చేర్పులను చేసి, ఆధునిక యుగం వరకు గల తతిమ్మా సంపుటాలను రచించడానికి ఆరుద్రగారు పూనుకోవడం ముదావహం.

పరిశోధనల్లో వచ్చిన ఆధునిక పద్ధతులను ఆకళింపు చేసుకొని ఆదిమ, చాళుక్య యుగాల నుండి నేటి ఆధునిక యుగం వరకూ సమగ్రరీతిలో తాను రచించిన సమగ్ర ఆంధ్ర సాహిత్య చరిత్రను ప్రచురించే అవకాశాన్ని మాకు కలిగించినందుకు ఆరుద్రగారికి మా ప్రచురణాలయం తరపున హృదయపూర్వకమైన కృతజ్ఞతాభివందనాలను తెలుపుకుంటూ ఈ ప్రచురణకు పూనుకొన్నాం.

సుదీర్ఘమైన అధ్యయనం, పరిశోధనల ఫలితంగా లభించిన అపూర్వమైన సాహితీ సంపదతో తెలుగు ప్రజలు తమ చరిత్రను, తమ సాహితీ సంస్కృతి వారసత్వాన్ని అవగాహన చేసుకునేందుకు ఉపయోగపడే విధంగా ఆరుద్రగారు రచించిన ఈ " సమగ్ర ఆంధ్ర సాహిత్యం" 12 సంపుటాలుగా వచ్చే ఈ ఉద్గ్రంథం- ఆంధ్ర ప్రజల ఆదరణను బహువిధాలుగా పొందడమేగాక, తెలుగు వారుండే ఇతర ప్రాంతాల్లో కూడా అన్ని గ్రంథాలయాల్లోను, విద్యాలయాల్లోను తగిన స్థానం పొందగలదని ఆశిస్తున్నాం.

22–7–'89
విజయవాడ

–ప్రచురణకర్తలు

## మనవి మాటలు

సాహిత్యాభిలాష గల సాధారణ పాఠకులు ఆంధ్ర సాహిత్యం గురించి సంపూర్ణంగా తెలుసుకోవాలనుకుంటే, వాళ్ళకు ఉపయోగించే పుస్తకాలు నేడు అందుబాటులో లేవు. నన్నయభట్టు నుండి చిన్నయసూరి దాకా మాత్రమేకాక శాతవాహనుల కాలం నుండి సాహితీ సమితి దాకా ఆంధ్ర సాహిత్యం అనేక విధాలుగా, బహుముఖాలుగా సాగింది. ప్రజ్ఞావంతులైన తెలుగు కవులు రచించిన గ్రంథాలు అన్నింటికి అన్నీ అచ్చుపడి వెలుగు చూడలేదు. అచ్చయిన పుస్తకాలు కూడా అన్నీ అందరికీ లభించడం లేదు. లభించిన పుస్తకాలైనా అన్నీ సాధారణ పాఠకులకు బోధపడే వివరణలతో లేవు. ఈ కొరతను తొలగించవలసిన బాధ్యత నేటి సాహితీపరులపై వుంది.

పన్నెండు సంపుటాలలో సమగ్ర ఆంధ్ర సాహిత్యం ప్రజానీకానికి పరిచయం చేద్దామనే సంకల్పం కొన్నేళ్ళ కిందట నాకు కలిగింది. పుస్తక ప్రచురణలో కొత్త పోకడలుపోయే ప్రతిభావంతులు శ్రీ యం.ఎన్.రావుగారితో దానిని ముచ్చటించాను. నా ఉద్దేశాన్ని వారు బహుముఖాం పరిశీలించారు. ఇటువంటి సాహిత్య గ్రంథాలకు పుస్తక ప్రపంచంలో ఆదరణ ఉంటుందని 'మార్కెట్ అధ్యయనం' బాగా చేసి తెలుసుకొన్నారు. వారి సంస్థ యం.శేషాచలం అండ్ కంపెనీ తరపున పన్నెండు సంపుటాలను ప్రచురించడానికి ముందుకు వచ్చారు.

సమగ్రత ఆశయం. దీన్ని సాధించడానికి ఇది ప్రయత్నం. పూజ్యులు కందుకూరి వీరేశలింగం గారు ప్రామాణిక సాహిత్యరచనకు పునాదులు వేశారు. శ్రీయుతులు మానవల్లి రామకృష్ణకవిగారు, వేటూరి ప్రభాకర శాస్త్రిగారు, చిలుకూరి వీరభద్రరావుగారు, కొమర్రాజు లక్ష్మణరావుగారు, మల్లంపల్లి సోమశేఖర శర్మగారు మొదలైన మహనీయులు సాహిత్యంతోబాటు దేశ చరిత్రను కూడా విశదం చేశారు. సురవరం ప్రతాపరెడ్డి గారు మన సాంఘిక చరిత్రకు శ్రీకారం చుట్టి కొత్త కోణాలను చూపెట్టారు. వీరి రచనలను ఆధారం చేసుకొని తమ ప్రతిభతో కొత్త ఆకారాలను గుర్తించి, నూతన సిద్ధాంతాలను ప్రతిపాదించి సాహిత్య చరిత్రను అనేక మంది విద్వాంసులు, విమర్శకులు, విఖ్యాత పత్రికలలో, వివిధ గ్రంథాలలో వివరిస్తున్నారు. ఈ అమూల్య రచనలన్నింటిని నా దృక్పథంతో సమన్వయం చేయడానికి ఈ రచనలో ప్రయత్నించాను.

ఒక భాష మాట్లాడే ప్రజల దేశ చరిత్ర, సాంఘిక చరిత్ర, సాహిత్య చరిత్ర ఒకదానితో ఒకటి పెనవేసుకొని వుంటాయి. రాజకీయాల వల్ల వివిధ రంగాలలో

**పునర్ముద్రణకు ఆరుద్ర 'మనవిమాటలు' కృతజ్ఞతలు'**

పరిణామాలు ఏర్పడుతూ వుంటాయి. విభిన్న సంఘటనలే జరిగినా అవి ఒక చారిత్రక క్రమంలోనే వుంటాయి. రాజకీయ ప్రభావాలకు లోనుకాని యుగం వుండదు. రాజవంశాల పేరుమీదుగా యుగాలను పేర్కొనడం రివాజే. పాశ్చాత్య చరిత్రలలో 'ఎలిజబెతియన్, జాకొబియన్, విక్టోరియన్, ఎడ్వర్డియన్' మొదలైన యుగాలు సుపరిచితమైనవే. ఇది అనువైన పద్ధతి, అందుకే సురవరం ప్రతాపరెడ్డిగారు తమ "ఆంధ్రుల సాంఘిక చరిత్ర"లో ఈ క్రింది విధమైన యుగ విభజన చేశారు.

1వ ప్రకరణము - తూర్పు చాళుక్య యుగము
2వ ప్రకరణము - కాకతీయుల కాలము
3వ ప్రకరణము- రెడ్డి రాజుల కాలము
4వ ప్రకరణము- విజయనగర సామ్రాజ్య కాలము(క్రీ.శ.1332 నుండి1530వరకు)
5వ ప్రకరణము- విజయనగర సామ్రాజ్య కాలము(క్రీ.శ1530 నుండి1630వరకు)
6వ ప్రకరణము - పేరు పెట్టలేదు ( క్రీ.శ.1600 నుండి 1757 వరకు)
7వ ప్రకరణము - పేరు పెట్టలేదు ( క్రీ.శ. 1757 నుండి 1857 వరకు)

సాంఘిక చరిత్రకు పనికివచ్చే సాహిత్య గ్రంథాలనే ఎన్నుకొనడంవల్ల సురవరం ప్రతాపరెడ్డిగారి యుగవిభజన వారి ప్రయోజనానికి అనుకూలమైంది. సమగ్ర ఆంధ్ర సాహిత్యంలో విస్తృతను దృష్టిలో పెట్టుకొని నేను యుగాల అంకెను, ఆయా రాజవంశాల ప్రాముఖ్యాలను బట్టి పెంచవలసి వచ్చింది. ఆదిలో నేను వేసుకొన్న ప్రణాళికలో ఇలాగ యుగ విభజన చేసుకొన్నాను.

| | |
|---|---|
| 1. ఆదిమ, చాళుక్య యుగాలు✓ | (క్రీ.శ.12వ శతాబ్దం చివరి దాకా) |
| 2. కాకతీయ యుగం ✓ | (క్రీ.శ.1200-1290) |
| 3. పద్మనాయక యుగం | (క్రీ.శ.1337-1399) |
| 4. రెడ్డి రాజుల యుగం | (క్రీ.శ.1400-1450) |
| 5. తొలి రాయల యుగం | (క్రీ.శ.1450-1500) |
| 6.మలి రాయల యుగం | (క్రీ.శ.1500-1550) |
| 7.నవాబుల యుగం | (క్రీ.శ.1550-1600) |
| 8.నాయక రాజుల యుగం | (క్రీ.శ.1600-1670) |
| 9.కడపటి రాజుల యుగం | (క్రీ.శ.1670-1750) |
| 10.కుంఫిణీ యుగం | (క్రీ.శ.1750-1850) |
| 11. జమీందారీ యుగం | (క్రీ.శ.1850-1900) |
| 12.ఆధునిక యుగం | (క్రీ.శ.1900 నుండి) |

పుస్తక ప్రచురణను ప్రారంభించడానికి ముందే ప్రతి సంపుటిలో పుటల పరిమితిని, సంపుటాల సంఖ్యను, ఒక్కొక్క సంపుటం వెలనూ, పన్నెండు సంపుటాలకు మొత్తం పూర్తిగా ముందే చెల్లించే పక్షంలో పెట్టువెల, అందువల్ల లభించే లాభసాటి సదుపాయాలూ ప్రకాశకులు ప్రకటించారు. ఎందరో ఈ ప్రణాళికకు స్వాగతం చెప్పారు. చందాదారులుగా చేరారు.

1965 జనవరి నెల నుండి ఈ సంపుటాల రచనకు ఉపక్రమించాను. ప్రతి సంపుటిలోని పుటల పరిమితి ముందుగానే నిర్ణయం కావడం వల్ల ప్రతి ప్రకరణంలో తెలిసిన ఏ ఒక్కటీ వదిలి పెట్టకుండా విరివిగానే రాసినా చివరకు కుదించవడం తప్పనిసరి అయింది. సమగ్రత దెబ్బతినకూడదని సంపుటాల సంఖ్యను పెంచి, అదనపు యుగాలను, ఉపయుగాలను చేర్చవలసి వచ్చింది. ప్రచురణకు ముందే ప్రజలకిచ్చిన వాగ్దానానికి భంగం లేకుండా పన్నెండు సంపుటాలనూ వరుసగా ప్రచురించడం జరిగింది. నామీదా, ప్రకాశకుల మీదా ఉన్న అభిమానంతో పి.వి.రాజమన్నారుగారు అన్ని యుగాలకు ఉమ్మడి ప్రవేశికనూ, ఒక్కొక్కరు చొప్పున సాహిత్యరంగంలోని లబ్ధప్రతిష్ఠులు పీఠికలు రాసి దీవించారు. వాటి వివరాలు ఇవి.

| సంపుటి పేరు | కాలం | పీఠికాకర్త |
|---|---|---|
| 1. చాళుక్య యుగం | ఏప్రియల్,1965 | వేటూరి శివరామశాస్త్రి |
| 2. కాకతీయ యుగం | మే, 1965 | విశ్వనాథ సత్యనారాయణ |
| 3. పద్మనాయక యుగం | జూన్,1965 | శివశంకరస్వామి |
| 4. రెడ్డిరాజుల యుగం | జూలై,1965 | మల్లాది రామకృష్ణశాస్త్రి |
| 5. గజపతుల యుగం | ఆగస్టు,1965 | గిడుగు వేంకట సీతాపతి |
| 6. తొలిరాయల యుగం | సెప్టెంబరు,1965 | ఖండవల్లి లక్ష్మీరంజనం |
| 7. మలి రాయల యుగం | అక్టోబరు,1965 | దివాకర్ల వేంకటావధాని |
| 8. నవాబుల యుగం | నవంబరు,1965 | రాళ్ళపల్లిఅనంతకృష్ణశర్మ |
| 9. ఆరవీటి రాజుల యుగం | ఫిబ్రవరి,1966 | నేలటూరివెంకటరమణయ్య |
| 10. నాయకరాజుల యుగం-I | అక్టోబరు,1966 | తాపీ ధర్మారావు |
| 11. నాయకరాజుల యుగం-II | మార్చి,1967 | కప్పగంతుల లక్ష్మణశాస్త్రి |
| 12. కడపటిరాజుల యుగం | ఫిబ్రవరి,1968 | --- |

1965 ఏప్రియల్ నెల నుండి నవంబరు నెలదాకా ఎనిమిది నెలలు క్రమం తప్పకుండా అసాంతం రచనచేసి ఒక మాసపత్రికలాగ సమగ్ర ఆంధ్ర సాహిత్యం సంపుటాలను అచ్చుకివ్వడంలో నా ఆరోగ్యం పూర్తిగా దెబ్బతిన్నది. పళ్ళు బిగివిచి రచన చేయడం వల్ల పళ్ళ బిగువు సడలి దంత వైద్యం అవసరమైంది. దానితో పాటు డయాబిటెస్, బ్లడ్ ప్రెషర్, ఒకటేమిటి టెన్షన్ వల్ల రావలసిన అన్ని రుగ్మతలూ వచ్చాయి. అయినా ప్రజలకు ప్రకాశకులతోపాటు వాగ్దానం చేసినది పన్నెండు సంపుటాలు కనుక ఆ సంఖ్యను పూర్తిచేయాలని నిశ్చయించాను. అది 1968 ఫిబ్రవరి నాటికి గాని పూర్తిచేయలేకపోయాను.

ఈ పన్నెండు సంపుటాలు వెలువడుతున్నప్పుడు ఆసక్తితో చదివి, సహృదయంతో విమర్శించి, ప్రోత్సహించిన వాళ్ళెందరో ఉన్నారు. వెల్లావెదురుగా వున్న ఆకరాలను ఒక్కచేత్తో క్రోడీకరించి విశ్లేషణ చేస్తున్నప్పుడు రచనలో తప్పులు దొర్లడం తప్పదు. వీటికి తోడు సాపు వ్రాస్తున్నప్పుడో, ప్రూఫు దిద్దుతున్నప్పుడో మరికొన్ని పొరపాట్లు చేరకున్నాయి. నా అంతట నేను గుర్తించిన తప్పులతో బాటు విమర్శకులు సూచించే లోపాలూ, కొందరి కోపాలూ రెండవ ముద్రణలో సర్దుకొంటానని అప్పుడే సవినయంగా విన్నవించుకొన్నాను.

మొదటి ముద్రణ సంపుటాలన్నీ ఏనాడో వెల్లుబడి అయిపోయాయి. రెండవ ముద్రణ కోసంఎందరో ఎదురు చూస్తున్నారు. కొందరు ఒత్తిడి చేస్తున్నారు. గత సంవత్సరం నా రెండు కళ్ళ కేటరాక్టులకూ ఆపరేషన్ విజయవంతంగా జరగడం వల్ల గ్రంథ పఠనానికీ,రచనా కార్యక్రమానికీ వీలు కలిగింది.

సమగ్ర ఆంధ్ర సాహిత్యంలో కొరతగా మిగిలిపోయిన సంపుటాలను పూర్తిచేయడమేగాక, తొలి పన్నెండు సంపుటాలకు కొత్త మెనాలు చేర్చి, తిరగరాసి ప్రచురించాలని నిశ్చయించాను. 'ప్రజాశక్తిబుక్‌హౌస్' వారు తిరగరాతకూ, పునర్ముద్రణకూ సదుపాయాలు కలిగించి ప్రచురణ ప్రారంభిస్తున్నారు. వారికి నా ధన్యవాదాలు. ఒక వ్యక్తి. సమాజంలో ఏదైనా సాధించగలిగాడంటే దానికి ప్రత్యక్షంగానూ, పరోక్షంగాను ఎందరి సహాయ సహకారాలో ఉంటాయి. ఈ నా కృషిలో నాకు తోడ్పడిన వారందరికీ నా కృతజ్ఞతలు.

1989 సంక్రాంతి
మద్రాసు -17

-ఆరుద్ర

# స్వస్తివాచకం

సమగ్ర ఆంధ్ర సాహిత్య తొలియుగం నుంచీ కడపటి రాజుల యుగం దాకా 12 సంపుటాల ప్రథమముద్రణ 1965 ఏప్రిల్‌లో ప్రారంభం అయింది. 1968 ఫిబ్రవరి నాటికి పూర్తి అయ్యాయి. కొన్ని యుగాలు కొరతగా మిగిలిపోయాయి. కనుక వాటిని పూర్తి చేయాలని 1988లో నిశ్చయించాను. ప్రజాశక్తి బుక్ హౌస్ వారు పాతసంపుటాల పునర్ముద్రణకు, కొత్త సంపుటాల ముద్రణకు సదుపాయాలు కల్పిస్తామని నన్ను ప్రోత్సహించారు. పాత పన్నెండు సంపుటాలలో విషయాలను తగ్గించకుండా చేర్పులతో కూర్పులతో పెంపుదల చేస్తూ కొన్ని యుగాలు జంటలుగా చేశాను. పూర్వ ముద్రణలో 12 సంపుటాలుగా వెలువడినవి ఈ కొత్త ప్రణాళిక వల్ల కడపటి రాజుల యుగందాకా ఎనిమిది సంపుటాలలో విశదం చేయగలిగాను.

మిగిలిన యుగాలను నాలుగు సంపుటాలుగా ప్రచురించాలని అనుకున్నా విషయప్రాధాన్యతను బట్టి కుంపిణీ యుగాన్ని రెండు సంపుటాలుగా, జమీందారీ నవ్యసాహిత్య యుగాల్ని రెండు సంపుటాలుగా, ఆధునిక అభ్యుదయ యుగాన్ని ఒక సంపుటంగా మొత్తం అయిదు సంపుటాలుగా ప్రచురించవలసి వచ్చింది. ఈ మొత్తం పదమూడు సంపుటాలను ప్రజాశక్తి బుక్‌హౌస్‌వారు ప్రచురించారు. వాటి వివరాలు

1. ఆదిమ చాళుక్య యుగాలు (1989, మార్చి)
2. కాకతీయ యుగం (1989, జులై)
3. పద్మ నాయక రెడ్డి రాజుల యుగాలు (1990, మార్చి)
4. గజపతుల తొలి రాయల యుగాలు (1990, మార్చి)
5. మలి రాయల యుగం (1990, ఆగస్టు)
6. నవాబుల ఆరవీటి రాజుల యుగాలు (1990, నవంబర్)
7. నాయకరాజుల యుగం (1990, నవంబర్)
8. కడపటి రాజుల యుగం (1990 నవంబర్)
9. కుంపిణీ యుగం - 1 (1990, డిసెంబర్)
10. కుంపిణీ యుగం - 2 (1990, డిసెంబర్)
11. జమీందారీ నవ్యసాహిత్య యుగాలు-1 (1991, మే)
12. జమీందారీ నవ్యసాహిత్య యుగాలు-2 (1991, మే)
13. ఆధునిక అభ్యుదయ యుగం (1991, జూన్)

ఈ బృహత్ కార్యాన్ని సుమారు రెండున్నర సంవత్సరాలలో నాచేత పూర్తి చేయించిన ప్రజాశక్తి బుక్‌హౌస్ వారికి, ఇతర మిత్రులకు నా ధన్యవాదాలు. ఒక వ్యక్తి సమాజంలో ఏదైనా సాధించగలిగాడంటే దానికి ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ ఎందరి సహాయ సహకారాలో ఉంటాయి. ఈ నాకృషిలో నాకు తోడ్పడిన వారందరికీ నాకృతజ్ఞతలు.

ఇక్కడే ఒక సంజాయిషీ లాంటిది చెప్పుకోవాలి. ఏ సాహిత్య చరిత్రకైనా వర్తమాన యుగం ప్రారంభం అవుతుందిగాని ఎన్నడూ పరిసమాప్తం కాదు. ఒక్కొక్క ప్రక్రియకూ ఒక సంపుటం చొప్పున రాయవలసినంత విస్తృతమైన అధునాతన యుగచరిత్రను ఒక సంపుటంలోనికి కుదించటం సాహసమే అయినా సాధ్యం కాని విషయం. నడుస్తున్న చరిత్రలో సంస్థల భోగట్టాలు, ఉద్యమాల ఘట్టాలు కథనం చేస్తున్నప్పుడు విరామచిహ్నాలు-ప్రకరణాల కామాలు, ఉపయుగాల సెమికోలన్లు ఉంటాయే తప్పించి ఫైనల్ ఫుల్‌స్టాపు.......

ఎప్పుడూ ఇంకా ఉందనిపించేదే ఈ చరిత్ర.

..............

19.6.1991

త్యాగరాయనగరు.

ఆరుద్ర

పునర్ముద్రణ -పదమూడవ సంపుటి చివరలో ఆరుద్ర 'స్వస్తివాచకం.'

# ఉపయుక్త గ్రంథసూచిక

## (Bibliography)


అచ్యుత శర్మ, సి. యస్వీ. **తెలుగులో ప్రతి విమర్శ–పరామర్శ**, కొవ్వుమ్మ చిక్కాల కాంతిదుర్గ పబ్లికేషన్స్, 1990.

అనంతకృష్ణ శర్మ, రాళ్ళపల్లి, 'వేమన,' వాల్తేరు, ఆంధ్ర విశ్వవిద్యాలయం, 1971.

ఆనందారావుం, సి. **సమాజసాహిత్యాలు**, హైదరాబాదు : యం. శేషాచలం అండ్ కంపెనీ, 1987.

ఆరుద్ర. **అమెరికా ఇంటింటి పజ్యాలు**, చెన్నై : శ్రీ శక్తి ప్రచురణలు, 2001.

.... **ఆరుద్ర రచన కవితలు**, (విపుల సంకలనం). విజయవాడ : క్వాలిటీ పబ్లిషర్స్, 1985.

.... **ఇంటింటి పజ్యాలు**, విజయవాడ : నవోదయ పబ్లిషర్స్, 1965.

.... **ఏటికేడాది**, విజయవాడ : నవభారత్ బుక్ హౌస్, 1979.

.... **కాటమరాజు కథ**, చెన్నయ్ : శ్రీశక్తి ప్రచురణలు, 1999.

.... కాశీనాథుని నాగేశ్వరరావు–సాహిత్యసేవ (వ్యా), సాహిత్యోపన్యాసములు (౯) హైదరాబాదు: ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, 1970.

.... **కూనలమ్మ పదాలు**, హైదరాబాదు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 2001.

.... **కొండగాలి తిరిగింది**, సికింద్రాబాద్ : ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, 1975.

.... **గుడిలో సెక్స్**, హైదరాబాదు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 2000.

.... **గురజాడ గురుపీఠం**, విజయవాడ : నవోదయ పబ్లిషర్స్, 1985.

.... **చదరంగం–అంతర్జాతీయ విధానం**, విజయవాడ : న్యూస్టూడెంట్స్ బుక్ సెంటర్, 1983.

.... **త్వమేవాహమ్**, హైదరాబాదు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 1999.

.... **దక్షిణ వేదము**, హైదరాబాదు : తెలుగు విశ్వవిద్యాలయం, 1989.

.... ప్రజాకళలూ–ప్రగతివాదంలూ, విజయవాడ : ప్రజాశక్తి బుక్ హౌస్, 1985.

.... మహనీయులు (కలంచిత్రాలు), విజయవాడ : నవభారత్ పబ్లిషర్స్, 1979.

.... మనవేమన, తిరుపతి : శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయం, 1985.

.... వ్యాసపీఠం, విజయవాడ : న్యూస్టూడెంట్సు బుక్ సెంటర్, 1985.
విజయవాడ : నవోదయ పబ్లిషర్స్, 1974

.... వేమన్న వేదం, సికిందాబాదు : యువభారతి, 1974.

.... సమగ్ర ఆంధ్ర సాహిత్యం, (పు.ము) (13 సంపుటులు), విజయవాడ : ప్రజాశక్తి బుక్ హౌస్, జూలై 1989–సెప్టెంబర్ 1991.

.... సమగ్ర ఆంధ్ర సాహిత్యం (తొ.ము) (12 సంపుటులు), సికింద్రాబాదు : యం.శేషాచలం అండ్ కంపెనీ, ఏప్రిల్ 1965–ఫిబ్రవరి 1968.

.... సాలభంజిక, విజయవాడ : నవభారత్ బుక్ హౌస్, 1979.

.... సివీవాలి, హైదరాబాదు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 1987.

ఆర్వియార్. తత్త్వశాస్త్రమౌలిక సూత్రాలు (గతితార్కిక భౌతిక సిద్ధాంత పరిచయం), హైదరాబాదు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 1999.

ఆర్వియార్. భగవద్గీత–మార్క్సిజం, హైదరాబాదు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 2002.

ఆల్బర్ట్, ఎడ్వర్డ్. హిస్టరీ ఆఫ్ ఇంగ్లీష్ లిటరేచర్. (రివైజ్డ్ బై) జె. ఎ.స్టోన్. కలకత్తా: ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటి ప్రెస్, మొ.ము.1923., 5వ ముద్రణ.

ఈశ్వరదత్తు, కుందూరు ప్రాచీనాంధ్ర చారిత్రక భూగోళము, సికిందరాబాదు: శివాజీ ప్రెస్, 1963

ఉమారాజేశ్వరరావు, నిడమర్తి. (అను), శాస్త్రీయ కమ్యూనిజం–విజ్ఞానదీపిక, మాస్కో: ప్రగతి, ప్రచురణాలయం 1986

ఎమిలీబరన్స్. మార్క్సిజం అంటే ఏమిటి, (అను) ఫాతిమా, హైదరాబాదు : ప్రజాశక్తి బుక్ హౌస్, 1998.

ఎల్లోరా. జానపద సాహిత్యం, హైదరాబాదు : దీప్తి పబ్లికేషన్స్, 1982.

కసిరెడ్డి. జానపద కళా దర్శనం, హైదరాబాదు : జానపద సాహిత్య పరిషత్, 1997.

కారల్ మార్క్స్ & ఏంగెల్స్. **కమ్యూనిస్టు పార్టీ ప్రణాళిక**, (అను) రాచమల్లు రామచంద్రారెడ్డి, ప్రజాశక్తి బుక్ హౌస్, విజయవాడ, 1998.

కార్. ఇ.హెచ్. **చరిత్ర అంటే ఏమిటి**, హైదరాబాద్ : హైదరాబాద్ బుక్ ట్రస్ట్, ప్ర.ము.,1983 నా.ము.,1997.

కృష్ణకుమారి, నాయని. **ఆరుద్ర (వ్యా) వమోదయంలహరి**, (ప్ర.సం) జి.వి.సుబ్రహ్మణ్యం, యువభారతి, సికిందరాబాదు, 1977.

కృష్ణ.బి. ఎస్. ఆర్. **ఆరుద్ర అభినందన సంచిక**, మదరాసు : ఆరుద్ర షష్టిపూర్తి ఉత్సవ సంఘం, 1985.

కృష్ణమూర్తి, భద్రిరాజు. (సం) **తెలుగు భాషా చరిత్ర**, హైదరాబాద్ : తెలుగు విశ్వవిద్యాలయం. మ.ము., 1995.

కృపాచారి, గుజ్జర్లమూడి. **తెలుగు సాహిత్యానికి క్రైస్తవుల సేవ**, నాగార్జుననగర్, స్వీయ ప్రచురణ 1988.

కులశేఖరరావు. ఎం. **ఆంధ్ర వాఙ్మయము- ఉత్పత్తి వికాసములు**, హైదరాబాదు. నవయుగ పబ్లికేషన్స్, 1971.

కె.వి. ఆర్. **ఆధునికాంధ్ర సాహిత్యచరిత్ర ఒక నిర్మాణ ప్రయత్నం**, (సం) చలసాని ప్రసాద్,ఎస్.వేణుగోపాల్, హైదరాబాదు విప్లవ రచయితల సంఘం, 1992.

కోశాంబి, డి.డి. **భగవద్గీత చారిత్రక పరిణామం**, (అను.?) (సం) చేకూరి రామారావు హైదరాబాద్ : హైదరాబాద్ బుక్ట్రస్ట్ ప్రచురణ,1995.

కోశాంబి,డి.డి. **భారత చరిత్ర–పరిచయ వ్యాసాలు**. (అను) వి.రామకృష్ణ , హైదరాబాదు: హైదరాబాదు బుక్ ట్రస్ట్ ప్రచురణలు, 1996.

గంగాధరం, నూతలపాటి **వెలుగులోకి** (క.సం.) మద్రాసు : ఎస్వీ పబ్లికేషన్స్, 1974.

గురజాడ. **గురజాడ జాబులు–జవాబులు దినచర్యలు** , (సం) సెట్టి ఈశ్వరరావు. హైదరాబాదు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 2000.

గోపి.ఎన్. **ప్రజాకవి వేమన** హైదరాబాదు : ఎన్ అరుణ ప్రచురణ, 1980.

చంద్రశేఖరరెడ్డి, రాచపాలెం, హెచ్. ఎస్.బ్రహ్మానంద, **సాహిత్య పరిశోధన సూత్రాలు**, హైదరాబాదు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 1997.

జయప్రకాష్, ఎస్. **పరిశోధనవిధానం**, హైదరాబాదు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,1993.

తిరుమలరావు, జయధీర్. తెలంగాణా రైతాంగ పోరాటం, ప్రజాసాహిత్యం, హైదరాబాదు, సాహితీ సర్కిల్ ప్రచురణ, 1988.

ధర్మారావు, తా పి. దేవాలయాల మీద బూతు బొమ్మలెందుకు? హైదరాబాదు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 2000.

దేవకి. ఎం.కె. తెలుగునాట జానపద వైద్య విధానాలు, అనంతపురం : పండువెన్నెల ప్రచురణలు, 1999.

దోణప్ప, తూమాటి ఆంధ్ర సంస్థానములు-సాహిత్యపోషణము. వాల్తేరు : ఆంధ్రవిశ్వకళాపరిషత్తు, 1969.

నరసింహారావు, ఆర్, అభ్యుదయ కవిత్వంలో అరుద్రత, హైదరాబాదు :విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 1992.

నాగభూషణ శర్మ మొదలి, ప్రసాద్, ఏటుకూరి (సం) కన్యాశుల్కం-నూరేళ్ళ సమాలోచనం. హైదరాబాదు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 1994.

నాగయ్య జి. తెలుగు సాహిత్య సమీక్ష (మొ.సం., రెం.సం.) తిరుపతి : నవ్య పరిశోధక ప్రచురణలు, 1999, 1996.

నారాయణ రెడ్డి, సి. ఆధునికాంధ్ర కవిత్వము, సంప్రదాయములు : ప్రయోగములు. సికింద్రాబాదు:ఆంధ్రప్రదేశ్ బుక్ డి స్ట్రి బ్యూటర్స్, 1967.

నారాయణరావు, వెల్చేరు. తెలుగులో కవితా విప్లవాల స్వరూపం, హైదరాబాదు : హైదరాబాదు బుక్ ట్రస్ట్, 1987.

నాయక్. ఎం.కె. ఎహిస్టరీ ఆఫ్ ఇండియన్ ఇంగ్లీష్ లిటరేచర్. న్యూఢిల్లీ : సాహిత్య అకాడమీ, 1982.

నిత్యానందరావు, వెలుదండ విశ్వవిద్యాలయాల్లో తెలుగు పరిశోధన. హైదరాబాదు: స్వీయప్రచురణ.మొ.ము.1987, పు.ము.1998

పఠాభి. కవిత నాదయిత. నెల్లూరు : వర్ధమాన సమాజం. (ప్ర.కా (?).

పద్మారావు, కత్తి భారతీయ భౌతికవాదం-చార్వాక దర్శనం పొన్నూరు: లోకాయత ప్రచురణలు 1995.

బాలగంగాధరరావు. యార్లగడ్డ. ఒకఊరి కథ. విజయవాడ : వి.జి.యస్ పబ్లిషర్స్, 1995.

భరతుడు. **నాట్యశాస్త్రము** (అను) శ్రీరామ అప్పారావు, పోణంగి, హైదరాబాదు : నాట్యమాల ప్రచురణ, 1982.

బంగారె. **వేమన పద్యాలు–సి.పి.బ్రౌన్ 1839 నాటి సంకలనం.** తిరుపతి : తిరుమల, తిరుపతి దేవస్థానములు, 1980.

బ్రహ్మానంద, హెచ్. ఎస్. **శిష్టసాహిత్యంలో జానపద ధోరణులు,** అనంతపురం : అక్షర ప్రసార ప్రచురణలు, 1989.

మధుసూధనరావు, త్రిపురనేని. **సాహిత్యంలో వస్తుశిల్పాలు,** (సం) బి. తిరుపతిరావు, హైదరాబాదు: పర్స్పెక్టివ్, ప్ర.కా (?).

మార్గశీర్ష, ద్వా.నా.శాస్త్రి. **సమాధిలో స్వగతాలు.** భట్లవిల్లి : శ్రీశారదా ప్రింటింగ్ వర్క్స్, 1981.

మలయవాసిని. **ఆంధ్రజానపద సాహిత్యం–రామాయణం,** విశాఖపట్టణము : స్వీయప్రచురణ, 1986.

మహాదేవశాస్త్రి, కోదాడ. **ఆంధ్రవాఙ్మయ పరిచయము.** మద్రాసు : సరస్వతీ ప్రచురణము. 1985.

మందేశ్వరరావు, వడలి. **పాశ్చాత్య సాహిత్య విమర్శ చరిత్ర–సిద్ధాంతాలు.** హైదరాబాదు. తెలుగు విశ్వవిద్యాలయం, 1994.

మందేశ్వరరావు, వడలి. **విమర్శలో సృజనాత్మకత (వ్యా) విమర్శ నాటినుండి నేటికి.** హైదరాబాదు: సమదర్శిని సాహిత్య సమాఖ్య, 1996.

మందేశ్వరరావు, వడలి. అనుశీలన – సాహిత్య విమర్శ, హైదరాబాదు: తెలుగు అకాడమి, 1992.

ముద్దు పళని. **రాధికా సాంత్వనం.** విజయవాడ : ఎమెస్కో ప్రచురణ, 1997.

రమణారెడ్డి.కె.వి. **మహోదయం.** విజయవాడ. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 1969.

రంగనాథాచార్యులు, కె.కె. **ఆధునిక తెలుగు సాహిత్యంలో విభిన్నధోరణులు,** హైదరాబాదు: ఆంధ్ర సారస్వతీ పరిషత్తు, 1982.

రంగనాథాచార్యులు, కె.కె.(సం) **తెలుగు సాహిత్యవికాసం,** హైదరాబాదు: ఆంధ్రసారస్వత పరిషత్తు, 1979.

రామరాజు.బి. **చరిత్రకెక్కని చరితార్థులు,** హైదరాబాదు. ఆచార్య బిరుదురాజురామరాజు గారి షష్ఠ్యబ్ది పూర్తి సన్మాన సంఘం, 1985.

రామమోహనరాయ్, **తెలుగు కవితా వికాసం (1947–1980).** హైదరాబాదు : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, 1982.

